**SARASWATHA VYASAMULU** Third Vol.
(A collection of Literary essays.)
Edited by Dr. G. V. Subrahmanyam, M.A., Ph.D.,
Reader, Telugu Department, University of Hyderabad,
Andhra Pradesh

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు-500 004



*ప్రచురణ : 310*

ప్రథమ ముద్రణ : 1969
ద్వితీయ ముద్రణ : 1980
ప్రతులు : 1000

వెల రూ. **11-50**

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్-500 004

ముద్రణ :
*పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్*
హైదర్‌గూడ, హైదరాబాద్.

---

Paper used (Partly) for the Printing of this book was made available by the Government of India at concessional rate.

# ద్వితీయ ముద్రణకు తొలిపలుకు

1969లో డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి సంపాదకత్వాన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురించిన "సారస్వత వ్యాసములు" మూడవ సంపుటము ప్రతులన్నింటిని తెలుగు పాఠకలోకము ఆదరించి అందుకొన్నది. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు జాగరూకతతో, విమర్శనా దృక్పథంతో, సాహిత్య సమీక్షా పరిజ్ఞానంతో సేకరించి మాకందించిన ఈ వ్యాసాలు పాఠకులకు పరిశోధకులకు, పండితులకు, భాషాభిమానులకు, విద్యార్థులకు, జిజ్ఞాసువులకు, ఎంతో ఉపకరించినవని, వీటిని తిరిగి ముద్రించవలసిన అవసరము ఉందని అకాడమి కార్యవర్గమువారు నిర్ణయించినారు. ఆ నిర్ణయానికి ఫలితమే ఈ మలిప్రచురణ. మా ఈ ప్రయత్నాన్ని హర్షించిన పాఠక లోకానికి, దీన్ని సఫలం చేయడంలో సహకరించిన డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారికి హార్దికాభివందనాలు.

హైదరాబాదు
తేది. 13-12-1980

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# తొలిపలుకు

19వ శతాబ్ది చరమభాగమున ఆంగ్లభాషాసాహిత్యప్రభావ మొక వైపు నుండియు, ముద్రణయంత్రసౌకర్య మొకవైపునుండియు నాంధ్రదేశసాహిత్య జీవితమున కొకనూతనచైతన్యమును కలిగించినవి. నూత్నసాహిత్యశాఖలు క్రొత్త చిగుళ్ళు తొడుగుచున్న తరుణముననే స్వాతంత్ర్యేచ్ఛ, దేశాభిమానము, భాషాభిమానము మొదలగు ఉజ్జ్వల సాంఘిక భావములు సారస్వతరంగమున కాలుపెట్టినవి. వానిని సత్వరముగా సాహిత్యపరులలోను, సామాజికులలోను వ్యాప్తిచెందించుటకై పత్రికలుపుట్టి నడుముకట్టినవి. సాహిత్యము జీవితాంతర్భాగ మను చైతన్యమును ముక్కోటి తెలుగువారిలో నుత్పాదించినవి సాహిత్య పత్రికలు. పత్రికల చలువపందిళ్ళలో ఆంధ్రభారతి నిత్యనూతనశోభావిలాసములు వెలార్చి తెలుగు బిడ్డల మన్నన లందుకొనినది.

పత్రికలలో దినపత్రికలు, వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు, త్రైమాసిక పత్రికలు, ఉగాది సంచికలు—ఇట్లు ఎన్నియో భేదములు కలవు. వీనిలో సాహిత్యపత్రికల కొక ప్రత్యేకత కలదు. అందులో కొన్ని వెలుగు చూడని సాహిత్యగ్రంథములను వెలికిఁదెచ్చినవి; కొన్ని పూడిపోయిన శిలాశాసనములకు పునర్జన్మ కల్పించినవి; కొన్ని క్రొత్తగా గొంతెత్తి కావ్యగీతము లాలపించెడి కవికోకిలలకు నూత్నవసంతము కల్పించినవి; కొన్ని ప్రాచీనభాషా సాహిత్యమర్యాదలకు ప్రాణము పోసినవి; కొన్ని అభ్యుదయమార్గమున శంఖములు పూరించినవి; ఇవియన్నియు వాదములకు రంగస్థలము లైనను సత్యాన్వేషణమునకు కూడ నాందీవాక్యము పల్కినవి. ఆయా పత్రికల వెనుక పరిషత్తుల వంటి వ్యక్తులు, పారావారములవంటి మేధావులు, దిగ్దంతులవంటి పండితులు నిలువఁబడి నవ్యాంధ్రసారస్వత సౌధనిర్మాణమునకు పునాదులు కట్టినారు. రూపురేఖలు దిద్దినారు. అట్టి మహోజ్జ్వలాధ్యాయములకు ప్రతిబింబములైన పత్రికల ప్రాతసంపుటము లిప్పుడు మన కందుబాటులో లేవు. వానిలోని విజ్ఞాననిధులు విద్యార్థులకే కాక విద్వాంసులకుకూడ ఉపకారకములు కాగలవు.

ఇట్టి యభిప్రాయముతో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ గత సంవత్సరము ఆంధ్రసాహిత్యపత్రికలసంపుటులలో ప్రచురితము లైన ప్రఖ్యాత సాహిత్య

వేత్తల వ్యాసములను విషయప్రధానదృష్టితో నెన్నికచేయించి 'సారస్వత వ్యాసము' లను పేర మూడు సంపుటములుగా ప్రచురింపవలె నని నిర్ణయము కావించినది. ఈ సంపుటములవలన 19 వ శతాబ్ద్యుత్తరార్థమునందును, ఇరువదియవ శతాబ్ది పూర్వార్థమునందును జరిగిన తెలుఁగు సారస్వత విమర్శ స్వరూప స్వభావములు, భావపరిణామము మొ॥ నంశములు స్థాలీపులాకన్యాయముగనైనను తెలిసికొనుటకు వీలుండు నని అకాడమీవారి భావము.

ఈ కార్యక్రమము క్రింద 'సారస్వత వ్యాసములు' ప్రథమ తృతీయ సంపుటములలో—'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (కాకినాడ), శారద, ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలు, భారతి'—అను సాహిత్య పత్రికలనుండి వ్యాసముల నెన్నికచేసి, వాని సంపాదకత్వము నిర్వహింపవలసినదిగా డా. జి. వి. సుబ్రహ్మణ్యముగారిని, వానిపై పర్యవేక్షణము సల్పుటకు డా. దివాకర్ల వేంకటావధానిగారిని కోరుటయైనది. అట్లే ద్వితీయ సంపుటములో 'అముద్రిత గ్రంథ చింతామణి', 'గ్రంథాలయ సర్వస్వము', 'తెలుఁగు', 'సారస్వత సర్వస్వము', 'ప్రతిభ', 'సుజాత', 'కిన్నెర'- పత్రికలనుండి వ్యాసముల నెన్నికచేసి సంపాదకత్వము నిర్వహింపవలసినదిగా శ్రీ పురిపండా అప్పలస్వామిగారిని, వారికి కార్యమున తోడ్పడుటకై డా తూమాటి దోణప్పగారిని కోరుటయైనది.

పైని పేర్కొనబడిన సాహిత్య పత్రికల సంపాదకులకు, ప్రచురణకర్తలకు, పై సంపుటములలో ప్రచురింపబడు వ్యాసముల రచయితలకు కృతజ్ఞతలు చెప్పుట అకాడమీ ప్రథమకర్తవ్యము. సకాలమున కీ సంపుటమును సిద్ధము చేసి యిచ్చిన డాక్టరు జి. వి సుబ్రహ్మణ్యముగారికిని, పర్యవేక్షణము చేసిన డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారికిని, మా ధన్యవాదములు. ఆంధ్ర పాఠకజనులు మా ప్రయత్నమును సహృదయముతో గ్రహింపగలరని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
22-10-1969.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# పీఠిక

నవ్యాంధ్ర సాహిత్య చరిత్ర నెఱుంగఁగోరు వారికిఁ దోడ్పడు ప్రధాన సాధనములు సాహిత్యపత్రికలు. తెలుఁగునాట వెలసిన సాహిత్యపత్రికలలో 'సాహిత్యపరిషత్పత్రిక, శారద, ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలు, భారతి' — మొదలగునవి యొక ప్రత్యేకతను గడించి యాంధ్రసాహిత్య పరిణామ ప్రగతులకు ప్రత్యక్ష సాక్ష్యములుగా నిలిచియున్న యక్షరమూర్తులు. పై పత్రికలు పుట్టుటకుఁ గారణములైన పరిస్థితులలోను వాని స్వరూపస్వభావములలోను వైవిధ్యము గానవచ్చుచున్నను, ఆంధ్ర సారస్వతాభ్యుదయసాధన మను లక్ష్యము నందు మాత్ర మవియన్నియు నేకసూత్రమున గట్టుబడియున్నవి. ఈ శతాబ్ది ప్రథమపాదములోఁ గన్నువిచ్చిన యీ పత్రికలు దాదాపొక అర్ధశతాబ్దికాలమున వెలసిన యాంధ్రసారస్వతవ్యవసాయమునకు పంట నేలలై పరిఢవిల్లినవి. తచ్చరిత్రను సమీక్షింపఁగోరు సాహిత్యవేత్తల కవి యాధారము లగుటయే గాక యారాధ్యములై యలరారుచున్నవి.

ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమీ వారు ప్రసిద్ధాంధ్రసాహిత్యపత్రికల ప్రాఁత సంపుటములయందు ప్రచురింపఁబడియున్న యమూల్యము లైన వ్యాసములను విషయ ప్రధానదృష్టితో నెన్నికఁజేయించి కొన్ని సంకలన గ్రంథములను సిద్ధము చేయింపవలె నని నిశ్చయించుకొనిరి. వారి యుదాత్తాశయము ప్రశంసనీయము! వారి నిర్ణయము ననుసరించి యిప్పటికే రెండు సంపుటములు ప్రచురితములయ్యెను. వానిలో ప్రథమసంపుటము నా సంకలన కర్తృత్వమున ''తెలుఁగు కవిత్వపు తీరుతెన్నులను'' తేటపఱచు గ్రంథముగా రూపొందినది. పైని పేర్కొనఁబడిన నాలుగు సాహిత్యపత్రికలనుండి ముప్పదివ్యాసములం దెన్నికచేయఁబడినవి పై పత్రికలయందు తెలుఁగు కవిత్వపరిణామరామణీయకత్వమును జిత్రించు వ్యాసములే కాక వివిధ సారస్వతశాఖల స్వరూపసౌభాగ్యములను సవిమర్శముగ సమీక్షించిన వ్యాసము లెన్నియో వెలసియుండుటచే నట్టివానికిఁ బ్రాతినిధ్యము వహించు వ్యాస సంకలన గ్రంథము మఱియొకటి సిద్ధము చేయు నావశ్యక మేర్పడినది అకాడమీవారు ఆ గురుతరమైన బాధ్యతను నాపై నుంచిరి. నా కీకార్యము నిర్వహించు సామర్థ్యము లేకపోయినను సాహిత్యముపైఁ గల యభిమానముచే నేను వారి యానతిని శిరసావహించితిని. నా కీ సదవకాశము కలిగించిన అకాడమీవారికి హృదయపూర్వకమైన కృతజ్ఞతలు చెప్పుట నా ప్రథమ కర్తవ్యము.

*ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు :*

పైని పేర్కొనఁబడిన సాహిత్యపత్రికలలోఁ గాలక్రమము ననుసరించి 'ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక' మొదట గణింపఁదగినది. విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి యమృతహస్తముతో 1908 లో నారంభింపఁబడిన ఆంధ్రపత్రిక వారపత్రిక యాంధ్రుల రాజకీయార్థికసాహిత్యపునరుజ్జీవనమునకు వైతాళికగీతికయై వెల్లివిరిసినది పంతులుగా రా వారపత్రికా ప్రచురణతో తృప్తిపడలేదు. ప్రతి ఉగాదికిని ఆంధ్రపత్రిక తెలుఁగువారి కొక నూతనభానూదయముగా విజ్ఞానజ్యోతిస్సుల నందింపవలె నను సదుద్దేశముతో-క్రీ. శ. 1910-సాధారణనామ సంవత్సరము నుండి ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికను ప్రచురించుట నారంభించిరి. ఆంధ్రభాషయం దిట్టి సంవత్సరాది సంచికను ప్రచురించుట కదియే యంకురార్పణము. ఆ పత్రిక ఆంధ్రభాషాసాహిత్యములకు సంబంధించిన పద్యగద్యరచనలతోపాటు, సంస్కృతాంగ్లసాహిత్యగ్రంథ విమర్శరూపము లగు వ్యాసములను, చరిత్ర మత రాజకీయ సాంఘికార్థికాది విషయములపైఁ బెక్కు రచనలను, ఆంధ్రజీవితసర్వతోముఖ వికాసమును జిత్రించు వార్తాచిత్రములను బ్రచురించుచు వెలువడుచుండెడిది. ఆ సంచిక లాంధ్రప్రజాజీవితప్రతిబింబములే కాక ప్రపంచపరిస్థితుల సమీక్షాభూమికలై సాక్షాత్కరించుచుండెడివి. ఆంధ్రసమైక్యత, రాష్ట్రోద్యమము, భారత స్వాతంత్ర్య సంగ్రామము, ప్రపంచ రాజకీయచైతన్యము, ఆంధ్ర సాహిత్యసర్వతోముఖవికాసము, ప్రతివర్షసాహిత్యసమీక్షలు, ఇట్టి వెన్నియోయంశములు సంవత్సరాది సంచికలలో నాయాకాలములందు ప్రకటింపఁబడుచుండెడివి.

పంతులుగారి బహుముఖప్రజ్ఞాప్రాభవము, సువిశాలదృక్పథము, నిర్వాహణదక్షత, దాతృత్వము, కార్యదీక్ష-ఇట్టి యుదాత్తగుణములన్నియు నా సంచికల నెట్టి సంకుచితాశయములజోలికి పోనీయక నిష్పాక్షిక దృక్పథముతో సమకాలీనసాహిత్యరంగమును సమీక్షించి, దానిని సర్వాంగసుందరముగా పత్రికలయందుఁ బ్రతిఫలింపఁ జేయుటకుఁ దోడ్పడినవి. తెలుఁగు కవిత్వపరిణామములు, చరిత్ర పరిశోధనలు, విమర్శదృక్పథములు, కావ్యకళావైవిధ్యములు, శబ్దప్రయోగచర్చలు, శాస్త్ర పరామర్శలు, గ్రంథసమీక్షలు ఉగాదిసంచికలలో నింద్రధనుర్విలాసహేలతోఁ బ్రత్యక్షమయ్యెడివి. వైవిధ్యముతోఁ గూడుకొనిన సాహిత్యజగత్తును సమదృష్టితోఁ జూడఁగలిగిన యామహాత్ముని యుత్తమాదర్శమాయుగాదిసంచికల నాదర్శపత్రికా సంపుటములుగాఁ దీర్చిదిద్దిన వనుటలో నెట్టి యనుమానమును లేదు.

ప్రముఖ సాహిత్యవేత్తల వ్యాసములాస సంపుటములను నాఁటినుండి నేఁటివఱకు సమలంకృతముఁ జేయుచునే యున్నవి. శ్రీయుతులు కందుకూరి వీరేశలింగము

పంతులు, కె. వి. లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు, కోలాచలము శ్రీనివాస రావు, త్రిపురనేని రామస్వామి చౌదరి, గురజాడ అప్పారావు, గిడుగు రామ మూర్తి పంతులు, నడకుదుటి వీరరాజు పంతులు, విక్రమదేవవర్మ, అక్కిరాజు ఉమాకాన్త పండితుఁడు, మానవల్లి రామకృష్ణకవి, తణికెళ్ళ వీరభద్రుఁడు, ముట్నూరి కృష్ణరావు, కోరాడ రామకృష్ణయ్య, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, వజ్ఝల, రాళ్ళపల్లి, కవికొండల, చింతా, గిడుగు సీతాపతి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, బసవరాజు అప్పారావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, పాకాల రాజమన్నారు, దువ్వూరి రామిరెడ్డి, పురాణం సూరిశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, శేషాద్రిరమణకవులు, నేలటూరి వెంకట రమణయ్య, భావరాజు వేంకటకృష్ణరావు, దీపాల పిచ్చయ్యశాస్త్రి, నిడుదవోలు వెంకటరావు మొదలగు పండితుల ప్రసిద్ధ వ్యాసము లీ పత్రిక ప్రాంతసంచికల నలంకరించియున్నవి. విశ్వావసు (1964-65) సంవత్సరమున నీ యాంధ్ర పత్రిక స్వర్ణోత్సవసంచిక వెలువడినది. ఏఁబదియైదుసంవత్సరముల పూర్వసంచి కల నుండి దాదాపు డెబ్బది యంశములను విషయవైవిధ్యదృష్టితో నెన్నికచేసి స్వర్ణోత్సవ సంచికయందుఁ బ్రకటించుట యైనది. ఆంధ్రపత్రిక తెలుఁగునాట నిత్యభానూదయము వలెను, ఉగాదిసంచిక నూతన వర్షోదయమువలెను ప్రజా జీవితమున బెనవైచికొని పోయినవి.

'ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక' యథాశక్తి సాహిత్య సేవయొనర్చిన దయ్యును అది ముమ్మూర్తుల సాహిత్యపత్రిక యని మనము గణించుటకు వీలు లేదు సాహిత్యసేవ యాపత్రిక లక్షించిన బహుముఖ ప్రయోజనములలో నొక యంశము మాత్రమే. అట్లగుట దానిగుణగౌరవమున కెట్టి లోపమును కాదు. బహుముఖమైన యొకజాతి జీవితవర్తనమును దీర్చిదిద్దుట కట్టి వార్షిక సంచికలు వెలువడుట యా జాతి విజ్ఞత కొక విశిష్ట నిదర్శనము కాఁగలదు

*సాహిత్యపరిషత్పత్త్రిక :*

తెలుఁగున వెలసిన సాహిత్యపత్త్రికలు పెక్కు లున్నను వానిలో సాహిత్య పరిషత్పత్త్రిక కొక ప్రత్యేక స్థానము కలదు. క్రీ. శ. 1911 లో స్థాపింపఁబడిన 'ఆంధ్రసాహిత్యపరిషత్తు' సాధింపఁ దలపెట్టిన వివిధ సారస్వతప్రయోజనముల కొక శక్తిమంతమైన సాధనముగా నీపత్త్రిక 1912 సెప్టెంబరు మాసమున త్రైమాసిక పత్రికగాఁ దలయెత్తినది ఆపైన 1920 లో ద్వైమాసిక పత్రికగా రూపొంది, యుత్తమసాహిత్యప్రమాణములతో నాఁటికిని నేఁటికిని సారస్వత సేవ చేయుచున్నది.

సాహిత్యపరిషదాశయములలో ముఖ్యమైనవి-సమగ్రమును సప్రమాణము నైన యాంధ్రనిఘంటువును సిద్ధముచేయుట, అముద్రిత ప్రాచీన గ్రంథములను

ప్రచురించుట, తాళపత్ర లిఖితగ్రంథములను సేకరించి పరిషత్ గ్రంథాలయమున వానిని బదిలపఱచుట, భాషాసాహిత్యములందు శాస్త్రీయవిమర్శనమును వెలయించుట, సాహిత్యసభలు నిర్వహించుట, పండితసత్కారము మొనర్చుట మొదలగునవి. దేశీయ భాషాసాహిత్యములపైఁ బ్రజలలో నాదరాభిమానములు సన్నగిలుచున్న యాదినములలో నాంధ్రవాఙ్మయపునరుద్ధరణకు పరిషత్తు నడుముకట్టి తన యుదాత్తాశయములతోఁ బండితలోకముయొక్క ప్రశంసలకు పాత్రమై నిలిచినది పరిషత్తునకు పిఠాపురము మహారాజా వారు పోషకులై ప్రోదిచేసి రక్షించుటచే నది మూఁడుపూవు లాఱుకాయిలుగా వర్ధిల్లినది. పరిషత్తు సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణము చేపట్టినది. కీ. శే. జయంతి రామయ్య పంతులు, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గార్ల ప్రధాన సంపాదకత్వమున నానిఘంటు వాఱుసంపుటములలోఁ బ్రచురింపఁబడినను అసమగ్రముగనే యుండిపోయినది. ఈనడుమ డా. దివాకర్ల వేంకటావధానిగారి ప్రధాన సంపాదకత్వమున నానిఘంటువుయొక్క చివరిసంపుటము సిద్ధమై ముద్రణభాగ్యము నందుచున్నది. ఇట్లు పరిషత్ప్రథమాశయము పరిపూర్ణమయి తెలుఁగున ప్రమాణబద్ధ మగు నిఘంటువు ప్రసాదింపఁబడినది.

పరిషదాశయములు బహుముఖముల విస్తరించి యుండుటచే వానిని సాధించుటకు 'పరిషత్పత్రిక' ప్రచారసాధనముగను, సాధనసమీకరణోపకరణ ముగను తోడుపడినది. అముద్రిత ప్రాచీనగ్రంథ ప్రచురణమునకును, శాస్త్రీయ విమర్శన వికాసమునకును పరిషత్పుస్తకభాండాగార గ్రంథపరిచయమునకును, సాహిత్యపరిషత్సభాముఖమున వెలసిన పండితోపన్యాసముల ప్రచురణమునకును పరిషత్పత్రిక యాలంబనమైనది. భీమకవి కవిజనాశ్రయము మొదలు శాసన పద్యమంజరుల వఱకు ఈ పత్త్రికాముఖమున ప్రజలకు ప్రథమదర్శన మిచ్చినవి. కీ శే. జయంతి రామయ్య పంతులు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులగార్ల యశేష చారిత్రక పరిశోధన కాలవాలములైన శాసనములు పెక్కు లీపత్రికద్వారమున పరిష్కృతములై ప్రచురితములైనవి. సంస్కృతాంధ్రాంగ్లభాషాసాహిత్యముల తులనాత్మక పరిశీలనములు, కవిజీవితకావ్యవిశేషములు, సాహిత్యభాషావికాస చర్చలు పండితప్రకాండుల రచనల మూలమున నీపత్రిక కెక్కినవి. శ్రీయుతులు జయంతిరామయ్యపంతులు, నాగపూడి కుప్పుసామయ్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, అక్కిరాజు ఉమాకాన్తము, మేదేపల్లి వేంకటరమణా చార్యులు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, తాతా సుబ్బరాయశాస్త్రి, కె వి. లక్ష్మణరావు పంతులు, పానుగంటి లక్ష్మీనరసింహరావు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, తల్లాప్రగడ సూర్యనారాయణరావు, వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి, కోలాచలము శ్రీనివాసరావు, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, సదకుదురు

వీరరాజు పంతులు, వావిలికొలను సుబ్బారావు, త తేవప్పెరుమాళ్ళయ్య, క్రొత్తపల్లి సూర్యారావు, టి. యస్ మురుగేశన్, పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, చర్ల నారాయణశాస్త్రి, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి, కేతవరపు వేంకటశాస్త్రి, విక్రమదేవవర్మ, బండారు తమ్మయ్య మొదలగు దిగ్దంతులవంటి పండితులు వెలయించిన విపులవ్యాసవాఙ్మయము ఈ పత్త్రిక యొక్క ప్రాత సంపుటముల నలంకరించియున్నది. పేరెన్నికగన్న పండితు లెందరో వ్రాసిన వ్యాసములను ప్రకటించుచు యీ పత్రిక నేఁటికిని తన యున్నతస్థాయిని గాపాడుకొనుచున్నది. ఏటేట నొక సాహిత్యపరిషత్సభను జరిపి, యందు లిఖితములైన యుపన్యాసములను బఠింపఁజేసి వాని నీపత్త్రికయందుఁ బ్రకటించుట పరిషత్కార్యక్రమములలో నొకటి. దానివలన నాయాకాలములందు దేశమున వ్యాపించియున్న సాహిత్యచైతన్యమును సమీక్షించిన విమర్శనవాఙ్మయ మీపత్త్రికాముఖమున మనకు లభించుచున్నది. పరిషత్పుస్తకభాండాగార గ్రంథపరిచయము సాహిత్య పరిశోధనసీమలను విస్తృత మొనర్చినది. పరిషత్ప్రచురణలకు పరిష్కర్తలు వెలయించిన పీఠికలు సాహిత్యపరిశోధకుల కమూల్యమైన నూతనాంశములను బ్రసాదించినవి. పరిషత్పత్త్రిక చేసిన యిట్టి సాహిత్యసేవ ప్రాచీన సాహిత్య చరిత్ర విజ్ఞానమున కొక నూతన వసంతోదయమైనది.

పరిషత్పత్త్రిక సాధించిన పైఅంశములన్నియు నొకయెత్తుగను, అది గ్రాంథిక భాషాప్రచారమున కొనర్చిన యుద్యమము మఱియొకయెత్తుగను బేర్కొనఁదగి యున్నది. కీ. శే. గిడుగు రామమూర్తిపంతులుగారి వ్యావహారిక భాషావాదమునకు పరిషత్తు ప్రత్యర్థి యగుటచే నీపత్త్రిక గ్రాంథికభాషలో వ్రాయఁబడిన వ్యాసములను, గ్రాంథికభాషావాదమును సమర్థించిన పండితులను దరికి తీసినది. గ్రామ్యభాషావాద ఖండన మీపత్రిక కొక నినాదమై నిలిచిపోయినది. అది యీ పత్త్రిక కున్న ప్రత్యేకత యని కొందఱు ప్రశంసించెదరు. అది యీ పత్త్రిక కేర్పడిన యభ్యుదయ నిరోధకమైన యవరోధమని కొందఱు తలంచెదరు.

సాహిత్యపరిషత్పత్త్రిక సాధారణ సంచికలు గాక స్మారక సంచికలు నాలుగు వెలువడినవి. అవి : జయంతి రామయ్యపంతులుగారి శతవార్షిక జన్మదినోత్సవ స్మారక సంచిక (సంపుటి 49; సంచిక 2, 3); కీ. శే. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి స్మారక సంచిక (సంపుటి 49; సంచిక 5, 6); శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరాయ బహద్దరు మహారాజావారి స్మారక సంచిక (సంపుటి 52, 53; సంచిక 5, 6; 1–2), పానుగంటి లక్ష్మీనరసింహరావు పంతులుగారి శతవార్షిక జయంతి సంచిక (సంపుటి 53; సంచిక 4–6) పైవానిలో పానుగంటివారి శతవార్షిక జయంతి సంచిక మాత్రము తత్కవికావ్యజీవిత పర్యాలోచనప్రధానముగా వెలువడినది. మిగిలినవి వివిధవ్యాససంకలన గ్రంథము

లుగా వెలువడినవి. సాహిత్యపరిషత్పత్త్రిక సంపుటులలోఁ బై స్మారకసంచికలు చాలవిలువైనవి; నాలుగు కాలములపాటు నిలువఁదగినవి.

**శారద :**

కలకత్తానగరమునుండి బాబు రామానంద ఛటర్జీ సంపాదకత్వమున వెలువడిన మోడరన్ రెవ్యూ (Modern Review) పత్రిక నాదర్శముగాఁ బెట్టుకొని శ్రీ కౌతా శ్రీ రామశాస్త్రిగారు 1923 సం॥లో మచిలీపట్నమునుండి 'శారద' ప్రచురింప నారంభిచిరి. ఆ మాసపత్రిక జీవించినది రెండుమూఁడేండ్లయినను ఉదాత్తాశయములతో నున్నతస్థాయిలో నడచినది. ఈపత్రిక సమకాలీన సాహిత్య ప్రక్రియా బాహుళ్యమునకు ప్రాతినిధ్యము వహించు వివిధరచనలను బ్రచురించుచుండెడిది. అనువాదనాటకములు, స్వతంత్రరూపకములు, రూపకవిమర్శ, భావకవిత్వము, కళాసమీక్ష, సాహిత్యశాస్త్ర విమర్శ, నవల, కథ, కథానిక, విజ్ఞానశాస్త్రము, సాంఘిక రాజకీయాంశములు శాసనప్రచురణము, చరిత్రాంశచర్చలు, సంస్కృతాంధ్ర కావ్యవిమర్శ, సమీక్షలు—ఇట్టి బహువిధ సారస్వతాంశములు ప్రతి సంచిక యందును బొందుపరుపఁబడుచుండెడివి. శారద సంచికలలో గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు రూపక విమర్శాంశములను గుఱించియు, దర్భా యజ్ఞేశ్వరసోమయాజులుగారు నవలావిమర్శవిధానమును గుఱించియు, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు వెంకిపాటలను గూర్చియు, నడకుదుటి వీరరాజు పంతులుగారు నన్నిచోడ కవిరాజశిఖామణిని గూర్చియు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు నన్నయకు పూర్వముగల ఛందస్సును గుఱించియు, చేకుమళ్ళ రాజగోపాలరావుగారు సీసపద్యములను గూర్చియు, దిగవల్లి వెంకట శివరావుగారు చిన్నకథలను గూర్చియు, గంటి జోగి సోమయాజులుగారు ఆంధ్ర ప్రబంధములగుఱించియు, పండిత శివనాథశాస్త్రిగారు ఋషిత్వము-కవిత్వమును గుఱించియు వ్రాసిన వ్యాసములు సహృదయులకు హృదయోల్లాస వికాసములను గల్పించుచున్నవి శారద ప్రక్రియావైవిధ్యమును ప్రతిఫలించుకొనిన సాహిత్య పత్రికలలో నొకటిగాఁ దెలుఁగువారి స్మృతిపథమున నిలిచియున్నది.

**భారతి :**

విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి పత్త్రికా పుత్రికలలోఁ గడగొట్టు చిన్నది భారతి. అది రుధిరోద్గారి పుష్యమాసమున (1924 జనవరి) బుట్టి కాకినాడ కాంగ్రెసు మహాసభాపర్వమున జన్మదినోత్సవము జరుపుకొనినది. నాఁటినుండి నేఁటివఱకు భారతి తెలుఁగువారి 'జనముద్దుబిడ్డ'. నలుబదియైదేండ్లు నిండినవికదా పండుముత్తైదువ యందుమా? యన్నచో-నామె తన నిత్యనూతనత్వముచే వయస్సును స్తంభింపఁజేసికొనిన సాహిత్యమూర్తి. జరాభారములేని చిరంజీవి భారతి.

తెలుగున వెలసిన సాహిత్యపత్రికలలో భారతికున్న ప్రాభవము, ప్రాబల్యము మఱి దేనికిని లేదు. అచ్చమైన సాహిత్యపత్రిక కుండవలసిన లక్షణములన్నియు దాని కచ్చొత్తినట్లమరినవి. సాహిత్యజగత్తును సాక్షిగా దర్శించుటయేగాక సాదరముగా సాకినది. గతమును గౌరవించినది; వర్తమానమును వాసికెక్కించినది; క్రొత్తప్రాతల మేలుకలయిక నసిధారావ్రతముగ నిర్వహించినది. కవిత్వము, కళ, శాస్త్రము, చరిత్ర, వ్యాసము, విమర్శనము, కథ, రూపకము, గ్రంథసమీక్ష, కలగూరగంప, లేఖలు, లేఖకపరిచయములు, స్వవిషయములు, ప్రపంచవిషయములు భారతికి నైజమైన హేలావిలాసములు. ఎన్ని హంగులున్నను స్థాయిత్వము సాహిత్యమునకే. బాలకథలనుండి బ్రహ్మపదార్థమువఱకు భారతి ప్రబోధించినది. ఆబాలగోపాలము నాకర్షించినది.

భారతి రజతోత్సవము చేసికొనుచు ప్రత్యేక సంచికను ప్రకటించుకొనినది. అందు "ఈనాడు ప్రసిద్ధవ్యక్తులైనవారిలో చాలమంది రచయితల ప్రథమ ఉజ్జ్వల రచనలు 'భారతి' నలంకరించినవి" "సర్వకళలు, సర్వ విజ్ఞానము భారతీ స్వరూపమే" అను ఉపాసకుని ఆదర్శరీత్యా సాహిత్యము, సంగీతము, చిత్రకళ, రసాయన భౌతికాది శాస్త్రములు, చరిత్ర-ఒకటేల, సర్వ విధ విజ్ఞానములకు భారతి ఆలంబనముగా నిల్చినది. విమర్శనల కొక సరళ విధానమును, విశిష్టతను, ఆధునిక స్వరూపమును కల్పించినది." "కేవలము యువకుల ఉత్సాహప్రకోపములకు అన్నివేళల చేయూత నొసగి యుండకపోవచ్చును. కాని ప్రకోపమాత్రము కాక, గాఢశక్తియుతమైన సత్యమార్గావలంబనల కన్నిటికి 'భారతి' ఉచితస్థాన మొసగుచునే వచ్చినది. దేశమున సాహిత్యమే నూత్న ప్రవేశముల నందుకొన్నను ఆ యా నూత్న ప్రకంపనముల వెలుఁగులన్నియు భారతి పూర్వసంపుటముల వరుసగా పరికించుకొనుచు వచ్చిన ప్రతిబింబములుగ గోచరించుచునేయుండు" నని ధీమాతో స్వవిషయమును చెప్పుకొనినది. రజతోత్సవమునాఁటి భారతి వాక్యములు రేపు జరుపుకొనబోవు స్వర్ణోత్సవమునాఁటికిని సత్యములై సార్థకములు కాగలవు!

దేవత లగ్నిముఖులని ప్రతీతి! నలుబదియైదేండ్లనుండి ఆంధ్ర సాహిత్యరస పిపాసువు లందఱు భారతీముఖులు!

భారతి సంపుట మొక్కొక్కటి యొక్కొక్క సాహిత్యరత్నము. (ఇప్పటికి) నలుబదియైదు రత్నములచే గూర్పఁబడిన యీ యుజ్జ్వలమాలికలో రజతోత్సవ సంవత్సర (1949) భారతీసంపుటము (26) నాయకమణివలె మన దృష్టి నాకర్షించుచున్నది.

పైసాహిత్య పత్రికలనుండి యేర్చి కూర్చిన ముప్పదిమూఁడు వ్యాసముల సంకలనగ్రంథ మీ సారస్వతవ్యాస తృతీయ సంపుటము. ఇందలి వ్యాసములు

ప్రధానముగా నాలుగుతెగల క్రింద విభజింపఁబడినవి. 1. సంస్కృతసాహిత్య సంబంధులు 2. ప్రాకృతసాహిత్యసంబంధులు 3 తెలుఁగులో శాస్త్రవిమర్శకుఁ బ్రతిబింబములైనవి 4. తెలుగులో వెలుఁగులవలెఁ గానవచ్చు ప్రక్రియావిశేషము లకు సంబంధించినవి. [చూడుడు : విషయసూచిక.]

తెలుఁగున వెలసిన సంస్కృతకావ్యవిమర్శ యపారమైనది. దాని కంత టికి నీచిన్ని పొత్తమున బ్రాతినిధ్యము గల్పింపఁగలుగుట సాధ్యమైన పనికాదు. అందువలన విషయవైవిధ్యమును దృష్టియందుంచుకొని యెనిమిది వ్యాసములు మాత్రమిందు గ్రహింపనైనవి. ప్రాకృతసాహిత్యమును గూర్చిన విమర్శ తెలుఁ గులో, నత్యంతము పరిమితముగా నున్నది. కావున నిందు ప్రాకృత కావ్యము లను బరిచయము చేయు నొకవ్యాసము గైకొనఁబడినది. తెలుఁగున వెలసిన శాస్త్రవిమర్శలో - నలంకారశాస్త్రము, వ్యాకరణము, ఛందస్సు, భాషాశాస్త్రము, (Linguistics)-వీనికి సంబంధించిన వ్యాసము లెన్నికచేయఁబడినవి. తెలుఁగు వెలుఁగులలో - తెలుఁగు కన్నడసాహిత్యములకుఁ గల సంబంధమును, కొన్ని తెలుఁగుసాహిత్యప్రక్రియల స్వరూపస్వభావములను, గ్రాంథిక వ్యావహారికభాషా వాదములను బరిచయముచేయు వ్యాసములను పొందుపఱచుటయైనది. ఇందలి వ్యాసకర్త లెల్ల నాయావిషయములలోఁ బరిశ్రమచేసి ప్రఖ్యాతివడసినవారగుటచే వారి వ్యాసము లాయాశాఖలలో మేలుబంతులై యలరారుచున్నవి. విషయవైవిధ్య ముతోఁ గూడుకొనియున్న యీ సంకలనగ్రంథము వివిధవర్ణసుమమంజరీసమలం కృతమైన భారతీదేవిపాదపీఠివలె పఠితలమనోనేత్రము నలంకరింపఁగలదని నా విశ్వాసము.

నాకీ సంకలనగ్రంథ సంపాదకత్వమున కవకాశము గలిగించిన ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ వారికిని, ప్రత్యేకముగా తత్కార్యదర్శులు, సారస్వతాభి మానులు, సహృదయులునైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి మఱల నా కృతజ్ఞతలు ఈ సంకలనగ్రంథ పర్యవేక్షణను శిష్యవాత్సల్యముతో నిర్వహించిన మా గురువర్యులు, విద్వన్మణులు డా॥ దివాకర్ల వేంకటావధానిగారికిని, పత్రికల ప్రాఁతసంపుటములను నా కందుబాటులోనుంచి సహకరించిన శ్రీ కృష్ణదేవ రాయాంధ్రభాషానిలయ, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ అధిపతులకును నా ధన్యవాదములు. శుద్ధప్రతులను సిద్ధము చేయుటలో సాయమొనర్చిన శ్రీమతి చి॥ సుశీలకు నా ఆశీస్సులు. ఈ సంకలనగ్రంథము సహృదయామోదము పొందఁగలిగినచో నా కృషి ధన్యము!

హైదరాబాదు,
సౌమ్య-విజయదశమి
20-10-1969.

గూడ వేంకట సుబ్రహ్మణ్యం.

# విషయసూచిక


**I. సంస్కృత సాహిత్య సమాలోచనము :**

ఋగ్వేద ఋషుల కవిత్వతత్త్వము
—శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి ... 1

రామాయణము (రవీంద్రుని మాతృక నుండి)
—డా. బెజవాడ గోపాలరెడ్డి ... 11

విష్ణువాయు పురాణములు
—శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు ... 19

అభిజ్ఞాన శాకుంతలము
—శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి ... 35

మధురవాణి
—శ్రీ మానవల్లి రామకృష్ణకవి ... 48

వ్యుత్పత్తివాదము
—శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరస్వామి ... 69

విద్యాజగన్నాథులు
—శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మ ... 81

ఆంధ్రులు - సంస్కృతవాఙ్మయము
—శ్రీ పరవస్తు రామానుజస్వామి ... 86

**II. ప్రాకృత సాహిత్య పరిచయము :**

ప్రాకృత కావ్యములు
—శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులు ... 106

**III. తెలుఁగులో శాస్త్రవిమర్శ :**

**అలంకార శాస్త్రము :**

అలంకారశాస్త్రము
—శ్రీ ఖులుసు వేంకటరమణయ్య ... 116

ఆనందత్రయము
—శ్రీ వేలూరి శివరామశాస్త్రి ... 123
కావ్యాలంకారచూడామణి - విన్నకోట పెద్దన
—శ్రీ దూసి రామమూర్తిశాస్త్రి ... 131
కవిత్వము
—డా. పాటిబండ మాధవశర్మ ... 142
కావ్యము - నీతి
—శ్రీ దువ్వూరి రామిరెడ్డి ... 152
స్వభావోక్తి
—శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులు ... 162

## వ్యాకరణము - ఛందస్సు :

ప్రథమపద్యాంధ్రవ్యాకరణము
—డా. బొడ్డుపల్లి పురుషోత్తం ... 171
బాలవ్యాకరణము - సులక్షణసారము
—శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి ... 189
అఖండవడి - పదునొకండుశబ్దము
—శ్రీ రావూరి దొరస్వామిశర్మ ... 210
యతిప్రాసలు
—శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి ... 218

## భాషాశాస్త్రము (Philology):

పాళి - తెలుఁగు
—శ్రీ వింగళి లక్ష్మీకాంతం ... 226
భాషాశాస్త్రము - దాని క్రమాభివృద్ధి
—శ్రీ కోరాడ రామకృష్ణయ్య ... 230

## ఆధునిక భాషాశాస్త్రము (Linguistics):

ధ్వని : వర్ణం
—డా. భద్రిరాజు కృష్ణమూర్తి ... 258

## IV. తెలుఁగు వెలుఁగులు :


తెలుగు కన్నడ సాహిత్యాల బాంధవ్యం
—శ్రీ కె. సుబ్బరామప్ప ... 270

ద్విపదకవిత్వము
—శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి ... 281

ఆంధ్ర ప్రబంధములు
—శ్రీ గంటి జోగి సోమయాజి ... 304

బొమ్మలాట - యక్షగానము
—డా. యస్. వి. జోగారావు ... 315

బ్రౌనుదొర - నిఘంటునిర్మాణము
—డా. కొత్తపల్లి వీరభద్రరావు ... 324

ఆంధ్రవిషాదనాటకము
—శ్రీ తణికెళ్ల వీరభద్రుఁడు ... 343

అమలిన శృంగారతత్త్వము
—డా. సి. నారాయణరెడ్డి ... 354

ఆంధ్ర గ్రంథ విమర్శనలేశము
—శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి ... 370

ఆంధ్ర జానపద గేయసాహిత్యము
—డా. బి. రామరాజు ... 394


## గ్రాంథిక వ్యావహారిక భాషావాదములు :


గ్రామ్యవాదుల భాషాపవాదము
—శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహరావు ... 423

నేటి తేట తెలుగు
—శ్రీ గిడుగు రామమూర్తి పంతులు ... 438

# ఋగ్వేద ఋషుల కవిత్వ తత్త్వము

—శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

సౌందర్యోపేతము లైన గీతముల సంపుటి ఋగ్వేదసంహిత. కళోపాసన, సౌందర్యోపాసన తక్క నిచట నన్య మెద్దియుఁ గానరాదు. ప్రపంచ సౌందర్యము, గృహ సౌందర్యము, మానవ బాంధవ్య సౌందర్యము, ప్రకృతి సౌందర్యము, ప్రకృతిలో నంతర్లీన మైన దైవసౌందర్యము, కవితావిషయముల సౌందర్యమును వారు పాడినారు. జ్యోతిష్మంత మగు ఉషస్సు, నక్షత్ర గ్రహసంకుల మైన యాకాశము, హృదయము నానందింపఁజేయు సూర్యాస్తమయము, గర్జన వర్షణాదులు, మరుత్తులు, మొదలైన వన్నియు సౌందర్యోపజీవ్యములు. తమ సాదృశ్యమునే సర్వత్ర గమనించి, ప్రతివిషయమునకు జీవకళ పోసినారు. తమతో పాటు దేవతలకు కూడ సుందరాభరణ వస్త్రాదులను తొడిగినారు. ప్రతిదేవతయు భక్తునికి సౌందర్యరాశి, కరుణామయుఁడు. తమ కవిత్వముపై వారికే యెక్కుడు భావము, ఆదరణము గలదు. వారి కళను, కవితాస్వరూపమును గురించి యనేక పర్యాయములు ముచ్చటించినారు. భావముపైనను, రూపము పైనను వారికి కొన్ని నిశ్చితాభిప్రాయములు గలవు. తమకృతులను ప్రథమమున కావ్యములుగనే పరిగణించినా రని చెప్పుట కనేక నిదర్శనములు కలవు. భావోచ్చారణ, తత్త్వానుభూతి, రూపాన్వేషణలను గురించి వీరికి దృఢాభిప్రాయములు కలవు. వీరి కవిత్వ తత్త్వమును దాదా పైదు క్రియాపదములక్రింద విభజింపవచ్చును. ఇవన్నియు వా రుపయోగించినవే యని జ్ఞప్తియం దుంచుకొనవలెను. ఇవి కృ, తక్ష్, ఈర్, జన్, సృజ్ ధాతువులు. 'ఈర్' ధాతువులో బ్రూ, వచ్, భర్ ధాతువు లంతర్లీనములుగ నెంచుచున్నాడను. కృ, తక్ష్ ధాతువులు కవితలోని రూపమును గూర్చి వివరించునవి. జన్, సృజ్ ధాతువులు భావమును విశదీకరించును. మిగిలినవి వీటి నేకత్ర మేళవింప జేయునవి. ఇంతమాత్రమున మూడుశాఖలుగ కవితావాద మా రోజులలో విరాజిల్లిన దని యెంచరాదు. భావరూపము లన్యోన్యాశ్రయములు, అవిభక్తములు. కవిత్వ మేకమే. భావరూపాదు లందులోని భాగములు.

రూపమునుగూర్చి వెలిబుచ్చిన భావములను క్లుప్తముగ వివరించిన, వారి యభిప్రాయము శుద్ధముగ తెలియ గలదు. యజ్ఞాన్నమువలె నూతనసూక్తమును

వసిష్ఠుడు చేసినాడు– ''ఇషం న కృణ్వే'' (7-36-2). భృగువులు రథమును చెక్కినట్లు ఋషులు గీతమును తయారు చేసినారు–''ఏతం వాం స్తోమ మశ్వినావకర్మా తక్షామ భృగవో న రథం'' (10-39-14). రూపమునకు మెరుగుల నిచ్చి రన్నమాట. వారు బ్రహ్మకృత్తులు (7-21, 2 ; 10-50- 7 ; 54-6 మొ.). సూక్తము ప్రభృతి ; ప్రకర్షచే తీసికొని రాబడినది (2. 41. 1). అంత మాత్రమున కేవలకళ లేదని యెంచరాదు- ''హంసా ఇవ కృణుథ శ్లోకం'' (3-53-10). హంసలగీతములవలె సూక్తమును చేసి పాడవలయునట. ఇట కావ్యమందలి మార్దవము, సుకుమారత, పరవశతలు సువ్యక్తములు. అశ్వినుల కుద్దేశించిన సూక్తమును భార్య నలంకరించురీతిగా నలంకరించినారు- ''న్యమృక్షామ యోషణాం న మర్యే నిత్యం న సూనుం. తనయం దధానాః'' (10-39-14).

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసములు చాల నావశ్యకములు. అశ్వము రథమున కెంత తేలికగా, శ్రమలేక కట్టెదరో అదేవిధముగ గీతమును రచించినామని కవులు చెప్పికొనినారు. రథనిర్మాత స్వామికొరకు రథమును తీసికొనిపోవు రీతిగా నోదస్సు తన సూక్తమును ఇంద్రునికి పంపినాడు-''అస్మా ఇదు స్తోమం సంహినోమి రథం న తష్టేవ తత్సినాయ గిరశ్చ గిర్వాహసే సువృక్తి'' (1-61-14). నూతన సూక్తమును తొలచినాడు– ''నవ్య మతక్ష ద్బ్రహ్మ'' (1-62-13). దేవత లిచ్చిన పరిశుభ్రమైన బుద్ధితో గీతమును తొలచగలిగినాడు (1-109-1). ప్రయాణ కాలములు మార్గముల నిర్మించునట్లు గృత్సమద ఋషి గీతముల చేసినాడు-''ఏవాతే గృత్సమదాసః శూరమన్మావస్యవో నవయుగాని తక్షుః'' (2-19-8). ఇవి బుద్ధిపూర్వకముగా నిర్మించబడినవి (2-31-7). పనివాడు తన యంత్రాదులను నిర్మించునట్లు కుశలురై యజమానులు తమ కృత్యాలను నెరవేర్చు కొనవలెను. ప్రయోజనము నపేక్షించి భృగువులు రథమును చేయునట్లు ఇంద్రానుగ్రహార్థు లగు ఋషులు సూక్తములను నిర్మింపవలెను. (4–16–20). ఇట్టి వాక్యము లనేకములు కలవు––

''బ్రహ్మ కర్మ భృగవో న రథం'' (4-16-20)
''యా తక్షామ రథా నివ'' (5-73-10)
''వచాం స్యా సా స్థవిరాయ తక్షం'' (6-32-1)
''మనీషాస్మత్. సుతష్టో రథోనవాశీ'' (7-34-1)

"బ్రహ్మణ్యా...విప్రా అతక్ష్మ" (8-6-33)
"అగ్నయే బ్రహ్మ ఋభవస్త తక్షుః
అగ్నిం మహా మవోచామ సువృక్తిం" (10-80-7)
"ప్రయేన్వస్యార్హణా తతక్షిరే
యుజం వజ్రం నృషదనేషు కారవః" (10-92-7)
"ఇమాతే వాచం...రథం నధీరః స్వపా అతక్షిషుః" (1-130-6)
"ఏతం మే స్తోమంతు విజాత విప్రో రథం నధీరః స్వపా
అతక్షం" (5-2-11).

చక్కగా నిర్మింపబడి, శీఘ్రగమనము కల రథమువలె వసిష్ఠుని గీతము పోవుచున్నది. ఇంద్రునికై గీతములను తొలచినవారికి రక్షణ, సార్వజనీనాను భూతి, పురుషత్వము లభించును. మేధావి, బుద్ధిమంతు డైనవాడు రథమును తయారుచేయునట్లు వీరు కావ్యము చేసినారు. ధీశాలియైన రథనిర్మాతవలె కుమార అత్రేయుడు సూక్తము నొనరించినాడు. అమూల్య వస్త్రములవలెను, రథము వలెను గౌరవతి సూక్తము చేసినాడు. అశ్వమును రథమునకు బంధించినట్లు నోదస్సు సూక్తమును ఆహ్వానమున కుపయోగించినాడు. (1-61-5). రుద్రుని నుంచి గైకొనిన సూక్తములను, గొల్లవాడు స్వామికి గొర్రెల నప్పగించు రీతిగ కుత్సుడు తిరిగి ఇచ్చివేసినాడు—"ఉపతే స్తోమాన్ పశుపా ఇవా కరం" (1-114-9), మరియు అశ్వినులను గురించి "నాసత్యాభ్యాం బర్హి రివ ప్రవృంజే స్తోమాన్ ఇయర్మి అభ్రియేవ వాతః" అని కలదు. దోషరహితమైన గీతము పూతము చేయబడిన ఘృతము వలె శుచిగా నున్నది. (6-10-2; 8-12-4).

ఈ వాక్యముల వలన రూపముపై వారు వహించిన శ్రద్ధ తెలియుచున్నది. పదముల కూర్పు, శోధన, ఔచిత్యము, విశిష్టార్థము, అలంకరణము మొదలైనవి తప్పక యుండవలెనని వారు దీక్షవహించి రని యనకతప్పదు. సుతష్టా, శుక్రా దేవీ (7-34-1) ఇత్యాది విశేషములతో ప్రతిభావ్యుత్పత్తుల యావశ్యకత నంగీక రించి, విధించినా రని తోచక మానదు. ప్రయత్నము లేకయే, అనాయాసముగ వారు కవిత నల్లెడివారు. హృదయపూర్వకమైన గీతమును (1-74-1. మొ.) ఉచ్చరించెడివారు. అనగా శ్రమలేకయే ఆశువుగా చెప్పినారు. హృదయ పూర్వక ముగా చెప్పుచుంటి మని యనేక పర్యాయము లనినారు. వానిలో మచ్చునకు-

''అవోచంత చర్షణయో వివాచః'' (8-31-1)
''ఇంద్రాయస్తోమం మతిభిరోవాచి'' (6-34-5)
''వోచేమ బ్రహ్మ కృతిం'' (7-28-5)
''వాచం...ప్ర...అవాదిషు'' (7-103-1)
''ధిషణా ముప బ్రువే'' (10-35-7)

—అనునవి చాలును. తన మనస్సును విప్పిచెప్పుటకు సూక్తమును సాధనముగా చేసికొనువాడు కవి. ఆవేశములో తన కనుభూతమైన విషయమును బాహ్యప్రదేశములో ప్రవేశ పెట్టవలెను. ఇదే ఇతని భారము. ఈ భారమును సంతోషముతో, మహా ప్రసాదమని ప్రకటించును అందువలననే.

''సువృక్తిం ప్రభర'' (1-84-1)
''ఇమాతే ధియం ప్రభరే మహోమహీ మస్య స్తోత్రే ధిషణా యత్ర ఆనజే'' (1-152-1)
''ప్రభరా మహేమతీః'' (1-114-; 136-1; 1-151-8; 5-12-1 మొ.)
''అమందాన్ స్తోమాన్ ప్రభరే మనీషా'' (1-126-1.)
''ప్రతవ్యసీం నవ్యసీంధేతి మగ్నయే వాచో మతిం సహస స్సూనవే భరే'' (1-143-1)
''ఉపస్తుతిం భరమాణస్య కారోః'' (1-148-2)
''అచ్ఛావో దేవీ ముషసం విభాతీం ప్రవోభరధ్వం సమపాసువృక్తిం'' (3-61-5)
''ప్రగిరం భరే నవ్యసీం జాయమానాం'' (5-41-3)
''రథై రివ ప్రభరే వాజయద్భిః ప్రదక్షిణిన్ మరుతాం స్తోమమృధ్యాం'' (5-60-1)
''వియద్వాచం కీస్తారో భరంతే'' (6-67-10)
''విసృష్ట ధేనా భరతే సువృక్తి రియ మింద్రజోహువతీ మనీషా'' (7-24-?)
''బ్రహ్మణి భృతిం నప్రభరామసి'' (8-55-11)

ఋషి ధరించి తెచ్చినది మహత్తర మైన గీతము, స్వీకార్యమును. ఆమందము లైన వవి. తనపై చూపిన అనుగ్రహమునకు సంతసించి, నమస్సులతో ధరించి, నవ్య మైన గీతిని జన్మింప చేయువాడు. రథములతో గమ్యస్థానమునకు పోవునట్లుగా శ్యావాశ్వుడు తనసూక్తాలను ధరించి, నివేదించును. అది ''విసృష్ట ధేనా'', తమ నిధిధ్యాసనకు, ఉపాసనకు హృదయ పారిశుద్ధ్యమునకు దేవతలిచ్చిన బహూకరణముగ నాగీతము నెంచెడివారాకవులు. కాని, మనఃప్రవృత్తులు భిన్నము లగుటచే, అనుభూతులు వేరగుచున్నవి. అందువలన తత్తద్గీతములతో మార్పులు కలుగును. కావుననే ''మనీషిణః ప్రభరధ్వం మనీషాం-యథా యథా మతయః సంతినృణాం'' (10-111-1) అన్నారు. కావున తత్త్వానుభూతి ఒకటే యైనను, భిన్న వ్యక్తులను, భిన్న మార్గములను అనుసరించి, వివిధ రకముల వర్ణనలతో జేరి యనేక గీతముల రాస్పద మగుచున్నది.

భావరూపాదుల సమ్మేళనమును గురించి పల్కు వాక్యము లనేకములు: ఆవేశ సమయములో కవి హృదయమున, మనస్సున ప్రచండ యుద్ధము జరుగును. ఆ సంకుల సమరమునుంచి జయజయ ధ్వానములతో బయట కరుదెంచునది సూక్తము.

దానిని కవి ఉచ్చరించును —

'సుష్టుతిమీరయామి'' (2-23-8)
''ఇయర్మివాచ మమృతాయ భూషన్'' (3-34-2)
''ఇయర్తివాచ మరితేవ నావం'' (2-42-1)
''విప్రా ఉదియర్తి వాచం'' (3-8-5)
''ఏష గ్రావేవ జరితా తదింద్రే యర్తి వాచం బృహదాశుషాణః''
(5-36-64)
''అయం మే పీత ఉదియర్తి వాచం మనీషా ముశమజీగాః''
(6-47-3)
''విప్రోమన్మాని దీర్ఘశ్రాదియర్తి'' (7-61-2)
''సువృక్తి మేరయామహే'' (7-94-4)
''సువృక్తిం ప్రేరయ'' (8-85-10)

"ఇమాంత ఇంద్ర సుష్టుతిం విప్ర ఇయర్తి దేతిభిః"
(8-12-31)

"ఉద్వాచ మీరయతి హిన్వతే మతీ
పురుష్టు తస్య కతిచి త్పరిప్రియః" (9-72-1)
"ప్రేంద్రాగ్నిభ్యాం సువచస్యామి యర్మి"
"సింధావివ ప్రేరయం నావమర్కైః" (10-116-9)
"మహీ మియర్మి సుష్టుతిః" (10-188-2)

ఇత్యాదు లసంఖ్యాకములు. పడవను నడుపురీతిగా ఆవేశ మిచ్చు దేవతయే గీత క్రమమును దిద్ది దారిజూపును. స్థిరులు, మేధావులు నైన ఋషు లాసూక్త ములు చెప్పుదురు. గ్రావములు సోమరసము వచ్చుచున్న దను సందేశమును పంపురీతిగా, గీత ముచ్చరింపబడును. సోమపానము వాక్కు నుత్పాదించును. ప్రాచీనకాలము నుంచి సూక్తములు వినుచున్న ఋషి హృదయపూర్వకముగా గీతమును చెప్పును. ధీప్రజ్ఞతో చెప్పబడిన సుష్టుతి యిది. సముద్రముపై నావను వదలునట్లుగా ఋషి తన గీతమును ఇంద్రునికై పడలును. పూజనీయులగు పురోహితులవలె దేవులు కూడ వాటిని గౌరవింతురు. సముద్రముపై నావను వదలునప్పుడు వాయుప్రసరణాదులను, నావయొక్క శక్తిని గమనించకపోరు. అటులనే సూక్తము పరిపక్వ స్థితి గాంచిన భావరూపయుతమై అలంకారోపేత మైన వేళనే ఉచ్చరింపబడు నని ధ్వని గలదు. ఇవి సార్థజన్యము లైన యెడల యెప్పుడో నశించి యుండెడివి. సార్వజనీనత వీటి విశిష్టగుణము.

వేర్వేరు స్థలములలో నున్న భావమును, రూపమును తెచ్చి కవులు మేళ వింప జేయలేదు. ఆవేశ మొక్క భావమునకే కాదు, రూపమునకు గూడ కలదు. కావున నివి పరస్పరము అవిభక్త బాంధవ్యము కలవి. అందుచే సూక్తజననముతో నివి రెండును లభించును సూక్తమును పుట్టించుచున్నా మని ఋషు లనేక సారులు చెప్పికొన్నారు.

"స్తోమం జనయామి నవ్యం" (1-109-2)
"ఉక్థం నవీయో జనయస్వ యజ్ఞైః" (6-18-15)
"నవంను స్తోమ మగ్నయే...జీజనం" (7-15-4)

"బ్రహ్మాణి జనయంత" (7-29-6)
"ఉరువ్యచసే మహినే సువృక్తి మింద్రాయ జనయంత విప్రాః" (7-31-11)
"శుచిం ను స్తోమం నవజాత మద్య" (7-93-1)
"పూర్వ్యాస్తుతి రద్ధా ద్వ్యష్టి రివాజని" (7-94-1)
"స్తోమం జీ జనత్" (8-12-14)
"అగ్నే జనామి సుష్టుతిం" (8-43-2)
"గిరం మంద్రా మజీజనత్" (8-95-5)
"ఉక్థం యదస్య జాయతే" (9-47-3)
"మధోర్ధారాభి ర్జనయంత అర్కం" (9-73-2)
"అతో మతీ ర్జనయంత స్వధాభిః" (9-95-1)
"సోమః జనితా మతీనాం" (9-66-1)
"జనయన్మతిం కవిః" (91-107-18)
"స్తోమంత ఇంద్ర విమదా అజీజన న్న పూర్వ్యం పురుతమం సదానవే" (10-23-6)
"ఇమా మగ్నే మతయస్తు జాతాః" (10-7-2)
"హృదామతిం జనయే చారుమగ్నయే" (10-91-14)

ఈను పంక్తు లుదాహరణకు చాలును. కవి నూతన సూక్తోత్పాదకుడు. అగ్నికొరకే వసిష్ఠుడు నూతన గీతమును జన్మింపచేసినాడు. ప్రాచీనులు, అర్వాచీనులునైన ఋషులు సూక్తస్రష్టలు; నవజాతము,శుచి యైన గీతములతో స్తుతించెదరు. మేఘుని నుండి వర్ష ముత్పన్నమగునట్లు గీతి యుత్పన్న మగుచున్నది. మోదనకరము లైన వానిని పుట్టించినారు. పైగా సోమమే వీనికి స్రష్ట యని కూడ పలికినారు. విమదాగీతములు అపూర్వ్యములు, పురుతమములు. కేవలము దేవత కొరకే జన్మించిన వివి. సుందరమైన గీతమును మనఃపూర్వకముగా అగ్నికొరకై పుట్టించినారు ప్రియురాలు తనభర్తయొక్క హృదయములో నుండ గోరునట్లు అగ్ని హృదయమధ్యమం దుండవలెనని కవి కోరికొనినాడు. (10-91-14).

సూక్త జననములో రూపాలంకరణకు కొంత తా వున్నది. ఋషులు గీతములను సృష్టించితి మని కూడ చెప్పుకొన్నారు. జననములో communication కు మంచి స్థానము కలదు. కళ కేవలము సృష్టి. ఇతరుల కందజేయుట యనునది సృష్టితోపాటు తనంతట తా వచ్చునది. సృష్టిలో కవి యన్వేషించ వలసినది నిధి ధ్యాసన మాత్రమే. తద్వారా సమస్తము చేకూరును.

"ఉపేమ సృక్షి" (2-35-1)
"స సృజంతే గిరః" (6-16-37)
"ఉపబ్రహ్మాణి ససృజే వసిష్ఠః" (7-18-14)
"ఉపస్తుతిం...అసృక్ష్యన్యా మివ" (8-27-11)
"స్తోమం డిదిష్టత" (10-92-9)

అను వాక్యములు సరిపోవును. సూక్తమును, వాక్కును సృష్టించినవాడు కవి. ఈ సృష్టి ప్రయత్న జన్యము కాదు. సులభముగ, తలవని తలంపుగా నరుదెంచునది. ఋగ్వేదకవుల కీ యనుభవము సర్వదా కలదు.

"వైశ్వానరాయ మతి ర్నవ్యసీ శుచిః సోమ ఇవ పవతే చారు రగ్నయే"- (6-8-1)

సోమ మేవిధముగ రమణీయతతో, అనాయాసముగ స్రవించునో, అదే విధమున సూక్తము కవిహృదయమునుండి ప్రవహించును. దీనినే పాశ్చాత్యులు "Spontaneous overflow of powerful feelings" అనినారు. ఈ యనుభవ మూ ఋషులకు నూతనము కాదనుట కీ క్రింది వాక్యముల పరిశీలింపుడు —

"మనసా మనీషా" (1-61-2)
"వృణోతి హృదామతిం నవ్యో జాయతా మృతం" (1-1(5-'5)
"హృదాయ త్తష్టాన్ మంత్రా నశంసం" (1-67-4)
"హృదా తష్టో మనసో ధాయిదేవాః" (1-171-2)
"మనసా ఉచధ మవోచన్" - (1-182-8)
"ఇమాం స్వస్మై హృద ఆసు తక్షం మంత్రం వోచేమ" (2-35-2)

"ఇంద్రం మతిర్హృద ఆవచ్యమానా చ్ఛావతిం స్తోమతష్టా జిగాతి" (3-39-1)

"పర్యచామి హృదామతిం" (10-119-5)
"హృది స్పృశో మనసా వచ్యమానాః" (10-47-7)

మనస్సుతోను, హృదయముతోను, బుద్ధితోను వచింపబడినది సూక్తము. సంపూర్ణ హృదయముతో కవి యుచ్చరించును, సూక్తములు నిర్మించును. వాటిని సమర్పించును. ప్రథమమున హృదయములోనే నిర్మింపబడిన దిది. అట్టి సూక్తము జాగ్రదవస్థకు తీసికొనివచ్చునది. ఇంద్రుని సందర్శనము గోరి యరిగిన దూత లగు నీ సూక్తములు హృదయమును స్పృశించునవి, మనసార వచింపబడినవి. అటువంటి Sincerity, జిజ్ఞాస ఉండుట చేతనే యెరుగనిదానిని గురించి తెలిసికొన కుతూహలమును కనబరచినారు - "యద్వాఘా సత్యముత యన్న విద్మ." (10-189-5).

ఇట్టి ఋషులు-కవులు పూజనీయులు.

"మాన్యస్య కారోః" (1-177-5; 184-4. మొ.) అని యనినారు. భౌతికాతీత జ్యోతులకు వశంవదులైన వీరి కపాయము లేదు. వీరు నింద్యులు కారు- "న స్తోతారం నిదేకరః" (3-41-6). వస్తుతః దోష రహితులు, సత్యాశ్రయులు, సత్యపాలకులు, వచోవిదులు (9-64-72). పైగా "సహస్రణీథాః కవయః" (10-154-5) అన్నారు. ఈ సామగ్ర్యోపేతుడైన కవి తనభావనా వాహినితో నెట్టి దాని నైనను ఉత్తమకావ్యముగా నల్లగలుగుచున్నాడు —

"అస్మా ఇదుగ్నాశ్చి ద్దేవపత్నీ రింద్రాయార్కం మహిహత్య ఊవుః" (1-61-8.)

సాలీడు తన గూటి నల్లునట్లు దేవపత్నులు ఇంద్రుని గురించి సూక్తము నల్లినారట! దేవపత్నీ శబ్దము వలన కవికి పూర్ణదనము సుకుమారత, సౌశీల్యము, స్నిగ్ధహృదయము, రమణీయత, లాలిత్యము మొదలైన సుందరగుణము లుండవలెనను ధ్వని కలదు. సూక్తము నల్లుటలో భావరూప సమ్మేళనము, ఐక్యతలు మాత్రమే కాక యొక అపూర్వాలంకృతి కలదు. కళానిష్పన్నమైన సృష్టిలో వివిధ భాగములు పొదగట్టవు. అందలి యనుభూతి సహితము సమగ్ర

కావ్య జనితమేయగును. శ్రీహర్షు డనినట్లు ఇచట "నాస్తి జన్యజనక వ్యతిభేదః". ఈ వాక్యము ఋగ్వేద కవులు నుడివిన "ఇంద్రో బ్రహ్మేంద్ర ఋషిః" అన్న పంక్తిని స్మృతికి దెచ్చును. ఈ యర్థికను జెప్పు పంక్తితో పాటు "హంసా ఇవ కృణుథ శ్లోకం" అను పంక్తిని కూడ కలిపి చదివిన మొదల ఋగ్వేద ఋషుల కవిత్వ తత్త్వము సంక్షిప్తముగ తెలియ గలదు.

"కూ" ధాతువు ఉచ్చారణ వాచి. "కవ్" అన వర్ణన. కవి శబ్దమునకు ఉచ్చరించువాడు, వర్ణించువాడు అని మాత్రమే కాక విశేషార్థము కలదు. ఋగ్వేద కాలములో ఋషి, సుమేధ, ధీర, రేభ, కవి శబ్దములు దాదాపుగ పర్యాయపదములుగ వాడబడినవి. ఋతమును కాపాడువారు కవులు. వారి హృదయములలో రహస్యముగ తత్త్వ మిమిడియున్నది—

"ఋతస్య పదం కవయోనిపాంతి
గుహానామాని దధిరే పరాణి" (10-5-2)

శ్రేష్ఠము, దోషరహితము నైన తత్త్వము వారి హృదయములలో వసించి యుండును. క్రమక్రమముగ నది వ్యక్తమై జగము నావేశించును.—

"యదేషాం శ్రేష్ఠం యదరి ప్రమాసీత్
ప్రేణా తదేషాం నిహితం గుహాలిః" (10-71-1)

దాగియున్న వానిని ప్రకాశవంతముగ చేయువాడు, సర్వమును వ్యక్త పరచువాడు కవి యని యాస్కాచార్యులు నిర్వచించినారు (12-13). సూర్యుడు, ఋషి, మహాకవియు నిట్టివారు. ఋగ్వేదకవులే ఋషులు. వారినే మహాకవు లన వలెను. సవితను కవిగా ఋషు లెంచినారు.

"విశ్వా రూపాణి ప్రతిముంచతే కవిః
ప్రాసావీ ద్భద్రం ద్విపదే చతుష్పదే
వినాకమఖ్య త్సవితా వరేణ్యోఽ
నుప్రయాణ ముషసో విరాజతి." (5-81-2)

—భారతి

స్వభాను - మాఘము - 1944 ఫిబ్రవరి.
సంపుటము 21. సంచిక 2,

# రా మా య ణ ము *

(రవీంద్రుని మాతృకనుండి)

—డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

సరాసరిని కావ్యములను రెండుభాగములుగ భాగింపవచ్చును. కొన్ని కావ్యములు కేవలము వానిని రచించు కవుల యభిప్రాయములతో ప్రపూర్ణములై యుండును; కొన్ని అటులు గాక యేదో యొక బృహత్ సంప్రదాయమునకు చెందినవై యుండును.

ఒక కవి యభిప్రాయములు ఒక కావ్యమునం దుండుననిన ఆ యభిప్రాయములు మరెవ్వరికిని ఉండవని అర్థము కాదు. ఒకవేళ అట్లుండిన అవి పిచ్చి అభిప్రాయములు, తలంపులకన్న వేరుగా నుండజాలవు. నిజసుఖదుఃఖములు, నిజకల్పన, నిజ జీవనాభిజ్ఞానము గుండా విశ్వమానవుల చిరంతన హృదయావేగము, జీవనమర్మకథ, తనంతటతానే వెలువడుచుండు నట్టి సామర్థ్యము కవియందు కలదని అర్థముచేసి కొనవలయును.

వీరు ఏ విధముగ ఒక శ్రేణికి చెందిన కవు లయిరో, ఆ విధముననే రెండవ శ్రేణికి చెందిన కవులు గలరు. వారి రచనలద్వారా ఒక సమగ్ర దేశము, ఒక సమగ్ర యుగము, తమహృదయమును, తమ అభిజ్ఞానమును వ్యక్తపరచి వాటిని మానవుల చిరంతన సామగ్రిగా చేయుచుండును.

ఈ ద్వితీయశ్రేణి కవినే మహాకవి యని చెప్పనొప్పును. సమగ్రదేశము యొక్క, సమగ్రజాతియొక్క విజ్ఞానము వీరిని ఆశ్రయించును. వీరు రచించునది యేదో వ్యక్తి విశేషముయొక్క రచనగా తోచదు. అది బృహద్వనస్పతివలె దేశముయొక్క భూతల జఠరమునుండి ఉద్భూతమయి, ఆ దేశమునకే ఆశ్రయచ్ఛాయాదానము చేయుచున్నదా యనునట్లుండును. కాళిదాసు శకుంతల, కుమార

*శ్రీయుత దినేశచంద్రసేన్ గారి 'రామాయణీకథా' అను గ్రంథమునకు భూమికా స్వరూపమున రవీంద్రులచే 1923 సం. డిసెంబరులో రచింపబడినది,

సంభవము విశేషముగ కాళిదాసు నిపుణహస్త పరిచయమును పొందుచున్నవి. కాని రామాయణ మహాభారతములు జాహ్నవీ, హిమాచలముల మాడ్కినే భారతవర్షమునకే చెందినట్లుగా తోచును. వ్యాసవాల్మీకులు ఉపలక్ష్యము మాత్రమే.

అసలు వ్యాసవాల్మీకులు ఎవరిపేరులు కావు. అవి భావమున నామకరణములు మాత్రమే. సమస్త భారత వర్షమునకు సంబంధించిన యీ గ్రంథములు రెండును, తమ్ము రచించిన కవుల నామములు పోగొట్టుకొనియున్నవి. కవులును తమ కావ్యముల యంతరాళముననే మునిగిపోయి యున్నారు.

మన దేశమున రామాయణ మహాభారతములవలె ప్రాచీన గ్రీసుదేశమునందు 'ఇలియడ్' ఉండినది. అది సమస్త గ్రీసు దేశముయొక్క హృత్పద్మసంభవముగను, హృత్పద్మవాసిగను ఉండినది. కవి హోమరు తన దేశముయొక్క కంఠమునకు భాషను దానము చేసియుండెను. ఆ సాహిత్యము తనదేశ నిగూఢాంతఃస్థలమునుండి బయల్వెడలుచు చిరకాలముగ తన దేశమును దీప్తిమంతముగ నుంచగలుగు చున్నది.

ఏ యాధునిక కావ్యమునకు గూడ నింత వ్యాపకత్వమున్నటులు కనబడదు. 'మిల్టన్' పారడైజు లాస్టునందు భాషాగాంభీర్యము, ఛందోమాహాత్మ్యము, రసగభీరత యెంత విశేషముగ నున్నను, అది దేశధనము కాదు. అది లైబ్రరీ యొక్క ఆదరమగు వస్తువు.

అయినను, కొన్ని ప్రాచీన కావ్యములను ఒకరాశిగా చేర్చి వాటికన్నిటికిని ఒకేనామ మివ్వవలయుననిన మహాకావ్యమని తప్ప మరేనామ మివ్వగలము? ఇవి ప్రాచీనకాలపు దేవదైత్యులవలె మహాకాయులుగా నుండినవి. వీటిజాతి యిప్పుడు లుప్తమై పోయినది.

ప్రాచీనార్య సభ్యతయొక్క ఒకధార యూరోపునందును, ఒకధార భారత వర్షమునందును ప్రవహించినవి. యూరోపుధార రెండు కావ్యముల యందును, భారతవర్షపు ధార రెండు కావ్యములయందును తనసాహిత్యమును సంగీతమును రక్షించి నిలిపి యున్నవి.

మనము విదేశీయులము. గ్రీసు తన సమస్త ప్రకృతిని తన రెండు కావ్యములలో ప్రకాశింపగల్గెనా లేదా యని మనము దృఢముగ చెప్పజాలము. కాని,

భారత వర్షము మాత్రము రామాయణ మహాభారతములలో నించేమియు శేషము లేకుండగ ప్రకాశింపగలిగె ననుట నిశ్చయము.

అందువల్లనే, శతాబ్దముల తరువాత శతాబ్దములు దొర్లిపోవు చున్నను, రామాయణ మహాభారతముల స్రోతము భారతవర్షమున లేశమాత్ర మైనను శుష్కించిపోవుట లేదు. అనుదినము గ్రామగ్రామమున, గృహగృహమున అవి పఠింపబడుచున్నవి. కల్లుదుకాణము నుండి రాజప్రాసాదమువరకు వాటికి సమాన మైన ఆదరము గలదు. ఆ కవియుగళము ధన్యము. కాలమహాప్రాంతర మధ్యమున వారి నామములు పోగొట్టుకొన బడినను, వారి వాణి బహుకోటి నర నారీ ద్వార ద్వారమునకు అజస్రధారగా శక్తిని శాంతిని గైకొని పోవుచున్నది. శత శత ప్రాచీన శతాబ్దముల ఒండుమట్టిని తెచ్చి, భారతవర్షము యొక్క చిత్త భూమిని నేడును సత్తువ చేయుచున్నది.

అట్టితరి, రామాయణ మహాభారతములను కేవలము మహాకావ్యము లనిన చాలదు. అవి యితిహాసములు గూడను. ఘటనావళియొక్క యితిహాసము కాదు. ఎందుకన, అట్టి యితిహాసము సమయ విశేషముపై ఆధారపడియుండును-రామాయణ మహాభారతములు భారతవర్షముయొక్క చిరకాలపు ఇతిహాసములు. అన్యేతిహాసములు కాలకాలమునకు ఎంత పరివర్తన యైనను, ఈ యితిహాసము పరివర్తనయే కాలేదు. మహాభారత వర్షపుసాధన, ఆరాధన, సంకల్పముల యితిహాసము ఈ రెండు విపులకావ్య హర్మ్యముల మధ్య చిరకాలపు సింహాసనమున విరాజమాన మగుచున్నది

ఈ హేతువుననే, రామాయణ మహాభారతముల సమాలోచన, యితర కావ్యసమాలోచన ఒకటి కాదు. రామునిచరిత్ర ఉచ్చమో, నీచమో, లక్ష్మణుని చరిత్ర మనకు రుచించునా, లేదా యనెడి విచారణ చాలదు. మౌనము దాల్చి నిఖిల భారత వర్షము అనేక సహస్ర వత్సరముల నుండి, వీటిని ఏ భావముతో గ్రహించియుండినదో యని శ్రద్ధాసహితముగ విచారణ చేయవలసి యున్నది.

రామాయణమున భారతవర్ష మేల పల్కుచున్నదో, రామాయణమున భారత వర్ష మేయాదర్శమును గొప్పదని ఒప్పుకొనినదో, అదియే ప్రస్తుతము మనము శ్రద్ధగ విచారింపవలసిన విషయము.

వీరరసప్రధాన మగు కావ్యమునే 'ఎపిక్' అనెదరని సామాన్య ప్రజల తలంపు. ఏకాలమున, ఏదేశమున వీరరసముయొక్క గౌరవము ప్రాధాన్యమును పొందినదో, ఆ దేశమున, ఆ కాలమున స్వాభావికముగ ఎపిక్ వీరరస ప్రధానమగుట తటస్థించును. ఇదియే అందులకు కారణము. రామాయణమునందు యుద్ధ వ్యాపారము కావలసినంత యున్నది. రాముని బాహుబలము గూడ విరివిగ వర్ణింపబడియున్నది. కాని రామాయణమునందు ప్రధానరసము వీరరసముకాదు. అందువల్ల బాహుబల గౌరవము హ్రస్వమగుటలేదు యుద్ధఘటనమే వారి ముఖ్య వర్ణన విషయము కాదు.

దేవుని అవతారలీలనే కైకొని రచింపబడిన కావ్యముకు కాదు ఇది. కవి వాల్మీకి యొద్ద రాముడు అవతారపురుషుడుగా నుండలేదు. సామాన్య మనుష్యుడుగనే యుండెను. కవి రామాయణమున నరచరిత్రనుగాక దేవచరిత్రనే వర్ణించి యుండిన, రామాయణము యొక్క గౌరవము తగ్గియుండెడిది; దానికి కావ్యాంశమున లోటు ఆపాదిల్లెడిది; మనుష్యుడనియే రామచరిత్రము మహిమాన్విత మైనది.

ఆదికాండ ప్రథమసర్గమందు వాల్మీకి తనకావ్యోపయుక్త నాయకుని ఉద్దేశించి బహుగుణముల ఉల్లేఖించి నారదు నిట్లడిగెను:- ''సమగ్రా రూపిణీ లక్ష్మీః క మేకం సంశ్రితా నరమ్'' (ఏదో ఒక నరుని ఆశ్రయించి సమస్త శోభలు రూపగ్రహణము గైకొనినవా?)

అప్పుడు నారదు డిట్లనియెను:-

''దేవే ష్వపి న పశ్యామి కశ్చి దేభి ర్గుణైర్యుతమ్;
శ్రూయతాం తు గుణై రేభి ర్యో యుక్తో నరచంద్రమాః॥''

(ఇట్టి గుణయుక్తపురుషుని దేవతలలో గూడ చూడలేదు. కాని యే నర చంద్రుని యందు ఈ సకల గుణములు కలవో వానివిషయము వినుము).

రామాయణము ఆ నరశ్రేష్ఠుని విషయము; దేవతావిషయము కాదు. రామాయణమునందు దేవత తన్ను తాను తక్కువ పరచుకొని మనుష్య డగుట లేదు. మానవుడే నిజగుణములద్వారా దేవతయై విరాజిల్లు చున్నాడు.

మానవుని చరమాదర్శమును స్థాపించుటకొరకే భారతవర్షపుకవి యీ మహా కావ్యమును రచించెను. ఆ దినము నుండి నేటివరకు మానవుల యాదర్శచరిత

వర్ణనను మనదేశపు పాఠకమండలి పరమశ్రద్ధా విశ్వాసములతోడ పఠించుచు వచ్చుచున్నారు.

రామాయణ ప్రధాన విశేషమేమన, అది క్షుద్రమగు గృహ విషయమునుగూడ మిగుల పెద్దదానినిగా చేసి చూపుచున్నది. పితాపుత్రుల, భ్రాతా భ్రాత, భార్యాభర్తల ధర్మబంధనములను, ప్రీతిభక్తి సంబంధములను ఎంతయు మహత్తరములైన వానినిగా చేయుటచే, అవి సహజముగనే మహాకావ్యములకు ఉపయుక్తములగు విషయము లగుచున్నవి. దేశజయము, శత్రువినాశము, రెండు ప్రబలవిరోధి పక్షముల ప్రచండాఘాత సంఘాతములు మున్నగు సమస్త వ్యాపారములే సహజముగా మహాకావ్యమునందు ఆందోళనోద్దీపన కారకములుగ నుండును. కాని, రామాయణముయొక్క ఔన్నత్యము రామాయణములోని యుద్ధముపై ఆశ్రితమై యుండలేదు. ఆ యుద్ధఘటన సీతారాముల దాంపత్యప్రేమను ఉజ్జ్వలముగ నొనర్చిచూపుటకు ఉపలక్ష్యము మాత్రమే. తండ్రియెడల కుమారుని భక్తి, సోదరునికై సోదరుని ఆత్మత్యాగము, పతిపత్నుల మధ్య పరస్పర ప్రీతినిష్ఠ, ప్రజల ప్రతి ప్రభుని కర్తవ్యము ఎటు లుండవలయునో దానినే రామాయణము చూపుచున్నది. ఈ రీతిగ వ్యక్తి విశేష ప్రధానత, గృహసంపర్కములు మరి యేదేశముయొక్క మహాకావ్యమునందున ఈ తీరుగ వర్ణనీయ విషయమైనదని చెప్పవలను పడదు.

రామాయణమున కవి పరిచయము మాత్రమే యగుటలేదు. సమస్త భారత వర్షముయొక్క పరిచయము ప్రాప్తమగుచున్నది. దీనివలన గృహమనిన, గృహ ధర్మములనిన, భారతవర్షమునకు ఎంత గౌరవార్హములగు విషయములో తెలియుచున్నది. మనదేశమున గార్హస్థ్య ఆశ్రమమునకు ఎట్టి అత్యంత ఉచ్చస్థాన మొసంగబడినదో, దానిని ఈ కావ్యము సప్రమాణముగ నిరూపించు చున్నది. గృహస్థాశ్రమము మన నిజసుఖములకు భోగములకు ఏర్పాటు చేయబడియుండలేదు; అది సమస్త సమాజమునుగూర్చి ఆలోచించెడిది; మనుష్యుని యథార్థభావముగ మనుష్యుని చేసెడిది. గృహస్థాశ్రమము భారతవర్షపు ఆర్యసమాజమునకు ప్రాకారమువంటిది. రామాయణము అట్టి గృహస్థాశ్రమముయొక్క కావ్యము. ఈ గృహస్థాశ్రమ ధర్మమునే రామాయణము ఒక విషమ అవస్థయందు గెంటి దానినే వనవాస దుఃఖముతో విశేష గౌరవాన్వితముగ నొనరించినది. కైకేయీ మంథరలు కుచక్రకఠినాఘాతములచే అయోధ్య రాజగృహమును చిందర వందర చేసినట్టి స్థితియందును, గృహధర్మపు దుర్భేద్య దృఢత్వమును రామా

యణము చాటుచున్నది. బాహుబల విషయము కాదు; జయింపవలెననెడి ఆశయు కాదు: రాష్ట్రగౌరవము కాదు. శాంతరసాస్పదమగు గృహధర్మమును రామాయణము కరుణాశ్రుజలమున అభిషిక్తము చేసి ఆ మహావీరునిపై స్థాపన చేసెను.

శ్రద్ధాహీనులగు పాఠకులు ఈ ఘట్టమున చరిత్రవర్ణన అతిశయోక్తిగ పరిణమించినదని అనగలరు. యథార్థస్థితిని కల్పనల సరిహద్దులను ఉల్లంఘించిన కావ్యకళ అతిశయోక్తిగ మారును. ఒకటిరెండు మాటలలో దాని మీమాంస కానేరదు. రామాయణ చరిత్రవర్ణన స్వాభావికము కాదని చెప్పు విదేశీయ విమర్శలకు ప్రకృతి భేదముచే నేది ఒకనికి అస్వాభావికముగ తోచునో, అదే మరొకనికి స్వాభావికముగ కనపట్టునని చెప్పవలసియున్నది. భారతవర్షము రామాయణమును అస్వాభావికమునుగాని, అతిశయోక్తినిగాని కాంచుట లేదు.

ఎచ్చోట ఏ ఆదర్శము ప్రచలితమో దానిని ఆసలే వదలివేసిన, అచ్చటి ప్రజల కది గ్రాహ్యమే కానేరదు. మన శ్రుతియంత్రమున మనము ఎన్ని శబ్ద తరంగముల యాఘాతముల గైకొనగలమో దానికి కొంత పరిమితి గలదు. ఆ సంఖ్యను మించిన మన చెవులు ఆ శబ్దతరంగములను గ్రహింపజాలవు. కావ్యము నందు చరిత్ర భావ, ఉద్భావన సంబంధము యందును ఆదేరీతిగ ఉండునని చెప్పవచ్చును.

ఇదే యథార్థమైన రామాయణ కథ, భారతవర్షముకడ ఏ యంశమునందును అస్వాభావికము కాలేదనుమాట సహస్రసంవత్సరముల నుండి రుజువై వచ్చుచున్నది. ఈ రామాయణకథనుండి భరతవర్షపు బాలురు, వృద్ధులు, వనితలు, పామరులు, పండితులు శిక్షణను మాత్రమే పొందుటకాదు; ఆనందమును పొందిరి. కేవలము దానిని శిరోధార్యముగ చేసికొనుటయే కాక, హృదయాంతరాళముల యందును ఉంచుకొనిరి. అది వారికి ధర్మశాస్త్రము మాత్రమే కాదు; వారి మహాకావ్యమై యొప్పుచున్నది.

ఈ మహాగ్రంథపు కవిత్వము భారతవర్షమునకు కేవలము సుదూరకల్పనాలోక సామగ్రియే యై యుండిన, మనసంసారసీమకు దూరస్థమగు విషయమే యై యుండిన, రాముడు ఒకే కాలమున మనకు దేవుడుగను, మనుష్యుడుగను, రామాయణముపై మనకు ఒకే కాలమున భక్తిప్రేమలు కల్గుటయు, నెప్పుడుగాని సంభవమయ్యెడిది కాదు.

ఇట్టి గ్రంథమును అన్యదేశ విమర్శకులు వారి కావ్యవిచారాదర్శానుసార ముగ అస్వాభావికమని యనిన, వారి దేశముతో సరిపోల్చుటలో భారత వర్షపు ఒక విశేషత్వము ఇంకను అధికముగ పరిస్ఫుట మగుచున్నది. రామాయణము న భారత వర్షము దేనిని అభిలషించినదో దానినే పొందగల్గినది.

రామాయణ మహాభారతములను నేను ఈ దృష్టితోనే పరికించుచున్నాను. దీని సరళానుష్టుప్ ఛందమున భారత వర్షపు సహస్ర వత్సరముల హృత్స్పందము స్పందిత మగుచున్నది.......

వాల్మీకి రామచరిత కథను పాఠకులు కేవలము కవియొక్క కార్యమని చూడక, దానిని భారతవర్షపు రామాయణముగ తెలిసికొన వలయునని మాత్రము తెలుప నుద్దేశించు చున్నాను. అలాగైన రామాయణము ద్వారా భారత వర్షమును, భారత వర్షము ద్వారా రామాయణమును సరియగురీతిగ అర్థము చేసికొనగలరు. ఇది యేదో ఐతిహాసిక గౌరవవాహిని కాదనియు, పరిపూర్ణమగు మానవుని యాదర్శ చరిత్రమును భారత వర్షము వినగోరెననియు, నేటి వఱకును అశ్రాన్తా నంద సహితముగ వినుచున్నదనియు గూడ పాఠకులు స్మరణయం దుంచుకొన వలయును. ఇందు గోరింతలు కొండంతలు చేయబడెనని కాని, యిది కావ్య కథయే యనికాని, మన దేశ మెన్నడు ననలేదు. సీతారామలక్ష్మణు లైనంత నిజము, భారతీయులకు తమతమ కుటుంబములోని వారును కారు.

పరిపూర్ణతను తెలిసికొనవలయునని భారతవర్షమునకు ఒకే ప్రాణాకాంక్ష గలదు. అది సత్యాతీతమైన దని అనాదరము చూపుటలేదు; అవిశ్వాసపడుటయు లేదు. దానినిగూడ యథార్థ సత్యమని విశ్వసించినది. దీని మూలముననే ఆనంద మును పొందుచున్నది. ఆ పరిపూర్ణతాకాంక్షను మేల్కొలిపి, తృప్తియగునటులు చేసి, రామాయణపుకవి భారతవర్షపు భక్త హృదయములను చిరకాలమూ ఋణ గ్రస్తములుగ చేసికొనెను.

ఏ జాతి ఖండసత్యమునకు ప్రాధాన్యము నొసంగు చున్నదో, ఎవ్వారు యథార్థ సత్యానుసరణమున అలసట చెందరో, కావ్యమును ప్రకృతి దర్పణము మాత్రమే యని యనుచున్నారో, వారిచే లోకములో అనేక కార్యములు చేయబడి నవి. వారు అధికముగ ధన్యులైరి. మానవజాతి వారికడ ఋణగ్రస్తమే. మరి

యొక వైపున ఎవరు "భూమైవ సుఖం, భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః" (పూర్ణతయే సుఖము, అదే తెలిసికొన దగినది) అని చెప్పిరో, ఎవరు పరిపూర్ణ పరిణామము మధ్య సమస్తభాగములకు సౌందర్యము, సకల విరోధులకు శాంతి నొనగూర్చుటకు సాధన సల్పిరో, వారి ఋణముగూడ ఎన్నటికిని తీర్పబడదు. వారి పరిచయము విలుప్తమై, వారి ఉపదేశములు మరువబడిన, మానవనాగరికత ధూళిధూమ సమాకీర్ణ కారాగారములోని జనులగుంపుల మధ్య, నిశ్వాసములచే కలుషితమై, తుదిలేని కష్టములలో తగుల్కొని, కృశించి, తుదకు మరణించి యుండెడిది. రామాయణము ఆ యఖండామృత పిపాసార్థుల చిరపరిచయము మోసికొని తెచ్చుచున్నది. దీనిలో ఏ భాతృప్రేమ, ఏ సత్యనిష్ఠ, ఏ పాతివ్రత్యము, ఏ ప్రభుభక్తి వర్ణింప బడినదో, దానిపై సరళ శ్రద్ధను, హృదయస్థభక్తిని నిలుపగలిగినచో మన కారాగారపు వాతాయనములగుండ మహాసముద్రపు నిర్మలవాయువు ప్రవేశించుటకు మార్గమును పొందగలదు.

—భారతి

విభవ సం॥ ఆశ్వయుజమాసము, అక్టోబరు, 1928.

సంపుటము: 5 ; సంచిక : 10.

—::—

# విష్ణు వాయు పురాణములు

(బ్రహ్మాండ పురాణాంతర్భాగములు)

— శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు

ఆరంభములోఁ బురాణముల సంఖ్య పదునెనిమిది కాదను సంగతి పండితు లందఱు నెఱింగినదియే. మొదట శ్లోకాత్మక మైన పురాణ మొక్కటియే యున్న ట్లును, అది క్రమముగఁ బెరిగినట్లును, దాని గ్రంథ సంఖ్య మొదట కొద్దిగా నుండి పిదపఁ బెరుగుచు వేఱు వేఱు కాలములలో వేఱు వేఱు పెరిగిన కూర్పులు బయలుదేఱి నట్లును తెలిసికొనుటకుఁ బురాణములలోనే కొన్ని సూచనలు కలవు. కీర్తిశేషులైన జాక్సనుగారు ఈ విషయమును గుఱించి యిట్లు వ్రాయుచున్నారు:

''వైదిక యుగము కడపటి భాగమునుండి క్రీస్తు పూర్వము రెండవ శతాబ్ది వఱకు నితిహాసముల కనుబంధముగఁ బురాణ మొక్కటి యుండినట్లును, అందు సర్గము, ప్రతి సర్గము, వంశము, వంశాను చరితము, మన్వంతరము అనునవి వర్ణింపఁబడి నట్లును హిందువుల వ్రాతల వలననే తెలియవచ్చు చున్నది. స్టీఫెను కాలము వఱకు వేఱు వేఱు మఠములలో వ్రాయఁబడుచు వచ్చిన మన 'శాక్జను వృత్తాంతము' (saxon chronicle) వంటివే యీ పురాణములు. నార్మనుల దండయాత్ర యనంతరము పరస్పరము సంబంధములేని భాగములు ఆ 'వృత్తాంతమున'నఁ జేరిపోవుచు వచ్చినట్లే హిందూ సామ్రాజ్య కేంద్ర ప్రభుత్వ మంతరించిన పిదపఁ బండిత సమావేశము లంతకుఁ బూర్వముకంటెఁ గష్ట సాధ్యము లైనప్పటి నుండి ఆ యా పుణ్యక్షేత్రము లందలి పండితులు తమ యొద్దనుండు శ్లోకాత్మకమైన మూలపురాణప్రతులలో నచ్చటచ్చట మార్చుటయు, మఱికొన్ని చోట్ల స్థానిక విషయములను జేర్చి గ్రంథమును బెంచుటయు సంభవించెను. మూల గ్రంథమగు నాది పురాణము నుండి యీ విధముగ బ్రహ్మ పురాణము ఒరిస్సా యందును, పద్మ పురాణము పుష్కర క్షేత్రముననను, అగ్ని పురాణము గయలోను, వరాహ పురాణము మథురలోను, వామన పురాణము

స్థానేశ్వరమునను, కూర్మ పురాణము వారణాసిలోను, మత్స్య పురాణము నర్మదా ప్రాంతము లందును బుట్టినవి."[1]

*మూల పురాణము ౧౨,౦౦౦ ల గ్రంథమే :*

దేశ కాలముల ననుసరించి పురాణములు ఎన్నో మార్పులు పొందుట వలన ఆది పురాణ మేది; ఎట్లుండినది; అను విషయములను మన మిప్పుడు సరిగా నిర్ణయింపలేము. కాని వాఙ్మయ విమర్శకుని తీక్ష్ణమైన యంతర్దృష్టి నవనవలాడుచుఁ బుష్టిగఁ బెరిగిన యష్టాదశ సంఖ్యాతీత పురాణోపపురాణ సాంద్రారణ్యమును జొరుచుకొని పోయి మూలపురాణ మను నీ యాదిమవాటికాస్వభావమును బయలు పఱుచునట్టి మఱుగుపడి నిగూఢములైన నిదర్శనములను గొన్నిఁటిని గనుఁగొనఁ గలదు.

భవిష్యత్పురాణములోని యీ క్రింది శ్లోకముల వలనఁ బురాణము లన్నియుఁ గలిసి మొదట ౧౨,౦౦౦ల శ్లోకములే యనియు, నా గ్రంథ సంఖ్య క్రమముగఁ బెరిగె ననియుఁ దెలియవచ్చు చున్నది.

"ఓ రాజోత్తమా ! పురాణము లన్నియుఁ గలిసి మొదట ౧౨,౦౦౦ ల గ్రంథ ముండెను. కాలక్రమమున నం దనేక వ్యాఖ్యానములు చేరి యది వృద్ధి నొందినది స్కాంద, భవిష్య పురాణము లీరీతినే పెరిగినవి స్కాందము, శత సహస్రము (అనగా లక్ష) అని లోకు లందఱికిఁ దెలియును. ఋషులు భవిష్య పురాణము నేఁబదివేల గ్రంథముగాఁ జేసిరి."[2]

---

1. Centenary Memorial Volume of the journal of thr Bombay Branch of the Royal Asiatic Society, Epic and Puranic notes : A.M.V. Jackson, p. 69.

2. "సర్వాణ్యేవ పురాణాని సంజ్ఞేయాని నరర్షభ, ద్వాదశైవ సహస్రాణి ప్రోక్తానాం హ మనీషిభిః,"

"పునర్వృద్ధిం గతానీహ ఆఖ్యానై ర్వివిధై ర్నృప, యథా స్కాందం తథా చేదం భవిష్యం కురునందన."

"స్కాందం శతసహస్రం తు లోకానాం జ్ఞాతమేవ హి, భవిష్య మేత దృషిణా లక్షార్ధ సంఖ్యయాకృతమ్."

—భవిష్య పురాణము, బ్రహ్మ పర్వము ౧,౧౦౪-౬.

ఇప్పుడు దొరకు వేఱు వేఱు పురాణముల ప్రతుల ప్రకారము చూచినచో ఆయా పురాణములలోని ఆ సంఖ్య మాహాత్మ్యములను దీసివేసినప్పటికిని, అష్టాదశ పురాణముల గ్రంథ సంఖ్య మొత్తము నాలుగు లక్షలకు మించినది. పండ్రెండువే లెక్కడ; నాలుగు లక్ష లెక్కడ! ఈ నాలుగు లక్షల గ్రంథమునకును (లక్షల కొలఁదిగనున్న మాహాత్మ్యములకును) ప్రధానాధారము ౧౨,౦౦౦ల పురాణమే! ఇప్పటి నాలుగులక్షల గ్రంథము నుండి మొట్టమొదటి పండ్రెండువేల గ్రంథమును విడఁదీసి చూపుటకు సాధ్యము కాకపోవచ్చును. కాని సాధారణముగ నన్ని పురాణములలోను గానవచ్చు కథలను, శ్లోకములను విడఁదీసి కుతూహల ప్రేరితులై జిజ్ఞాసువు లెవ్వరైన నాదిపురాణ స్వరూపమును నిర్మింపఁదలఁచిన యెడల నది పూర్తిగ నసాధ్యమైన కార్యము మాత్రము కాదు. అయితే యీ వ్యాసమునం దిపుడు నేను చేయఁదల పెట్టినది ఆ పని కాదు. ఆదిపురాణము బ్రహ్మాండమను పేరుతో నుండెననియు, నిప్పుడు మహాపురాణము లనఁబడునవి యొకప్పుడు దానిలోని యంతర్భాగములుగ నుండె ననియు మాత్రమే నే నీ వ్యాసమునఁ దెలుపఁ గలచితిని. నేనీరీతిని నమ్ముటకుఁ గల కారణముల నీదిగువఁ బొందుపఱుచు చున్నాను.

విష్ణు పురాణము :

ఒక్క పురాణము నుండి పెక్కు పురాణములు పుట్టినవనుటకు విష్ణు పురాణమే యొక దృష్టాంతము. పురాణములను గుఱించి విచారించిన తజ్జ్ఞు లందఱును విష్ణు పురాణము ఆదర్శ పురాణ మనియుఁ, బురాణములలోఁ బురాతమనియుఁ జెప్పిరి కాని యీ పురాణము కూడ స్వతంత్రము కాదనియు, నొకప్పుడిది ఆది బ్రహ్మాండ పురాణము యొక్క భాగముగ నుండెననియు; దరువాతఁజీలి స్వతంత్ర పురాణ మయ్యె ననియుఁ దెలియవచ్చు చున్నది. ఇందును గుఱించి యిదివఱ కెవ్వరును విచారించి యుండలేదు తెలుఁగు విష్ణు పురాణముఁ జదువు నప్పుడు ఈ విషయము నాకుఁ దెలియ వచ్చెను. ౧౬ వ శతాబ్దారంభమునం దుండిన వెన్నెలకంటి సూరన విష్ణు పురాణమును దెనిఁగించెను. అతఁడు షష్ఠ్యంతములైన తరువాత నిట్లు వ్రాసెను· "అభ్యుదయ పరంపరాభివృద్ధిగ నాయొనర్పం బూనిన యాది మహా పురాణంబగు బ్రహ్మాండ పురాణంబునందలి పరాశర సంహితయైన శ్రీ విష్ణు పురాణంబునకుఁ గథా క్రమం బెట్టిదనిన..." [౧ ఆ.] ప్రతి ఆశ్వాసము చివరను అంత్య గద్యమం దిట్లె వ్రాసి యున్నాడు. దీనిని బట్టి చూడఁగా ౧౬ వ శతాబ్ది మందలి సంస్కృత విష్ణు పురాణ ప్రతి యందు నది బ్రహ్మాండ పురాణ మందలి పరాశర సంహిత యనఁబడు భాగముని

వ్రాయఁబడి యుండె ననుట స్పష్టము. విష్ణు పురాణము స్వతంత్రగ్రంథ మనక మఱియొక పురాణ భాగమన్న యెడల దాని గౌరవము తగ్గునని కాఁబోలును ఇటీవలివారు సంస్కృత ప్రతుల నుండి యీ భాగము నెత్తివేసినారు. కావున, నది కానరాదు. కొన్నిటి యందు మాత్రము పరాశర సంహిత అని యున్నది.[3]

కావునఁ బై విషయములను బట్టి చూడ నిప్పటి విష్ణు పురాణ మను ప్రామాణిక గ్రంథము ఆదిబ్రహ్మాండ పురాణమున నొక భాగమని తేలుచున్నది. ౧౧-వ శతాబ్దమందుండిన అల్‌బెరూని యను మహమ్మదీయ పండితుఁడు తన పురాణముల జాబితాలో విష్ణు, బ్రహ్మాండ పురాణములు రెంటిని విడివిడిగఁ బేర్కొనుట వలన విష్ణు పురాణము బ్రహ్మాండ పురాణము నుండి పదునొకండవ శతాబ్దికిఁ బూర్వమే చీలిపోయి యుండునని యూహింప వచ్చును.[4] వైష్ణవమతము తిరిగి విజృంభించిన కాలమున నీ పురాణమునకుఁ బ్రాముఖ్యము వచ్చియుండును. వైష్ణవు లీ పురాణ మింకొక పురాణములోని యంతర్భాగమని యంగీకరింపక పోవుట సహజము. కాఁబట్టి మతాభినివేశముగల వైష్ణవులో, లేక, యెన్నో శతాబ్దులు కడచిన తరువాత నా పురాణమునకును దీనికిని గల సంబంధముఁ దెలియక యా యాశ్వాసాంత గద్యము లేఖక ప్రమాద మని తలంచినవారో దానిని తీసివేసి యుందురు. అయినప్పటికిఁ గొన్ని కొన్ని వ్రాఁతప్రతులలో విష్ణు పురాణ, పరాశర సంహితలు రెండు నొక్కటియే యని తెలుపు నాశ్వాసాంత గద్య భాగ మెట్లో నిలిచియే యున్నది. ఈ పురాణము యొక్క కొన్ని కొన్ని ప్రతులలోఁ బ్రతి అంశము చివర నీ యాశ్వాసాంత గద్యము లేదు. పురాణము చిట్టచివర నాఱవ యంశము కడపటనే యీ రీతిని గలదు.

"ఇతి విష్ణు పురాణే పరాశర సంహితాయాం షష్ఠోఽంశః సమాప్తః"[5]

కనుక విష్ణు పురాణము మొట్టమొదటఁ బరాశర సంహిత యనఁ బరగుచుండెనని తెలిసికొనుట కిక్కడ కిటుకు దొరకినది. అది పరాశర సంహిత యని

---

3. నేను అచ్చుపడిన గ్రంథములను మాత్రము చూచితిని. వేఱు వేఱు దేశము లందలి వ్రాత ప్రతులను జూచి యింకను శోధింప వలెను.

4. Alberuni-Trubners Oriental Series, Vol. I, Page 131.

5. Edition Printed at the Oriental Press, Bombay. Mss in the G. O. M. Library, Madras.

౧౬వ శతాబ్దమున నాంధ్రీకరింపఁబడిన విష్ణు పురాణమునఁ గూడఁ గలదు. అందువలన దీనిని బట్టి బ్రహ్మాండమనే యొక పురాణము మొదట ననేక సంహితలుగ నుండెడి దనియు, విష్ణు పురాణ మందులో నొకటి యనియు మనము గ్రహింపవచ్చును. ఇట్లే వాయు పురాణము గూడ నొకప్పుడు బ్రహ్మాండ పురాణములోనిదే యనియు నది ప్రాయికముగ మొదట వాయుసంహిత యను పేరఁ బరగుచుండెననియు మనము ముందు తెలిసికొనగలము. పెక్కు సంహితలిప్పటి కొన్ని పురాణముల లోనివేయని యందఱు నెఱిఁగిన విషయమే. ఉదాహరణమునకు సూతసంహితఁ జెప్పవచ్చును. అది యొక సంపూర్ణ గ్రంథమైనప్పటికి బ్రహ్మాండ పురాణము వలెనే దానిని సంపూర్తిగఁ గానరాని స్కాంద పురాణములోని కొంతభాగమని యూహించెదరు.

*విష్ణు పురాణము యొక్క వివిధ దశలు :*

నేఁడు కానవచ్చు ౬,౦౦౦ శ్లోకముల విష్ణు పురాణము కాని, నారద పురాణమునఁ జెప్పఁబడినట్లు ౨౩,౦౦౦ ల శ్లోకముల విష్ణు పురాణము గాని మొదట విష్ణు పురాణములో నొక భాగముగ నుండెడి దని మన మనలేము. అప్పుడు పరాశర సంహితలోఁ గొన్నివేల శ్లోకములో లేక బాగుగా నాలోచించినఁ గొన్ని వందల శ్లోకములో మాత్రమే యుండి యుండవలెను. ఈ విష్ణు పురాణము కూడ ననేకములైన యితర పురాణములవలెను, మహా భారతము వలెను క్రమ క్రమముగఁ బెరుగుచు వచ్చె ననుట స్పష్టము. రత్నగర్భ భట్టాచార్యులవారను సుప్రసిద్ధ వ్యాఖ్యాత "వైష్ణవకూట చంద్రిక" యను తమ విష్ణు పురాణ వ్యాఖ్యానమున నిట్లు చెప్పుచున్నారు: "విష్ణు పురాణ గ్రంథ సంఖ్య పదివేలని కొందఱు, నెనిమిదివేలని కొందఱు నిట్లు వేఱు వేఱు విధములుగఁ జెప్పుదురు. ఈ విధముగ గ్రంథ సంఖ్యను గూర్చి యభిప్రాయ భేదము లున్నప్పటికి నేను మాత్ర మాఱువేల శ్లోకములకే వ్యాఖ్యానము చేయుచున్నాను".[6] విష్ణుచిత్తుఁడను మఱియొక వ్యాఖ్యాకారుఁడు ఈ పురాణము యొక్క గ్రంథసంఖ్యను గుఱించి పై రీతినే పెక్కు భిన్నాభిప్రాయములను దెలిపియున్నాఁడు. "విష్ణుపురాణమున నాఱు విభాగములు కలవు; కావున నది పదివేల శ్లోకములదని, ౮ వేల శ్లోకములదని వేఱు వేఱు పురాణములలో వేఱు వేఱు రీతులఁ దెలుపఁబడినది. ఈ విభేదములు వేఱు వేఱు

6. "విష్ణు పురాణంచక్వచి ద్దశసాహస్రంక్వచి దష్టసాహస్ర మిత్యాదివికల్పేఽప్యత్ర షట్సాహస్ర మేవ వ్యాఖ్యాయతే"—(అం. ౧; అ. ౧, శ్లో. ౨౩).

సంహితల మూలమునఁ గలుగుచున్నవని చెప్పవచ్చును. విష్ణు పురాణమున లింగ పురాణము ప్రకారము పదివేల శ్లోకములును, శివ మత్స్య పురాణముల ప్రకారమెనిమిదివేల శ్లోకములును గలవు కొన్ని దేశములలో నిది తొమ్మిదివేల శ్లోకములనియు మఱికొన్ని దేశములలో నిరువది నాలుగు వేల శ్లోకము లనియుఁ వేఱొక కొన్నిట నిరువది రెండువేల శ్లోకము లనియుఁ జెప్పెదరు. కాని మే మిచట నాఱు వేలకు మాత్రమే వ్యాఖ్యానము చేయుచున్నాము.''[7]

విష్ణు ధర్మోత్తర ఖండమును విష్ణు పురాణమున కంటఁగట్టి నారద పురాణము దాని గ్రంథ సంఖ్యను విపరీతముగా ౨౩,౦౦౦ వఱకుఁ బెంచుచున్నది. కాని శ్రీ శంకరాచార్యులవారి గ్రంథముల ప్రకారము చూడఁగా విష్ణు ధర్మోత్తరమును, విష్ణు పురాణమును వేఱు వేఱు గ్రంథము లనియు, సాధారణముగ నిప్పుడచ్చుపడు కూర్పులలో నున్నట్లే యది యాఱవ యంశముతోనే ముగియుచున్నదనియు స్పష్టమగు చున్నది. "యస్మిన్న్యస్తమతి ర్న యాతి నరకం స్వర్గోఽపి యచ్చిన్తనే" అను శ్లోకముతోఁ బరాశరుల వారు విష్ణు పురాణమును ముగించు చున్నట్లు శంకరాచార్యులవారు తమ "విష్ణు సహస్రనామ భాష్యము"నందుఁ జెప్పియున్నారు.[8] ఇప్పుడీ శ్లోకము దాదాపుగ నాఱువేల శ్లోకముల విష్ణు పురాణము

---

7. వైష్ణవం తు షడ్భేదం। తేన పురాణాంతరేషు వైష్ణవస్య దశసహస్రోష్ట సహస్రత్వాద్యుక్తిః। సంహిత భేదమాన విషయాకల్ప్యః। యథా లైంగ్యే దశసహస్రమితం। శైవ మాత్స్యయోస్తు వైష్ణవంచ అష్ట సహస్ర మితి। క్వచిత్ దేశే నవ సహస్ర ముచ్యతే। క్వచిత్ చతుర్వింశతి సహస్రం। క్వచిత్ ద్వావింశతి సాహస్రం। ఇదం తు షట్సాహస్ర మస్మాభి ర్వ్యాఖ్యాయమానం [౧-౧-౨౩] ఈ వ్యాఖ్యాత యొక్క కాలమును నిర్ణయింప లేక పోయితిని. కాని యతఁడు చెప్పిన విషయము మాత్రము చాల నమూల్యమైనది. లింగ, మత్స్య పురాణముల యొక్క యిప్పు డచ్చు పడిన ప్రతులకు, నతనికి దొరికిన ప్రతులకు జాల వ్యత్యాస మున్నట్లు అతని వ్రాతల వలనఁ దెలియవచ్చుచున్నది. పురాణము లన్నియు నొక ఫక్కి నుండవలయునను నుద్దేశముతోను, సందర్భశుద్ధి గలిగి యుండవలయునను నుద్దేశముతోను ఏ విధమైన ప్రమాణము లేకయే పరిష్కర్తలిప్పు డచ్చుపడిన చాల పురాణములను దిద్దియుందురని నా నమ్మకము. ఏ పురాణము యొక్క గ్రంథ సంఖ్య యెంతో యిప్పటి లింగ పురాణమునఁ దెలుపఁబడి యుండలేదు. విష్ణు పురాణ గ్రంథ సంఖ్య ౮,౦౦౦ లని కాక ౨౩,౦౦౦ లని మత్స్య పురాణము తెలుపుచున్నది.

౮. శ్రీ శంకరాచార్యులవారి "విష్ణుసహస్రనామ భాష్యం", "వాణీ విలాస ప్రతి", శ్రీరంగం, పుట ౪౩. ఈ భాష్యకర్త ప్రస్థానత్రయ భాష్యకారులైన ఆది

చివర గాన్పించుచున్నది. 'ఓరియంటల్ ప్రెస్' ప్రతిలో నీ శ్లోకము తరువాత నాలు శ్లోకములు మాత్రమే కలవు.

విష్ణు పురాణము యొక్క వేఱు వేఱు ప్రతు లన్నిటిని బట్టి చూడఁగా మొదట నిది బ్రహ్మాండ పురాణాంతర్గతమై యున్నప్పుడించు ౬౦౦౦ శ్లోకముల కంటె నెక్కువ లేవనియుఁ బ్రారంభములో నొకవేళ రెండు మూడువేల శ్లోకములు మాత్రమే యుండెననియు మన మూహింపవచ్చును. ఈ యాఱువేల శ్లోకములలో గూడఁ జాల భాగము సాధారణముగ అసలు గ్రంథమునకు సందర్భించని యిటీవలఁ జేరిన ప్రక్షిప్తములని చూపవచ్చును.

వాయు పురాణము :

ఇంక వాయు పురాణమును గురించి యాలోచింతము. 'ఇప్పుడున్న యతి పురాతనము లైనట్టియు, నత్యంత విశ్వాస పాత్రమ లైనట్టియు నాది పురాణ

---

శంకరుల వారే యని నేననుకోను. ఆదిశంకరులవారి గ్రంథము లందలి రచనకు దీనికి సహస్రాంతము భేదముకలదు. ఆ రచన మందిది చాల నీరసముగ నున్నది. ఆదిశంకరులవారి పీఠము నధిష్ఠించిన శంకరాచార్యుల వారెవ్వరో యీ చిన్న గ్రంథమును రచియించి యుందురు. ఈ భాష్యకారుఁ డాది శంకరులవారా, వారి తరువాత నాపీఠ మధిష్ఠించిన మఱియొక శంకరాచార్యులవారా, యన్న వాదముతో మన కిప్పుడిచట నంత ప్రసక్తిలేదు. గ్రంథకర్త యెవ్వరైనను నీగ్రంథమును రచియించు నాఁటికి విష్ణుధర్మోత్తరము విష్ణు పురాణములోని యొక భాగముగఁ బరిగణింపఁబడి యుండలేదనియు విష్ణుపురాణము పై శ్లోకముతో సమాప్తమయ్యెననియు నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఈ విషయమే విష్ణుధర్మోత్తర విష్ణు పురాణములను రెంటిని కలగూరగంపగఁ గలిపివేయు నారద పురాణము యొక్క కాలమును తెలిసికొనుటకుఁ గొంచెము వీలిచ్చుచున్నది. నారద పురాణముగాని, లేదా అష్టాదశ పురాణముల యొక్క విపుల సూచినిచ్చు నారద పురాణ భాగము గాని శంకరుల తరువాత-వారాది శంకరుల వారైననేమి, లేక వారి తరువాతివారైన నేమి - పుట్టియుండవలెను. వారాది శంకరులవారేయైన యెడల నారదపురాణ కాలము క్రీ. శ. ౯ వ శతాబ్దికి ముందుది కానేరదు. తరువాతి శంకరులవారేయైన యెడల నా పురాణము నింకను జాల శతాబ్దులు తరువాతికిఁ దీసికొని రావలసి యుండును. అందువలన బురాణ విమర్శనమును గురించి పురాణ నిరీక్షణ మనఁబడు తమ చక్కని మహారాష్ట్ర గ్రంథమున నారద పురాణమున నీయఁబడిన పురాణ సూచి శంకరాచార్యులవారి కాలముకంటెఁ బూర్వపుదన్న పండిత త్ర్యంబక గురునాథ కాళేగారితో నేనేకీభవింపఁ జాలను. స్వభావము ననుసరించి పురాణములు పోను పోను వృద్ధిచెందునే కాని, సన్నగిల్లవు.

ప్రతులలో దీనినొకటిగ భావింపవచ్చు'నని విల్సన్ దొరగారీ పురాణమును గురించి చెప్పుచున్నారు. 'పవమానప్రోక్త పురాణ'మని బాణకవి దీనిని దన హర్ష చరిత్రమునఁ బేర్కొనియున్నాడు [9] ఇంతటి పురాతన పురాణము కూడ నాది బ్రహ్మాండ పురాణములోని యొక భాగముగనే కాన్పించుచున్నది. తంజావూరు సౌధ పుస్తక భాండాగారము (Tanjore Palace Library) నందలి వ్రాఁత ప్రతులను గుఱించి తయారుచేసిన సుప్రసిద్ధమైన తన గ్రంథముల పట్టికలో డాక్టరు బర్నెల్‌గారు బ్రహ్మాండ పురాణమును గురించి యీ విధముగ వ్రాసియున్నారు :

'సాధారణముగ వాయుపురాణ మనఁబడునది దాని (బ్రహ్మాండము) లోని యొక విభాగమని కొన్ని కొన్ని వ్రాఁత ప్రతుల వలన (వ్రాతప్రతుల సంఖ్య ౧౬, ౧౭ మొదలగునవి) తెలియవచ్చుచున్నది' (పుట. ౧౯౦); తాను చూచిన బ్రహ్మాండ పురాణమును గుఱించి విల్సనుగారుకూడ నిట్టి కథనే చెప్పుచున్నారు.

''సంపూర్ణ బ్రహ్మాండ పురాణ మనఁబడు ప్రతు లొక్కొక్కప్పుడు అరుదుగనైనా దొరకుచునే యుండును. అట్టి ప్రతియొకటి నాకు రెండు భాగములుగ దొరికినది. మొదటి భాగమున ౧-౩౪ అధ్యాయములు కలవు; రెండవ భాగమున ౭౮ అధ్యాయములు కలవు. ఆ రెండు భాగములలోఁ గలిసి యాపురాణమునకుఁ జెప్పఁబడిన గ్రంథసంఖ్య కలదు.[10] పెద్దదియగు మొదటి భాగము వాయుపురాణమే యని తేలినది. అందు 'ఇతి వాయు పురాణే' అనుటకు మాఱుగ 'ఇతి బ్రహ్మాండ పురాణే' అని కలదు. ఈ విధమైన మార్పు ఉద్దేశ పూర్వకముగఁ జేయబడినట్లు కన్పట్టదు. ప్రళయమును వర్ణించు వాయు పురాణమునందలి మొదటి భాగము యొక్క కడపటి కాండమునకు బ్రహ్మాండ మని నామకరణము చేయఁబడెను. ఇది వాయు పురాణ మని నిశ్చయించుట కాధార భూతములైన విషయ సూచికయు, వాయువు కథకత్వమును మర్యాదగఁ గాపాడఁబడినవి. ఈ బ్రహ్మాండ పురాణము యొక్క రెండవభాగమునకు వాయు పురాణమునకు నెట్టిసంబంధమును

---

9. గమకైర్మధురై రాక్షిపన్మనాంసి శ్రోతౄణాం గీత్యా పవమాన ప్రోక్తం పురాణం పపాఠ-హర్ష చరితము (నిర్ణయసాగర ప్రతి)-పుటలు ౮౫-౮౬. యత్ర చ మహాభారతే శకుని వధః పురాణే వాయు ప్రలపితం - కాదంబరి - పీటర్‌సన్‌గారి ప్రతి - పుట ౪౦.

10. ౧౨,౦౦౦

లేదు. దక్షిణ దేశమున నది ప్రాయికముగ సంహిత యనియో కాండ యనియో వాడుకలోనుండి యుండును'' [చూడుడు: విల్సనుగారి విష్ణుపురాణోపోద్ఘాతము].

బిబ్లియోథికా ఇండికా గ్రంథమాల, ఆనందాశ్రమ గ్రంథమాల, వేంకటేశ్వర ముద్రాలయ గ్రంథమాల-ఈ మూఁటిలోఁ బ్రకటింపఁబడిన వాయుపురాణ ప్రతులు మూఁడింటిని నేను సంపాదింపఁ గలిగితి. ఈ మూఁడుప్రతుల విషయ సూచికలను వేంకటేశ్వర ముద్రాలయమువారు ముద్రించిన బ్రహ్మాండ పురాణ ప్రతి[11] విషయ సూచికతో పోల్చిచూడఁగా వాయుపురాణములోని మున్నూటిక భాగము ముక్కకు ముక్క బ్రహ్మాండపురాణముతో సరిపోవుచున్నది. ప్రక్రియ, అనుషంగము, ఉపోద్ఘాతము, ఉపసంహారము అని బ్రహ్మాండ పురాణము నాలుగు పాదములు గలదని నారద పురాణము చెప్పుచున్నది. ఈ నాలుగు పాదములు నొకదానితరువాత నొకటి వాయుపురాణమున సంపూర్ణముగ వర్ణింపఁబడినవి. వాయుపురాణములోని కడపటి భాగమునను, బ్రహ్మాండపురాణమునను గూడఁ గానవచ్చు సామాన్యవిషయమేమియు లేదు. బ్రహ్మాండ పురాణకథకుఁడు వాయువు కావున నిప్పటి వాయు పురాణములోఁ జాలభాగము బ్రహ్మాండ పురాణములోనిదని కాని, లేక ఈ రెండు పురాణములు నొకే పురాణములోని యంతర్భాగములని కాని యూహించుట సహేతుకము కాకపోదు.

కీర్తిశేషులైన డాక్టరు రాజేంద్రలాల్ మిత్రగారిచేఁ బరిష్కృతమై బెంగాలు 'ఏషియాటిక్ సొసైటీ' వారిచేఁ బ్రకటింపఁబడిన బిబ్లియోథికా ఇండికా ప్రతి వాయు పురాణమును గుఱించి బంగాళీ విశ్వకోశ[12] మిట్లు చెప్పుచున్నది:

''దీనినిబట్టి ఈ 'సొసైటీ' వారు ప్రకటించిన వాయుపురాణము అసలు వాయుపురాణము కాదని తెలియవచ్చుచున్నది. గయాక్షేత్ర మాహాత్మ్యముకూడఁ గలిసిన బ్రహ్మాండపురాణములోని యొకభాగము మాత్రమే యిది; ఈ విధమున

11. నేను వేంకటేశ్వర ముద్రాలయమువారి ప్రతులు సరిగాఁ బరిష్కృతములైన వని తలంపను కాని, యవి వాడుకలో నున్నవి. ఏయే వ్రాత ప్రతిలోనుండి యేయే పాఠము గైకొనఁబడినదో సరిగా నుదహరింపకుండగనే యా యా పురాణములలోని పరస్పర వైరుధ్యమును దొలఁగించి, వాటి నన్వయింపఁ బ్రయత్నించినట్టు కనఁబడును. అందువలనే నే యితర ప్రతియు నాకు దొరకనప్పుడు వారి ప్రతులనే ఉపయోగించితిని.

12. సం. ౧౦. పురాణమును గుఱించిన వ్యాసమును జూడుఁడు,

నిది చిత్రమైన యొక సంకర గ్రంథము. ఇది వాయుపురాణమో, బ్రహ్మాండ పురాణమో చెప్పుటకు సాధ్యము కాదు.''

బ్రహ్మాండపురాణమును బొరపాటున వాయుపురాణ మని చెప్పినందుకు బంగాళీ విశ్వకోశకారుఁడు డాక్టరుగారిని దండించుచున్నాఁడు; కాని పైని చూపిన దృష్టాంతములవల్ల నీవిధమైన పరివర్తనమునకు డాక్టరుగారు బాధ్యులు కా రన్న విషయము స్పష్టమే. ఎవరో గ్రంథకర్త— లేక పరిష్కర్తయైనఁ గావచ్చును— చాలకాలముక్రితమే ఒక పురాణము నింకొక పురాణముగనో, లేక బ్రహ్మాండ పురాణము నందలి వాయుసంహితను వాయుమహాపురాణముగనో మార్చియుండ వచ్చును; డాక్టరుగారు సంపాదకధర్మమును బాటించి లేనివి చేర్పకయు, ఉన్నవి తీసివేయకయు సూటిగాఁ దమ వ్రాతప్రతుల ననుసరించిరి.

*నారదపురాణ మేమి చెప్పుచున్నది ?*

ఆయా పురాణములలోని గ్రంథ విషయమును గుఱించి విపులముగ నారదపురాణములోఁ జేయఁబడిన వర్ణన మంత ప్రాచీనమైనది కాకపోయినప్పటికిఁ దక్కిన పదునేడు పురాణములు నాది బ్రహ్మాండ పురాణమునుండి పెరిగిన కూర్పులే యను నైతిహ్యమున కిందు సూచనలు కలవు. ఇప్పటి బ్రహ్మాండ పురాణ (వెంకటేశ్వర ప్రతి) విషయసూచికి సరిపోవు బ్రహ్మాండపురాణ విషయ సూచి నిచ్చినతరువాత నారదపురాణకారుఁడు బుద్ధిపూర్వకముగ నిట్లు రహస్య మొకటి బయలుపఱచుచున్నాఁడు :

''నాలుగు పాదములతోను బ్రహ్మాండపురాణమును వర్ణించియున్నాను. ఇది పదునెనిమిదవది ; అనుపమానమైనది. సారాతిసారమైనది. బ్రహ్మాండ పురాణము నాలుగులక్షల శ్లోకము లని పురాణకాలమునుండి వాడుక. పారాశర్య మహా ముని దీనినే యందఱికిఁ బదునెనిమిది విధములుగఁ జెప్పియున్నాఁడు. ఆ మహా ముని నావలనఁ బురాణములను విని మననము చేసికొని ధర్మశీలురును, దీనానుగ్రహకరులు నైన మునులకుఁ దెలియఁజెప్పి వానిని లోకమున వ్యాపింపఁ జేసెను. వారు వేదముతోపాటు పురాణమును మొదట వసిష్ఠునికిఁ జెప్పిరి. ఆతఁడు దానిని శక్తి సుతునికి (పరాశరుఁడు) నతఁడు జాతకర్ణునికిఁ జెప్పిరి. ప్రభంజనముఖతః వ్యాసుఁడు దానిని సంపాదించెను. తర్వాత నా యద్భుత

పురాణ మా విధమునఁ బ్రమాణీకరించి లోకమునఁ బ్రవర్తింపఁ జేయఁ బడినది.''[13]

బ్రహ్మాండమే యన్ని యితర పురాణములకు మూలాధార మని యొక పురాణగాథ యున్నట్టి శ్లోకములు స్పష్టముగ సూచించు చున్నవి. యవద్వీపము దగ్గఱ నున్న బలిద్వీపము నందలి 'కవి' భాషలోని కి బ్రహ్మాండ పురాణ మనువదింపఁ బడుటయే చాలవఱకు దాని పౌరాతన్యమును బలపఱచుచున్నది. అట్టి యనువాద మొకటి యున్నట్లు మనకు మొట్టమొదటఁ దెలియ వచ్చినది డాక్టర్ ఆర్. ఫ్రెడ్రిక్కు గారి మూలమున. ఇందును గుఱించి వారి తరువాత వ్రాసిన వారు వారు చెప్పిన దానికంటె నంత క్రొత్త విషయము లేవియు దెలిపి యుండ లేదు. ఫ్రెడ్రిక్కుగా రన్న ప్రకారము హిందువులు క్రీస్తుశకము ౫ వ శతాబ్దికిఁ బూర్వమే బలిద్వీపమునకు వలస పోయిరి: వెళ్ళునప్పుడు వారు తమతోఁగూడఁ దమ తమ గ్రంథములను దీసికొని పోయిరి. ఆటు తరువాత నా దేశ భాషయైన 'కవి' భాషలోని కవి యనువదింపఁ బడెను. ఆ భాషలో (సంస్కృత మూలములతో సహా) ఋగ్యజుస్సామాథర్వ వేదములు, రామాయణ మహాభారతములు కూడఁ గలవు. కాని పురాణములలో నా బలిద్వీప నివాసు లొక్క బ్రహ్మాండ పురాణమునే కాని యితర పురాణముల పేర్లనైన నెఱుఁగరు.

''బలిద్వీపమున బ్రహ్మాండ పురాణము మాత్రమే యేల వాడుకలో నుండవలెనో, తక్కిన పదునేడు పురాణముల పేర్లు చెప్పినను గూడ వాటి నేమాత్రము నెఱుఁగనంత సంపూర్తిగఁ బండితులకు వాని జ్ఞాపకము కూడ నిసుమంతయైన లేకుండ నెట్లు పోయెనో యిందుకుఁ గారణ మీ విధమున సులభముగఁ జెప్ప

---

13. చతుష్పాదం పురాణం తే బ్రహ్మాణ్డం సముదాహృతమ్, అష్టాదశ మనౌపమ్యం సారాత్సార తరం ద్విజ। బ్రహ్మాండం చ చతుర్లక్షం పురాణత్వేన పఠ్యతే, తదేవ వ్యస్య గదిత మత్రాష్టాదశధా పృథక్। పారాశర్యేణ మునినా సర్వేషామపి మానద, వస్తుదృష్ట్వాథ తే నైవ మునీనాం భావితాత్మనాం మత్వా శ్రుత్వా పురాణానిలోకేభ్యః ప్రచకాశిరే మునయో ధర్మశీలా స్తే దీనానుగ్రహ కారిణః। యథా వేదం పురాణం తు వసిష్ఠాయ పురోదితం, తేన శక్తి సుతాయోక్తం జాతుకర్ణాయ తేన చ। వ్యాస లబ్ధం తతశ్చైతత్ ప్రభంజన ముఖోద్గతం, ప్రమాణీకృత్య లోకేఽస్మిన్ ప్రావర్తయ తదద్భుతమ్ [నారద పురాణము-వేంకటేశ్వర ప్రతి-పూర్వఖండము-అధ్యా. ౧౦౦ శ్లో. ౨౮-౩౫.]

వచ్చును. బలిద్వీపమున నొక తెగ శైవ మతస్థులు కలరు. వారు బ్రహ్మాండ మునే తమ పురాణముగ నంగీకరించి యున్నారు.'' (పుటలు ౭౯-౮౦)

డాక్టరు ఫ్రెడ్రిక్కుగా రీ పై విధమునఁ జెప్పుచున్నారు. దాని ననుస రించి హిందువులు బలిద్వీపమునకు మొదట వలసపోయినప్పు డొక్క **పురాణమే** యుండెనని కాని లేక యేవో కొన్ని యితర పురాణము లాది **పురాణమునుండి** చీలిపోవుట యప్పటికే యారంభమైనప్పటికిఁ దరువాత వానికి మత విషయిక ముగ గలిగిన ప్రాముఖ్య మప్పటికి రాలేదని కాని మనము న్యాయముగ నూహింప వచ్చును. బలి ద్వీప వాసుల కీ పురాణము తప్ప యే యితర పురాణము తెలి యక పోవుట కీకారణము తప్ప మఱి యే యితర కారణమును జెప్పఁజాలము. అయితే బలిద్వీప బ్రాహ్మణులు శైవులనియు, శివోత్కర్ష చెప్పనదగుటచేత వారితర పురాణముల కంటె బ్రహ్మాండ పురాణమునే కాపాడి రనియు డాక్టరు ఫ్రెడ్రిక్కుగారు ఒక సిద్ధాంతమును జేసి యా కారణమున నా ద్వీపమున నితర పురాణములు లోపించె నని చెప్పఁ బ్రయత్నించుచున్నారు. కాని పురాణములలో నాలుకంటె నెక్కువ పురాణములు శైవపరములైనవే యనియు,[14] వానిలోఁ బెక్కులు బ్రహ్మాండ పురాణము కంటెను మతాభినివేశము కలిగించునవి కల వనియుఁ బురాణముల నుండియే మన మెఱుఁగుదుము.

*బ్రహ్మాండ పురాణ విషయసూచి :*

డాక్టరు ఫ్రెడ్రిక్కుగారి వ్రాఁతలవలనఁ దెలియ వచ్చిన దానిని బట్టి చూడఁగా 'కవి' భాషలో రచియింపఁబడిన బ్రహ్మాండ పురాణ విషయసూచి చాల కొద్దిగాను, సాధారణముగను నున్నది.

''సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, సూర్య చంద్ర వంశాను చరితములు, పౌరాణిక గాథలు, కథానకములు మొదలైనవియే బ్రహ్మాండ పురాణ సూచిలోఁ గలవు. దానిని భగవానుడైన వ్యాసుఁడు రచియించెను.'' [పుట ౮౦].

---

14. ఈ క్రిందఁ బేర్కొనఁబడినవి శైవ పురాణము లని స్కాంద మిట్లు చెప్పుచున్నది:

''తత్ర శైవాని శైవంచ భవిష్యం చ ద్విజోత్తమాః। మార్కణ్డేయం తథాలైఙ్గం వారాహం స్కాందమేవ చ। మాత్స్యం మన్యే తథా కౌర్మం వామనం చ మునీశ్వరాః। బ్రహ్మాణ్డం చ దశే మాని త్రీణి లక్షాని సంఖ్యయా। గ్రన్థానాం మహిమా స్సర్వైః శివ స్యైవ ప్రకాశ్యతే'' [సంభవకాండము ౨-౩-౩౩]

ఈ పై నీయఁబడిన సూచి యన్ని పురాణములలోఁ గూడ గానవచ్చుట వలన నది యన్నిటికి మూలాధారమైది కావచ్చును. 'కవి' బ్రహ్మాండ పురాణము యొక్క సరియైన సూచిని గుఱించి మనకుఁ దెలిసిన విషయము చాల తక్కువ కాఁబట్టి యింతకంటె విస్తారము దానిని గుఱించి చెప్పలేము. కాని యీ పురాణమును గుఱించి బంగాళీ విశ్వకోశమందలి లేఖకుఁడు తనకు సమస్తము తెలిసినట్లుగనే యీ క్రింది రీతిని నొక్కి చెప్పుచున్నాడు:

"క్రీస్తుశకము ౫-వ శతాబ్దిలో బ్రహ్మాండ పురాణము యవద్వీపమునకు వెళ్ళె నని యిదివఱకే చెప్పియున్నాము. 'కవి' భాషలో దాని యనువాద మొకటి కలదు. భవిష్యద్రాజవంశానుచరితమునఁ దక్క మిగిలిన యన్ని విషయముల లోను బలిద్వీప బ్రహ్మాండ పురాణ మిప్పటి బ్రహ్మాండ పురాణమునకు సరిపోవుచున్నది. భవిష్యద్రాజేతిహాసము మినహాగా మన మీ యనువాదమున నాది బ్రహ్మాండ పురాణము యొక్క ప్రాచీన స్వరూపమును గాంచఁగలము. అష్టాదశ మహా పురాణములలోని కెల్ల నిదియే యత్యంత ప్రాచీనమైనదిగ మనము గ్రహింప వలసి యుండును." [సం. ౧౧. పుట ౬౯౪].

ఇప్పటి బ్రహ్మాండ పురాణముతో సరిపోల్చి చూడఁ గలుగుటకు 'కవి' భాషానువాద విషయానుక్రమణికా వివరములను గురించిన సమాచార మీ వ్యాసకర్త యెక్కడనుండి సంపాదించెనో నాకుఁ దెలియదు. నాకు వలెనే యీతనికిఁ గూడ డాక్టరు ఫ్రెడ్రిక్కుగారి వ్రాతలే యాధారమైన యెడల వాటివలన నింత స్పష్టముగ నిన్ని వివరములు తెలియవచ్చు నని నే ననుకోను. 'కవి' భాషలోని యీ పురాణము నింతవఱకే పండితుఁడు ననువదించుటకుఁ బూనుకొనక పోవుట చాల విచారకరము.

*పురాణము లన్నిటికి సామాన్యాధారము :*

ముఖ్యములైన రెండు ప్రాచీనపురాణములకు మూల మొక్కటే యని కనిపెట్టఁ గలిగితిమి గనుక మిగిలిన పురాణములలో ననేక మీ రెండు పురాణములనుండియే పుట్టియుండు నని మనము సులభముగఁ జూపవచ్చును. అష్టాదశ పురాణములలో బ్రప్రథమునఁ జెప్పఁబడు బ్రహ్మపురాణములోని చాల భాగములు మక్కికిమక్కి విష్ణు పురాణములోని భాగములే కాని వేఱుకావు. దాదాపుగ భాగవతపురాణములోని కథ లన్నియు (శ్లోకముల మాటకాదు. ఇది పురాణపద్ధతినిగాక కావ్యపద్ధతిని వ్రాయఁబడినదని మన మెఱుఁగుదుము)—విష్ణు

పురాణమున వర్ణింపఁబడినవి. గరుడ పురాణములోను, మఱికొన్ని యితర పురాణములలోను గల శ్రాద్ధకల్పమునకు సంబంధించిన చాల యధ్యాయములను విష్ణుపురాణములలోఁ గూడ దానికి సరిపోలిన భాగమునఁ గాంచనగును. ఇంత యేల, వైష్ణవ పురాణము లన్నియు రూపములోఁ గాని, లేక విషయములోఁ గాని ముఖ్యముగా నీ విష్ణుపురాణమునుండియే పుట్టినవని చూపవచ్చును. ఈ విధముగనే యనేకములైన శైవపురాణములకు వాయుపురాణము మూలాధారముగఁ గనఁబడును. శైవ వైష్ణవ పురాణములలో విపరీత మతాభిమానమును బురికొల్పుచు వ్రాయఁబడిన భాగములు, భవిష్యద్వృత్తాంతములు, స్థానిక మాహాత్మ్యములు- ఇవి యన్నియు నిటీవలఁ గాలక్రమమునఁ గ్రొత్తగఁ జేరిన భాగములే.

*ఒక సిద్ధాంతము:*

ఇవి యన్నియుఁ బర్యాలోచించి, క్రీస్తుశకము మూఁడు నాలుగు శతాబ్దుల వఱకుఁ బురాణమను పేరుతో నొక గ్రంథము మాత్రమే యుండెననియు, దానికే యప్పుడు కాని యటు తరువాత కాని బ్రహ్మాండమను పేరుండి యుండుననియు నేనొక సిద్ధాంతమును బ్రతిపాదించుచున్నాను. దానిలో ౧౨,౦౦౦ శ్లోకముల కంటె నెక్కువ యుండవు. ఆ పురాణములోని భాగములు క్రమముగా దానినుండి వేఱుపడి ప్రత్యేక పురాణము లయ్యెను. ఈ విధముగాఁ దఱిగిపోవుటవలన మూలపురాణము కాలక్రమమున సన్నగిల్లి నామమాత్రావశిష్ట మయ్యెను. మూల పురాణభాగము లన్నిటిలోనికి గొప్పవియు, మొట్టమొదటఁ జీలిపోయినవియు విష్ణు వాయు పురాణములై యుండును. కొంతకాలము వఱకు (అంత్యాగద్యము మొదలగు వానిలో) నేయే భాగము లెయే మూల గ్రంథములోనివో తెలుపఁబడుచు వచ్చెను. కాని, మతము మీఁది యభిమానము క్రమముగా నెక్కువైనకొలఁదిఁ గౌరవహానియని కాఁబోలు మూలగ్రంథనామమును జల్లఁగజారవిడిచి స్వతంత్రములైన ప్రత్యేక పురాణములుగనే వానినిఁ బ్రకటించుచు వచ్చిరి.

అధ్యాత్మరామాయణమును, బ్రహ్మాండ పురాణములోని వనఁబడు ననేక మాహాత్మ్యములును గాక దక్షిణ హిందూదేశమున ఈ వ్యాసమునఁ బైనుదాహరించిన బ్రహ్మాండ పురాణమునకు భిన్నమైన గ్రంథము బ్రహ్మాండ పురాణ మను పేరుతోనే మఱియొకటి గలదు.[15] ఈపురాణ కాలమునకే సి.పి.బ్రౌన్ దొరగారి ప్రోత్సాహమున నెవరో యొకపండితుఁడు తయారుచేసిన విషయవివరణముకూడఁ

15. చెన్నపురిలో గవర్నమెంటు వారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నెం. ౧౩-౫-౧౧ రు గల వ్రాఁతప్రతిని జూడుఁడు.

గలదు.[16] ఇది వైష్ణవపురాణముగఁ గనఁబడును. పూర్వోత్తరభాగము లని రెండు భాగములు కలవు. ఒక్కొక్కభాగమునఁ బెక్కు ఖండములు కలవు.

[తా. క. ఈ వ్యాసమంతయుఁ బూర్తిచేసిన పిదప నేను తెలుఁగులిపిలో ముద్రితమైన రెండు సంస్కృత విష్ణుపురాణప్రతులను జూచుట తటస్థించెను. వీటిలోని యాశ్వాసాంత్య గద్యమునఁ గూడ పదునాఱవ శతాబ్దిలోని విష్ణుపురాణాంధ్రానువాదము అంత్యగద్యమున నున్నట్లే కలదు. ఈ రెంటిలో మొదటి ప్రతిలో[17] మొదటి యధ్యాయము చివరగద్యమున నిట్లు కలదు :

"ఇత్యాది మహాపురాణే బ్రహ్మణ్డే పారాశర్య సంహితాయాం విష్ణుపురాణే పరాశర మైత్రేయసంవాదే ప్రథమాంశే ప్రథమోఽధ్యాయః."

మఱి యే యితర అధ్యాయము చివరగాని, యంశము చివరగాని యీ గద్యము కానరాదు. మొదటియంశము రెండవ యధ్యాయమునుండి యంత్యగద్య మిట్లున్నది : "ఇతి విష్ణుపురాణే ప్రథమాంశే ద్వితీయోఽధ్యాయః."

నేను చూచిన రెండవప్రతిలో[18] మొదటి యంశము మొదటి యధ్యాయము చివర మాత్రమే యంత్యగద్యమున నిట్లు కలదు :

"ఇతి సర్వపురాణానా మాదిభూతే బ్రహ్మణ్డాఖ్యే మహాపురాణే ఉద్ధృతాయాం పారాశర్య సంహితాయాం శ్రీవిష్ణుపురాణే ప్రథమోఽధ్యాయః."

పురాణము లన్నిటిలో బ్రహ్మాండమే మొట్టమొదటి పురాణమనియు, పరాశర సంహిత యను విష్ణుపురాణము దానిలోనిదే యనియు నీ గద్యము వెనుకటిదానికంటెను మఱింత స్పష్టముగఁ దెల్పుచున్నది.

---

16. చెన్నపురిలో గవర్నమెంటు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నెం. ౪-౩-౧౩రు గల వ్రాతఁ ప్రతినిఁ జూడుఁడు. ఇందు నితర పురాణముల విషయ వివరణము గూడఁ గలదు.

17. శ్రీధర విష్ణుచిత్త వ్యాఖ్యానములతోఁ గూడ నీ ప్రతిని వావిళ్ళ అనంత నారాయణశాస్త్రిగారును, వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారును, ఆది సరస్వతీ నిలయ, వివేక రత్నాకర ముద్రాలయములలో ౧౮౫౫ (కలి.౪౯౫౬)వ సం. న నచ్చువేసి యున్నారు. దీని ప్రతి యొకటి అడయారు పుస్తక భాండాగారమునఁ గలదు.

18. రెండు వ్యాఖ్యానములతో నీ ప్రతిని అయ్యన్న జగన్నాథాచార్యుల వారు జ్ఞాన సూర్యోదయ ముద్రాలయమున ౧౮౮౭ వ సం. న నచ్చువేసి యున్నారు.

ఈ గద్యము విష్ణుచిత్తుఁడు వ్యాఖ్యానము చేయునాఁటికిఁ గూడఁ గలదని యాతఁడు దానికిఁజేసిన యీ క్రింది యన్వయమువలనఁ దెలియుచున్నది:

"ఇతీతి : సర్వపురాణానా మాదిభూతే బ్రహ్మాణ్డపురాణే ఉద్ధృతాయాం పారాశర్యే సంహితాయాం ఇతి ప్రథమోఽధ్యాయః ఇత్యన్వయః."

ఈ యంత్య గద్యమును దాని వ్యాఖ్యానము నితర ప్రతులలోనుంచి తీసి వేసిరి.

అచ్చయిన యీ రెండు ప్రతులలోని యంత్యగద్యములవలన విష్ణుపురాణము ప్రత్యేక పురాణము కాదనియు నది యష్టాదశపురాణములకు మూలాధారణమైనదని ప్రసిద్ధిఁ జెందినట్టియు బ్రహ్మాండ మని పేరుగలిగినట్టియు వేఱొక పురాణములో మొదట నొకభాగముగ నుండె ననియుఁ పరంపరగ వచ్చు నొక ప్రాచీనగాథ కల దని నిస్సందేహముగఁ దేలుచున్నది.[19]]

భారతి

అక్షయ-పుష్య, మాఘములు—1927 జనవరి, ఫిబ్రవరి,

సంపుటము 4. సంచికలు 1, 2.

---

19 "సౌత్ ఇండియన్ రిసర్చి" అను నింగ్లీషు మాసపత్రికలోఁ బ్రకటితమైన యాంగ్ల వ్యాసమున కిది యనువాదము.

# అభిజ్ఞాన శాకుంతలము

—శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

లోకమునఁ గావ్యరచనకు వాల్మీకి మహర్షివలె దృశ్యకావ్య నిర్మితికి భాసుడాద్యుడనజాలము గాని తత్పూర్వరూపకము లదృశ్యము లగుటచే నట్టి యశస్సతనికి దక్కినది. కాళిదాస మహాకవి మాలవికాగ్నిమిత్ర ప్రస్తావనలో ''ప్రథిత యశసాం భాస సౌమిల్ల కవి పుత్రాదీనామ్'' అనుచు గావించిన ప్రశంస కూడా దానిని స్థిరపఱిచినది.

భాసాదులకును కాళిదాసునకును సుమా రొక శతాబ్ది యంతరమున్నది. ఇతని నాడు వారి రూపకములు ప్రదర్శన రమ్యములై మెప్పు గాంచినవి. అయితే నేమి ? దైవానుకూల్యమున భాసరూపకములు కొన్నియైనా మిగిలినవి గాని, తక్కిన వారివి పేరేని లేకుండ బోయినవి. ఆ భాసుని రూపకములైనను సుమారు వెయ్యేళ్లు వ్యాప్తిగాంచిన తరువాత మొన్న మొన్నటి వఱకు రమారమి వేయేండ్లజ్ఞాతవాసమున లీనములైనవి. అందుచే నీతని యీ నాటకరాజము జన్మించిన యుత్తరక్షణము నుండియు స్వప్నవాసవదత్తము మాదిరి నాట్యరంగముల నలంకరించుచు వచ్చి, దుర్దైవమున నది ప్రచ్ఛన్నమయినంత, దానే విద్వల్లోకమున నగ్రగణ్యమైనది. ఆనాటి యీ రెంటి ప్రశంసలివి :

''భాషాసు రమ్యా గైర్వాణీ తస్యాం కావ్యం మనోహరమ్,
తత్రాపి రూపకం రమ్యం తత్ర భాసకవేః కృతిః''
''కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా''

అట్టి ఖ్యాతిగన్న దీని ఘనత నీ చిన్న వ్యాసమున నెంతని చూతుము ? అయినా యొకింత—

ఇతివృత్తము :— ఇది మహాభారతాది పర్వమున నిట్లున్నది : ''దుష్యంతుడు వేటకై యడవికేగి క్రమముగా కణ్వాశ్రమము సమీపించి, అమ్మహర్షికి నమస్కరించి వచ్చుటకై తానొక్కడ యాశ్రమములోనికి పోయెను. కణ్వుడు కుటీరమున లేడు. శకుంతల యతని కర్ఘ్యపాద్యాదు లిచ్చి సత్కరించినంత రా

జాకన్యక యుదంత మంతయు నడిగి తెలిసికొని, తన్ను గాంధర్వమున బెండ్లి యాడుమని కోరెను. తన కుదయించిన నందనుని యువరాజును జేయునట్లు వరము పుచ్చుకొని యామె యతని కోరిక నెఱవేర్చెను. పురమున కేగిన రాజు శకుంతలకై ప్రధానుల నంపలేదు. మూడేండ్లు గర్భముమోసి యామె కుమారుని గనెను. ఆ పిల్లవా డాఱు సంవత్సరముల వాడైనంత మునీంద్రుడు శిష్యులను తోడిచ్చి తల్లిని పిల్లవానిని రాజు చెంత కంపెను. అతండు శకుంతల నెఱింగియు నెఱుగనట్లు నటించి, ''వీరు నీ భార్యాపుత్రులే, స్వీకరింపు''మని యాకాశవాణి పలికినంత భార్య నాదరించి పుత్రునికి భరతుడను పేరుపెట్టి యువరాజును జేసెను.''

ఇట్లతి సంగ్రహముగా నున్న యీ ప్రఖ్యాత వృత్తము ప్రదర్శనోచితములు సామాజిక మనోరంజకములు నగు మార్పులతోను నూతన పాత్రలతోను నవ్యకల్పనలతోను వికసించి మిశ్రవృత్తమైన విధ మొకింత కనుగొందము.

వస్తుసంగ్రహము :—రథారూఢుడై విల్లెక్కిడి లేడిని తఱుముచు వచ్చిన దుష్యంతుని కణ్వాశ్రమ మందలి తాపసులు విచారించిరి. రాజు రథము దిగి వారితో సంభాషించి, అతిథి సత్కారార్థము కూతురి నింట నుంచి కులపతి సోమతీర్థమున కేగెనని తెలిసియు తనరాక మహర్షి కామెయే తెలుపుగాక యని, తా నొక్క డాశ్రమము జొచ్చి, యొకవంక పూలమొక్కలకు నీళ్ళు వోయుచున్న మునికన్యలను చూచి, చెట్టుచాటున నుండి వారి మాటలు విని వారిపై కెళ్ళి ఱింగి, శకుంతలను కష్ట కృత్యమునకు నియోగించిన కణ్వుని చర్యకు వగచి యా కన్నె చక్కదనమున కచ్చెరువడుచు,ఆమె తాను పరిగ్రహింపదగినకన్యయని భావించుచు, భ్రమర చేష్టావశమున వారికి ప్రత్యక్షమై మాటల ధోరణిని తాను పౌరవవంశరాజయిన దుష్యంతుడ నని చెప్పి యనసూయ వలన శకుంతలా జన్మవృత్తాంతము విని, తన మనోరథమున కవకాశము కలదని నిశ్చయించుకొనెను. నాయికానాయకులు పరస్పర మనురక్తులైరి.

తరువాత మా వంశమున కీ వసుంధర యెట్టిదో మీ చెలికత్తె యట్టి దని యనసూయ ప్రియంవదలకు నచ్చజెప్పి గాంధర్వ విధికి శకుంతల నంగీకరింపజేసి సిద్ధమనోరథుడై తన్ను స్మరించుచుండుటకై స్వనామాంకితమైన యంగుళీయకమును ప్రియురాలి ప్రేలం దొడిగి, రాజు తన రాజధానికి వెంచేసెను-మఱి యా నాడో లేక మఱునాడో దుర్వాసుడు కణ్వునింటి వాకిట నతిథియై వచ్చి, పతిధ్యాన

పరవశయై తనవైపు చూడకున్న శకుంతలను "నీవు ధ్యానించుచున్నవాడు నిన్ను మఱచిపోవు"నని శపించి, యంతలో నచ్చటికి వచ్చిన ప్రియంవద ప్రార్థింపగా, "అభిజ్ఞానమైన యాభరణము కంటబడినచో శాపము తొలగిపోవు" నని విఱుగుడు చెప్పి వెళ్ళిపోయెను. అట్టిని సిద్ధముగా తమ సఖి వ్రేల నుండుటచే గండము తప్పినదని యా చెలికత్తెలు సంతోషించిరి గాన శాపము మాట శకుంతలకు చెప్పలేదు, సరిగదా, ఎవ్వరికి నీ మాట చెప్పరా దనుకొన్నారు. తరువాత-

"శకుంతల గర్భము ధరించియున్నది. దుష్యంతుడు చెప్పినట్లుగా శకుంతలను దీసికొని వెళ్లుటకై సేవకుల నంపలేదు. లేఖయైన వ్రాసి యంపలేదు. ఇందుకు దుర్వాసశ్శాపము హేతువు కాదు గదా ? తాతపాదులతో నేమి మనవి చేయుదును?" అనుచు ననసూయ విచారించుచుండగా ప్రియంవద వచ్చి, "చెలీ ! శకుంతల నత్తవారింటికి పంపుటకు తగిన సన్నాహము చేయుము. తాతపాదులు వచ్చి శకుంతలను జూచి 'కుమారీ ! నీకు తగిన భర్త లభించెను. నిన్నిపుడు పతి గృహమునకు పంపింతు' నని సెలవిచ్చినారు" అని చెప్పెను.

ఆశ్రమవాసు లందఱు శకుంతల నభినందించిరి. కణ్వుడు, గౌతమిని శార్ఙ్గరవ శారద్వతులను తోడిచ్చి కూతురు నత్తవారింటి కంపెను— వారందఱు దుష్యంతునికి చెప్పవలసిన మాటలు చెప్పిరి. ఎవ రెన్ని చెప్పినా, శకుంతలను దానాశ్రమములో పరిగ్రహించిన మాట యతడు స్మరింపకుండెను. అయితే, నీ కానవాలు చూపి నీ సంశయము తీర్చెద నని శకుంతల తన వ్రేలు తడవికొని, అయ్యో ! ఉంగరము లేదని విచారించెను. శచీతీర్థమున జాఱిపడి యుండునని గౌతమి యనెను. ఇక లాభము లేదని యా తాపసులు వెడలిపోయిరి. ప్రసవించు నంతవఱకు మా యింట నుంచెదనని పురోహితుడు శకుంతలను గొనిపోవుచుండ, అప్సర స్తీర్థముచెంత నొక తేజ స్సామె నెత్తుకొనిపోయి మారీచాశ్రమములో దాక్షాయణి కప్పగించెను —

రాజనామాంకిత మైన యాయుంగరము శచీతీర్థమున చేపలు పట్టువానికి లభించినది. అది రాజుగారి దృష్టికి వచ్చినది. శకుంతలను స్మరింపజేసి విప్రలంభావస్థ తెచ్చిపెట్టినది. అతని విరహబాధ చూచి శకుంతల శ్రేయస్సు గోరు సానుభూతి సంతోషించినది,

తరువాత నసురసంహారమునకై యింద్రునిరథ మెక్కి నాకలోకమున కేగిన దుష్యంతుడు తిరిగివచ్చును. తపస్వి క్షేత్రమైన హేమకూట పర్వత మందలి మారీచాశ్రమమున దిగి సర్వదమను డను పేర నందు క్రీడించు తన పుత్రుని శకుంతలను గాంచును. మారీచానుగ్రహమున భార్యాపుత్రులను స్వీకరించి సుఖముగా పురము చేరును. ఈ సందర్భమున రెండు మాటలు :

అనసూయ, సానుమతి, విదూషకుడు నను పాత్రములు కనరావు గాని, యీ నాటక మందలి కథ యంతయు కొంచె మెచ్చు తక్కువగా పద్మపురాణ స్వర్గఖండమున గనవచ్చును. ఆ పురాణము కూడా వ్యాసప్రోక్తమే యన్న విశ్వాసము వ్యాపించియున్నది. గావున దానినుండి కాళిదాసీ ఇతివృత్తము గ్రహించియుండు నని యెవరేని తలంపవచ్చును. ఈ విషయము నా సంస్కృత వాఙ్మయ చరిత్ర ద్వితీయ సంపుటమున చర్చించబడినది. అందలి సార మిది :- ''కాళిదాసు శాకుంతల నాటకము చదివి యానందించిన యానాటి పండితు డొకడు ప్రదర్శనోచిత క్రమమున నున్న యిందలి కథను స్వీకరించి చిన్న మార్పులతో ననుష్టుప్ఛందోబద్ధము గావించెను. అది పద్మపురాణమున కెక్కెను.'' భారతము నందే ప్రక్షిప్తము లుండగా నిక దక్కిన వాని మాట చెప్పనేల ? దీనినిబట్టి యీ దృశ్యకావ్య కథ చిరకాలము క్రిందట శ్రవ్యకావ్యకథగా గూడ మాఱిన దని సంతసింపవచ్చును.

మఱి యొక్క విశేషము—అల్లాబాదు నగరము దగ్గఱ నున్న 'భీత' గ్రామమున మార్షలు పండితుడు సంపాదించిన గుండ్రని రాగిరేకులలో శాకుంతల ప్రథమాంక కథ రేఖాచిత్రరూపము దాల్చియున్న దట. శాకుంతల ఘనతకిది వేఱొక నిదర్శనము.

పూర్వోక్తరీతి నున్న యిందలి కథాసంవిధానమున కంతకు నభిజ్ఞాన కల్పనము కీలకము. అది. అంగరసములకు మూలము. నాయికా నాయకుల శీలములకు శాణము. నాటకము పేరే దానితో నుండ నిక దాని వర్ణన మేల? తరువాతిది శాపకల్పనము. ఈ రెంటికి గల సంబంధ మందుచూ, అతి విచిత్రము కాళిదాస ప్రతిభా జ్ఞాపకము.

మూడు నాలుగు దినములు తన్ను స్మరించుచు కాలము గడుపుటకై రాజు ప్రియురాలి కిచ్చిన యుంగరము నత డా ప్రేయసిని పెండ్లాడి నట్లు నమ్ముటకై యభిజ్ఞానముగా మార్చినది శాపమే కదా! అదే పురము చేరిన ఱేనికి సతీస్మృతిని

పోగొట్టినది. శచీతీర్థమున నయ్యంగుళీయమును పడగొట్టినది. తన చెంతజేరి విలపించు సాధ్విని నిందుచూలాలిని, రాజుచే నిల్లు వెడల గొట్టించినది. తుదకు శాంత్యుపాయమును గూడ నామమాత్రము గావించినది. శాప మంగుళీయక దర్శనావసానము— అన్నమాట పోయిన యుంగరము మరల గంటబడినపుడు ''నేను పరిత్యజించిన మునిపుత్రి నేను పెండ్లాడిన శకుంతలయే' యని రాజు స్మరించుటతో సరి. మఱి దాని ప్రభావమో! తరువాత రమారమి మఱి యైదు సంవత్సరము లింట దుష్యంతుని, హేమకూటాద్రిపై పొరుగింట శకుంతలను వియోగదుఃఖానలమున వేపి విడిచి పెట్టినది. ఇక శాంత్యుపాయ మా పుణ్యదంపతులను సుఖపెట్టినదేమున్నదో యూహింపుడు!

సప్తమాంకమున మారీచ మహర్షి వినిపించు నందాక శాపముమాట గాని శాంత్యుపాయముమాట గాని యా సతీపతుల చెవిని బడదు. అపుడు గదా ''నేను లోకనిందా విముక్తుడ నైతి'' నని దుష్యంతుడును, ''ఆర్యపుత్రుడు నన్ను నిష్కారణముగ పరిత్యజింప లే'' దని శకుంతలయు నూఱడిల్లగల్గిరి. అదిగదా కథా నిర్మాణ చాతురి! అది యట్టిది గాకున్న దీని కింత ఘనత యేల వచ్చును? ఇట్లు వస్తు కల్పనౌచితి నొకింత పరామర్శించితిమి. ఇక—

పాత్రౌచిత్యము :— పౌరవోత్తముడైన రాజర్షి కథానాయకుడు. అతడు ధీరోదాత్తుడు, దక్షిణనాయకుడు. మేనకావిశ్వామిత్రుల కూతురును కణ్వమహర్షి పాలితయు దివ్యాదివ్యయు నైన శకుంతల నాయిక. బ్రహ్మర్షిపుత్రిక లైన యనసూయా ప్రియంవదలు నాయికా సఖులు. ఆపత్కాలమందు నాయికకు సహాయపడిన సానుమతి మేనకవలెనే యప్సరస. ఆ నాయికను రక్షించినవారు దివ్యు లైన దాక్షాయణీ మారీచులు, దేవదానవ మానవవంద్యులు. వారిచే దుష్యంతుని కర్పింపబడిన దౌష్యంతి జంబూద్వీపములోని ప్రాగ్భాగమునకు తన పేర భరతవర్ష మను పేరు దెచ్చి నతడు.

రాజు శకుంతల రూపలావణ్యములకు ముగ్ధుడై, యా సుందరి తప్పక క్షత్రియుడు పరిగ్రహింప దగిన కన్యారత్న మని తన యుదార హృదయము దానిని కోరుటయే తెల్పుచున్న దనుటతో స్వార్థపరాయణత్వ మహంభావము కాముకత్వ యు గనవచ్చుచున్న వని కొంద ఱయిన భావింపకపోరు, సత్యమే. కాని, యా భావ మాపాత్ర కాసమయమందు సముచితమే—రాజు మొట్టమొదట

ముగ్గురి నేకకాలమందే చూచి, అహో వీరి దర్శన మెంత మధురము ? ఈ రూప సంపద యంతఃపురాంగనలకు గూడా దుర్లభమే యనుకొన్నాడు. చాటున నుండి యట్లే చూచుచు వారి మాటలు వినుచుండ నతని దృష్టి యెక్కువగా శకుంతలపై వాలినది. హృదయము సంశయగ్రస్తమైనది. ఈ కన్య కణ్వుని కూతురా?—ఒకవేళ క్షత్రియాంగన యందు కణ్వమహర్షి కుదయించిన దేమో? అని తర్కించుకొన్నాడు. బ్రాహ్మణ మునికన్యలైన యనసూయా ప్రియంవదల సౌందర్యమును మించిన దివ్యలావణ్య రూపరేఖావిలాసములు శకుంతలయం దుండుట కని పెట్టినాడు. అపుడు మనసు పట్టజాలక ''నా యుదారహృదయము కోరుచున్నది గావున నీసుందరి తప్పక క్షత్రియుడు పరిగ్రహింప దగిన కన్యారత్నమే''యని నిశ్చయించుకొన్నాడు. నిజముగా నత డెన్నడు నధర్మచింతన మెఱుగడు. కావుననే ''య దార్య మస్యా మభిలాషి మేనః'' అనుచు ధైర్యముతో నట్లు పలుక కలిగెను.

అతడు కామియైన మాట నిజమే కాని, అనసూయ నడిగి యా శకుంతల జన్మవృత్తాంతము తెలియునందాక మనోవికారమును పైకుబుక నీయలేదు. తత్త్వము తెలిసిన పిదప, మహర్షిసమ్మతి కెదురుచూడ నక్కఱలేదని యా కన్నెను గాంధర్వవిధి కంగీకరింపజేయుట శృంగారనాయక లక్షణమే కదా!

నిజముగా నత డధర్మభీరువు. శకుంతల తన సభలోనికి వచ్చుటకు ముందే ''అనిర్వర్ణనీయం పరకళత్రమ్'' అని యామెను జూడ శంకించెను. అందఱి మాటలు వినునపు దేదో సత్యము మనస్సును పొడచుచున్నను శాపవశమున నామె తనభార్య యని స్మరింపలేక, తన్ను నమ్మింప గౌతమి శకుంతల మేలిముసుగు తొలగింప నా సుందరిం జూచి చూచి, తనలో స్వీకరించినచో పరకళత్ర పరిగ్రహ మగునేమో ! విడిచినచో స్వకళత్ర పరిత్యాగ మగునేమో ! 'ఉభయథా మహాపాపమే' యన్న పాపచింతతో మంచుతొడిమలె పువ్వుపై వాల లేక దానిని విడిచిపోలేక యుండు తుమ్మెదవలె నున్నా ననుచు నిట్లు చింతించెను:

''ఇద ముపనత మేవం రూప మక్లిష్ట కాంతి
ప్రథమ పరిగృహీతం స్యా న్నవే త్యవ్యవస్యన్,
భ్రమర ఇవ విభాతే కుంద మంతస్తుషారం
న చ ఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుమ్.''

శాపము బలపత్తర మైనపుడు తొల్లిటి సుఖానుభూతి యెట్టిదైన నేమి? తుదకు పోపొమ్మని శకుంతలను వదల్చుకొని నాయకుడు తనలో ననుకొన్న మాట లివి :

"కామం ప్రత్యాదిష్టాం స్మరామి న పరిగ్రహం మునే స్త నయామ్,
బలవత్తు దూయమానం ప్రత్యాయయతీవ మాం హృదయమ్."

"నేను విడిచిన ముని పుత్రిని నేను పెండ్లాడిన ట్లెంత మాత్రము తలంపను గాని, అదేమో కుతకుతలాడు నా హృదయము మాత్రము నన్ను నమ్మింప జేయుచున్నట్లున్నది ?" అనగా, ఏ హృదయము తొలుత శకుంతల నభిలషించి నదో, ఆ హృదయమే నీవు విడిచినది నీ భార్యయే సుమీ యని పరితపించుచున్న దని భావము. అయితే నేమి ? శాపోపహతము.

అంగుళీయక దర్శనానంతరము శకుంతలను స్మరించిన యతని పరితాపమున విప్రలంభ శృంగారము పొడచూపకపోదు గాని, అకటా ! అధర్మ మాచరించితిని గదా యన్న యనుతాపమే యందు హెచ్చు. ఆతడు దయాహృదయుడు, ధర్మమూర్తి—అనపత్యుడై మృతుడైన ధనమిత్రుని యాస్తి రాజునకు సంక్రమించునన్న మంత్రిలేఖ చూచి, అయ్యో పాపము! అతని భార్యలలో నొకతె యేని గర్భవతియేమో కనుగొనుడన్న జాలిగుండెవాడు, ఛీ! అంతర్వత్ని యైన ధర్మపత్నిని పరిత్యజించిన పాపిని. నా గతికూడ నట్టిదే కదా ! పౌరవ వంశము నాతోసరి ! యని ధర్మచ్యుతికి పరితపించిన పశ్చాత్తాపమూర్తి. ఇక నాయికా పాత్రమును గూర్చి యొకింత :

భ్రమర పీడాకల్పనము నాయికా నాయకుల ప్రత్యక్షదర్శనమునకు మూలము. అంతదనుక చాటుననుండి చూచిన జేనికి మున్నే యభిలాష మంకురించినది. ఇపు డామెకు వికార మంకురించినది. అనంగదశలలో నిది దృగవస్థ మనోహర రూపము నుదాత్తవేషమును సందర్శించి నపు "ఇత డెవరో! ఎవరికన్య!" యనెడి కుతూహలము తోడి వికార మంకురించుట స్త్రీ పురుష సాధారణము. స్వభావ సిద్ధమైన యీ మనోధర్మము ననుచితమనుట పొరపాటు. తాత్కాలికమైన యట్టి వికారము తరువాత గుణవిచారణచే నిలచిన నిలుచును, లేకున్న నంశరించును. అంతేకాని యంకురింపక మానదు. లోకజ్ఞుడైన కాళిదాసు శకుంతలచే ననిపించిన మాటయే మన కీ విషయమున ప్రమాణము.

"కిం ను ఖలు ఇమం ప్రేక్ష్య తపోవన విరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా?"

"ఇతనిని చూచి తపోవన విరుద్ధమైన వికారము పాలయితినేమి ? అనుకొన్నది. సహజధర్మ మనివార్య మనుట కీ మాట చాలును — ఇక నది మొదలా మె చూపిన హావభావములా ? మృదుతరములు; కులముగ్ధకన్యకోచితములు. వరుని మాటలతో కలుపని మాటలతీరందుమా, సౌశీల్యజ్ఞాపకములు. అతనిమీది యనురాగమా గాఢము, నిమలము. తండ్రిమీది భక్తియా, అసదృశము——నాటక శకుంతల భారత శకుంతలకంటె వేఱు. నీకు నాయం దుదయించిన వానిని యువరాజును గావింపవలెనని వర మడుగలేదు. మహారాజు మాట కాదనుటకు సాహసింపక యెట్టకేలకు గాంధర్వమున కొనబడినదిగాని తాతపాదులు తెలిసి యేమందురో, ఏమనుకొందురో యని భయపడుచునే యున్నది. సిగ్గుపడుచునే యున్నది — సభలో శారద్వతాదుల మాటలు విని రాజు విస్మితుడై "నే నీమెను పెండ్లాడితినా?" అన్నపుడు ——

"పరిగ్రహ బహుత్వేఽపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే
సముద్రరశనా చోర్వీ సఖీ చ యువయో రియమ్."

"నాకు భార్యలు పెక్కండ్రున్నను, నా వంశము పేరు నిలుపునవి రెండే, ఈ చతురబ్ధిపరీతవసుంధరయు మీ చెలికత్తెయును" అని నా సఖులకు నచ్చజెప్పి, నా తండ్రి పరోక్షమున నన్ను గాంధర్వమున బెండ్లాడి, యిపు డిట్లనుట యుక్తమేనా? యన్న తన మాట ధిక్కరించినపుడును, తన దుర్దైవమును నిందించుకొన్నది గాని పెద్దకోపముతో భర్త నేమియు తూలనాడలేదు. ఇందలి నాయిక సాత్త్వికభావము తోడి సతీతిలక మనుటకంటె హెచ్చుగా విశదీకరింపబనిలేదు.

వర్ణాశ్రమాచారమును యథోక్తముగా ప్రవర్తింపజేయ దక్షతగలవాడే ప్రజాపాలకుడు కాదగును. అర్థకామములు ధర్మావలంబనములు కావలెను గాని, తద్వ్యతిరిక్తములు కారాదు. శ్రేయస్సులు విఘ్నాంతరితములు, సుఖదుఃఖములు పర్యాయసిద్ధములు, దైవము దురతిక్రమము - ఇత్యాదిగా ప్రేక్షకులకు ధర్మము హితము నుపదేశింప నవతరించిన యీ రూపకమందలి పాత్రములిట్లే తీర్చిదిద్దినవి గాక వేవేమి ?

రసౌచితి :— రసములలో శృంగార మెట్లాదియో దానిని వివిధగతుల సముచితముగా వర్ణించిన నాటక కవులలో కాళిదాసు నట్టే యామ్యో దనదగును. ఇతని కావ్యము లన్నిటిలో నితర రసవర్ణన లెన్నో యున్నను, వానిలో నెల్ల శృంగార వర్ణనలే యెక్కువ ప్రశస్తి గాంచి యున్నవి. అందును పాఠ్యకావ్యములలోని శృంగార పద్ధతి వేఱు, దృశ్యకావ్యములలోని దాని స్థితివేఱు. అందు తామస రాజసావస్థల కడ జూచినవి. ఇందు సాత్త్వికమార్గము త్రొక్కినది. ఇంక శాకుంతలము లోని శృంగారమంచుమా, దీని కిదే సాటి. ''రసోవై సః రసగ్ హ్యేవాయం లబ్ధ్వా౽౽నందీ భవతి'' అను శ్రుతివాక్యమును లౌకికముగా సమన్వయించు తు మేని, అందుకు శాకుంతల శృంగారమాద్యోదాహరణ మగును. ఇందు కొకటి —

చెలీ ! నీవు చెంత నుండుటచే నీ పొన్నను న్న తీగతో కూడియున్నట్లు తేజరిల్లుచున్నది సుమీ యని ప్రియంవద యన్న మాట, నిజ మనుచు ఆ భావము నొకింత వివరించుటకై నాయకుడు —

''అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ'' అని ప్రారంభించి, ఈ పేడ పేడువరుస నీ వర్ణన యేమిటిరా? అనుకొని కాబోలు!—

''కుసుమ మివ లోభనీయం యౌవన మఙ్గేషు సన్నద్ధమ్''

అనుచు నొక్కమాటతో శకుంతల తారుణ్య తారతమ్యములను ప్రేక్షకుల భావనలో ప్రతిఫలింపజేసినాడు. ఇది గదా శృంగార వర్ణన సౌందర్యము! మఱొక్కటి :—

యౌవనకృతము లయిన శోభాకాంతి మాధుర్యములను పెట్టియెత్తినట్లు వర్ణించిన వారెందఱో కలరు గాని, ప్రకృతి సౌందర్య వర్ణనమున భావము వికసింప జేసిన వా రెంద ఱున్నారు ?

శకుంతల వల్కదన మవలోకించి, యీ సుందరి దేహకాంతి కీ వల్కలము తగదు గాని యిది యలంకారశోభను సంతరింపక పోలే దనుచు నాయకు డన్న మాట లివి :

''సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయ మధికమనోజ్ఞా వల్కలే నాపి తన్వీ
కి మివ హి మధురాణాం మండనం నాకృతీనామ్ ?''

గెటీ మొదలగు పాశ్చాత్య పండితులు గూడా వహవా యని మెచ్చుకొన్న వర్ణన మిది. ఇందలి కడపటి పాదము భాసుని ప్రతిమా నాటకములో నారచీర గట్టిన్న సీతను చూచి శ్రీరాము డన్న ''సర్వశోభనీయం సురూపం నామ'' అను వాక్యము ననుకరణ మనుటకంటె, ఆ సూత్రమున కిది దుష్యంతుని భాష్య మనుట యుక్తము. దీని భావము తెలుగున చూతము :

''కమలము నాచుతీఁగ పయిఁగ్రమ్మిన యేనియు సొంపులొల్కు, నా
హిమకరు శోభ యిమ్మడిగ హెచ్చును నల్లని మచ్చఁ జేసి, యీ
కమలదళాక్షి యంద మధికం బొనరించెను నారచీర, ర
మ్యము లగునట్టి రూపముల కారయ భూషణ మేది కా దిలన్ ?''

రసపిపాసువుల నాకర్షించు చాతుర్య మలర నితని స్త్రీవర్ణనము లెట్లు వికసించుచు వచ్చినవో తత్స్వరూప మొకింత యిచ్చట గనుగొందము.

''తన్వీశ్యామా శిఖరి దశనా పక్వబింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకితహరిణీ ప్రేక్షణా నిమ్ననాభిః,
శ్రోణీభారా దలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్రాస్తే యువతి విషయే సృష్టి రాద్యేవ ధాతుః.''
''అస్యా స్సర్గవిధౌ ప్రజాపతి రభూ చ్చంద్రోనుకాంతిప్రదః
శృంగారైకనిధిః కథం ను మదనో మాసోను పుష్పాకరః
వేదాభ్యాస జడః కథం ను విషయవ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం రూపం పురాణో మునిః.''
''చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా
రూపోచ్చయేన విధినా మనసా కృతాను
స్త్రీరత్నసృష్టి రపరాప్రతిభాతి సామే
ధాతు ర్విభుత్వ మనుచింత్య వపు శ్చ తస్యా.''

ఆ పరమేష్ఠి యువతి నిర్మాణ విషయమున గావించిన ప్రథమశిల్పముగా సర్వాంగ సౌష్ఠవముతోడి యక్షపత్ని మొదటి శ్లోకమున బ్రత్యక్షమగుచున్నది.

ఈ సుందరి సుధానిధి యగు చంద్రుడో శృంగారనిధి యైన కంతుడో కుసుమాకరుడైన వసంతుడో సృజియించినది గాని, అందము చందము నెఱుగని యా ఛాందసుడు ముసలితాత బ్రహ్మయ్య నిర్మించినది మాత్రము కాదను నట్లూర్వశి రెండవ శ్లోకమున గనుపిం దగుచున్నది.

మహామహిమాన్వితు డైన యాస్రష్టముందు చిత్తరువున సర్వాంగ సౌష్ఠవ ముతో నీ యువతిని లిఖించి తరువాత ప్రాణము పోసెనో, లేక, సర్వావయవ సౌందర్య ముట్టిపడు నీ సుందరిని మనసా నిర్మించెనో కాని, లోకములోని యందఱు స్త్రీలను సృజించిన ట్లీ రమణీమణిని సృజింపలేదు. ఈ తరుణీ సృష్టియే వేఱు, అనునట్లు శకుంతల మూడవ శ్లోకమున దర్శన మిచ్చుచున్నది. ఇక నీ విషయమున వివరణ మేల ? ఒక ప్రాచీన విద్వాంసుని స్తుతివాక్యము స్మరింతము చాలును.

"సాకూత మధుర కోమల విలాసినీ కంఠ కూజితప్రాయే,
శిక్షాసమయేఽపి ముదేరత లీలా కాళిదాసోక్తి."

ఇంక రూపవర్ణన మందుమా, అపురూపము - రత్నకాంచనాభరణములు లేకయే యవయవములు దేనిచే రమ్యములై ప్రకాశించునో, అది రూపము - సౌందర్యము లేక చక్కదన మన బడునది కన్నారజూచి మనసార ననుభవింప దగినదే కాని మాటలతో దెల్పదగినది కాదు. అట్టి దానిని పోలికలతో నిరూపింప బూనిన వర్ణన మిది :

"అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదితరసమ్,
అఖండం పుణ్యానాం ఫల మివ చ తద్రూప మనఘం
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః."

శకుంతల సౌందర్యము, ఆఘ్రాణింపని పువ్వువలె నున్నది, గిల్లని లేజి గురు వలె నున్నది, తొలువఁబడని మణివలె నున్నది, రుచిచూడని తేనెవలె నున్న దనుచు, కంటికి గోచరించు వస్తువులతో పోల్చియు, తనివితీఱక, పూర్వపుణ్యముల సమగ్రఫలమువలె నున్న దనుచు నదృశ్యపదార్థము నుపమానముగా జూపి, యా సౌందర్యము వర్ణనాతీత మన్న భావము వెల్లడించి నట్లున్న దీ వర్ణనము. ఇఁక -

"త త్రాపి చ చతుర్థోఽఙ్క స్తత్ర శ్లోక చతుష్టయమ్."

అనుచు రసజ్ఞుల ప్రత్యేక ప్రశంసకెక్కిన కథాభాగ మొకింత పరామర్శింతము - దీనికి సంబంధించిన ప్రదేశమా, తపోవనము. అందలి పాత్రములా, కులపతి కణ్వుడు, శిష్యులు గౌతమ్యాది తపస్వినులు తాపసకన్యలు, మృగలతా పాదపములు — అయితే నేమి? శకుంతల సత్తువారింటికి పంపుట యను విషయమును పురస్కరించుకొని యీ రంగమును రక్తి కట్టించినది కణ్వపాత్రము. ఆ యారణ్యకవ్రతు డాబ్రహ్మనిష్ఠు డిందు దివ్యదృష్టి తోడి యోగీంద్రుడై మహిమలు చూపు సిద్ధుడై పౌరుడైన గృహమేధియై పిల్లలల తండ్రియై కూతురికి బుద్ధులు నేర్పిన తల్లియై పృథ్వీశాసకుని శాసించు ధర్మశాసకుడై నటియించిన చందమపూర్వము. తన యాశ్రమము లో పెరిగిన యంపు శకుంతలపై జనియించిన మమకార మతని కంట నీరు పెట్టించినది. మా పిల్ల మగని యింటి కరుగుచున్న దమ్మా యని చెట్లతో చెప్పించినది. మా కెవ్వరికి తెలియకుండ నీ మాటల కంగీకారము చూపిన యమాయికురాలు సుమీ యీ పిల్ల! నన్ను స్మరించియైనా, నీ భార్యలు నలుగురితో సమానముగా నీమె నాదరింపుము. తరువాత దాని యదృష్ట మని యల్లునికి కబురు పంపించినది. ఆహా! సర్వజన హృదయాకర్షకముగా స్వభావ ముట్టిపడునట్లు పుత్రికావాత్సల్యము నిట్లు ప్రదర్శింప జేసిన యీ లోకజ్ఞత, ఆ చాతుర్య మా కవీంద్రుని సొమ్ము గదా! వనదేవతా వనస్పతులచే శకుంతల కై బంగారు నగలు పట్టుచీరలు లాంఛనము నిప్పించినది కవీంద్రుని వాగ్వైచిత్రియో లేక ఋషీంద్రుని మానసిక సిద్ధియో! ఇంతయేల? నాట్యరస జిజ్ఞాసతో నీ యంకము చదువు పాఠకుడా సమయమం దాయాశ్రమమున నున్నట్లు తన్మయుడై హర్షవిషాద పరవశు డగు చున్నచో సరిపోవును గదా! ఇంక, శాప ప్రభావము తోడి తరువాతి కథ :—

దుష్యంతుడు స్వపక్షమున ధర్మబుద్ధుడు; గౌతమీ శారద్వతాదుల పక్షమున ధర్మచ్యుతుడు. కణ్వమహర్షి సందేశమునే పెడచెవిని బెట్టిన యతని మఱపు తాపసుల మాటలను దరికి జేరనిచ్చునా? మేలిముసుగు తొలగించినా, ఆనవాలు పట్టనీయని దా శకుంతల నర్మాలాపములను నమ్మనిచ్చునా?

అదివఱకే లేదు కాదనుచు రాజు తనుమాటలను త్రోసివేయుటచే నందఱికిని ప్రాణము విసిగినది ఆసవాళ్ళందఱు కపట స్వభావులే యనుటలో శకుంతల కొళ్ళుమండినది. దానితో ''సభర్త్ర మైన నా ప్రార్థన నుంగీకరింపవేని నీ తం

వెయ్యి చక్కలగును'' అనుచు భారత శకుంతలవలె గట్టిగా తిట్టకపోయినా ''ధర్మమనే చొక్కాలో దూఱియున్నావు. గడ్డి మూసిన నుయ్యివంటివాడవు నీ వలెనే యందఱును వంచనాపరులు అనుకొనుచున్నావు'' అనుచు మృదువుగా నిందింపకపోలేదు. ఆ నిందతో ''ఈ తరుణి కోపము నిష్కపటముగా గనవచ్చు చున్న'' దనుచు రాజుబుద్ధి సందిగ్ధావస్థలో పడకపోలేదు. అయితేనేమి? అభిజ్ఞా నము కంటబడలేదు గదా!

అంగుళీయక దర్శనమైనది. శాప మంతరించినది. రాజునకు విరహవేదన యారంభమైనది. శకుంతల కా యుంగరమిచ్చిన సందర్భమును స్మరించి, ఆడిన మాట తప్పిన క్రూరుడనని పశ్చాత్తాప పడుచు, నామె చిత్తరువు చూచి సత్య శకుంతల ప్రత్యక్షమైనట్లు మురియుచు చిత్తరువని తెలిసినంతనే మరల విచారించు నాయకుని విరహము, ''పూర్వాపరవిరోధీ అపూర్వ ఏష విరహమార్గః'' అని సానుమతి యన్నట్లు విజృంభించినది. తుదకు నాయకుడన్న మాటలివి :

''ప్రజాగరా త్ఖిలీభూత స్తస్యా స్స్వప్నే సమాగమః
బాష్పస్తు న దదా త్యేనాం ద్రష్టుం చిత్రగతా మపి.''

ప్రియురాలిని కలలో గలసి సుఖింతునంటే కంటికి కునుకు రాకున్నది. పోనీ! చిత్తరువులో చూచి యానందింతునంటే కన్నీరు చూడనీయకున్నది.

ఇట్లనురక్తురాలైన ధర్మపత్నిని వదలు కొన్నందుకును అంతర్వత్ని యైన యా సాధ్విని విడిచి వంశప్రతిష్ఠకవరోధము కలిగించుకొన్నందుకును పరి తపించు నాయకుని హృదయము మాతలి చర్యచే వీరరసాక్రాంత మైనది. తరు వాత దుష్యంతునికి శకుంతలాభరత లాభమున నాటకము శుభాంతముగా ముగి సినది. ఈ విషయమున మారీచమహర్షి వాక్యము స్మరణీయము.

''దిష్ట్యా శకున్తలా సాధ్వీ స దపత్య మిదం భవాన్
శ్రద్ధా విత్తం విధి శ్చేతి త్రితయం తత్సమాగతమ్.''

— భారతి

జయ-వైశాఖము - మే, 1954.

సంపుటము 31, సంచిక 5.

# మ ధు ర వా ణి

— శ్రీ మానవల్లి రామకృష్ణకవి

రఘునాథుడు పెక్కండ్ర సంస్కృతాంధ్ర ద్రవిడ విద్వన్మణులఁ బోషించి గ్రంథముల స్వయముగా రచించియు, రచియింపించియుఁ జోళపాండ్య తుండీర దేశముల ననేక పుణ్యస్థలముల దేవతావిమానమండపాదుల నిర్మించి చోళదేశమున ననేకాగ్రహారములఁ దన పెద్దలపేర స్థాపించి పశ్చిమోత్తర దేశముల నుండి దక్షిణాభిముఖి యైపాఱివచ్చు సంగీతదేవతకుఁ దంజాపుర ప్రాంతము విహార భూమిగా నిలిపి శూద్రక వాసుదేవ విక్రమార్క భోజాదుల చరిత్రము లిట్టి వని యుద్ద్యోతింపఁజేయు విద్యావినోదములతోఁ గాలము పుచ్చి కీర్తికాయుఁ డయ్యె. ఇతని గుఱించి పెద్దగ్రంథము రచింపఁదగిన చరిత్ర సామగ్రి కలదు.

భోజవిక్రమార్కాదుల సభలలోవలె నితని యాస్థానమునఁ బెక్కండ్రు స్త్రీలు సంగీత సాహిత్య నృత్య విద్యలఁలో ప్రౌఢిమ చూపుచుఁ బురుషప్రకాండు లకు సమానముగా గోష్ఠి ప్రసంగములఁ జొచ్చి కనకరత్నాభిషేక గౌరవములు వడసి సంస్కృతాంధ్రములఁ గావ్యసంతానముచేఁ దమ వంశకీర్తులఁ బవిత్ర తరములుగాఁ జేసికొనిరి. వీరిలో మిన్నలని యెన్నఁదగిన యన్నులు రఘునాథ చరిత్రము రచించిన రామభద్రాంబయు, రామాయణసార సంగ్రహము విరచించిన మధురవాణియుఁ గాఁదగుదురు. రామభద్రాంబ తాను రఘునాథుని దేవి యని చెప్పుకొన్నది గాని మధురవాణి రాజుతోఁ తనకుఁ గల సంబంధ బంధముల వర్ణించు కొన్నదికాదు. కావున నా రాజపురందరుని రహఃకేళీ విలాసములఁ బాల్గొనునంత సౌభాగ్య సంపద లేనిదేమో. రేవా, రోహా, శశిప్రభా, అణులక్ష్మి, మాధవీ, ప్రహతా మొదలగు ప్రాకృతభాషాకవయిత్రులును, విజ్జా, విజయా, అవంతి సుందరీ, శీలాదులగు నార్యావర్త సంస్కృత కావ్యకర్తలును, కంతి హొన్న మొదలగు ద్రవిడ విదుషులును ప్రఖ్యాతలై యుండ నాంధ్రవనితలలో సంస్కృతాంధ్ర కవయిత్రులు గల్గరనుట యేమి చోద్యము? మొల్ల, రంగాజి, ముద్దుపళని మొదలగు నాంధ్రభాషా రచయిత్రు లాంధ్రవిమర్శకులకుఁ జిరపరి చితులే కదా! అట్లే గంగాదేవి, తిరుమలదేవి, రామభద్రాంబా ప్రభృతులగు నాంధ్రస్త్రీల సంస్కృత వాగ్విలాసము లాస్వాదితపూర్వములే యగును.

సంస్కృతమున రామాభ్యుదయము రచించిన యభిరామ కామాక్షియు, నందే శ్రీరంగాభ్యుదయము విరచించిన త్రివేణికయు, దృశ్యశ్రవ్యకావ్య ప్రాకృత గ్రంథసంధాత్రి యగు శారదయు నాంధ్రమహిళలు గాఁబోలు. వారి వచో గుంఫము కొందఱ కింకను శ్రవణగోచరము కాకుండ వచ్చును.

"గద్య పద్య ప్రబన్ధానాం । పఞ్చాష్టాదశనాటకైః
సాకం ప్రాకృత కావ్యాభ్యాం । సాహిత్యం శారదా వ్యధాత్॥"

అని డిండిమ కవిచక్రవర్తి యగు నరుణగిరినాథునిచేఁ బొగడ్త గన్న శారద దేవరాయల యాస్థానవిదుషి యందురు. త్రివేణి తానే తన్ను గుఱించి, శ్రీరంగాభ్యుదయ సర్గాంతముల నిట్లు చెప్పుచున్నది:

"త్వఙ్గద్గాఙ్గ తరఙ్గప జ్క్తి విలసద్భంఙ్గీ త్రపాకృత్స్వవా
గ్గుమ్ఫోఽనన్తకవిస్వ సూతతనయాం యోఽసౌ త్రివేణ్యాఖ్యకామ్,
శ్రీరఙ్గాభ్యుదయే తయా విరచితే సద్భ్యర్న్ద నన్ద్యే మహా
కావ్యేఽసౌ దశమః సుధాకృతసఖః సర్గః స్వ మాధుర్యతః"

మధురవాణి రఘునాథుని యాస్థానమున సమస్తవిద్యాప్రసంగములఁ గలసికొని యతఁడు రచించిన రామాయణము పఠింపంగా విని సంస్కృతమున రచించినట్లు చెప్పుదురు కాని యతఁడు రచించిన రామాయణము మాకు లభించినంత వట్టు పరిశోధింపఁగా మధురవాణి రామాయణసంగ్రహము దానికి దెనిఁగింపు గాదని తోఁచెను. మధురవాణికావ్యము సుందరకాండము వఱకు లభించును. అంతకు పదునాలుగు సర్గలు గలవు. రఘునాథుని బాలకాండములో కొంత భాగము సైతము దానికంటెఁ బెద్దదిగా నున్నది. భావములు గలసినవి కావు. రఘునాథుఁడు చిత్ర రచనపొంత పోక సరళముగాఁ బదములకుఁ గాని, యతి ప్రాసములకుఁ గాని కష్టపడక మహావర్ణనల సైతము మృదుపద సందర్భముగా రచించుచున్నాడు. మధురవాణి యనేకస్థలములఁ గ్లిష్ట రచనకు దిగును. పాఠకులు కాలక్రమమున నవ్యుత్పన్నులుగాఁ బుట్టఁబోవుదు రని కాఁబోలుఁ గొన్ని శ్లోకములకు స్వయముగా వ్యాఖ్య రచించె. పాణినీయము చక్కఁగాఁ జదివె నని చెప్పి తదాస్వాదము చూపుటకుఁ గాబోలు "రాజనీతిరపస్పశా" యని మాఘుఁడు చెప్పినట్లు ప్రయోగచాతురిఁ జూపును. ఆమె గద్యములఁ దన్నుగూర్చి యేమనియె ? ఇదియె—

"తత్రాద్య ఘటికార్ధ నిర్మిత శతశ్లోకీ ఫణిగ్రామణీ
వాణీ ప్రాకృత శాస్త్ర నైపుణ సముస్మీలద్యశశ్శ్రీ జుషా
దేవ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యమ్బాఖ్యయా నిర్మితే
శ్రీ రామాయణసార కావ్యతిలకే సర్గ స్తృతీయోఽభవత్."

అని ఘటికాశతగ్రన్థకర్తల నధఃకరింప ఘటికార్ధశతగ్రంథకర్త్రి యనియు, ప్రాకృత భాషలోను శాస్త్రములలోను నైపుణి గల దనియుఁ జెప్పుకొనియె. ఓ విదుషీమణీ ! గ్రామ్యభాషాకవిచక్రవర్తుల మగు మాకు నీ ఫణిగ్రామణీవాణి యేల ? మఱికొన్ని గద్యములఁ గానిమ్ము.

"ప్రస్తారాభినవాత్త వృత్తకవితాఖాటీ కథాశుక్రియా
షడ్భాషారచనావిశేష బహుధా విఖ్యాత కీర్తిశ్రియా
దివ్యోద్యన్మతి......సర్గస్తురీయోఽగమత్."

మా కాలములోని యాశుకవిత సర్వకాల సర్వావస్థలలోను బ్రారంభించిన నిలువఁజాలక వీథులలో సహిత మనర్గళముగాఁ బ్రవహించుట నీవు చూచిన దానవు కావు. నీ షడ్భాషారచనలో నత్యుత్కృష్ట మగు మా గ్రామ్యభాషా సముల్లాసములు కలవేని తక్కిన యైదును దప్పక శ్లాఘ్యములే యగు. ఇంకను నీ ప్రతిభ గొంత వర్ణింపుము, విందము—

"వీణావాద కళావినోదసమయే ధృత్వా సమస్యాః శతం
సద్యస్సంసది సాధుపూరయతి యా దత్తాః కవీన్ద్రై స్సయా
దివ్యోద్యన్మతి సఖ్యయా...సర్గోఽభవత్పంచమః"

అనువాదనీయంత్రములను (గ్రామఫోనులు), హార్మోనియములును నీ కాలమున నుండియుండినయెడల నో కళావతీ, వేయుసమస్యలఁ బూరించి యుందువు. అయినను నీ చాతుర్య ముభయకలాధ్వంసక మని మా సభ్యులు రహస్యముగా గుస గుస లాడుచున్నారు. నీ పాట కానిమ్ము.

"ప్రఖ్యాతాష్టవయా పదార్థగమక వ్యాఖ్యాన పక్షాన్వయ
ప్రాగల్భ్యాస్పద నైషధ ప్రతివిధా సానంద సూరీన్ద్రియా,
దివ్యోద్యన్మతి సఖ్యయా...సర్గోఽత్రషష్ఠోఽభవత్."

నీయందున్న యార్జవము మే మెఱుఁగఁజాలము. కాల మట్టు యవనిక నిన్ను మఱుగుపఱచుచున్నది. పోనిమ్ము, వామత్వము లేక యార్జవము గలదేని దానియందు స్త్రీత్వము లేదని 'అవామతాకామశత్రుః' అని పెంచాలుఁడుప-

''గ్రామేవాసః శ్రోత్రియ కథనం పరత స్త్రీతా కృపణభావః
అర్జవయుతా చ నారీ పుంసాం మదనాంతకారిణః కేచిత్.''

అని యీశ్వరదత్తుఁడును జెప్పుదురు విద్వదౌషధ మగు నైషధమునకుఁ బ్రతికృతిఁ గల్పించెదవా? వసుచరిత్రను జూచి వేయుఁ బ్రతికృతుల నిర్మించు మాయాంధ్రులలోఁ బుట్టినదానవు కావే? నీ కేల యట్టి చాతుర్య మలవడకుండుఁ గానిమ్ము, ఏమి యూరకున్నావు? విషయాంతరప్రసక్త మగు వామత్వమును సౌజన్యధర్మమగు నార్జవమును వర్ణించుచో నప్రస్తుతప్రశంస చేసితి నని కోపమా? ని న్నార్జవ మాశ్రయింపఁగా మావాక్కున వక్రోక్తి ప్రవేశించె, పోనిమ్ము, నీ శక్తివర్ణన జరుగనీ. నీ వాణి యాత్మస్తుతియందుఁ గేవలము మధుర ముగా నున్నది. విందము.

''స్వాద్వీ దుగ్ధసితా సుధామధురవాణ్యశ్రాన్త సన్తోషిత
ప్రౌఢశ్రీ రఘునాథ దత్త శుభవత్సార్థాభిధాసంభృతా
దివ్యోద్యన్మతిసఖ్యయా...సర్గోఽభవత్సప్తమః.''

స్వాద్వీయగు నీ వాక్కు సాక్షాత్తుగా విన్న రఘునాథుఁ డశ్రాంతసంతోషియై యెన్నియేని బిరుదములు నీకొసఁగఁదగు. మాకు నీ గద్యములలోని యుత్తరార్థము పల్లవిగా వినివిని పరిచయాధిక్యముచే మా శ్రోత్రములు జగమంతయు మధురతరముగా గ్రహించుచున్నవి. కథ సాగనిమ్ము.

''సద్యోవిస్మయకృ న్నిరోష్ఠ్యకవితాసన్దర్భ ధారాసుధా
సారోర్మిపరిపూరితశ్రుతిసుధీ సమ్భావితాభిఖ్యయా
దివ్యోద్యన్మతి సఖ్యయా...సర్గోఽజనిష్టాష్టమః.''

ఇందు శ్రుతి యనఁగాఁ జెవి యనియే కదా అర్థము. కాక సంగీతస్వరముల లోని శ్రుతు లైనయెడల మధ్యమపంచమము లగు జీవస్వరముల నోష్ఠ్యము లని వదలినచో నీ సంగీత మతిమానుష మగునో యని భ్రమించితిమి. పోనిమ్ము. నీ నిరోష్ఠ్యకవితా గద్యమున నీ పే రెట్లు కూర్చెదవవో వామతము పూనక యార్జవ

ముగాఁ జెప్పుము. లేక మధుర శబ్దమును దొలగించుకొనెదవా ? ఏమి ! విస్మేర నమ్రముఖి వయ్యెదవు ? అహో, యాఁడుదానవు కదా ! మఱచితి.

''మాధుర్యైక ధురంధరాంధ్రకవితా నిర్మాణ సమ్మాన్యయా
దివ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణసారనామని మహాకావ్యేఽతి భవ్యే సుధీ
వర్గోల్లాస విశేషధామ్ని నవమః సర్గో మనోజ్ఞోఽభవత్.''

ఏమి విదుషీమణీ ! ద్విపాది యగు పల్లవి త్రిపాది యయ్యె, ఇఁకఁ జతుష్పాది యగునా మేమి ? లేక యాంధ్రకవితలోని భావదారిద్ర్యము నిన్నావహించెనా? కావుననే కాఁబోలు నీ యాంధ్రప్రబంధములు మా కాలము వఱకు రావయ్యె.

సూరి స్తవ్య కుమారసమ్భవ మహాకావ్యప్రతిగ్రన్థన
ప్రాగల్భ్య ప్రకటశ్రియా పదసదః ప్రఖ్యాతవైదుష్యయా
దివ్యోద్యన్మతి సఖ్యయా...దశమః సర్గోఽత్ర కావ్యేఽభవత్.

రఘువంశమునకు యదువంశ మనియు, భారవికి భూరవి యనియు, మేఘ సందేశమునకు హంస సందేశ మనియు, మాఘమునకు ఫాల్గున మనియు, కుమార సంభవమునకు మారసంభవ మనియు నొక మహాకవి ప్రతిగ్రన్థనము సేసె. ప్రతి గ్రంథన కళానైపుణ్య మతనివలన సంపాదించితివా ? నీ దేశికు లెవరో తెలుపవైతివే.

ప్రౌఢ శ్రీ రఘునాథనాయక కృత స్వర్ణాభిషేకక్రియా
దివ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యమ్బాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణసారనామని......సర్గస్త్వైకాదశః.

కనకరత్నాభిషేకముచే నీ శరీరము మందాకినీజలావగాహనముచేతవలెఁ బవిత్రమయ్యె. ఇట్టి ధన్యురాలిం గన్న తల్లిదండ్రుల పేరులఁ దెలుపుము. విని యానందింతము.

''ఏమి నీ యసందర్భప్రశ్నము ? కాళిదాసాదులు తమ జననాథులు వర్ణించుకొనిరా ? గ్రంథములు చదువు పాఠకులు కదా తత్తద్రచనభావగుంభనములచే కవి వ్యక్తుల ననుమానమున నిర్ణయింపవలయు'' అని చెప్పెదవా ?

"ఓ కవయిత్రీ! ఏమి ప్రతారణము సేసెదవు? కవుల చరిత్రములు వ్రాయునప్పుడు తల్లిదండ్రుల పేరులును, నియోగియా తదన్యుఁడా, గోదావరీ మండల స్థితుఁడా లేక యనాంధ్రుఁడా, యనుట ముఖ్యాంశములుగా మేమాంధ్రులము పరిగణించి యున్నారము. అందుకొఱకడిగితిమి. నీకంత కోపము రానేల? కాళిదాసాదులు తమ విషయముగా సర్వత్ర మౌనమునే పూనిరి. నీవు నీ పాండిత్య విశేషమును బహుభంగిగా గద్యములలోఁ జెప్పినందున నీ జననకథ యడిగితిమి. నీవును కాళిదాస భాస సరణి నవలంబించి యున్నచో —

"ఏ దంపతులకుఁ బొడమెనో, యే దేశమునందుఁ గీర్తి కెక్కినవాఁడో, (తుదకు) ఏ దెసఁవాఁడొ యెఱుంగను" అన్న వాక్యమున లింగము మార్చి నీ కన్వయించి యుందుము. కాని యాత్మప్రఖ్యాపనశీల వగు నీకు సిగ్గేల చెప్పరాదా? 'సరస్వతీ పవిత్రాణాం జాతి స్తత్ర నకారణం' అని యొక్క క్షత్రియ కవి సార్వభౌముఁడు పలికెఁగదా! మేము నా మతములోని వారము. నీవు నిశ్శంకముగాఁ దెలుపుము. భోగిని వని సంకోచించెదా? ఈ వ్యాసమున మంగళాంతము చూడుము. పోనిమ్ము గ్రంథము నారంభింపుము కొంత తెలిసికొందము.

"లక్ష్మీం దిశే ల్లక్ష్మణ పూర్వజన్మా, వీరో రఘూణాం విజయం ప్రయచ్ఛేత్
ఆరోగ్య మర్కాభిజనస్య దద్యాత్, ద్రతీశమూర్తే రఘునాథనేతుః".

ఇది శ్రోత్రియబ్రాహ్మణుల యాశీర్వచన మంత్రమువలె నున్నది. కృత్యాదినే రతీశ శబ్దమునకు సందర్భమేమి? రఘునాథ శబ్దముతో నాంధ్రభాషా సంప్రయుక్తమగు విశ్రామ నియమ మర్థసమముగా నిందు సంఘటించుచు రతీశుఁడు యతీశుఁడయ్యెనా? కృత్యాద్యవస్థ యను వాచోయుక్తి నీయందు నిక్కమయ్యెఁ గాఁబోలు.

"సాహిత్య సద్వర్త్మని సంచరన్తః, సన్తః పురో వామగతిం సమేత్య
శబ్దాయమానాన్ శ్రవసో రహస్యం, న కాకవీన్ ద్రష్టుమపి క్షమన్తే."

కుకవిదూషణము కావ్యమర్యాద కదా! అదిలేకున్నఁ బ్రబంధము మెఱుఁగుపెట్టని యాభరణమువలె నగు కాకులు కుకవి యెతమగా వచ్చుట యపశకునమా?

రఘునాథుని వంశావళి బహుగ్రంథముల వర్ణిత మయ్యె. మేము విన్నదే. దాని దాఁటి నీ గ్రంథరచనకు సందర్భము రచించితివేని ఛమవుము.

''యద న్తరావ ర్తిత న ర్తనానాం సీమ న్తినీనాం శ్రమమాక్షిప న్తి
పర్య న్త య న్త్రి ప్రతిమాకరాగ్ర ప్రకీర్ణజాతాః పవమానపోతాః.''

ఇది రఘునాథసభలోని శిల్పప్రతిమారచన కదా !

విపఞ్చికాయాం చతురాః ప్రగల్భాః శాస్త్రేఽతిదక్షాః సరసప్రబన్ధే
సమీపమేతస్య సమేతస్య కేఽపి సుభ్రూజనాః స్వస్వకళా వ్యవృణ్వన్.

ఇది యంతఃపురవృ త్తమా, లేక సభానిర్వృ త్తమా?

రామాయణం శ్రీరఘునాథనామ్నా రాజ్ఞామునా నిర్మిత మన్ధ్రవాణ్యా
కర్ణామృతం కావ్య మతీవ భవ్య మపాఠి పాఠీనదృశా కయాచిత్.

రఘునాథుని యాంధ్రరామాయణము నొకతె పఠించుచుండెనా ?

సర్వో త్తర స్వాదిమ సంస్కృ తాంన్ధ్ర ప్రబన్ధ నిర్మాణపచేశిమాని
యశాంసి భూయాం స్యవతారయ న్త్యః సహస్రశః స న్తి సరోజనేత్రాః.

రఘునాథరామాయణముఁ దెనిఁగింపఁగల స్త్రీలు గలరా యని ప్రశ్నించి నపుడు పై సమాధానము కలిగెను. ఉత్కృష్ట సంస్కృతాంధ్ర ప్రబంధ నిర్మాణ కీ ర్తిగల స్త్రీలు వేనవేలు గలరని కదా! విక్రమార్కుని యట్టి దాత గలఁడేని కాళిదాసువంటి కవు లేల పుట్టరు ?

రసో త్తరం రామకథానుబన్ధి కావ్యం మయా కల్పిత మన్ధ్రవాణ్యామ్
కార్యం కయా సంస్కృతవాగ్భరేత దిత్యేష చి త్తే గణయ న్నవాత్సీత్.

ఇది రఘునాథుని వాక్యము. తన రామాయణము నెవ్వతెయైనఁ దెలిఁగింపఁ గలదా యని రఘునాథుఁడు రామునియందు బరమభక్తుఁడు. రామసేతు శ్రీరంగ విజయరాఘవపుర కుంభఘోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపితరామభద్రుఁడని తన యాంధ్ర గ్రంథగద్యములలోను, ''శ్రీరామ సీతావపి కుమ్భఘోణే శ్రీరఙ్గధామ న్యపి రామభద్రమ్, దేవం ప్రతిష్ఠాప్యతరా మతానీః ప్రాకార సద్గోపురమణ్డపాని, రథోత్సవాది ర్మహతీం విభూతిం రసా దకార్షీ రఘునాయకస్య'' అని సంగీత సుధలో రఘునాథుని సంబోధించి చెప్పఁబడియె.

కావుననే రామకథ యెన్ని ముఖములనైన వినఁగోరి స్త్రీవాక్కు మధుర మగుటచే తద్రచనకు స్త్రీకవులఁ గోరుకొనియె. అంత నారాత్రి స్వప్నమునఁదన యిష్టదైవమే ప్రసన్నుఁడై —

చతుర మధురవాణీం సమ్య గాకర్ణ్య యస్యాః
సదసి మధురవాణీ నామ దత్తం త్వ యైవ
సరసకృతి విధాయాం సాధు మేధా విశేషా
స్వధికపటు రశేషా స్వమ్బుజాక్షీషు సైషా.

రాముఁడు ''నీచే మధురవాణి యను బిరుదము పొందిన మేధావతి, స్త్రీలలో నెక్కుడు కవిత్వపాటవము గలది'' యని చెప్పెనే కాని యామెకుఁ దలిదండ్రులు పెట్టిన నామమును దెలుపఁడయ్యె. సర్వాంతర్యామి యగు భగవంతునకుఁ గూడ దాని పేరు తెలియదా ?

విద్యాన్వవాయే విహితావతారా, సుశిక్షితాసౌ విదుషా త్వయైవ
విద్యాపరీక్షా సమయే విశేషాత్, ప్రకాశమాన ప్రతిభానుభావా.

చాతుర్యమేతి కవితాసు చతుర్విధాసు, వీణాకళా ప్రకటనే భవతీ ప్రవీణా
ప్రజ్ఞామయం నిపుణమశ్నుతి పాణినీయే, మేధాం వ్యనక్తి బహుధా వివిధావధానే,
కర్తుం పటుః కావ్య మిమం స్వయం తే, సాహాయ్యకం చేత్క్రము తేతి సద్యః
ఆవేద్య రామోఽన్తరథా త్ప్రభాతే, పయోధికాఞ్చ్యాః పతిరి త్యబోధి.

అని శ్రీరామచంద్రుఁడే గ్రంథకర్త్రి పాండిత్యశక్తుల వర్ణించె. రఘునాథుఁడే దానికి విద్యాగురు వైనప్పుడు కొఱంతయేమి ? మీమాంసాలంకారశాస్త్రముల జితశ్రముఁడగు యజ్ఞనారాయణకవియుఁ దాను రఘునాథుని శిష్యుఁడనియె చెప్పుకొనెను.

ప్రౌఢ శ్రీ రఘునాథభూపతి కృపాస్ఫూరీ భవత్సాహితీ
సామ్రాజ్యస్తవయోఽతివిశ్రుతనయో గోవిన్దయజ్వేశితుః
వక్షస్సర్గ మపూరయత్

అని మరియు,

కావ్యాలంకృతి నాటకాదికలనా పాణ్డిత్య మత్యద్భుతం
సర్వజ్ఞో రఘునాథ భూశతమఖో యస్యోపదిశ్య స్వయమ్
ఆదాతుం గురుదక్షిణా మభిమతా మర్థోఽప్యహో దత్తవాన్
కర్ణాలఙ్కరణం నిజం చ ఘతకం పాదాఙ్గదం కఙ్కణమ్.

అని రఘునాథుఁడు యజ్ఞనారాయణ కవివలన గురుదక్షిణ గ్రహింపక శిష్యునకుఁ దానే కుండలకంకణాదు లొసంగెనఁట. ఇది విద్యారసికుని వాత్సల్య చేష్టయే. లక్ష్మీసరస్వతు లహమహమికగా విలాసము లెవ్వనియందు నిలుపుదురో యా పురుషుని జన్మజీవితములు ధన్యత్వము నెంది జీవలోకమును రసమయముగాఁ జేయు ననుట వింతయే.

"ఆంధ్రక్షమామండలాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు
వేదాద్రినరసింహ విపులవక్షస్స్థలీ
కల్హారమాలికా గంధలహరి
ఘోడెరాయాంక సద్గురురాజ భీమేశ్వ
రస్వామి పదసమారాధనంబు
కమలాద్రినిలయ మార్కండేయ శశిమౌళి... ...
కారణంబులు నుద్బోధకములు గాఁగ
సంభవించిన సాహిత్యవిద్య.''

అని శ్రీనాథుఁడు తనకు పెద్దకోమటి వేమభూపతియు, అహోబలనృసింహస్వామి వరప్రసాదమును రెడ్డిరాజులకు గురుపీఠ మధిష్ఠించిన శైవాచార్యుఁ డగు ఘోడెరాయ భీమేశ్వరుఁడను పండితోత్తముఁడును విద్యాప్రదాతలై రనుటచే వేమనకు శ్రీనాథుఁడు శిష్యుఁడా యని సందియము గలుగు. కారణోద్బోధకశబ్దము లా యర్థమునకు వారకము లయ్యు మహాకవుల వాక్కులు వేయువిధముల ధ్వనించుచుండు నని భీతిచే నా రాజేంద్రుని గురుభావము శ్రీనాథునియందుఁ బ్రసన్న మయ్యెనా?

స్వప్నానంతరము రాజు సభాస్తారుఁతోఁ గొలువుండి మధురవాణిం బిలిపించి రామకథ రచింపు మని సస్నేహముగా నాజ్ఞ యొసఁగె

ప్రకృతిమధుర కావ్యప్రౌఢ సందర్భవిదభి
ర్యువతిజనమణీభి ర్యుక్తపార్శ్వద్వయోఽసౌ
అథ సవిధ ముపేతాం సౌహృదా దాహ్వయన్మా
మవని పరివృఢానా మగ్రణీ రిత్యభాణీత్.

అజహదలంకృతిక్రమ మనేకరసోల్లసితం
సరసపదార్థసంగతి సమగ్రగుణానుగుణమ్

రఘురమణ ప్రబన్ధతిలకం రసికాభిమతం
సుదతి విధీయతా మితి సుధీ రగదీ న్నృపతిః.

అని గ్రంథరచనకుఁ బ్రోత్సాహకరముగాఁ గ్రొత్త రత్నహారమును వజ్రములు చెక్కిన యంగదాదులఁ బ్రీతిదాయకముగా నొసఁగె. పూర్వము శకారాతి హరుషుఁ డను కవి తన విజయప్రతాపకీర్తుల వర్ణించిన కాలఁది ప్రహర్షోద్రేకమున మదజలాసారసంక్లిన్నపథ్యాసముద్య దకాలప్రావృషేణ్య సౌభాగ్యంబుగ భద్రగజశతంబుల నొసఁగె నఁట.

శ్లోకోఽయం హరుషాభిదా సుకవినా దేవస్య తస్యాగ్రతో
యావద్యావ దుదీరితః శకవధూ వైధవ్య దీక్షాగురోః
తావత్తావ దుపోఢ సాన్ద్రపులకోద్భేదః స తస్మై దదౌ
లక్షం లక్ష మఖణ్డితం మదజల ప్రక్లిన్నగణ్డం గజమ్.

అని శకారాతి యగు విక్రమార్కుని రసికతయు నుదారతయు వర్ణింతురు. ఆ గజచయంబును మన కవయిత్రి యాభరణములతోడనే యంతర్ధానము నెందెఁ గాని తత్కావ్యము లొసంగిన కావ్యదీపికలు కాలదండమును ఖండించి బ్రహ్మాండ వ్యాప్తి నెంది నక్షత్రలోకమువలె స్థిరజీవము లై యున్నవి.

ఇఁకఁ గథాభాగము నెట్లు కవి తన బిరుము నెల్లింప రచించెనో చూతము. కుశలవులు వాల్మీకాశ్రమమునఁ గాఁబోలుఁ జెఱియొక్క వీణ పుచ్చుకొని శ్రుతులు గూర్చుకొని తంత్రులు సారించి కంఠనాదములు కలియునట్లు పాడి రఁట.

తౌ వల్లకీ మఙ్కతలే నిధాయ శ్రుతి ప్రమాణం స్ఫురిత ప్రధానమ్
తన్త్రీః సమన్తా న్మృదుసారయన్తా వాలోకయామాస తు రైక కణ్ఠ్యమ్.

స్ఫురిత మనునది గమకములలో నొకటి—

గ్రామద్వయే దీవ్యతి భూతధాత్ర్యాం ప్రశస్యమానే సురభౌ చ జాతౌ
రసగ్రహాం శాంత ర్ధమార్గ లక్ష్మ్యా తాలేషు నైకాఙ్గకళోన్నతేషు.

ఈ శ్లోకములకెల్లఁ గవయిత్రియే వ్యాఖ్యయుఁ గూర్చె. 'షడ్జ మధ్యమ గ్రామములలో గ్రహాంశన్యాసములు తప్పక యల్పస్వర సంగతి విశేషములతో సుఖమైన జాతి గ్రహించి లఘుద్రుతాది తాళాద్యంగ నియమములతోఁ పాడఁ

బోయెదురు. అంతరమార్గ మన ''అల్పత్వభాజాం స్వరాణాం విచిత్రసఙ్గతి విశేషః తదుక్తం— న్యాసాదిస్థాన ముజ్ఝిత్య మధ్యేమధ్యేఽల్పతాయుజామ్ స్వరాణాం సఙ్గతిః' అని యామెయే టీకలో వివరించెను. గాంధారగ్రామము స్వర్గలోకముననే ప్రసిద్ధము. క్రింద వర్ణింపఁబోవు రాగములలో వికృతస్వరములే ప్రధానములు కావునను, షడ్జ మధ్యమ గ్రామములలో స్వరశ్రుతులు నియతము లగుటయు, వికృతస్వరములలో శ్రుతినియమము లేకుండుటయు షడ్జ మధ్యమ గ్రామ విభాగమే నేటి గాయకులలోను, దక్షిణదేశ వీణలలోను గానరాదు. కావున గ్రామద్వయ ప్రశంస కేవల మర్థవాదమై సంగీతప్రశంసాపర మగు.

వివాదినం తం పరిమృద్య వాది సంవాదినావ ప్యనువాదినం చ
ప్రకాశ్య కాలస్ఫురితాది హృద్యం స్థాయి క్రమేణాపి విచిత్రవృత్తిః.

వాది సంవాద్యనువాది స్వరములు పరస్పర మైత్రితో మెలఁగును; వివాదులు స్వరవ్యక్తి నశింపఁజేయు. స్ఫురితము గమకములలో నొకటి.

వృత్తులు వేగమును బాటించు మూఁడు గతులు చిత్ర వార్తిక దక్షిణములని. స్థాయిక్రమ మనఁగా నొకనొక స్వరమునుండి యారోహావరోహ రూపములుగా స్వరసంచారము సేయుట యందురు.

ఉత్కర్ష ధన్యర్ష భలాలనీయ, ముద్యత్సుధోన్మేష విశేష ధన్యమ్
విశుద్ధి భాస్వత్సమపాతి భావం, నాట్యం పటుత్వం బహునాటయన్తౌ.

నాటరాగమేళ మని ప్రకృతార్థము. నాట్య మని యప్రకృతార్థము. ఇం దప్రకృతార్థము ధన్యులలో ఋషభులు (శ్రేష్ఠులు). వారిచే లాలనీయము. సుధ యొక్క యున్మేషము, సమపాతి (పాద విన్యాసము సమముగా నడచుట).

ప్రకృతార్థమున, ఉత్కర్ష-తంత్రులఁ బైకి నుద్ధతముగా నాకర్షించుట. ధ, ని, ఋషభస్వరములచే (ధైవతనిషాదర్షభములు శ్రుత్యధికము లగుట, షట్ శ్రుతిధైవతర్షభములు, కాకలీనిషాదము, అందుచే నంతరగాంధారము). సమపానాం షడ్జసమధ్యమ పంచమముల శుద్ధస్వరత్వము గల నాటరాగమేళ మని యర్థము.

నాటమేళమున శుద్ధములు షడ్జ మధ్యమ పంచమములు. ధైవతర్షభములు షట్శ్రుతికములు, గాంధార నిషాదము లంతరకాకలీనామకములు. ఈనాట దేశి

రాగములలోఁ జేరినది కావున షడ్జ మధ్య గ్రామ వ్యవస్థలో వచ్చునదికాదు. నాట రాగము మొదటఁ జెప్పుటకుఁ గారణ మేమన రఘునాథుని సంగీతసుధలో నిది ప్రథమమేళముగా గ్రహింపఁబడియె. దీనినె కళ్యపాదులు నర్తరాగ మనిరి.

మఱియు రఘునాథున కీ రాగ మెక్కువ ప్రీతి నొసఁగుచుండె నని తోఁచు చున్నది. మఱియు నది మంగళకర మందురు. రఘునాథుఁడు బాల్యముననే వీణావాదనము చక్కఁగా నేర్చి గురుకులమునుండి తండ్రి యొద్దకు రాఁగా సభలోఁ గుమారుని విద్యాసంస్కారము పరీక్షింప నఁతడు మొదట నాటరాగ-మునే రూపకాలాపాదిలక్షణములతో రాగవర్ధనిక్రమములతోఁడ బాడి వాయించి చూపినట్లు యజ్ఞనారాయణ దీక్షితులు సాహిత్యరత్నాకరమునఁ జెప్పుచున్నాఁడు.

రాగేణ తేన ప్రథితేన ఠాయ గీతప్రబన్ధాన్ పటువాదయిత్వా
పరం విదూరీకృత పఞ్చమోద్య త్ప్రసక్తి గౌళస్ఫురణం ప్రకాశ్య.

గౌళస్ఫురణ మనఁగా గౌళరాగపు గమకము లేక వ్యక్తీకరణము. దూరీకృతపంచమ = పఁచమస్వరము పరిహరించినది. పంచమస్వరము వదలి తక్కిన యాఱుస్వరములతో గౌళరాగ మారోహమున షాడవ మను సంజ్ఞ చెందు చున్నది. సంపూర్ణముగా రాగము విస్తరింపఁ దగినచో నాలాప, ఠాయ, గీత, ప్రబంధములను నాలు గంగములఁ బరిపూర్ణము సేసి పాడుట యుత్తమగాయక సంప్రదాయము. ఇందు ఠాయగీత ప్రబంధములు మూఁడు చెప్పఁబడియె. గౌళ రాగమును చౌకముగా వర్ధనముచేసి సర్వజనామోదము కలిగించి రనుట ప్రకృతార్థము. అర్థాంతరమునఁ గోకిలస్వరోద్యత్ప్రసక్తి యని మధురవాణియే వ్యాఖ్య యొనర్చె.

ఈ శ్లోకమునకుఁ గవి పంచమ మనఁగా ధైవతస్వరము, ''గౌళ స్తదంగ విన్యాస గ్రహాంశః పఞ్చమోజ్ఝితః। ఇతి గౌళే గ్రహస్స్వరో నిషాదః తదపేక్షయా పఞ్చమో ధైవతః'' అని సంగీత రత్నాకర శ్లోకము నుదాహరించి పంచమము (అయిదవది)ధైవతము వర్జ మని వ్యాఖ్య చేసె పంచమశబ్దము సరిగమ పధని స్వరములలో నొక్కటి యగును. అది పారిభాషికార్థము. పంచమము = అయిదవది. ఇది లౌకికార్థము. ఈమె శ్లోకమున పంచమశబ్దమును లౌకికార్థమున వ్యాఖ్యాన మొనర్చె. దీని రత్నాకరవ్యాఖ్యాతలు (సింగభూపాల కల్లనాథు లిరువురును) సుగమ మని వదలిరి. అందుచేఁ బంచమస్వర మని పారిభాషికార్థముననే గ్రహింపవలసి యుండును. మతంగుఁడు-

"టక్క రాగేణ సదృశః పఞ్చమేన వివర్జితః
షడ్జాంశన్యాససమ్పన్నో గౌడః స్యాత్ స్ఫురితర్షభః."

అనియు, నాన్యదేవుఁడు (సరస్వతీహృదయాలంకారమున)

న్యాసాంశ గ్రహషడ్జః పంచమహీన స్త్వృషభగ్రహః
స్ఫురితాఖ్యగమకనిబిడో గౌడః సాత్టక్కరాగ రవసదృశః

జగదేకమల్లుఁడు సంగీతచూడామణిలో—

గౌడః స్యాత్ టక్కరాగాఙ్గం సనాసాంశగ్రహాన్వితః
వర్జితః పఞ్చమే నైవరసే వీరే నియుజ్యతే.
జాతే శ్చాఙ్గం నిషాదిన్యా వదన్తి న తు మే మతమ్

అని వీరెల్లరు పంచమహీనమై గౌడరాగము షాడవ మనియు, షడ్జగ్రహముగలదై (అనఁగా షడ్జస్వరముతో ప్రారంభించుట, దానితో న్యాసము అనఁగా ముగింపు) అనిరి. టక్కరాగచ్ఛాయగాక నిషాదినీజాతిలోఁ బుట్టిన దన్న మతము జగదేకమల్లుఁడంగీకరింపఁడు. అఁనగా నిషాదస్వర మంశస్వర మగుట (ప్రధానము లేక జీవస్వర మగుట) ఏల యనఁగా నిషాదమునకు గాంధారము పదియవ శ్రుతిలో నుండుటగా సంవాదిత్వము కావలయును. గాంధార నిషాదము లెల్లప్పుడు వివాది (విరోధి) స్వరములు కావున నిషాదము గ్రహాంశస్వరములుగా గ్రహించినచో రక్తినాశమగు, నిషాదము గ్రహాంశమని శాస్త్రమందున్నను ఋషభమే యంశస్వరమగుట వాడుక. రికిపంచమ (ఐదవ) స్వరము ధైవతము; దాని లోపింపఁజేసిరి ఈ యంశమునే రఘునాథుఁడు సంగీతసుధలో నిట్లు చెప్పె.

వక్ష్యామహే సంప్రతి గౌళరాగ, మేళోభవే దత్రచ గుర్జరీవత్
గౌళస్య చైతస్య పదామి లక్ష్మ న్యాసోగ్రహోంశోఽత్ర నిషాద ఏవ.

స షాడవో ధైవతలోపతః స్యా, ల్లక్ష్యానుసారా దృషభ స్త్విహాంశః
అత్రోచ్యతేఽన్య స్వరశత్రుభూతే, గాన్ధారకే కించ నిషాదనామ్ని.

ప్రధానభావోఽంశతయా న యుక్త స్తస్యాదిహాస్యా దృషభస్వరోఽంశః
రాగాభియుక్తై రత ఏవ కైశ్చిత్ సంకీర్ణరాగత్వ ముదీర్యతేఽస్య.

అని యంశస్వరము ఋషభ మనియుఁ గొందఱు దీని సంకీర్ణజాతిలోఁ బఠింతు రని చెప్పె. కొందఱు అనఁగా రామామాత్యాదులు. వారు దీని నధమరాగ మనిరి. అనఁగా ఆలాపతాయ గీతప్రబంధము లను నాల్గంగములు దీనికి రావని భావము. వేంకటమఖి చతుర్దండిప్రకాశిలో గౌళాది సప్తరాగములకు నిషాదము గ్రహస్వర మని చెప్పి- గౌళస్తు షాడవోరాగో రాగాంగో ధైవతోజ్ఝితః, వాది సంవాదివా వత్ర రిగౌ శశ్వత్ప్ర గీయతే-అని ధైవతలోపముచేత షాడవ మనియె. తులాజా రాజు తన సారామృతమున - గౌళో మాళవగౌళీయ మేళజో ధైవతోజ్ఝితః, షాడవో నిగ్రహో రాగాంగోఽయం శశ్వత్ప్రగీయతే-అనియె.

మఱియు రఘునాథుఁడు గౌళరాగమును గుర్జరీమేళజన్యముగాఁ జెప్పె. రామామాత్యుఁడు శ్రీరాగము క్రిందను, వేంకటమఖి స్వతంత్రమేళకర్తగాను, పరమేశ్వరుఁడును స్వతంత్రమేళముగాఁ జెప్పిరి. 'సంత్యజ్య మేష మవరోహతి వైణికైస్తు, తత్షాడ వౌడువగణే పరిగణ్య గీతమ్' అని మేషమును (అనఁగా గాంధారమును) పరిత్యజించి యవరోహించుచు నౌడువ మగు ననియె. కావున దీనికి వీరి మతానుసారము తాయాదులు పొసఁగ వని భావము. నేఁటికాలమువారు దాని మాళవ గౌళమేళజన్య మందురు పై సూచించిన మతభేదములుగలగౌళరాగ మునకు తాయాదులు కూర్చినట్లు మధురవాణి చెప్పుచున్నది.

ఆలాప, తాయ, గీత, ప్రబంధము లను నాలుగంగములను నాలుగు దండము లని, యందుచే రాగము చతుర్దండీ విలసిత మని గోపాలనాయకుఁడు చెప్పినట్లు వేంకటమఖి చెప్పుచున్నాడు ఆలాపమున కేవలము స్వరసందోహ మున నారోహణావరోహణాది చమత్కృతి. తాయ మన స్థాయిగా నొక స్వరమును నిర్ణయించుకొని యారోహావరోహ గమకచమత్కృతి నాతిద్రుత విలంబితములుగా జరుపుట. గీత మన స్వరతాళపదాత్మక వైచిత్రి. ప్రబంధమన స్వరాతాళ పదరస భావపుష్టి చమత్కృతులు గలుగును. కావుననే సంగీతసూర్యోదయమున స్థాయి సంచార్యారోహావరోహణములకే చతుర్దండి యని నిర్వచించెను.

ఈ గీత తాయప్రబంధ వైచిత్రి దేశీయరాగములకే కాని కేవలము యజ్ఞోప యోగముగా దేవతాస్తుతిపర మగు గాంధర్వమున వచ్చు గ్రామరాగములకు లేవని యాంజనేయాదు లనుశాసించిరి.

తథైవ తాదృఙ్మహితప్రకర్షం, వరాళిరాగోల్లసనం సృజన్తౌ
వ్యజ్ఞ్జ్యక్ష స్మ సామన్త ముఖారి పాళి, జయన్తసేనాదిషు చాతురీం తౌ.

మ = మధ్యమస్వరమున, హితమైన ప్రకర్షం, అనగా వరాళిరాగమున మధ్యమస్వరమునకు ౬ లేక ౭ శ్రుతులు గల వందురు.

సామన్తము. ముఖారి, పాళి, జయన్తసేన - రాగభేదములు. జయన్తసేన రఘునాథుఁడే యుద్ధరించినట్లు చెప్పుచున్నాఁడు. అది భైరవీమేళజన్య మని తాఁ జెప్పె. ''జయన్తసేనా రఘునాథభూమి పునన్దరే ణైవ సముద్ధృతా చ, సదా ప్రగేయా శుభదాయికాస్యా ద్రక్తిప్రదా చాఖిలగాయకానామ్'' అని సంగీతసుధలో రఘునాథుఁడే జెప్పెను. షణ్ముఖుఁడును తులజామహారాజును దీనిని శ్రీరాగమేళము క్రింద నొసఁగిరి. శ్రీరాగమున జతుశ్శ్రుతికము ధైవతము, భైరవిలో ధైవతము శుద్ధము. ఇదియే భేదము.

ఇట్లే సంగీతశాస్త్రమర్మములు సూచించునట్లు కుశలవుల గానవైఖరి ౩౯ శ్లోకములలో వర్ణింపఁబడియె.

కథాభాగములలోఁ గొన్ని వర్ణనలఁ జూతము. కథాశరీరనిర్మాణకౌశలము చూపుటకు రామాయణకథ పొంకముకాదు. ఏలయనఁగా సుప్రసిద్ధమయిన కథాసంధి ఘట్టనము గల పురాణపుణ్యకథల మార్చినచో సీతాది దివ్యకాంతల లోకోత్తరగుణ సంపత్తియు, రావణాదుల యుద్ధతియుఁ గొంత మాఱి ధర్మోపదేశము భిన్న రూపము వహించి లోకుల హృదయాధిష్ఠిత నిత్యార్చనీయ దివ్యమూర్తులు స్వరూప నాశము నెందును.

ఇఁక నట్టి కథలఁ బుణ్యానుబంధము లని గ్రహించు వారు కథానిర్మాణ కౌశలము వీటిఁబుచ్చి సల్లాసనై పుణియు, నానారసభావగుంభనాసంభావనయు, లోకజ్ఞతయుఁ బ్రసన్నగంభీరపదరచనావిచక్షణతయు క్షీరాబ్ధికల్లోలమాలాపరంపరల వలెఁ దెరలెత్తి సదర్థజాలము పొంగి పొరలు నట్లు రచించు ప్రతిభాప్రభావమును జూపఁ గలుగుదురు.

పాత్రసంభాషణవైచిత్రి శ్రవ్యకావ్యములకంటె దృశ్యకావ్యములలోఁ బ్రవ్యక్తముగా నుండు. మధురవాణి వర్ణనానైపుణి చూపుచు సాహిత్యజ్ఞానము

ప్రకాశింప నిచ్చు గలది యగుటచే శ్లేషాది చిత్రరచనలతో సర్గములు నిండించును. తంజాపురాంధ్రకావ్యములలో నచ్చటచ్చట హాసజనకము లగు భావములు నిపుణముగాఁ బొందింపఁబడినట్లె తద్వాసనావాసిత యగునిదియు నట్లె హాస్యరసము సకృత్తుగాఁ బోషించును. హాస్యరసమునఁ గలుగు నపాయ మేమనఁగాఁ గావ్యములో నుదాత్తరూపముగా వర్ణింపఁ బడు ప్రధాన రసమునకు నిమ్నభావము సోఁకి స్ఫోటకపిటకములచే ముఖసౌందర్యము చెడినట్లు కృతికి వికృతి కలుగు వచ్చు. ఈ దశావిశేషము రఘునాథాదుల కావ్యములందును బ్రతిఫలించును. మధురవాణి కేవలము వర్ణనలలో మెలఁగుచున్నందునఁ దద్దోషముచే నెక్కుడు బాధింపఁబడ దయ్యె. ఆమె కవితలోఁ గొన్ని పట్టులు చూపు చున్నాము. రోమపాదుఁడు ఋశ్యశృంగుని యొద్దకు వేశ్యల పంపిన ఘట్టమున—

శ్రుతిహృద్య ముదార భఙ్గిగానం సుదృశాం తత్ర సుతో విభణ్డకస్య
నిరవద్య మసౌ నిశమ్య హర్షం సమ ధత్తాత్మని సామగాన బుద్ధ్యా.
వనజాక్షీః ప్రసభం నిరీక్ష్య వక్షోధృత చంచన్నవమౌక్తికాక్షదామ్నః
మనుతే స్మ తదా మనస్య పూర్వాన్ ముని రశ్మశ్రు ముఖాన్ స మౌనిముఖ్యాన్.

ఈ ఘట్టమున రఘునాథుని వర్ణన సరసమై గ్రామీణశేఖరుని లోక తంత్రజ్ఞ లగు విదగ్ధాంగన లెట్లు వశీకరింతురో యా వైశికతంత్రచ్ఛాయఁ బ్రకటించుచున్నది. కొన్ని పద్యముల నుదాహరించెదము.

క. ఇమ్మానిసి మేకముఖా మది
నమ్మఁ దగదు చేరి గొబ్బునం జనకుఁడు పైఁ
గ్రుమ్మి తల వంచికొని పడిఁ
గొమ్ముల నటు చిమ్మెనేని కొదవగుఁ జుమ్మీ!

గీ. తరుణిరో వీని శుద్ధదంతములు మీఁద
లీలఁ దాంబూలరస మింత కీలు గొనిన
పండి పగిలిన దాడిమీఫలములోన
విత్తు లన నుండు నెఱుగఁడు వీడియంబు.

గీ కొమ్ము మొలచిన యంతనె కౌదువ యేల
వచ్చు నితఁ డేమి చక్కని వాఁడు గాఁడె

యది కిరీటంబులోపల నణఁచరాదె
యంచుఁ బల్కెరి మునిపుత్రుఁ గాంచి వేడ్క.

గీ. ఘనుఁడె యితఁ డేమి యిందఱ కంటె వేఱె
కొమ్ము మొలచెనే యని యాడికొందు రెందుఁ
గొమ్ము మొలచిన దితనిఁ గొమ్మవార
మునిశిరోమణి యితఁడ పో ముజ్జగముల.

గీ. చెలియరో వీఁడు నాచేతఁ జక్కనేని
కళలఁ జొక్కించి సుఖనిద్ర గ్రమ్మఁ జేసి
గుఱుసు దగులక యుండంగఁ గొమ్ము దివిచి
మంచి కస్తూరి బరణిఁ బట్టింప వచ్చు.

సీ. చెలువలు పన్నీరుచెంబు లిచ్చినఁ గాశి
కుప్పెలజల మలచుఁ గ్రోల నెంచు
సతులు జవ్వాది యొసఁగ గోపిచందన
మని ఫాలమునఁ దీర్చ నగ్గలించుఁ
గాంతలు మరువంబు గాను కిచ్చినఁ దుల
సీదళం బనుచు భక్షింపఁ జూచుఁ
బొలఁతులు తెలిగందవొడి యిచ్చిన విభూతి
యిది యటంచుఁ ద్రిపుండ్ర మిడఁ దలంచు
నలరుఁబోడులు వజ్రాలహార మొసఁగఁ
బటికపుజపాక్షసర మంచుఁ బాణిఁ బూని
మౌని జపియించఁ దివురు నెందైనఁ గలరు
ముగ్ధ లగు వార లిటువంటి ముగ్ధ గలఁడె.

శాపధారాజిహ్వాంచలులగు మహర్షులతో సరస మాడుట యగ్నిజ్వాలలతో మల్లయుద్ధము సేయుటయే యని యిమ్ముగ్ధ లెఱుంగరు కాఁబోలు. మిథిలానగరము రామప్రవేశసమయమున నిట్లుండె—

పితానపరిలమ్బితోత్పలవితానసన్దానితం
వినూతనని కేతనాకలిత కేతనాలంకృతమ్

మృదఙ్గపటహాకృటీముఖరగోపురం తత్పురం
ప్రశ_స్త మవలోకయన్ ప్రముముదే రఘూణాంపతిః.

ఇది స్వభావసిద్ధమగు వర్ణన. ఇందుఁగల శబ్దాలంకార మంతగా రసభఙ్గకారి కాదు. సీతావర్ణనము నాంధ్రకావ్యములలోవలెఁ బ్రత్యఙ్గసౌష్ఠవ ప్రకాశకమగుట చూడఁగా స్త్రీ స్త్రీని వర్ణించెనేని స్త్రీత్వమునకుఁగల యపూర్వ గర్వేర్ష్యా మదవిభ్రమము లా స్త్రీకవి కుండియుండునా యని యొక వినోదప్రశ్న గలుగ వచ్చును. ప్రతియోగిభావముచేఁ బురుషకవులకుఁ గల్గు భావనావిలాసములు తత్ప్రతియోగిస్థానమున వ్యత్యస్తముగా నుండునేమోయని కొందఱు భావుకులు తలంతురు ! సీతాహరణానంతరము రామవిరహోద్దీపకమగు ప్రావృట్కాలపుఁ బ్రళయవేళలో——

ధ్వన్యుద్భూతోన్మేషసాహిత్యముద్రాం, తన్వద్భ్యః స్వే సన్నిధానే కవిభ్యః
రాజ్ఞో యేన (?) శ్వేతపద్మావికీర్ణాః, కూజద్భృఙ్గా జైత్రశఙ్ఖా ఇవాసన్.
తస్మిన్ భృఙ్గీమీననాళీకకోక, ద్వన్ద్వాలోకా ద్భూమికన్యా ప్రతీతాన్
స్మారం స్మారం జాతదీనానులాపం సౌమిత్రి స్తం సాంత్వయామాస రామమ్.

మొదటిది సంధ్యాకాలమున ముకుళించు పద్మములనుండి వచ్చు భృంగారవములును, రెండవది సీతాసమానవస్తుదర్శనముచే రామునకుఁ గలుగు భ్రాంతి స్మరణ విలాపదైన్యాదుల లక్ష్మణుఁ డపనయించుటయుఁ దెలుపును.

నృత్తై రార్ధ్వాం నీలకణ్ఠస్య సద్యో వ్యోమాభోగే కాళికాయాం నటన్త్యామ్,
వేగా ల్లఙ్ఘ్యా లక్ష్య తత్కుణ్డలాం చ, ద్రత్నాభేవ ప్రాద్యుత ద్వైద్యుతశ్రీః.

నీలకంఠ = శివుఁడు, నెమలి; కాళికా = నల్లకాంతి, కాళికాదేవి; కుణ్డల = శ్రవణాభరణము, కాళికాదేవికి సఖి. ఇందు మెఱుపుకాంతి వర్ణింపఁబడియె.

పాథోవాహి ప్రావృషేణ్యే ప్రభూతే, ప్రాదుర్భూతే పక్వజమ్బూని దానే,
కేకి శ్రేణీ కేతకీ కేళినీశః కేదారాళీ చోత్కలాపా బభూవుః.

ఇందు - ఉత్కలాప = ఉత్ + కలాప (నెమలిపురి విచ్చి పైకెత్తుట). ఉత్కలా, ప = అధికశ్రుతిగల పంచమస్వరము.

నృత్తేఽబ్దానాం ప ఙ్క్తి మాలోక్య కేకీ, మేఘాంచక్రే సిన్ధురాజీవనానామ్
ప్రోవాహాప్యశ్యామశాఖిచ్ఛటానా, మేఘాం చక్రే సిన్ధు రాజీవనానామ్.

ఇందు - సిన్ధురాన్ ఆజీవయన్తీతి సిన్ధురాజీవనాః, నృత్తే, మేథాం చక్రే, సింధు, రాజీ, వనానాం, ఏథాం చక్రే, ప్రోవాహ = వహతిస్మ - అని గ్రహింపవలయు.

పఙ్క్తీభూయ ప్రాదురాసన్ బలాకానాథం నాత్రాశ్లిష్యతి స్మాబలా కా,
సిన్ధోరూర్మ్యాః కూలసీమామరాళాః, ప్రాయోఽబధ్నన్ వ్యో మ్న్యథావ
న్మరాళాః.

ఇందుబలాకాః పంక్తీభూయ, ప్రాదురాసన్, కా, అబలా, అత్ర, నాథం నాశ్లిష్యతిస్మ, అరాళాః సిన్ధోరూర్మ్యాః కూలసీమాం ప్రాయో అబధ్నన్, మరాళాః వ్యోమ్ని అధావన్ - అని సమన్వయము.

అమ్భోదానాం దత్తహంసారసానా, మాళీ రేజే మానినీ సారసానామ్,
ధారా దిక్షు వ్యానశే సారసానాం, జజ్ఞే నాఖ్యా భూతలే సారసానామ్.

ఇందు దత్తహంస + అరసానాం (అరసః = అప్రీతి) మానినీసారసానాం = మానినీనాం సారః స్థైర్యం, తత్ స్యన్తి (అన్తర్భావితణిచ్, అతోఽనుపసర్గేకః ఇతి కప్రత్యయః) అమ్భోదానాం అళీ రేజే, సా = తాదృశీ రసానాం జలానాం వా ధారా దిక్షువ్యానశే, సారసానాం = పద్మానాం ఆఖ్యా, భూతలే, న, జజ్ఞే.

వర్షాకాల వర్ణన మంతయు నుఱుములు మెఱపులు వడగండ్లు - వీనితో అనఁగా యమకానుప్రాస శ్లేషాదులచే విరహిజనులకుంబోలెఁ బాఠకులకును దుస్సహమై యుండెఁగదా. శరశరాసనోద్యోగమున కర్హమగు శరద్వాసరవైదశ్యము నొక్కసర్గములోఁ గవియిత్రి వర్ణించె. ఒండు రెండు మాత్రలఁ జూతము.

కాదమ్బిన్యాః క్షాళయన్ కాళిమానం, కాదమ్బానాం కౌతుకాధానహేతుః,
శామ్బ త్యజన్కః పక్వశాలి ప్రహాలీ, శాలీ సద్యశ్శారదో వానరోఽభూత్.
(కౌతుకము = వివాహము; ఆధానము = గర్భాదానము.)
శత్రూన్ జేతుం శాతశాతా మతన్వన్, నాళీకానాం పాళికాం రాజహంసాః.
ప్రత్యగ్రాణాం ప్రాప్నువన్ సప్రశంసా, నాళీకానాం పాళికాం రాజహంసాః.

(రాజహంసాః = రాజహంసలు, రాజశ్రేష్ఠులు నాళీకము = తామర, బాణము; శాతశాతాం = అతి తీక్ష్ణమైనట్టి, పాళికాం).

అతిదూర మాగతవతః శ్రమచ్ఛిదే, నిజకామినీమణిజనస్స్వయహృతః
పటవాసపాంసు రివ కేతకీరజ స్తటసీమని స్ఫురతి వాసయన్ మహీమ్.
తటవికస్వరనూతనకేతకీ పతితపాంసుపరీతనిజా స్తరమ్
స్ఫురతి యస్య పురారితనుః పయః ససితభాసిత భాసిసిభా ఇవ.
(భాసిత = భస్మసంబంధమగు).

అని మొదలుగా శారదరాజహంస కేతకీరజోవర్ణనలు తేటగా కొంత సరసములుగా నున్నవి.

సుందరకాండకథలో హనుమంతుఁడు సీతాదర్శనమున నంగుళీయక మిచ్చిన ఘట్టమున-

ఆయాత మత్ర రఘువీర కరాపమర్శం
త్యక్త్వేతి రాగభరమాత్మని మాకృథా స్త్వమ్,
రత్నాఙ్గుళీయక వితర్కయ రత్నగర్భా
గర్భోద్భవయా త్సహజరాగ మనూనమేవ.

అను హనుమద్వాక్యము భావవ్యంజకముగా నున్నది. సీత యుంగరమును బ్రతిగ్రహించి శోకపరవశ యగుట కవి చక్కఁగా వర్ణించెను.

"భవ్యం విహాయ భరతో మణిముద్రికే త్వాం
సామ్రాజ్యపాలన సమంజసతా ప్రకారే,
పాదూద్వయం రఘుపతిం ప్రణయాద్యయాచే
కిం ను స్తవీ మ్యహహ తత్కలితోపకారమ్
సోఽగ్నిః స్వకీయశిఖయా గ్లపితాశయానాం
న క్తంచరేంద్రనగరీవనితాజనానామ్,
శ్వాసానిలైః ప్రవవృధే శతధా సమృద్ధ
మగ్రే తతస్తు నయనాంబు తదావరాసీత్."

అని సీతాబాష్పసలిలవర్ణన ముత్ప్రేక్షాసరసమై యున్నది. ఇవి పదునాలుగవ సర్గములోని శ్లోకములు. ౧౫వ సర్గమునఁ గొంతభాగము వఱకు గ్రంథము లభించుచున్నది. ఆంధ్రలోకమునకు నాంధ్రకవయిత్రి సంస్కృతరచన చూపవలయు నని యుదాహరించితిమి. స్త్రీకవిత్వమును రాజశేఖరుఁడు-

"పురుషవద్ యోషితోఽపి కవీభవేయుః, సంస్కారోహ్యాత్మని సమవైతినస్త్రైణం పౌరుషం వా విభాగ మపేక్షతే, శ్రూయన్తే, దృశ్యన్తేఽపి చ రాజపుత్ర్యో మహామాత్ర దుహితరో గణికాః కౌతుకిభార్యా శ్చ శాస్త్రప్రహతబుద్ధయః కవయశ్చ" అని విద్యాసంస్కారము స్త్రీపురుషభేదము లేక లభించు రాజపుత్రికలు మంత్రికుమారికలు గణిక లాదిగా విదుషులు శాస్త్రముల నేర్చి కవిత్వము చెప్పనేర్చిరని భావము. పూర్వము రాజులయొద్ద భోగినులు పట్టాభిషిక్త యగు రాజ్ఞికి స్థాన విశేషమున న్యూనత వహించినను కలావిలాసశిల్పచాతురుల మిన్నలై యేకచారిణీ వ్రతము ననుష్ఠించుచు, గౌరవము నెందుచుండిరి. అట్టి పదవిలో గంగాదేవి, రామభద్ర, తిరుమలాంబ, మధురవాణి, రంగాజి మొదలగు సంస్కృతాంధ్రవిదుషులు చేరి యుందు రని కేవల మూహచేఁ దలఁచుచున్నాము.

వైశ్యాశూద్రకులోత్పన్నా రూపయౌవనసంయుతాః
నృత్తగీతకలాదక్షా శ్చిత్రజ్ఞాః ప్రేమనిర్భరాః.

సంభోగసుఖసామ్రాజ్య సంవర్ధనవిచక్షణాః
అవరోధవధూః కాన్తాః కుర్యాద్భోగాయ భూపతిః.

అని సర్వజ్ఞసోమేశ్వరుఁడు మానసోల్లాసమున శాసించె.

అభి రభ్యుచ్ఛ్రితా వేశ్యా శీలరూపగుణాన్వితా,
లభతే గణికాశబ్దం స్థానంచ జనసంసది,
యోగజ్ఞా రాజపుత్రీ చ మహామాత్రసుతా తథా,
సహస్రా న్తఃపుర మపి స్వవశం కురుతే పతిమ్.

తథా పతివియోగే చ వ్యసనం దారుణం గతా,
దేశాన్తరేఽపి విద్యాభిః సా సుఖేనైవ జీవతి.

అని వాత్స్యాయనమహర్షి గణికావిద్యాసంస్కారమును వర్ణించె. గణికలు స్వధర్మములఁ బరిత్యజించి నిమ్నమార్గముల హేయజీవనము సేసినచో దూష్యలగుచుందురు గాని నియతధర్మానుష్ఠాత్రులు వినింద్యలు కారు కదా!

— భారతి.

ధాత, మార్గశీర్షము - డిసంబరు, 1936.
సంపుటము 13. సంఖ్య 12.

# వ్యుత్పత్తివాదము

—శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామి

పూర్వము అవ్యుత్పత్తివాదులు ఇరుతెగలవారుండిరి. అందు మొదటి తెగవారు ఇట్లనిరి: "పాచకుఁడు వంట చేయక నిద్రించుచున్నను అతనిని పాచకుఁ డందురు. పాచకశబ్దమునకు ప్రకృతిప్రత్యయ లభ్యమైన అర్థలక్షణమున అతివ్యాప్తిదోషము పట్టినది. కావున కృత్ప్రత్యయాంత పాచకాది శబ్దములు కూడ ఉణాది ప్రత్యయాంతశబ్దములవలె రూఢములు." వృద్ధకాతంత్ర గణమువారు ఈ సంప్రదాయములో చేరియుండవచ్చును. "వృక్షాదివ దమీ రూఢాః కృతినా న కృతాః కృతః" అని కాతంత్రవృత్తికారు డగు దుర్గసింహుడు. సంప్రదాయ ధారాకల్పన చేసి శర్వవర్మ సంబంధమున వ్రాసె ననిపించును కావున వీరి సిద్ధాంతము అవ్యుత్పత్తివాద చరమావధి.

దీనికి ప్రత్యుక్తి వ్యుత్పత్తివాదులలో శాకటాయనమతావలంబు లిట్లు చెప్పుదురు: "నిద్రలో నున్న వ్యక్తియందు పాకయోగ్యత యుండుటచే అతనిని పాచకు డనవచ్చును. కావున పాచక శబ్దమునకు వ్యుత్పత్తి లభ్యమైన అర్థలక్షణమున అతివ్యాప్తి దోషము నేమాత్రము కల్పింప గూడదు." నవీనకాతంత్ర గణమువా రీ వాదము ననుసరించినారు. అందుచే త్రిలోచనుని పంజియం దిట్లున్నది: "సత్యం యదా క్రియా మసౌ కృతవాన్ తదా కర్తేతి, అధునాఽపి తదర్థ స్మృతివిజ్ఞాన మి త్యదోషః. తథా కరిష్య న్నపి క్రియాయాః కర్తైవ తథోపచారాత్, అథవా భూత భవిష్య త్క్రియాసు యోగ్యతా మధికృత్య తథోచ్యతే, యథా లోకేఽపచ న్నపిసూపకారః పచనయోగ్యతయా పాచక ఇ త్యుచ్యతే" (చ. ౨-౨౦) దీనిపై వాఖ్యలో సుషేణవిద్యాభూషణుఁడు "కృతో యోగ్యతాయాం శక్తి రితి పక్ష మఫలం బ్యాహ-అథ వేతి" అన్నాడు.

ద్వితీయసంప్రదాయములో రెండుతెగల వారున్నారు. అందొకరు బహుప్రాచీనులు. రెండవవారు నాతిప్రాచీనులు. అతిప్రాచీనులలో గార్గ్యముని యౌగిక మని, రూఢ మని శబ్దమునకు రెండువిభాగములు కల్పన చేసినాడు. తన్మతమున యోగరూఢ, యౌగికరూఢ శబ్దములు రూఢములు కాని సాంకేతికములు

గాని యగును. అందు ఉణాది వ్యవస్థయు, ఊహ ప్రక్రియయు అశాస్త్రీయము లగుటయే హేతువు. కాని నాతిప్రాచీనుల సంప్రదాయమున నిరుక్తము, వ్యాకరణము అను వేదాంగద్వయమునకు విరోధము పరిహరించు నభిప్రాయముతో ఉణాది నిష్పన్నశబ్దములకుగాని ఊహ్య శబ్దములకుగాని అశాస్త్రీయత్వమును వారు గార్గ్యునివలె సంపూర్ణముగా నంగీకరింపలేదు. అందుచేతనే వ్యాఘ్రభూతి విరచిత శ్లోకవార్తికమున ''నైగమరూఢిభవం హి సుసాధు'' అని వినబడుచున్నది.

''నామ చ ధాతుజ మాహ నిరుక్తే, వ్యాకరణే శకటస్య చ తోకమ్
యన్న పదార్థవిశేషసముత్థం, ప్రత్యయతః ప్రకృతేశ్చ త దూహ్యమ్.''

దీనిపై వ్యాఖ్యలో పతంజలి యిట్లన్నాడు : ''నైగమా శ్చ రూఢిభవా శ్చోణాదికాః సుసాధవః కథం స్యుః? నామ చ ధాతుజ మహ నిరుక్తే. నామ ఖల్వపి ధాతుజ మేవాహుః నైరుక్తాః. వ్యాకరణే శకటస్య చ తోకమ్* వైయాకరణానాం చ శాకటాయన ఆహ ధాతుజం నామేతి. అథ యస్య విశేషపదార్థో న సముత్థితః కథం తత్ర భవితవ్యమ్? యన్న విశేషపదార్థ సముత్థం ప్రత్యయతః ప్రకృతేశ్చ త దూహ్యమ్. ప్రకృతిం దృష్ట్వా ప్రత్యయ ఊహితవ్యః, ప్రత్యయం చ దృష్ట్వా ప్రకృతి రూహితవ్యా'' (మ.భా.౩-౩-౧) వ్యాఘ్రభూతి మతమున నిశ్చయముగా ఊహను చేయవచ్చును. ఊహింపవచ్చునుకదా యని గావీ,గోణీ, గోతా, గోపోతలికా ప్రభృతి అపశబ్దములను ఊహ చేయవచ్చునా? ఇట్టి ప్రశ్నల నాశంకించి పతంజలి యిట్లు పలికినాడు :

''సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయా శ్చ తతః పరే. కార్యా ద్విద్యా దనూబన్ధమేతచ్ఛాస్త్ర ముణాదిషు...సంజ్ఞాసు, అర్థాత్ సాధుత్వే నాభిమతాసుసంజ్ఞాసు." ''యే శబ్దాః సాధుత్వేన ప్రసిద్ధాః తేషు సంజ్ఞా శబ్దేషు ప్రకృతిప్రత్యయకల్పనయా సూహః కర్తవ్యోనాన్యత్ర. తత్రధాతురూపాణి కల్పయితవ్యాని; ప్రత్యయా శ్చతతః పరే కల్పయితవ్యా ఇతి శేషః. కార్యాద్గుణా భావాదికాత్ విద్యాత్ జానీయా దనూబంధం కకారాదికమ్. ఏత దనంతరోక్తంశాస్త్రముణాదిషు.శాస్త్రోపి నిబంధనత్వాత్ శాస్త్రవిషయిత్వాత్ వా శాస్త్ర మిత్యుక్తమ్'' అని శ్లోకనిష్కర్షము.

*తోక శబ్దమునకు సాధారణార్థము పుత్రుడు లేక అపత్యము. ఇచ్చట యువాపత్యముగాని గోత్రాపత్యముగాని గ్రాహ్యము. శకటుని పుత్రుడు శాకటిః; శాకటాయనుడు కాడు.

వ్యుత్పత్తి, అవ్యుత్పత్తి వాదముల వారినడుమ ఇంత వాదప్రతివాదము లేల యని కొందర నవచ్చును. పురాకల్పమున శబ్దపారాయణమున 'బ్రహ్మేదం శబ్ద నిర్మాణమ్......' ఇత్యాది న్యాయానుసారముగా ప్రతిపదపాఠక్రమమున సమస్తనామములకు ధాతుయోనిత్వ ముపదిష్ట మయ్యెనని తోచును. కాలక్రమమున ధారణాశక్తి తగ్గుటచే సామాన్యవిశేషలక్షణాన్వితసూత్రాత్మకవ్యాకరణ ముదయము కాగాఁ బ్రాచీనులతో పోల్చికొని తత్కాలికు లిట్లనుచుండిరి :

''ఋషయో వ్యపదేశస్య నాన్తం యాన్తి పృథక్ త్వశః
లక్షణేన తు సిద్ధానా మన్తం యాన్తి విపశ్చితః.''

సూత్రత్మక నవీనగ్రంథమున కృదధికారమున ప్రాచీనశబ్ద పారాయణములో ననేకశబ్దములు చాలనీ న్యాయమున గృహీతము లయ్యెను బహుశబ్దములు సూత్రారూఢములు కాకపోవుటచే సూత్రకారులు విధిలేక వానిని విడిగా విడిచిరి; అట్టి శబ్దముల కన్నిటికిని వ్యుత్పత్తి చూపుటకై విడివిడిగా అపవాద సూత్రములను రచించినచో గ్రంథము పెరిగిపోవు నని, వానిని రూఢసాంకేతికము లని కాని, అవ్యుత్పన్న ప్రాతిపదికము లని కాని నిర్దేశించిరి. శాకటాయనునికి వలె ప్రాచీన మతావలంబుల కిది సహ్యము కాలేదు. ''సర్వాణ్యాఖ్యాతజాని నామాని'' అని వారు ప్రతివాదపూర్వకముగా వక్కాణించిరి. నవీనసంప్రదాయమువారు గార్గ్యుని వలె ఈ విషయమును తొలుత నంగీకరింపలేదు. క్రమముగా వీరిలో గూడ నిరుక్త వ్యాకరణములను ఏకీభూతముచేయు నుద్దేశమువలన ఉణాదిసిద్ధి ద్వారా శబ్దసమూహ సాధుత్వ మభ్యుపగత మయ్యెను.

వ్యుత్పత్తివాదము స్మృతిసమ్మత మనియు, అవ్యుత్పత్తివాదము సూత్రకారుల బుద్ధిమాత్రోత్ప్రేక్షిత మనియు గ్రహింపవచ్చును.

*వ్యుత్పత్తి పక్షము : పాణిన్యాదుల మతామతములు :*

యాస్కుని తరువాతి వైయాకరణులలో గార్గ్యశాకటాయనుల మతామతములను ఎవ రనుసరించిరో ఎవరు పరిత్యజించిరో తెలుపుట అప్రాసంగికము కానేరదు ఇప్పుడు నిలిచియున్న వ్యాకరణ గ్రంథములలో పాణిని అష్టాధ్యాయియే ప్రాచీనతను మగుటచే తొలుత దానిని పరిశీలింపనగును.

"అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్'' అని పాణిని అన్నాడు. దీనిపై వ్యాఖ్యాప్రసంగములో జ్ఞానేంద్ర సరస్వతి, ''అవ్యుత్పత్తి పక్షస్య చేద

మేవ జ్ఞాపక మితి ప్రాంచః'' అని తత్త్వబోధినిలో వ్రాసినాడు. మ.మ.-శివదత్త శర్మ యిట్లు లిఖించినాడు : ''అర్థవ...దితి సూత్రం కృతవతః 'అతః కృకమి కంస...' (౮-౩-౪౬) ఇతి సూత్రే కమేః పృథక్ కంసగ్రహణం చ కుర్వతః పాణినేస్తు అవ్యుత్పత్తి పక్ష ఏవాభిమతః'' (నిరుక్త ౫౬ పృ.). ఇందలి శేషాంశమునకు తాత్పర్య మిది : శాకటాయనుని ''వృతవృది హని కమి కషి భ్యః సః''(౩౬-౨)అను ఔణాదిక సూత్రానుసారముగా కమి ధాతువునుండి కంస శబ్దము నిష్పన్నమయినను, అష్టాధ్యాయిలో ''అతః కృ కమి కంస...''(౮-౩-౪౬) సూత్రమున కమిధాతువుమీద పృథగ్భావమున మరల కంస శబ్దము గృహీత మగుటచే, పాణిని కంసశబ్దమునకు ధాతుమూలకత్వమును స్వీకరింపక, దానిని రూఢమని కాని, అవ్యుత్పన్న మని కాని యెంచి ప్రయోగించినా డని తోచును. ఇంతియేకాదు. సూత్రానుసారముగా ప్రాప్తమగు గుణవృద్ధికార్యముల నుల్లంఘించి, కంస పరశు శబ్దములనుండి కంసీయ, పరశవ్య రూపములు సాధువు లగుటచే ''ప్రత్యయస్య లుక్ శ్లు లుపః'' (౧-౧-౬౧) అను సూత్రముపై కాత్యాయనుడు ''కంసీయ పరశవ్యయో ర్విశిష్ట నిర్దేశాత్ సిద్ధం'' అని వార్తికము చేసినాడు. దీని వ్యాఖ్యావసరమున పతంజలి, ''కమేః సః కంసః, పరాన్ శృణాతీతి పరశు రితి నైషదోషః. ఉణాదయోఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని''అన్నాడు. ఇచ్చట కయ్యటాచార్యుడు, ''అంతః కృకమి కంస కుంభేతి కంస శబ్దస్య భేదే నోపాదానాత్ క్వచిదుణాదయో వ్యుత్పత్తికార్యం నలభన్త ఇత్యర్థః'' అని చెప్పినాడు. ఉణాది ప్రత్యయాంతశబ్దముల రూఢత్వమును గూర్చి కాత్యాయనుని వార్తికము లెన్నో కలవు ''ఉణాదయోఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని'' (౩-౪-౭౨); ''తత్రోణాది ప్రతిషేధః'' (౭-౧-౨); ''ఉణాది ప్రతిషేధ శ్చ'' (౮-౨-౭౮) ఇత్యాదులు. ''అత్రపాణిని రవ్యుత్పన్నః'' ఇత్యాదిగా పతంజలి పలికినాడు. ఈ స్థితిలో పాణిని అవ్యుత్పన్నపక్షము వాదని ఉపపన్న మగుచున్నది. అందుచేతనే నాగేశ భట్టు ౭-౩-౧ సూత్రముపై శబ్దేందుశేఖరమున, ''నైరుక్త వ్యాకరణే శాకటాయనశ్చ సర్వం నామధాతుజ మాహేతి తే వ్యుత్పన్నత్వవాదినః. ఏవం చ పాణినేః నతత్ వ్యుత్పన్నత్వవా దీతి స్పష్టమేవోక్తమ్'' అని చెప్పినాడు.

కాని పాణిని సంపూర్ణముగా అవ్యుత్పన్నవాది యనుట సంగతము కాదు. దీనికి కారణము కూడ కలదు. నానావిధ కృత్ సూత్రములు రచించి, కృత్ప్రత్యయాంతశబ్దములకు ధాతుజత్వ సాధుత్వములను పాణిని చూపినాడు.

ఇట్లు పాణిని ఔణాదిక శబ్దములను గ్రహించి, గార్గ్యునివలె శాకటాయనుని సంపూర్ణముగా త్యజింపలేదు. అష్టాధ్యాయిలోని "ఉణాదయో బహులమ్" (౩-౩-౧); "భూతేఽపి దృశ్యన్తే" (౩-౩-౨); "భీమాదయోఽపాదానే" (౩-౪-౭౪); "భవిష్యతి గమ్యాదయః" (౩-౩-౩); తాభ్యా మన్యత్రోణా దయః (౩-౪-౭౫) ఇత్యాదులు. శాకటాయనుని ఔణాదిక సూత్రములు ఎడ నెడ పాణినీయ కృత్సూత్రములయందు తత్త్వతః అనుసృతము లయినవి. హస్త, గర్త, దన్త ప్రభృతి శబ్దములను గూర్చి శాకటాయనుని "హసి మృగ్రిణ్వామిద మిలూపూధు ర్విభ్యస్తన్" (ఉణా. ౩౬౬) సూత్రమును, "తితుత్ర తథ సిసు సరకసేషు" (౭-౨-౯) అను పాణినిసూత్రమును పోల్చి చూచినచో యథార్థము బోధపడును. అనేక ఔణాదికప్రత్యయములుకూడ అష్టాధ్యాయిలోని కృత్సూత్రములలో ప్రవేశించినవి. గండయన్త, మండయన్త, స్పృహయాయ్య, గృహయాయ్య, గదయిత్ను, స్తనయిత్ను, అనామయిత్ను * ప్రభృతి శబ్దము లిందులకు ప్రమాణము. శాకటాయనుని "తృా భూ వహి వసి భాసి సాధి గణ్డి మడి..." "శ్రు దక్షి స్పృహి గృహి గృహిభ్య ఆయ్యః" "స్తని హృషి ముషి గది మదిభ్యోణే రిత్నుచ్" ప్రభృతి ఔణాదిక సూత్రములనుండియే అష్టాధ్యాయిలోని "అయా మన్తాల్వాయ్యేత్విష్ణుషు" (౬-౪-౫౫) ప్రభృతి సూత్రములందు పాణిని ఝచ్ (అన్త), ఆయ్య, ఇత్ను ప్రభృతి ప్రత్యయములను గ్రహించినాడు ఇదియంతయు జూచినచో ఆయన వ్యుత్పత్తిపక్షము కేవలము స్థగితము కానేరదు కాని నాగేశభట్టు ౩-౩-౧ సూత్రముపై "...భూతే ఇతి (౩-౨-౧౪) సూత్రస్థం భాష్యం వ్యుత్పత్తిపాది వ్యాకరణాంతరీయ రీత్యా. అవ్యుత్పన్నవాది పాణిని మతే తు న తదితి బోధ్యమ్" (౧౦౭-౯ పృ.) అని చెప్పినాడు. అయినను ఔణాదిక శబ్దముల వ్యుత్పన్నత్వమును గ్రహించి, శాకటాయనుని పాణిని సంపూర్ణముగా పరిత్యజింప లేదని తోచును.

కారణములు :

(౧) అష్టాధ్యాయిలోని 'ఉణాదయో బహులమ్' అను సూత్రముపై పాణిని సాక్షాచ్ఛిష్యుడు వ్యాఘ్రభూతి యిట్లు వార్తికము చేసినాడు :

---

* అనామయిత్ను శబ్దము ఋగ్వేదములో కలదు-"హస్తాభ్యాం దశశాఖాభ్యాం జిహ్వా వాచః పురోగవీ అనామయిత్నుభ్యా త్వాతాభ్యాం త్వోపస్పృశామసి" (౧-౭-౨౫-౭; కాక ౧౦-౧౩౭-౭) అని ఆమ్నాతము.

"బాహులకం ప్రకృతే స్తను దృష్టేః, ప్రాయ సముచ్చయనా దపి తేషామ్
కార్య సశేషవిధే శ్చ తదుక్తం, నైగమరూఢి భవం హి సుసాధు
నామ చ ధాతుజ మాహ నిరుక్తే, వ్యాకరణే శకటస్య చ తోకమ్
య న్న పదార్థ విశేష సముత్థం, ప్రత్యయతః ప్రకృతేశ్చ త దూహ్యమ్."

ఊహనప్రక్రియను జూపుటకై పతంజలి యిట్లన్నాడు :

"సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయాశ్చ తతః పరే
కార్యాత్ విద్యా దనూబంధ మేతచ్ఛాస్త్ర ముణాదిషు". (మ. భా. ౩-౩-౧)

వ్యుత్పత్తిపక్షము పాణినికి కేవల మభిమతము కాకపోయినచో, గార్గ్యునకు వలె ఉణాది ప్రకరణ-అశాస్త్రీయత్వమే అభిమత మైనచో, ఈ సూత్రము గాని, సంప్రదాయవేత్తల సకల - అవాంతర కథలుగాని యెందులకో?

(౨) అష్టాధ్యాయిలోని "భూతేఽపి దృశ్యన్తే" (౩-౩-౨) అను సూత్రము ఉణాది సంక్రాంతము. కాశికలో జయాదిత్యుడు "భూతే కాల ఉణాదయః ప్రత్యయా దృశ్యన్తే" అన్నాడు. కొందరు కొందరు ఉణాదిశాస్త్ర మభ్యుపగతము కాలే దనియు, పాణిని "భూతే కాలే హ్యుణాదయః ప్రత్యయా దృశ్యన్తే న చోచ్యన్తే" అని చెప్పుటచే కారణ మనియు పలుకుచున్నారు. మంచిది. ఉణాది ప్రకరణ మశాస్త్రీయ మయినచో తత్ప్రత్యయములను జూపుటవలన నేమి ప్రయోజనము? గాపీ, గోణీ, గోతా ప్రభృతి అపశబ్దముల వ్యుత్పత్తి పరీక్షకై యెవరును యత్నింపలేదు.

(౩) అష్టాధ్యాయిలో "భవిష్యతి గమ్యాదయః" (౩-౩-౩)అను సూత్రమునకు భవిష్యత్కాలమున గమ్యాది శబ్దములు సాధువు లని తాత్పర్యము. ఇదియు ఉణాది ప్రత్యయ విషయక సూత్రము. కలాపములోని 'భవిష్యతి గమ్యాదయః' (కృత్. ౩౧౩) సూత్రవ్యాఖ్యలో దుర్గసింహుడు 'గమీత్యేవ మాదయః శబ్దా ఔణాదికా భవిష్యతి కాలే సాధవో భవన్తి, గమాదిభ్యో భవిష్యత్కాలవృత్తిభ్య ఇన్ స్యా దిత్యర్థః' 'అని చెప్పినాడు.

(౪) "భీమాదయోఽపాదనే" (౩-౪-౭౪), "తాభ్యా మన్య త్రోణాదయః" (౩-౪-౭౫) అను పాణినీయసూత్రములు ఔణాదిక శబ్దసాధనకై ఉపదిష్టములు. కాశికలో "భీమాదయః శబ్దాః అపాదానే నిపాత్యన్తే.

ఉణాది ప్రత్యయాన్తా ఏతే... 'శ్యాథూ సూభ్యో మక్' (ఉణ్. ౧౫౦), 'భియః యక్ చ' (౧౪౩) ఇత్యేవ మాదయః. తాభ్యా మన్య త్రోణాదయ ఇతి పర్యుదాసే ప్రాప్తే నిపాతన మారభ్యతే'' అని జయాదిత్యుడు వ్రాసినాడు ఇవి యన్నియు జూడ పాణిని వ్యుత్పత్తిపక్షతయు ఒక్క మారుగా నిరస్తము కాదనిపించును.

ఉణాది ప్రత్యయాంత శబ్దములను గ్రహించి పాణిని శాకటాయనునకు విరుద్ధముగా నుండనియెడల, భాష్యవార్తికమున ''ఉణాదయోఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని'' అను పరిభాష మాటిమాటికిని ఏల చెప్పిరో అనుసంధానము చేయవలెను. ''ఆయనే యీ నీయీయః ఫఢఖఛఘాం ప్రత్యయాదీనామ్'' (౭-౧-౨) అను సూత్రానుసారముగా ఢ ప్రత్యయస్థానమునందు ఏయ, ఖ ప్రత్యయ స్థానమున ఇన ఆదేశము వచ్చును. కావున ''స్త్రీభ్యో ఢక్'' (౪-౧-౧౨౦) అను సూత్రానుసారముగా వైనతేయాది శబ్దములు, ''కులాత్ ఖః'' (౪-౧-౧౩౯)అను సూత్రానుసారముగా కులీనశబ్దమును సాధింపవచ్చును. కాని 'శమేః ఖః' (౧౦౭) శంఖః, 'షణోఢః' షండః ప్రభృతి ఔణాదిక పదములనుజూచి కాత్యాయనుడు ''తత్రోణాది ప్రతిషేధః'' అన్నాడు. నానావిధ-ఔణాదిక శబ్దముల సాధుత్వమును స్వీకరించిన పిమ్మట మరల నిషేధ మెందులకు? అట్టి ప్రశ్నల నాశంకించియే ఆయన మరల 'ప్రాతిపదిక విజ్ఞానా చ్చ పాణినేః సిద్ధమ్' అన్నాడు. అనగా పాణిని యే భావముతో నేయే ప్రాతిపదికకు ప్రకృతి ప్రత్యయ విభాగ శూన్యత గ్రహించెనో తదనుసారముగా నది సిద్ధమయ్యెను. కావున నీ సకల శబ్దములను గూర్చి 'ఉణాద్యంత తదాదీని అవ్యుత్పన్నాని ప్రకృతిప్రత్యయవిభాగ శూన్యాని' అని చెప్పవలయును. దీనివలన ''ఉణాద్యంత తదాదిత్వేన శాకటాయ నాభిప్రేతే కాని వస్తుతస్తు పాణినిమతే ప్రకృతి ప్రత్యయ విభాగశూన్యాని' అని సూచిత మగుచున్నది. అనగా ''ఉణాద్యంతాని ప్రకృతి ప్రత్యయ విభాగ ప్రయోజ్య పాణిని సూత్ర ప్రవృత్త్యనర్హాణి'' కాబట్టి కౌమారగణమువలె పాణిని గూడ ''ఔణాదికా హి ద్వివిధావ్యుత్పన్నా అవ్యుత్పన్నాశ్చ'' (ఆ. ౧౨౫) అన వలసియుండును, పాణినిమతమున భస్మ, గమి, భీమ, కృషి, వాయు ప్రభృతి ఔణాదికశబ్దములు వ్యుత్పన్నములు; శంఖ, షంఢ శండ, శంఠ, శంట, పాయు, మాయు, జాయు ప్రభృతి ఔణాదిక శబ్దములు అవ్యుత్పన్నములు. కావున స్వకృతగ్రంథసూత్రానురోధముచే పాణిని అవ్యుత్పన్నవాది యగుట సత్యము; కాని శాకటాయనీయ వ్యాకరణమందలి ఉణాది ప్రక్రియ అశాస్త్రీయమని ఘోషించు నద్దేశ మాయనకు లేదు. ఇందుచేకే పేరుసూరి తన ఔణాదికపదార్ణవ ప్రథమ పాదమున నిట్లు చెప్పినాడు :

"అ వ్యుత్పన్నాః సూత్రకృతా, సంజ్ఞాః సాధయితుం క్షమాః
సంజ్ఞాయాం వర్తమానే చ, కాలేఽర్థే స్యు రుణాదయః.
క్వచి ద్భూతేఽపి దృశ్య న్తే, గమ్యాది స్తు భవిష్యతి
దాశ గోఘ్నౌ సంప్రదానే, కారకే వినిపాతితౌ.
భీమాదయో ప్యపాదానే, తదన్యార్థా ఉణాదయః
అసజ్ఞాయా మపి భవ, న్త్యేతే బాహులకాత్ క్వచిత్".

శాకటాయనమహర్షి అసాధారణశాబ్దికు డనుటకు సందేహము లేదు. ప్రాచీనకాలమున పాణినిసంప్రదాయమందలి ఆచార్యులే "అనుశాకటాయనం వైయాకరణాః" (కాశికా ౧-౪-౮౬) అన్నారు. అయినను, పాణిని ఔణాదిక శబ్ద సాధుత్వమును స్వీకరించుట శాకటాయనుని యెడల ఆదరమువలన కాదు. నిరుక్త వ్యాకరణములను వేదాంగముల వైరుధ్యమును పరిహరించుటయే ఆయన ముఖ్యోద్దేశము.

శర్వవర్మ అవ్యుత్పత్తి పక్షవాదియని కాతంత్రవృత్తికారుడు స్పష్టముగా చెప్పినాడు; పాచకాది కృత్ప్రత్యయాంత శబ్దములుకూడ అశ్వగోవృక్షాదులవలె రూఢములుకాని సాంకేతికములని శార్వవర్మిక కాతంత్రమున కృత్సూత్రములు చెప్పలే దన్నాడు. సకలానస్థలలో ప్రకృతి ప్రత్యయ లభ్యార్థముతో పాటు సముదాయార్థ - ఐక్యభావహేతువు పాచకాది శబ్దముల వ్యుత్పత్తిగల అర్థలక్షణమున అతివ్యాప్తి పొందుటచే వానికి ధాతుజత్వము కల్పించుటకు వలనుపడదు. కావున పాచకాది కృత్ప్రత్యయాంత శబ్దములుకూడ ఉణాది ప్రత్యయాంత వృక్షాది శబ్దములవలెనే రూఢములు. నది వస్తుతః శర్వవర్మాచార్యుని సిద్ధాంతమగునో కాదో చింతనీయము దుర్గసింహు డేమన్నను, ఆయన అంతతః గార్గ్యునివలె అవ్యుత్పన్నవాదియు ననవచ్చును. గార్గ్యముని కృత్ప్రయాంత శబ్దములకు ధాతుజత్వమునుగాని, వ్యుత్పన్నతనుగాని అంగీకరింపకపోలేదు, కాతంత్రమున అనేక కృత్సూత్రముల ప్రయోగము ఉపలబ్ధమగుచున్నది. "ధాతో స్త్వశబ్దః స్యాత్" (నామ ౬౮); "ధాతో ర్వా తుమన్తా దిచ్ఛతి నైక కర్తృకాత్" (ఆ. ౩౮); "తుమర్థా చ్చ భావవాచినః" (చ. ౨౩౪); "కర్తృ కర్మణోః కృతి నిత్యమ్" (చ. ౨౪౭); "న నిష్ఠాదిషు" (చ. ౨౪౮) ఇత్యాదులు కానవచ్చును. కావున కృత్ప్రత్యయాంత పాచకాది శబ్దముల రూఢత్వావధారణ శర్వవర్మ యుద్దేశము కాదు. కాని శీఘ్రకాలములో సాతవాహనునకు కొంతవ్యాకరణము బోధించు నభి

ప్రాయముతో ఆయన కృత్పరిత్యాగము చేయుట విచిత్రము కాదు. అధ్యాపన సమయమున శబ్దముల అభిధానలక్షణమును జూపి, శిష్యుని ధీవికాసమునకై కృత్సంబంధోపదేశ ప్రదానముతో ఆయన విరమింపలేడు. కాని యిప్పుడు కలాపశేషమున దుర్గవృత్తి సమేతముగా పంచపాదాత్మక - ఉణాదిప్రకరణము కానవచ్చుచున్నది. తాంజోర ప్రవాదానుసారముగా వృత్తికారుడు దుర్గసింహుడే ఈ సూత్రము లన్నిటికిని కర్త. పంచమపాదారంభమున—

''శబ్దాత్మికా యా త్రిజగత్ బిభర్తి, స్ఫురద్ద్వి చిత్రార్థ సుధాం స్రవన్తీ
యా బుద్ధి రీడ్యా హృదయే సదైవ, ముఖే చ సా మే వశ మస్తు నిత్యమ్.''

అని ఆయన చెప్పి, షష్ఠపాదాంతమునం దిట్లు లిఖించినాడు :

''శబ్దానా మానంత్యాత్, వ్యుత్పత్తిః దృశ్యతే యేషామ్
తేషాం విజ్ఞైః కార్యా, మృగ్యా ధాతో స్తతః ప్రత్యయాంతాత్''*

ఇదియే కాక ప్రకరణారంభమున ప్రణామశ్లోకములోని 'ఉణాదయో ఽభిధాస్యన్తే' అను దుర్గోక్తివలన గూడ ప్రవాదము పుట్టి యుండవచ్చును, కాని ఇంద్రగోమివ్యాకరణమే యీ సూత్రముల కన్నిటికి ఆకర మని కొందరన్నారు. ఏమయినను, శాకటాయనాదిప్రణీత ఔణాదికసూత్రముల యోగవిభాగములద్వారా కలాప - ఉణాదిసూత్రములు రచింపబడినవి. దుర్గసింహుని దృష్టిని గ్రహించి, ఉపాధ్యాయ సర్వస్వమున సర్వధర ఉపాధ్యాయుడు ఈ సూత్రముల కన్నిటికిని వ్యాఖ్య రచించినాడు. రమానాథ చక్రవర్తి సారనిర్ణయమున ఉపాధ్యాయ సర్వస్వము ననుసరించినాడు.

చాంద్రసంప్రదాయమున శాకటాయన మతప్రాబల్యము కానబడును. స్వయముగా చంద్రగోమి చాంద్రవ్యాకరణమునకు పరిశిష్టరూప మగు ఔణాదిక సూత్రపాఠము రచించినాడుట. అందు మూడుపాదములు కలవు. అది ప్రాచీన బౌద్ధ వ్యాకరణములలో నొకటి.

* కాతంత్ర-ఉణాది ప్రకరణమున (వంగీయ సంస్కరణమున) పంచపాదములు మాత్ర మున్నవి. అందు ఆరవపాదము కాని, అన్ని సూత్రములు కాని కనబడవు - ఈ రెండు శ్లోకములు మదరాసు ప్రతిలోనివి. డాక్టర్ టి.ఆర్. చింతామణి ప్రకటించిన 'కాంతంత్రోణాది సూత్రాణి, దుర్గసింహ విరచిత వృత్తియుతాని' అను గ్రంథమున ౩౩, ౭౨ పుటలలో ఉక్తశ్లోకద్వయాంశలు కానవచ్చుచున్నవి.

జైనులవ్యాకరణమున విశేష మేమియు లేదు. జైనేంద్రవ్యాకరణమున దేవనంది పాణినిమునిని, అభినవ శాకటాయనుడు దేవనందిని, హేమచంద్రుడు మలయగిరి అభినవ శాకటాయనుని అనుసరించినారు. కాబట్టి వీరి గ్రంథము లన్నియు వస్తుతః పాణినిని అనుసరించినవే. అభినవ శాకటాయనుని శబ్దాను శాసనమున నామముల ధాతుజత్వమును గూర్చి మహర్షి శాకటాయన మతవాదము కానరాదు. అందుచేతనే డాక్టర్ శ్రీపాద కృష్ణ యిట్లు చెప్పినాడు :

"One expects to find in the Unadi sutras at least traces of the ancient Sakatayana and his works, but he is sure to be disappointed in his expectations." (S. S. O. P. 71)

పురాకల్పమున ఆదివ్యాకరణ సమూహమున ఔణాదిక ప్రక్రియా ప్రమాణ హేతువున శాకటాయనునే భోజదేవుడు అనుసరించినాడు. "అభిదధాత్యర్థం ధాతుః" (ప్రక్రియా, ఉణాదిఖండ, ౧-౬౪) అని ధాతుశబ్దవ్యుత్పత్తి. ఇందుచేతనే కాబోలు, భోజుడు నామమాత్రమునకు ధాతుజత్వము స్వీకరించినాడు. "ఉణాదయోభూతేఽపి" (౨-౪-౧); "సర్వధాతుభ్యో మనిన్" (౨-౪-౨); "భవిష్యతి గమ్యాదయః" (౨-౪-౩); ప్రకృతి ఔణాదిక సూత్రములు తదీయ వ్యాకరణమున గానవచ్చును. ప్రక్రియాసర్వస్వములోని ఉణాది ఖండ మందలి 'వర్ణానీతి' తరువాత నారాయణభట్టు—

"ఉక్తేషు ప్రత్యయేష్వేవ, ప్రకృత్యాధిక్య గోచరాః
భోజోక్తయః పురా ప్రోక్తా, అవశిష్టా నథ బ్రువే."

అను శ్లోకము చెప్పి, ఔణాదికసూత్రముల కెన్నిటినో వ్యాఖ్య చేసినాడు; "ఇతి భోజోక్తాః" అని సూత్రముల చివర లిఖించినాడు. ఈ సూత్రముల నన్నిటిని భోజుడు స్వయముగా రచించెనో, కాక ప్రాచీన గ్రంథమునుండి గ్రహించెనో నిశ్చయముగా జెప్పుటకు వీలులేదు.

క్రమదీశ్వరుడు శాకటాయనునే విశేషముగా ననుసరించెను. సంక్షిప్త సారమందలి 'కృ చ్ఛేషోణాది పాదః', 'కృషో చ్ఛే వ్యయపాదః'-ఈ రెండును దీనికి నిదర్శనములు. ఊహనాది ప్రక్రియానుసారముగా క్రమదీశ్వరుడు అనేక సంజ్ఞలకు వ్యుత్పత్తి చూపినాడు. ఉణాది పాదశేష సూత్రవృత్తిలో "ఇతి దిఙ్మాత్రమస్యాత్రాపి ప్రకృతి ప్రత్యయాగమ గుణవృద్ధి హ్రస్వాదయో యథా సంభవం పరికల్పనీయా.

> తిఙన్తా దితరే శబ్దాః కృద్భిః సర్వే ప్రసాధితాః
> సమాస తద్ధితాభ్యాం చ వికారా నపి సాధయేత్.
> యస్మిన్ దేశే ప్రసిద్ధా యే ప్రయోక్తవ్యా హి తత్ర తే
> అప్రసిద్ధా శ్చ యే శబ్దా బోధ్యా గ్రంథాంతరా త్తు తే''. (౨-౨-౨ సూత్ర

వృత్తి) అని వ్రాసినాడు. వృత్తికారుడు క్రమదీశ్వరుడే. జుమరనందివలన ఈ గ్రంథము పరిశోధితము, పరివర్ధితము మాత్రమయినది.

సారస్వత వ్యాకరణమున వ్యుత్పత్తిపక్షమునెడ విశేషాదరము గోచరించును. ఇందలి ఉణాదిప్రక్రియలో ''అథోణాదయో నిరూప్యన్తే. సదోణాదయః...'' అని యున్నది. ప్రకరణశేషమున నిట్లు కానవచ్చును.

> ''సంజ్ఞాను ధాతురూపాణి ప్రత్యయా శ్చ తతః పరే
> కార్యాత్ విద్యా దనూబంధ మేత చ్ఛాస్త్ర ముణాదిషు
> ఉణాదయోఽపరిమితా యేషు సంఖ్యా న గమ్యతే
> ప్రయోగ మనుసృత్యామీ ప్రయోక్తవ్యా స్తత స్తతః.''

సిద్ధాంతచంద్రికాకారుడు ''సదోణాదయః'' అనుసూత్రముపై వ్యాఖ్యలో ''సర్వస్మిన్ కాల ఉణాదయః, ఉణాదయోఽపరిమితాః ప్రయోగ మనుసృత్య ప్రయోక్తవ్యాః'' అని వ్రాసినాడు. దీని టిప్పణిలో ''తాని శాకటాయనాది ప్రణీత వ్యాకరణాంతరాత్ సంగృహీతాని సన్తి'' (౩౫౩). చక్రధరశర్మ కుమారుడు నవ కిశోరశాస్త్రి ఏతద్గ్రంథాంతమున ఉణాదికోశమును చేర్చినాడు.

''చణమ్ వాభీక్ష్ణ్యే పూర్వకాలే'' (౧౧౮౩) అను సూత్రవృత్తి భాగములో బోపదేవ గోస్వామి యిట్లన్నాడు :

> ''కృత్తద్ధిత సమాసానా మభిధానం నియామకమ్
> లక్షణం త్వ నభిజ్ఞానాం త దభిజ్ఞాన సూచకమ్'' (౧౩౯౯)

కాని దీనికి పూర్వమే ఆయన కృత్సూత్రము లనేకము రచించినాడు. ముగ్ధబోధము చివర ఉణాదిసూత్ర పంచపాదములు కానవచ్చును. ఉణాదికోశకర్త రామశర్మయే వీని నన్నిటిని రచించెనేమో; బోపదేవుడు రచింపలేదేమో. ముగ్ధబోధములోని ''నామ్న్యౌణ్యేతిక్'' (౧౦౦౭) అను సూత్రమున పాణిని స్మృత మగు ''ఉణాదయో బహులమ్'' (౩-౩-౧) అను సూత్రతాత్పర్యము ప్రవిష్టమయి

యుండును. దానినుండి ఆచార్యప్రవృత్తిని గ్రహించి రామశర్మ ఈ ఉణాది సూత్రముల నన్నిటిని రచించియుండును. ఈ స్థితిలో బోపదేవుడు గార్గ్యు ననుసరించిన వా డనుటకంటె పాణిని ననుసరించెననుట యుక్తము.

పాణినివలెనే పద్మనాభదత్తుడు కూడ అవ్యుత్పన్నవాది యనవలెను. కాని కొద్దిగా భేదముకలదు. అష్టాధ్యాయిలో ఉణాది విషయక సూత్రములు కొలదిగా గలవు. పద్మనాభుని సుపద్మమున నానాకృత్సూత్రములేకాక. ౧౮౦ ఔణాదిక సూత్రములుకూడ కలవు. ''ఉణాదయో బహులమ్'' అనునది ఉభయగ్రంథముల లోను ప్రథమసూత్రము (అష్టా. ३-३-౧; సుపద్మ. ४-౨-౧). దీని వృత్తి భాగములో పద్మనాభుడు, ''ఉణాదయః ప్రత్యయా ధాతో ర్బహులం స్యుః. య దాహుః - ఉణాదయోఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని'' అన్నాడు.

శ్రీ జీవగోస్వామి పాణిని ననుసరించినాడు. ఆయన హరినామామృత వ్యాకరణములోని కృత్ప్రకరణమధ్యమున ''గమి గామ్యాదయస్తు భవిష్యతి సాధవః'' ఇత్యాది ఉణాదివిషయకసూత్రము కానబడును.

పురుషోత్తమ విద్యావాగీశుడు కూడ పాణిని ననుసరించినవాడు. ఆయన ప్రయోగరత్నమాలలో కృద్విన్యాసమున 'ఉణాదయ స్స్యుః బహులమ్', 'భీమాదయోఽపాదానే స్యుః'-ఇత్యాది ఉణాది సంబంధీయ సూత్రములున్నవి. (३౮౨).

యాస్కుని తరువాత పాణిని మొదలు పురుషోత్తమ విద్యావాగీశుని వరకును శాబ్దికులు తమతమ సూత్రానురోధమున గార్గ్యపక్షము నవలంబించినను అల్పముగానో విస్తారముగానో ఔణాదికశాస్త్రసాధుత్వము నంగీకరించుచు శాకటాయనుని మర్యాదను పాటించినారు. కావుననే ప్రాచీనులవలెనే నేటికిని ''అను శాకటాయనం వై యాకరణాః'' అనవచ్చును.

—భారతి.

విరోధి - భాద్రపదము. 1949, సెప్టెంబరు.
సంపుటము : 26; సంచిక. 9.

—: ० :—

# విద్యా జగన్నాథులు

శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మ

విద్యానాథుఁడు, జగన్నాథుఁ డిద్దరాంధ్రులు, విద్యాధికారులు. సాహితీ విద్యా స్వరూపతత్త్వములను సహృదయుల కందించిన పాండిత్యవైదగ్ధ్యాద్వైత మూర్తులు. విద్యానాథుఁడు కాకతీయసామ్రాజ్య జగ మేలిన సారస్వతేయుఁడు. విద్యానాథునకు గిరాందేవత విద్యాకైరవకౌముది. సారస్వతప్రక్రియాబీజన్యాస భూస్వామియె కవితానాట్యము నిర్దేశించిన సుకృతి. విద్యానాథుఁడు ప్రతాపరుద్ర యశోభూషణము పేరిట అలంకారశాస్త్రసర్వసంగ్రహముగా కావ్యాలంకార సంగ్రహము రచించినాఁడు. ఆంధ్రానాంధ్రావనులం దంతట నది యలంకార ప్రథమాంతేవాసుల కారాధ్య మయినది.

''రసప్రధానాః శబ్దార్థాః, గుణాలంకారవృత్తయః
రీతయశ్చేయతీశాస్త్ర, ప్రమేయం కావ్య పద్ధతిః''

అని యని కావ్యము వలని కర్తవ్యతాదీ సరసమని రసికుఁడై యనినాఁడు. కాంతాసమ్మితకావ్యశ్రీ సరసత నాపాదించు ననినాఁడు. ఉత్తమ పురుషచరిత నిబంధనము లేకున్నచో కావ్యము పరిత్యాజ్యము. అందుననె ''కావ్యాలాపాం శ్చ వర్జయే'' త్తని పెద్ద లనిరట.

విద్యానాథుని నిగమన మి ట్లున్నది. ''రసమహనీయ కావ్యముననె గుణాలంకార విలసనము. అదియు విశిష్ట శబ్దార్థముల హృదయానంది యగును. అమృత మాధుర్యసుభగ మయిన శబ్దార్థముల యున్మేషమును పుణ్యశ్లోక చరిత నిబంధనమున రాణించును'' అని.

ఇట్లనిన నాథుఁడును శబ్దార్థములు కావ్య మని సంప్రదాయ మనుసరించితి నని యాత్మభావనము చేసికొనెను. కావ్యసంపద కాంతాసంపద. జీవితము వ్యంగ్య వైభవము. విద్యానాథుఁడు తాను గుర్తించిన సాహిత్యమర్యాదలను పొదిపి పొదిపి యందించినాఁడు. ''రచన రసవ్యంజకము. రసాననుగుణవర్ణ రచన దోష మనినారు కదా! రసావస్థానసూచకములు నాలుగువృత్తులు రచనా

శ్రితములై యుంట రసమార్గము వైదర్భ్యాదిరీతులు శబ్దగుణాశ్రితము లర్థవిశేష నిరపేక్షములు సందర్భములోని సౌకుమార్య ప్రౌఢత్వములనె చూచు నని వామనుడు వినకుండునట్లు పలికినాఁడు. వైదర్భి గౌడి పాంచాలి రీతులె చెప్పినాఁడు. "ఆంధ్రమును విదర్భులు గౌడులు పాంచాలురు పంచుకొనుఁడు!" అని తనకు తానై యనలేదు. కాని, తాను కవితానాట్యములో "ఆంధ్రీరీతి" సూచించినాఁడు.

పదముల పరిమైత్రిని శయ్యగాఁ జేసి యర్థగంభీరిమతో పాకము హృదయంగమ మొనర్చినాఁడు. శబ్దాలంకారప్రధానపఁలు నాథునిదృష్టిలో క్షుద్ర ప్రబంధములు. తాలసంబద్ధములు, వాసచిత్రములు, విభక్తి భక్తికములు, విభక్త పునరాకృష్ట శబ్దములు, వాక్యాడంబర సయుక్తము లాలంకారిక విద్యానాథునకు క్షుద్రములు. రూపకములు చెప్పి వాని భేద ప్రభేదములు నిర్దేశించి, సంధి సంధ్యంగములను వివేచించి, రూపకరచనా సామర్థ్యము నిరూపించుటకై యత్నించిన విద్యానాథుఁడు సర్వప్రబంధములకు రసము జీవిత మని నిర్దేశించినాఁడు.

రసము నాయకాశ్రయమె. నటుఁడునిపుణముగా ప్రదర్శించినచో సామాజికులు సాక్షాత్కరించుకొందురు. భావించి సంభావింతురు.రసము వారలకు నిరతిశయానందజననము యని అనినాదే కాని సామాజికాశ్రయత్వమే చెప్పినాఁడు. నటుఁడు ననుకరణమాత్రపరుఁడు. రసాశ్రయయోగ్యత వానికి లేదని యనినాఁడే కాని నటునకును భావకత్వ మంగీకరించినాఁడు. నటుఁడును భావుకుఁడయినచో వాఁడు సామాజికుఁడు. నటుఁడు శిక్షాభ్యాసపాటవమున సర్వము ఘటింపఁగలఁడు. ఇది రసకథ. రసములలో పరస్పర విరోధ మున్నను కవి ప్రౌఢుఁడై సమావేశింపఁ జేయఁగలఁడఁట! రసమున రస ముదయించు నని శృంగారతిలకుల భావ మాభాషించినను భారతీయప్రక్రియ ననుసరించి రస మొక్కటియే అని విద్యానాథుఁడు చెప్పకతప్పలేదు.

విద్యానాథుఁడు భావించిన రసరీతి నవము కాదు. అనవమును కాదు. భావ విభవ మొక్కటి గుణాలంకార శ్రీపరిష్కృతమై ప్రాదుర్భవించి వేద్యాంతర మంతయు పోగొట్టును. సహృదయునం దదది పూర్ణరసభరమై పరిణమించి అమందానందాత్మక మగును. భావములె క్రమమున పరస్పర విభవము కలవై రసీభావము పొందుచున్నవి. రసము వాక్యార్థము. విభావాది భావములు పదార్థములు. అవి రసమున సముచిత విశ్రాంతి పొందును. రత్యాదిస్థాయి వర్ధమానమై యుండగా

భావములు పొంగి చల్లాడును. నిజాస్వాదాతిశయము రసమై సామాజికుని సర సీకరించుచున్నది. ఇట్టి నాథుని రసపథము చూచి మల్లినాథుని కుమారుఁడు కుమారస్వామి సోమపీథి —

''యీ స్థాయి భావరతి రేవ నిమిత్త భేదాత్
శృంగార ముఖ్య నవనాట్య రసీ భవంతి
సామాజకాన్ సహృదయాన్ నటనాయకాదీన్
ఆనందయేత్ సహజపూర్ణ రసోఽస్మి సోహమ్'' అనుకొనినాఁడు.

రసము చెప్పుటతో నాథుఁ డాగలేదు. గుణములు వివేచింప వలయు నని తలఁచినాఁడు. దోషనిరూప మున్నగాని గుణవివేకము కలుగదు. శబ్దార్థగోచరము లయిన దోషములు కావ్యాపకర్ష నాపాదించును. వాని దూరీకార మూరీకరింప వలయును. ఇంక నెన్నెని దోషముల నూహింప వచ్చునట. రసభావములకు స్వశబ్ద వాచ్యత దుష్టమే. ఇది నాథరీతి.

ఇరువదినాలుగు గుణములు ధ్వనిపథికులు పలుకరు కదా! విద్యానాథుఁడు ధ్వనిపథ్యలో సంచరించినను భోజుని గౌరవించుటకు గుణముల నన్నిటిఁ జెప్పి నాఁడు. దెబ్బదియైదలంకారములను నిరూపించి తన గ్రంథ మొక యలంకార శాస్త్ర గ్రంథ మయిన దనిపించుకొనినాఁడు. అలంకారములను వర్గీకరించి రుద్ర కుని సూత్రమును జయరథుని విమర్శనమును పట్టిపట్టి తాను చేయవలసినంత చేసి నాఁడు. విద్యానాథుఁడు మనవాఁడు. ఆంధ్ర తరుణలోకము తా నొక యలంకార శాస్త్ర మిచ్చి మా వారందరు చదువవలెను-అని భావించి యుండును. సంస్కృత ముఖులంద రొకనాఁడు ప్రతాపరుద్రీయము పఠించిరి. అంతటితో కొంద రాగిరి. మఱికొంద రింకను సాగిరి. ప్రతాపరుద్రీయములోని పద్యములు మనోజ్ఞము లని ''రత్నశాణము'' పలికినది.

''విద్యానాథః కథ మపి బహవో, రకరాత్ శాస్త్రజాలాత్,
సంజగ్రాహ ప్రకృతి కఠినే, రత్నజాలం కరండే॥''

రత్నముల నెన్నిటినో కూర్చినాఁ డట. అట్టి దిది తెలుఁగు లాక్షణికులకు సుబోధము కావలె నని భట్టుమూర్తి గట్టి చేసినాఁడు. కాని సన్నిధానము సర్వము సన్నిధానములో నుంచుట విద్యానాథునకు నిధానమయినది. ప్రతాపరుద్రీయ

మలంకార శాస్త్రము. నవ్యుల కందరకు దివ్యవాణీ పుష్టి, తుష్టి సంపాదించునది కావలయునని "నవ్యసాహిత్య పరిషత్" వ్యాఖ్యాగత సర్వవిషయములతో సవిస్తరముగా ననువదింపఁజేసి యందించినది. ఆఁనాడు విద్యానాథునకు ఓరుగల్లు పాలకుఁడు నేనున్నా ననినాఁడు.

జగన్నాథుఁడు పండితరాజ జగన్నాథుఁడు. అతఁడే జగన్నాథ పండిత రాయలు. ప్రతాపరుద్రీయనిర్మాత నవవిద్యావంతుఁడు కాగా రసగంగాధర రచయిత రసజగన్నాథుఁ డయినాఁడు. ఢిల్లీ పట్టణములో మొగలాయీ చక్రవర్తి షాజహాన్ దర్బారులో "దారాషుకో" ఛత్రచ్ఛాయలో పండితరాయలై జగన్నాథుఁడు విద్యాజగములో నాథుఁ డయినాడు. ఒక నవకాదంబిని అతని మతి చుంబనముచేసినది. సర్వవిద్యాధరుని కుమారుఁ డాతఁడు. అతని తండ్రి పేరు భట్టు. లీలచే పాషాణము పీయూషము పిండెడిది. మనన నిమగ్నుఁడై లలితరస గంగాధరమును తెచ్చిన జగన్నాథుఁడు సచేతసుల హృదయము నలంకరింపఁ జేసినాఁడు. ఇఁక యితరాలంకారములకు గర్వ మెట్లుండును? సహృదయధురీణులు కొందరు అర్థపరిష్కార మొనరించిన ఏమాయెను? జగన్నాథుని క్లేశము గతార్థము కాదు. స్వయము నిర్మాణదక్షుఁ డైఁ మననతరితీర్ణ విద్యార్ణవుఁ డై జగన్నాథ పండిత నరేంద్రుఁడు కావ్యమీమాంస యొనర్చినాఁడు. "రమణీయార్థక ప్రతిపాదక శబ్దము" కావ్యము. లోకోత్తరాహ్లాద మనువభవ సాక్షికము కావ్యకారణము కేవల ప్రతిభ యొక్కటే. ప్రతిబంధకములు లేకున్నచో చక్కని కావ్య ముదయించును. ఉత్తమోత్తమకావ్యము ధ్వని. ఉత్తమమధ్యమాధములు తరువాతవి. కొన్నిటిలో వ్యంగ్యము చక్కగఁ గోచరింపదు. నాగరికేతర నాయికలు కల్పించిన కాశ్మీరరాగ నిగీర్ణ మయిన నిజాంగగౌరిమ వలె వ్యంగ్యము స్ఫురింపదు. ఏవాచ్య మేని ప్రతీయమానము స్ఫురింపక రమణీయత నాధానింపఁజాలదట! పండితరాయల రసనిర్వచనము అతని కావ్యమీమాంసను "రసగంగాధరము" చేసినది. కావ్యానందము లౌకిక సుఖాంతరసాధారణ కాదు. భగ్నావరణ చైతన్యమే రసము ఇది జగన్నాథ రసరథము. రస మీ ప్రపంచమున పరమాహ్లాదియై రమణీయత నాధానించును.

జగన్నాథులున్నారు. పండితజగన్నాథులున్నారు. పండితరాజజగన్నాథుఁడున్నాఁడు. అతఁడే ఈతడు. కావుననే పీఠభేదములలో పాండిత్యపీఠము జగన్నాథుని గణనములోనికి వచ్చినది. గిరాంపతి పలుకని వాచాదేవి వాకొనని, నేనున్నాను అనువాఁడు పండితరాయ లొక్కఁడే! రసగంగాధరము రచనామర్యాదలు

చూపి ప్రౌఢపరిష్కారము లిచ్చినది. అక్షరతపస్వి జగన్నాథుఁడు. వర్ణముల వర్ణములు గుర్తించినాఁడు. అనుకూల ప్రతికూల వర్ణములు వానికే తెలిసినవి. సుధామధుర మయిన నిర్మలవాచాశిక్షణము జగన్నాథుని సొత్తు. అనర్వాచీనులు సుపరిష్కృతము లొనరింపని కొన్నిటిని వారి పక్షము వహించి పరిష్కరించి నాఁడు. అటునుండి ఇటు కావ్యరచనా పటుప్రజ్ఞు లెవరో! వా రేరి! పలుఁకుఁడు! పృథ్వీకామసృణ రసమాధురీ భాగ్యము కల వాచామాచార్యత నాపలె ననుభవింపఁ గలవాఁడెవ్వఁడు? నేను నేనే యని వాఁడె వాకొనెను. పండిత రాయల దృష్టిలో వ్యంగ్య మష్ట మూర్తి ధరమై భాసించినది. రసగంగాధర మాతనిది ధ్వనిభాష్యము. వ్యాకరణములో పతంజలి భాష్య మున్నది. వేదాంత ములో శంకరభాష్య మున్నది.సాహిత్య దర్శనములో జగన్నాథభాష్య మున్నది. ఆలంకారిక తంత్రము స్వతంత్ర మని పండితరాజు బాజా వాయించినాఁడు. పీయూషయూషకల్ప మయిన అల్పమయిన నాకు నేని వ్రావిన వారికి జగమున నేమియు నిష్టముకాదు.

> ''మద్వాణి మాకురు విషాద మనాదరేణ
> మాత్సర్య మంద మనసాం సహసా బలానాం
> కావ్యారవింద మకరంద మధువ్రతానాం
> ఆస్యేషు యాశ్యసి సతాం విపులం విలాసం''

కొందరున్నారు వా రనుసరింతురులె! అని జగన్నాథుఁడు భావించినాడు.

నేఁడు లోకములో సాహితీ తంత్రీనాదములు సుస్వరములతో సుశ్రుతులతో నుండుటకు పండితరాజ పదారాధనము కావలయును. రసగంగాధరము నవరస గంగాధరముగా నవతరించినది. రసగంగాధరమణి వచ్చినది. ఇంక నెన్నో రావలసి యున్నవి. ఇది జగన్నాథ రసపదవి. విద్యానాథ జగన్నాథులు విద్యా జగములో నాథులయినారు. మనము సనాథుల మయినాము. సాహితీనాథులు నవసృష్టి సంపాదించుటకు విద్యాజగన్నాథావశ్యకత ఎంతేని యున్నది.

భారతి

నవంబరు 1956.

సంపుటము ౩౩, సంచిక 11.

# ఆంధ్రులు - సంస్కృత వాఙ్మయము

— శ్రీ పరవస్తు రామానుజస్వామి

మన దేశము ఆంధ్రదేశము. ఇది దక్షిణ హిందూ దేశమున నాగ్నేయముగా నున్నది. ఇది తూర్పు సముద్రము నానుకొని యున్నది. దీనికి దక్షిణమున తమిళ దేశమును, పశ్చిమమున కర్ణాటక మహారాష్ట్ర దేశములును, ఉత్తరమున ఉత్కళ దేశమును, మధ్యపరగణాలును గలవు. దీని వైశాల్యము లక్ష దెబ్బదివేల చదరపు మైళ్ళు జనసంఖ్య దాదాపు మూడుకోట్లు. జనసంఖ్యను బట్టి మన దేశము హిందూ దేశమున మూడవ స్థానమును బొందియున్నది. ఆంధ్రదేశమునకు త్రిలింగ దేశము, తెలుగు దేశము, తెనుగు దేశము అను నామములు కలవు వీటి నన్నిటిని మనము పర్యాయములుగా భావింపవచ్చును. తెలుగు భాష మిక్కిలి శ్రావ్యమైనది. పాశ్చాత్య దేశములలో ఇటలీ భాషవలె భరతఖండమున తెలుగు భాష మిక్కిలి రమ్యమైనది. అందుచేతనే శ్రీకృష్ణదేవరాయలు "దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స" యని స్తుతించియున్నాడు.

ఆంధ్రజాతి మిక్కిలి పురాతనమైనది. వాఙ్మయమున మొట్టమొదట ఋగ్వేద బ్రాహ్మణ మగు నైతరేయమున నాంధ్రులు పేర్కొనబడి యున్నారు. విశ్వామిత్రుని సంతతివారు కొందరు దక్షిణమునకు వచ్చి యాంధ్రులని వ్యవహరింపఁబడ నారంభించిరి. తరువాత రామాయణమునందును, మహాభారతము నందును ఆంధ్రుల ప్రశంస కలదు. క్రీస్తుశకము ప్రారంభమగుటకు పూర్వమే యాంధ్రరాజులు ప్రబలులై దేశాంతరముల నాక్రమించి పాలించుచుండిరి. క్రీస్తుశకము ప్రారంభమైన పిదప ఆంధ్రదేశమును శాలివాహనులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర చక్రవర్తులు పాలించుచుండిరి. తరువాత నాంధ్రులకు స్వాతంత్ర్యము నశించి వారు దేశాంతరీయులకు సామంతులైరి.

ఆంధ్రు లార్యజాతిలో నొక తెగవారగుటచే వారు మొదటినుండియు నాగరికులైయే యుండిరి. వారు శాస్త్రములయందును, కళలయందును ప్రవీణులై యుండిరి. చిత్రలేఖనము, సంగీతము, కవిత్వము, విదేశ వ్యాపారము మొదలైన వాటిలో నాంధ్రులు నిపుణులుగా నుండిరి. వారు సముద్రయానము

లను జేసి జావా, మలయా, బర్మా, బంగాళము మొదలగు దేశములకు పోయి తమ సంస్కృతి నచ్చట వ్యాపింప జేసిరి. మహారాష్ట్ర, ద్రావిడ దేశములలోనికి ఆంధ్రులు వలసపోయి నివాసము నేర్పరచుకొని యున్నారు. నవీనకాలమున నాంధ్రులు ఖండాంతరములకు కూడ బోయి కీర్తిని సంపాదించియున్నారు.

ఆంధ్రు లార్యజాతికి చెందిన వారగుటచే వారు మొదట సంస్కృతమును, తరువాత ప్రాకృతమును వ్యవహరించుచుండినట్లు తోచుచున్నది. తరువాత వారాంధ్రభాషను వ్యవహరించ నారంభించినను, నార్యులవలె వారికి వ్యావహారిక భాషయం దనాదర మేర్పడినది. అందుచేతనే ఆంధ్రుల వాఙ్మయము పూర్వము సంస్కృతముననను, తరువాత ప్రాకృతముననను గనబడుచున్నది. నవీన కాలముననే వ్యావహారిక భాషలో వాఙ్మయము ప్రారంభమైనది. అందువలన దెనుగు వాఙ్మయము చాల నవీనముగా గనబడుచున్నది. తెలుగు వాఙ్మయమును విడచి యాంధ్రుల సంస్కృత వాఙ్మయమును గూర్చి కొంచె మీ వ్యాసమున బ్రసంగించబడును.

సంస్కృత వాఙ్మయమున నాంధ్రోపజ్ఞమగు భాగము విశేషముగా గలదు. అది సుమారు రెండువేల యైదువందల సంవత్సరములకు పూర్వమునుండి నేటి వరకును సాగుచునే యున్నది.

వేదమునందలి మంత్రబ్రాహ్మణ భాగములలో నాంధ్రదేశమునకు జెందిన ప్రత్యేక శాఖ యగుపడుటలేదు. కాని సూత్రకాలము నాటికి ఆంధ్రుల యాచార వ్యవహారములు కొంత మారి ప్రత్యేక శాఖగా నేర్పడినట్లు తోచు చున్నది. ఆపస్తంబ ఋషి యాంధ్రుడనియు, గోదావరీప్రాంత నివాసి యనియు ప్రతీతి కలదు. అతనొక కల్పసూత్రమును రచించి యాంధ్రుల శాఖను స్థిర పరచియున్నాడు. ఆపస్తంబ కల్పసూత్రమున లేని విషయములు బోధాయన కల్పసూత్రమునుండి గ్రహించ వలయు నను ప్రతీతి యాపస్తంబశాఖ వారందరిచే నంగీకరింపబడిన దని సూచించు చున్నది. ఆపస్తంబ కల్పసూత్రము కంటె ప్రాచీనమగు నాంధ్రరచిత సంస్కృత గ్రంథము కనబడుటలేదు. ఆపస్తంబ ఋషి కాలమును మనము నిర్ణయింపలేము. క్రీస్తు జన్మించుటకు పూర్వ మైదవ శతాబ్దముకంటె నవీనుడు కాడని పాశ్చాత్య విద్వాంసుల యాశయము. ప్రాచ్యగ్రంథకర్తల కాలములను నిర్ణయించుటలో పాశ్చాత్య పండితుల వరావధినే సూచించుచుందురు.

క్రీస్తు జన్మించుటకు పూర్వము మొదటి శతాబ్దమున ఆంధ్రదేశమును శాతవాహనుడు పాలించుచుండెను. ఇతని కాలమున నింకను సంస్కృతము

వ్యవహారములో నుండినట్లు తెలియుచున్నది. ఈయన రాణులలో నొకర్తెయగు విష్ణుశక్తియను రాజుకూతురు మంచి సంస్కృత పాండిత్యమును సంపాదించెను. రాజు మాత్రము సంస్కృత పాండిత్యమున వెనుకబడి యుండెను. ఒకనా డామె యందుకు రాజును హాస్యము చేయగా నతడు దానికి నొచ్చుకొని వెంటనే సంస్కృతము నభ్యసించి మంచి పాండిత్యము నచిరకాలములోనే సంపాదించె నని యొక గాథ కలదు. ఇందును శర్వవర్మ యను పండితమంత్రి యతనికి సహకారి యయ్యెను. శర్వవర్మ కాతంత్ర మను సంస్కృత వ్యాకరణమును వ్రాసెను. పాణినీయ వ్యాకరణము కఠినముగా నుండుటచే సంస్కృతభాషను సులభముగా బోధించుటకీ గ్రంథము రచియింపఁబడినదని కథాసరిత్సాగరమున చెప్పఁబడి యున్నది. దీనిని పఠించి శాతవాహనుఁడు సంస్కృతమును స్వల్పకాలములో నేర్చుకొనెనట. ఈ కాతంత్ర వ్యాకరణోత్పత్తి వృత్తాంత మును బట్టి యీ గ్రంథ మాంధ్రరచితమని మనము చెప్పవచ్చును. అరవ వ్యాకరణ మగు తొల్కాప్పియ మీ కాతంత్రము ననుసరించి వ్రాయబడి యుండుట గూడ నీ కాతంత్రము దక్షిణదేశమున రచియింపబడినదని సూచించు చున్నది.

గుణాఢ్యు డను మరియొక పండితుఁడు శాతవాహనుని యాస్థానమున నుండెను. రాజునకు స్వల్పకాలములో సంస్కృతమును నేర్పు సందర్భమున గుణాఢ్యుడు శర్వవర్మ కోడిపోయి సంస్కృతభాషను సన్యసించి, పైశాచీభాష నభ్యసించి దానిని వ్యవహరించుచుండెను. ఆ భాషయందు బృహత్కథ యను గొప్ప గ్రంథమును రచించెను. ఈ గ్రంథమును రాజున కంకితము చేయ గోరెను. కాని, రాజా గ్రంథమునం దనాదరము చూపెను. ఈ యవమా నము నోర్వజాలక గుణాఢ్యు డడవి కేగి తన పుస్తక పత్రములను చదివి చదివి తగులబెట్ట నారంభించెను. ఈ సంగతిని రాజు విని పశ్చాత్తప్తుడై పోయి దగ్ధశేషమగు గ్రంథభాగమును దెచ్చి రక్షించెను. ఇది గూడ నిప్పుడు లేదు. కాని దీని విషయమును సంక్షేపించి చెప్పు రెండు సంస్కృత గ్రంథ ములు మాత్రము కలవు. వీని పేర్లు బృహత్కథామంజరి, (బృహత్) కథా సరిత్సాగరములు. వీనినిబట్టి బృహత్కథ స్వరూపమును మనము కొంత యూహింపవచ్చును. పైశాచీభాషయం దున్నను బృహత్కథ యాంధ్రగ్రంథ మని మనము చెప్పవచ్చును.

క్రీస్తుశకము ప్రథమశతాబ్దమున హాలశాతవాహనుఁ డాంధ్రదేశమును పాలించుచుండెను ఈ మహారాజుయొక్క యాస్థానమున కవులును, పండితులును

విశేషాదరమును పొందుచుండిరి. ఈయనకు దేశభాషయం దభిమానము హెచ్చు. ఈయన సప్తశతి యను నీతిబోధక శృంగారకావ్యమును రచించెను. ఇది యేడునూర్ల ముక్తక శ్లోకముల సంపుటము. మహారాష్ట్రి ప్రాకృతమున వ్రాయ బడియున్నది. ఈ గ్రంథమును బాణుఁడు తన హర్షచరితమున నిట్లు స్తుతించి యున్నాడు :

"అవినాశిన మగ్రామ్య మకరో త్సాతవాహనః
విశుద్ధజాతిభిః కోశం రత్నైరివ సుభాషితైః."

తరువాత సుమా రేడెనిమిదివందల సంవత్సరములవరకును మన యాంధ్రదేశమున వాఙ్మయాభివృద్ధి జరిగిన ట్లగపడదు. ప్రజలలో రాజకీయ సంక్షోభ మధికముగా నుండిన ట్లగపడుచున్నది. రాజులు తరచుగ మారుచుండిరి. రాజవంశములు మారుచుండెను. అరాచక మేర్పడుచుండెను. రాజధానులు మారు చుండెను. ఆర్య సంస్కృతియం దభిమానము తగ్గుచువచ్చెను. ఆర్యభాష వెనుక బడెను. దేశభాష ప్రాముఖ్యమును బడయ నారంభించెను. దేశీయకళ లభివృద్ధి చెందెను. ఇట్టిస్థితిలో సంస్కృత గ్రంథములు రచింపబడకపోవుటలో విశేషము లేదు. వైదికమతము క్రమముగా నడుగున బడి, కర్మమార్గమును ప్రజలు విడ నాడి, భక్తిప్రపత్తుల నవలంబించుకొని ప్రజలు క్రొత్త మతములను కల్పించిరి. ఈ మతములను దేశభాషల మూలమున బ్రచారము చేయుచు, మతగ్రంథములను దేశభాషలలోనే రచియించుచుండిరి. కాని, ప్రాచీనార్యనాగరకతయు, ఆర్య భాషయు వాని చిహ్నములను చూపుచునే యుండినవి. ద్రావిడాచారములలో నార్యాచారములు మిశ్రితములైనవి. ద్రావిడభాషలలో సంస్కృతపదములు విశేష ముగా ప్రవేశించినవి. ద్రావిడ వాఙ్మయము సంస్కృతవాఙ్మయచ్ఛాయను నడచి నది. కాని క్రమముగా ౧౨, ౧౩ శతాబ్దములనాటికి తిరిగియు సంస్కృతభాషలో గ్రంథములు రచింపబడుటకు ప్రారంభమైనది. కాని యీపర్యాయము ద్రావిడ సంస్కృతవాఙ్మయములు రెండును జోడుగా నడిచినని.

ఈ మధ్యకాలమున వెలువడిన గ్రంథములు కనబడకపోయినను సంస్కృ తమున వ్రాయబడిన శాసనము లనేకములు కలవు. ఇవి యుత్కృష్టమైన కావ్య శైలిలో వ్రాయబడి గద్య పద్య మిశ్రముగా నున్నవి. కాబట్టి వీని రచయితలు కావ్యరచన చేయుటకు సమర్థు లని మన మూహింపవచ్చును. కావ్యములను వ్రాసి

నను వ్రాసియుండవచ్చును. మచ్చునకు శాసనములలోని కొన్ని పద్యములును, కొంత గద్యయు క్రింద జూపబడినవి

"రణపరాక్రమలబ్ధ జయశ్రియాసపది యేన విరుగ్ణ మశేషతః
నృపతి గన్ధగజేన మహౌజసా పృథుకదమ్బకదమ్బకదమ్బకమ్.

అపరిమిత విభూతిస్ఫీతసామన్తసేనా
మకుటమణిమయూఖాక్రాంతపాదారవిన్దః,
యుధి పతితగజేన్ద్రానీకభీభత్సభూతో
భయవిగలితహర్షో యేన చాకారి హర్షః.

ఉత్సాహ ప్రభుమన్త్రశక్తి సహితే యస్మిన్ సమన్తాద్దిశో
జిత్వా భూమిపతీన్ విసృజ్య మహితా నారాధ్య దేవద్విజాన్
వాతాపీం నగరీం ప్రవిశ్య నగరీ మేకా మి వోర్వీ మిమాం
చఞ్చన్నీరధి నీలనీరపరిఖాం సత్యాశ్రయే శాసతి."

"సమాశ్రితానాం కామధేనుచరితస్య యస్య చ శస్త్ర మాపన్నత్రాణాయ, విగ్రహః పరాభిమానభఙ్గాయ- శిక్షితం వినయాయ, విభవార్జనం ప్రదానాయ, ప్రదానం ధర్మాయ, ధర్మః శ్రేయోవాప్తయే,- తస్యతనయః శశధర ఇవ సర్వ లోకహృదయానన్దకరః, సురగజ ఇవావిచ్ఛిన్న దానసలిలకీర్ణనికేతః, చక్రధర ఇవాప్రతిహత చక్రో, ద్రోణ ఇవ కృపానుగతః. స్వబాహుబలోపార్జిత సర్వసిద్ధిః. సమరశత సంకటోత్థంత విజయవీర ధ్వజః సకాలావనీపతి మకుటతటఘటితమణి మయూఖపుంజమంజరితచరణసరోరుహః స్వగుణానురక్త ప్రకృతి సంపాదిత సర్వసంపత్ శ్రీ జయసింహవల్లభ మహారాజః పరమబ్రహ్మణ్యో మాతాపితృ పాదానుధ్యాత త్రింశద్వర్షాణి వేంగిదేశ మపాలయత్.. ......"*

౧౧ వ శతాబ్ద ప్రారంభమున రాజరాజరేంద్రుడు తన శక్తిసామర్థ్యము లచే ఆంధ్రదేశమును శాంతముగా జేసెను. అందుచేత నీయనకాలమున వాఙ్మ యము తిరిగి మొలకెత్తినది. ఈయన యాంధ్రభాషకు పోషకుడుగా నుండెను.

* ఈ సంస్కృత గద్య పద్య భాగములు శ్రీ పరవస్తు లక్ష్మీనరసింహ స్వామి గారిచే సంకలితమగు చాలుక్య చరితమునుండి గ్రహింపబడినవి,

ఈయన యాస్థానకవి యైన నన్నయభట్టారకు డీయన నీ క్రిందివిధముగా ప్రశం సించి యున్నాడు :

> ''రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజ తే
> జోజయశాలి శౌర్యుడు విశుద్ధ యశశ్శరదిందు చంద్రికా
> రాజిత సర్వలోకుఁడు పరాజితభూరిభుజాకృపాణధా
> రాజయశాంతి శాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్.''

నన్నయభట్టు రాజాజ్ఞచే తెనుగున మహాభారతమును రచియించినను సంస్కృతమున ఆంధ్రశబ్దచింతామణి యను నాంధ్రవ్యాకరణమును రచించె నని కొందరు పండితుల సిద్ధాంతము.

ఈ కాలముననే వైష్ణవ మత ప్రచారకులు కొందరు తమ మతమును వేద సమ్మితము చేయవలయునని తమ మతానుసారముగా నుపనిషత్తులకును, వేదాన్త సూత్రములకును వ్యాఖ్యానములు వ్రాసిరి. వారిలో శ్రీ రామానుజాచార్యులు ముఖ్యులు. ఈయన సంస్కృతగ్రంథములు విశిష్టాద్వైత మతమునకు పునాదులైనవి. శ్రీరామానుజాచార్యులు ఆసూరివంశమునకు చెందినవారని ప్రతీతి కలదు. ఆసూరివారు సుప్రసిద్ధాంధ్రవైష్ణవులు. ఈయన వ్రాసిన బ్రహ్మసూత్రభాష్యమునకు శ్రీభాష్య మని పేరు దీని శైలి అతి గంభీరముగా నుండును. ఈయన భగవద్గీత కొక భాష్యమును వ్రాసిరి. వేదార్థసంగ్రహ మను మరియొక గ్రంథమున వేదమంత్రములను విశిష్టాద్వైతపరముగా సమన్వయము చేసియున్నారు. శరీర శరీరిసిద్ధాంతమును స్థాపించి యభేదశ్రుతులను విశిష్టాద్వైతపరముగా సాధించిరి. ఈయన గద్యత్రయ మను మరియొక సంస్కృతస్తోత్ర గ్రంథమును వ్రాసిరి. యామునాచార్యులవా రీయనకు గురువును, కొంచెము ప్రాచీనుడుగాను నుండెను. ఆయన యాగమప్రామాణ్య మను సంస్కృత గ్రంథమును రచియించి పాంచరాత్రాగమము వైదికులకు గ్రాహ్య మని నిరూపించిరి. ఈయన సిద్ధిత్రయ మను, మరియొక వేదాంతగ్రంథమును, స్తోత్రరత్న మను స్తోత్రమును సంస్కృతమున రచించెను. రామానుజాచార్యుల మొదటి గురువగు యాదవప్రకాశుడు వైజయంతి యను గొప్ప సంస్కృత నిఘంటువును, బ్రహ్మసూత్రములకు భాష్యమును రచియించెను.

౮ వ శతాబ్దమున భవభూతి తన యుత్తరరామచరిత నాటకమునను మాలతీ మాధవ ప్రకరణమునను గోదావరీనదీ ప్రాంతములను విశేషముగా

వర్ణించి యున్నాడు. శ్రీశైలక్షేత్రమును మాలతీ మాధవమున బేర్కొని యున్నాడు. దీనిని బట్టి యిత డాంధ్రదేశమున నుండినట్లు తెలియుచున్నది. తా నుదుంబర వంశమునకు జెందినవాడనని చెప్పుకొని యున్నాడు. ఉదుంబరులు త్రిలింగ బ్రాహ్మణు లని ప్రతీతి కలదు. ఇతడు దాక్షిణాత్యు డగుటచేతనే కాబోలును ఇతని నాటకములు సకలజనాదరణీయములు కాలేదు. నిరాదరణవల్ల ఇతనికి కోపము వచ్చి యాదరించని వారి నిట్లు దూషించియున్నాడు :

''యేనామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞానం
జానన్తి తే కి మపి తా న్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే హి మమకోఽపి సమానజన్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.''

౧౩ వ శతాబ్దమున కాకతీయవంశపు రాజగు రెండవ ప్రతాపరుద్రుడు సంస్కృతకవుల నాదరించుటయే కాక తానుకూడ గ్రంథములను రచియించెను. యయాతిచరిత మను నేడంకముల నాటకమును, ఉషారాగోదయ మను నాటికను ఇతను రచించెను. ఇతని నాశ్రయించియుండిన విద్యానాథుడు (అగస్త్యుడు) తన ప్రతాపరుద్రీయ మను నలంకారగ్రంథము నితని కంకితము చేసి యుదాహరణ శ్లోకముల నన్నిటిని నితని ప్రశస్తితో రచియించెను. ఈ పుస్తకము నిట్లు ప్రతాపరుద్రున కంకిత మిచ్చినందుబకు కవిరాజువలన నేమియు గౌరవము లభించక పోయినను, లోక మితనిని విశేషముగా గౌరవించినది. అలంకార శాస్త్రమున ప్రవేశము గోరువా రందరును నాంధ్రదేశమున నీ పుస్తకమునే ప్రథమమున జదువుటచే దీనికి వ్యాప్తి యధికముగా నున్నది.

ప్రతాపరుద్రదేవుని నాశ్రయించుకొని యగస్త్యు డను కవి యుండెను. ఇతడు తన పాండిత్యప్రకర్షచే విద్యానాథు డను బిరుదమును సంపాదించె ననియు, నా పేరుతో ప్రతాపరుద్రీయమును రచియించె ననియు నొక సిద్ధాంతము కలదు. దీనికి ప్రతారుద్రీయములోని యీ క్రింది శ్లోక మాధారము :

''ఔన్నత్యం యది వర్ణ్యతే శిఖరిణః క్రుధ్యన్తి నీచైః కృతా
గామ్భీర్యం యది కీర్త్యతే జలధయః క్షుభ్యన్తి గాధీకృతాః
తత్త్వాం వర్ణయితుం బిభేమిః యదివా జాతోఽస్మ్యగ స్త్యస్త్వితః
తత్పార్శ్వే గుణరత్న రోహణగిరే శ్రీ వీరరుద్రప్రభో.''

అగస్త్యుడు గొప్పపండితుడు. ఇతని ప్రతిభను రాజచూడామణి దీక్షితు డిట్లు వర్ణించియున్నాడు :

"జడాశయానాం హృదయం జగత్యాం
యస్యోదయా ద్యాతితమాం ప్రసాదం
స ఏవ సారస్వత మర్మవేదీ
విభాతి మౌళౌ విదుషా మగస్త్యః."

గంగాదేవి తన మధురావిజయమున నగస్త్యుడు గొప్పకవి యనియు, ౭౪ కావ్యములను రచించె ననియు చెప్పియున్నది.

"చతుస్సప్తతి కావ్యోక్తి వ్యక్త వైదుష్య సంపదే
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయే త్కో నకోవిదః."

ఇతడు సంస్కృతవాఙ్మయమునకు గొప్పసేవను జేసె నని చెప్ప వచ్చును. ఇతడు బాలభారత మనుకావ్యమున మహాభారతకథ నంతను వర్ణించి యున్నాడు. ఇందు కృష్ణచరిత మను నొక గద్యకావ్యమును గూడ రచియించెను. నలకీర్తికౌముది యను కావ్యము రెండుసర్గల వరకు మాత్రము లభించుచున్నది. మిగిలిన గ్రంథము లిప్పటికి బైలుపడలేదు.

గంగాదేవి బుక్కరాయని రెండవకుమారుని భార్య. ఆమె మధురావిజయ మను కావ్యమున తనభర్తయొక్క విజయయాత్రలను వర్ణించెను. ఇందు విద్యా నగరవర్ణన మతిచిత్రముగా నున్నది.

మాధవాచార్యుడు సన్యసించి విద్యారణ్యస్వామి యను నామముతో శృంగేరీ పీఠాధిపతి యయ్యెను. ఈయన సర్వతంత్రస్వతంత్రుడు. వేదమున, వేదాంతమున, ధర్మశాస్త్రమున, వ్యాకరణమున, పూర్వమీమాంసమున, వైద్య మున గ్రంథములను రచించెను. నాలుగువేదములపైని విద్యారణ్యభాష్యము జగత్ప్రసిద్ధమైనది. ఈ భాష్యరచనలో మాత్ర మీయనతమ్ముడగు సాయనుడు సహాయము చేసియుండవలెను. అందుచేతనే వానికి సాయనకృతము లని కూడ ప్రసిద్ధి కలిగినది. జైమినీయ న్యాయమాల యను గ్రంథమున పూర్వమీమాంసా శాస్త్రవిషయమునంతను సంక్షేపముగా శ్లోకరూపమున వ్రాసియున్నాడు. ఈయన

పరాశరస్మృతికి వ్యాఖ్యానమును వ్రాసి, స్మృతిలో లేని యనేక విషయములను వ్యాఖ్యలో చేర్చియున్నాడు. వ్యాకరణమున ధాతుపాఠమునకు వృత్తిని వ్రాసెను. సర్వదర్శన సంగ్రహమున నన్నిదర్శనముల సిద్ధాంతములను సంక్షేపముగా వ్రాసెను. శంకర విజయ మను గ్రంథమున శ్రీ శంకరాచార్యుల చరిత్రను వ్రాసెను. సాయణాచార్యుడు సుభాషిత సుధానిది యనియు, అలంకారసుధానిధి యనియు రెండు గ్రంథములను రచించెను.

భాస్కరుడు తన యున్మత్తరాఘవమున తా నా యేకాంకమును విద్యారణ్యుని సేవించుటకు వచ్చిన పండితసమూహవినోదార్థము వ్రాసితి నని చెప్పుకొనియున్నాడు.

ప్రతాపరుద్రదేవుని యాశ్రితు డగు విశ్వనాథుడు సౌగంధికాపహరణ మను నేకాంకికను రచియించెను. ఇందు భీమునకును నాంజనేయునకును సంవాద మతి మనోహరముగ నున్నది. ఇత డగస్త్యునకు మేనల్లు డని చెప్పుచున్నారు.

ప్రతాపరుద్రదేవుని యాస్థానమున భల్లటు డను కవి యుండెను. ఇతడు నాట్యశేఖర మను నాట్యగ్రంథమును రచియించెను.

నరహరి యను నతడు కడపప్రాంతమువాడు. ఇతడు సన్యసించి సరస్వతీతీర్థు డను నామమును గ్రహించెను. ౧౩ వ శతాబ్దపువాడు. ఇతడు మమ్మటుని కావ్యప్రకాశమున కొక వాఖ్యానమును వ్రాసెను.

సింగభూపాలుడు క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమున వెంకటగిరిలో రాజుగా నుండెను. ఇతడు పండితుల నాదరించుచుండుటయే కాక తాను కూడ గ్రంథములను వ్రాసెను. ఇతడు నాటకపరిభాష యనియు, రసార్ణవసుధాకర మనియు రెండు నాటకలక్షణ గ్రంథములను రచించెను. రసార్ణవసుధాకరమున ఉదాహరణములు వివిధనాటకములనుండి గ్రహింపబడి యున్నవి. అందుచేత నిత డనేకగ్రంథములను చదివినట్లు తెలియుచున్నది. ఇతని యాశ్రితుడైన విశ్వేశ్వరకవి చమత్కారచంద్రిక యను నలంకార గ్రంథమును రచించెను. ఇం దుదాహరణము లన్నియు సింగభూపాలుని స్తుతులుగా నున్నవి. ఇతడు కందర్పసంభవ మను నొక నాటకమును వ్రాసిన ట్లీ గ్రంథమును బట్టియు, రసార్ణవసుధాకరమును బట్టియు దెలియుచున్నది.

విశ్వనాథుడు ౧౪-వ శతాబ్దమున కళింగదేశమున నివసించుచుండెను. ఇతని సాహిత్యదర్పణ మతిప్రసిద్ధమైన గ్రంథము. అలంకారశాస్త్రమున కావ్య ప్రకాశము తరువాత నిదియే విపులమైన గ్రంథము. అలంకారవాదార్థమున నిత డలంకారవిషయములను చర్చించెను. సాహిత్యదర్పణములోని యుదాహరణము లను బట్టి యితడు రాఘవవిలాసము, నారసింహవిజయము అను సంస్కృతకావ్యము లను, కువలయాశ్వచరిత మను ప్రాకృతకావ్యమును, చంద్రకళ, ప్రభావతీ పరిణయము అను నాటకములను గూడ రచియించినట్లు తెలియుచున్నది. ప్రశస్తి రత్నావళిలో నితడు ౧౬ భాషలలో ప్రశస్తులు వ్రాసెను.

గోదావరీమండలవాసి యగు మరియొక విశ్వనాథుడు సాహిత్యసుధాసింధు వను నలంకారగ్రంథమును, మృగాంకలేఖ యను నాటికను రచియించెను.

కాటయవేముడు ౧౪వ శతాబ్దముచివరను కొండవీట నుండెను. ఇతడు కుమారగిరి యాజ్ఞానుసారము, కాళిదాసు నాటకములకు కుమారగిరిరాజీయ మను వ్యాఖ్యానములను రచించెను.

పెదకోమటి వేమారెడ్డి (వేమభూపాలుడు) కొండవీట ౧౫వ శతాబ్ద ప్రారం భమున రాజుగా నుండెను. ఇత డనేకగ్రంథములను రచించెను. పండితుల నాద రించుచుండెను. ఇతనికి వీరనారాయణు డను బిరుదము కలదు. ఇతడు సాహిత్య చింతామణి యను నొక యలంకార గ్రంథమును, సంగీత చింతామణి యను సంగీత గ్రంథమును రచియించెను. ఈ రెండును గొప్ప గ్రంథములు. ఇత డమరకోశమునకొక వ్యాఖ్యను గూడ వ్రాసెను.

వామనుడు విద్యారణ్యుని శిష్యుడు. ఇతని పూర్వవయస్సు విజయనగర ములో గడిచినది. తరువాత నితడు కొండవీటి కోమటివేమారెడ్డి నాశ్రయించెను. ఇత డనేక శాస్త్రములలో పండితుడు. ఇతడు బాణునిమీద స్పర్థవహించి యతని గద్యకావ్యముల బోలిన గద్యకావ్యములను వ్రాయబూనెను.

"బాణకవీన్ద్రా ద న్యేకాణాః ఖలు సరస గద్యసరణీషు
ఇతి జగతి రూఢయశసో వత్సకులో వామనోఽధునా మూర్ష్ని."

ఇతడు శృంగారభూషణ భాణమున విద్యానగరప్రజల సుఖజీవనమును బాగుగ వర్ణించియున్నాడు. పార్వతీపరిణయమున కుమారసంభవకథను నాటక

రూపమున వ్రాసెను. ఇతడు కనకలేఖ యను నొక నాటికను గూడ వ్రాసెను. ఎనిమిది సర్గల నలాభ్యుదయము, 30 సర్గల రఘునాథ చరితము అను రెండు కావ్యములను రచియించెను. హంససందేశ మను సందేశ కావ్యము నొకదానిని వ్రాసెను. అన్నిటి కంటె ముఖ్యమైనదియు, ప్రసిద్ధమైనదియు నగు వామనుని పుస్తకము వేమభూపాల చరిత మను వీరనారాయణ చరితము. బాణుడు తన రాజగు హర్షునిచరితము వ్రాసినట్లు వామనుడు తన రాజగు వేమభూపాలు డను వీరనారాయణుని చరితమును వ్రాసెను.

గోపేంద్ర తిప్ప (త్రిపురహర) భూపాలుడు విజయనగర సాలువ వంశమునకు జెందినవాడు. ఇతడు గూ౧౫వ శతాబ్దపువాడు. ఇతడు వామనుని కావ్యాలంకార సూత్రవృత్తికి కామధేను వను వ్యాఖ్యానమును, తాళదీపిక యను సంగీత గ్రంథమును రచియించెను.

౧౫వ శతాబ్దముననే కోలాచల మల్లినాథు డనేక కావ్యములకు వ్యాఖ్యానములను వ్రాసెను. సంస్కృత మేమాత్ర మభ్యసించిన వారైనను ఇతని వ్యాఖ్యానములను చూడకుండ నుండరు. మల్లినాథుడు విద్యాధరుని (౧౩ శతాబ్దము) ఏకావళి యను నలంకారగ్రంథమునకు గూడ వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతని కుమారుడు కుమారస్వామి ప్రతాపరుద్రీయమునకు "రత్నాపణ" మను వ్యాఖ్యానమును వ్రాసెను.

హరిహరరాయని యాస్థానమున లోలంబరా జుండెడివాడు. అతడు గొప్ప కవియు, ఆయుర్వేదవేత్తయును. అతడు వైద్యగ్రంథములనే కాక హరివిలాసము, సులదర దామోదరము అను రెండు కావ్యములను రచియించెను.

హరిహరరాయని కుమారు డగు విరూపాక్షుడు నారాయణవిలాసమను నైదంకముల నాటకమును ఉన్మత్తరాఘవము అను అంకమును రచియించెను. ఇతని యాస్థానమున నుండిన మాధవు డనుకవి నరకాసురవిజయ మను కావ్యమును రచియించెను.

ప్రౌఢదేవరాయలు రతిరత్నప్రదీపిక యను గ్రంథమున రతిరహస్యములను వర్ణించెను. సాలువ నరసింహరాయుడు (౧౫వ శతాబ్దము) రామాభ్యుదయ మను ౨౪ సర్గల కావ్యమును రచియించెను.

కృష్ణదేవరాయలు ౧౬ వ శతాబ్ద ప్రారంభమున రాజ్యము నేలుచుండెను. అతడు గొప్పపరాక్రమశాలియే కాక గొప్ప పండితుడును, పండితపక్షపాతియును కూడ. ఇతడు ఉషాపరిణయము, జాంబవతీ కల్యాణము నను రెండు నాటకములను రచియించెను. ఇతడు మరికొన్ని గ్రంథములను రచియించినట్లు తన యాముక్త మాల్యదలో చెప్పుకొని యున్నాడు గాని యవి యిప్పుడు లభ్యములు కాకుండ నున్నవి. అవి యేవి యనిన-మదాలసా చరిత్రము, సత్యావధూసాంత్వనము, సకలకథాసారసంగ్రహము, రసమంజరి, జ్ఞానచింతామణి.

తిరుమలాంబచే వ్రాయబడిన వరదాంబికా పరిణయమున అచ్యుతరాయని కిని వరదాంబకును వివాహమును, పుత్రజననమును వర్ణింపబడియున్నవి.

విజయనగర రాజుల యాస్థానమున డిండిమ కవులు ప్రసిద్ధిగాంచి యుండిరి. అరుణగిరినాథుడు (౧౫ వ శతాబ్దము) సోమవల్లీయోగానంద మను ప్రహసనమును రచియించెను. అరుణగిరినాథుని కుమారుడు రాజనాథుడు సాలు వాభ్యుదయ మను కావ్యమును రచించి యందు సాలువ నరసింహుని ప్రతాప మును వర్ణించెను. రాజనాథుని దౌహిత్రుడు శివసూర్యుడు పాండవాభ్యుదయమను కావ్యమున మహాభారత కథను వర్ణించెను. ఇతని కుమారుడు భాస్కరుడు వల్లీ పరిణయ మను నాటకమును రచియించెను. అభిరామకామాక్షి అభినవరామాభ్యు దయ మను కావ్యమును రచియించెను. రాజనాథుని కుమారుడు అరుణగిరినాథుడు (౧౬ వ శతాబ్దము) వీరభద్ర విజయ మను డిమమును రచించెను. ఇందు దక్ష యజ్ఞము వర్ణింపబడినది. ఇతని కుమారుడు రాజనాథుడు అచ్యుతదేవరాయల కోరికపైని భాగవత చంపువును వ్రాసెను. ఇతడు అచ్యుతరామాభ్యుదయ మను కావ్యమున నచ్యుతరాయని దక్షిణ దేశయాత్రను వర్ణించియున్నాడు. రాజనాథుని యల్లుడు మల్లికార్జునుడు సత్యభామా పరిణయ మను నాటకమును రచియించెను. రాజనాథుని దౌహిత్రు డగు స్వాయంభూనాథుడు శంకరానంద చంపువును వ్రాసెను. ఇందు కిరాతార్జునీయ కథ వర్ణింపబడినది. ఇతడు కృష్ణవిలాస మను కావ్యమున కృష్ణచరిత్రమును వర్ణించెను. ధర్మసుధీ-లేక-ధర్మభట్టు (౧౬ వ శతాబ్దము) కృష్ణాపుండలము వ్రా.సు. ఇతడు పశ్చిమవయస్సున సన్యసించి వారణాసిలో నివాస మేర్పరచుకొనెను. ఇతడు న్యాయశాస్త్రపండితుడు. సాహిత్య రత్నాకర మను నలంకార గ్రంథమును రచించెను. ఇం దుదాహరణ శ్లోకము లన్నియు రామప్రశస్తులుగా నున్నవి. ఇతడు శంకర భాష్యమునకు రత్నప్రభ యను వ్యాఖ్యానమును వ్రాసెను. హంస సందేశ మను ప్రాకృతకావ్యమును రచి

యించెను. మరియు బాలభాగవత మను కావ్యమును, నరకాసురవధ యను వ్యాయోగమును, కృష్ణస్తుతి యను స్తోత్రమును రచియించెను. సాహిత్య రత్నాకరమునకు చర్ల వెంకటశాస్త్రి నౌక యను వ్యాఖ్యానమును, మల్లాది లక్ష్మినారాయణశాస్త్రి మందర యను వ్యాఖ్యానమును, మధుసూదనశర్మ నౌక యను వ్యాఖ్యానమును రచియించిరి.

కృష్ణదేవరాయల యాస్థానమున సంగీత విద్వాంసుడుగా (వాగ్గేయకారుడు) నుండిన లక్ష్మినారాయణుడు సంగీతసూర్యోదయ మను ౫ అధ్యాయముల గ్రంథమును రచియించెను. ఇందు తాలము, వృత్తము, స్వరగీతము, జాతి, ప్రబంధము నిరూపింపబడినవి.

లక్ష్మీధరుడు తిరుమలరాయని యాస్థానమునకు చెందినవాడు. ఇతడు గీత గోవిందమునకు వ్యాఖ్యానమును, భరతశాస్త్రమును, ఋతుక్రీడావివేకమును రచియించి యున్నాడు.

జగన్నాథుడు (పండితరాజు) ముంగండలో పుట్టిన వేగినాటి బ్రాహ్మణుడు. ఇతడు ఢిల్లీ సుల్తానగు షాజహాన్ (౧౬౨౮-౧౬౫౮) ఆస్థానమున నుండెను. షాజహాన్ కుమారుడు దారాకు జగన్నాథుని మీద మిక్కిలి ప్రీతి. ఇతడు అప్పయ్య దీక్షితుని చిత్రమీమాంసకు ఖండన మగు చిత్రమీమాంసాఖండనమును, రసగంగాధర మను స్వతంత్ర అలంకార గ్రంథమును రచించెను. రెండును అసంపూర్ణములే. ఇత డనేక చిన్నకావ్యములను (ఖండకావ్యములను) వ్రాసెను. ఇవి గంగాలహరి, అమృతలహరి, లక్ష్మీలహరి మొదలైనవి. వీటి యన్నిటికంటె నితని భామినీ విలాసము (పండితరాయ శతకము) ప్రసిద్ధమైనది ఇందు అన్యోక్తులు విశేషముగా నున్నవి. ఇతడు వ్యాకరణమున గూడ పండితుడు. భట్టోజీ దీక్షితుని మనోరమకు మనోరమాకుచమర్దన మను వ్యాఖ్యానమును వ్రాసెను ఇతడు భట్టోజీదీక్షితుని గ్రంథమును ఖండించుటకు కారణ మేమనగా భట్టోజీ దీక్షితుడు శేషకృష్ణునివద్ద విద్య నభ్యసించి, యతని తండ్రిచే రచియింపబడిన ప్రక్రియాకౌముదిని తన సిద్ధాంత కౌముదిలో ఖండించెను. ఇట్లతడు గురుద్రోహి యని పండితరాజు కోపముతో నతని గ్రంథమును ఖండించెను. అప్పయ దీక్షితుడు తనను చూచుట కంగీకరింప లేదని యతని గ్రంథమును జగన్నాథుడు ఖండించెను.

శేషకృష్ణుని కుమారుడు వీరేశ్వరుడు. ఇతని యొద్ద పండితరాజును, అన్నంభట్టును చదువుకొనినట్లు తెలియుచున్నది. ఇతని సోదరుడు నారాయణుడు. శేష

కృష్ణుని సోదరుడు చింతామణి. వీరితండ్రి శేషనరసింహుడు. ఈ శేషవంశము వారు గొప్ప శాబ్దికులు. వీరు గోదావరీ మండలమువారు. తరువాత వారణాసికి పోయి యచ్చట నివాసము నేర్పరచుకొనినట్లున్నది. వీరు దక్షిణ దేశమున వ్యాకరణ ప్రవర్తకులు. శేషనరసింహులు గోవిందార్ణవ మను ధర్మశాస్త్ర గ్రంథము వ్రాసెను. ఇతని కుమారుడు చింతామణి రుక్మిణీహరణ మను నాటకమును, రసమంజరీ పరిమళాది మరికొన్ని గ్రంథములను రచియించెను. చింతామణి సోదరుడగు కృష్ణుడనేక గ్రంథములను రచించెను, కంసవధము, మురారి విజయము, ముక్తాచరితము, సత్యభామాపరిణయము అను నాటకములును, పారిజాతాపహరణము, ఉషాపరిణయము, సత్యభామా విలాసము అను చంపువులును ఇతని కృతులు. నారాయణుడు మహాభాష్యమునకు సూక్తి రత్నాకర మను వ్యాఖ్యానమును వ్రాసెను. వీరేశ్వరుని కుమారుడగు రామచంద్రుడు రామచంద్రుని ప్రక్రియా కౌముదికి ప్రక్రియాప్రకాశ మను వ్యాఖ్యానమును వ్రాసెను. పాణిని యష్టాధ్యాయీ సూత్రములను వరుసమార్చి ప్రకరణము లేర్పరచి వృత్తులను వ్రాసిన వారిలో రామచంద్రుడే ప్రథముడని చెప్పవచ్చును. భట్టోజీ దీక్షితు డీప్రక్రియా కౌముదిని చూచియే తన సిద్ధాంత కౌముదిని వ్రాసెను.

చిదంబరు డను కవి విజయనగర రాజగు వెంకటుని (౧౫౮౬-౧౬౧౪) యాస్థానమునకు చెందినవాడు. ఇతడు బహుగ్రంథకర్త. రాఘవయాదవపాండవీయ మను త్ర్యర్థికావ్యమును, పంచకల్యాణ చంపువను పంచార్థి కావ్యమును రచించి, యితడు తన పాండిత్యప్రకర్షను సూచించెను. ఇతని శబ్దార్థ చింతామణి ద్వ్యర్థి కావ్యము. ఇంక నితడు శ్లేష చింతామణి, భాగవత చంపువు, చిదంబర విలాస కావ్యము మొదలగు గ్రంథములను వ్రాసెను. ఇతని శిష్యుడు శ్రీకంఠుడు మదన మహోత్సవ భాణమును రచించెను.

శ్రీరంగరాజు (౧౭వ శతాబ్ద ప్రారంభము) విజయనగర రాజవంశమునకు చెందినవాడు. ఇతడు నాటకపరిభాష యను రూపకలక్షణగ్రంథమును రచియించెను. సోమనాథు డను కవి యీ కాలపువాడే. ఇతడు గోదావరీ మండలమువాడు. ఇతడు రాగవిబోధమున వీణాగానమునకు సంబంధించిన రాగములను శ్రుతులను గురించి ఆర్యావృత్తములలో వ్రాసియున్నాడు. నారాయణ తీర్థుడు గూడ గోదావరి మండలము వాడే (౧౭౦౦ ప్రాంతము). ఇతడు కృష్ణ

లీలా తరంగిణి యను గేయ గ్రంథమును రచించెను. బెల్లంకొండ రామశాస్త్రి మరియొక కృష్ణ లీలా తరంగిణిని రచియించెను.

అన్నంభట్టు (౧౭ వ శతాబ్దము) తర్క వ్యాకరణములందు పండితుడు. ఇతడు తర్క వైశేషికములందు ప్రవేశమును కోరువారి యుపయోగార్థము తర్క సంగ్రహ మను ప్రకరణమును, దీనికి వ్యాఖ్యానరూప మగు దీపిక యను నొక ప్రకరణ గ్రంథమును రచియించెను. పాణినీయ సూత్రములకు మితాక్షర యను లఘువృత్తి యను నొకదానిని గూడ రచియించెను.

జగత్ప్రసిద్ధుడైన త్యాగరాజు తంజావూరు నివాసి యైనను తెలుగువాడని నిశ్చయింపబడినది. ఇతడు గొప్ప సంగీత విద్వాంసుడు. వేదాంతవేత్త. ఇతడు సంస్కృతమున పాటలను రచించెను. ఇతని తెనుగు కీర్తనలను విననివారుండరు. శ్యామశాస్త్రి యను సంగీత విద్వాంసు డితనికి సమకాలపు వాడు. ఇతడు కూడ నొక సంస్కృత కృతిని రచించెను.

పద్మరాజు (౧౮వ శతాబ్దము) గోదావరీ మండలనివాసి. ఇతడు బాల భాగవత మను చంపూగ్రంథమును రచించెను. కొల్లూరు సోమశేఖరుడు(౧౮ శతా) గోదావరీ మండలవాసి. ఇతడు సాహిత్యరత్నాకర మను నలంకార గ్రంథమును భాగవతచంపు వను కావ్యమును రచించెను. విశ్వనాథుడు గోదావరీ మండలవాసి. కాని పశ్చిమ వయస్సున వారణాసిలో నివసించుచుండెను. ఇతడు మృగాంకరేఖ యను నాటికను రచించెను.

కృష్ణసుధి జగన్నాథపండితుని వంశమువాడు అందుచే ఇతడు కాంచీపుర ప్రాంతనివాసియైనను నాంధ్రుడని చెప్పక తప్పదు ఇతడు కావ్యకళానిధి యను పెద్ద యలంకార గ్రంథమును రచించెను ఇందలి యుదాహరణ శ్లోకము లన్నియు తనరాజు ప్రశస్తులుగా నున్నవి కృష్ణసూరి యను కృష్ణామండల నివాసి యలంకార మీమాంస, సాహిత్య కల్పలతిక యను రెండలంకార గ్రంథములను రచించెను. ప్రతాపరుద్రుని యాస్థానమున నుండిన భల్లటుడు నాట్య శేఖర మను గ్రంథమును రచించినట్లు శృంగార శేఖరుడు తాను రచియించిన యభినయభూషణమున చెప్పియున్నాడు.

మల్లాది ఆరాధ్యుడను వీరశైవుడు శివలింగ సూర్యోదయ మను సయి దంకముల నాటకమున వీరశైవమతోత్కర్షను వర్ణించెను. పురుషోత్తముడు గంజాం

మండల నివాసి (౧౭౬౦). ఇతడు రామచంద్రోదయము, రామాభ్యుదయము అను ప్రబంధములను, కలాంకురనిబంధ మను రాగమాలికను రచించెను. ఇతని కుమారుడగు నారాయణమిశ్రుడు సంగీతసరణి యను సంగీతగ్రంథమును, బలభద్ర విజయము, శంకరవిహారము, ఉషాభిలాష, కృష్ణవిలాసము, గుండిచా విజయము, నవనాగలలితము అను ప్రబంధములను రచించెను.

గణపతి వీరశ్రీనారాయణదేవు పర్లాకిమిడిరాజు. ఇతడు పై పురుషోత్తముని శిష్యుడు. ఇతడు గంగవంశమువాడు. ఇతడు సంగీతనారాయణ మను గ్రంథమున సంగీతము, నాట్యము, వాద్యము, ప్రబంధము అను నాలుగు విషయములను చర్చించియున్నాడు. ఇతడు అలంకారచంద్ర మను గ్రంథమును గూడ రచియించినట్లు చెప్పుకొనియున్నాడు.

పద్మనాభుడు (౧౮ శతాబ్దము) గోదావరీమండల వాస్తవ్యు డగు తెలుగు బ్రాహ్మణుడు. ఇతడు త్రిపురవిజయ వ్యాయోగము, లీలాదర్పణ భాణము అను రెండు దృశ్యకావ్యములను రచియించెను.

రాజశేఖరుడు (౧౮ శతాబ్దము) గోదావరీ మండలమున కోనసీమ వాస్తవ్యుడు. ఇతడు సాహిత్యకల్పద్రుమము, అలంకార మకరందము అను రెండలంకార గ్రంథములను, శివశతకము, శ్రీశచంపువు అను రెండు కావ్యములను రచియించెను.

వెంకటనారాయణుడు గూడ గోదావరీమండల వాస్తవ్యుడే. ఇతడు ౧౮ భాషలలో గ్రంథములను రచియించినట్లు చెప్పుకొనియున్నాడు. శృంగారసార మను నలంకారగ్రంథమును రచియించి యున్నాడు. తాను శృంగారసారావళి యను మరియొక విపుల గ్రంథమును వ్రాసినట్లు కూడ చెప్పుకొని యున్నాడు

వెంకటశాస్త్రి గోదావరీ మండల వాస్తవ్యుడు. ఇతడు మహేశ్వర మహాకావ్యము, సతీశతకము, భాస్కరప్రశస్తి, రుక్మిణీపరిణయము అను పద్యకావ్యములను, అలంకారసుధాసింధు, రసప్రపంచము, అప్పారాయయశశ్చంద్రోదయము అను అలంకారగ్రంథములను, శ్రౌతసూత్రవ్యాఖ్యానమును రచియించెను. ఇతని కుమారుడు నారాయణుడు సాహిత్యకల్పద్రుమము అను నలంకార గ్రంథమును వ్రాసెను నారాయణుని కుమారుడు వెంకటుడు చిత్రమత్కార మంజరిని, సూర్యస్తవమును రచించెను.

చర్ల భాష్యకారశాస్త్రికూడ గోదావరీమండల నివాసియే. ఇతడు వ్యాకరణమున, నలంకారశాస్త్రమున గొప్ప పండితుడు. ఇతడు మేకాధీశ శబ్దార్థకల్పతరువు అను నలంకార గ్రంథమును, మేకాధీశరామాయణము అను కావ్యమును రచించెను. మేకాధీశ మేకాధిశా అను ౮ అక్షరముల పాదమే వివిధము లగు పదచ్ఛేదములతో రామాయణకథ నంతను బోధించును. ఇంక నితడు కంకణబంధ రామాయణము, వినాయకచరిత్రము అను కావ్యములను వ్రాసెను.

తిమ్మకవి పిఠాపుర ప్రాంతమున నివసించుచుండెను. ఇతడు రసికజన మనోభిరామమును రచియించిన తిమ్మకవికి మునిమనుమడు. తన సుజనమనఃకుముదచంద్రిక యను గ్రంథమును సంస్కృతములోనికి భాషాంతరీకరించెను.

శ్రీనివాసాచార్యుడు తిరుపతిలోని యర్చక కుటుంబములకు చెందిన వైఖానసుడు. ఇతడు శాకుంతలమునకొక యతివిపులమైన వ్యాఖ్యానమును వ్రాసెను. ఇతడు వైఖానససూత్రమునకు గూడ వ్యాఖ్యానమును రచియించెను. రామాయణమునకు గూడ నొకవ్యాఖ్యానమును వ్రాసినట్లు చెప్పెదరు.

పరవస్తు వెంకటరంగాచార్యులు (౧౮౨౨-౧౯౦౦) విశాఖపట్టణ నివాసి. ఈయన తర్క వ్యాకరణ మీమాంసాద్యనేక శాస్త్రములలో గొప్ప పండితుడు. ఈయన ప్రభుత్వమువారి వలన మహామహోపాధ్యాయ బిరుదమును పొందిన ప్రథములలో నొకరు. ఈయన మంజుల నైషధ మను నేడంకముల నాటకమును, లఘువ్యాకరణ మను శ్లోకరూపమగు సులభ వ్యాకరణమును, ప్రపత్తివాద మను వేదాంతగ్రంథమును రచియించెను కుంభకర్ణ విజయము, ఆంగ్లాధిరాజ స్వాగతము అను రెండు చిన్న కావ్యములను రచియించెను. శాకుంతల నాటకమును వీరు మొట్టమొదట ఆంధ్రీకరించిరి. రాజచూడామణిదీక్షితుని కమలినీకలహంసమును గూడ నాంధ్రీకరించిరి వీటియన్నిటికంటె గొప్పగ్రంథమగు శబ్దార్థసర్వస్వ మను బృహన్నిఘంటువును రచియించిరి. యిది యింగ్లీషు భాషలోని 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా'ను ఆదర్శముగా పెట్టుకొని వ్రాసిన గ్రంథము. ఈ గ్రంథమును వ్రాయుటకు నలుబది సంవత్సరములు పట్టినవి. కాని ధనాభావము వలన నీగ్రంథము ముద్రితము కాలేదు. అకార-ఆకారాది పదములు మాత్రము రెండుసంపుటములలో తెనుగక్షరములలో ముద్రింపబడినవి. ఇవి ౭౦౦ పుటలు

పట్టినవి. ఈయన యీ వ్యాసకర్తకు పితామహులు. రంగాచార్యుల తండ్రిగారగు శ్రీనివాసాచార్యులుగారు సర్వశబ్దసంబోధిని యను నకారాది సంస్కృత నిఘంటువును రచియించిరి. వీరు విశ్వగుణాదర్శము నాంధ్రీకరించిరి. రంగాచార్యులు గారి కుమారులు జగన్నాథస్వామిగారు భగవద్గీతలకు తెనుగు టీకను భాష్యత్రయ విశేషములతో కలిపి వ్రాసిరి. వీరు సంస్కృతమున పరమేశ్వరచూర్ణికను గూడ వ్రాసిరి. వీరి కుమాళ్లు భట్టనాథస్వామిగారు ఇందుమతీ స్వయంవర మను నాటకమును, సంస్కృతనాటక కథలను రచియించిరి.

ముడుంబ నరసింహాచార్యులు (౧౮౪౨-౧౯౨౮) విజయనగరమున విజయి రామగజపతి, యానందగజపతుల యాస్థానమునకు చెందినవారు. వీరనేక శాస్త్రములలో గ్రంథములను రచియించిరి. వీరు శతాధిక గ్రంథకర్తలని ప్రసిద్ధి. జయసింహాశ్వమేధీయ మను నాటకమును, రామచంద్రకథామృత మను కావ్యమును ప్రసిద్ధములైనవి. నరసింహాట్టహాసము, రాజహంసీయ నాటకము, నీతిరహస్యము, ఉజ్జ్వలానందము,కావ్యాలంకార సంగ్రహము,సాంఖ్యసూత్ర వ్యాఖ్యానము అనునవి వీరి మరికొన్ని గ్రంథములు. వీరు తెనుగున గూడ ననేక గ్రంథములను రచించిరి.

కస్తూరి శివశంకరశాస్త్రి (౧౮౩౩-౧౯౧౨) గోదావరీ మండల వాస్తవ్యుడు. ఈయన శివానందలహరి, ద్వాదశమంజరి, సముద్రాష్టకము, నృసింహ స్తోత్రము మొదలగు స్తోత్రములను, కొన్ని వేదాంత గ్రంథములను రచించెను.

నిష్టల వేంకటేశ్వరశాస్త్రి చిత్రకవిత్వమున నిపుణుడు. ఈయన రామాయణ సంగ్రహము చతుశ్చిత్రగర్భమని చెప్పబడినది. కొన్ని యక్షరముల వినియముతో నిందుండి మరి నాలుగుకావ్యము లుద్భవించును. గౌరీవివాహము, శ్రీరంగాది క్షేత్రమాహాత్మ్యము, భగవదవతార చరితము, ద్రౌపదీకల్యాణము అను కావ్యములు రామాయణములోని అయోధ్యాది యుద్ధకాండ పర్యంత ముండు శ్లోకముల ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ పాదాద్యక్షరములతో క్రమముగా రచియింపబడినవి. బాలకాండలోని శ్లోకముల మొదటి యక్షరములతో రామకవచము వ్రాయబడినది.

కొక్కొండ వెంకటరత్నం పంతులు (౧౮౪౨-౧౯౧౬) సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుడు. ఈయన యక్షరసాంఖ్యమును కనిపెట్టి దానిని వివరించుచు మార్గదాయిని యను గ్రంథమును రచియించెను. ఈయన బిల్హణాథ

శతకము, తనుమధ్యార్యా శతకము, తనుమధ్యా గీతారత్నము, వరదరాజస్తుతి మొదలగు ననేక స్తోత్రములను రచియించెను. గీత గోవిందమువంటి గీతమహా నట మను గేయగ్రంథము నొక దానిని గూడ రచియించెను

కొంతి భద్రాద్రి రామశాస్త్రి (౧౮౫౬-౧౯౧౫) గోదావరీ మండలము వాడు. ఈయన ముక్తావళి యను నాటకమును, శ్రీరామవిజయ మను కావ్యమును శంబరాసురవిజయ మను చంపువును రచియించెను.

దూర్వాసుల సూర్యనారాయణ శాస్త్రిగారు విజయనగరమున ఆనందగజ పతి యాస్థానము నలంకరించినవారు వీరు గొప్ప సంగీత విద్వాంసులు. వీణా వెంకట రమణదాసుగారు వీరి శిష్యులు; వీరు వారితండ్రిగారి శిష్యులు. సూర్య నారాయణ శాస్త్రిగారు సంస్కృతమునను, తెలుగునను గీతములను రచియించిరి.

కృష్ణామండలమున కాండూరి రామానుజాచార్యులు, నరసింహాచార్యులు గూడ సంస్కృతమున గీతములను వ్రాసిరి. వింజమూరి వీరరాఘవాచార్యులు (౧౮౫౫-౧౯౨౦) ప్రథమమున గోదావరీ మండల నివాసి. తరువాత కృష్ణా మండలమునకు చేరి బెజవాడలో నివాసము నేర్పఱుచుకొనెను. ఈయన రామా నుజ శ్లోకత్రయి, మనస్సందేశము, హనుమత్సందేశము, పానకాల నరసింహ స్తోత్రము, రఘువీర గద్యవాఖ్య, చరు శ్లోకీ వ్యాఖ్య అను గ్రంథములను రచించెను. రాణీ నరసింహ చయనులు (౧౮౬౨-జననము) గోదావరీ మండల మున జన్మించి విజయనగరములో కొంతకాలమును, బెజవాడలో కొంతకాలమును నివసించుచుండెను. వీరు గణితశాస్త్రమున మంచి పండితులు. ఈయన చిత్సూ ర్యాలోక మను వేదాంత నాటకమును, కాలమానోపపత్తి, తిథిమంజరి అను జ్యోతిషగ్రంథములను రచియించెను.

పేరి కాశీనాథశాస్త్రి (౧౮౫౭-౧౯౧౮) విశాఖపట్టణమండల వాస్తవ్యులు. వీరు ఆనందగజపతి యాస్థానమున నుండెడివారు. వీరు పూర్వశాకుంత లము, పాంచాలీరా రక్షణము, యామినీపూర్ణతిలక అను నాటకములను, గంగా స్తవము, గోదావరీస్తవము మొదలగు చిల్లరకావ్యములను వ్రాసెను. వీరి జామా తలును, సుప్రసిద్ధాంధ్ర పండితులు నగు మహామహోపాధ్యాయ తాతా సుబ్బా రాయశాస్త్రిగారు నాగేశుని శబ్దేందుశేఖరమునకు గురుప్రసాద మను వ్యాఖ్యానమును వ్రాసిరి. విజయనగర వాస్తవ్యు లగు జయంతి వెంకన్న (౧౮౬౪-౧౯౨౪) అభినవరామాయణమను కావ్యమును, ప్రహ్లాదచంపువును, లక్ష్మీపతి శతకమును, ముకుందానందలహరిని రచియించెను.

గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రిగారు విజయనగర వాస్తవ్యులు. వీరు న్యాయశాస్త్ర పండితులు. సంగమేశ్వరక్రోడ మని యొక క్రోడపత్రమును వ్రాసిరి. మేడేపల్లి వేంకటరమణాచార్యులు (౧౮౬౨-జననము) విజయనగర వాస్తవ్యులు. వీరు నాలాయిరద్రావిడ ప్రబంధములోని తిరువాయ్‌మొళిని గీర్వాణ శఠగోప సహస్ర మను పేరున సంస్కృత శ్లోకముల లోనికి ప్రవర్తించిరి. షేక్స్పియర్ నాటక కథలను సంస్కృతమున గద్య రూపముగా వ్రాసిరి.

సంస్కృతమున గ్రంథ రచన చేసిన ఆంధ్ర కవులపై పరిగణమున సజీవులగు వారు విడువబడిరి. మఱియు నాకు తెలియని వారు కొందరు చేరక యుండవచ్చును. అయినప్పటికిని సంస్కృతాంధ్రకవులు విశేషముగా గలరని పైన వర్ణింపబడిన వారినిబట్టి తెలియుచున్నది. వేదము, వేదాంతము, న్యాయము వ్యాకరణము, జ్యోతిషము, కల్పము, సాంఖ్యము, ఆయుర్వేదము, గాంధర్వ వేదము, కావ్యములు, నాటకములు, అలంకారము, కామశాస్త్రము, ధర్మశాస్త్రము మొదలగు నన్ని శాస్త్రములలోను నాంధ్రులు విశేష పాండిత్యమును సంపాదించుటయేకాక గొప్ప గొప్ప గ్రంథములను రచించియున్నారు. చాళుక్యుల రాజ్యకాలముననన్ను, విజయనగర సామ్రాజ్యోన్నత్య కాలముననను నాంధ్రదేశమున సంస్కృత వాఙ్మయ మధికముగా నభివృద్ధి చెందినది. తరువాత నాంగ్లేయుల రాజ్యపాలనమునగూడ సాహిత్యమభివృద్ధి చెందినది. దీని కాంగ్లేయుల భాషా సాహిత్యాదరమే కారణము. ఎట్లైనను ఆంధ్రులు సంస్కృత భాషకును, సంస్కృత వాఙ్మయమునకును జేసిన సేవ యపారమైనదని యీ వ్యాసము వలన దెలియగలదు.*



—భారతి
(రజతోత్సవ సంచిక)
సర్వధారి-పుష్యము; జనవరి 1949
సంపుటము 26. సంచిక 1.

* నే నీవ్యాసమునకు కీ. శే. శ్రీమాన్ ఎమ్. కృష్ణమాచార్యులుగారి లౌకిక సంస్కృత వాఙ్మయ చరిత్రమును ముఖ్యమైన యాధారముగా గైకొంటిని.

# ప్రాకృత కావ్యములు

— శ్రీ మేడేపల్లి వేంకట రమణాచార్యులు

విద్వాంసులగు వారు వివిధ భాషా తారతమ్య విమర్శనమం (Philological Research) దధిక శ్రద్ధగలవారై నూతన విశేషములఁ గనుగొను చున్న యీ కాలమందు, ప్రాకృత భాషను గుఱించియుఁ దద్భాషానిబద్ధ కావ్యములను గురించియుఁ గొంతమట్టు కుపన్యసించుట యనావశ్యకము కాదు. బౌద్ధుల గ్రంథము లన్నియు పాలీభాషలో వ్రాయఁబడి యున్నట్లు జైనుల గ్రంథము లన్నియు నీ ప్రాకృత భాషలో వ్రాయఁబడి యున్నవి. ఈ జైన పండితులలో ప్రాచీనులైన ఆచార్య హేమచంద్రుఁడు, జినదేవముని, జినధర్మసూరి, రుద్రదేవుఁడు, సిద్ధసేనుఁడు, ప్రభచంద్రసూరి, మానతుంగాచార్యుఁడు, బప్పభట్టు, వీరగణి మొదలగువారు ప్రాకృత వాఙ్మయమునకే గాక సంస్కృత వాఙ్మయమునకుఁ గూడ సంవర్ధకులైనవారు. ప్రాచీన హిందూదేశ చరిత్రము చాలమట్టుకు జైనవాఙ్మయమువలననే తెలియవచ్చుచున్నది. ప్రాకృత సంస్కృత కావ్యములు ప్రాకృత సంస్కృత నిఘంటువులు, జ్యోతిస్సిద్ధాంత గ్రంథములు, వ్యాకరణ శాస్త్ర గ్రంథములు, తర్క గ్రంథములు మొదలగునవి యెవ్వి గలవో యవి యన్నియును జైనులవలనే మనకు లభించినవి. ఇపుడు హిందూదేశమందు మాటలాడబడుచున్న ఘూర్జరీ మహారాష్ట్రి మొదలగు దేశభాషలకు సంస్కృతమునకు నడుమను ప్రాకృతభాష యనునొక ద్వార మేర్పడకపోయిన యెడల వాని యుత్పత్తి ప్రకారము వాని పరిణామ విధులు మనకేమియుఁ దెలికుండ నుండవలసివచ్చును. ప్రాకృత భాష సహాయమువలననే మనము దేశభాషలఁ దెలిసికొనఁగలిగితిమి. అది లేనిచో నవి యన్నియుఁ బ్రహేళికలవలె దుర్జ్ఞేయార్థములై యుండెను. ఇంతియకాక యీ ప్రాకృత గ్రంథములు మనకు మఱియొక యుపకారమును గూడ నొనరించుచున్నవి బౌద్ధమతోత్పత్తికి మహమ్మదీయులు హిందూదేశము నాక్రమించుకొనుటకు మధ్యనున్న కాలమందు జరిగిన వృత్తాంతమును, సంస్కృత గ్రంథములకంటె నధికతరముగాఁ దెలుపుచున్నవి. ఆ కాలమందు ప్రాకృత భాష జనవ్యవహారమందుండెను. ప్రాకృత గ్రంథములు కూడ మొట్టమొదట సంస్కృత గ్రంథములకంటె సులభతరముగా సామాన్యజనులు తెలిసికొనఁ దగినవిగా నుండెను. అర్థపుష్టి రసము లేక కేవల

శబ్దాడంబరమయ మగు నర్వాచీన సంస్కృత కవనముకంటె ప్రాకృత కవనము స్వభావసిద్ధమైన మనోహరత్వము, మాధుర్యము, మార్దవ్యము, శ్రావ్యత గలదియై యుండును. ఈ దిగువ వ్రాసిన శ్లోకములఁ జూడుఁడు. శాతవాహనుని గాథాస ప్తశతి-చతుర్థ శతకము.

1. ''ణగుణేణ హీరఇ జణో హీరఇ జోజేణ భావియో తేణ।
మోత్తూణ పుళిందా మోత్తి అఇం గుంజాయో గేహ్ణన్తి॥''

[నగుణేన హ్రీయతే జనో హ్రీయితే యోయేన భావిత స్తేన। ముక్త్వా పుళిందా మౌక్తికాని గుంజా గృహ్ణన్తి ॥]

2. ''ణవిణా సబ్భావేణ ఘేప్పఇ పరమత్థజాణుయో లోయో
కోజుణ్ణమజ్జరం కాంజియేణ వేయారిఉం తరఇ.''

[నవినా సద్భావేన గృహ్యతే పరమార్థజ్ఞో లోకః। కోజీర్ణమార్జారం కాంజికయా ప్రతారయితుం శక్నోతి ॥]

ఇపుడు మనకున్న ప్రాకృతగ్రంథము లల్పసంఖ్యాకములై యున్నవి. మఱికొన్ని ప్రాచీన గ్రంథములను గనిపెట్టి పైకిఁ దీసినయెడల సంస్కృత వాఙ్మయములోని కొన్ని గ్రంథముల కాలమును నిర్ణయించుటకు సాధనములై యుండును.

ఇట్లు బహుకాలము సంకర స్థితిలో నున్న యీ ప్రాకృతభాష కాలక్రమమునఁ జెప్పశక్యము గాని వికృతి నొంది యనేక శాఖలుగా మాఱిపోయినది. సంస్కృత నాటక కవులు సంస్కృతమును ప్రాకృతముగా మార్చుట కారంభించినది మొదలుకొని చెడినది. నానాఁటి కిది పండితులకుఁ దప్పఁ దదితరులకు దుర్బోధ మయ్యెను. భవభూతి మాలతీమాధవము సప్తమాంకములోని యీ వాక్యమును జూడుఁడు. దేవాలయమందు మాలతి లవంగికతోఁ జెప్పెడు వాక్యము —

''తస్సిం ఉహాఏ కుసుమా ఉరుజ్జాణ పేరంత రచ్ఛా ముహ సమాయమే సవిచ్ఛ ముళ్ళసిఅ కోడూహుప్ఫుళ్ళ పరిసరు వ్వేల్లమాణ సవిళాస మసిణసిఢిల సంచార చాయ తారయా వియంభమాణాణంగ సింగారాయరియ సవ్వాయమోప దేశ ణిమ్మావిద వియద్ధ ముద్ధ మణహరా ఏయ్యే ణిరూవిదా దిట్ఠిసంభేహా.''

రాజశేఖరుని బాలరామాయణము ద్వితీయాంకము: "ఇదోవి ఎదేఉత్తుంగ లంగూలగ్గాలింగిఅ గఅణంగణుచ్చంగా ఘణఘోణా ఘురుమురాఘో ఘగ్ఘరిజ్జన్త గళగుహాకుహారఫాలఫుల్లగల్ల విదరిల్లా విజ్జుప్పుంజపింజరిద దిట్ఠిచ్ఛటాకడక్ఖ దుప్పేచ్చా సహసత్తి సీహసంఘా ఓదరంతి.'"

ఈ భాష వ్యవహారములోనుండి తొలఁగిపోయిన తరువాత వ్యాకరణములు వ్రాయఁబడినవి. ఈ వ్యాకరణము లైనను సంస్కృత శబ్దములను ప్రాకృతములోనికి మార్పు విధానమునే నేర్పుచున్నవి గాని అసలు దేశ్యశబ్దములకు లక్షణమును జెప్పవు. అనేక సంస్కృత శబ్దముల కొక్కటియే ప్రాకృతరూపము. వీనిని దెలిసికొనుట యెంత చిక్కుగా నుండునో చూఁడుఁడు. "అవతార, అపచార, అపకార - అను నీ మూఁడింటికి 'ఓయార' అను ప్రాకృతరూప మొక్కటియే. అట్లనే గత, గద, గజ అనువానికి 'గఅ'; పాద, పాత, పాక అనువానికి 'పాయ': పార్శ్వ, పాశ, వాస అనువానికి 'వాస' - ఇట్లనేకములు గలవు. ఇట్టి కష్ట మీ ప్రాకృతమందే గాక మూలభాషలనుండి పుట్టిన యితర భాషాశబ్దముల వ్యుత్పత్తులయందుఁ గూడఁ జూపట్టుచున్నది. ఇట్టి యుదాహరణములు ఫ్రెంచి భాషలో మెండుగా నున్నవి.

e (though written et) stands for et.
a (though written ai) for habet.
vu (though written veut) for vult.
pu (written peut) for potest.
voi (written voit) for videt.

ఈ భాషకు మొట్టమొదట వ్యాకరణమును వ్రాసినవాఁడు వార్తికకారుఁడైన వరరుచి. దీనికి హలాయుధుఁడొక వృత్తిని వ్రాసెను. క్రీ. శ. 1089-1174 మధ్యను జీవించిన హేమచంద్రుఁడు ప్రాకృతశబ్దానుశాసన మను నొక పెద్ద వ్యాకరణమును వ్రాసెను ఇపుడున్న ప్రాకృతవ్యాకరణములలో నిదియె మిగులఁ బ్రసిద్ధి కెక్కినది. వాల్మీకి యొకవ్యాకరణ మును వ్రాసెను. ఇవిగాక త్రివిక్రముని ప్రాకృతవ్యాకరణము లక్ష్మీధర పండితుఁడు వ్రాసిన షడ్భాషా చంద్రిక యను నీ రెండు వ్యాకరణములు గలవు.

ప్రాకృతకావ్యములు :

1. ప్రవర సేనుని సేతుకావ్యము. దీనికి దశముఖవధ యని నామాంతరము గలదు. 2. ఆచార్య హేమచంద్రుని కుమారపాల చరిత్ర. 3. గాథా శాత వాహనుని గాథాసప్తశతి. 4. వాక్పతిరాజకృత గౌడవధ, గుణాఢ్యుని బృహత్కథ పైశాచీభాషలో వ్రాయబడినది గాని యది నష్టమై పోయినది. మన మెఱిఁగిన ప్రాకృత కావ్యము లివియే.

1. సేతు కావ్యము :

కాశ్మీరదేశాధీశ్వరుఁ డగు ప్రవరసేన మహారాజు దీనిని రచించెను. ఇందులోఁ బదునైదాశ్వాసము లున్నవి. భారవి మాఘులు తమ కావ్యములలోఁ బ్రతిసర్గాంతశ్లోకమును యథాక్రమముగా లక్ష్మీశబ్ద శ్రీశబ్దాంకితముగాఁ జేసినట్లే గ్రన్థకర్తయుఁ బ్రత్యాశ్వాసాంత స్కంధకమును అనురాగశబ్దాంకితము గావించెను. ఎట్లనగా : ఎత్థ సమప్పఇ ఎఅం సీయాలంభేణ జణియ రామబ్భుయయమ్, రావణవహత్తి కవ్వం అణురాఅంకం సమత్థజణణివ్వేసమ్ (అత్ర సమాప్యతే ఎతత్సీతాలంభేన జనిత రామాభ్యుదయమ్, రావణవధ ఇతి కావ్యమనురాగాంకం సమస్తజననిర్వేషమ్). ఇందలి వృత్తములకు స్కంధకము లని పేరు. ఈ కావ్య మష్టవిధ ప్రాకృతభాషలలోఁ బ్రశస్తతమ మైన మహారాష్ట్రిభాషలో వ్రాయఁబడినది. దీనిని గుఱించి దండి కావ్యాదర్శములో నిట్లు వ్రాసెను: ''మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః, సముద్ర స్సూక్తి రత్నానాం సేతుబంధాది యన్మయమ్''. ఎనిమిదవ శతాబ్దములో నున్న భవభూతి కూడ హర్షచరిత్ర ప్రారంభమందు ''కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా, సాగరస్య పరంపారం కపిసేనేవ సేతునా''అని చెప్పియున్నాఁడు. ప్రాచీన లేఖమాలలో (Indian Antiquary)వ్రాయఁబడిన శాసనములనుబట్టి యీ సేతు కావ్యనిర్మాత యగు ప్రవరసేనుఁడు కావాటకవంశస్థుఁ డనియు నితఁడు క్రీస్తుశకము-పంచమశతకమందుఁ గాశ్మీరదేశపాలకుఁ డై యుండెనసియు-బుహలర్ పండితునిచే నిశ్చయింపఁబడెను. దీనికిఁ టీక వ్రాసినవాఁడు కూడ నొక మహారాజు; అతని పేరు రామదాసమహీపతి. ఇతఁడు జలాలుద్దీను నాజ్ఞచే దీనికి రామసేతుప్రదీప మను వ్యాఖ్యానమును వ్రాసిన ట్లీ దిగువ శ్లోకములోఁ జెప్పెను: ''తద్వ్యాఖ్యా సౌష్ఠవార్థం పరిషది కురుతే రామదాసస్స ఏవ గ్రంథం జిల్లాల

దీంద్రక్షితిపతి వచనా రామసేతుప్రదీపమ్''. ఈవ్యాఖ్యాత జయపుర సంస్థానాధీశుల పూర్వపురుషుఁడైన మానసింహ మహీపాలునికి సన్నిహితబంధు వనియు జయపురసంస్థానములోఁ జేరిన ఓలీ యను పట్టణమున కధిపతి యనియు జయపుర రాజకీయవంశచరిత్రము వలనఁ దెలియవచ్చినది.

2. *కుమారపాల చరిత్ర :*

ఇది యాచార్య హేమచంద్రునిచే వ్రాయఁబడినది. ఈ గ్రంథకర్త సంస్కృత శబ్దానుశాసనము, ప్రాకృత శబ్దానుశాసనము నను పేరులుగల సంస్కృత ప్రాకృత వ్యాకరణములను వ్రాసి వాని కుదాహరణముగాఁ గుమారపాలచరిత్రమను నొక ద్వ్యాశ్రయకావ్యమును రచించెను. దీనిలో నిరువది సర్గలు సంస్కృతము, నెనిమిదిసర్గలు ప్రాకృతము. ఇద్దఱు వ్యాఖ్యాత లీ రెండుభాగములకు వ్యాఖ్యానములను వ్రాసిరి వారిలో సంస్కృత భాగమునకు వ్యాఖ్యానమును వ్రాసినవాఁడు అభయతిలకగణియని వ్యాఖ్యానాంతగద్యమువలన దెలియవచ్చుచున్నది. ''ఇతి శ్రీ జినేశ్వరసూరి శిష్యాభయతిలకగణి విరచితాయాం శ్రీహేమచంద్రాభిధాన శబ్దానుశాసన వివృతౌ వింశస్సర్గ స్సమర్థితః''. ప్రాకృతభాగమునకు వ్యాఖ్యానము వ్రాసినవాఁడు పూర్ణకలశగణి-ఇతఁడు గ్రంథాంతమం దిట్లు వ్రాయుచున్నాఁడు. ''దత్తోముదాత్తైః జినేశ్వరత్నసూరి క్షమాధిపై ర్ప్రోబ్రధమణిప్రదీపః। శ్రీప్రాకృత ద్వ్యాశ్రయగేహగ భన్ స్థితం యదాదశన్ యదథన్ జాతమ్। శ్రీమజ్జినేశ్వరయతీశ్వర దత్తదీక్షాశిక్షోత్ర పూర్ణకలశోగణి రల్పబుద్ధిః అన్యోపకారిషు పదం పరిలబ్ధుకామో వృత్త్యానయా కిమపి తత్ప్రకటీ చకార.''

ఇఁక నీకావ్యమును గురించి-యిప్పుడు పాట్నా యని పిలువఁబడు అణహిల్లపుర మను పట్టణము యొక్క వర్ణనతో నీకావ్య మారంభ మైనది. తరువాత నీ పట్టణమును బరిపాలించుచున్న రాజు, వాని విభవములు, వదాన్యత, పరాక్రమము, మొదలగునవి వర్ణింపఁబడినవి. తరువాత గ్రంథమున కుమారపాలునికి కొంకణ దేశపు రాజైన మల్లికార్జునునికి జరిగిన యుద్ధము. ఆ యుద్ధమందు మల్లికార్జున నృపాలుని వధ వర్ణింపఁబడినది. హేమతుంగాచార్యులు వ్రాసిన ప్రబంధ చింతామణిలో నీ కుమారపాలుని చరిత్రము విపులముగా వ్రాయఁబడి యున్నది. అణహిల్లపురాధీశుఁడను భీమదేవుఁడు బౌలదేవి యను నొక వేశ్యను తన దేవిగాఁ బరిగ్రహించి యంతఃపురమందుంచెను. ఆమె క్షత్రియ స్త్రీ కాకపోయినను శీల సంపదకు, భర్తృ

భక్తికి మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. దాని గర్భమందుఁ బుట్టినవాఁడు హరి పాలుఁడు, వానిసుతుఁడు త్రిభువనపాలుఁడు, త్రిభువనపాలుని పుత్రుడు కుమార పాలుఁడు. ఈ కుమారపాలుని సాముద్రిక లక్షణమును జూచి యొక సిద్ధుఁడు వీఁడీ అణహిల్లపురాధీశుని జయించి యీ రాజ్యమున కధీశ్వరుఁ డగు నని చెప్పెను. ఆ కాలమం దారాజ్యము నేలుచున్న రా జీవృత్తాంతము నాకర్ణించి కుమార పాలుని వధింపవలె నని యుద్యమించెను. కుమారపాలుఁ డీవృత్తాంతము నెఱింగిన వాఁడై భిక్షువేషమును ధరించి విదేశములలోఁ గొంతకాలము గడపి మరల నణహిల్లపురమునకు వచ్చి యొక సత్రమందు బసచేసి యుండెను. ఆ పట్టణపు రా జాదినమందు తన తండ్రియాబ్దిక మగుటచే నారాధించుటకు సన్న్యాసుల నందఱను బిలువనంపెను. కుమారపాలుఁడు కూడ నా సన్న్యాసులతో రాజసన్ని ధికి బోయెను. ఆ రాజు భక్తి శ్రద్ధలతో సన్న్యాసుల కాళ్లు గడుగుచు గుమార పాలుని పాదములయం దున్న చక్రవర్తి చిహ్నములను జూచి యాశ్చర్యపడెను. అంతట కుమారపాలుఁడు రా జనుమా నించుటఁ జూచి పాఱిపోయెను. వెదకు టకుఁ బంపఁబడిన రాజభటులకు దొరకక పరుగిడి కొన్ని దినములు పోయి పోయి యనేక దేశములయందుఁ గ్రుమ్మరి కొనకు స్తంభతీర్థమను స్థలమును జేరెను. దానికే యిపుడు కాంబే యని పేరు. ఆ కాలమందు ప్రసిద్ధి కెక్కిన జైన సన్న్యాసి యగు హేమచంద్రాచార్యుఁ డాస్థలమం దుండెను. ఆ దేశపు రాజు మంత్రి యగు ఉదయనుని యింటికి కుమారపాలుఁడు భోజనమునకుఁ బోఁగా వానియసాధారణ సాముద్రిక చిహ్నములను జూచి హేమచంద్రుఁడు వీఁడు సార్వ భౌముఁడు కాక తప్ప దని చెప్పెను, హేమచంద్రుఁడు చెప్పిన మాటలయందు కుమారపాలుఁడు నమ్మకము లేనివాఁ డై యుండఁగా హేమచంద్రుఁడు (సంవత్ 1199 వర్షే కార్తికవది ద్వితీయాయాం రవౌ హస్తానక్షత్ర యుక్తే యది భవతః పట్టాభిషేకో నభవతి తదాతఃపరం నిమిత్తావలోక సన్న్యాసః) ఆగామి కార్తిక బ॥విదియనాఁడు నీవు తప్పక పట్టాభిక్తుఁడ వగుదువు. అట్లు కానిచో నే నీ దైవజ్ఞత్వమును విడుచుకొందు నని రెండుపత్రములపై వ్రాసి యొకటి యుద యనునికి, రెండవది కుమారపాలునికి నిచ్చెను. నేను జెప్పినట్లు నీకు రాజ్యము లభించిన యెడల నీవు జైనమత మవలంబింపవలయు నని చెప్పెను. అందు కంగీ కరించి కుమారపాలుఁడు మంత్రియింటికిఁ బోయి యచట సుఖముగాఁ గొన్ని దినము లుండి మాలవదేశమునకుఁ జనెను. అచట నొక దేవాలయపు గోడ మీఁద— ''ఓయి విక్రమార్కుఁడా, నీశకము 1199 సం॥ అయిన తరువాత కుమారుఁ డనువాఁడు నీయంత రాజగును.'' అను నొక శాసనమునుజూచి యాశ్చ ర్యపడెను. ఇంతలో అణహిల్ల పురాధీశుని మరణవార్త విని యాపురమునకుఁ

బోయెను. మృతుఁడైన యారాజు యొక్క మంత్రులలో ముఖ్యుఁడైన కన్నడ దేవు డచట వీనిని జూచి సన్నిహిత బంధువుఁ డగుటచే వీని నారాజ్యమం దభిషేకించెను. అప్పటికిఁ గుమారపాలుఁ డేఁబదివత్సరముల వయస్సుగలవాఁడై యుండెను. అనేక దేశములను జూచి యమితమైన లోకానుభవము గలవాఁడగుటచే రాజ్యతంత్రమును జక్కఁగా నడిపించుచుండెను. తనపై ద్రోహబుద్ధిగల ప్రాచీనమంత్రుల నందఱను వధించెను. కుమారపాలుఁడు రాజ్యమందు స్థైర్యము లభించి కొంకణదేశపు రాజైన మల్లికార్జునదేవుని బరిమార్చి వాని రాజ్యమును దీసికొనెను. యథాప్రతిజ్ఞాతముగా జైనమతమందుఁ బ్రవేశించి తన రాజ్యమందామతమును స్థాపించెను.

## 3. గాథా సప్తశతి :

ఇది ప్రాచీన ప్రాకృత కవుల ప్రాకృత గ్రంథములనుండి గ్రంథకర్తచే నెత్తి వ్రాయఁబడిన యేడువందల గాథల సమూహము. ప్రాకృతములో గాథ యనఁగా సంస్కృతములో నార్యాగీతి వంటిది దీనిలో శ్లోకము లన్నియుఁ బండితరాజశతక శ్లోకముల వలె నర్థ్యాపదేశార్థకములు, నీతిని శృంగారమును బోధించునవి. ఇది సంస్కృతములో నున్న శార్ఙ్గధర పద్ధతి, సుభాషితావళి మొదలగు గ్రంథముల వంటిది. దీనిని జూచి గోవర్ధన పండితుఁడు సంస్కృతములో నార్యా సప్తశతిని వ్రాసెను. ఈ గాథాసప్తశతిని వ్రాసినవాఁడు శాతవాహనుఁడు. ఇతఁడు దీపర్ణి యనువాని పుత్రుడు. ప్రతిష్ఠానపురము నేలిన మహారాజు. ఇతని యాస్థానమందు బృహత్కథాకారుఁడైన గుణాఢ్యుఁడు, కలాప వ్యాకరణ కర్తయగు శర్వవర్మ మొదలగు మహావిద్వాంసు లుండి రని కథాసరిత్సాగరము నాఱవత రంగములో నున్నది. "సోహం దరిద్రోవిత్తార్థీ ప్రయాతో దక్షిణాపథమ్, ప్రాప్తః పురం ప్రతిష్ఠానం శాతవాహన భూపతేః" "రాజార్హ రత్ననిచయై రథ శర్వవర్మా తేనార్చితో గురి రితి ప్రణతేన రాజ్ఞా, స్వామీకృతశ్చ విషయేభరుకచ్ఛ నామ్ని కూలోపకంఠ వినివేశిని నర్మదాయాః". శాతవాహనుఁడు శర్వవర్మను నర్మదానదీ తీరమందున్న భరుకచ్ఛ మను దేశమునకుఁ బ్రభువుఁగాఁ జేసి రాజార్హమైన వస్తువులఁ బారితోషికముగా నొసంగె నని కథాసరిత్సాగర షష్ఠతరంగాంత్య శ్లోకము చెప్పుచున్నది "కర్తర్యా శాతవాహనో మలయవతీం మహాదేవీం జఘాన" అని యీ శాతవాహనుఁడు తన దేవి యగు మలయవతిని గత్తెరచేఁ జంపె నని వాత్స్యాయన తంత్రమందు ద్వాదశాధ్యాయములో ననున్నది. పీటర్ సన్పండితుఁడు

జంపుట మొదలగు వృత్తాంతములు విపులముగా వర్ణించెను. కావుననే యీ కావ్యమునకు గౌడ వధ యని పేరు ఇందలి శ్లోకసంఖ్య పండ్రెండు వందల తొమ్మిది. ఇంత పెద్ద గ్రంథమును వ్రాసినను వాక్పతి యెచ్చటను దన వృత్తాంతము నించుకైనఁ దెలియఁ జేయలేదు. "భవభూఇ జలహి ణిగ్గయ కన్వామయ రసకణా ఇవ ఫురంతి, జస్సవిశేసా, అజ్జవివియదేసుకహాణి వేసేసు) (799) భవభూతి సముద్రమును మథించి తీయఁబడిన కావ్యామృత రసకణము లిప్పటికి నా కథా నిబంధములయందు ప్రకాశించుచున్న వని చెప్పుటచే వాక్పతి భవభూతి విరచిత గ్రంథములను గూలంకషముగాఁ గృషిచేసి యున్నాఁ డని మన మూహించుకొనవలెను గాని యతని యొద్ద శిష్యుడై పుస్తకముఁ బట్టి చదివినట్లు కానరాదు. ఏలయనఁగా పై శ్లోకమందు "అద్యాపి" అనుటచే వాక్పతి యీ గ్రంథమును రచించిన కాలమునకు భవభూతి గతించినట్లు కానవచ్చుచున్నది. "భాసమ్మి జలణమిత్తే కుంతీదేవేఅ జస్సరహు యారే, సోబంధవే అబంధమ్మి హరిచందేయ ఆణందో" భాసుఁడు, జ్వలన మిత్రుఁడు, కుంతీదేవుఁడు, కాళిదాసు, హరిచంద్రుఁడు మొదలగు కవులయందు సుబంధుని వాసవదత్తయందుఁ దనకు మిక్కిలి యానంద మని చెప్పుచున్నాఁడు. వేదము, వ్యాకరణము, న్యాయశాస్త్రము, అలంకార శాస్త్రము, ఛందశ్శాస్త్రము మొదలగు శాస్త్రములయందు నిరూఢప్రజ్ఞ గలవాఁడ నని చెప్పుకొనుచున్నాఁడు.

*యశోవర్మ కాల నిర్ణయము :*

యశోవర్మ కాలము నిర్ణయింపఁబడఁగా వాక్పతిరాజు కాలము నిర్ణయింపఁ బడును. ఈ యశోవర్మ చరిత్రమును దెలిసికొనుటకు కల్హణకృత రాజతరంగిణి ముఖ్యమైన యాధారము. కాశ్మీరదేశము నేలిన రాజవంశములలో నొకటి యైన కార్కోటకవంశమందుఁ బుట్టిన లలితాదిత్యుని చరిత్రముతో నీ యశోవర్మ చరిత్రము సంబంధించియున్నది. ఈ లలితాదిత్యుఁ డమితపరాక్రమశాలి. శత్రుభయంకరుఁడు భరతఖండము నంతను నేకచ్ఛత్రాధిపత్యముగా నేలెను. తన జీవితకాల మంతయును జైత్రయాత్రలతోఁ గడిపినవాఁడు. తూర్పు దిక్కున రాజుల నందఱను జయించి వారివలనఁ గప్పములఁ గొనియెను. యశోవర్మను గూడ జయించెను. అపుడు యశోవర్మ యనన్యగతికుఁడై యేమియుఁ జేయునది లేక లలితాదిత్యునితో సంధిఁ జేసికొనుటకుఁ గోరెను గాని, లలితాదిత్యుని మంత్రి యగు మిత్రశర్మయు దీర్ఘ యుద్ధ కుతూహలులై యున్న సైనికులును సంధి కొప్పు

కానకపోవుటచే యశోవర్మ తన స్వల్పసైన్యముతో లలితాదిత్యు నెదిరించి పరాజితుఁ డయ్యెను. అపుడు లలితాదిత్యుఁడు తన మంత్రి చేసిన యుపదేశము వలనఁ దనకు జయము కలిగిన దని సంతసిల్లి వాని కైదుబిరుదముల నొసంగెను. ఇట్లు యశోవర్మ శత్రునికి లోపడి తన పండితులును దాను వాని గుణస్తుతి పాఠకులైరి పిమ్మట లలితాదిత్యుడు తూర్పుసముద్రపుటొడ్డున నున్న దేశములపై దండెత్తి వెళ్ళి గౌడదేశపురాజునేనుంగులఁ బట్టుకొనెను. దేశము తరువాత దేశమును జయించుచుఁ బోయి పోయి కొనకు సప్తకోంకణములను బుకార్రా దేశమును జయించెను. జయించిన దేశములయందెల్లఁ బట్టణములను, నా పట్టణములలో దేవాలయములను నిర్మించెను. లలితాదిత్యుఁడు పరాక్రమశాలి, ధార్మికుఁడు, దయతోఁ బ్రజలఁ బాలించినవాఁడునై యుండెను. యశోవర్మ చరిత్రముతో సంబంధించిన లలితాదిత్యుని వృత్తాంత మిది. రాజతరంగిణీ వచన ప్రకారముగా లలితా దిత్యుఁడు క్రీస్తుశకము 695 సం॥ మందు సింహాసన మెక్కెను. అతఁడు ముప్పదియాఱు సంవత్సరములు, నేడు మాసములుఁ, బది దినములు రాజ్యముఁ జేసెను. కావున నతని రాజ్య పాలన కాలము 695 మొదలుకొని 732 వఱకు. అతఁడు యశోవర్మను జయించుట యెనిమిదవ శతాబ్దము యొక్క ప్రారంభమందై యుండ వచ్చును. యశోవర్మ గౌడరాజును వధించిన కథను బూర్ణముగాఁ జెప్పెద నని ప్రతిజ్ఞఁ జేసి వాక్పతిమిత్రుఁడు దానిని సంగ్రహముగాఁ జెప్పి గ్రంథమును ముగించెను.

— ఆంధ్ర సాహిత్య పరిషత్పత్త్రిక
రక్తాక్షి - శ్రావణ కార్తిక మాసములు (1925)
సంపుటము - ౧౩, సంచిక - ౩-౪.



# అలంకార శాస్త్రము*

—శ్రీ ఖులుసు వేంకట రమణయ్య

గీర్వాణ వాఙ్మయము నందలి తక్కిన శాస్త్రముల రీతినే యలంకార శాస్త్రము యొక్క యారంభదశను గనుఁగొనుట కష్టము. కాని యెపుడు కావ్యము వెలువడినదో, దానిని జర్చించు నీ శాస్త్రము కూడ దానితోడిదేయని నిశ్చయించుట మాత్రము సాహసము కానేరదు. ఆదికవి యగు వాల్మీకిముని రచించిన యాదికావ్యమును బరిశీలించినచో నలంకారశాస్త్ర సంప్రదాయములు కన్పట్టకపోవు. అందలి—

"రవిసంక్రాంతసౌభాగ్య స్తుషారావృతమండలః
నిఃశ్వాసాంధ ఇవాదర్శ శ్చంద్రమా న ప్రకాశతే."
[అరణ్యకాండము, 22-13]

అను శ్లోకమున నత్యంత తిరస్కృతావివక్షితవాచ్యధ్వని 'నిఃశ్వాసాంధః' అను పదమునఁ గలదని యానందవర్ధనుఁడు తన ధ్వన్యాలోకమున విశదీకరించి యున్నాడు.

ఇచట నంధ శబ్దమునకు గ్రుడ్డి దను నర్థము చెప్పినచో నిఃశ్వాసపదమున నన్వయింపదు. అట్లే మొదటి యితిహాస మగు మహాభారతమునఁ గూడ నీ శాస్త్ర మర్యాదలు కన్పించును. అందలి శాంతిపర్వమునందలి ''గృధ్రగోమాయు సంవాదము'' ప్రబంధగత వ్యంగ్యమున కుదాహరణముగ నాలంకారికులచే నంగీకరింపఁబడినది.

ఎపుడు వాఙ్మయము వెలువడినదో యలంకారశాస్త్రము కూడ దానితోడిదే యని చెప్పినం జెప్పవచ్చును. మనకు లభించిన గ్రంథములలో మొదటి దగు ఋగ్వేదమున నలంకార శాస్త్ర మార్గములు కన్పించుచున్నవి. అందలి—

''అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివసనయే వనానామ్।
జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ నిరిణీతే అప్సః॥''
[1-124-7]

---

* కాశిలో జరిగిన The First All Asia Educational Conference కు నేను జదివిన సంస్కృత వ్యాసము దీనికి మూలము.

''ద్వాసువర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్న న్నన్యో అభిచాకశీతి॥''
(1-164-20)

అను మంత్రములలో మొదటిదానియం దుపమాలంకారమును రెండవ దానియం దతిశయోక్తియుఁ గన్పడుచున్నవి. ఇట్లే వ్యతిరేకాద్యలంకారములు కల భాగములు చాలఁ గలవు. ఉపనిషత్తులలోఁ గూడ నిట్లే కలవు. అందులకుఁ గఠోపనిషత్తు నందలి ''ఆత్మానం రథినం విద్ధి శరీరం మన ఏవచ'' అను మొదలగు శ్లోకము లుదాహరణము. అందు రూపాలంకారము సుస్పష్టము.

ఇట్లాదినుండియు నలంకారశాస్త్ర సంప్రదాయములు చూపట్టుచున్నవి. వేదములు సామాన్యముగ స్తోత్రరూపము అగుటచేతను, అం దలంకారములుండుట చేతను, వేదమునకు శాస్త్రాంతములతోడి సంబంధముకంటె నలంకారముతోడి సంబంధమే ప్రాథమిక మైనదని యూహింప నవకాశము కలదు.

మీఁద జెప్పిన చొప్పున వేదములందుఁ గూడ నలంకార సంప్రదాయ ములు కన్పడుచున్నను, తచ్ఛాస్త్రపారిభాషిక పదములు మాత్రము కానరావు. అక్కటతన, నా కాలమున శాస్త్ర విషయములగు నాలోచనము లున్నను ఆలం కారికులు గాని, వారి గ్రంథములు గాని యపు డున్నట్లు నిశ్చయింపఁ జాలము.

మనకు లభించిన యలంకార గ్రంథములలో నాట్యశాస్త్రము మొదటిది. అంతకుఁబూర్వ మలంకార గ్రంథము లేవేని గలవో తెలియదు. కాని వరరుచి ప్రఖ్యాతాలంకారికుఁ డని ప్రతీతి కలదు. వేదాంతసూత్రములందలి—

(i) అత ఏవ చోపమా సూర్యకాదివత్, (3-2-18)
(ii) నానుమానిక మప్యేకేషాం, శరీరరూప కవిన్యస్తగృహీతే ర్దర్శయతి చ. (1-4-1)

౨. సూత్రములలో నుపమారూపకములు శబ్దోపాత్తములై యున్నవి. పాణిని ముని తన యష్టాధ్యాయి యందలి-

(i) ఉపమానాని సామాన్య వచనైః। (2-1-55)
(ii) ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే। (2-1-56)

(iii) తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీయాన్యతరస్యామ్। (2-3-72)

అను సూత్రములం దలంకార పారిభాషికపదములను వారు వాడెడియర్థము లందే వాడియున్నాఁడు. యాస్కుని నిరుక్తమునందలి "లుప్తోపమాన్యార్థోపమానీత్యా చక్షతే" (3-18) అను మొదలగు వచనంబులం బట్టి యాతఁ డలంకార శాస్త్రమును బాగుగ నెఱుంగునని చెప్ప నవకాశము కలదు. ఇట్లు పాణిని మొదలగు ప్రాచీన మహర్షులచే సూత్రయుగమున నాలంకారికపారిభాషికముల వాడఁబడుటచే నియ్యది మిక్కిలి ప్రాచీనశాస్త్ర మని చెప్పవలసి యున్నది. ఆ కాలమున నలంకార గ్రంథములు రచియింపఁబడి యుండవచ్చును. కాని యవి కాల గర్భమున మునింగిపోయి యజ్ఞాతవాసమున నున్నవి.

అలంకారశాస్త్ర మి ట్లతిప్రాచీన మైన దైనను దక్కిన శాస్త్రములతోడి సమానాభ్యర్హి తత్వమును బొందలేదు. వేదసంరక్షణార్థ మేర్పడిన వ్యాకరణాదుల కున్నంత గౌరవము వేదమంత్రాంతర్గతము లగు నలంకారములకు మూలము లగు నలంకార శాస్త్రమునకు లేకపోవుట కడుంగడు విచారణీయము. వేయేల? ఆలంకారికులకుఁ గూడఁ దమ శాస్త్రమునందు, దాని యపసరము స్వరూపమును నిరూపింపఁ బట్టుదల, ఆసక్తి యుండిన ట్లగపడదు.

ప్రాచీనుఁ డగు పతంజలిముని తన మహాభాష్యమునఁ బస్పశమున వ్యాకరణ శాస్త్రావశ్యకతం గూర్చి చర్చించి సాటిలేని గౌరవము నద్దాన నాపాదింపఁ జేసెను. కాని ప్రథమాలంకారికుఁడని యనుకొనఁబడు భరతమహర్షి నాట్యశాస్త్రమున నలంకారశాస్త్ర విషయమున నేమియుఁ బ్రస్తావింపలేదు. మఱియు నాట్యమున కంగముగ నొక కొంత యలంకారాదికమును నిరూపించెం గాని యతని యుద్దేశ్య మలంకారము కానేరదు. ఐన నతఁడే ప్రథమాలంకారికుఁడని మనము ప్రాకులాడుచున్నాము.

భరతుని తరువాత భామహుఁడే తక్కిన వారిలోఁ బ్రథముఁడు. దండి భామహుల పౌర్వాపర్యముం గూర్చి వాదవివాదములు పెచ్చుపెరిఁగి యున్నను భామహుఁడే ప్రాచీనుఁడని చాలమంది సిద్ధాంతీకరించిరి. భామహుఁడు తన గ్రంథమునకుఁ గావ్యాలంకార మని నామ మిడెను; ఇందును గావ్యగుణాలంకార స్వరూపమే వివరింపఁ బడెను కాని అలంకార శాస్త్రముయొక్క గౌరవము

పోషింపఁబడలేదు. ఇందు భామహుని కంటెఁ బ్రాచీనుఁడు మేధావి యనునొక యాలంకారికుఁడుండినట్లు లిఖింపఁబడినది. ఆతని గ్రంథ మేదో కూడఁ దెలియమి నందేమి విచారింపఁ బడెనో గుర్తించుట యసంభవముగ నున్నది.

భామహుని యనంతరమున నీ విషయమున నతనినే యనుసరించిన దండి-వామన-రుద్రటాదుల వలన మనకేమియుం గ్రొత్త విషయము గోచరింపదు. కాని యాలంకారికులలో- (విమర్శన మార్గముం ద్రొక్కిన వారలలో) పేరెన్నికఁ గని- ప్రథముఁడేయై ధ్వనిమార్గముం గనిపెట్టిన యానందవర్ధనాచార్యు లీ విషయమునఁ గొంతవఱ కుపకరించును. ధ్వని ప్రస్తావనమున నతఁడు "ధ్వనిని దెలిసికొనుటకు సహృదయుఁడే కావలె"ననియు, నసహృదయుల కం దధికారము లేదనియు, వ్యాకరణాది శాస్త్రములు చదివిన మాత్రముననే యది బోధపడదనియు, ఆలంకారికులే దానిని గుర్తెఱుంగఁ గల రనియుఁ జెప్పి యుదాహరణములతో దాని నుపపాదించెను. ఒక కారికను మాత్ర మిట నుల్లేఖింతును.

"శబ్దార్థశాసనజ్ఞాన మాత్రేణైవ న వేద్యతే
వేద్యతే స హి వాక్యార్థ తత్త్వజ్ఞై రేవ కేవలమ్"

—[ధ్వన్యాలోకః-ఉద్యోతః]

ఇట్లొనర్చిన యానందవర్ధనుఁడు కూడఁ దన యలంకార శాస్త్రమునకుఁ బ్రాధాన్యము నొసంగినట్లు కన్పడదు. వైయాకరణులే గొప్ప వారనియు, నొకకొందఱు వారి మార్గమునే యవలంబించి ధ్వనిమార్గము నవలంబించి రనియు

"ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః
వ్యాకరణమూలత్వా త్సర్వవిద్యానామ్
......అత స్తన్మతానుసారభి రన్యైరపి
............ —[ధ్వన్యాలోకః-ఉద్యోతః]

అని యతఁడే లిఖించి యున్నాఁడు దీనింబట్టి యలంకారమునకుఁ బ్రత్యేకముగ నితఁడు శాస్త్రత్వము నంగీకరించినట్లును గనుపింపదు కాన నానందవర్ధనులు ప్రథమాలంకారిక విమర్శకులే యైనను శాస్త్రత్వ విమర్శన విషయమున విముఖులై యుండిరని యనుమానింప నవకాశము కలదు. దీనింబట్టి ప్రాచీనకాలమున నలంకారశాస్త్ర మొక శాస్త్రమని చాలమంది యంగీకరింపనట్లు తోఁచుచున్నది మఱియు నాలంకారికులకుఁ గూడ (10వ శతాబ్దపు రాజశేఖరుని

వఱకును) తమ శాస్త్రమునకుఁ గల శాస్త్రత్వమును నిరూపింపఁ బట్టుదలయు లేకుండెను.

కాని కావ్యమీమాంసను వ్రాసిన రాజశేఖరుఁడు బాగుగ విమర్శించి యంతకుఁ బూర్వ మలంకారమునకు వేదాంగత్వాదికము లేకపోవుటచే, నట్లూర కుండుట పాడి గాదని యెంచి "ఉపకారకత్వా దలంకారః సప్తమ మంగమ్... పంచమీ సాహిత్యవిద్యా ... ... సకల విద్యాస్థానైకాయతనం పంచదశం కావ్యం విద్యా స్థానమ్" అని స్వతంత్రమగు మార్గము ననుసరించెను.

రాజశేఖరుఁడు వ్రాసిన యీ యంశము స్వతంత్రమైన దగుటచేఁ దదనంతర కాలీనులచే నంగీకరింపబడి యుండకపోవచ్చును. కావుననే తద నంతర కాలీనుఁడగు మాధవాచార్యుఁడు తన సర్వదర్శన సంగ్రహమునఁ బ్రత్యేక ప్రత్యేకముగ శాస్త్రాంతములయొక్క యాశయముల నన్నింటిని బ్రతి పాదించియు నలంకార విషయము నెత్తుకొననైన లేదు. రసేశ్వరవాదులు రసమునే యీశ్వరునిగా వాదింతురు. ఆలంకారికుల మతమునను రసమే పరబ్రహ్మము. (పరబ్రహ్మసబ్రహ్మచారి.). ఈ రెండు మతములకును మూల మొక్కటియే; కాని రసేశ్వరవాదుల రసము వేఱు. ఆలంకారికుల రసము వేఱు. రసేశ్వరవాదుల మతమున రసశబ్దమునకుఁ బారద మర్థము. మాధవా చార్యులు రసేశ్వరవాదము నిరూపించునెడ నైనను ఆలంకారికుల మతమును సూచింపకుండుట విచారణీయము. అలంకారశాస్త్రము వ్యాకరణపరతంత్రమని యానందవర్ధన మమ్మటాదులగు నాలంకారికులే నుడువుటచే దానికిఁ బ్రత్యేక శాస్త్రత్వము, గౌరవము కలుగలేదని యనుకొనవచ్చును.

కాని యెడనెడ నిది శాస్త్రమని వాదములు బయలుదేఱినట్లు రాజశేఖరుని వచనము తెల్పుచున్నది. ప్రాచీనాలంకారికుఁ డగు దండ్యాచార్యుఁడు తన కావ్యాదర్శమున,

> "పూర్వశాస్త్రాణి సంహృత్య ప్రయోగా నుపలభ్య చ
> యథాసామర్థ్య మస్మాభిః క్రియతే కావ్యలక్షణమ్"
>
> [కావ్యాదర్శము-1 పరిచ్ఛేదము]

అని యలంకారము శాస్త్రమైనట్లే వ్రాసియున్నాఁడు. విద్యానాథ పండితుఁడు కూడ "వక్ష్యే సమ్యగలంకారశాస్త్రసర్వస్వసంగ్రహ"మ్మని తన ప్రతాప

రుద్రీయమున వచించినాడు. అప్పయ దీక్షితులును ''సవిశేషణేహితిన్యాయోపన్యాసో వాక్యమీమాంసకానాం శోభతే, నాలంకార మీమాంసకానామ్'' అని తన చిత్రమీమాంసయం దలంకారము శాస్త్రమే యని యుదాహరించెను.

మఱియు నలంకారము వేదాంగ మని కూడ రాజశేఖరుఁడు నిర్వచించి యున్నాఁ డని యీ వఱకే చెప్పఁబడినది.

న్యాయమునుబట్టి చూచినచో దీనికి వేదాంగతయు, శాస్త్రతయు, దర్శనతయు సరిపడఁ గలవు. న్యాయాదికము లగు కొన్ని శాస్త్రములకు వేదాంగత్వము లేదు. కాని, యెట్లు వ్యాకరణము వేదాంగము, శాస్త్రము, దర్శనమునగుచున్నదో యట్లే యలంకారము కూడను.

మన గీర్వాణ వాఙ్మయమున సకలశుభదాయకమును, ప్రధానము నగునది వేదము. దానిని రక్షించుకొఱకే వేదాంగము లుపకరించుచున్నవి. శిక్షాదు లగు షడంగములు నెట్లు తదర్థావగమమున నుపయోగించునో అలంకారము కూడ నట్లే యుపయోగించును. కావుననే రాజశేఖరుఁడు—

''ఉపకారకత్వా దలంకారః సప్తమ మంగమ్, ఋతేచ తత్స్వరూప పరిజ్ఞానాద్వేదార్థానవగతిః-యథా—

'ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి''

(ఋ. 1-124)

అని సోదాహరణముగ నిర్వచించినాఁడు. కాన నతఁడు స్వతంత్రించినను సమంజసముగ నుండుట నలంకారశాస్త్రము వేదాంగము కావచ్చును.

ఆయాశాస్త్రమున నాయాశాస్త్రమునకు సంబంధించిన పదార్థాదికము నిర్వచింపఁబడి, ఆయా రీతిగ నుండవలె నని శాసించుటను మనము చూచుచున్నాము. వ్యాకరణమునఁ బదవిచారమును, మీమాంసయందు వాక్యవిచారమును, న్యాయమునఁ బ్రమాణవిచారము నున్నట్లే యలంకారమున ధ్వన్యలంకారాది విచారము కలదు. కాన నవి శాస్త్రము లగుచో నలంకారము మాత్రము శాస్త్రము కాదని చెప్పుట కణుమాత్రము నవకాశము లేదు.

వ్యాకరణాదిశాస్త్రములకు దర్శనము లని కూడ వ్యవహారము కలదు. దర్శనములందు, ఏదో యొకరీతిగ బ్రహ్మవిచారము కాని తత్సంబంధము కాని కొంతవఱకు నిరూపింపఁబడియుండును. న్యాయ్యముగ దర్శనశబ్దము జ్ఞానార్థకము. వ్యాకరణాదులందు తత్తచ్ఛాస్త్రసిద్ధాంతములు జ్ఞాతవ్యములు. అట్లే యలంకార శాస్త్రమునుండి తద్జ్ఞానమును సంపాదింపవచ్చును. కాన నిదియు దర్శనమే యగును.

''అలంకారము దర్శనమే యైనచో బ్రహ్మవిచారముతోడి సంబంధ ముండ వలెను గదా! అది యిందు లేదే? దీనికి దర్శనత్వ మెట్లు?'' అని శంక కలుగ వచ్చును. పాణినీయదర్శనమున శబ్దబ్రహ్మ మెట్లో అలంకార దర్శనమున రస బ్రహ్మము నట్లే యగుటచేత నాశంక కవకాశము లేదు వారి మతమున శబ్దమే పరబ్రహ్మ. వీరి మతమున రసమే పరబ్రహ్మ. రసము బ్రహ్మమనుటలోఁ బ్రమాణ మే మందురేని కనుఁడు.

''రసోవై సః రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి!''

(తైత్తిరీయోపనిషత్తు. 2-7-1)

కాన నిదియు దర్శనము కావచ్చును. అలంకారశాస్త్రమును దర్శనమే యని యిప్పటి ప్రసిద్ధపండితు లంగీకరించియున్నారు. ప్రాచీనకాలమున నెటులున్నను, ఇక్కాలమున నలంకారశాస్త్రమునఁ బ్రత్యేకశిక్షణ మీయఁబడు చున్నది.

కాని వ్యాకరణాదిశాస్త్రముల కెంతటియవలంబమును, ఎంతటివ్యాప్తియు, గౌరవమును గలవో, ఈ యలంకారశాస్త్రమునకు మాత్రమిప్పటికిని-అట్టి యవ లంబనము - ప్రచారము - గౌరవము లేవు. కాన దీనావస్థలో నున్న యీ శాస్త్రము నుద్ధరించు భారము పండితులపైఁ బడియున్నది. దీని యుపయోగములు విద్వద్వేద్యములే యగుట విస్తరించి వ్రాయకుంటిని. విద్వద్వరేణ్యు లందఱు నీ శాస్త్రమునకు స్వాగతము నొసంగి గౌరవింతురు గాక !

—సాహిత్య పరిషత్పత్రిక.
ప్రజోత్పత్తి-చైత్ర వైశాఖములు. (1931)
సంపుటము- 20. సంచిక- 1,

# ఆనందత్రయము

## లౌకికానందము - కావ్యానందము - ఆత్మానందము

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి

### లౌకికానందము :

మన మొక కొండను గాని కోరిన వస్తువును గాని చూచి సంతసింతుము. పసిపాపల పలుకులుగాని కోయిలల యెలుగులుగాని విని సొగియుదుము. ఆగలు పొగలు గాని పూతావిగాని మూర్కొని మురియుదుము. తేనియలు క్రోలిగాని భక్ష్యముల నారగించిగాని తనియుదుము. మలయమారుత స్పర్శమువల్లగాని మిత్రుల యాలింగనము వల్లగాని మైమరతుము. ఈ సుఖమెల్ల జ్ఞానేంద్రియములవల్ల.

కర్మేంద్రియములచే గూడ నిటులే మనకు సుఖము కలిగించు వస్తువులు విషయములు కాగా మన మనుభవించునది విషయసుఖము, లేక లౌకికసుఖము.

ఇంద్రియములగుండ మనస్సునకు విషయములతో గలుగు సంబంధము నకు వృత్తియని పేరు. విషయముల కింద్రియములతో సంబంధ మున్నను మనస్సు వేరొకచో నుండెనేని విషయ జ్ఞానమే కలుగదు. ఇక సుఖమెట్లు కలుగును? దీనివల్ల సుఖ మనుభవించునది మనస్సని తేలినది.

అన్ని వస్తువుల వలనను అందరకును సుఖము కలుగదు. జంతుభేదము వలన స్వభావభేదము వలన కొన్ని వస్తువులవల్లనే కొందరికే సుఖము కలుగును. 'తలకొక బుద్ధి; నాల్కకొక రుచి' అని సామెత. మరియు విషయము లేనిదే లౌకిక సుఖము లేదు. ''గోవిందా యనుకొంచూ గొబ్బరీ తినుకొంచూ, నారాయణా యంచు నమలి కొంచూ'' అను పాటలో చెప్పినటులు సుఖసాధన మగు ఆహారమును ప్రీతితో నమలి భుజింతు మనుకొందము. నములుటతోబాటు ఆహారము స్వాద్యమై నమలిన కొలది సుస్వాద్యమై రస మగుచున్నది. అపుడు రసము గాని సత్త్వముచే పదునై ఏకాగ్రమైన చిత్తమునందు స్వాత్మానందము ప్రతిబింబించును. విషయోపభోగమునం దెల్లడ నిదే రీతి.

వేరొక రీతి—విషయలబ్ధి కలిగి కోరిక తీరగా చిత్తవృత్తి సాత్త్వికమై యేకాగ్రత చెందును. అపుడు దానియందు స్వాత్మానందము ప్రతిఫలించును. ఈ ప్రతిబింబానందమే విషయానందము. అనుభవ సమయము నందు చిత్తవృత్తి కిని చైతన్యమునకును సంబంధ ముండును గాన ఆ సుఖము అంతఃకరణ వృత్తితో గూడిన చైతన్య స్వరూపము. తాతగారి మాటలలో నిది యిట్టుల చెప్పబడినది :

శా. ''ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీపకళికశ్రీ దోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుగను...''

ఈ పద్య మింతవరకే ఉపయోగించు కొనవలెను. ఈ సుఖము 'పంచ కోశ వివేకముచే మిథ్యాత్మది యగునా కాదా? ఇది అంతర్బుద్ధి నూహింఁపుమా' అని ఆ వరూధినికే వదలుదుము.

సుఖ మందరకును అనుభవమే. కాని దానికి లక్షణము చెప్పుమన్న చెప్పుటకు తటపటాయించవలెను. 'యదర్థమ్ సర్వమ్ యచ్చ నానార్థమ్, తత్ సుఖమ్' అని సుఖమునకు లక్షణము. 'మనప్రవృత్తి యంతయు దేనికొరకో అది సుఖము. ప్రతివాడును ఏపని చేసినను అది సుఖము కొరకే కదా. మరియు ఏది మరొకదానికి ఉపాయము కాదో అది సుఖము. అనగా సుఖమే ఉపేయము. అనగా ప్రాప్యము. దానికి మరియొక ప్రాప్యము లేదు.

ఈ విషయ సుఖాతిశయమును (ముక్తిగా మోసగించుచు) తెనాలి రామ కృష్ణకవి,

సీ. ''కీలారముననుండి పాలింటి కేతేర
బహుధాన్యములు చేలఁ బండి యొలుగ
యెంనెడఁ బెండ్లిండ్లు వడుగులు పొదమఁ
గృతార్థులై యర్థించు నర్థు లలరఁ
బరిచారకాకోటి పనిపాటు పాటింపఁ
జుట్టంపు సందడి నెట్టుకొనఁగ
గ్రామ మెంతయు నిజప్రాభవంబున మన
సత్యనిష్టకుఁ దన్ను సాక్షి గోర

గీ. నిత్యనైమిత్తికము నిర్ణిద్రబుద్ధి
నాచరించుచు హరిభక్త మాత్మభార్య
భక్తినిడ భుక్తిఁ గొనుచున్కి ముక్తి గాని
నిఘర వంటిది రాతి వంటిదియుఁ గాదు.''

అని ఒక కరణము సుఖమో దేశపాండ్యాసుఖమో గొప్ప ఆనందముగా చెప్పెను. (ఇది గౌణాత్మ). తైత్తిరీయ మిట్లు చెప్పెను: ''ఆరోగ్యము, బలము దార్ఢ్యము, చదువు, ఇవి కల పిన్నవాని కీపృథివి యెల్ల యున్నచో నొదవు ఆనందము ఒక మానుషానందము. ఈ యానందము గూడ ఆరోగ్యాదులలో నేవి పోయినను పోవునుగాన అల్పము. దానినే - ''యో వై భూమా తత్ సుఖమ్, నాల్పే సుఖ మస్తి'' అని సనత్కుమారుడు. అనగా ఏది పరిపూర్ణమో అది సుఖము; అల్పము సుఖము కాదు. కాన దీని తెలియుముందు కావ్యానందము లేక రసానందము కనుగొందము.

కావ్యానందము :

పూర్వ మొకపండితుడు- 'ఇంతమంది పండితులు రసమునుగూర్చి తలా యొకరీతిగా తట్టెడు గ్రంథములు వ్రాసిరి. నేను సులువుగా చెప్పెదను వినుడు- గీ. 'పాలు గ్రోలెడు మార్జాలః పరివృథుఃడు'- అని చెప్పె నట. 'ఇందు రస మేమి కలదండీ ?' అని యడుగగా 'పాలకు మించిన రస మెక్కడ నున్న దయ్యా ?' అని అనెనట. 'సరే పద్యమునకు నాలుగు పాదము లుండవలెనే' అని అడుగగా, 'పిల్లికి లేవటయ్యా' అనెనట! కాగా రస మీమాంస పిల్లిపాలు కావలసి వచ్చెను. అది యటుండె.

మన కిపుడు తీరికయు, ఓపికయు లేదు గాన కావ్యాంగణములో గాక నాటక రంగములో ప్రవేశింతము. పుష్పోద్యానములో అదుగో ఇరువురు. ఒకడు యువకుడు, ఒక్తు యువతి. ఆమె తళుక్కున క్రీజూపునే అతనిపై తూపుగా విసరెను. అతని నెమ్మేను సనపకాయ యాయెను. వీరు వలపు గొన్నా రని మన కొకరు పాఠము చెప్పవలెనా ?

అదుగో ఇరువురు! కన్నులలో నిప్పులు! కంఠములలో పిడుగులు! వారుగో మల్లసరచుచున్నారు! వీరు క్రుద్ధు లని వార్తాపత్రికలు చూడవలెనా ? నిట్టూర్పు లతో విరిసినవెంట్రుకలతో కన్నీటితో మింటిమో మైయాతర మెరుగని ఒక డిదుగో! ఇతడు శోకదగ్ధ డని రాలకపప్పులకును దెలియును. ఇత డింకొకడు.

విప్పు కనులు, ప్రసన్న మగు మోము, రెప్పార్పని చూపు ఆనందాశ్రువులు, పులకలు, అనిశ్చలత- ఇతడు విస్మయావిష్టుడు కాడా ? మేన చెమరుతో కదలు కనీనికలతో ఎండిన ఓష్ఠములతో గద్గదకంఠముతో వడవడ వణకుచు ఇదే పోవువానిని చూచి మనమాట వినిపించుకొనకున్నను 'భయము వల దని' ఆశ్రయ మీయకుందుమా !

వీడుగో ఒక మీసము పైకి మరొకటి క్రిందికి! పొగపై రొట్ట మోకాల సొట్ట! ముక్కుమీద బొట్టు, ఎగుడుదిగుడు కట్టు! ఇట్టి ఇతనితో మనము శ్రుతి కలుపకున్న నవ్వెపోరా ?

అదె బూడిద బుస్సను శేల! గ్రద్దలు గోళ్ళకు మెలివైచిన ప్రేవులను ముకుపట్టుకారులతో లాగుచున్నవి ! కాలుచున్నతలనుండి మెదడు నురుగువలె వెలికుబుకుచున్నది. ఈ స్థితి చూచి వీ వే మనుదువో ! ఓహో, ఎట్టి జుగుప్స నీకు !

సముద్రమువలె గంభీరతా రామణీయకము లితనిలో! ఎదిరిని చూచి 'నీ కీ భ్రాంతి యేల ? నేటికేని మంచిదారికి రా! రాసిచో ఇదే నాబుజము కోలు లేని త్రాచు' అని అనుచున్నాడు. కర్తవ్యార్థములం'దితడు పట్టినపట్టు విడువ దని ఉడుములకును తెలియును. ఓహో, మనుష్యరూప మగు ని దెక్కడి తేజము! గోచిపాతరాయడు. ఏకాగ్రదృష్టి, పిల్లలు వెంటబడుచున్నారు! ఇతనికి చేతులు తమంత తామే మోడ్చును.

పరులమనోవికారములకు స్పందించుట అనగా హృదయసంవాదము చెందుట మానవస్వభావము. దీనికి సంస్కారము బీజము.

శబ్దశక్తియు, అర్థశక్తియు మనకు తెలియు ననుకొనుడు-భావనాశక్తియు వానికి తలకట్టుగా గలదు- ఇట్టి మనసు ఒక కవి చక్కని సన్నివేశములచే నాయి కాదులను కటాక్షపాతాశ్రుపాతాదులను హర్షచింతాదులను వర్ణింపగా నటీనటుల వాగంగసత్వాభినయద్వారమున వినుచు, కనుచు నున్నాము. వీనిలో నాయికానాయ కాదులు, వారి కటాక్షాదులు, ఉద్యానాదులు మన హృదయమున ప్రతిబింబించుటతో పాటు రస మంకురించెను. అనగా మనలోని రాగాదివాసన మేలుకొనెను. ఇపుడు సీతారాములో, శకుంతలాదుష్యంతులో వారివారి కటాక్షాదులో, అశ్రుపాతాదులో కార్యకారణములతో తమతమ సంబంధమునకు చెల్లుచీటి యిచ్చిరి. ఇపుడు వీనిని విద్వాంసులు విభావము లనియు, అనుభావము లనియు నందురు. రాగాది సహ

కారు లగు హర్షామర్షాదులు విభావానుభావములచే వ్యక్తము లగుచో వ్యభిచారు లందురు. మనము వీనిని విభావనము, అనుభావనము సంచారణమును చేయుదుము. ఇవి అలౌకికవ్యాపారములు. వీనికే సాధారణ, చర్వణ, స్వదన, భావన, వ్యంజన అని పేళ్లు. మన మిపుడు రసానందములో మునిగితిమి. ఇపుడు నాయికాదు లందును, వారి చేతలందును, చిత్తవృత్తులందును, పరత్వము గాని, మమత్వము గాని, పరకీయత్వము గాని, మామకీనత్వము గాని లేదు. మన ఈ రసానుభవవేళ విభావాదిత్రయము రత్యాది విశిష్టమై మిలితమై అభిన్నమై యున్నవి. ఇచట ఈ ఉద్దాలకుని మాట గమనింతము-'తేనెటీగలు నానాపుష్పముల నానారసముల కేకరసత్వ మొడగూర్చుచున్నవి. ఆ తేనియలో ఇది మావిపూరసము ఇది మాలతి పూరసము అని వేరుపరుపలేము-'యథా సోమ్యమధుమధుకృతోని స్తిష్ఠంతి నానాత్యయానాం వృక్షాణాగ్ంరసాన్ సమవహార మేకతాగ్ం రసం గమయన్తి తే యథాతత్ర నవివేకం లభన్తేఽముష్యాహం వృక్షస్య రసోఽస్మ్యముష్యాహం వృక్షస్య రసోఽస్మీతి.'(ఛాం.6-9)

ఈ రాగక్రోధహర్షామర్షాదులు వాసనలు. ఇవి సాక్షిభాస్యములు. లౌకికములగు రాగక్రోధహర్షామర్షాదులో చిదాభాసభాస్యములు. కావున వానిలోని క్రోధామర్షాద్యనుభూతిలో క్రోధాదులే గాని ఆనందము లేదు. లౌకిక రాగహర్షాదులం దేని కావ్యానందమువంటి ఆనందము లేదు.

మంచినాటకము చూడ మొదలిడుటతో ఇతరవృత్తులు పోయి హృదయసంవాదము కలిమి నాయికానాయకులయు గాని నాయకప్రతినాయకులయు గాని అనురాగక్రోధములచే మనలోని యనురాగక్రోధములు మేలుకొనును. ఇచట మనము ప్రేమించుటకు స్త్రీలును ద్వేషించుటకు శత్రువులును లేరు. కవి పుణ్యమా యని స్త్రీలు, శత్రువులు మొదలగువారు లేకుండనే కవి ప్రవేశపెట్టిన బొమ్మలమాటున మనలోని రాగక్రోధహాసశోక భయోత్సాహజుగుప్సావిస్మయ నిర్వేదాదు లుద్బుద్ధము లై మేళకర్త లగుచున్నవి. ఇవి మాత్రమే యేల? రసానుభవవిశ్రాంతి ప్రధానముగా ఇటనే గనుక. ఎంత వింత! ఈయలౌకిక వ్యాపార మావరణమును తొలగించినది. ఇపుడు స్వయంప్రకాశ మగు ఆత్మ సాక్షియై యీ యలౌకిక రాగాదులను ప్రకాశింప జేయుచున్నాడు. అలౌకికమగు ఈ రత్యాదికము సాత్త్వికము గాన స్వస్వరూపానందముతో కలిసి మనకు గోచర మైనది. భక్ష్యభోజ్యచోష్య లేహ్యములను నమలి ఆస్వాదించి రసము

గొని ఆనందించినట్లు విభావాదులచే అంకురిత మైనది కావుననే అలౌకిక మైన యీ రత్యాదిస్థాయిభావములను అనుభావసాత్త్విక భావసంచారిభావములతో నమలి-భావన చేసి-చర్వణ మొనరించి రసము గొని మన మానందించుచుంటిమి.

ఈ రసము జ్ఞాప్యమును, కార్యమును, నిత్యమును, అనిత్యమును భావము కలదియును, లేనిదియును, వర్తమానమును, భూతమును, భవిష్యమును సవికల్పన నిర్వికల్పకజ్ఞానవిషయమును, పరోక్షమును, ప్రత్యక్షమును కాదు లోకమునం దిట్టిది లేదు పోనిండు, అసలిది లేదందుమా? కలదనుటకు సహృదయుడెల్ల సాక్షి. కాననిది అలౌకికము. విషయానందముకంటె భిన్నము. విషయములు లేకుండ నీలోని రాగాదులను నీవు చర్వణ మొనరించి, సాక్షివై ఆనందించుచుండుట లేదా? ఇక జాలు.

ఈ యానందము గూడ చర్వణానమనంతరముననే అంతమగును గాన నిదియు నల్పము. కాన నిపు డాత్మానందము నన్వేషింతము.

ఆత్మానందము :

బృహదారణ్యక మీయాత్మానందము నెంతో సుందరముగ నిరూపించెను. యాజ్ఞవల్క్యుడు అమృతత్వమును గోరు మైత్రేయి కిటులు చెప్పెను-పత్నికి పతి ప్రియు డందురు. దానికి కారణము పతి కాదు. మరి యేమి? పతిలో పత్ని తన స్వరూపము చూచుకొనును. గావుననే పతి ప్రియుడు. ఇటులే పతికి పత్ని ప్రేయసి అని యందురు. దానికి కారణము పత్ని కాదు. మరి యెవరు? పత్నిలో పతి తన స్వరూపమును చూచుకొనును గావుననే పత్ని ప్రేయసి; కాగా తేలినదేమి? ''ఆత్మయే ప్రియతమ మని, ఆత్మసంబంధము లేనిచో నేదియును ప్రియము కాదు'' అని. ఆత్మప్రీతి కొక కారణము లేదు. విషయప్రీతికో సుఖము కారణము. అది ఆనందముయొక్కయే ప్రకాశము.

విశ్వ మెల్ల తన రూపరాశిచే మన ఆత్మలోని ఆనందమును మేలు కొల్పును. ఈ రూపరాశిలో మనము విశ్వాత్మనే చూడబడయునది. కావున ఈ రూపరాశి ఆత్మ యొక్కయే విశ్వరూపము.

ఏ యానంద మీ విశ్వమూలమునందో ఆ యానందమే మన హృదయార విందమందు-'కో హ్యే వాన్యాత్ కః ప్రాణ్యా ద్యదేష ఆకాశ ఆనందో న స్యాత్'

హృదయగుహాయం దానందము లేనిచో ఎవడు ఊర్చును? నిట్టూర్చును? అనగా బ్రతుకును? అని తిత్తిరి. ఆ యానందమే ఆత్మ-ఇటు లాత్మయే పరమాత్మ.

ఆత్మ ఆనందము కావుననే దాన నిరతిశయ ప్రీతి. ఆ యానందమే ఆత్మ. ఇటులు ఆత్మయే పరమాత్మ.

ఆత్మ ఆనందము కావుననే నిరతిశయప్రీతి! మనకానందము వలయును! ఏల? మన స్వరూపము ఆనందము కావున.

ఆత్మని విశ్వరూపము విశ్వప్రీతికి నిధానను. విశ్వప్రీతి కాత్మప్రీతి పునాది. కాన ఆత్మ అందరికంటె అంతరతరము. దాన ఆత్మ పుత్రుని కంటె విత్తముకంటె మరి యన్నిటికంటె ప్రియతరము. ప్రియతరము కావుననే ఆనందము.

మనకు బాహ్యవిషయములతో సంబంధము కలిగినపుడు ఆయావస్తువుల జ్ఞానము చిద్రూప మని తెలియవచ్చును. ఆత్మ ఆనందరూపమేని ఈ చిత్తవృత్తులలో చిద్రూపము తెలిసినటులు ఆనందరూపము ఏల తెలియదు ?

మన యింద్రియము లేకైకగుణగ్రాహులు. కన్నే రూపము గ్రహించును. చెవియే శబ్దము నెరుగును. అటులే చిత్తము సత్త్వవృత్తిచేతనే ఆనందమును పొందును. చిత్తమునందు సత్త్వరజస్తమస్సులు చక్రనేమి క్రమముగను, అక్రమముగను తిరుగుచుండును. సత్త్వవృత్తి కాదాచిత్కము. అది మాత్రమే ఆనందగ్రాహకము. రజోవృత్తి మలినము. కాన ఆనందాంశము తిరస్కృతము. సత్త్వవృత్తికో ఇచ్చ లేదు. అది శుద్ధము. కాన అందు చిదానందైక్యము గోచరించును.

"రసోవై సః రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" అని తిత్తిరి. అనగా-అతడు రసమే. జీవుడు రసమును పొందియ కదా ఆనంది యగుచున్నాడు.

సారము లేక స్థిరాంశమే రసము; దాని గ్రోలియే మన మానందింతుము. విషయసుఖమునం దిది విశ్వజనీనము.

నిద్రలో విజ్ఞానఘనోపాధికు డగు ఆనందమయుడు సూక్ష్మములగు అజ్ఞాన వృత్తులచే ఆనంది యగును. అపు డతడు సాక్షియు భోక్తయు.

కావుననే అతడు- ''సుఖముగ నిద్రించితిని; ఏమియు నెరుగను'' అని మెలకువగని అనును. ''సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్ చేతోముఖః'' (మాం. 1.5.).

ఆవరణము లేమియే ఆనందము. ఆనందసంవేదన మిందు లేదు. అదియ ఆనందస్వరూపము. కాగా ఆవరణము లేని ఆత్మ ఆనందము. కావున ఆత్మనే ఉపాసింపవలెను- ''ఆత్మాన మేవ ప్రియ ముపాసీత'' (బృ. 1.48).

ఇటులుకాక ''నేను వేరు'' ''దేవుడు వేర''ని దలచు వా డజ్ఞుడు; వాడు దేవతలకు పశువు- ''అన్యోఽసా వన్యోఽహమ స్మీతి, నసవేద. యథా పశు రేవం సదేవానామ్''. [బృ. 1-4-10]. ఇటులు ఆత్మయే బ్రహ్మము. ఆత్మా నందమే బ్రహ్మానందము. అఖండమగు ఆత్మాకారచిత్తవృత్తి కలుగుటయే ఆవరణనాశము. ఆ చిత్తవృత్తి క్రమక్రమముగా ఆత్మహత్య చేసికొనును. నిర్మలమును నిస్తరంగమును అగు ఆనందము! విషయలబ్ధివల్ల చిత్తము సాత్త్వికమై ఏకాగ్రత చెందగా, అందు ప్రతిబింబించిన స్వాత్మానందమే విష యానందము లేక లౌకికానందము.

విషయములవల్ల చిత్తము సత్త్వము చెంది ఏకాగ్రత పొందగా అందు ప్రతిబింబించిన స్వాత్మానందమే లౌకికానందము.

కవివ్యాపారముచే ఏకాగ్రమైన చిత్తమున మేలుకనిన రాగాది వాసనలతో కలిసి భాసించు శుద్ధచైతన్యానందమే రసానందము, లేక కావ్యానందము.

చిత్తవృత్తులు భస్మీభూతములు కాగా ఉన్మన్యవస్థలో శేషించిన ఆనందమే ఆత్మానందము.

—భారతి.

ఆగస్టు 1955

సంపుటము 32; సంచిక 8.

—: o :—

# కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన

— శ్రీ దూసి రామమూర్తి శాస్త్రి

ఆంధ్రాలంకార గ్రంథములలో నెల్లఁ బ్రాచీన మనఁదగు నీకావ్యాలంకార చూడామణిని విన్నకోట పెద్దన కవివరుఁడు రచించి శ్రీ చాళుక్య విశ్వేశ్వర రాజునకుఁ గృతి యొసంగెను. ''ఈ చాళుక్య విశ్వభూపతి మనుమఁ డగు నృసింహభూపతి క్రీ. శ. 1403వ సంవత్సర ప్రాంతమునఁ బంచతీర్థమునందలి ధర్మలింగేశ్వర స్వామికి నాలయమును గట్టించిన ట్లొక శిలాసన మగపడు చున్నది తాతకును, మనుమనికిని నేఁబదియేఁడు లంతర ముండు నని యంగీక రించినచో క్రీ. శ. 1350 సంవత్సర ప్రాంతమునఁ గృతిపతి యగు చాళుక్య విశ్వభూపతి యుండుట సంభవించును. కావున నీ గ్రంథము క్రీ. శ. 14వ శతాబ్ది మధ్యకాలమున రచింపఁబడి యుండును'' అని కీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులు గారు గ్రంథకాలమును, గ్రంథకర్తకాలమును దేట పఱచియున్నారు.

మఱియుఁ నీగ్రంథమునందలి చతుర్థపంచమోల్లాసములలోఁ జేర్పఁబడిన గుణాలంకార భాగములు దప్ప దక్కిన భాగములన్నియు సామాన్యముగఁ బ్రతాపరుద్రీయము ననుసరించియే యాంధ్రీకరింపబడినవి గాన నీగ్రంథము కాకతీయ ద్వితీయ ప్రతాపరుద్ర దేవాంకితమై క్రీ. శ. 1320 ప్రాంతమునఁ బుట్టిన ప్రతాపరుద్రీయమునకుఁ దరువాత రచియింపఁ బడియుండు నని నాకుఁ దోచుచున్నది.

సామాన్యముగ గ్రంథమంతయుఁ బ్రతాపరుద్రీయమునే యనుసరించుటం జేసి ప్రతాపరుద్రీయానుసరణము సోదాహరణముగఁ జూపుట యనావశ్యకము. ఐనను మచ్చునకై కొన్ని యుదాహరణములఁ జూపెదను:

మూలము : 'యా పదానాం పరాఽన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే.'

ఆంధ్రీకరణము : 'మృదుతర మై యొండొంటికిఁ
బదమిత్రత గలిగి నొడువు పలుకులలోనన్
బొదలెడు నర్థం బెచ్చట
నదలించి శయించు శయ్య యనఁగా నదివో.'

మూలము : 'అర్థగంభీరిమా పాక స్స ద్వేధా హృదయంగమః;
ద్రాక్షాపాకో నారికేలపాక శ్చ ప్రస్ఫుటాంతరౌ.'

ఆంధ్రీకరణము : 'పాక మనంగా నర్థని
రాకులగంభీరయుక్తి యది యిరుదెఱఁగై
లోకమునఁ బేర్చు ద్రాక్షా
పాకంబును నారికేలపాక మనంగాన్.'

మీఁద నిరూపింపఁ బడిన యుదాహరణములలో యతిప్రాసముల నిమిత్తము, పద్యపాదపూరణార్థము ప్రతాపరుద్రీయ లక్షణములలో లేని మాటలు క్రొత్తగాఁ జేర్చబడినవి. ఇఁక మక్కీకి మక్కీగా నాంధ్రీకరించిన స్థలములను గొన్నింటిని జూపెదను.

మూలము : 'శ్రుతికటురూప దోషనిరాకరణాయ సౌకుమార్యం మతమ్.'

ఆంధ్రీకరణము : 'శ్రుతిపరుషత మాన్పుటకై
మతికర్తవ్యంబు సౌకుమార్యము చెప్పన్.'

మూలము : 'గ్రామ్యదోష నిరాకరణాయ కాంతి స్స్వీకృతా.'

ఆంధ్రీకరణము : 'చతురతఁ గాంతి ఘటించుట
వితత గ్రామ్యార్థహరణవిశ్రుతిఁ జేయున్.'

మూ : 'అస్పష్టార్థ నిరాకరణా యార్థవ్యక్తి ర్మతా.'

ఆం : 'కృతు లన పుష్టార్థప్రవి
హతికై చొనుపంగవలయు నర్థవ్యక్తిన్.'

మూ : 'న్యూనాధిక పదనిరాకరణాయ సమ్మితత్వం మతమ్.'

ఆం : 'వితతన్యూనాధికపద
యుతిహతికై సమ్మితంబు నొప్పం గవితన్.'

మూ : 'అనుచితార్థ నిరాకరణార్థ ముదాత్తతా స్వీకృతా.'

ఆం : 'అనుచితార్థనిరాకరణాప్తికొఱకు
నగు నుదాత్తతఁ గావ్యంబులందుఁ జొనుప.'

మూ : 'విసంధి నిరాకరణాయ ఔర్జిత్యం మతమ్.'

ఆం : 'యుక్తపాద విసంధి విచ్యుతి యొనర్చు
పనికి నూర్జస్వి కర్జంబు పద్యములను.'

మూ : 'పతత్ప్రకర్ష నిరాకరణాయ రీతి రిష్టా;
క్లిష్టపరిహారాయ ప్రసాదో మతః.'

ఆం : 'తుదిఁ బతత్ప్రకర్షదోషాపహతికినై
యుక్తరీతిఁ గావ్య మొగి నొనర్చ
నప్రతీతికపరిహారంబు కొఱకు
సుప్రసాదగుణముఁ జొనుపవలయు.'

మూ : 'అశ్లీలపరిహారార్థ ముక్తి స్స్వీకృతా
చ్యుతసంస్కార పరిహారార్థ సౌశబ్ద్య మిష్టమ్;
ప్రక్రమభంగనిరాకరణాయ సమతా మతా.'

ఆం : 'చ్యుతసంస్కృతి మానుటకై
యతిమధురసుశబ్దవృత్త మగు నొనరింపన్
ప్రతతప్రక్రమభంగా
హతికై సంక్రమత కూర్ప నగు నండ్రు బుధుల్.'
'ప్రేయోఽలంకారము దా
శ్రేయం బగుఁ బరుషదోషశిథిలత కొఱకై
చేయఁ దగు సూక్తితంత్రము
హేయాశ్లీలంబు దొలఁగ నెగుచుటకొఱకై.'

ఇట్లే యచ్చటచ్చటఁ బ్రతాపరుద్రీయము ననుసరించి మక్కీకి మక్కీగా లక్ష్యములు ఆంధ్రీకరింపఁబడినవి.

మూ : 'వ్యర్థాష్టాబాహూనా, మమీషా మీదృశాం దృశామ్;
కథం సహే మహే ధిగ్ధి, క్కఠినం హంత జీవితమ్.'

ఆం : 'జగతి నెనిమిదింటి సగములో సగ మగు
భుజము లాహవములఁ బొల్లు లగునె

భూపతులకు నన నపుష్టార్థ మర్థార్థ
పదను లర్థపుష్టి పదము గామి.'

మూ ; 'బాష్పాంబుక్లిన్న నేత్రాణి, ముఖాన్యంగ మృగీదృశామ్;
హిమదూషితపత్రాణి, కుముదా నీవ నిర్మదామ్.'

ఆం : 'బాష్పకణకీర్ణ మై యొప్పు బఱఁతిమోము
మంచు నిండిన తొగపువ్వు మాడ్కి నినిన
నప్రసిద్ధోపమార్థ మై యదరు నంద్రు
కుముదముఖముల కుపమా ప్తి గూడ కునికి.'

మూ : 'కా నామ గణనా యస్య కాకతీయస్య భూపతేః;
యశః ప్రతాపయో ర్మగ్నౌ సూర్యాచంద్రమసా వపి,
క్షామక్షామముఖాః కాంతాః కాననే మాలవేశితుః;
గ్రీష్మే నద్య ఇ వామ్లానపద్మోత్పల బిసావిలాః.'

ఆం : 'శ్రీవిష్ణువర్ధనాఖ్య
క్ష్మావరుకీర్తి ప్రతాపమహిమలతో రా
జీవేందీవరమిత్రులు
కావింతురు చెలిమి యనఁగఁ గ్రమభంగ మగున్.'
'వికలముఖు లైన యరివధూటికలు క్లాంత
నలినకైరవ లగు గ్రీష్మనదులభంగి
నైరి నా నధికోపమ మయ్యె నరయ
నందుఁ గైరవ ముపమకు నధిక మగుట.'

ఇట్టి వనేకములు గలవు; కాని విస్తరభీతిచే నుదాహరింపనైతి.

ఇందుఁ జతుర్థపంచమోల్లాసములలోఁ బేర్కొనఁబడిన గుణరీత్యలంకార సందర్భములు దండి కావ్యాదర్శము ననుసరించి రచింపఁబడిన వనుటకుఁ బ్రతాప రుద్రీయమునందువలెఁ గాక యిందు దండ్యాచార్యు ననుసరించి గుణదశకము నంగీకరించుటయు, దండ్యుక్తాలంకార లక్షణములతో నిందలి యలంకార లక్షణములు సరిపడియుండుటయు, దండివలెనే తత్తదలంకారముః క్రిందనే తత్తద్దోషముల నిరూపించుటయు, నిర్హేతుకముగ నలంకారములవరుసయు సరిపడి యుండుటయుఁ గారణములుగాఁ జాలును.

కావునఁ బైని నిరూపించిన కారణ సమూహముచే గుణాలంకార సందర్భములు దండికావ్యాదర్శము ననుసరించి రచింపఁబడిన వని చెప్పకతీరదు. 'రీతి రాత్మా కావ్యస్య', 'రీతి శ్చగుణవిశిష్టపదరచనా' అను వామనసూత్రము ననుసరించి పెద్దన,

గీ. 'అఖిల కావ్యంబులకు రీతు లాత్మ యండ్రు;
ప్రాణదశకంబు వానికిఁ బ్రాణ మరయ;
ధర నలంకార మతవిభేదముల నవియు
పెక్కు; లొకకొన్ని తగఁ గానిపింతుఁ దెలియ.'

అని రీతిలక్షణమును గల్పించెను. దండియు దశగుణవిశిష్ట పదరచనయే రీతియని యంగీకరించెను గాని యట్టిరీతిని కావ్యాత్మగా నంగీకరింపక కావ్యశరీరముగా నంగీకరించి యున్నాఁడు.

మూ : 'శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ...'

కావున రీతి లక్షణము వామనసూత్రము ననుసరించి కల్పింపఁ బడినదని చెప్పవలసి వచ్చినది. కాని 'రీతి రాత్మా కావ్యస్య, రీతిశ్చ గుణవిశిష్టపదరచనా' అను వామనసూత్రములోని 'ఆత్మన్' శబ్దమునకు మనసుగాక శరీర మర్థ మని యొప్పినచో వామనుఁడును 'తైశ్శరీరం చ కావ్యానా మలంకారా శ్చ దర్శితాః, శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ' అను దండి మార్గము ననుసరించియే రీతి లక్షణమును నిరూపించెనని చెప్పుట కవకాశము గలదు. మొత్తము మీఁద ఇష్టార్థ వ్యవచ్ఛిన్నపదావలియే వామనుని రీతి యగుచున్నది. కానఁ బెద్దనయు దండి ననుసరించియే రీతిలక్షణమును నిరూపించెనని చెప్పుట కవకాశము గలదు.

మఱియుఁ గావ్యాదర్శ ప్రతాపరుద్రీయముల లేనట్టియు, సాహిత్య దర్పణాదులం దగుపడునట్టియు లాటికారీతి, ధీరాధీరాది నాయికాభేదములు, నృసింహ సంకరము మున్నగు నూతనవిషయము లిందుఁ జేర్పఁబడినవి. ఇంకఁ గుణరీత్యలంకార సందర్భములకు దండి కావ్యాదర్శము మూలమను నంశమును దిజ్మాత్రముగఁ జూపెదను.

దండి కావ్యాదర్శమునఁ దత్తదలంకారముల క్రిందనే తత్తద్దోషములను, దత్తద్దోషములకు గుణత్వమును బ్రతిపాదించి యున్నాఁడు.

మూ : 'లింగవచనే భిన్నే న చ న్యూనాధికోపమే
ఉపమా దూషణాయాలం యత్రోద్వేగో న ధీమతామ్.
స్త్రీవ గచ్ఛతి షండోయం వక్త్యేషా స్త్రీ పుమా నివ
ప్రాణా ఇవ ప్రియోఽయం మే విద్యాధన మివార్జితా.
భవా నివ మహీపాల ! దేవరాజో విరాజతే
అల మంశుమతః కక్షా మారోఢుం తేజనా నృప !
అస్త్యేవ కశ్చి దుద్వేగః ప్రయోగో వాగ్విదాం యథా
హంసీవ ధవలశ్చంద్ర స్సరాంసీ వామలం నభః ;
భర్తృ ముక్తో భట స్యేవ ఖద్యోతో భాతి భానువత్.'

ఇట్లే కావ్యాలంకార చూడామణి కర్తయు మున్నుపమాదోషములకు గుణత్వము నిరూపించి యనంతర ముపమాదోషములను, దండిప్రకరణమును గ్రమముగా నాంధ్రీకరించి నిరూపించెను.

క. 'లింగంబుల వచనంబుల
భంగులు హీనాధికతల పాటియు వీడ్వా
టుం గదిరిన నుపమను నిం
పుం గలుగం జేయు నంద్రడు బుధు లుచితోక్తిన్.'

గీ. 'అరుగుచున్నాఁడు పేడియాఁ డతివ వోలెఁ
బలుకు చున్నది పురుషునిపగిది నింతి
ప్రాణములు నాకు సీతఁ డుపార్జితార్థ
మున్నివిద్యలు నసుపు నెసఁగు నుపమ.'

క. 'దేవా, నీ చందంబున
దేవేంద్రుం డొప్పె నచటు దినకరుగతి ను
ర్వీవరుఁడు తేజమున సం
భావితుఁడన నుపమ చెల్లు బ్రౌఢప్రియమై.'

గీ. 'హంసివోలెఁ జంద్రుఁ డవదాతుఁడు, నభంబు
కొలకులట్లు సితము, నుక్క వోలె

సించు బంటు పతికి నినుఁ బోలె ఖద్యోత
మనెడు నుపమ లపహసనకరములు.'

శ్లో. 'ప్రసిద్ధిహేతువ్యావృత్త్యా యత్కించి త్కారణాంతరమ్
యత్ర స్వాభావికత్వం వా విభావ్యం సా విభావనా.'

అను కావ్యాదర్శములోని విభావనాలక్షణ మీ క్రిందివిధమున నాంధ్రీకరింపఁ బడినది.

గీ. 'సహజవిఖ్యాతహేతువు జాఱవిడిచి
కారణాంతరకల్పన కథన మొండెఁ
గామవిహిత స్వభావసంగతియ యొండె
నమరఁ బల్కు విభావన యండ్రు బుధులు.'

పెద్దన గుణరీత్యలంకారసందర్భ మంతయు సరిగా దండి ననుసరించియే యాంధ్రీకరించి యుండుటచే దిఙ్మాత్రముగా నుదాహరించి విరమించితిని. కావ్యాదర్శమునందు వలెనే యిందును నలంకారములు యథాక్రమముగ నిరూపింపఁ బడినవి. కాని కావ్యాదర్శమున నలంకారములుగాఁ బరిగణింపఁబడని యుదారవక్రోక్తులును, భావికమును నిం దలంకారములుగాఁ జేర్కొనఁబడినవి. మఱియుఁ గావ్యాదర్శమున నలంకారముగాఁ బరిగణింపఁబడిన సంకర మిం దలంకారముగాఁ బరిగణింపఁబడలేదు. కావుననే దండి చెప్పిన ముప్పదినాల్గలంకారము లిందు ముప్పదియా ఱయ్యెను. ఈ యిసుమంత భేదము దక్క వేఱొక భేద మీసందర్భమునఁ గానరాదు.

ఇందలి గుణరీత్యలంకారసందర్భములు కావ్యాదర్శమునుండియు దోషాది సందర్భములు ప్రతాపరుద్రీయమునుండియు సంగ్రహింపఁబడిన వగుటచే నీపొత్తమునఁ గొన్నియంశములు పునరుక్తములును, గొన్ని పూర్వాపరసందర్భ విరుద్ధములును నగుచున్నవి. దండి కావ్యశోభాకరధర్మము లన్నియు నలంకారములే యని తలంచి యా యలంకారములను గుణరీత్యలంకార రూపముగా నిరూపించి విరమించెను. మఱియు పాకము, వృత్తి, శయ్య, రసము, ధ్వని, వ్యంగ్యము మున్నగు వానిని జెప్పనేలేదు. వీనికిఁ గావ్యశోభాకరణమే ప్రయోజన మగుటం జేసియు, వీని కంతగాఁ బరస్పరము భేదము లేమింజేసియు నాతఁ డుపేక్షించెను.

ఈ యంశము "కావ్య శోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే; తే చాద్యాపి వికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి. కాశ్చిన్మార్గవిభాగర్థ ముక్తాః ప్రాగ ప్యలంక్రియాః, సాధారణ మలంకారజాత మద్య ప్రదర్శ్యతే' అను దండిగ్రంథము వలన స్పష్టమగుచున్నది. కావున దండి యిన్నియవాంతరభేదములఁ బరిగణింపలే దనియు నలంకారదోషములను రెండేభేదములఁ బరిగణించె ననియు దండిగ్రంథ మును సువ్యక్తముగాఁ జూచినవారలకు విశదము కాకమానదు. మఱియు విద్యా నాథాదులవలె దండి కావ్యము నొకకాంతగాఁ దలంచి దానికి లోకసామగ్రిని సమకూర్పలేదు.

విద్యానాథుఁ డట్లుగాక వృత్తి, శయ్య, పాకము, రీతి, గుణము, అలంకా రము, రసము మున్నగు ననేక భేదముల నిరూపించి వానికిఁ బరస్పరము భేద మునుఁ జెప్ప యత్నించి తన గ్రంథమున ననేక పునరుక్తములు చొచ్చుట కవ కాశమును గల్గించెను. మఱియు గుణాలంకారకథనముచే గతార్థ మగు దోష ప్రకరణమును, దోషప్రకరణముచే గతార్థ మగు గుణాలంకారప్రకరణమును నిరూపించి గ్రంథమును గలుషపఱచియున్నాఁడు క్షయసంవత్సర జ్యేష్ఠాషాఢ సాహితీపరిషత్పత్త్రికలో మదాంధ్రగురు లగు బ్ర. శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారిచే వ్రాయఁబడిన 'కావ్యగుణములు' అను వ్యాసమున దీని విస్తరము చూడనగును.

మొత్తముమీఁదఁ బ్రతాపరుద్రీయములోనుండి యిచటికిఁ దిగిన పునరు క్తులు గొన్నియు విభిన్నము లగు దండి విద్యానాథమతములు జోడించినందున సంభవించిన పునరుక్తి పూర్వాపరసందర్భవిరోధములు గొన్నియు నీగ్రంథమున సమావేశమైన వని తత్తత్సందర్భపరిశీలనమువలన సువ్యక్త మగుచున్నది.

దండిమతము ననుసరించి యుపమాలంకార సందర్భమున "లింగంబుల వచనంబుల" అను మున్నగు పద్యములచే నుపమాదోషములను బేర్కొని యున్నాఁడు. తిరుగ వానినే విద్యానాథమతము ననుసరించి రచియింపఁబడిన దోష ప్రకరణమునందును నిరూపించియున్నాఁడు. కావ్యదోషప్రకరణమున నిరూ పింపఁబడిన భిన్నలింగ, భిన్నవచన, న్యూనోపమాధికోపమాద్యుపమాదోషములు పునరుక్తము లగుచున్నవి.

మఱియు గుణములు దోషములం దొలఁగించుటకే యంగీకరింపబఁడినట్లు ప్రతాపరుద్రీయమునను, నద్దాని ననుసరించిన చూడామణియందును జెప్పఁబడినది. కాన నేయేదోషములఁ దొలఁగింప నేయేగుణము లంగీకరింపఁబడినవో ఆయా

గుణములు కావ్యములో నుండ నాయాదోషములు కావ్యములోఁ జొచ్చుట కవకాశము లేదు గదా. కావున గుణములను జెప్పిన దోషములఁ జెప్ప నవసరములేదనియు, దోషములఁ జెప్పిన గుణములఁ జెప్పనక్కరలేదనియు విశద మగుచుండుటం జేసి దోషప్రకరణములోని గుణములచే నపాకృతము లగు దోషములు పునరుక్తము లనఁజనును. (చూ. ప్ర. రు. గుణప్రకరణము).

మఱియు దండి ననుసరించి యర్థసందర్భద్యోతకము లగు గుణదశకము నంగీకరించి నపుడు దండి చెప్పిన దశవిధదోషములు దక్క నితర దోషములు కావ్యములోఁ జొచ్చుట కవకాశమేలేదు. కావుననే దండి గుణాలంకార కథనముచే నగతార్థము లగు దోషములఁ బదింటిని మాత్రమే పేర్కొని విరమించెను.

పెద్దనార్యుఁ డన్ననో దండిమతము ననుసరించి తత్తదలంకారసందర్భము లందే తత్తద్దోషములఁ బేర్కొనియుఁ దిరుగ ముందువెన్క లరయక వానినే విద్యానాథ నిరూపితదోష ప్రకరణాంధ్రీకరణ సందర్భమునసైతము నిరూపించెను. కాన సుపరినిరూపితదోషములు పునరుక్తము లైన వని గ్రహించునది.

పెద్దన ద్వితీయోల్లాసమునఁ బ్రతాపరుద్రీయము ననుసరించి రసముల నలంకార్యములనుగా నిరూపించి యున్నాఁడు. అలంకారప్రకరణమున దండి ననుసరించి యారసములనే యలంకారములుగాఁ బేర్కొనియున్నాఁడు. దండి రసవదలంకారములక్రింద రసము లన్నింటి నుదాహరించుటఁ బట్టి చూడ గుణాలంకారములవలె రసములును గావ్యశోభాకరధర్మములే యని తలంచి యంగిభూత రసములును, నంగభూతరసములును నలంకారములక్రిందనే పరిగణించె నని చెప్పవచ్చును.

శ్లో. రసభావ తదాభాస భావశాన్త్యాది రక్రమః ;
భిన్నో రసాద్యలంకారా దలంకాతయా మతః.

అను మున్నగు సందర్భములను బట్టి విద్యానాథునిమతమున నంగభూతరసము లలంకారము లనియు, నంగిభూతరసములు రసము లనియు. సువ్యక్త మగుచున్నది. కావుననే యాతఁడు రసము కావ్యశ్రీకిఁ బ్రాణమువంటి దనియు గుణాలంకారాదులు శౌర్యహారాదులవంటి వనియు నంగీకరించియున్నాఁడు. కావున నీతని మతము ననుసరించి రస మలంకార్యమ యగును.

రస మలంకారముగా నంగీకరించిన నయ్య దలంకార్యము గాఁజాలదు గదా ! కటకకుండలాదులు కావ్యశ్రీకి జీవితప్రాయములు గానేరవుగదా ! కావున రసముల నలంకారములను నంగీకరించిన దండిమతమున నియ్యవి యలంకార్యములు గాఁజాల వనుట నిర్వివాదాంశము. అట్లే రస మలంకార్య మయ్యెనా యయ్యది యలంకార మెన్నఁడును గాఁజాలదు. జీవిత మెన్నఁడును శోభాదాయకాలంకారము గానేరదు గదా ! కావున రసమును జీవితముగాఁ (అలంకార్యముగా) నంగీకరించిన విద్యానాథమతమున నయ్య దెన్నఁడును నలంకారము గానోపదు. ఇట్టి స్థితిలోఁ బెద్దన రసముల నలంకార్యములుగ ద్వితీయోల్లాసమునఁ బేర్కొని తిరుగ వాని నలంకారప్రకరణమున నలంకారములుగ నిరూపించుట పూర్వాపర సందర్భవిరుద్ధముగ నున్నది. ధర్మము ధర్మియు నొకే వస్తువు కాఁజాలనట్లు రస మలంకార్యమును, నలంకారమును గాఁజాలదు. కాన బెద్దన ముందువెనుక లరయక కేవలసూక్ష్మమార్గాపేక్షతో దండిగ్రంథము నందలి గుణాలంకారప్రకరణము నాంధ్రీకరించె ననియు, దండివిద్యానాథుల మతములు భిన్నము లని తలంపక యేగ్రంథ మార్గము నవలంబించినపు డాగ్రంథమార్గమునే యనుసరించుచు నవిమర్శముగ నాంధ్రీకరించె ననియు, నక్కారణమున నిట్టిపూర్వాపరసందర్భవిరుద్ధవిషయము లింపుఁ గల్గె ననియుఁ జెప్పవచ్చును

అలంకారప్రకరణమున లవాలంకార ప్రస్తావమున లవలక్షణములో వినుతి నిందలను లవాలంకారస్వరూపములుగఁ బేర్కొనియుఁ దిరుగ వినుతి నిందార్థప్రతిపాదక మగు లవసజాతీయ మగు వ్యాజోక్తిని గూడ నిరూపించుటచే నిందలి వ్యాజోక్తి పునరుక్త మగుచున్నది. వినుతినిందలు మతాంతరాంగీకృతము లైనట్లు "లేశ మేకే విదుః" అను కారికలోని "ఏకే" అను శబ్దముచే దండి సూచించుటచే దండి వ్యాజోక్తి పునరుక్తము గానేరదు. ఈతఁడట్లుగాక భావమునఁ దోఁచు వస్తుగోపనమును, వినుతినిందలును, లవాలంకారస్వరూపములుగానే నిరూపించుటంజేసి యిందలి వ్యాజోక్తి యుండ దనియు, వస్తుగోపనము మాత్రమే లవాలంకార స్వరూపముగ నంగీకరించి వినుతినిందలు మతాంతరములుగా నంగీకరించినవారి మతమున వ్యాజోక్తి యుండదగుననియు నభిప్రాయము.

ఇందలి విలక్షణములు సంస్కృతలక్షణములవలె స్పష్టార్థము నీయఁజాలకున్నవి. మఱియు నొక్కొకచో విపరీతార్థమును గూడ నొసంగ క్షమములై యున్నవి. యతిప్రాసపద్యపూరణార్థము ప్రయుక్తము లైన వ్యర్థపదములు

రావలసిన యర్థమును రాకుండఁ జేయుచున్నది. మఱియు లక్షణములు స్వకపోల కల్పితము లౌట చేతను, విశ్వేశ్వర రాజాంకితము లగుటచేతను స్పష్టానీయఁ జాలకున్నవి. విమర్శకుఁడు వస్తు గుణమును మాత్రమే విమర్శింపక యందలి దోషములను గూడ నిరూపింప వలె ననియుఁ దన్మూలమున నుపయోగము గల దనియు విమర్శకు లందురు కాననే నిందలి దోషలేశములఁ జూపితిని గాని దోషారోపణబుద్ధితోఁ గాదని సహృదయులు గ్రహింతురు గాక!

మఱియు విభిన్నమార్గ గ్రంథద్వయానుసరణచే నీ గ్రంథమున నీదోషలేశములు కల్గెనని తెలియఁజేయ నింతమట్టు వ్రాసితిని. ఆంధ్రమున కలంకార గ్రంథములు లేని కొఱంతను దీర్చిన పెద్దనాదులయెడల నాంధ్రపండితు లెల్లరు కృతజ్ఞులై యుండవలసి యున్నది. కాని సాహిత్యదర్పణాదులవంటి చక్కని లక్షణగ్రంథ మొకటి యాంధ్రమున నుదయించువరకు నాంధ్రమున నలంకార గ్రంథము లేదనియే చెప్పవచ్చును. కాన సమర్థులగు సహృదయు లట్టి మహోపకార మొనర్చి యాంధ్రమాత నలంకరింతురు గాక !

—భారతి

అక్షయ-పుష్యము; జనవరి-1927

సంపుటము 4, సంచిక 1.

—oo॰oo—

# కవిత్వము

డాక్టర్ పాటిబండ మాధవశర్మ

౧

కవిత్వ మొకసృష్టి. ఈసృష్టి రెండు విధములు; బహిస్సృష్టి, అంతస్సృష్టి, అనగా దృశ్యమాన మగు జడజగత్తు ఒకసృష్టి, దాని పరమార్థము ఒకసృష్టి. జడత్వము ప్రధానముగా భగవంతుఁడు కావించిన యీసృష్టిసే కవి పరమార్థము ప్రధానముగా సృష్టించును. బుద్ధిమంతులు ప్రపంచము మాయ యని చెప్పినారు. ఏలన, దృశ్యమాన మగు జగత్తంతయు నశ్వరముగనే యున్నది. అనశ్వరమైన దాని పరమార్థమును కనుగొనలేనంతవఱకు దాని బాహ్యరూపమే మనకు తథ్యము. పిమ్మట మిథ్య; అనగా లేనిది. ఉన్నది దానిపరమార్థ మొక్కటే. కవిసృష్టి కీపరమార్థమే పదార్థము. అనగా జడప్రకృతి యను పదార్థమునకు చైతన్యము నొసంగు తేజస్సు కవిసృష్టికి పదార్థము కనుక కవిసృష్టియంతయు తేజోమయము. అందు నశ్వర మగు జడత్వ మేమియు లేదు. పరిష్కరించినచో జగత్సృష్టి జడత్వప్రధానమనియు, కావ్యసృష్టి తత్త్వప్రధాన మనియు తేలినది.

కవిత్వమునకు తత్త్వమునకు గల సంబంధమును ప్లాటో (Plato) మహాశయుఁ డిట్లు చెప్పినాడు: "Poetry is three removes from the truth, being but an imitation by the Artist of the imitation in life of an idea in the mind of God."

భగవంతుని మనస్సులో జనించిన యొక సంకల్పమునకు సృష్టి యనుకరణము. ఆ సృష్టికి కావ్య మనుకరణము. కనుక కవిత్వము తత్త్వమునకు మూడు మెట్లు క్రింద అని ప్లాటోవాదము. ప్లాటో కేవలము తార్కికుని వలె మాట్లాడుచున్నాఁడు కాని యథార్థము నరసినచో నిట్లు తోచును. ప్రకృతి భగవత్సంకల్పమున కనుకరణము. భగవత్సంకల్పము వ్యక్త మగుటకు ప్రకృతి యను జడపదార్థము నాశ్రయించినది. ఆ సంకల్పము పరమార్థము మరుగుపడిపోయి వట్టి జడరూపమే వ్యక్త మగుచున్నది. ఈ సృష్టి ననుకరించుటలో కవి

చేసిన సంస్కారమేమి? దాని జడత్వమును తొలగించి తత్వమును ప్రకాశింపఁ జేసినాడు.

కనుక సృష్టిలో వ్యక్తము కాఁజాలని భగవత్సంకల్పము కావ్యమున వ్యక్తమైనది. కాగా ప్లాటో చెప్పినట్లు కవిత్వము ప్రకృతికంటె ఒకమెట్టు దిగజారక ఎగబ్రాకినది. అందుచే తత్వమునకు మూడడుగులు దూరమగుటకుబదులు తత్త్వసాయుజ్యమును పొందినది. ఇప్పుడు దీని నొకవిధముగా చెప్పవచ్చును. భగవంతున కొకసంకల్పము కలిగినది. దానిని సృష్టి యను కావ్యరూపమున వ్యక్తము చేసినాఁడు. రసికులు దీనిని గాంచి ముగ్ధులైరి; అలసులు ఉదాసీనత వహించిరి. తాత్వికులు ఇది మిథ్య యనిరి. కవిలో ఈ రసికత్వము, తాత్వికత్వము గలవు. కవి సృష్టిని గాంచి దానితత్వము గ్రహించి ముగ్ధుఁడైనాఁడు. అలసులగు లోకులకు దీనిని వ్యాఖ్యానము చేసి వివరించుచున్నాఁడు. Mathew Arnold మహాశయుడు "Poetry is the Criticism of Life" అనుటలో నిదే పరమార్థము. Life అనగా ప్రకృతి (Nature) అని నా యర్థము.

కాలము గడచిన కొలందియు లోకు లీప్రకృతికి దూరమగుచున్నట్లున్నది. అనగా సృష్టికి ప్రాచీనత్వము ఘటిల్లుచున్నది. ఈ ప్రాచీనత్వము కేవలము అధ్యాస, అనగా ఆరోపితము. ఈ అధ్యాస లోకులదృష్టిలో మాత్రమే. కనుకనే లోకము పూర్వమువలె నేఁడు సృష్టిని వ్యాఖ్యానము చేయలేకున్నది. సృష్టిరహస్యమును సృష్ట్యాదికి సన్నిహితములైన వేదములవలె నేఁడు మనము వ్యాఖ్యానము చేయలేము. సమకాలగ్రంథమును సమకాలికులు వ్యాఖ్యానము చేసినంత సత్యసన్నిహితముగ భావికాలమువారు చేయలేరు. అంతకంటె బాగుగ చేయవచ్చును గాని సత్యసన్నిహితముగ మాత్రము చేయఁజాలరు. అట్లే సృష్టిని వేదములు చేసినంత సత్యముగ నర్వాచీనకావ్యములు వ్యాఖ్యానము చేయలేవు. కాని యీ వ్యాఖ్యానము యొక్క సత్యత కవియొక్క ఋషిత్వము మీదఁ నాధారపడియుండును. అనఁగా ప్రకృతికి ప్రాచీనార్వాచీనతలు లోకముదృష్టిలో మాత్రమే కాని యథార్థముగా నది ప్రత్యగ్రము, అనఁగా అభినవము. దాని విషయములో కాలము సంజ్ఞామాత్రము. అది కేవలము (Absolute). కాలమును ఇట్లు కేవలముగా గణింపఁగలవాఁ డొక్కఋషి. తరువాత ఇట్టిదృష్టి కర్హతగలవాఁడు కవి. కవి ఋషిత్వమును వృద్ధి బొందించుకొను కొలందియు నీవ్యాఖ్యానము సత్యసన్నిహిత మగుచుండును. అందుచేతనే "నానృషిః కురుతే కావ్యం" అను వాక్యము పరమసత్యము.



దృష్ట్యంతరముచేఁ గావ్యసృష్టి మఱల ద్వివిధము. ఒకటి కవి స్వతంత్ర సృష్టి, రెండవది పఠిత అనుసృష్టి. పఠిత యనఁగా విమర్శకుండు, సహృదయుఁడు నగు పఠిత. కవి స్వతంత్రసృష్టి కావ్యరూపమునను, పఠిత యనుసృష్టి వ్యాఖ్యానరూపమునను గోచరించుచున్నవి. ఈ సందర్భములో కవి భగవంతుని స్థానమును, పఠిత కవిస్థానమును ఆక్రమించుచున్నారు.

దృశ్యమానమగు జడప్రకృతిలో భగవంతుని సంకల్పము మరుగుపడిన దనియు, దానిని కావ్యములో ప్రకాశింపఁజేసినవాఁడు కవి యనియు వెనుకచెప్పితిని. పరమార్థము వ్యక్తమగుటకు పదార్థము అత్యావశ్యకము. అర్థము వ్యక్తమగుటకు శబ్దమువలె. పదార్థము నాశ్రయించని తత్త్వము భగవంతుఁడు నిర్గుణుఁడు. ఈ నిర్గుణబ్రహ్మము మనదృష్టి కతీతము. అందుచేతనే భగవంతుని మనము చూడలేము. అంతేకాదు, చెప్పలేము; భావింపను లేము. కనుకనే బుద్ధిమంతులు భగవంతుఁడు అగోచరుఁడేకాక అవాఙ్మానసగోచరుఁడనియుచెప్పినారు.

ఇట్టి నిర్గుణతత్త్వము ప్రకృతి నాశ్రయించి సగుణమగుచున్నది. చూడఁగలవారు చూచుటకుఁగాని, చూడలేనివారికి చూపుటకుఁగాని ఇదియే అవకాశము. ఈ యవకాశమును సక్రమముగ నుపయోగించుకొని లోకులను ప్రబోధించువాఁడు కవి. ఈ తత్త్వబోధలో కవిది హృదయంగమమగు పద్ధతి. పిల్లవానికి 'క్రోధము' అను భావమును తెలుపవలయు నన్నచో అయ్యవారు వాగ్రూపమున నెంత వివరించియు హృదయమున కెక్కింపఁజాలరు. క్రోధమును సూచించు చిత్రమును చూపుచో పిల్లవానికి అది హృదయమునకు హత్తి ఆ జ్ఞానము వానికి స్థిరముగా నిలుచును. ఇది objective teaching. సృష్టిరహస్యమును వ్యక్తము చేయుటలో కవిపద్ధతి ఇట్టిది. ఇవి యుపదేశించు ధర్మమే ఋషియు నుపదేశించును. కాని ఋషిపద్ధతి నీరసము; హృదయమునకు హత్తదు.

జగద్రహస్యమును వ్యక్తముచేయుటకు కవి యొక సూక్ష్మజగత్తును సృష్టించును. ప్రత్యక్షప్రపంచమునందు అసంబద్ధములుగాఁ దోఁచువిషయకలాపము కావ్య ప్రపంచమునందు అనుషంగికములు, అవినాభావములు నై యుండును.

"Poetry is an arrangement of reality" అని Moulton పండితుఁడు. లోకమునందు ప్రియులు గలరు; వెన్నెలలు గలవు. కాని కావ్యమునందు వీనికి అవినాభావసంబంధము గలదు.

"నాయెడ నీయెడం దవుల నాకయి నీకయి యారటింప, నీ
లోయలలోపలన్ సెలలలోపల, జొన్నపొలాలలోపలన్,
హాయిగ హాయిగా కలిసి యాడుద మీతొలినాటి రాతిరిన్,
గాయును చందురుండు మనకై జగమెల్ల వెలందివెన్నెలల్"(నా 'చారుణి'

నుండి.) వెన్నెలలు ప్రియులకొరకే కాయుచున్న వని ప్రత్యక్ష ప్రపంచమున నిర్ణయములేదు. కావ్యప్రపంచమున నీకార్యకలాపమున కంతకు సంబంధము నిర్ణయింపఁబడుచున్నది. ప్రత్యక్షజగత్తులో పరాస్పరాపేక్షములు గాని విషయములు కావ్యమునం దేకసూత్రమున సంఘటింపఁబడుచున్నవి.

"అలస లఘుప్రయాణముల నల్లన నల్లన కాలిబాట, న
చ్చెలువయు రాకుమారుఁడును చేరిరి కొండొకసేపులోన న
ప్పొలమును; క్రొత్తదంపతులపోడుములున్ బొడసూపువారిపై
కలకల నవ్వెనాఁ గలువకన్నెలరాయఁడు గాచె వెన్నెలల్"
(నా 'చారుణి' నుండి)

లోకములోని చంద్రికకు అర్థము కన్పట్టదు, కావ్యమునందు అర్థములేనిది జీవింపదు. చంద్రజ్యోత్స్నకు ప్రియుల సమావేశమునకు కావ్యమునందు కార్యకారణసంబంధము సమర్థింపబడినది. "In Art no detail liveth to itself" అని Moulton పండితుఁడు. ప్రకృతిలోని యీ యేకత్వము వాచా వివరింపరానిది. కనుక సృష్టిలో నిరర్థకముగాఁ దోచుఁ సర్వమును కవి కావ్యములో సార్థకము చేయుచున్నాఁడు. ఇది కవి సృష్టి

ఇక పఠిత సృష్టి. "To feel freshly and deeply is not only characteristic of the Artist, but also of the reader. The first finds delight in creation and the second in discovery" అని Dr. Hamilton Mabie. సృష్ట్యంతరితుఁడైన పరమాత్మను కవి యెట్లు గుర్తించుచున్నాఁడో కావ్యాంతరితుఁడైన కవిని పఠిత

యట్లు గుర్తింపవలయును. జడజగత్తునకు ఆత్మ భగవంతుఁడు. కావ్యమున కాత్మ కవియే. కావ్యాంతరితుఁడైన కవిని గుర్తించి యవ్యయానందసిద్ధిని దొరికించుకొను రసికులు యోగులు.

మానవుఁడు లేనిచో సృష్టియే లేదు. అట్లే పఠిత లేనిచో కావ్యమే లేదు. మానవుఁడు తనయాత్మను విశ్వాత్మతో సమన్వయించి చూచుకొనినప్పుడే సృష్టికి సార్థకత. పఠిత తనయాత్మను కావ్యాత్మతో మేళవించి గ్రహించుకొననిప్పుడే కావ్యమునకు సార్థకత. "Music as well consists in the ear as in the Player." శ్రోత లేనిచో గానమే లేదు.

"చివురులే నీపాట సిరిరూప మైతెనో
చివురురూప మ్మెత్తి చెలగునో నీపాట
కొసరి గొంతెత్తి దిక్కులఁ జాటు నీపాట
కుసుమాస్త్రు సమరసంకులశంఖరావమో
చైతన్యరససుధాసారమ్ము గురియు సం
గీతమ్ములోన రాగిల్లు నీవిశ్వమ్ము
విధురనైరాశ్యనిర్విణ్ణమానసములన్
మధురించు కోకిలమ్మా! నీకు స్వాగతము! (నా "ప్రణయపథి" నుండి)

అని కవి సమన్వయము చేయువఱకు కోకిలపాట కర్థమే లేదు. కనుక పఠిత కావ్యస్థితికి ఒక హేతువు. జీవాత్మపరమాత్మలకుఁ గల బంధమే ప్రకృతి. అనఁగా భగవంతుని మానవుని కూడదీయునది ప్రకృతి. కావ్యమును, కవికి పాఠకునకుఁ గల యొక సంబంధవిశేషము. ఇరువురిలో నెవరు లేకున్నను ఈ బంధమే లేదు. "There is nothing like a Poem absolute. Poetry is a function of sympathy between the author and his audience"అని Kellet పండితుడు.

సృష్టిరహస్యమును విప్పిచెప్పుటకు కవి సృష్టికర్తయంతవాఁడు గావలయును. కావ్యరహస్యమును గ్రహించుటకు పఠితయు కవియంతవాడుఁ కావలయును."A critic is one, who has failed in original work" అని Kellett పండితుఁడు. అనఁగా కవియంతవాఁడు కాకున్నను కవితో సమానమైన భావనాబలము గలవాఁడు కావలయును. లేకున్న కవితోపాటు అతీతభావనాపథముల విహరింపఁజాలడు.

కవిసృష్టి పఠితకు శబ్దార్థరూపమున సాక్షాత్కరించుచున్నది. అనఁగా కావ్యప్రపంచముయొక్క వ్యక్తరూపము శబ్దార్థములు. కవి భావించిన రూపము పఠితకు సాక్షాత్కరించునది ఈ శబ్దార్థములమూలముననే కనుక, కవికి "కావ్య ఘటనానుకూల శబ్దార్థోపస్థితి" యుండవలయును. అనఁగా నీ శబ్దార్థములు నిసర్గములు గావలయునే కాని కృతకములు గారాదు. కృతకములు, బలాదాకృష్టములు నగుచో కావ్యమునకు క్లిష్టత వాటిల్లును. ప్రపంచమునం దిట్టి కృత్రిమవస్తునిర్మాణము వృద్ధియగుచున్నది కనుకనే సృష్టిరహస్యము దుర్గ్రాహ్యమగుచున్నది. మనోహరములు, యథోత్పన్నములు నగు ప్రకృతిచిత్రములు ఛేదింపఁబడి వానిస్థానమున చక్షుపీడాకరములగు యంత్రాగారములు నిర్మింపఁబడుట సృష్టికర్త యభిమతమని యెవ్వఁడు చెప్పఁగలఁడు ? ఇది యంతయు మానవునిచే బలవంతముగఁ గల్పింపఁబడినది. ప్రశాంతమై మనోహరమైన ప్రకృతి యుత్సంగమున విశ్రమించి వేదఋక్కులు గానము చేసిన ఆర్యఋషి నేఁటి యీ జగద్వైషమ్యము గాంచినచో నావేదములు పాడఁగలఁడా ?

ఋష్యాశ్రమములందు మృగములు పరస్పరవైషమ్యములు లేక యుండినవఁట. అనఁగా సృష్టిరహస్యమునకు దాని వ్యక్తస్వరూపమునకు వైషమ్యము లేదు. అప్పుడు వ్యాఖ్యాతకు శ్రమలేదు. ఇట్లే కవియాశయములు అతని సృష్టిలో సువ్యక్తములు గావలయును. శబ్దము లొకొక్కసారి మహాద్రోహము చేయఁగలవు. కవి యీ విషయమున జాగరూకత వహింపవలయును. అనఁగా వశ్యవాక్కు కావలయును.

బాహ్యసృష్టిని తిలకించి కవి దానిరహస్యమును భావించును. పఠితయు నట్లే కావ్యరహస్యము గ్రహించును. శబ్దసామగ్రి యపరిపుష్ట మగుచో కవి సృష్టికి పఠితయును సృష్టికి సామరస్యము పొసఁగదు. ఆధునిక కవిత్వములో నిది యొక గొప్పలోపము. నేఁటి కవులకు భావనాబలము లేదనరాదు. ఆ భావమును వ్యక్తము చేయఁగల శబ్దశక్తిలేదు. కనుకనే కవికిని పాఠకునకును పొత్తు కుదురుట లేదు. అర్థమునకు పుష్టి, స్పష్టత యలవడుచో ఆధునిక కవిత్వము మహోత్కృష్ట మగుననుటకు సుంతయు సందియము లేదు.

3

విశ్వసృష్టికి కావ్యసృష్టికి కొంతభేదము గలదని యెఱింగితిమి. సృష్టిలో నిరర్థకముగా దోచు సర్వము కావ్యమునందు సార్థకము చేయఁబడుచున్న దనియు తేలినది. ఇంతియకాక లోకమునకు కావ్యమునకు మఱియు వాసి కలదు.

లోకమునకు భూతము, వర్తమానము, భావి యని కాలము మూఁడ వస్థలలో క్రమముగ నడచుచున్నది. భావిని భూతము రాదు. భూతమున వర్తమానము రాదు. కావ్యమునం దిట్లు కాదు. వర్తమాన నిర్దేశముతో నారంభించి కావ్యము భూతముతో ముగియవచ్చును.

రావణజననాదికను రామాయణమునం దుత్తరకాండయం దిట్లే చెప్పఁబడినది. రావణజననము, తద్దిగ్విజయయాత్రలు సర్వమును రామాదిజననమునకు పూర్వమే జరిగినవి. కాని కావ్యమునం దవి తత్పరమున చెప్పఁబడినవి. లోకములోని యీ కాలవ్యవస్థను కవి తారుమారుచేయుట ప్రయోజనాపేక్షతోడనే. ఉత్తరరామాయణమువల్ల రావణుఁడు మహాపురుషుఁడని స్పష్టమగుచున్నది. అతని మహాపురుషలక్షణములు పఠితహృదయమున కెక్కిన తరువాత సీతాపహరణ మొక నెరసుగా మాత్రమే పొడకట్టును. రామరావణయుద్ధమునకు రావణనాశనమునకు మూలపీఠమగు సీతాపహరణమునకు ప్రాధాన్యము పోయినచో రామాయణ కథాబంధమునందు నిబిడత్వము కొరవడును. రావణనాశనమునకు కవి తగిన యుపపత్తి చూపలేఁడు. కనుకనే పూర్వకాండలో సీతాపహరణము క్షంతవ్య మనిపించు నుత్తమలక్షణము లేవియు రావణున కారోపింపఁబడలేదు. పఠితకు రావణుఁడు హంతవ్యుఁ డనియే బుద్ధి. కాని రావణుఁడు లోకులదృష్టిలో నిట్లు నీచుఁడై పోవుట కవికి సమ్మతము కాదు. ఏలన అతఁడు స్వతః మహాపురుషుఁడు. ఈ లక్షణమును కవి దాపఁగోరలేదు. అందుకే ఉత్తరకాండ యవసరమైనది.

ఈ విధముగా లోకమునకు, కావ్యమునకు కాలవ్యవస్థలోఁ గొంతభేదము గలదు. తెలుఁగుకవులలో పింగళిసూర్యనార్యుని కళాపూర్ణోదయ మిట్టిది. లోకమునం దెన్నిచరిత్రలు జరుగుచుండుట లేదు? పఠితకు వానియెడ ఉత్కంఠ లేదు. కాని కావ్యమునందలి ఈ కథాకౌటిల్యము పఠిత కుత్కంఠ పెంచును.

ఇట్టి కాల వ్యవస్థాభేదము కాక లోకవృత్తమునకు కావ్యవృత్తమునకు మఱి యొక విధమగు భేదముగలదు. ఇది పాత్రసంబంధి. కర్ణుఁడు భారతము నందొకవిధముగా చిత్రింపఁబడినాఁడు. భారతమునం దర్జునునకు ప్రతివీరుఁడు కర్ణుఁడు. ప్రతియోగముచేత నాయకగుణములను ప్రకాశింపఁ జేయుటకై ప్రతినాయకుని కళంకమునకు తళుకు పూయుట కవిలోకమర్యాద. యథార్థముగ భారత గాథ లోకమున ప్రవర్తితమైనప్పుడు కర్ణుఁడు మహాపురుషుఁడే కావలయును భారతము నందాతని దుర్గుణములకే ప్రాధాన్యము. లోకమునందు ప్రతివ్యక్తియొక్క వృత్తమును ప్రతియితరవ్యక్తియొక్క వృత్తమునకు తగుల్వడియుండును. కనుక ఒక వ్యక్తియొక్క చర్యలకు ఇతమిత్థ మని కారణము నిరూపింపఁజాలము. కావ్యమునందు వ్యక్తులసంఖ్య పరిమిత మగుచుండును గనుక ఒకవ్యక్తియొక్క చర్యలకు మూలకారణములు కొంతవఱకు నిరూపింపవచ్చును.

కర్ణుఁడే నాయకుఁడైన యొకకావ్యమునందు అతని యనుదాత్తగుణములు తిరస్కృతములై యుదాత్తగుణములే భాసిల్లఁగలవు. ఆ కావ్యమునందు వర్ణించు ఇతరపాత్రల వృత్తములును తదనుగుణముగా నుండును. అనఁగా మంచిచెడ్డలు ప్రతియోగరూఢములే కాని వ్యక్తికి కేవల నిసర్గములు గావని యొక విధముగా చెప్పవచ్చును.

భారతము అతివిస్తృత మైన ఇతివృత్తము. అందు కర్ణునిలోపములు వివిధములు. భారతమునుండి పృథక్కరించి కర్ణునిచరిత్ర వ్రాయుచో నాతనిలోపములు చాలవట్టు మఱుగుపడి మహత్తు మాత్రమే ప్రకాశించును. కర్ణుని చరిత్రలో ఇది యొక చిత్రము. చిన్నతనమునందే నేను కర్ణచరిత్ర నాటకము చేసితిని. అందు కర్ణునకు విశ్వరూపసందర్శనము చేయించితిని. కర్ణుఁడు దాని కర్హుఁడని నాకు తోచినది. నా నాటకము చదివినప్పుడు మీకును తోచగలదు.

"ఆ శారతుఁడౌ సుయోధను వశంబున కర్ణునిఁ ద్రుంచు శ్రీమనో
హారు నధర్మరూపక మహత్తరధర్మము నాశ్రయించెదన్."

భారతములోని కర్ణవృత్తమునకు పరిష్కృతి యగు నా నాటకమునందు ఇది బీజము. లోకవర్తమునందు ధర్మలోపము తటస్థించుచున్నప్పుడు కవి దానిని చేపట్టి యీ ధర్మసమన్వయము చేయును. లోకమున కిది విరుద్ధము కావచ్చును. కాని యిదియే సత్యము. కవి సత్యవాది, కాని కేవలము యథార్థవాది కాఁడు,

"Poetry aims at the reality of an internal probability" అని Aristotle పండితుఁడు.

ఇతర పాత్రలప్రభావము వలన కర్ణునిచరిత్ర యొకవిధముగా పరిణమించి నను అసలు దాని పరిణామము భారతమున సత్యసమ్మతముగా నిరూపింపఁబడ లేదు. కవి దానిని చేపట్టి సత్యసమ్మతముగ నిరూపించును. నా నాటకమునందు నిరూపింపఁబడిన కర్ణవృత్తపరిణామమునకు అనుకూలములగు శక్తులు అంత ర్వాహినిగా భారతమునందే కలవు. కాని ఆ శక్తులకు తగిన అవకాశములు భారత మున లేవని చెప్పవలయును.

జన్మాంతరక్రమమున నొకవ్యక్తి పరిణమించు నని కర్మయోగవాదము. ఈ సత్యము కావ్యమునందు నిర్వహింపఁబడును. ఈ జన్మమునందలి యొక వ్యక్తి యితివృత్తమును చేపట్టి కవి దాని యుత్తర జన్మమును కావ్యమున నిరూ పించును. "Poetic truth is fidelity to what may be, not to what is" అని Hudson మహాశయుఁడు.

ఇట్లు కవి చేయు సృష్టి లోకమునకు ప్రతిబింబముగాను, అనుసరణము గాను, లేదా ప్రతికూలముగాను ఉండవచ్చును. "Imitation is the test of Pcetry" అని Aristotle పండితుఁడు. ఇచ్చట Imitation అనగా అనుకరణము అని చెప్పరాదు. గ్రీకుభాషలో Mimesis అను పదమును అరి స్టాటిలు వాడినాఁడు. దాని కాంగ్లానువాదము Imitation, అనగా అనుకరణము అని స్పష్టము. కాని గ్రీకులో Mimes అనగా 'నటుడు' అని అర్థము. నటుఁడు చేయుపని అభినయము. Mimesis అనగా అభినయమని చెప్పుకొందము. "అవస్థానుకృతిర్నాట్యమ్" అని భరతమహాముని చెప్పినను నాట్యము కేవల మనుకరణ మనరాదు. అభినయము లోకము ననుసరించి యుండవచ్చును. లేదా దానికి మెఱుగుపెట్టు సృష్టి కావచ్చును. పురాణకాలమునాటి రామాదులపాత్రల ప్రదర్శించు నటుఁడు లోకము ననుసరించుచున్నాఁ డని చెప్పఁజాలము గదా! భావనాబలముచే నటుఁడు సృష్టించినవే రామాదులపాత్రలు. కనుక Mimesis అనగా అనుకరణ మని Aristotle భావ మని చెప్పఁజాలము. కవిత్వము Creat.ve, అనగా సృజనశక్తి గల కళ యని ప్రసిద్ధము. ఈ సృష్టి ప్రకృతి ననుసరించి కావచ్చును; లేదా ప్రకృతి పరమార్థమును ప్రదర్శించు స్వతంత్ర సృష్టి కావచ్చును.

"We are God's poem" అని యొకనుడుగు. అనగా మనము భగవంతుని కవిత్వము. సృష్టి భగవంతునికావ్య మని దీని భావము. కనుక Poet అనుపదము సైతము సృష్టినే సూచించుచున్నది. ఆర్యులు సైతము 'కవి బ్రహ్మ' యనుటలో కవి సృష్టికర్త యనియే కొనియాడిరి. ఈ కవిసృష్టి స్వతంత్రమే కాని అనుకరణము కాదు.

"No one merits the name of a creator except God and the Poet."—Shelley. అనఁగా భగవంతుఁ డెట్టి సృష్టికర్తయో కవియు నట్టి సృష్టికర్తయే. plato మహాశయుఁడు భగవంతుని సృష్టికర్తృత్వమును, తన్మూలమున కవిసృష్టికర్తృత్వమును న్యూనపఱచినాఁడు.

"Nature is the imperfect expression of the idea"- Plato. భగవంతుని సంకల్పమునకు అసమగ్ర మగు రూపమే సృష్టి. ఈ సృష్టికి అసమగ్ర మగు అనుకరణము కావ్యము. కాని ప్లేటో కవులకు పెద్ద విరోధి. కవిత్వమునకు శత్రువు. కాని తాను స్వయము మహాకవి యగుట గుర్తించుకొన లేదు. యథార్థముగా Plato మంచికవి.

భగవంతునిసృష్టి వంటిదే కవిసృష్టియు. "The poet creates another Nature and other fortunes as if he were another God" అని Scaliger పండితుఁడు. కావ్యసృష్టి జగత్సృష్టికి భిన్నము, పోషకమును అగుచున్నది.

—భారతి

శ్రీముఖ-ఫాల్గునము; భావ-చైత్రము, జ్యేష్ఠము
1934, మార్చి, ఏప్రిలు, జూన్.
సంపుటము 11-సంచికలు 3, 4, 6.

# కావ్యము : నీతి

—శ్రీ దువ్వూరి రామిరెడ్డి

మతము, శాస్త్రము, ధర్మము, లలితకళలు మున్నగునవి వాని వాని కుచితమైన రీతుల మానవశిక్షణమునకుఁ దోడ్పడుసాధనములు. కొన్ని బుద్ధిని ఉత్తేజన మొనరించునవి. మఱికొన్ని హృదయమును పరిపక్వపఱచునవి.

ప్రతియుగమునందును ప్రతిసంఘమునందును కాలమునకంటె ముందు నడచు ప్రతిభావంతులు, విప్లవకారులు, దూరదృష్టిగలవారు కొంద ఱుద్భవించు చుందురు. అట్టి మహనీయులభావములు, సృష్టులు, ఆ యుగమునకు, ఆ సంఘమునకు ఆదర్శకములుగ నుండును. ఆ పురుషపుంగవులు, మార్గదర్శకులు, అస్ఫుటముగను, అవ్యక్తముగ నున్న భావికాలమును మనకన్నులకుఁ బొడకట్టునట్లు చేయఁ గల మహిమావంతులు. వారి పలుకుబడివలన మానవ సంఘము క్రొత్తక్రొత్త దారులు ద్రొక్కుచుండును. జాతీయత అట్టి యుదార హృదయముల భావసంపర్కముచేత నంతర్జాతీయతగఁ బరిణమించుచుండును. బుద్ధుఁడు, వాల్మీకి, ఏసుక్రీస్తు, మహమ్మదు మున్నగు మహాపురుషు లీతరగతికి సంబంధించినవారు. వారి జీవితమే యొక యుత్కృష్టమైన కావ్యము. వారి ప్రవర్తనమే నీతికి ఆదర్శకము.

ప్రతియుగమునం దొక్కొకభావము ప్రముఖమై యుండును. అది యాధ్యాత్మిక మైనను, సాంఘిక మైనను, రాజకీయ మైనను, లేక మఱి యింకే విధ మైన మానవచర్యకు సంబంధించినది యైనను గావచ్చును. ఆ భావము లందుఁ బ్రజల యాంతరంగికదృష్టి లగ్నమై యుండును. ఇట్టి భావము సార్వజనీనముగ నుండక తప్పదు. దానిని కవియో, చిత్రకారుఁడో, ప్రవక్తయో, తన సృష్టి మూలమున బయలు పఱచును మన మెల్లర మానాయకుని ననుసరింతుము. ఎందువలన? మనయందు అస్పష్టములుగను నిగూఢములుగను నున్న భావములను ఆయన వెలిబుచ్చును. ప్రజాబాహుళ్యము యొక్క భావములు అతని సృష్టియందు ఆదిశేషావతారము దాల్చి రెండు వేల నాలుకలతో మాటలాడుచుండును. ఆయనకును మనకును సహానుభూతి గలదు. కావుననే యానాయకుఁడు మనల నాకర్షించును. అట్టి మహనీయుల యుద్దేశములు, సంభాషణములు,

ప్రవర్తనములు విశ్వశ్రేయమును జేకూర్చుచుండును. ఏది విశ్వశ్రేయము సంపాదింపఁగలదో యది నీతిబాహ్యముగ నుండనేరదు.

లలితకళలు జాతీయ జీవితమునందు అంతర్వాహినులై ప్రవహించు భావముల రమణీయాభివ్యక్తులే కావున, వానియందు ముఖ్యములును, సర్వజనాదరణీయములును అగు భావములను ఆకర్షించి, శిల్పులు తమ రచనాచమత్కృతి వలన వానిని ఆదర్శములుగ నొనరింతురు. ఇట్లనుటవలన మానవసమాజమును కళలును పరస్పరాపేక్షకము లని మన మూహింపవలయును. తాత్కాలికములైన భావములు కొన్ని ప్రజలను, శిల్పులను ఆకర్షింపవచ్చును. అట్టివి క్షణికములు కాని, కాలపారంపర్యముగ నొక జాతియందు అస్థిగతమై మజ్జలో నాటుకొని యున్న భావములను మూర్తీభవింపఁ జేయుట జాతీయశిల్ప మనఁబడును. అదియే లోకాదరణపాత్రము. తన వ్యక్తిత్వమును బోఁగొట్టుకొనక చిరంజీవిగ నుండును. తాత్కాలికములైన విజాతీయానుకరణములు మన స్వభావమునకుఁ గూడ విజాతీయములే కావున సత్య పటుత్వము కొఱఁతపడి కళాప్రపంచమునందు నిరాదరింపఁబడును.

ప్రాచ్యపాశ్చాత్యశిక్షణ మార్గములందుఁ బరస్పర వైరుధ్యము గోచరించుచున్నది. ఒకరికి శాంతియు నిరాడంబర మైన జీవనము ప్రధానము. మఱియొకరికి తృష్ణ, చిత్తసంక్షోభము, ఆటోపము ముఖ్యము. నేతిచేఁ దడుపఁబడిన అగ్నిహోత్రమువలె భోగము లనుభవింపఁబడుకొలఁది వృద్ధిచెందుచుండు ననియు, కావున భోగముల నియతముగ గ్రహింపవలయుననియు నొకరిమతము భోగముల వీలైనంతవఱకు వృద్ధి పొందించి వాని ననుభవింపనిదే నాగరకత గాదని మఱియొకరి యభిప్రాయము. ప్రాచ్యులకు, జీవితము పరమార్థమును సాధించుటకై యేర్పడిన యొక యుపకరణము. పాశ్చాత్యులకు, జీవితమే యొక పరమార్థము. కావున యిట్టి మార్గభేదములు రెండు ఖండములయొక్క లలితకళలయందు నస్థిగతముగ నంకితమై యున్నవి. ప్రాచ్యశిల్పమునందు రూపయాథార్థ్య మంత ముఖ్యము గాదు. ఏలనన, వారి శిల్పము చాలవఱకు సాంకేతికము. సాంకేతిక శిల్పమెప్పటికిని కొన్ని శిల్ప సమయములకుఁ గట్టువడి యుండును. అజంతా గుహలయందలి రేఖాచిత్రములు ఈ తరగతి శిల్పమునకుఁ బ్రబల నిదర్శనములు మన శిల్పము ధ్యానమూలకము; వారి శిల్పము ప్రకృత్యనుకరణము.

'కళలయందు రసరామణీయకములె ప్రధానములు. గాని నీతికిని ఆధ్యాత్మిక భావములకును నేమి సంబంధము గలదు?' అని కొందఱు విమర్శకులు

ప్రశ్నించు చున్నారు. ఇది మనకు నవీనమును విజాతీయము నైన సందేహము. ఆస్కారువైల్డు (Oscar wilde) అను నొక ఆంగ్లేయ విమర్శకుఁడు* కళ లన్నియు నీతి బాహ్యము లనియు, నీతి యననది యేదో కొద్దిపాటి తెలివితేటలు గల వారికే కాని ప్రతిభావంతులకు నీతి యనవసర మనియు చెప్పియున్నాఁడు. ధర్మశాస్త్రముల యందువలె కావ్యములందు నీతిబోధ యనవసర మనుటయే ఆయన యుద్దేశ మైన యెడల మే మిరువురము ఏకాభిప్రాయులమే, కాని నీతికిని కావ్యమునకును ఏలాటి సంబంధము లేదని వాదించు వారికిని నాకును భిన్నాభిప్రాయము గలదు. ఈ విషయమును గొంచెము చర్చింతము.

కావ్యమందు రామణీయకము ముఖ్యము; తక్కిన గుణములు అందును పోషకములుగ నుండవలయును. రామణీయక మనునది ప్రతిభావంతుఁడైన కవి యొక్క రచనానైపుణ్యమునకు సంబంధించినది. గుణ మెప్పుడు తన కాలంబ మైన వస్తువును ఆశ్రయించి యుండును గాన వస్తుగుణములు రెంటికిని ప్రాధాన్యము గలదు. ఒకవేళ నీతిబాహ్య మైన వస్తువు రమణీయమై యుండిన యెడల షేక్సియరు(Shakespeare) మహాకవి సృజించిన క్లియోపాత్రా(Cleopatra) కన్యవలె మానవలోకమున కుపద్రవము గలుగఁజేయును. శకుంతలవలె అనుభోగ్యము గాదు.

మఱియొక పూర్వపక్షము గలదు. "శిల్పముకొఱకే శిల్పము" (Art for art) అనఁగా శిల్పమున కేలాటి బాధ్యతలు లేవు. కవి భావోద్రేకమువలనఁ దన కిష్టమైన రీతిని గానము చేయును. అట్లు చేయుట యితరులకొఱకు గాదు; తన సంతోషమునకు. కోకిల కూయుట యెవరిని ఆనందపెట్టుటకొఱకు ? ఈ వాదము మొట్టమొదట వినుటకు ఇంపుగానే యుండును. కాని విమర్శించుకొలఁది యందలి లోపములు బయలుపడును. కోయిలకూతను విని మన మానందించు చున్నాము. నిజమే. దానికూత మధురముగ నుండుట వలనను ఆ కూత మనకు సమ్మత మగుట వలనను మనము సంతోషించుచున్నాము. అది తన కిష్టము వచ్చినట్లు కూయుట వలనఁ గాదు. కాకిగూడ తన కిష్టము వచ్చినట్లే గూయును. దానిని మన మేమాత్ర మాదరించుచున్నాము ? అటులనే కవి చేయు గానము మానవ సమాజము నుద్ధరించుటకు యోగ్య

* "All the arts are immoral. To morals belong the lower and less intellectual spheres"-"Intentions,"

మైనదిగ నుండుటవలననే గౌరవింపబడుచున్నది. 'నాకు నో రున్నది. తిట్టుటకు చాలమాటలు దెలియును. కావున నేను తిట్టుకొనుచుందును' అని చెప్పి వీథుల వెంబడి తప్పుదారికూఁతలు కూయుచుఁ దిరుగుచుండిన 'అతనికి పిచ్చిపట్టిన' దని పిచ్చివారి యాసుపత్రికి పంపుదుము. సమాజ మెట్లు తనయందలి వ్యక్తికి బాధ్యమో, వ్యక్తికూడ సమాజమునకు బాధ్యుఁడు.

కవి యొకమూలఁ గూర్చుండి తనసంతోషముకొఱకు నొకకావ్యము రచియించుకొని దానిని బదిలముగ నింటఁ దాచుకొనియుండిన యెడల నేలాటి యిబ్బంది లేదు. అట్లుగాక కవిరచనలు వ్యాప్తిలోనికి వచ్చి లోకజీవనముపై నధికారము చేయుచుండును. కావున నందఱికంటెను కవికి బాధ్యత యెక్కువ. ఉత్తమకవి సృష్టియందు దాకాలపుమానవసంఘమునందలి సమంచిత భావములు మూర్తీభవించి యుండును. అతనిరచనలందు భవిష్యద్వాణి రహస్యమర్మర రవములతో సంభాషించుచుండును.

మానవ జీవితమునకును శిల్పమునకును సహజమైన సంబంధము గలదు. జీవిత ప్రయోజనము ననుసరించి శిల్పప్రయోజనము గూడ నిర్ణయింపఁబడుచుండును. మన జీవితమును గుఱించి ఓమరుఖయాం (Omar khayam) అను పారసీక కవి యిట్లు నుడివియున్నాఁడు:

"One thing is certain and the rest is lies.
The flower that once has blown for ever dies.

o o o o

Many knots unravelled by the road.
But not the knot of human death and fate.
There was a door to which I found no key.
There was a veil past which I could not see.
While you live, drink; for once dead, you never shall return.

ఓమరుఖయము కొంచె మించుమించుగా చార్వాకమతస్థుఁడు. 'వికసించిన పూవు మరల వికసింపఁబోదు. మరణించిన మానవుఁడు మరల తిరిగిరాబోఁడు,

ప్రాణ ముండగనే భోగము లనుభవించెదము. చచ్చిన వెనుక యే మగునో ఆ విషయము నాకు తెలియదు. ఆ ముడిని నేను విప్పఁజాలకపోతి' నని చెప్పె. అట్టి వారికి జీవితము భోగమాత్రప్రయోజనము. జీవితము ననుసరించి శిల్పముగూడ విషయభోగముల ప్రతిబింబముగ నుండును.

కాని మన విశ్వాసములు వేఱు. ధర్మార్థకామమోక్షము లను నాలుగు పురుషార్థములను మానవజీవితము సాధింపవలయు నని మనపెద్దలు నిర్ణయించిరి. వారు ఇహపరముల రెంటికిని సమాన గౌరవమును చూపియున్నారు. సన్న్యాస మనునది అతీతధర్మము. లోకసామాన్యము గాదు. ధర్మార్థకామమోక్షములు పరస్పరసాపేక్షములు. కావున మన కవిత్వప్రయోజనము, జీవితాదర్శకము ననుసరించి బ్రహ్మానందసోదరమైన పరనిర్వృతిగ నిర్ణయింపఁబడినది. కావ్యము లనఁగా బసిబిడ్డలాడుకొనుటకై మన మిచ్చు రంగులబొమ్మలు గావు. అనాగరకతాదోషము పాపుకొనుటకు మేజాబల్లలపైఁ బ్రదర్శింపఁబడు భూషణగ్రంథము లనుగా కావ్యములను మన మెప్పుడు తలంపలేదు. మన జీవితమునందు కావ్యములు మిళితమై పోయినవి. ఆర్యసాంఘికజీవనప్రవాహమునకు రెండుతటములుగ నున్న రామాయణ మహాభారతములే యిందులకు దృష్టాంతము. సీత, దమయంతి, సావిత్రి, ద్రౌపది మున్నగు పౌరాణికసతీరత్నములు భారతదేశమునం దెందఱు పతివ్రతల సృజింపలేదు? సంసారమందు నిర్భరదారిద్ర్యమును, కష్టపరంపరలతో ననుభవించుచున్న సతీమణులకు దమయంతి, ద్రౌపది, చంద్రమతి మున్నగు నిల్లాండ్ర చరిత్రము లెంత యూఱట నొదగూర్చి యుండలేదు ఈనారీపతంసము లందఱు వ్యాసవాల్మీకిమహాకవుల భావప్రపంచమునఁ బుట్టి పెంపొందిన ఆదర్శకసృష్టులే కదా ! అట్టికవు లెన్నటికైన నిర్బాహ్యు లగుదురా ? వారి రచనలు నీతిబాహ్యములగునా ?

కీట్సు (Keats) అను ఆంగ్లేయ కవి 'Beauty is truth, truth beauty' అని చెప్పియున్నాఁడు. మనపూర్వికులు సత్యసౌందర్యములకు శ్రేయమునుగూడఁ జేర్చిరి. కావ్యము విశ్వశ్రేయము చేకూర్చునదిగ నుండవలయును అనీతిదాయకమైన దేదియు లోకకల్యాణము నాపాదింపలేదు.

ఇఁక నీతి యన నేమి? దాని నెవరు కల్పించిరి? దానివలన బ్రయోజనమేమి? అను నీవిషయములు మనసున కెక్కనిదే కావ్యములందు నీతి యావశ్య

కమా లేదా, యనుసందేహమును మనము తీర్చుకొనలేము. నీతి యను పదమును విశాలభావముగలదానిగా నూహించి నే నిచట ప్రయోగించుచున్నాను. దేశకాల పాత్రములకు లోఁబడి నీతులు భిన్నములుగ నుండవచ్చును ఒక సంఘమువారికి నొక దేశమువారికి ననుకూల మైన నీతులు మఱియొకరికి విరుద్ధముగఁ దోచ వచ్చును. కాని యిట్టి పరస్పరవిరుద్ధములైన నీతులందును నంతర్వ్యాపియగు నుద్దేశ మొక్కటియే. అది యేదన, మానవజీవితోద్ధరణము, లోకయాత్రా సౌకర్యము. నే నిచటఁ బ్రయోగించిన నీతి అనుపదమును దేశకాలపాత్రాచార వ్యవహారములకు వశవర్తియయి సంకుచిత మైన నీతినిగ నర్థముచేసికొనఁ గూడదు. అన్నినీతులకు జన్మకారణ మైన యావశ్యకతనుగఁ దలంపవలయును. ఇది జగదేకము.

సంఘసమష్టికిని దదంశ మైన వ్యక్తికిని భిన్నభిన్న వ్యక్తులకును గల ప్రవర్తన సామరస్యము, ఆనుగుణ్యము నీతి యనబడును. ఈ నీతి మానవుల యావశ్యకతను బట్టియు, ననుభవము ననుసరించియు, గ్రమక్రమముగ రూపము దాల్చి సంఘయంత్రమును నడుపుచుండును. ఈ నీతులు సకలవిధములైన మానవచర్యలకు సంబంధించియున్నవి. ఇట్లనుటవలన, విశేషసంఖ్యాకు లగు ప్రజలయభిప్రాయము ఘనీభవించి నీతిగను, శాసనముగను మాఱును. కాని నీతి శాసనములకుఁ గొంత భేదము గలదు రాజాధికారముద్రగలది శాసనము. సంప్రదాయసిద్ధ మయి మానవులభావములను బరిపాలించునది నీతి. నాగరికత హెచ్చుకొలఁది అధికార ముద్రాంకితము లగు శాసనములకంటె స్వయ మారోపితము లగు నీతులే మనుష్య సంఘమును బాలించుచుండును. విరుద్ధశాసనమునకు లొంగియుండుట దాస్యమైనను స్వయంకృత నియమమునకు వశవర్తియై యుండుట స్వాతంత్ర్య మనఁబడును

నీతులును శాసనములును (స్వయంకృతము లైనను, పరకృతము లైనను) సంఘమును శాసింపని యెడల వ్యక్తిస్వాతంత్ర్యము నశించి మానవజాతికిఁ బ్రళయము సంభవించును. కావున నీతి మానవులయం దన్యోన్యప్రవర్తనానుగుణ్యమును బోషించును.

కళలు సాంఘిక జీవితముయొక్క యుచ్ఛ్వాసనిశ్వాసముల యాదర్శక లేఖనములని యిదివఱకే తెలిసికొనియుంటిమి. కావున జీవిత మొకవంకనుఁ గళలు వేఱొకవంకనుఁ బ్రవహింపనేరవు. సాధారణజీవితమునందు నేవేవి నీతిబాహ్యములుగను నేవము పుట్టించునవిగ నుండునో అట్టివి కళలయందును నింపు గొలుపవు. అట్లగుటఁ గావ్యమునకును నీతికిని సంబంధ మెట్లు తెగిపోవును ?

ధర్మశాస్త్రములు వేఱు; కావ్యములువేఱు, వానిని వాని ప్రయోజనములును భిన్నములు. పాలనాదండము చేతఁబట్టుకొని "సత్యంవద" ధర్మంచర" అని వేదములు శాసించును. కవి "సత్యం వద" అని శాసింపక హరిశ్చంద్రుని సృజించెను. "సత్య మేవ జయతి" అను ధర్మవాక్యమునకు హరిశ్చంద్రోపాఖ్యానము లక్ష్యము. ఆ కథను జదివిన వారికి హరిశ్చంద్రునిపై భక్తిగౌరవములు గలుగక పోవు. మన మెవరిని ఉత్తములని మెచ్చుకొందుమో వాని ననుకరింపవలయుననియో, వారివలె బ్రవర్తింపవలె ననియో మన మభిలషింతుము. ఈ కోరిక మనయందు సహజముగఁ బుట్టును. సత్కావ్యములయందు ఇట్టి యున్నతాశయములను, ఆసలను బ్రేరించు శక్తిగలదు. *బలాత్కారనీతిబోధనమునకుఁ గావ్యము లెన్నఁడును బూనుకొనగూడదు. అట్టివి కావ్యములు గాక మనుధర్మశాస్త్రములవంటి స్మృతులుగా మాఱును. కళలయందలి నీతి యంతర్లీనమై యలక్షితముగ మనహృదయముఁ బ్రవేశించును. దాని పద చిహ్నము లదృశ్యములు. ఇట్లు రచించుట కళానైపుణ్యము.

కావ్య మర్థింపవలసినది రససౌందర్యములే కదా! అంతర్లీన మైన నీతియైనను వాని కెటుల నుపకరించును అను సంశయము కొందఱకుఁ గలుగవచ్చును. నీతిస్పర్శ లేనిదే సౌందర్యము పరిపూర్ణము గాదని నాయుద్దేశము. ఈ దృష్టితో మనము విమర్శింపబూనిన యెడల నేదేశముయొక్క యుత్తమ శిల్పమునందుగాఁని యనీతిపరత్వము గోచరింపదు. ఒకచిత్రకారుడు రమణీయవతియగు కాంతను విగతవస్త్రనుగఁ చిత్రించి మనకుఁ జూపిన యెడల ఆ సౌందర్యము నంతయు మ్రింగివేయఁగల యసహ్యము పుట్టి మొగము చిట్లించుకొందుము. ఎందువలన? ఆచిత్రపటమునకును జీవితమునందు మన కలవాటుపడియున్న యౌచిత్యమునకును వైరుధ్యము సంభవించినది. అందలి రమ్యత సర్వజనోపభోగ్య మగునంత లేదు. సభ్యముగ ఇట్టి చిత్రములు అహ్లాదమును గలిగించి మనస్సు నుద్ధరించుటకు మారు, ఇంద్రియచాపల్యమును, అసభ్యములగు మనోవికారములను బ్రేరేపించుచుండును. అట్లుచేయుట యుత్తమకళయొక్క ధర్మము కాదు.

* "The office of Poetry is not moral instruction, but moral emulation, not doctrine, but inspiration" -G. H. Lewis. "The Inner life of art."

అట్లయినయెడల మానవచర్యలకు సంబంధింపని వనములు, కొండలు, మేఘములు, ఉషస్సులు, సూర్యాస్తమయములు మున్నగు దృశ్యముల ప్రతిలేఖనములు కాంచువారలకు ఆనందము గలిగించును గదా! అట్టి చిత్రమునందుఁ గూడ నీతి అంతర్లీనమైన యున్నదా అని కొందఱడుగవచ్చును. అట్టి చిత్రములు అనీతి స్ఫోరకము గాకుండుట చేతనే వానియందలి రామణీయకమును ప్రతిబంధకము లేక మన మనుభవింతుము. నీతి సౌందర్యమునకు హేతువు గాదు. పరిపూర్ణతకు ఆవశ్యకమైన యొక యౌచిత్యము.

కావ్యమునందు శిల్పనైపుణ్యము హెచ్చుకొలఁది యందలి కథాభాగమునకుఁ జదువరుల హృదయము నాకర్షించుశక్తియు హెచ్చుచుండును. గుణ మెప్పుడు వస్తువు నాశ్రయించి యుండును గావున నితరకళలయందువలెనే కావ్యమునందును వస్తుగుణములు రెండింటికిని వానివానికిఁ దగిన ప్రాధాన్యము గలదు.

మానవుని ప్రతికోరికకును రెండుదిక్కులు గలవు మొదటిది వాంఛా పరిపూర్తి; రెండవది తజ్జనితమైన యుపయుక్తి. ఒక యుదాహరణము : మిఠాయినిఁ జూచినపుడు తినఁ గోరిక పుట్టును. ఇది జిహ్వాచాపల్యము. మన దృష్టి కోరిక తీర్చుకొనుటయందే లగ్నమై యుండును గాని, దాని యుపయోగమును గుఱించిన తలంపు సాధారణముగఁ గలుగదు. కాని, మనము తలంచినను, తలంపకపోయినను మిఠాయి తినుటవలన రెండు లాభములు చేకూఱినవి. ఒకటి : కోరిక తీరుటవలన గలుగు తృప్తి రెండు : దేహపుష్టి. ఇచ్చట మిఠాయిలోని మాధుర్యము రుచిచూచుటవలన గోరిక తీరినది. ఆ మాధుర్యము ఆహారవస్తువు నాశ్రయించి యుండుట వలన దేహమునకు బలము కలిగించినది. కాని మాధుర్యము మాత్రము కోరిక తీర్చునదిగ నుండి తదాశ్రయవస్తువు అనారోగ్యకరమై యుండినయెడల దాని ప్రతిఫలమును మనము తప్పక యనుభవింతుము. ఈ సాదృశ్యమును కావ్యములో రససౌందర్యములకును, కథాభాగమునకును, వాని ననుభవించు మానవ సమాజమునకును నన్వయించి చూడుఁడు. అంత్యఫలితము మీరే యూహింపఁగలరు.

మానవస్వభావనిర్మాణమునందుఁ బరిస్థితులు చాల ముఖ్యము లని మన స్తత్త్వశాస్త్రజ్ఞు లెల్లరు నొప్పుకొన్న విషయమే. కావ్యములం దట్టి పరిస్థితులు గలవు. ఇంద్రియగోచరము లగు విషయములు మనల నెట్లు లోఁగొనునో, కావ్యాంతర్గత విషయవర్ణనము గూడ నట్లే మనల వశవర్తులఁ జేసికొనును.

కావున కావ్యములతోఁ గవికిఁ గల సంబంధముకన్నను దానిని యానందించు లోకుల కెక్కుడు సంబంధము గలదు.

మతమును శిల్పమును ఒకపూవులోఁ బుట్టిన రెండురేకులని చెప్పవచ్చును. వాని రెంటికి మిక్కిలి సమీపబాంధవ్యము గలదు. ఒకదాని నొకటి యపేక్షించి యవి యన్యోన్యసహకారము వలన నభివృద్ధి చెందినవి.

వైదికఋషుల భావమును, కవిత్వకల్పనాశక్తియు సమ్మిళిత మయి, యందుండి యపూర్వసృష్టులు బయలుదేరినవి. పౌరాణికప్రపంచ మంతయు నిట్టి మత కవిత్వసాంకర్యముయొక్క యద్భుతసృష్టియే కదా ! ఇట్టి కల్పనలు లేకున్న మానవజీవిత మెంత సంకుచితముగ నుండి యుండెడిదో !

మతమును, శిల్పమును ఆనందసాక్షాత్కారమునకై పాటుపడుచున్నవి. గంతవ్య మొకటి ; మార్గములు భిన్నములు.

"ఆనందా దేవ ఖల్విమాని భూతాని జాయంతి, ఆనందా దేవ జాతాని జీవంతి, ఆనందం ప్రయా న్త్యభిసంవిశంతి."

ఈ భూతసృష్టియంతయు నానందమునుండి యుత్పన్న మగుచున్నది. ఆనందమున వర్ధిల్లుచున్నది. ఆనందము దిక్కునకే ప్రవహించుచున్నది. తుద కాయానందమున బ్రవేశించుచున్నది. శిల్పసృష్టియు నిట్టిదే. భక్తుఁడును శిల్పియు నేది "సత్యం శివం సుందర"మో దానిని దర్శించుచున్నారు. ఈ యంతస్తునందు నిద్దఱికిఁ గల భేదము నశించినది. కవి భక్తుఁడు; భక్తుఁడు కవి, శిల్పము మతము నొక్కటియే యైనది.

మొదటి యనాగరకదశయందు మానవుఁడు పశుప్రాయుఁడై కామ్య సౌఖ్యములతో సంతృప్తిపడియుండును అంతకు మించిన సంతోషము నతఁ డెఱుఁగఁడు. రెండవదశయందుఁ బ్రాపంచికజ్ఞానము కొంత యుదయించి మనో వికృతులు శిక్షితము లయి శాస్త్రములు శిల్పములు మున్నగువాని మూలమున నానందముఁ బొందును. మూఁడవదశయందు రానురాను ఆ జ్ఞానము విశేష ముగ నభివృద్ధి నొంది పూర్వమున కన్న శాశ్వతమైన యానందము నన్వేషింప మొదలిడును. అదియే యమృతానందము.

"ఏకం రూపం బహుధా యః కరోతి...తమ్ ఆత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా, తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్."

ఒక రూపమును బహురూపములుగ నెవ్వఁ డొనరించుచున్నాఁడో, ఆత్మస్థుఁడైన ఆ పరమాత్మను ఏ ధీరులు దర్శించుచున్నారో వారు శాశ్వతసుఖమును బొందుదురు. అన్యులు పొందరు.* శిల్పము తనయాదర్శకమును క్రమక్రమముగ మార్చుకొని యెట్టకేల కీశాశ్వతసుఖమును మానవుల కందింపఁగలయంతటి యున్నత పదవి నారోహించినం గాని కృతకృత్యము కానేరదు.

ఆంధ్ర పత్రిక.
క్రోధన సంవత్సరాది సంచిక.
1925 మార్చి 25 వ తేదీ – సంచిక 16.

---

* "Fine art is not real art till it is in this sense free, and only achieves its highest task, when it has taken its place in the same sphere when religion and philosophy." Hegel's 'Philosophy of Fine art.'

# స్వభావోక్తి

—శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులు

కవి చిత్రకారుఁడు నను నిద్దఱునుఁ బ్రకృతి పరిశీలకులు. పూఁదేనెం దుమ్మెద యాస్వాదించున ట్లెల్లవస్తువులయందలి సౌందర్యసారమును గ్రహింపఁ గల నేర్పు వీరిది. దీనింబట్టి స్థాయిభావ పరిణామకారణము లగు విభావాను భావాదుల నుచితరీతిం బోషించి సహృదయాహ్లాదకర మగు నిర్భరానందసం విద్రూపరసపరిస్ఫూర్తిఁ గావించుటలో వీరి నైపుణ్యమునందుఁ బరస్పరసామ్యము గన్పట్టును. అదిగాక కవి కావ్యమునందును, చిత్రకారుఁడు చిత్రరచనమునందును నారాధింపవలసిన రసాధిదేవతామూర్తి యొక్కటి యగుటచే వీరికిఁ బరస్పర సహకారము నుపకారి కావచ్చును. రసపరిష్కృతము లగు నిర్మలహృదయ ముకురములం దనేకచిత్రవిచిత్రాకృతులు ప్రతిబింబించుచుండును. కల్పనాపటిమచే వింత మెఱుఁగు గూర్చి రసజ్ఞలోకమున కయ్యాకృతుల నెఱుక సేయుటకు వలయు నైసర్గికప్రతిభ వీరిపాలిసొమ్ము. సాధారణజనులవలెఁ గాకఁ దొల్తఁ దమ హృదయ ఫలకమునం దీర్చిదిద్దుకొనిన యాకారమును గాని, భావమునుకాని యినుమడించిన శోభతో వాచికముగా సాక్షాత్కరింపఁజేయఁగలవాఁడు కవి. జీవకళ లుట్టిపడఁజిత్రింపఁగలవాఁడు చిత్రకారుఁడు. వీరిలోఁ జిత్రకారునకు రసజ్ఞలోకమును సమ్మోహింపఁ జేయఁ గల ప్రధాన సాధనము "స్వభావ కథనము." ఇతని నిసర్గప్రతిభాసంరంభవిశ్రాంతికిఁ బరమావధి యయ్యదియ.

"అవస్థానుకృతి ర్నాట్యమ్" అనుటచే ననుకార్యుల యవస్థాస్వరూపముల ననుకరించి ప్రేక్షకసమాజమును జొక్కించు ననుటకు నీ "స్వభావకథనమే" పరమావధి. అట్లే—

కవిప్రయత్నమునకు నీ "స్వభావోక్తి" ప్రధానపరికరము. నిసర్గ ప్రతిభా పరమాధి కధీనములైన యాకారములను, భావములను విదగ్ధజనమనో హరముగ నపూర్వరచనావైచిత్ర్యము నునువుపఱచి శబ్దార్థముల మూలమునఁ బలుక నేర్చిన కవి ధన్యుఁడు. వింతసొంపులనింపు నాతని బలుకులే కావ్యశోభాకరము లగు నలంకారములు. స్వప్రతిభైకగోచర మగు సహజస్వరూపము నిచ్ఛావిలాసముగా మెఱుఁగుసొబఁగులు తురంగలింపఁ

బలుతెఱంగుల నలంకరించుట కలంకార పరికరము కావలసినంత కవిసృష్టిలోఁ గలదు. అం దీస్వభావోక్తి యున్నతస్థాన మాక్రమింపఁగలదు. రసపరికరము లగు విభావానుభావాదుల మనోజ్ఞస్వరూపము నీయలంకారము నిరూపించునంత తేటగను, సూటిగను తక్కుంగల యలంకారములు నిరూపింపఁ జాలవు. స్థాయిభావవికాసమున నిది ముఖ్యసాధనము. రసికబృందమున కీయలం కారమునం దాదర మెక్కుఁ డగుట కిదియే కారణము. మను చరిత్రమున శృంగారరసపోషణకు వలయు పరికరముం గూర్చుటకు—

సీ. "కులిశధారాహతి పొలుపునఁ బైనుండి
యడుఁగు మోపఁగ జేగు రైన తటులఁ
గనుపట్టు లోయ గంగానిర్ఝరము వారఁ
జలువ యౌ నయ్యేటి కొలఁకులందు
నిసుకపెట్టిన నేల నేచి యఱ్ఱాంకులఁ
జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముకపున్నాగనారంగరంభానాళి
కేరాదివిటపికాంతారవీథిఁ

గెరలు పికశారికాకీరకేకిభృంగ
సారసధ్వని తనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వయక్ష
గానఘూర్ణిత మగు నొక్కకోనఁ గనియె."

అని యొకయపూర్వదృశ్యమును కవి స్వభావోక్తి మూలమునం గల్పించెను. ఇది తప్ప యుపమ లెన్నిచెప్పినను, యుత్ప్రేక్ష లెన్నిఁ గూర్చినను, శ్లేషచమత్కృతు లెన్నిఁ గుమ్మరించినను మఱి యేయలంకారముల బెడంగు హవణించిన నిట రసో దయము కాదు. సమయోచితముగ స్వభావోక్తి రాణించును. ఆంధ్రకవితాపితా మహు డిట్టిసమయములఁ గుర్తించుటలోఁ గడునేర్పరి. అతని—

"తతనితంబాభోగధవళాంశుకములోని
యంగదట్టపు కావిరంగువలన"
"అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింప..."
"చూచి ఝళంఝళత్కటకసూచితవేగపదారవింద యై..."

అను పద్దెములందలి స్వభావోక్తుల రామణీయకం బపూర్వ మై సమయోచితమగు టచే సహృదయుల నధికముగా నాకర్షించుచున్నది.

ఈ యలంకారము కేవల రసోపస్కారహేతువే కాక కవికాలమునందలి నాగరికత, శిల్పాదికళల యభివృద్ధి, ఆచారాదర్శములు, రాజ్యాంగపద్ధతులు మొదలగు చరిత్రాంశముల నందందు నిరూపించుటకు ముఖ్యసాధనమగుచున్నది. దానంజేసి కవికిఁ గల లౌకికజ్ఞానసంపత్తి వెల్లడి యగుటయు, పాఠకునకుఁ బ్రాచీనచరిత్రావబోధ మై లోకవ్యవహారజ్ఞానముచేకూరుటయుం దటస్థింపఁగలదు. అపుడుగాని కావ్యప్రయోజనము సాకల్యముగ ఫలింపదు.

మనుచరిత్రకారుఁడు వరూధిని గట్టుకొన్న వస్త్రమును వర్ణించుటంబట్టి పురాతనకాలమునుండియు స్నిగ్ధములు సున్నితములు నగు వస్త్రములు తయారు కాఁబడు చుండెడి వని నేఁటి చరిత్రకారులు సిద్ధాంతీకరించుట కవకాశము గలిగినది. రామాయణాది కావ్యములయందలి స్వభావోక్తులం బట్టి శిల్పాదికళలయభివృద్ధి నిరూపింపఁబడినది. శ్రీనాథుఁడు మొదలగు కవుల చాటుపద్యములును, విశ్వగుణాదర్శమువంటి గ్రంథములును స్వభావోక్తులచే నత్యంతరమణీయములై యిట్టి చారిత్రాంశములను బోధించుచున్నవి. కవికి నైసర్గికప్రతిభ, కూలంకషమగు శాస్త్రపరిచితి, లోకజ్ఞానము, వాఙ్నైపుణ్యము అను వీనిలో నేది లోపించినను స్వభావకథనము లోకోత్తరచమత్కారి కానేరదు. కవికిఁ గల వాఙ్నైపుణ్యమును, ప్రతిభావిశేషమునుఁ బరీక్షించుట కిది గీటురాయి యనవచ్చును. అందుచేఁ బ్రాచీనాలంకారికు లిద్దాని నాద్యలంకృతి యని వక్కాణించి దీని కుపమాదులన్నిటికంటెఁ బ్రాముఖ్య మిచ్చిరి.

కావ్యాదర్శమున—

"నానావస్థం పదార్థానాం రూపం సాక్షా ద్వివృణ్వతీ
స్వభావోక్తి శ్చ జాతి శ్చే త్యాద్యా సాలంకృతి ర్యథా."

అని దండ్యాచార్యు లీయలంకారలక్షణమును దొల్త వివరించుటలో నీవిశేషమిమిడియున్నది. "ఆద్యా' యను కంఠోక్తి దానిని మఱికొంత స్పష్టము చేయుచున్నది.

ఇట్లుండ నవీనులు-"తత్ర ప్రథమ మనేకాలంకారబీజభూతత్వా దుపమా నిరూప్యతే"(విద్యానాథుఁడు) అని యుపమాలంకారమును మొదటి దనిరి. అనేకాలంకారబీజభూత మను కారణముచే నావిషయమును సమర్థించి స్వభావోక్తిని దూర

ముగ విసరిరి. అందుచే నర్థాలంకారము లుపమాదు లైనవి. ఈ విషయ మెంత దనుక సమంజసమో చూతము.

ఉపమాలంకార మనేకాలంకారబీజ మఁట; అగుఁగాక! ఉపమకుఁగూడ బీజమగుచున్నది స్వభావోక్తి. ఏలన - ప్రకృతాప్రకృతములకు సామ్యము వాచ్య మగుచో నుపమ యగునుకదా! అట్లగుచో ప్రకృత మనఁబడు వస్తువుయొక్క సంపూర్ణ స్వరూపము కవిప్రతిభాగోచరమైనపుడు గదా ఆ ప్రకృతముతో సామ్యము వాచ్య మగుట. ముఖ్యస్వరూప మిది యని నిర్ణయింపఁబడినమీఁదట నది చంద్రుని వలెనున్న దనుట పొసఁగును గాని వర్ణ్యస్వరూపానుభవము లేన ప్పుడు సాదృశ్య ప్రసక్తి యెట్లు? అందుచే వస్త్వవస్థాస్వరూపానుభవము నున్న దున్నట్లు వివరింపనేరని కవి కుపమాదులతోడిసంబంధము నపుంసకవధూ కాంక్షయే యనఁదగు. ఒకవేళ పూర్వకవిసంప్రదాయములను, గమనికలను గుర్తించి వారిభావములను, పదములను సేకరించి ''పులిని జూచి నక్క వాఁత పెట్టుకొన్నట్లు'' ముఖ మిందు బింబ మనియు, కనులు కలువరేకు లనియు నల్లి బిల్లిగ నాల్గుపదము లల్లవచ్చు నది కవిత్వమా? ఆ యలంకారములు కవిప్రతిభా విశేష సూచకములా? కావు.

ప్రకృతిసుందరము లగు నవయవసంస్థానములు గల మూర్తి నలంకరించు టకు హారనూపురాద్యలంకారము లెట్టివో, కవిప్రతిభాగోచరము లగు విభావాను భావాదుల నిసర్గసుందరస్వరూపము నలంకరించుట కుపమాదు లట్టివి. అనఁగా జాతి క్రియాగుణద్రవ్యభేదముచే నలుతెఱంగు లైన విభావానుభావాదుల యవస్థా స్వరూపములను రసజ్ఞలోకమునకు సులభముగ బోధించి రసానుభవముఁ జేకూ ర్చుట కుపమాదులు సాధనము లగుచుండును. కవి వివక్షిత మిందు స్వభావోక్తియే యగును అందుచే నలంకారము లన్నిటికి స్వభావోక్తి బీజ మనుటలో సంది యము లేదు.

''శంపాలతికతోడి జలదంబుకైవడి
మెఱుఁగుటొల్లియతోడి మేనివాని''

అని పాడుకొను కవీంద్రుని హృదయముకురమునఁ దొలుఁత ప్రతిబిం బించినది 'మెఱుఁగుటొల్లియతోడి మేనివాని' సొబఁగు కాని మెఱపుతోడి మేఘంబు గాదు. ఆ ప్రతిబింబాకృతినే యాతఁడు ప్రధానముగా రసజ్ఞలోకమున కెఱుక పఱుపఁ దలఁచినదియు, అందుల కొక పోలిక గొనితేఁగోరి ప్రకృతి నొక్కమాఱు సింహావలోకనముం గావించి మెఱుపుదీవపొత్తు గల మేఘంబు నేర్చి కూర్చి రస

జ్ఞులకు స్వప్రతిభైక గోచర మగు మూర్తి నతిసులభముగాఁ బ్రత్యక్షము చేసినాఁడు. ఇం దుపమాలంకారమునకు స్ఫూర్తియున్నను స్వభావోక్తియే యిం దతి సుందరముగ గోచరించు చున్నది. ఇట్లలంకారజాతము నెల్లఁ దఱచిన నీ స్వభావోక్తి దానిలో నంతర్భింబితమై కన్పట్టకమానదు.

మేఘసందేశమున—

"తస్యాః కించి త్కరధృత మివ ప్రాప్తవా నీరశాఖం
హృత్వా నీలం సలిలపవనం ముక్తరోధో నితంబమ్
ప్రస్థానం తే కథ మపి సఖే లంబమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః."

అని కలదు. సృష్టిం దలక్రిందు సేయఁగల నిసర్గప్రతిభాసంపన్నుఁ డగు కవి బ్రహ్మ యొకవిధ మగు సృష్టినిర్మాణమునం దృప్తినందఁ జాలఁడు. అందులకుఁ దనకావ్య సృష్టియం దత్యద్భుతనూతనదృశ్యములం గల్పించుకొని వినోదించు చుండును. అతని వినోదము సహృదయహృదయాకర్షక మైనది.

ఈ శ్లోకమున - గట్టుక్రిందకుం దిగిన గంభీరానదియు, నందుఁ దేరిన నల్ల నీటిపై కొఱఁగిన వేతసశాఖయు, నందు పైపై నలముకొనిన మేఘంబును గల యొకమనోహరప్రకృతిదృశ్యము ప్రత్యక్షీకరింపఁబడినది. భావనాప్రపంచమున లీనుఁ డైనపుడు స్వప్రతిభలో గోచరించు నైజస్వరూపమును వెల్లడించుటయే కవి యొక్క ముఖ్యోద్దేశము. అగుచో నిది స్వభావోక్తియే యగును. అయిన నిది స్వభావోక్త్యలంకార మనఁ జెల్లదు. కవిప్రతిభ యంతటితో విశ్రమింపలేదు. స్వభావసిద్ధ మైన పూర్వదృశ్యము కావ్యసృష్టి నొకవింతపరిణామము నొంది నూతన దృశ్యముగాఁ గన్పట్టుచున్నది. ఇందు గంభీరానది గంభీరనాయిక యైనది. ఒడ్డు క్రింద నున్న నల్లని నీ రామె నితంబమును పీడిన విరహసూచక మైన నల్లని పలువయైనది. నీటి కొఱఁగిన వేతసశాఖ వస్త్రనిరోధక మగు నామెహస్తమైనది. మేఘుఁడామెకు నాయకుఁ డయ్యెను. కవిబ్రహ్మయొక్క యీ వినూత్నశిల్పనా కౌశలమున శృంగారరస ముద్దీపిత మైనది. రూపకార్థాంతరన్యాసాలంకారము లిందు బహిర్వ్యక్తములై ప్రాధాన్యము వహించినవి. అందుచే నూత్నశిల్పమునకుఁ బునాది యని స్వభావోక్తి ననవలసియుండును.

అనుకరణ ప్రధానము గల దృశ్యకావ్యములయం దీస్వభావోక్తి మిక్కిలిగఁ గూర్పఁబడును.

> "దర్భాంకురేణ చరణః క్షత ఇత్యకాండే
> తన్వీ స్థితా కతిచి దేవ పదాని గత్వా
> ఆసీ ద్వివృతవదనా చ విమోచయంతీ
> శాఖాసు వల్కల మసక్త మపి ద్రుమాణామ్."

గీ. "చరణమునఁ గ్రుచ్చికొనెఁ గుశాంకుర మటంచుఁ
గొన్ని యడుఁగులె నడచి యాకొమ్మ నిలిచె
తరువు శాఖల వస్త్రంబు దగుల కున్న
దీసుకొనుదానివలె వెన్కఁ దిరిగి చూచె." (క. పి.)

అని గలదు. శృంగార రసాధిదేవత యిందు సహజస్వరూపమున దాండవించు చున్నది. నాయిక యొక్క తాదాత్మికావస్థా స్వరూపము నతిసుందరముగఁ బ్రత్యక్షీకరించుటలో కవి ప్రతిభ కిందుఁ బూర్తి యైన పని కుదిరినదిఁ అత్యద్భుత సంవిధానముచే నాలంబన విధానము యొక్క సహజ సౌందర్య సామ్రాజ్యము కవివాఙ్నైపుణ్యముచే మెఱుఁగుదీరి యొక్కింత వింతరామణీయకము నెనయ నఖండ బ్రహ్మానంద సబ్రహ్మచారి యగు రసము జాలెత్తినది. సహృదయహృదయములందలి హర్షాంకురముల కది జీవము.

స్థాయిభావ వికాసమునకు నీస్వభావకథనమే హేతు వనుటకు-"రాజా- సఖే! తపస్విభిః కైశ్చి త్పరిజ్ఞాతోఽస్మి చింతయతావ త్కేనాఽపదేశేన సకృదాశ్రమే వసామ" అను నాయకుని వాక్యము గుర్తు. తరంగిత మగు రసప్రవాహమున నుఱ్ఱూత లూఁగుచున్న యాతనిడెంద మిప్పుడు నిశ్చయస్థానము నధిగమింపఁ గలిగినది. "కుంభగత ప్రదీపికాశ్రీ దోఁప నేకాగ్రత నిర్వృతిఁ జెందుట" యన నిదికదా! కాదేని యేదేని మిషవెట్టి యైన నిట నుండు మను నుత్కంఠాసూచక వాక్యము బయల్పడు టెట్లు? ఇది స్వభావోక్తివలనఁ గలిగిన పరిణామము. ఈ స్వభావమును నటకుఁడు గూడ సరసముగా ననుసరింప గలిగెనా, సామాజికుని భాగ్య విశేషమే మని చెప్పవలయును! ఇట్లు విభావానుభావ సామగ్రిఁ బోషించి సహృదయులఁ జొక్కించు నీస్వభావోక్త్యలంకార ప్రాగల్భ్య

మును శృంగారాదినవరసక్రమమున వివరించుటకు తావు చాలదు. కాళిదాసాదుల రచనలయం దీస్వభావోక్తుల పొందిక లనంతములు.

సగుణారాధకుల కీయలంకారమునం దభిరుచి మెండు. లక్ష్యముం జూపినఁ గాని వ్యాకరణ సూత్రార్థ మవగాహన కాని వడువునఁ దా మారాధించు దేవతా మూర్తి కనులఁ బొడకట్టినఁ గాని భక్తి రసానుభవము సిద్ధింపదు. భక్తి రసాభవమునకు మూర్తి సాక్షాత్కారమే పరమావధి కదా ! భక్తిరస ప్రధాన మగు శ్రీకృష్ణ కర్ణామృతమునం దీస్వభావోక్తు లతిసుందరము లనేకములు.

''అంసాలంబితవామకుండలధరం మందోన్నతభ్రూలతం
కించిత్కుంచిత కోమలాధరపుటం సాచిప్రసారేక్షణమ్
ఆలోలాంగుళిపల్లవై ర్మురళికా మాపూరయన్తం ముదా
మూలే కల్పతరో స్త్రిభంగి లలితం జానే జగన్మోహనమ్.''

ఉ. ''మూఁపున వామకుండలము మోవి నొకించుక మోడ్పు నందముం
జూపెడు నోరచూపు సొగసుం బొమ నొక్కట నిక్కు గన్పడం
గ్రేపులు సొక్కఁ గల్పకముక్రిందఁ ద్రిభంగిగ నిల్చి యంగుళీ
వ్యాపితవంశపూర్తిమయి వర్తిలు మోహనమూర్తిఁ గొల్చెదన్.''

అని చిన్ని కృష్ణుని సహజసుందర స్వరూపము నత్యంత రసోద్దీపకముగఁ జిత్రించి స్వప్రతిభాగోచర మగు మూర్తి నింతకంటెఁ దెలుపఁజాలనో యనునట్లు 'జగన్మోహనమ్' అనుపదముచే స్వసంరంభమున కవధిఁ గల్పించికొనినాఁడు కవిపుంగవుఁడు. ఆంధ్రీకరణము నత్యంతరమణీయముగ నున్నది. ''క్రేపులు సొక్క'' అనుపదము మూలాధికమయ్యు నందముఁ గూర్చినది. ఇందలి స్వరూపము చిత్రకారునకుఁ జక్కనిపని గల్పింపఁగలదు.

పరమభక్తాగ్రేసరుఁ డగు పోతనమహాకవి కీ స్వభావోక్తి ప్రియతమము. అతని గ్రంథమునం దతిలలితములైన స్వభావోక్తు లనేకములు గన్పట్టును. చూడుఁడు—

సీ. ఒకచెలికానిపై నొకచేయిఁ జాచి వే
ఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ

గొప్పున కందని కొన్నికుంతలములు
చెక్కుల నృత్యంబు సేయువాని
గఱుచచుంగులు పుచ్చి కొమరాఱఁ గట్టిన
పసిడివన్నియ గల పటమువాని
నొదలఁ దిరిగిరా నలవడఁ జుట్టిన
దట్టంపుఁ బింఛెపుదండ వాని
రాజితోత్పలకర్ణపూరములవాని
మహితపల్లవపుష్పదామములవాని
భువనమోహననటవేషభూషివానిఁ
గనిరి కాంతలు కన్నుల కఱవు దీర.''

కనినవారు కాంతలే కాదు; కవియు, మనమును. ఇం దాగోపికావల్లభుని సహజ స్వరూపము గడుసొంపుగఁ గన్పట్టుచున్నది. కవి హృదయమునం దోచుచున్న మూర్తిని సంపూర్ణముగఁ జిత్రించుట కీపద్యఫలకము చాలనే లేదంటకు ''కన్నుల కఱవు దీర'' అను పదమే నిదర్శనము. అదిగాక భువనమోహననటవేషుని మూర్తిం బూర్తిగ నిరూపింప నెవరితరము ?

అత్యంతరసోపస్కారకారణమై పండితపామరజనసామాన్యము నాదరింపఁ జేయుటలో స్వభావోక్తికి మించిన యలంకార మొండు గానరాదు,

భాగవతమున నీకవి కృష్ణుని శైశవమును వర్ణించుటలో—

సీ. ''కడుపున దిండుగాఁ గట్టిన పలువలో
లాలితవంశనాళంబుఁ జొనిపి,
విమలశృంగంబును వేత్రదండంబును
జారి రానీక డాచంక నిఱికి,
మీఁగడపెరుఁగున మేళవించిన చల్ది
ముద్ద డాఁపలిచేత మొనయ నుంచి,
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయల
వ్రేళ్ళసందుల నెల్ల వెలయ నిఱికి,
సంగడీలనడుమఁ జక్కనఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి

యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు నెఱపి చల్ది గుడిచె.''

అని శ్రీకృష్ణపరమాత్మను లీలామానుషస్వరూపమునఁ జిత్రించుటలోఁ గవి చూపిన వాజ్నైపుణ్యము వాచాతీతము. గొల్లపిల్లలలో నాభగవానుని,నాయిద్దరిలో పాఠకులను నైక్యము గావించుట కీకవి కూర్చుకొనిన పరికరము నిరుపమానము. అప్రాకృతతేజోమూర్తి నాలకాఁపరిగఁ జేసి యామూర్తియొక్క తొల్లిటివేషమును ''యాగభోక్త'' యను పదముచే గోచరింపఁజేసి రెంటిలో భేదమును గట్టెదుట నిల్పి చూపుటచే నీమహాకవి సంవిధాన మత్యాశ్చర్యకర మైనది. అమరులు వెఱఁగందుటయు నందులకే గదా !

ఇట్లు స్వభావోక్తులు కవి ప్రతిభను బట్టి మనోజ్ఞము లై కావ్యలక్ష్మి నలంకరించుచుండును. పూర్వాలంకారికుల మతమున నిది ప్రాధాన్యము వహించుటయు నుచితమే యగును. అభిరుచింబట్టి మతభేదము గాని మతభేదముంబట్టి యభిరుచి కాదు గదా !

—ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక - ప్రజోత్పత్తి.
(1951 - 52) సంచిక : 22.



# ప్రథమ పద్యాంధ్ర వ్యాకరణము

—డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం

రచనావిధానమునుబట్టి తెలుగుభాషకు వ్యాకరణములు ఈ క్రింది విధములుగా వింగడింపఁబడినవి. (1) సంస్కృతశ్లోకములయందు ఆంధ్రశబ్దచింతామణి, వికృతివివేకములేక అధర్వణకారికావళి, హరికారికావళి మున్నగున విట్టివి. ఇందలి కారికలనే తగురీతిని విఱచి సూత్రములుగాను పఠించుకొనదగును. (2) సంస్కృతసూత్రములందు వైకృతచంద్రిక. దీనిని మంచెళ్ళ వాసుదేవ కవి రచించెను. ఇది యింతదనుక ప్రచురింపబడక పోవుట విచార్యము.

## 1. ఆంధ్రకౌముది :

ఇది మండ లక్ష్మీనృసింహ కవి విరచితము. దీనిని 1895 లో విశాఖపట్టణము ఆర్షాప్రెస్‌వారు తొలుత ప్రచురించిరి. ఇందలి సూత్రములు దేవనాగర లిపిలోను, ఉదాహరణములు తెలుగులిపిలోను ఉన్నవి. గ్రంథపీఠికలోని కతిపయ విషయము లాధారముగా ఆచార్య గంటి జోగిసోమయాజులుగా రీవ్యాకృతి క్రీ.శ. 1670 ప్రాంతమున రచిత మై యుండునని ఊహించిరి. కాని అనేకాంతరంగిక సాక్ష్యములనుబట్టి యిది ప్రాచీనవ్యాకృతిగా కానరాదు. సిద్ధాంతకౌముదికిది అనుకరణముగా కనుపట్టినను, రచన చాల సంక్షిప్తము. ఇందనేకము లగు అవకతవకలు గూడ గలవు "From the quotaions contained in the work, it may be inferred that he lived in recent years"అని ప్రాచ్యగ్రంథాలయాధికారుల యభిప్రాయము.

## 2. చిన్నయసూరి సూత్రాంధ్ర వ్యాకరణము :

ఇదియు సమగ్రముగా కనుపట్టదు. లోపభూయిష్ఠమైనది. ఇందనేకసూత్రములు వివరణము నపేక్షించుచున్నవి. చిన్నయసూరి తానొక సూత్రాంధ్ర వ్యాకరణమును సంస్కృతమునందు సమగ్రముగా వ్రాసినట్లును, అందలి కొన్ని సూత్ర

ములను బాలుర కుపయుక్తమగునట్లుగా తెనుగున కనువదించినట్లును ఈ క్రింది పద్యమువలన తెలియును:

"మును మదుపజ్ఞంబగుచుం
దనరిన వ్యాకృతిని సూత్రతతి యొక కొంతం
దెనిగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగు భంగిఁ దగన్."

సమగ్రముగా తెనుగు శబ్దలక్షణము తెలిసికొనవలయు నను వేడ్క గల వారలు ఈ మూలవ్యాకృతియగు సూత్రాంధ్రవ్యాకరణము జూడవలయు ననియు సూరి ఆకాంక్షించెను. ఇప్పుడు లభించుచున్న సూత్రాంధ్రవ్యాకరణము, సమగ్రముగా తాను వ్రాసినట్లు సూరి చెప్పుకొన్న వ్యాకరణమునకు చిత్తుప్రతిగానో, తొలిరూపము వంటిదిగానో భావింపనగు నని కొందఱ యభిప్రాయము.

*3. పద్యములందు రచింపబడినవి :*

వీఁటిలో ప్రథమము, ప్రధానమునగు ఆంధ్రభాషా భూషణము గూర్చి విపులముగా పరామర్శింతము.

*4. తెలుగు సూత్రములందు రచింపబడినవి.*

చిన్నయసూరి బాలవ్యాకరణము, ప్రౌఢవ్యాకరణము మున్నగునవి.

*5. గద్యాంధ్ర వ్యాకరణములు :*

వీనినే వివరణాత్మక వ్యాకృతు లనియు ననఁదగును. ఈ రచయితలకు "అల్పాక్షర మసందిగ్ధమ్, సారవత్ విశ్వతోముఖమ్, అస్తోభ మనవద్యం చ సూత్రమ్ సూత్రవిదోవిదుః" అను లక్ష్యముతో సూత్రరచన చేయవలయునన్న ఆశయము లేదు. విషయవివరణమే వీని ప్రధానలక్ష్యము. శ్రీరావిపాటి గురుమూర్తిశాస్త్రి విరచితమగు "తెనుగు వ్యాకరణము", శ్రీ ఉదయగిరి శేషయ్య "తెలుఁగు వ్యాకరణ సంగ్రహము", టి. యం. శేషగిరిశాస్త్రి "ఆంధ్రశబ్ద తత్వము", కుప్పణ్ణయ్యంగారి "సర్వలక్షణసారసంగ్రహము", శ్రీ వావిలికొలను సుబ్బారావు "సులభవ్యాకరణము", శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి "ఆంధ్రశబ్దానుశాసనము", శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి "బాలవ్యాకరణోద్యోత్యాదు" లిట్టివిగా నెన్నవచ్చును.

పద్యాంధ్రవ్యాకరణముల గూర్చిన సంక్షిప్తచరిత్రమును, వానియందలి విలక్షణలక్షణములను పరామర్శించులక్ష్యముతో ప్రథమపద్యాంధ్రవ్యాకరణమును ఇట సమీక్షింతము.

ఆంధ్రభాషా భూషణము :

క్రీ. శ. 13 శ. మూలఘటిక కేతన కర్త. ఇది 192 పద్యములతో పరిమిత మైన వ్యాకరణము. (అటనట వచనములును లేకపోలేదు.) ఆంధ్రశబ్ద చింతామణి అర్వాచీనమైన వ్యాకృతి యని, బహుశః ఎలకూచి బాలసరస్వతియే దీనిని వ్రాసియుండు నని భావించు ఆధునికులు చాలమంది ఈ వ్యాకృతియే తెలుగుభాషకు తొలి దని భావింతురు. ఇందులకు కేతన-

"మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్"

అని చెప్పుకొనుటయు నుపబలక మై యుండును.

సంస్కృతమునందు విరచితమైన కొన్ని వ్యాకృతులందు లక్షణమే కాని లక్ష్యములు తత్కర్తలచే కూర్చబడినవికావు. అవి తరువాతి టీకాకర్తలు, వ్యాఖ్యాతలు, అనువాదకులు చేకూర్చినవి. కాని ఆరీతిగా గాక లక్ష్యలక్షణములు రెండును కేతనచేతనే కూర్చబడినవి. కొన్నిచోట్ల లక్ష్యములు మాత్రమే యుండును.

కేతన తాను వ్రాసినది చిన్న వ్యాకృతియే యైనను, తన్ను 'ఆ షణ్ముఖ పాణినులకు నగు నెన' యని 'భాషావేదులు సంతోషింతు' రని విశేషముగా ఆశించినట్లు కనిపించును. ఒక సమగ్రవ్యాకరణము ఆంధ్రభాషకు రచింపవలయునను ఉదారాశయ మాతని కున్నట్లు కానరాదు. ఆంధ్రభాషా ప్రవేశమున కాతడు మార్గదర్శి కావలయుననియే ఆతని ఉద్దేశ్యము. ఒక క్రొత్త గ్రామమునందు, 'ఫలానా' వారి యిల్లెక్కడని అడుగుదుము. ఇందులకు కొందరు గొందులు, సందులు, సంకేతములు చెప్పి పొమ్మందురు. కొందరుదారులు తామే స్వయముగా వచ్చి ఇంటిపద్ద దిగవిడచి పోదురు. ఇందేది యుత్తమ మని ప్రశ్నింప పనిలేదు. మొదటిపద్ధతి ప్రకారము అడిగినవాడు

కొంత తనబుద్ధిని కూడ ఉపయోగింపవలసి యుండును. ఇందు పొరబడి ఒక యింటికి మారుగా ఇంకొక ఇంటిలో ప్రవేశించుట కవకాశ ముండును. రెండవపద్ధతిలో ఇట్టిదాని కవకాశ ముండదు. ఈ రెండును గాక మధ్యేమార్గ మొకటున్నది. కొంతదనుక వచ్చి రూఢముగా గుర్తు చూపనగును. కేతన తొలిదారినే త్రొక్క నవచ్చు ననుట కీ క్రింది పద్యమే సాక్ష్యము.

"కంచి నెల్లూరు మఱి యోరుఁగఁ ల్లయోధ్య
యను పురంబులపై గంగ కరుగు మనిన
పగిది, నొక త్రోవఁ జూపెద, బహుపథంబు
లాంధ్రభాషకుఁ గల వని యరసికొనుఁడు."

ఆంధ్రభాషాగ్రహణమున కనేకమార్గము లున్నట్లును, అందు తా నీరీతిగా, స్థూలముగా మార్గసూచనము మాత్రమే చేయతలపడినట్లును కేతన వచించెను. కావున కేతన తన రచనను సమగ్రముగాఁ గావింపలేదని విమర్శింపరాదు. ఏలన ఏ రచయిత ఏ ఆశయముతో తనరచన సాగించెనో గుర్తించి, ఆ ఆశయసిద్ధిని అతఁడు గాంచెనో లేదో పరామర్శింప వలయునే కాని అత డాశింపని దానిని మన మాతనినుండి ఆశింపరాదను విమర్శన సూక్ష్మము నిట్లొకచో శ్రీ అరవిందులు తెలియపఱచిరి.

"The true spirit of criticism is to seek in a literature what we can find in it of great or beautiful, not to demand from it what it does not seek to give us". కాని కేతన విషయములో వచ్చిన చిక్కు అతడు తన్ను పాణిన్యాదులతో పోల్చుకొనుట. నక్కెక్కడ ? నాకలోక మెక్కడ ?? కేతన తన పరిధి తెలియనంత అవివేకి గాడు. బహుశః యిది ప్రక్షిప్తమేమో ! లేదా తాను తొలి వ్యాకృతిని తెలుగునకు కూర్చినా నను మోజుతో చెప్పుకొనియుండును. ఆధునికులకు నిట్టి సర్దాలు లేకపోవు.

కేతన సంస్కృతమే అన్నిభాషలకు తల్లియని, అట్టి సంస్కృతము, తజ్జన్యము నగు తద్భవము కాక, స్వతంత్రముగా కల్గినభాషయు కొంత కలదని, ఈ మొత్తము కలిసిన భాషయే "తెనుఁగుబాస నాఁగ వినుతి కెక్కె" అని ఉద్ఘాటించెను.(14 ప॥). ఇది యంతయు ఆంధ్రభాష యని ఆతఁడు భావించలేదు. ఆతడు రచించినది 'ఆంధ్రభాషాభూషణమే' అయినను, ఆంధ్ర పదము నాతఁడు

పట్టైనచోటులను ప్రయోగింపనేలేదు. అది యట్లుంతము. ఆంధ్రశబ్ద చింతామణి యందువలె ఇందు ప్రాకృతముల ప్రసక్తి లేదు. కాని కేతన ప్రాకృతప్రసక్తి నొక్కమారు గావించెను. అది యిది.

> ''సంస్కృత ప్రాకృతాది లక్షణముఁ జెప్పి
> తెనుఁగునకు లక్షణముఁ జెప్పకునికి యెల్లఁ
> గవిజనంబులనేరమి గాదు నన్ను
> ధన్యుఁ గావింపఁ దలఁచిన తలఁపు గాని.''

ఇట ఒకసందేహము. సంస్కృతప్రాకృతాది లక్షణమును జెప్పిన కవిజనము లెవరు? తెనుఁగుకవులే కావలయును. ఎవరో అయినచో వారు తెనుఁగునకు లక్షణము నేల చెప్పరు? దీనినిబట్టి తెనుగు కవులు కొందఱు వక్ష్యమాణకవుల కుపయుక్త మగునట్లుగా సంస్కృతప్రాకృతములకు లక్షణము నేర్పఱచి యుందురు. అవి యీనాఁడు లభ్యములు అగుటలేదని భావించవలయును. కేతన కాలమున ఆంధ్రదేశములో ప్రాకృతవ్యాకరణములు కూడ సంస్కృతముతోపాటు పఠనపాఠనము లందుండె ననుట కీ పద్యము తోడ్పడుచున్నది. అయినను కేతన సంస్కృత సమము లట్లు ప్రాకృతసమములను గాని, సంస్కృతభవములట్లుగా ప్రాకృతభవములను గాని గుర్తింపలేదు. వర్ణనాత్మకవ్యాకరణము రచించు వానికి ప్రాకృతములతో తెనుగునకు గల సంబంధము చారిత్రకము కావున నిరూపింప వలసిన పనిలేదు. ప్రాకృతసమముల నన్నింటిని ప్రాకృతభవములుగానో, సంస్కృతభవములుగానో పరిగణించినను ప్రమాదము లేదు. సిరి, అగ్గి ఇత్యాదులు నేటి విద్యార్థులు శ్రీ, అగ్ని అను ప్రకృతులకు వికృతులుగా గ్రహించు చున్నారు. కాని ఒక్కచోట ప్రమాదము వాటిల్లుచున్నది. సంస్కృతమునందలి 'య' కారము సూటిగా తెనుఁగునకుఁ జేరునపుడు యకారము లోపించుచున్నది. ఉదా॥యశము-అసము, యుగ-ఉగము, యువతి-ఉవిద ఇత్యాదులు. ఇట్లు యకారము లోపించు పదములకన్న యకారము జకారముగా మాఱుపదములే తెనుగునం దెక్కువ. ఈమార్పు ప్రాకృతభాషలో కల్గి, తద్ద్వారమున తెనుగున ప్రవేశించినది. ఈ ఒక్కచోటనైన ప్రాకృతసమ-లేక-భవములను అంగీకరింపక తప్పదు. సంస్కృతభవము లనుటకు వీలులేదు. ఏలన సంస్కృత యకారము తెనుగున అకార మగును గదా! కావున యాత్ర-జాత్ర, యముఁడు-జముఁడు ఇట్టివి ప్రాకృతభవములని గాని, ప్రాకృతసమములని గాని అనకతప్పదు.

కర్ణాటతమిళభాషలయందును ప్రాకృతసమభవములు గుర్తింపఁబడలేదు ఒక కర్ణాటభాషా చరిత్రకారుడు ఈ సందర్భమున వీనిని గుర్తించిన తెనుఁగు వ్యాకర్తల విజ్ఞతనే యిట్లు ప్రశంసించెను

"The word tat in the compounds tatsama and tatbhava is taken in Kannada grammars to denote Sanskrit, but in Telugu it is taken to denote Prakrit also, and this classificatıan is desırable since there ate instances of words, which it is easier to derıve from Prakrit than from Sanskrit"- History of kannada Language by R. Narasimhachary. p. 115,

*సాంకేతిక పదములు :*

శాస్త్రరచన సాంకేతికపదములమీదనే ఆధారపడియున్నది. ఏశాస్త్రరచన యైనను ప్రాచీనపారిభాషికపదములను మార్చుకొని గాని, ఉపజ్ఞకొలది స్వకీయములను కల్పించుకొనిగాని అభివృద్ధి నందవలసి యున్నది. పాణినితో బోల్చుకొన్న కేతనలో నీ దృష్టి కానరాదు.

కేతన అచ్చులు, హల్లులు అను పాణినీయ సంజ్ఞలను; స్వరములు, వ్యంజనములు, అంతస్థలు, ఊష్మలు అను ప్రాతిశాఖ్యసంజ్ఞలను ఉపయోగించెను. తత్సమము, తద్భవము, దేశ్యము అను పారిభాషికపదములను ప్రాకృతవ్యాకరణముల నుండియైన గాని, భరతుని నాట్యశాస్త్రము, దండి కావ్యాదర్శాదుల నుండి గాని గ్రహించె ననవచ్చును. 'గ్రామ్యము' అను పరిభాషను తొలిలక్షణ గ్రంథముగా నెంచదగు "కవిజనాశ్రయము" నుండి స్వీకరించియుండును. ఈ విషయము ముందు నిరూపితము. 'అచ్చతెనుఁగు' అనునది కేతన ఉపజ్ఞతో కల్పించినదిగానే కనుపించును. దీని పరామర్శయు ముందు జరుగును.

సంస్కృతమునందు తపరకరణము, ఇత్సంజ్ఞవంటి వానిని తాను కల్పింపవలయు నని కేతన ఉత్సహించి యిట్లు నుడివెను. "లక్షణములు దెలిపెడుచో నక్షరములు దెలియు కొఱకు ననువైన క్రియన్, శిక్షార్థముగాఁ బల్కెద, లాక్షణికులు తప్పుగాఁ దలఁపకుఁడు మదిన్" (33 ప॥). కాని యిందును నీతఁడొక నిర్దిష్టవిధానము ననుసరింపకపోవుట విచార్యము. వుఱు, ముఱు, డుఱు, కుఱు, ఙుఱు, నఱు, రుఱు, దుఱు అనురీతిగా హల్లులకును, అఱు, ఇఱు ఉఱు అనురీతిని

అచ్చులకును జేర్చెను. ఇంతకు దీనివలన నితడు సాధించినది 'కారము' అను ప్రత్యయ ప్రయోగము చేయకుండ గాని; అక్షరము అని ప్రయోగింపకుండగాని పద్యమును నడపుట. జిత్తుకిత్తుల సున్నట్లు వీనికి వ్యాకరణకార్యమునందే విశేష ప్రయోజనము లేదు. యశ్రుతి అనిగాని, యడాగమ మనికాని యనక కేతన కేవలము యకారమనియే యనెను (49 ప॥). ఆగమాదేశాదులను గూడ నీతఁడు చాలవఱకు ప్రయోగింపలేదు. ఆదేశమునకు 'తోచివచ్చు'నని యీతఁడు చక్కగా నుడివెను. (62 ప॥). కాని ఒకచో నిగ్రహము తప్పి కాబోలును "పునాదేశ" మని నుడివెను (1.9 ప॥). ఇట్లే 'వికల్ప' మనియు నొకచో వచించెను. (51 ప॥) బహుళము, విభాష అనునవి యిందుపయుక్తములు కావు.

ఆంధ్రశబ్దచింతామణియందు కల్పింపబడిన ప్రాణులు, ప్రాణములు, వక్రములు, వక్రతమములు, పరుషములు, సరళములు, స్థిరములు దంత్యతాలవ్య భేదములు, కళ, ద్రుతప్రకృతికము, ఔపవిభక్తికము, మహద్వాచకము, అమహద్వాచకము, తద్ధర్మార్థకము, సమాపకమువంటి పారిభాషిక పదము లాంధ్రభాషాభూషణమునందు లేవు. అర్థకము, (mood) వర్తమానార్థక, భూతార్థకాదు లని యిం దుపయుక్తము.

ద్రుతప్రకృతికము లనుటకు మాఱుగా కేతన 'నాంతంబైన పదంబుల' (54 ప॥) అని ప్రయోగించెను. ఇట 'నంతమ'ని యుండు టుచితము. తక్కిన పాదాదిఅచ్చులు కూడ దీర్ఘములు కావు అట్లుకానిచో 'న+అంతము' అని గ్రహింప వలయును. అప్పుడు 'న' లోని అత్వము తక్కిన హల్లులందు వలె ఉచ్చారణసౌలభ్యమునకు తెచ్చిపెట్టుకొన్నదిగానే యెంచవలయును. 'పొల్లునకారమే' (59 ప॥) కొన్ని పదాంతములయం దుండు నని యీతఁ డెంచెను. దీనికే చింతామణికర్త ద్రుత మని పేరిడెను.

సంధి, సమాసము, విశేషణము, విభక్తి, క్రియ, ప్రధానము అను సంస్కృతవ్యాకరణ ప్రచురసంజ్ఞలను కేతనకూడ ఉపయోగించెను. కాని సర్వనామమునుటకు మారుగా ఈతఁడు, "యుష్మదస్మత్పదంబు" లనెను. (105 ప॥. 106 ప.). ఈరీతిగనే కృదంతములు, తద్ధితాంతములు మున్నగు వానినికూడ కేతన గ్రహింపక అట్టి వానిని కొంచెముగా మాత్రము సూచించెను. పురుష, లఘువు, అనుస్వారాదులును, తత్పురుష, కర్మధారయ, బహువ్రీహి అనురీతి నీతఁ డుపయోగింపలేదు.

క్త్వార్థ మను దాని నీతఁడు యిత్వాంతం బనుట మిక్కిలి సముచితము. ఇట్లు పారిభాషికపదప్రయోగవిషయమున చింతామణ్యాదులతో నీ పద్యాంధ్ర వ్యాకరణము పూర్తిగా భేదించుటను బట్టి కేతనను కొంతవఱకు స్వతంత్ర మార్గగామిగా భావింపనగును. సంస్కృతసంజ్ఞాదికము నుపయోగించకుండ నుండు పట్ల కేతన చూపిన నిగ్రహము మిక్కిలి ప్రశంస్యము

సంస్కృతమునందు తద్భాషకు వ్యాకరణ రచన మూడు విధముల జరిగినది.

*1. పాణినీయ పద్ధతి :*

సాంకేతికనైపుణ్యముతోఁ గూడిన కృతకసంక్షిప్తరచనాపద్ధతి. పాణిని అష్టాధ్యాయినిని మార్గదర్శకముగాఁ గావించుకొని యొనర్చిన వ్యాకరణము లగు చాంద్ర, జైనేంద్ర, సరస్వతీకంఠాభరణాదు లిట్టివి.

*2. కాతంత్ర పద్ధతి :*

ఇందు అక్లిష్టము సహజమగురచనాపద్ధతి పాణినీయముకన్న భిన్నముగా నుండును. ప్రత్యాహారాదిక్లేశము లిందుండవు. "శబ్దకృతలాఘవము కంటె అర్థ కృత మైన లాఘవమునకే ప్రయత్న మెక్కువ." శర్వవర్మ విరచితకాతంత్రమును (పాణినీయరచనకు, వార్తికములకు మధ్య నిది విరచిత మై యుండునని పెద్దల యభిప్రాయము) మార్గదర్శకముగాఁ జేసికొని రచితమైన హైమశబ్దానుశాసన, సంక్షిప్తసార, సారస్వత, సుపద్మ, ప్రయోగరత్నమాలాదు లిట్టివి.

*3. పాణినీయ కాతంత్ర పద్ధతి :*

కాతంత్రమువలె ప్రకరణవిభాగమును, పాణినీయమువలె ప్రత్యాహార పద్ధతి, ఏకాక్షరసంజ్ఞలు కలిగిన రచన ముగ్ధబోధవ్యాకరణ మిట్టిది.

అష్టాధ్యాయిలో 3990 సూత్రము లుండగా, నాలుగధ్యాయములు గల కాతంత్రమున 1400 సూత్రములే కలవు. ముగ్ధబోధలోను నాలుగే అధ్యాయములు-1184 సూత్రములు. తెలుగు దేశములో దీనిని బాగుగా ఉపాసించినవారు కీ॥ శే॥ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు.

అక్లిష్టత, రచనలో అవలంబింపబడిన సహజధోరణి, సంక్షిప్తత మున్నగు లక్షణములను బట్టి ఆంధ్రభాషాభూషణము కాతంత్రపద్ధతికి చెందినదిగా భావింప

నగును. తమిళమునందలి తొల్‌కాప్పియము కూడ నిట్టిదే అని బన్నెల్ పండితుఁడు నిర్ధారించెను. (చూ. "On the Andhra School of Sanskrit Grammarians-Their place in Sanskrit and subordinate Literatures-పుట 10). ఆంధ్రభాషాభూషణ విషయము పట్ల నిట్లుగా స్పష్టముగా నిర్ధరింపఁజాలము కాని, స్థూలముగాఁ బేర్కొననగును. ఆంధ్రశబ్దచింతామణి, బాలవ్యాకరణాదులు, పాణినీయ పద్ధతికిఁజెందిన వనవగును. పైవిభాగము మాట నట్లుంతము. చింతామణి, బాలవ్యాకరణాదులు సాంప్రదాయిక వ్యాకరణములు కాగా, ఆంధ్రభాషాభూషణాదులు స్వతంత్రవ్యాకరణము లనవచ్చును. లక్షణగ్రంథములందు వ్యాకరణప్రసంగము కొంత యుండును. వానిని కేవలవ్యాకరణము లనుటకు వీలులేదు. అందలి వ్యాకరణభాగములను ప్రాసంగికవ్యాకరణము లనవచ్చును. కావ్యాలంకార చూడామణిలోని నవమోల్లాసము; అనంతుని ఛందస్సులోని చతుర్థాశ్వాసమునందలి కొంత భాగము మున్నగు ప్రాసంగిక వ్యాకరణము లిట్టి స్వతంత్రశ్రేణికి చెందినవిగా పరిగణింపవచ్చును. ఇది ప్రత్యేకవిషయముగా నిరూపింపఁదగినది.

కేతన వ్యాకర్తగా పాటింపవలసిన కొన్ని ప్రాథమికనియమములు కూడ మెలకువతో పాటింపకపోవుట విచార్యము. ఉదా॥ (I) "మును సంస్కృతపదములపైఁ దెనుఁగువిభక్తులు ఘటించి తేటపడఁగఁజెప్పిన నది తత్సమ మనఁజను" (ప॥ 20). ఇట పద మనుట యుచితము గాదు. పదములపై విభక్తులు చేరవు కదా! 'శబ్దముల'ని కాని 'ప్రకృతుల'ని కాని యనుట శాస్త్రీయము. 'తెలుఁగున సంస్కృతపదములు పలికెడి తెఱఁగెఱిఁగినంత' (ప॥ 42) తిరిగి యిట్లే ప్రయోగించెను. (ii) "గుణ పదములపై మానుగహల్లున్న నంతిమము లగు ములకున్ బూని పునాదేశం బగు." (ప॥ 119). 'పునాదేశ మ'నుట పరుషసరళములకు ముందయినచో సరిపడును గాని, తదితరములయిన హల్లులు పరమగు నపుడయి యినచో 'పు' మాత్రమే ఆదేశమగును. (iii) త్రికసంధిగా నేఁడు బహుళ ప్రచార మందిన సంధిని కేతన నిరూపించుచు, 'ఊష్మలుడుగ' (ప॥ 186) అని మాత్రమే వచించెను. రేఫను విస్మరించుట ప్రమాదము. 'అయాయేలను పదములు తుదినూష్మ లుడుగఁ బై వర్ణముతో నదుకునెడఁ గుదియు, సాగును; కుదియు నెడన్ జడ్డ్రవా లగున్ బై హల్లుల్'' (ప॥ 186) అచ్చులు కుదియునెడన్ హల్లులు జడ్డ లగుచున్న వనుటకన్న, హల్లులు జడ్డలు కాగా, అచ్చులే కుదియుచున్న వనుట మేలు. ఇట్టి వింకను కొన్ని నిరూపింపవచ్చును. అట్టివానిలో

పేర్కొనఁదగినది 'డు', 'కు' లు విధించునపుడు వానికి పూర్వము బిందు నిర్దేశము చేయకపోవుట. 'ండు', 'ంకు' లననగును (ప॥ 70,73).

అచ్చతెనుఁగు :

తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యమునను నాల్గువిధము లగు విభాగములను మాత్రమే ఆంధ్రశబ్దచింతామణికర్త, తదనుయాయులు గావింపఁగా, అచ్చతెనుఁగను విభాగము నదనముగా కేతన గావించెను. కాని, అచ్చతెనుఁగన నేమియో ఆతడు నిర్దుష్టముగా నిర్వచింపక పోవుట విచార్యము. 'తల, నెల, వేసవి, గుడి, మడి, పులి, చలి, మడుఁగు, వూరు, పేరు, బూరుగు, మగవాడు, అలుక అని యెల్లవారికిఁ దెలిసెడి యాపలుకులు అచ్చతెనుఁ గనఁ బరఁగున్' అని మాత్ర మాతఁడు వచించెను. ఎల్లవారికిని తెలిసెడి పదములనునవి యుండు టెట్లు సాధ్యమగును? శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు పైపదములకు తమిళ, కర్ణాట భాషలలోని సజాతీయపదములను జూపి (Cognates) "ప్రాకృతవైయాకరణులవలె సంస్కృతమునుండి వచ్చిన వని చెప్పుటకు వీలు లేనివి, అర్థము సులభముగా తెలియనివి యగు శబ్దములను గాదు వీరు 'దేశి' అని చెప్పినది; ఈ దేశిశబ్దములకు "ఊరో గ్రామః" అన్నట్లు అర్థము చెప్పవలసిన ఆవశ్యకతయు కేతనాదులకుఁ గలుగ లేదు. ఇది 'కలితీ' లేని అచ్చమైన —స్వచ్ఛమైన, తేరిన.—తేట తెనుఁగు. తెనుఁగు దేశము నందలి యెల్లవారికి నప్రయత్నముగనే సహజముగనే తెలిసెడి పలుకులు గావున-వీని కచ్చతెనుఁగని కేతన పేరు పెట్టినాఁడు" అని వివరించిరి. (దక్షిణదేశభాషాసారస్వతములు—దేశి, పుటలు 33, 34). దేశ్యములక్రింద కేతన తొంబదియొక్క పదముల నుదాహరించెను. ఇందును 'సహజముగనే అందఱకును తెలిసెడి పలుకులు— వెన్న, మన్ను, వేట, పొద్దు, గ్రద్దలు, చెంత—ఇత్యాదులు లేకపోలేదు. ఇట్టి విభాగము లతివ్యాప్తి, అవ్యాప్తి దోషములతోఁ గూడి స్పష్టత నాశించుచున్నవి. దేశ్యము లనఁగా 'తేర నాడినవ'ని కేతన నిర్వచనము. అనఁగా 'తేటఁగా పల్కినవ'ని దివ్యప్రభావివరణము. (పుట.32).

"ఆ కాలపు ప్రాంతీయాంధ్రశబ్దము (Provincialisms) లని తలంపవలసి యున్నది. కాని వీనిలో పెక్కుశబ్దములు సమాసపదములుగను, గ్రంథస్థములుగను కావ్యభాషా సామాన్యములుగనే యుండుటను బట్టి నిత్యవ్యవహారములోనివి గాని, గ్రాంథికభాషారూపములనే యిట్లు గ్రహించిరా"యని శ్రీ కోరాడ

వారికి చక్కగా 'సందేహింపవలసి' వచ్చినది. (భాషా చారిత్రక వ్యాసములు-పుట 122). మాండలిక పదము లాయామండలవాసులకు సులభగ్రాహ్యములే యగును గాన అవి వారికి అచ్చతెనుఁగులే యన నగును గదా! ఇట్లొకతీరుగా జెప్పిన కేతన "తత్సమంబు దక్క తక్కిన నాలుగు, నచ్చతెనుఁగు లంచు రభిలజనులు" అని తిరిగి యుద్ఘాటించినట్లు కలదు. (ప॥ 27). దీనినిబట్టి తద్భవదేశ్యములే అచ్చ తెనుఁగు లని గ్రహించిన, వక్ష్యమాణ లక్షణవేత్తల నిర్వచనములతో నిది తులతూగుచు, పై ప్రసంగములను నిరర్థక మొనర్చు చున్నది. ఇది కేతన రచించెనా? పునరుక్తిగా నిట్లు చెప్పినదే చెప్పునా? సందే హింపవలసి యున్నది.

గ్రామ్యము :

ఈ పారిభాషికపదము సంస్కృతప్రాకృత వ్యాకరణములోనిది కాదు. సంస్కృతాలంకారశాస్త్రములోను, తెనుఁగు ఛందోగ్రంథములయందు కలదు. "ఇవి మొదలగు నొడువు లనేకవిధ గ్రామ్యోక్తు లెన్ని కల వన్నియు" (కవిజ నాశ్రయము. దోషాధికారము-26 ప) దుస్సంధులు, కుసంధులు, అపశబ్ద దోషములు, చట్టుప్రావు, వైరిపద మిత్యాదులన్నియు గ్రామ్యోక్తులుగా నిందు పరిగణింపఁ బడినవి. (చూ. ఇందే 18-26 ప.) ఇట్లు శబ్దదోషములే ప్రధానముగా కవిజనాశ్రయమునందు నిరూపితము. కాని సరసత లేని, అసభ్యవచనములను గూర్చి పేర్కొనలేదు. "ఓ ముగుదరో! యేలా నిన్ గామించుచునున్న నన్ను గామింపవటం చీమెయిఁ బలికిన నర్థగమై మేకొను గ్రామ్యదోష మతి విరసము గన్"– (తెలుఁగు కావ్యాదర్శము-ప్ర. ప. 48). ఇది విరసపువచనమున కుదాహరింపఁ బడఁగా, అందే అసభ్యవచనమున కిట్లుదాహరింపఁబడెను: "కలిగి తీరు సభ్యేతర కథనమునను, శబ్దమందును గ్రామ్యదోషస్ఫురణము, రతిమహో త్సవ మధురవర్ణనములందు, యభవముఖ్యపదంబుల నతికి రేని॥ యభమైథునే అని ధాతుపాఠము" (తెలుఁగు కావ్యాదర్శము-ప్ర. ప. 50 ప.) అభినవదండి పై రీతిగా నున్న అపశబ్దములను, అసభ్యవిరసవచనములను గ్రామ్యములుగా నిరూపించి (చూ. 26 ప. ఉదాహరణములు) "గ్రామ్య మనఁగ నెవ్వరు నొప్ప రొరులఁ దెగడుచోట నొప్పు నదియు" (27 ప.) అని నిర్వచించెను. శిష్టులైన వారెవ్వరు నంగీకరింపని యప శబ్దములు, యాసలు మున్నగునవియే కాక, ఇతరులను నిందించుపట్ల నుపయుక్తమగు భాషయు గ్రామ్య మగునని కేతన వచించెను. లక్షణవంత మైన భాషలో నెవ్వరిని దెగడరాదనియా కేతన భావన!

అయినచో కావ్యభాషలో తెగడ వలసిన ఘట్టముల నెట్లు పోషించుట? ఇప్పట్లను కేతన నిర్వచనము సమగ్రముగా లేదు. మొత్తము మీద ఉచ్చారణమందు గాని, అర్థమందుగాని గ్రామ్య మనఁగా అసభ్య భాషణము లనియేఁ నూత్నదండి యభిప్రాయమై యుండును. ఈ రీతిగా కావ్యభాష కాపున అర్థగ్రామ్యత (Vulgarism) భాషాగ్రామ్యత (Non-gramatical Language) రెండును ఆంధ్రభాషా భూషణమునందు సూచితము. ఇట్టి రచనను బురస్కరించుకొనియే సి. పి. బ్రౌన్ మున్నగువారు గ్రామ్యము లనగా rustic phrases: some forms used in common talking are considered vulgar అని వచించి యుందురు. (A Grammar of the Telugu Language-2 nd Edition P-159.)

నిజమునకు అర్థగ్రామ్యముతో వ్యాకరణశాస్త్రమునకు సంబంధము లేదు. గ్రామ్య మనునది వ్యాకరణశాస్త్రసంజ్ఞగా నిర్వచింప వలయును. ఒకేసంజ్ఞ రెండు శాస్త్రములందు వ్యవహృత మగుట వలన ఇట్టి చిక్కులు కల్గును. అందుచేతనే సాంప్రదాయిక మైన ఆంధ్రశబ్ద చింతామణి "అనియమాత్ గ్రామ్యం హి యత్త్వపభ్రంశః"-లక్షణము పట్టినది గ్రామ్యము (కారిక. 3. బాలసరస్వతీయ పుట 6) అని వచింపగా తదనుయాయి చిన్నయసూరి "లక్షణవిరుద్ధం బగు భాష గ్రామ్యంబు" అని నిర్వచించెను.

*సంధి :*

(1) సాంప్రదాయిక వ్యాకరణమగు వికృతివివేకమునం దిట్లుగా తెనుఁగు నందలి సంధి నిర్వచింపబడెను :

"ఆద్యంత వర్ణయో రైక్యం సన్ధి రిత్యుచ్యతే బుధైః
పూర్వస్య పర రూపత్వ మత్రైవ నియతం భవేత్"

ఇందలి పూర్వార్ధము కేతన యొసఁగిన ఈ క్రింది నిర్వచనముతో సరిపడుచున్నది.

"మొదలిపదము తుదివర్ణము
వదలక పైపదముమొదలివర్ణముతోడం
గదియఁగ సంధులు నాఁదగు".

చిన్నయసూరి పై కారికలోని పూర్వార్ధమును వదలి, ఉత్తరార్ధమును గైకొని "పూర్వపరస్వరంబులకుఁ బరస్పరం బేకాదేశ మగుట సంధియనం బడు" నని సంధినిర్వచనమును సంకుచిత మొనర్చెను.

2. "నాంతము లైన పదంబుల పొంతంబై నున్న శబ్దముల కచటతల్, దొంతి గజడదబ లగు; నయ్యంత నకార మగు సున్న" అని కేతన (ప॥ 54) చెప్పినది, చింతామణికర్త చెప్పినదియు నీరీతిగా సమానముగా నున్నది. "పరుషా ద్రుతప్రకృతికా త్సరళాస్స్యు స్తద్రుతం చ బిందు స్స్యాత్." వీరిరువురి మతము నను ద్రుతము పొల్లు నకారమే. ఇట్టి ప్రాచీనాభిప్రాయమును గాదని చిన్నయ సూరి ఉత్వవిశిష్ట నకారమును ద్రుతముగా స్వీకరించుటను బట్టి సంశ్లేషరూప మొకటి అధికముగాఁ గల్పించెను. పూచెన్+గలువలు అనుచో సంహిత కలు గగా పొల్లు నకారము గకారముతోఁ జేరివర సమీకరణము చెంది (Assimilation) తద్వర్గ అనునాసికముగా మాఱును; పూచెఙ్గలువలు: ఇట్లు వర్గాక్షర ములతో వ్రాయు పద్ధతి క్రమముగా పోయి సుకరముగా బిందూపయోగము గావించు పద్ధతి ప్రచురమగుటచే "పూచెంగలువలు" అనురీతిని రూపము సిద్ధించును. ఈ సంధిలోని చారిత్రక సత్య మిది. ప్రథమపద్యాంధ్ర వ్యాకరణము నను, సంస్కృతోక్తవ్యాకరణమునను సంశ్లేషరూపములు చెప్పఁబడకపోవుట గుర్తింపఁదగిన యంశము.

విభక్తి :

సాంప్రదాయిక మగు ఆంధ్రశబ్దచింతామణిలో సప్తవిభక్తులే చెప్పఁబడగా సంబోధనమును గూడ ఒక ప్రత్యేకవిభక్తిగా ఆంధ్రభాషాభూషణకర్త "ఎనిమిది తెఱంగుల" విభజించెను. (ప॥ 68).

సమాసము :

సమాసములలో లుక్సమాసములనే కేతన పరిగణించి "మొదలిపదంబు విభక్తులఁ బుచ్చి మీఁదిపదంబులతోడ సమ్యక్సంసక్తంబు లగుటంజేసి సమాసంబు లయ్యె" నని కేతన వచించెను. సాంప్రదాయికవ్యాకరణము "లోప శ్చ విభక్త్యాదే శ్శబ్దేషు స్యా త్సమాసకాంగేషు" (ఆంధ్రశబ్ద చింతామణి IV-17) "సమాసవిభక్తికి లోపం బగు, (లట్టునకుఁ గాదు) (బా. వ్యా. సమాస. 25) అని పూర్వోత్తరపదముల సంబంధ మైన విభక్తులకు లోపమును జెప్పెను. ఉత్తర పదములో నిట్టి లోపము కేవలము శాస్త్రమర్యాదకే యగునని యెంచి కానోపు, కేతన దానిని త్రోసిపుచ్చెను. సమాసమును శాబ్దికముగానే కేతన నిర్వచించుట సముచితమే యననగును,

సంస్కృతమునందలి తత్పురుష, కర్మధారయము, బహువ్రీహి, ద్వంద్వ మిత్యాది సమాససంజ్ఞలను చేబట్టక అర్థప్రాధాన్యమునే గ్రహించుట గుర్తింపదగు నంశము.

తెనుఁగున పూర్వపదార్థప్రధానము, సమాస ముండ దని కానోపు చిన్నయ సూరి యట్టి దానిని నిరూపించలేదు. (బా. వ్యా. సమాస. 3 సూ. వృత్తి). పెదతల, క్రేఁగన్నులు, నడురేయి, ఎడకాలు, ఎడగాలు అనునుదాహరణములు పూర్వ పదార్థ ప్రధానములుగా కేతన చూపెను. (ప॥ 111).

ప్రధాన మనుపదమునకు A Dictionary of sanskrit Grammar నందు 'ముఖ్యము' 'స్వతంత్ర ప్రయోజనము కలది' అనియే అర్థము కలదు. ''సమాసస్థ మగు పదద్వయమునందు ఏది ప్రప్రథమమునఁ గ్రియతో నన్వయించునో యది ప్రధానము''ని 'తత్సమ చంద్రిక' యందు (పుట 313) చక్కఁగా నిర్వచింపఁబడెను. ఈ యర్థమును బట్టియే దీని నొక వ్యాకరణసంజ్ఞగా నెంచఁదగును. సంస్కృతమున ''పారేసముద్రము పురము గలదు'' సముద్రము యొక్క పారమందు పురము గలదు. ఇందు 'కలద'ను క్రియాపదములోనికి 'పార'పద మన్వయించును. అనఁగా బూర్వపదము. కావున నిది పూర్వపదార్థ ప్రధాన మగు నవ్యయీభావము. (త. చం. పుట 314). సంస్కృతమున అధి, ఉప, అను, ఇత్యాద్యుపసర్గలతో నిట్టి సమాసములు ప్రాయికముగా నేర్పడు చుండును. ఇట్టి ఉపసర్గలు తెనుగున నుండవు. అందుచే నిట్టి సమాసములు తెనుగున నుండ వని సూరి భావించియుండును. ''అతని బుద్ధి పెడతల బట్టెను'' అనుచో 'పట్టె నను' క్రియతో 'పెడ' పద మన్వయించును కాని యిట్లు తక్కిన వన్నియు సరిపడుట లేదు. ''అతఁడు నడురేయి యేతెంచెను'' ఇందు ''ఏతెంచెన''ను క్రియతో 'నడు' అన్వయింపక-'రేయి' అన్వయించును. ఇట్లే 'ఎడగాలం బట్టె', 'క్రేఁగన్నులఁ జూచె' ఇత్యాదులు. తెనుఁగున సామాన్యముగా విశేషణవిశేష్యభావమే ప్రచురము.

గణపవరపు వేంకటపతి కవి తన 'ఆంధ్రకౌముది' యందు ''పూర్వపదార్థ ప్రధానమై యవ్యయీభావ మొప్పుఁ సచు నుండు'' (పుట 17) నని వచించి ''కొనకొమ్మ, తుదమ్రాను, మునిమాపు, నడురేయి, రాయంచ, కడసంజ, రాచిలుక, మునివ్రేళ్ళు, మీఁగాళ్ళు, ముంజేయి, కొనఁగోరు, క్రీఁగడుపు, కడకన్ను, లోఁదొడ, పెడతల'' అను వానిని(పుట 22) ఉదాహరించెను ఈ విషయము పట్టిగల

యభిప్రాయభేద మట్లుంచి, తెనుఁగు సంప్రదాయముగా ఇట్టివి కొన్ని పరిశీలించి, పరిగణింపవలసి. యున్నది. "పెదతల మొదలగు వాని యం దేది యుత్తర మునఁ బ్రియోగింపఁదగు పదమో అది పూర్వమునఁ బ్రయోగింపబడినది. తల యొక్క పెడ పెడతల" అని దివ్యప్రభావివరణము. (పుట 88).

సమాససంధులను సమాసనిరూపణసందర్భముననే కేతన వచించుట సమంజసము (119-129; 136, 137 పద్యాలు).

*క్రియాపదములు :*

త్రికాలములను బోధించు క్రియాపదములను కేతన (i) భూతార్థకము (ii) వర్తమానార్థకము (iii) భవిష్యదర్థకము అని సొరిదిని నిరూపించుట సముచితము. ఇట 'అర్థక' మనునది వ్యాకరణశాస్త్ర సంజ్ఞ. ఆంగ్లమునందు Time నకు Tense నకు గల భేదమువంటి భేదమే 'కాలము'నకు 'అర్థకము' నకు గలదు. ఒకటి లోకవ్యవహారము-రెండవది శాస్త్రవ్యవహారము. ఆంధ్రశబ్ద చింతామణియు "తద్ధర్మవర్తమానాతీతాగమ్యర్థకాః" "వ్యతిరేకార్థే" అను రీతిని ప్రయోగించెను. ఇది సంస్కృతప్రాకృతము నుండి యెరవుగొన్న సంజ్ఞ కాదు ! ఈ సంజ్ఞ కేతనోపజ్ఞమా? చింతామణ్యుపజ్ఞకమా? అని విచికిత్స జనించి పరామర్శింపఁగా, నిది కన్నడ వ్యాకరణమునుండి సంపాదించుకొన్నదిగా కనుపించినది. (చూ. భూతార్థ-V-222 ప. 1 ; విధ్యర్థక-229 ప 1 ఇత్యాదులు శబ్దమణిదర్పణం.)

తమిళ వ్యాకరణమునందు 'కాలమ్' అను లోకవ్యవహారపదమే వ్యాకరణ శాస్త్రమునకును సంజ్ఞ యైనది. అంతకన్న కర్ణాటాంధ్ర వ్యాకరణ శాస్త్ర పద్ధతియే మేలైనది. అప్పుడే శాస్త్రాధ్యయనము, పృథగ్భూత మై రాణించు చుండును.

ఇట్టి వ్యాకరణశాస్త్రసంప్రదాయ మెఱుఁగక ప్రభుత్వము ప్రకటించు చున్న పాఠ్యపుస్తకకర్తలు 'వర్తమానకాలము' 'భూతకాలము' 'తద్ధర్మకాలమ'ను రీతిని వ్రాయుట శోచనీయము (చూడుడు-6 వ తరగతి తెలుగువాచకము పుట 22 ; రచయిత శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి). దివ్యప్రభావివరణకర్తయు ప్రామాదికముగా "భూతకాలము" "తద్ధర్మకాలమ" నెను. (పుటలు 109 ; 110). అప్పటికి 'వాఙ్మయ మహాధ్యక్షులు' కాని కారణముచే కానోపు శ్రీ వఝమూడి వారు తమ పీఠికలో "తద్ధర్మకాలరూపము" లని (పుట 134) వచించిరి.

సాంప్రదాయికము లగు ఆంధ్రశబ్ద చింతామణ్యాదులందు "తద్ధర్మార్థకము ; తద్ధర్మాద్యర్థకము" అను రీతిని గల విభాగము ఆంధ్రభాషాభూషణమున లేదు. "తద్ధర్మార్థకము" చింతామణి కల్పితసంజ్ఞయే, తమిళకర్ణాటాది దాక్షిణాత్యభాషల యందును ఇట్టి 'అర్థకము' లేదు. ఆంధ్రభాషా భూషణ కర్తయు నిట్టిదానిని గుర్తింప లేదు. ఇట్టి తద్ధర్మార్థకక్రియ లనఁబడు వానిని గూడ భవిష్యదర్థక క్రియలుగానే కేతన నిరూపించెను. ఉదా. పలుకును-పలుకుదురు;పలుకుదువు-పలుకుదును, పలుకుదురు. ఇవియే రెండర్థములందును ఉపయోగ మగును. చింతామణి యిట్టి వానిని తద్ధర్మార్థకము లని, భవిష్యదర్థమున "కల" అనునది అనుబంధక మగుననెను. (ఆం. చిం. క్రియా-4). ఒక్కొక్క భాషలోని తద్ధర్మ మొక్కొక్కరీతి నుండును. ఆంగ్లమునందు వర్తమానార్థకముపయుక్తము. ఉదా : The Sun rises in the East.

*తద్ధితాంతములు :*

కాఁడు, ఈఁడు, ఇఁడి, ఆఁడు, ఆరి, కత్తె, తనము అను ప్రత్యయములను ఎట్టి పేరునుబెట్టక పేర్కొని కేతన ఉదాహరించెను. (162–167 ప॥)

*కృదంతములు :*

ఇమి, అమి అను రెండు ప్రత్యయములనే ఎట్టిపేరును బెట్టక కేతన వచించెను. (166 ప॥). అప్పటి కెంతగనో తెలుగుభాషాభివృద్ధి జరిగినను, కేతన వాని నన్నిటిని నిరూపించుట కుద్యమింపలేదు. ఈ సందర్భములందు కేతన "ఆలికి రాలగు దిగువ గుణాలి నిలిపి పలుకుచోట ననువగునెడ, గొల్లరాలు జవరాలు, పాతకురాలు, గెడపురాలు, ముద్దరాలు" (168 ప॥) అని పేర్కొనుట పొసగదు. ఇది సమాససంధులలోఁ జేర్చనగును.

సూక్ష్మములో మోక్ష మన్నట్లుగా కేతన 1.ధ్వనులు 2. తత్సమ, తద్భవ, దేశ్య, అచ్చతెనుఁగు, గ్రామ్య విభాగములు 3. సంస్కృతములను తెనుఁగు గావించు తెఱఁగు 4. సంధి 5. విభక్తులు 6. వచనము 7. కారకము 8. సర్వనామములు 9. సమాసము 10. క్రియ 11. తద్ధితాంతములు, కృదంతములు 12. రూపాంతరములు 13. వాక్యము (186, 187 ప॥) అను ననేక విషయములను తడవెను.

తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమునందు "జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ, జొన్ప", నని చెప్పినట్లుగానే కేతనయు, "వృక్షేణ, దకాయ, పక్షిభిః, పుత్రస్య అను విభక్తులు, అస్తి ప్రయాతి మున్నగు క్రియలు, గత్వా, హసిత్వా మున్నగు లబంతములు, గంతుం హంతుం వంటి తుమున్నంతములు, అపి, చ, తు, హి అనురీతిగా కొన్ని అవ్యయములు తెనుఁగునకుఁ జొరవ"ని హెచ్చరించి, మణిప్రవాళశైలివంటి శైలి తెనుఁగు నందు ప్రవేశింపఁ జేయకుండునట్లు చూచెను.

ఇట్లనేకరీతుల అనేకగుణలోపములతో చారిత్రక ప్రాధాన్యము గల దీ ప్రథమ పద్యాంధ్ర వ్యాకరణము. ఇట్టి తొలికబ్బమునకు 'దివ్యప్రభావివరణము'ను శ్రీ దేవినేని సూరయ్య గారు వ్రాసిరి. దీనిలోని లోపములను శ్రీ కౌండిన్య 20-6-1954 ఆంధ్ర దినపత్రికలో ఎత్తి చూపిరి. ఈ ప్రాథమిక మగు టీక, కేతన రచనాలక్ష్యమును పూర్తిగా నిరూపించదు. కేతన దశకుమార చరిత్ర రచించిన పిమ్మటనే దీనిని రచించెను. ఆతని లక్ష్యప్రపంచమున కిది ఎంతగా తగిన దర్పణమో పరిశీలింపవలసి యున్నది.

ఆంధ్రుల దురదృష్ట మేమియో గాని తమకాలము వఱకు అభివృద్ధి నందిన భాషాభ్యుదయమును నిరూపించుట కింతవఱకును సమగ్రాంధ్ర వ్యాకరణము లేదు. కేతనకును అట్టి లక్ష్యము లేదు. కారణము దురవగాహము. అట్టి లక్ష్యమే యున్నచో, అట్లు రచింపఁగల ప్రతిభావ్యుత్పత్తులు లేనివారు కారు కేతనాదులు.

కేతనకు సమకాలికుడే "శబ్దమణి దర్పణ" మను కర్ణాటవ్యాకృతిని రచించిన కేశిరాజు. దానితో పోల్చిచూచుటకును నిది తగినదికాదు. 320 కంద పద్యములతోఁ గూడిన ఆ శబ్దమణిదర్పణము స్వోకీయవృత్తి వివరణములు కల్గి, తన కాలమునాఁటి ప్రాచీనకన్నడ భాషాస్వరూపమును సమగ్రముగా నిరూపించు నని తద్భాషా వేత్తల యభిప్రాయము. (..."The fullest exposition of the language of his period" — by Dr. A. N. Narasimhaiyya—A Grammar of the oldest Kannarese Inscriptions-Introduction) Dr. Burnell పండితుని యీ యభిప్రాయమును పరిశీలింపఁదగినది: "The great and real merit of the Sabdamanidarpana is that it bases its rules on independent research and the usage of repute. In this

way, it is far ahead of the Tamil and Telugu treatises, which are much occupied with vain scholastic disreputation. (Aindra school of Grammarians p. 8). కేతనలో వ్యర్థపాండిత్యప్రకర్ష లేనందుకు సంతోషమే కాని తక్కిన సల్లక్షణములు ప్రదర్శితము కాకపోవుట విచార్యము.

కేతన లక్షణము నేర్పుటకన్న లక్ష్యములు చూపుటలోనే మిన్నగా చాల సందర్భములందు కనిపించును. ప్రక్రియ కన్న నిపాతరూపప్రదర్శనము గానే కేతన రచన కావించెను. అందుచే ఈతనిని లక్ష్యచక్షుష్కుఁ డనియే భావించవలసి వచ్చును. సాంప్రదాయకవ్యాకర్తలు లక్షణచక్షుష్కులుగాఁ గనుపింతురు. అందుచేతనే కానోపు అథర్వణుఁ డిట్లు హెచ్చరించెను—

"శాస్త్రప్రయుక్త వచసో శాస్త్రం బలవ దుచ్యతే
అనిష్పన్నే పదే తేన, ప్రయోగాశ్రయణం హితమ్."

—భారతి
అక్టోబరు, 1966
సంపుటము 43 : సంచిక 10.

# బాలవ్యాకరణము – సులక్షణసారము

—శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి

విచక్షణులారా !

భాషకు లక్షణగ్రంథములు త్రివిధములుగా నుండును. 1. ఛందోరూపములు, 2. వ్యాకరణరూపములు. 3. అలంకారాదిరూపములు. కొన్నివిషయములయం దీమూఁటికిని సాంకర్యము సంభవించుటయుఁ గలదు.

జనసంఘముచే జనోపయోగమునకై కల్పింపఁబడు శిక్షాధర్మశాస్త్రములు జనుల ప్రవృత్తికి నియామకములై యున్నట్లు కవితాయోగ్యతకై కవులచేఁ గల్పింపఁబడు లక్షణగ్రంథములు గవులకు నియామకము లగుచుండును. దేశకాలములనుబట్టి శిక్షాధర్మశాస్త్రములు మార్పుల నొందుచున్నట్లె లక్షణశాస్త్రములు మహాకవులచే యథోచితము లగు మార్పుల నొందుచుండును. అట్టిమార్పులు జరుగుటకు భాషాభిమానులవిమర్శనములె బీజము లగుచుండును. విమర్శనములు లేనపుడు లక్షణశాస్త్రములందును లక్ష్యగ్రంథములందునుగల లోపములు బయలుపడవు. లోపములు లున్నవను బుద్ధియే లేనపుడు వానిని సంస్కరించుకొను ప్రయత్నములు జరుగనేరవు గదా ! కావున భాషాభివృద్ధిని వాఙ్మయాభివృద్ధిని గోరువారు విమర్శనముల నభివృద్ధి చేయవలెను.

విమర్శన మనునది విమర్శకుని యభిప్రాయమును బట్టి పెక్కువిధములుగా నుండును. విమర్శకులు గ్రంథరచనకుఁ గవులఁ బ్రోత్సాహము చేయునపుడు దోషముల నంతగా నెత్తక గుణములనే వర్ణించుచుందురు. గుణదోషస్వరూపమును లోకమున కుపదేశింపఁగోరునపుడు వాఙ్మయమును గాని యొక గ్రంథమును గాని కొన్నికొన్నిసంస్కారముల నందవలె నని తలంచినపుడు వానిలోని లోపములనె విశదముగాఁ జూప యత్నింతురు.

పైకారణములలో నేకారణముచేతనైన విమర్శకులు విమర్శించునపుడు భాషాభిమానులు యథావసరముగఁ బ్రతివిమర్శనములను జేయుచు సంస్కరించుకొనఁదగువిషయము లెవ్వియో నిర్ధారణము చేసికొని యట్టిసంస్కారమును జరుప

వలెను. కాని విషయవిమర్శనమును విడిచి కోపమును జూపు పరుషభాషణములతో మార్దవము మీఱిన ప్రసంగములఁ జేయుచు వివాదములోనికి దిగుట భాషాభిమానుల కుచితము గాదు. కావునఁ దత్వమును వెల్లడించునభిప్రాయముతో మృదువుగ విమర్శన ప్రతివిమర్శనములు జరుపఁబడుచుండుట భాషాభివృద్ధికి బీజ మనుట నిర్వివాదాంశము.

ఆంధ్రభాషకుఁ గల లక్షణగ్రంథములలో నిప్పటికి ఛందోవిషయమున సులక్షణసారమును భాషావిషయమున బాలవ్యాకరణమును ప్రధానములుగను ప్రథమోపదేశార్హములుగను బరిగణింపఁ బడుచున్నవి. భాషాసేవ చేయఁగోరు ప్రతి మనుజుఁడును వానిని బఠింపఁగోరుచుండును. వేయేల విద్యాశాఖవారు వానిని విద్వద్విరుదపరీక్షకుఁ బఠనీయగ్రంథములుగ నేర్పఱచియున్నారు.

అప్పకవీయమును సులక్షణసారముకంటె నెక్కుడుగౌరవముతో నాంధ్రులు చదువుచుండుట గలదు గాని యది మొట్టమొదట నభ్యాసకాలమునఁ బఠింపఁబడుట యరుదు. కావున బాలవ్యాకరణ సులక్షణసారములె యాంధ్ర విద్యార్థులలో ననేకులచేఁ బ్రథమోపదేశార్హములుగ గ్రహింపఁబడుచున్న వనుటకు సందేహము లేదు. అట్టివానిలో నేవైనఁ గొఱంత లుండెనేని యవి పెక్కువిద్యార్థులమనముల నాటుకొని మరల్పరాని వగు నని నా నమ్మకము. ఆంధ్రభాష మహోన్నతదశకు వచ్చుచున్న యిక్కాలమునందైన నట్టిలోపములు సంస్కరింపఁబడవలదా యను నభిప్రాయముతోఁ బై వానిలో నొకటగు బాల వ్యాకరణమునందును దద్వ్యాఖ్యలయందును లోపము లని నాకుఁ దోచినవానిలోఁ గొన్నిటి నీవఱకు సాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రచురించియున్నాను. పైయభిప్రాయముతోడనే యిచ్చట మఱికొన్నిటిని విన్నవించుకొనుచున్నాను. కావున భాషాభిమానులగు నాంధ్రమహాశయులు నావిన్నవించు విషయములను బరిశీలించి యవి సరియైనవె యైనయెడల నట్టి లోపములు లేకుండఁ బైగ్రంథములకు సంస్కారమును జరుపుటకై యత్నింపవలయు నని సవినయముగఁ బ్రార్థించుచున్నాను.

భాషయొక్క మొదటియవస్థలోఁ గల్పింపఁబడు ఛందస్సులకు నియమములను గవులు స్వచ్ఛందముగఁ గల్పించుకొందు రనుమాట నిజమే కాని యప్పటి కభివృద్ధిలో నున్నట్టియుఁ దమకుఁ బరిచితము లగునట్టియు భాషలలోని రీతులు మాత్రము కవులకు మార్గదర్శకములు కాకపోవు. సంస్కృతప్రాకృతద్రావిడకర్ణాటభాషల

లోని ఛందోమార్గములు మన తెనుఁగుభాషలోని ఛందోరీతులకు మూలము లై యుండుట పై కారణముచేతనే సంభవించె నని చెప్పవచ్చును. పై నుదాహరించిన రీతిని బాటలె యనఁదగు నక్కరలు ద్విపదలు మొదలగు జాతులు మొదట మొదట మన యాంధ్రభాషయందును నారంభింపఁబడినవి. నన్నయభట్టునకుఁ బూర్వమునందును నక్కరలతో నిండియున్న శాసనము లుండుటయే యిందుకు నిదర్శనము. పిమ్మట నన్నపార్యునికాలమున సంస్కృతద్రావిడాదిభాషలలోని మార్గముల ననుసరించి శ్రుతిహితము లగు మత్తేభశార్దూలచంపకోత్పలమాలాదులు కల్పింపఁబడినను నక్కరలును మెండుగనే యుండెడిని. రంగనాథరామాయణాదులు ద్విపదకావ్యములే. అట్లయినను నుత్తరోత్తర పద్యవాఙ్మయమునం దట్టిజాతు లరుదై చంపకోత్పల మత్తేభశార్దూలవృత్తములును గందసీసగీత పద్యములును మెండై యున్నవి. పూర్వవాఙ్మయమున లేనిలక్షణములు గల పద్యము లుత్తరోత్తరవాఙ్మయము నందు వెలయుచు వచ్చుచున్నవి. కొన్ని యెడలఁ బూర్వగ్రంథములం దుండు లక్షణము లుత్తరగ్రంథములందు మార్పఁబడుటయుఁ గలదు. ఈరీతిని బద్యముల నడకలవిషయమునందే కాక యతి ప్రాసములవిషయమునందును మార్పు లగపడుచున్నవి.

సువాసినులకుఁ గుతికంటు మంగళసూత్రము నను నలంకారములు నియతములయినట్లుగ నాంధ్రభాషాయోషకు (ననియత) శబ్దాలంకారము లగు యతి ప్రాసములు నియతములుగ నంగీకరింపఁబడినవి. అయినను వానివిషయమున నధికములగు నిర్బంధములను బెట్టుకొన్నచో భాషకు స్వాభావిక మగు శోభ తగ్గిపోవునను భీతిచేఁ బ్రాచీనమహాకవులును బ్రాచీనలాక్షణికులును నట్టినిర్బంధములను సడలించి యుచ్చారణరమ్యత నాశ్రయించి యథోచితముగఁ గొంతవఱకు స్వేచ్ఛ నిచ్చుటకు యత్నించుచు వచ్చిరి. కావుననే వానివిషయమునఁ బ్రాచీన లక్షణగ్రంథములలో ననేకవిధము లగు మార్పు లగుపడుచున్నవి. అట్టిమార్పులు జరుగుచున్నకాలములోని లక్షణగ్రంథముల నాధారములుగాఁ జేసికొని సులక్షణ సారము వ్రాయఁబడిది. కావున దీనినిబట్టి ప్రాచీనలక్షణకర్తల యభిప్రాయములను బ్రాచీనమహాకవిప్రయోగ విశేషములను గ్రహించుటకుఁ గొంతవఱకు కవకాశము గలిగియున్నది.

అప్పకవీయ మనెడు లక్షణగ్రంథము దీనికి వెనుక సుమారు డెబ్బది సంవత్సరములలోనె పుట్టినది యైనను నయ్యది సులక్షణసారకర్తయభిప్రాయము వంటి యభిప్రాయముతో వ్రాయఁబడిన ట్లగపడదు. అం దప్పకవి నిర్బంధము

లను బెంచియుఁ బ్రాచీనమహాకవిప్రయోగములను మార్చియుఁ బ్రాచీనలాక్షణికుల యభిప్రాయముల నుల్లంఘించియు నట్లు వీలుపడనపు డుపేక్షించియు వారుదాహరించిన మహాకవిప్రయోగములు గావని చర్చించియు నున్నాఁడు.

చ. నన్నయ ముఖ్యసత్కవిజనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు గొన్నియుఁ బోకడపెట్ట దక్కవై
యున్నెడఁ జూచి జానపదు లోకడ దిద్దినతప్పుత్రోవలె
ల్లన్నిజమంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే'' (అప్పకవీయము)

అని యప్పకవి తాను జేసినతప్పు నితరులపైఁ బెట్టియున్నాఁడు. తనకు మిక్కిలి ప్రాచీను లగు లాక్షణికు లే ప్రయోగముల నాధారముగాఁ జేసికొని యేయేలక్షణములను గల్పించిరో యాయాలక్షణములు తన కసమ్మతము లగుట నాయాప్రయోగములు కవిప్రయుక్తములు కావని చెప్పుచువచ్చెను. చిరకాలమునుండి లాక్షణికులొకరివెనుక నొక రనుశ్రుతముగ నుపయోగించుచున్న లక్ష్యములు తప్పులనియుఁ దాను దిద్దిన ప్రయోగములే కవిప్రయుక్తము లనియుఁ జెప్పుట మిక్కిలి సాహస మనఁదగును. ఈ విషయమున ''నానృషిః కురుతే కావ్య''మ్మను సూక్తిని బట్టి యీయన కొక్కరికే ఋషిత్వమును దివ్యజ్ఞానిత్వమును సంగీకరింపవలసి యున్నది. మఱియుఁ దాను సవరించినవి ప్రాచీనశుద్ధతాళపత్రమాతృకలలో నున్నవని వ్రాయుట మిక్కిలి వింతగ నున్నది. చిరకాలమునుండి లాక్షణికులచే లక్ష్యములుగఁ దీసికొనఁబడి యనుశ్రుతముగ వాడఁబడుచున్న ప్రసిద్ధము లగు పద్యములు తప్పులని రుజువుచేయఁదగిన మాతృక లాయనకొక్కనికే లభించె ననుట యెంతవఱకు విశ్వసనీయమో యెఱుఁగను. అందును నన్నయభట్టీయమువంటి ప్రమాణగ్రంథ మలంతిపుటలతో నుండిన దొకమాతృక గోదావరిలోఁ గలుపఁబడినంత మాత్రమున మరల దాని నయిదువందలసంవత్సరములనాఁడు సిద్ధుఁడు తెచ్చి యిచ్చినఁ గాని లభింపని యట్టికాలమున నతివిపులము లగు నీ ప్రబంధముల పరిశుద్ధమాతృకలు అనేకప్రాచీనలాక్షణికులకు దుర్లభములు-ఏ సిద్ధుఁడు తెచ్చి యిచ్చెనో తెలియరాకున్నది.

అట్లని గ్రంథములలో వ్రాఁతతప్పులు లేవని గాని పడవనిగాని నా యభిప్రాయము గాదు. ప్రాచీనలాక్షణికులును గవులకు సమీపకాలమువారును నగువారు సమ్మతించి వానినే యాధారముగాఁ జేసికొని లక్షణములు వ్రాసినపు డట్టి లక్షణములు సమ్మతింపనివా రాప్రసిద్ధపద్యస్థ ప్రయోగములు వ్రాఁతతప్పు లని

వాండిచుట యుచితము గాదని నా యభిప్రాయము. రామరాజభూషణుఁడు రలలకు యతి ధారాళముగాఁ బ్రయోగించియుండఁగా వానిని లాక్షణికులు రలల యతిక్రింద నుదాహరించి యుండఁగా నా ప్రయోగములు రామరాజభూషణ హృదయములుగా వని యప్పకవి చర్చించియున్నాడు ఇట్లె యనేకస్థలములందు వ్రాసియున్నాఁడు.

ఛందఃకల్పనమునందువలెనే యోగ్యము లగు పదములను వ్యవహారము నుండి యెన్నుటయందును గవుల కధికారము గలదు. మఱియు భాషలోని మొదటి వాఙ్మయమునకు మూలము వ్యవహారము గాక వేఱేమి యుండును? కవులు వ్యవ హారమునుండి యోగ్యత గల పదముల నెన్నుటయే గాక యట్టిపదముల సామ్యము నుబట్టియుఁ గొన్ని వ్యాకరణనిబంధనములఁ బట్టియు ఛందఃప్రతిబంధములను బట్టియు నితరభాషల వ్యవహరించు జనులసంబంధములను బట్టియు సంభవించు మార్పులు గల పదములను యథోచితముగ స్వీకరించి గ్రంథరచనము చేయు చుందురు. అట్లనేకు లగు కవులు గ్రంథములను వ్రాసిన పిదప వారిలో నుత్తము లనఁదగినవా రనేకు లుపయోగించినమార్గములు రోత్తరకవులకుఁ బ్రమాణము లగుచుండును. అయినను గవు లాప్రాఁతప్రయోగములను ప్రయోగింపవలె ననే నిర్బంధ ముండదు. అట్లుండినచో భాషావాఙ్మయముల కుత్తరోత్తరాభివృద్ధి యుండనేరదు. ఉత్తరోత్తరకవులు పూర్వపూర్వవాఙ్మయములోని ప్రయోగము లనే గాక భాషావాఙ్మయముల నభివృద్ధి చేయుటలోఁ బ్రాచీను లవలంబించిన పద్ధతులను మఱికొన్ని యితర పద్ధతులను గ్రహించి యనుకూల మగురీతి గ్రంథ రచన చేయుచుందురు.

అట్టి పద్ధతి మొదటమొదటఁ బ్రాచీనకవులయొక్కయుఁ బ్రాచీనలాక్షణికుల యొక్కయుఁ గాలమున వ్యాపించియున్నను నది దురదృష్టవశమున నానాఁటికి క్షీణింప నారంభించెను. క్రమక్రమముగఁ గవుల ప్రాచీనమార్గములనె స్వగ్రంథ ములందుఁ బ్రతిఫలింపఁ జేయుచు వచ్చిరి. కావుననె యించుమించుగఁ బ్రాచీ నాంధ్రమె సుమా రేఁబదిసంవత్సరముల క్రిందటి కాలమువఱకుఁ బుట్టియున్న ప్రబంధములందు వెలయుచున్నది. ఇప్పటికి నట్టిభాషతోఁ బ్రబంధ చనము చేయు టయె యుత్తమమవి కొంద ఱాంధ్రపండితులు తలంచుచుండక పోలేదు. మీఁదు మిక్కిలి ప్రాచీనప్రయోగములె గ్రాహ్యములు గాని నవీనప్రయోగములు గ్రాహ్య ములు గావను నభిప్రాయము జనులహృదయమున నాటుకొన్నది. వ్యవహారము నుండి భ్రష్టమయిన సంస్కృతభాష తెలుగుభాషకుఁ బ్రధానమై యుండుటచేతను

దెలుఁగు పండితు లెల్లఁ గొంతవఱకైన దానినె చదివియున్నవా రగుటచేతను సంస్కృతమువలెనె మన తెలుగుభాషయు మార్పు నొంద రాదను నభిప్రాయము స్థిరపడినదని చెప్పవచ్చును. ఇట్టి యభిప్రాయముపూర్ణముగా ముదిరినకాలమందు బాలవ్యాకరణము రచింపఁబడినది. కావుననే యీ వ్యాకరణము నవీనమయ్యుఁ బ్రాచీనప్రయోగములను మాత్రమె నియమింపఁ జాలియున్నది. కాని యద్యత నాంధ్రమహాకవుల ప్రయోగములను సాధింపఁజాలకున్నది. ప్రాచీనప్రయోగము లన నేల ? ప్రాచీనతమ మగు భారతభాషను మాత్రమే నియమించుచున్న దని చెప్పుట సాహసము కాదు. ఈ విషయమున సూరిగారి సిద్ధాన్త మప్పకవిగారి మార్గమునకును దోసిరా జైయున్న చని చెప్పవచ్చును. అప్పకవి, కవిప్రయోగ ములను దిద్దినను, గవుల నప్రామాణికు లని తలఁచియుండలేదు. సూరిగా రన్ననో యంతకన్న నూర్ధ్వసీమ నధిరోహించి భారతతేతరకవులను బ్రామాణి కులనుగ నంగీకరింపలేదు.

“సంస్కృతీయమునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యములందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునిక కృతు లందొకానొకచోట స్త్రీవాచకతత్సమంబులకు సంధి గానంబడియెడు. గంగను కాసె, నెలఁతిచ్చెను” అని సూరిగారు వ్రాసియున్నారు, ఈ సందర్భమును బరిశీలింపఁగా నన్నయకు వెనుకటిలాక్షణికులలోని కెల్లఁ బ్రాచీనుఁడును ద్వితీయా చార్యుఁ డని యహోబలపతిచే నంగీకరింపబడినవాఁడును నగు నథర్వణాచార్యుని వాక్యము సైతము సూరిగారికి సమ్మతము కాలే దని విశద మగుచున్నది. మఱియు నాముక్తమూల్యదలోని “గంగనుకాసె”అనుదాని నుదహరించి యది ప్రాచీనకవి ప్రయోగము కాకుండుటచేఁ బ్రమాణము గా దని యుపేక్షించిరి, అట్లె కానిచో “స్త్రీవాచక తత్సమములకు సంధి లేద” ని వివరింప నేల ? ఆముక్తమాల్యద యల్లసానిపెద్దనార్యుఁడు రచించె నని విద్వాంసు లభిప్రాయపడు చున్నారు. “అల్లసాని పెద్దనార్యకవినా ఆముక్తమాల్యదాయాం” అని యహో బలపతి సయితము వ్రాసియున్నాఁడు. కూచిమంచి తిమ్మకవియు నట్లె వ్రాసి యున్నాఁడు. అట్టిగ్రంథములోని ప్రయోగములను సయితము బాలవ్యాకరణ మంగీకరించి సాధింపదు గదా ? “అమ్మని” “కొమ్మంచున్” అని యిట్లు వసు చరిత్రమునందు స్త్రీవాచకసంధి యగపడుచున్నది. ఆముక్తమూల్యదను గృష్ణ దేవరాలే రచించె ననుకొందము. అయినను బదునాఱవశతాబ్దపుఁగవులు మొన్నటి సూరిగారికిఁ బ్రాచీనులు గాకుండుట వింత కాదా ? అప్పకవి సయితము పైగ్రంథ ములలోని ప్రయోగములను బ్రమాణములులుగా నుదాహరించియున్నాఁడు.

పై రీతిని భారతప్రయోగములనుమాత్రమె ప్రమాణముగాఁగైకొని రచింపబడుటంబట్టి యీ బాలవ్యాకరణమున నథర్వణాచార్యుఁ డంగీకరించినట్టి యనేక మహాకవిప్రయోగములు సంగ్రహింపఁ బడలేదు. లక్ష్యగ్రంథములను వెదకి లక్షణములను వ్రాయువారి గ్రంథములలోఁ గొన్నిప్రయోగములు సంగ్రహింపఁ బడకున్నను నవి యాలక్షణకర్తలకు స్ఫురింపకుండవచ్చు ననుట కవకాశము ముండుటచే నయ్యవి వారి కనిష్టములనుటకు వలనుపడదుగాని యథర్వణాదుల లక్షణ గ్రంథములను జదివి వానిలోని విషయముల నెత్తివ్రాయు సూరిగారు తమ గ్రంథములో నథర్వణాది లక్షణగ్రంథసాధిత ప్రయోగముల సంగ్రహింప నప్పు దవి సూరిగారి కనిష్టములే యని తలంచుట విరుద్ధము కాదు గదా ?

''ఇట్లు దపంబు'' అని తిక్కన మహాకవియు,''ఎవ్వండు పఠియించును'' అని శ్రీనాథుండును, ''పెంపున పరీక్షింపమొ,'' అని రామరాజభూషణుఁడును ప్రయోగించి యున్నారు. ''పరుషాణాం స్వరూపేణా, ప్రతమాంతోపరిస్థితాః। వికృతాత్ పరుషా శ్చ స్యుః, సుస ఆద్యపదాదిగాః॥''అని యథర్వణాచార్యుఁడు వాని సాధుత్వము నంగీకరించి యున్నాఁడు. ఇట్టి స్థితిలో సూరిగారు ''తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు'' అని సూత్రించిరి. దీనిసిబట్టి పై నుదాహరించిన కవుల ప్రయోగములు సయితము సూరిగారిచేఁ బ్రాచీన కవిప్రయోగములుగను, బ్రామాణికములుగను గ్రహింపఁబడలే దని విశదమగుచున్నది. భారతమును రచించిన తిక్కనయొక్కయు నితర గ్రంథములప్రమాణము లని తలంచుట వింతగ నున్నది. అరయ నరయ సూరిగా రీవిషయమున నప్పకవి చెప్పిన యీ క్రిందివాక్యములను వేదవాక్యములుగా భావించిన ట్లగపడుచున్నది.

ఉ. ''ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పిన భారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెందును దానినె కాని సూత్రసం
పాదన లేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రా దని ద్రాక్షవాటి కవిరాక్షసుఁ డీనియమంబు చేసినన్.''

క. ''ఆమూఁడుపర్వములలో
నామాన్యుఁడు నుడుపు తెనుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కను
ధీమణి మొదలైన తొంటి తెనుఁగు కవీంద్రుల్.''(అప్పకవీయము)

ఒకప్పు డీకవిప్రయోగములు సూరిగారికి గోచరించియుడ లేదని యందు రేమో, అట్లనుటయు సరి కాదు. సూరిగారికిఁ బూర్వుఁడును బ్రసిద్ధుఁడును నగుఁ కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షలసారసంగ్రహమునఁ బై ప్రయోగముల నుదాహరించి తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకును గసడదవాదేశము రావచ్చునని చర్చించి యున్నాఁడు.

ఆథర్వణకారికానంతచ్ఛందఃప్రభృతి ప్రాచీనగ్రంథము లిట్టి యపమార్గమున రచింపఁబడలేదు. ప్రాచీన లాక్షణికు లందఱును స్వపూర్వవాఙ్మయస్థ మహాకవిప్రయోగముల కెల్ల సాధుత్వము నంగీకరించుచు వచ్చిరి. కావున నథర్వణాది ప్రాచీన లక్షణ గ్రంథములలో నున్న లక్షణములు మహాకవిప్రయోగ మూలకములెయని దృఢముగాఁ జెప్పవచ్చును. అప్పకవికాలము మొదలు నేఁటివఱకు దిద్దివేయఁబడుచుండుటచే భారతము మొదలగు కొన్ని ప్రాచీన మహాకవి గ్రంథములం దట్టి ప్రయోగము లగపడకున్న నగపడక పోవచ్చును. పై యభిప్రాయము తోడనే "బహుగ్రంథద్రష్టలు కాని కొందఱు భారతమును దిద్ది పాడుచేసిరి; చేయుచున్నారు; చేయగలరు" అని బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర మహాకవులు పాశుపతమున వ్రాసియున్నారు.

పైరీతిఁ బ్రాచీన మహాకవి ప్రయోగములును దన్మూలకములగు ప్రాచీన లక్షణములును సూరిగారిచే నుపేక్షింపఁబడినవి, క్త్వార్థకసంధి కనేక ప్రాచీన మహాకవి ప్రయోగములు కలవు. అట్లే యించుగాగమ చకారమునకు, ముత్తు పరమగునపుడు 'పత్వము' రానందులకును, ననేక ప్రాచీన మహాకవి ప్రయోగములున్నవి. ఐనను సూరిగారు వాని నంగీకరింపలేదు. క్త్వార్థకసంధిని నిరాకరించిరి.

భారతము పుట్టినకాలమునకు వెనుక మనయాంధ్రదేశమునకుఁ దురుష్కులతో సంబంధ మధికముగా సంభవించెనని యెల్లరకును విదితమే. కావున భారతమునందుఁ దురుష్కభాషాపదము లుండకుండుట వింతకాదు. పదునాల్గవ శతాబ్దమునుండి మనయాంధ్రులకుఁ దురుష్కులతో సంబంధము గలుగుటచే నది మొదలుగ నుండు కవుల గ్రంథములలో నా భాషలోని పదము లిప్పటి ఇంగ్లీషు పదములవలెనె ప్రవేశించియున్నవి. అంతకుముందు ద్రావిడ కర్ణాటాదులతో సంబంధ ముండుటచె వారి భాషల పదములు ప్రవేశించియుండెను. అయినను మనవారు ద్రావిడ కర్ణాటాది పదము లన్య దేశ్యములని గ్రహించిన ట్లగపడదు.

కాని తురుష్కపదము లన్యదేశ్యములని గ్రహించియున్నారు. అట్టి యన్యదేశములు సంస్కృతప్రాకృతపదములవలెనె కొన్ని తత్సమరూపములతోడను, కొన్ని తద్భవరూపములతోడను మనకవులచే వాడఁబడినవి. ''అహేయ మన్యదేశీయం యత్త దేవ ప్రయుజ్యతే'' అని యథర్వణాచార్యుఁ డన్యదేశ్య ప్రయోగమునకు సాధుత్వము నంగీకరించియున్నాఁడు. అయినను సూరిగారు మాత్రము భారతమునందు లేకుండుటచేఁ గావలయు నన్యదేశ్యము నంగీకరింపలేదు. ''త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగు భాష దేశ్యంబు'' అని సూత్రించి యాంధ్రదేశ్యములను మాత్రమే యుదాహరించిరి. దేశ్యము నాంధ్రదేశ్యమనియు నన్యదేశ్య మనియుఁ దక్కినవై యాకరణులవలె విభజింపలేదు. అన్య దేశ్యములు మాత్రము త్రిలింగదేశవ్యవహారసిద్ధములు కావా యని యంద మన్నఁ దద్భవాదులును దేశ్యములె కావలసివచ్చును. మఱియు సూరిగా రన్యదేశ్యమును బైరీతిని సంగ్రహించియే యున్నయెడల ''అన్యదేశ్యం బని మఱియొండువిధంబు గలదు'' అని బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాకారులు వ్రాసియుందురు గదా ? భారత కాలమునకు భాషలోనికి వచ్చియుండుట కవకాశము లేకుండుటచే భారతమున నన్యదేశ్యము లేకున్నంతమాత్రమునఁ బ్రాచీన మహాకవుల ప్రయోగములను బ్రాచీనలాక్షణికులలక్షణములను భాషలస్వభావమును బాటింప నక్కఱ లేదా ? మఱియు నన్యదేశ్యపదప్రయోగము సాధువే కానియెడల నిప్పుడు గ్రంథములను వ్రాయుట మాట యటుండఁగా వ్రాయదలంచుటకైన నవకాశము లేదని చెప్పుట యతిశయోక్తి కాదు గదా ?

''నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్'' అని యిట్లు మహాకవిప్రయోగములు గలవు. కూచిమంచి తిమ్మకవి సయితము పైప్రయోగమునకు సాధుత్వము నంగీకరించెను. ''హ్రస్వో దీర్ఘ సమాసేపి క్వచిచ్చ స్త్రీపః ప్రయోగతః'' అని సూత్రించి యథర్వణుఁడు ప్రయోగమునకు సాధుత్వము నంగీకరించి యున్నాఁడు. ఈ విషయము బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడలేదు. ఇట్లే ''ద్వంద్వః కేషాంచి దిష్టస్స్యాత్ క్వార్థశబ్దేన కుత్రచిత్'' అని మొదలగు పెక్కు నియమములు సూరిగారు సంగ్రహింపలేదు.

కొన్ని లోకోక్తులలోఁ బదములందును గొన్నిట నర్థమందును సాధుత్వ మండదు. అయినను వానిలో సాధుపదములను జొనిపినచో నిష్టార్థ స్ఫూర్తి కలుగదు. అట్టియెడల లోకోక్తులను మార్పకయే ప్రయోగింపఁదగునని యథర్వ

ణుఁడు చెప్పియున్నాఁడు. "లోకో క్తినాంభవేద్యోగో యదిస్యా చ్ఛ్రుతిరంజనమ్''. ఇదియును సంగ్రహింపఁబడలేదు.

''ఉతా మత్ర భవేద్వావు రస్త్రియాం ల్వాదివర్ణకే'' అని యధర్వణుఁడు చెప్పి యున్నాఁడు. ''ఆస్త్రియా మిత్య ధర్వణవచనే స్త్రీవాచక వ్యతిరిక్తానా ముదంతనా మితి వాఖ్యానాన్నతన్వాదిభ్యో వువర్ణక వికల్పో విరుద్ధః'' అని యహో బలపతి వ్యాఖ్యానము చేసి యున్నాఁడు. పై సందర్భమునుబట్టి వువర్ణకేతరవిభక్తి పరమగు నపు డుకారాంతములలో స్త్రీవాచకములకు నిత్యముగాను, దదితర ములగు నమహత్తులకు వికల్పము గాను వుగాగమము వచ్చు నని స్పష్ట మగు చున్నది. ఇట్లు ప్రాచీనులు స్పష్టపఱచి యుండఁగా ప్రయోగములు నట్లె యుండఁగా సూరిగా రీవుగాగమవిధిని బహుళముగా విధించిరి. అగతికస్థలముల యందుఁ దప్ప నెల్లడలను విశదముగాఁ జెప్పఁదగిన స్థలములందును బహుళ విధానము చేయుట యుచితము కాదు గదా ?

ఆచ్ఛిక శబ్దములకు సంస్కృత శబ్దములు విశేషణము లగునపు డాయా చ్ఛిక శబ్దముల మహత్త్వాదులను బట్టి పుంలింగాదులు నిర్ణయింప నగునని యహో బలపతి చర్చించి యున్నాడు.

''కనియెన్ విద్యుల్లతావిగ్రహన్......నవలాన్'' అని యని యల్లసాని పెద్దనార్యుడు ప్రయోగించియున్నాఁడు అత్యావశ్యక మగునట్టి విషయమునయి తము బాలవ్యాకరణములో సంగ్రహింపఁబడలేదు. ''నవలా'' శబ్దము స్త్రీసమ మగుటచేఁ దద్విశేషణములును స్త్రీలింగము లగునని బాల వ్యాకరణమును బట్టి సాధింపరాదా యని యందురేమో? అట్లయినచో ''తండ్రిఘన'' అను మొదలగు ననిష్టరూపములును సాధువులు కావలసి వచ్చును.

''కేచిన్నాంతాచ్చగుర్వాదేః ద్వ్యక్షరా త్పటిమూచిరే'' అనియు, ''సరశే పరుషే చైవ సమాసే నుముతో భవేత్, అద్రుతా త్సరళా దందు పట్టి కూర్చి విభక్తిషు'' అనియు నధర్వణాచార్యుఁడు చెప్పియున్నాఁడు. ''కాఁబట్టి, రాఁబట్టి, వచ్చుటంబట్టి, జ్ఞానముంబట్టి'' అను మొదలగు ప్రయోగములు సాధుకవిసమ్మ తములే యనుట సుప్రసిద్ధము. అయినను బాలవ్యాకరణాదులతోఁ బై ప్రయో గములు సాధింపఁబడలేదు.

గ్రంథవిస్తరణభీతిచే విరమించితినిగాని యీరీతిని ప్రాచీనలక్ష్యలక్షణము లెన్నో బాలవ్యాకరణములో సంగ్రహింపఁబడలేదు. అథర్వణుని గ్రంథమును సూరిగారు చూచినట్లు "సంస్కృతీయమునకు సంధి యగునని యధర్వణాచార్యులు చెప్పిరి" అను వాక్యమే స్పష్టపఱచుచున్నది. అట్టిస్థితిలో నధర్వణుఁడు చెప్పినవి సూరిగారు చెప్పనప్పు డవి సూరిగారి కనిష్టము లనుటకు సందేహము లేదు గదా!

ఈరీతిని మహాకవిప్రయోగమూలకము లగు నధర్వణుని లక్షణములనే యంగీకరింప నపుడిఁక నంతకంటె నవీనులు ప్రయోగించిన ప్రయోగములును దన్మూలకము లగు లక్షణములును సూరిగారికి సమ్మతములు కావని చెప్పుట వింత కాదు గదా! ఇఁక నట్లు సూరిగారు విడిచిన ప్రయోగములలోఁ గొన్ని ప్రౌఢవ్యాకరణమునందు సాధింపఁబడినవి గాని పైనుదాహరించిన జాతులప్రయోగము లెన్నో యెందును సంగ్రహింపఁబడలేదు. మఱియు మూలకారుఁ డగు సూరిగా రనిష్టములని విడిచినవానిని వ్యాఖ్యాతలు సంగ్రహించుటయు సరికాదు. సంగ్రహించినను నవి బాలవ్యాకరణవిరుద్ధము లనుట నిర్వివాదాంశము.

మఱియుఁ బ్రాచీనలక్షణకర్తలు గల్పించిన నియమముల రీతులు గలవి కొన్నియుఁ, బ్రాచీనమహాకవి ప్రయోగరీతులు గలవి కొన్నియు, వ్యవహారసిద్ధతాది కారణములచే నధునాతనాంధ్రమహాకవులు ప్రయోగించుచున్నారు. కొన్ని యెడలఁ బ్రాచీనలక్షణములకు విరుద్ధము లైనవి సైతము వ్యవహారబలమున శ్రుతిహితము లగుటచేఁ గావలయు నధునాతనాంధ్రమహాకవులు ప్రయోగించుచున్నారు. పైని వ్రాసిన వెవ్వియు బాలవ్యాకరణముచే సాధ్యములు కావు. అట్లని పైప్రయోగములు నింద్యములు నగ్రాహ్యములు ననుటకు వలను పడదు. ఎప్పుడైన వ్యాకరణములకు మహాకవి ప్రయోగములే గదా సాధకములు! ప్రాచీనవ్యాకరణములెల్ల మహాకవిప్రయోగములే గదా యాధారముగాఁ జేసికొని వెలసియున్నవి. కావున నట్టి ప్రయోగములను సాధించుట కొక వ్యాకరణము తెలుగులో వ్రాయవలసి యున్నది.

బాలవ్యాకరణ తద్వ్యాఖ్యలలోని వైరుధ్యము లీవఱకుఁ బరిష్కృతికాముఖమున గొన్ని వెల్లడించియున్నాను. విస్తరభీతి నిటఁ గొఱవడినవాని నుదాహరింపలేదు. గ్రంథములోని సమన్వయవైరుద్ధ్యములతో నిపు డంతగాఁ బ్రసక్తియు లేదు.

ఇఁక నధునాతనాంధ్రమహాకవులు ప్రయోగించుచున్నట్టియు, బాల

వ్యాకరణ తద్వ్యాఖ్యలచే సాధ్యము కానట్టియుఁ బ్రయోగప్రపంచము నిట దిఙ్మాత్రము చూపెదను.

అధునాతనాంధ్రకవులు విసంధిని స్వేచ్ఛగా నుపయోగించుచున్నారు యడాగమమును సరళాదేశాదిద్రుతకార్యములను నియమము లేక యథోచితముగఁ బాటించుచున్నారు. అర్ధానుస్వార శకటరేఫ నియమముల నంతగాఁ బాటించుట లేదు. పై విషయము లెవ్వియు బాలవ్యాకరణమునకుఁ గాని ప్రౌఢవ్యాకరణమునకుఁ గాని సమ్మతములు కావు. సంధివిషయమున బాలవ్యాకరణము మిక్కిలి పట్టుదలతో నియమించుచున్నది. ''వాక్యావసానమున సంధిలేమి దోషంబుగాదని యార్యు లండ్రు'' అని బాలవ్యాకరణము చెప్పుచున్నది. ఇందువలన వాక్యమధ్యమున సంధియ వర్జనీయ మని స్పష్టమగుచున్నది గదా! వేయేల? ''ఏగి యేగి యనుచోఁ గ్త్వార్థకంబగుట సంధి లేదు'' అను సూరిగారి ప్రయోగమే వరుషాదేశాది సంధీనిత్యతను వెల్లడించుచున్నది. ఇచ్చటఁ గకార తకారసంయోగము చర్చించుటకు వీలుపడదు. అయినను సంధి మానలేదు. ఇట్లే యడాగమమును మానుటకును నీవఱ కున్న తెలుఁగు వ్యాకరణములు సమ్మతింపవు. ''అయ్యుమ'' ఇత్యాదులు ప్రాసములలో నున్నవి. యడాగమము లేనిచో నిచట ద్విత్వ మెట్లు? యకారము నుచ్చరించిన జాలును వ్రాయ నక్కఱలేదు'' అనుటయు సరికాదు. అట్లయినచోఁ బైనుదాహరించిన ద్విత్వస్థలములలో నట్టిద్విత్వమున కనుమాపకములుగ నచ్చులు వ్రాయుట యసంతము, దుర్ఘటము నగును.

కావునఁ బైనుదాహరించిన విసంధ్యాదు లీవఱ కున్న యాంధ్రవ్యాకరణములకు సమ్మతములు కావు. అయినను నవి యద్యతనాంధ్రమహాకవులచేఁ బ్రయోగింపఁ బడుచుండుటచే గ్రాహ్యము లనక తప్పదు.

ఇట్లే యధునాతనాంధ్రమహాకవులు ప్రయోగించుచున్న యీక్రింద నుదాహరించుజాతులు గల పదములు బాలవ్యాకరణాములచే సాధ్యములు కావు.

అచ్చటకు, మీదఁకు, బయటకు, ఎదుటకు, బియ్యపుపిండి, ముత్యపు చిప్ప, మాళవదేశప్రభువు, తినమని, పదమూఁడు, అగుపడెను, ముతక గుడ్డలు, తఱగకుండ, అలుముకొని, ఇరువురిని, అందఱికన్న, నలుగుఱిని, ఇందఱిని, అడివఱకు, ఇదివఱకు, పైనజెప్పిన, రాజుని, కూతుని, జాళ్లు, తొమ్మండు గురు, నలుబది, జాగ్రత, బద్ధలగునట్లు, తనను, గౌరవనీయులు, అతను, రాజ

పత్నులనేకులు, రాజరికము, నేను ప్రభువును. అనేకమారులు, దేశద్రిమ్మరి, తీక్షణములు, చడవినాను, చేసినావు, భేరీలు, మఱుచటియేఁడు, పెట్టకూడదు, కని పెట్టి, కూతురిని మొదలగునవి. ఇట్లిప్పటి కున్న లక్షణములకు విరుద్ధము లగు పదములు వేనవేలు గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు.

ఇట్టి పదములయర్థము గల సలక్షణపదములకన్న నివి శ్రుతిహితము లగుట చేతనో, వ్యవహారస్థితిరూపజీవకళచేఁ గల్గు నర్థస్ఫురణపటుత్వ మంది యుండుట చేతనో, లక్షణరాహిత్యమును మఱపింపఁజాలినంత యోగ్యతను గలిగియుండుట చేతనో, యధునాతనకవులు ప్రాఁతలక్షణములకు విరుద్ధము లను విషయమును బాటింపక ప్రయోగించిరి. అట్లు ప్రయోగించినవారు బహుగ్రంథ ద్రష్టలను బహు గ్రంథకర్తలును, జీర్ణించిన యాంధ్రభాషను మరల మొలక లెత్తునట్లు వెలయించి సారస్యమును జూపి యాంధ్రమహాశయులహృదయములను జూఱఁగొనుచున్నవారును నగు నధునాతనాంధ్రమహాకవులు. వీరిలోఁ గొంద ఱాంధ్రవ్యాకరణములను రచించినవారు. అట్టి వారందఱిగ్రంథములందును సంవాదముగాఁ బలుమాఱు ప్రయోగింపఁబడిన పై జాతులపదములు గ్రాహ్యము లని యొప్పకుండుట యుచితమా? లాక్షణికసంప్రదాయమా? అవి నింద్యములే యైనచో నించుమించుగా నిప్పటివాఙ్మయ మంతయును నింద్యమే యనవలసి వచ్చును.

కాఁబట్టి భారతభాషను మాత్రము సాధించు నుద్దేశముతోఁ బుట్టిన యసం పూర్ణమగు బాలవ్యాకరణము ప్రకృతమున విద్యార్థుల కెంతమాత్రము నుపచరింపఁ జాలదు. ఎన్నివిధములచేతనైనఁ బ్రాచీనాద్యతన మహాకవిప్రయోగములను సాధించు వ్యాకరణము పుట్టవలసియున్నది. అందు నథర్వణాహోబలపండితాది ప్రాచీన లక్షణకర్తలమతము లన్నిటి నేర్చికూర్పవలెను. ఇంకను దిద్ది పాడు చేసిన ప్రతులను విడిచి ప్రాచీనమాతృకలను వెదకి యందలి ప్రాచీనమహాకవి ప్రయోగముల సాధించు లక్షణములు చేర్పవలసియున్నచోఁ జేర్చి పూరింప వలెను.

సులక్షణసారము బాలవ్యాకరణకర్త యభిప్రాయమువంటి యభిప్రాయ ముతో రచింపఁబడిలే దని యీవఱకే వ్రాసియున్నాను. కాఁబట్టి దీనినుండి కొంత వఱకుఁ బ్రాచీనలాక్షణికుల యభిప్రాయములను వానికి మూలము లగు మహా కవులప్రయోగములకు గ్రహింపవచ్చును గాని యిందును గ్రంథకర్తృకృతము లగు కొన్నిలోపములు లేకపోలేదు.

పద్యలక్షణములను జెప్పుటయందు గ్రంథకర్త యనుక్రమణికను పాటింపలేదు. నడకయందుఁ గాని ప్రాసవిశ్రమములయందు గాని యించుకయు భేదములేని పద్యలక్షణములు పృథక్పద్యభ్రాంతిని వేర్వేఱఁ బఠింపఁబడినవి. యతులపట్టిక నిచ్చునపుడు సీసపద్యమునపక్రమించి యది కుదురుటకై యతులను జెప్పుట యందలి యనుక్రమణికను విడిచినందునఁ గొన్నిసందర్భము లసంగతములైనవి. ప్రాచీనలక్షణకర్తలపరిపాటి చొప్పున ననావశ్యకమగు కృత్యాద్యవస్థ గ్రంథాన్తమున మిక్కలి విపులముగాఁ బెంచి వ్రాయఁబడెను. అట్టి యనావశ్యకభాగము సుమారు గ్రంథములో సగమువఱకు నుండును. అత్యావశ్యకమగు ప్రాసస్వరూపమును దద్భేదములును బేర్కొనఁబడ లేదు. గురుత్వ లఘుత్వ విషయమున నాంధ్ర లక్షణములం దవశ్యముగాఁ జెప్పవలసినసంస్కృత లక్షణ మార్గములు సయితమిందుఁ బేర్కొనఁబడలేదు. ఇట్టిగ్రంథకర్తలోపమాలే గాక ముద్రణకర్తలలోపములును నధికముగ నిందుఁ గలవు. తుదకుఁ బ్రాసవిశ్రమాదులు లేనిపద్యములును నిందు వెలయుచున్నవి.

కొన్నిలోపము లున్నను నీగ్రంథమునుండి గ్రహింపఁదగిన ప్రాచీనాభిప్రాయము లనేకములు గల వని మాత్రము చెప్పక తప్పదు. వానిలోఁ గొన్నిటి నుదాహరించుచున్నాఁడను :

క. అఆఇఔలకు మఱి, ఇఈలు ఋకారసహితమెఏలకునౌ
ఉఊ ల్దమలో నొడఁబడి, ఒఓలకు వళ్లగు న్నయోన్నతచరితా.

ఇందు వ్యావహారిక మగు వర్ణపారాయణములోని సజాతీయదీర్ఘాక్షరపరకహ్రస్వగౌరవము స్వీకరింపఁబడినది. ఇట్లె నియతముగా నీనియమ మనేక స్థలము లందు గ్రహింవఁబడెను. విస్తరభీతి నుదాహరింప లేదు పైపద్యము నందు ద్వితీయాక్షరము స్వరమాత్రము గాన హల్మాత్రసామ్యరూపప్రాసము లేకుండుట దోషము కా దని కావలయును ప్రాసమును బరిగణింప లేదు. ఈరీతి పద్యములు కవిజనాశ్రయమున ననేకములు గలవు. మాహేశ్వరసూత్రములందు వలెనె యిచ్చట సంధి లేమి దోషమును కానేరదు. ఈ క్రిందిపద్యము సయితము పైదానిమార్గమునే యవలంబించి యున్నది.

క. ''ఌౡఅంజఇణములు, సల్లలితములై వెలుగు శక్షలు పధియున్.''

దీనియందును గురుత్వాదివిషయమునఁ బై నియమములు చూపఁబడినవి. ఇంతియకాక యుచ్చారణములోని లవర్ణద్విత్వశ్రుతి ననుసరించి తక్కిన చరణత్రయమునందును లద్వయప్రాసము ప్రయోగింపఁబడెను.

ఇట్లే యుచ్చారణము నందలి సాజాత్యమును బట్టి శాస్త్రీయ మగు సంబంధము లేకున్నను గొన్నియతులు సులక్షణసారకర్తచే నంగీకరింపఁబడినవి. సులక్షణసార కర్తయేగాదు, అనంతాది ప్రాచీనలాక్షణికులు సయిత మంగీకరించి యున్నారు. వానిలోఁ గొన్ని యేకారణముననో యప్పకవీయాదులందు సంగ్రహింపఁబడలేదు. శబ్దాలంకారము లనఁదగు యతిప్రాసములవిషయమున వర్ణములకు శాస్త్రసంబంధము కంటె నుచ్చారణమునందలి శ్రుతిసంబంధమే యధికముగ నాదరింపఁబడుట యుచితమని ప్రాచీను లభిప్రాయపడినట్లు తోఁచుచున్నది. ఇదియే సమంజస మని నా యభిప్రాయము.

''రివడి'' అని ముద్రిత మగు సులక్షణసారమున నొకయతి యుదాహరింపఁబడినది.

క. ''విలసదృకారమ్మును మఱి
రిలవి విరమ మొందు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ నిప్పలుకులు
తలఁచఁగ రీతోడి విరతి దలకొనునపుడున్.

గీ. మును ఋకారము నెలమితో నొనరినట్లు
చేర దొకట యణాదేశకారణమున
ఘనరకారము నస్వరాకారవిరతి
క్లుప్తి లేదు శౌరిగుణావళుల కనంగ.''

అని యున్నది. ఈ పద్యము లనంతుని ఛందోదర్పణమునుండి సంగ్రహింపఁబడినవి. కాని యవి సరిగ నెందుఁ వ్రాయఁబడలేదు. వానియందుఁ జెప్పఁబడిన యతులప్పకవీయమున సంగ్రహింపఁబడ నందున నవి యశాస్త్రీయము లని భావించి యప్పకవి యంగీకరించి యున్న యతిభేదపరముగ నర్థమును జతపెట్టి యిట్లు సవరించి సంస్కర్త లెవ్వరో వ్రాసిన ట్లగపడుచున్నది. ఋకారమునకును రివర్ణమునకును యతి చెల్లు నని యప్పకవి చెప్పియున్నాఁడు. అయ్యది యీ గ్రంథమున

వేఱొకచోటఁ జెప్పఁబడియున్న ఋవళిలో సంగ్రహింపఁబడలేదు. అది సందు చేసి కొని యాకొఱవడిన భాగము గ్రంథకర్త యిచ్చటఁ జెప్పెనని తలఁచునట్లుగఁ బై రీతిని సవరించిరి కాని యిందు ద్వితీయ పద్యమున కర్థమే కుదరలే దనియుఁ గుదిరినపాటియుఁ బ్రకృతమునకు సరిపడియుండ లేదనియు నందును జతుర్థచర ణమునందలి యుదాహరణమున కేమాత్రమును బ్రకృతసందర్భముతో సంబంధము లేదనియుఁ దలంపకుండుట వింతగ నున్నది. పై వానిలో ద్వితీయ పద్యమును దీసివేసినఁ గొంతవఱకు వీరికృత్యము దాఁగునేమో!

ఇంకొక విశేషము గలదు. ఋకారమునకు రీతోడి యతి ప్రాచీను లగు మహాకవుల గ్రంథములలో లేకుండుటను కావలయు ననంతుఁ డంగీకరింపక నిరా కరించెను. అప్పకవి యీవిషయమున నుదాహరణములను రెండింటిని మాత్ర మొసఁగి యున్నాఁడు. వానిలో నొకటి యనంతున కిటీవలివాఁ డగు చేమకూర వేంకటకవి విజయవిలాసము లోనిది. రెండవది భారతము సభాపర్వము లోనిది.

సీ. "ఋత్విజుం డని విచారించి పూజించితే" (భారతము)

ఈయది యించుకాగమయతిచొప్పున సాధింపవచ్చును. కాన దీనిచే ఋరీల వళి నంగీకరింప నక్కఱలేదు. కావుననే యీ 'రివడి' ననంతుఁడు నిరసించి యుండెను. అనంతునిగ్రంథములోని రివడినిరాసకపద్యములను రివడిని సాధించు నట్లు దిద్దుటి సాహసము. సాహస మనఁజనదు, పరమసాహసము. పై యంశ ములు చదువరులకు విశదమగుటకై పై రివడి పద్యముల యథార్థస్థితి ననంతుని ఛందోదర్పణమునుండి తీసి చూపుచున్నాను.

గీ. క్షితి ఋకారరూప స్వరయతులు పరఁగు
ఋగ్యజుస్సామవినుతుండు కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు కరుణాసమృద్ధుఁ డనఁగ
హేమపీతాంబరుఁడు దేవవృషభుఁ డనఁగ.

క. విలస ద్రుకారమును వ
ట్రులు రువిరమణంబు శౌరి ఋషులకు శశ్వ
త్ప్రులభుఁ డనఁగ నీ ఏలకుఁ
ధలఁషగ రీతోడి ఫిరతి దలకొన దెందున్.

గీ. తెల్లముగ ఋకారము యణాదేశశక్తి
గలుగ రేఫయు నిత్యము నంటఁ గదిసి
నట్టి రీకి సీఏలతో నన్వయించు
నట్టి సత్వంబు లే దది హల్లుగాన.

గీ. మును ఋకార మీఏలతో నొనరినట్లు
చేర దొకట యణాదేశకారణమున
ఘనలుకారంబ యగు స్వరల్కారవిరతి
క్లుప్తి లేదు శౌరిగుణావళుల కనంగ.

పై నాలుగు పద్యములలో ద్వితీయ చతుర్థపద్యములె సులక్షసారమున నుదాహరింపఁబడినవి. ఇప్పటి సులక్షణసారపద్యము లంత ఘోరముగఁ బ్రాఁత సులక్షణసారపుస్తకములందలి పద్యములు సవరింపబడలేదు.

క. విలసద్రికారమును వ
ట్టులు విరమణ మొందు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ నిప్పలుకులు
దలఁపఁగ రీతోడి విరతి దలకొనునపుడున్.

తే. గీ. మును ఋకారము నెలమితో నొనరినట్లు
చేరు నొకట యణాదేశకారణమున
ఘనరకారంబున స్వరాకారవిరతి
క్లుప్తి లేదు శౌరిగుణావళుల కనంగ.

పై రీతిని "1862"వ సంవత్సరమున ముద్రిత మగు పుస్తకమున నున్నవి. ఇవి సత్యాసత్యస్థితులకు మధ్యవర్తులై యుండుటచే సత్యరూపమును స్మరింపఁ జేయఁ జాలియున్నవి. అసత్యరూపనూతనార్థము నీయఁజాలక యర్థశూన్యములై యున్నవి.

సభ్యులారా ! చూచితిరా ? మనవారు గ్రంథమును దిద్ది పాడుచేయుటలో నవలంబించు సాహసములు! ఈరీతిని మన వాఙ్మయ మెల్ల బాలవ్యాకరణాప్పక వీయముల విశ్వరూపమున వెలయుచున్నది. 'లక్ష్యలక్షణగ్రంథము లెల్ల ఛందో

విషయమున నప్పకవీయానుసారముగను వ్యాకరణవిషయమున బాలవ్యాకరణాను సారముగను నుండునట్లు చేయుటయె మనవారి ప్రధానోద్దేశ మై యున్నది.

పై నుదాహరించిన యనంతచ్ఛందస్సులోని పద్యచతుష్టయమును బరిశీలింపఁగా స్వర మగు "ఋకారము"నకును, ఉత్వవిశిష్టరేఫకును యతి చెల్లుననియు నట్టియతిపేరు "రువిరమణ" మనియు, నుచ్చారణములోని ఋకార శ్రుతినిబట్టి యది కల్పింపఁబడె ననియు, ఋకారమునకు 'రిరే'లతో యతి చెల్లదనియు స్పష్టముగాఁ దెలుచున్నది. వేయేల! "ట్రులు విరమణ మొందు శౌరి ఋషులకు శశ్వత్;" క్లుప్తి లేదు, శౌరిగుణావళుల కనంగ" అను నుదాహరణములే పైయభిప్రాయము నుద్ఘోషించుచున్నవి. ఋకారౠకారను లుచ్చరించునపు డుత్వసహిత రేఫలకారములుగా వినఁబడుట లోకప్రసిద్ధము గాన నట్టియతి యంగీకరింపఁబడె నని చెప్పకతీరదు. ఇంతయేల- "అయన ఋషి" మొదలగు చోట్ల యడాగమము రాకుండఁ గాపాడు "ఋౠవర్ణంబులు రలతుల్యంబులు" అను బాలవ్యాకరణ విధానమునకును "నారికినై నాకకుజం, బాఋభుపతి గెలిచి తెచ్చె నచ్యుతుఁ డనఁగ" అను మొదలగు నుదాహరణములు గల యప్పకవి గారి ఋప్రాసవిధానమునకును నీవ్యావహారికోచ్చారణమెగదా మూలము. కాన నది రివడి కాదనియు రువడి యనియు నిది వ్యావహారికరీతి నాధారముగాఁ జేసికొని యంగీకరింపఁబడిన దనియుఁ జెప్పక తప్పదు.

మఱియు ననంతుఁడు పదునాల్గవశతాబ్దమువాఁ డగుటను బహుగ్రంథ ద్రష్టయగు ప్రాచీనలాక్షణికుఁ డగుటను నాతఁడు వ్రాసినది నిరాకరించుట యసంగతము. అనంతుని లక్షణములే కాక యాతనిప్రయోగములును ప్రామాణికములే యని యప్పకవియుఁ దలచినట్లు గన్పట్టుచున్నది. అనంతునిప్రయోగము మాత్రమె యాధారముగాఁ జేసికొని లడలయతి నప్పకవి నూతనముగ సాధించి యున్నాఁడు. (అనంతునిఛందమునందు)

క. "కాకుస్వరయతి యగు నితఁ
దే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర
శ్నాకలితదీర్ఘమున నితఁ
దే కవ్వడిరథము గడపె నిమ్ముల ననఁగన్."

(అప్పకవీయము)

ఈ రీతిని ననంతుని బ్రామాణికునిగాఁ గైకొన్న యప్పకవి యాఁతడు కంఠోక్తిగాఁ జెప్పిన యీ రయతి నేల యంగీకరింపలేదో తెలియరాకున్నది.

**'అక్షోహిణీ శబ్ద యతి':**

'అక్షోహిణి' 'అక్షౌహిణి' అను రెండును సాధువులె యైనను గోశాదులలో నక్షౌహిణి యను పదమె సుప్రసిద్ధమై వెలయుచున్నది. శబ్దరత్నాకరమునందును వాచస్పత్యమునందును నక్షౌహిణీశబ్దమే యుదాహరింపఁబడినది గాని యక్షోహిణి శబ్దము పేర్కొనఁబడలేదు "అక్షా దూహిన్యా ముపసంఖ్యాన" మ్మను వార్తికము చొప్పున నక్షౌహిణి యని సిద్ధించును. అక్ష శబ్దమున కూహ శబ్దము పరము కాఁగా నక్షోహ యని సిద్ధించిన పిదప నిని ప్రత్యయము రాఁగా నక్షోహిణీ యని సిద్ధించునని తత్త్వబోధినియందును గురుబాలప్రబోధికారులందును వ్రాయఁబడి యున్నది. సంస్కృతభాషలో స్పష్టముగా నీవిషయమును దెలుపునట్టి ప్రయోగములు లభించుట దుర్లభము గాని యాంధ్రభాషలో విశ్రమస్థానమం దిట్టిప్రయోగ మున్నచో సందేహనివృత్తి గలుగును. తిక్కయజ్వభారతమున నక్షోహిణి శబ్దములోనిఁ 'క్షో' యను దానిని విశ్రమస్థానమున నిలిపి యున్నాడు. కోశాదులలో నక్షోహిణీ శబ్దము లేకుండుటచేతను బ్రసిద్ధ మగు 'నక్షా దూహిన్యా ముపసఖ్యాన' మ్మను వార్తిక మక్షౌహిణీశబ్దమును సాధించుచుండుటచేతను నప్పకవి యక్షోహిణీశబ్ద మపశబ్దమని తలఁచికావలయు నిత్యసమాసయతి సందర్భమున దీనిని స్మరింపక దిద్దుటకు వలనుపడకుండుటచేఁ గాఁబోలును జల్లఁగ జాఱవిడిచి యున్నాఁడు — అయ్యది దిద్దుట కెట్లు వీలు పడును? పెక్కుచోటులందు యతిస్థానములందే తిక్కయజ్వ బిగించియున్నాఁడు.

"సహస్రాక్షోహిణు లట్లగుట మీరు చూడరె యెందున్"

(భా. ఉద్యో. 1 ఆ. 236 ప.)

గీ. "కోరి, పతులుగఁ జేయు మక్షోహిణులకు"

(భా. ఉద్యో. 4 ఆ. 110 ప.)

గీ. "కోరి, కొనఁగఁ దగువార లగుదు రక్షోహిణులకు"

(భా. ఉద్యో. 4 ఆ. 139 ప.)

సులక్షణసారమునం దీ యక్షోహిణీశబ్దయతి చూపఁబడియున్నది. దాని నప్పకవి చూచియుండియు నుపేక్షించుట నరయఁగా నాతని కిది యసమ్మత

మనక తీరదు గదా! అక్షోహిణీశబ్ద మక్షౌహిణీశబ్దాపభ్రంశ మని తలఁచి నిరాక రించి యుండు నని తోచుచున్నది.

క. "పూనుకొని యక్షశబ్దము
పైనూహిని శబ్ద మున్నఁ బటువృద్ధి యగున్
మానుగ గుణముం జెల్లును
దాన నఖండంబు స్వరము దనరుం గృతులన్."
(కవిజీవిత సంజీవనము)

ఆ. వె. "లక్షణాన్వితముగ నక్షశబ్దంబుపై
దనర నూహి నను పదంబు వెలయు
నపుడు వృద్ధి సెప్ప నగు గుణంబును జెల్లు
నాగుణం బఖండ మై చెలంగు."
(సులక్షణసారము)

అక్షోహిణీ శబ్దసాధనప్రక్రియావిషయమునఁ బై పద్యములు పాణినీయ మతమును బ్రతిఘటించుట విరుద్ధము కానేరదు - "అక్షోహిణి" "అక్షౌహిణి" యను రెండు శబ్దములును సాధువులె యగునపు డిట్లు చెప్పుటయే సహజము. పాణినీయవ్యాఖ్యాతలకు మూలాతిక్రమము వలనువడకుండుటచే వారు భంగ్యంత రమునఁ బ్రక్రియను గల్పించుకొనిరి. ఇతరులును నట్లె చెప్పవలయు నను నియ మము లేదు గదా! "ప్రాదూహోఢోఢ్యేషైష్యేషు" అనుదాని కవిరుద్ధముగ నుండు టకై యీషేష్య శబ్దముల మూలమునఁ బ్రేషప్రేష్య శబ్దములను బాణినీయులు సాధించియుండఁగా ముగ్ధబోధవ్యాకరణమున "వై షైష్యే" అని సూత్రించి యేషైష్య శబ్దములు పరమగునపుడే పరరూపవృద్ధులు రెండును రావచ్చునని వోపదేవుఁడు చెప్పియుండ లేదా ?

పైరీతి నక్షౌహిణీశబ్దము సాధు వై యుండఁగా నధునాతనాంధ్రభారత టిప్పణకారు లది వై యాకరణసమ్మతము కాదని భ్రమించుట వింతగ నున్నది.

ఇట్లే మహాకవ్యనుమతినిబట్టి యభేదయతియు నఖండయతియు నించు గాగమయతులనఁ దగు భిన్నాభిన్నయతులను సులక్షణసారకర్త చే నంగీకరింపఁ బడినవి. అం దభేదయతి "పఫబభవ"లకును 'లడ'లకును 'లర'లకును నంగీక

రింపఁబడినది. ఇయ్యదియును దేశభేదముల యుచ్చారణభేదములనుబట్టి సంభ వించుమార్పుల ననుసరించి కల్పించినదే యనవచ్చును. పైనుదాహరించిన యతు లకు మహాకవిప్రయోగములును ననేకములు గలవు. అయినను వాని నప్పకవి యొప్పుకొనలేదు. ఆ ప్రయోగములు కవిప్రయుక్తములు కావనియు నెవ్వరో యజ్ఞు లట్లు దిద్దిరనియు జర్చించియున్నాఁడు-ఇది సరికాదని నే నీవఱకే వ్రాసి యున్నాను.

మొత్తము మీఁద సులక్షణసారమునుండి యనేకము లగు ప్రాచీనులయభి ప్రాయములు విశద మగుచున్నవి. ప్రాచీనులమార్గము లనేకము లిప్పటి పనికి మాలిన నిర్బంధములను సడలింపఁజేయుచు నూతనకల్పనమునకు మార్గదర్శకము లుగా నున్నవి. కావున నట్టి గ్రంథ మావశ్యకముగాఁ బఠింపఁదగినదే యైనను దాని కీయధునాతనుల సంస్కారములును ముద్రణస్ఖాలిత్యములును గొప్పలోప మును దెచ్చి యున్నవి. కావున నయ్యది సవరించి యావశ్యకములైన యనంతాది ప్రాచీనలాక్షణికుల మతములను గొఱవడినవానిని జేర్చి యొకగ్రంథము వ్రాయ వలసి యున్నది.

విచక్షణులార ! ఆంధ్రమహాశయులు స్వభాషాభివృద్ధికై మిక్కిలియుత్సా ముతోఁ బనిచేయుచున్నారు. భాషాభిమానముతోఁ మహారాజులు పెక్కువిధములగు సాహాయ్యములను జేయుచున్నారు. మనపాలకు లగు నాంగ్లేయప్రభువులును దేశ భాష లభివృద్ధికై ప్రోత్సాహము చేయుచు ధనసాహాయ్యము చేయుచు విద్యాశాఖ నేర్పఱచి దేశభాషలకును బరీక్షల నేర్పఱచి యుత్సాహము నభివృద్ధి నొందించు చున్నారు. శరత్కాలిక శుక్లపక్షచంద్రునివలె నుదయించినది మొదలు దినదినాభి వృద్ధితో నీయాంధ్రసాహిత్యపరిషత్తు వెలయుచున్నది. ఇట్టి సమయమునందైన నాంధ్రభాషాభ్యాసము చేయఁగోరువారికిఁ దగిన గ్రంథము లుండవలదా ? తుదకు విద్వద్విరుదపరీక్షాపఠనీయగ్రంథము లిట్టి యవస్థలోనుండఁ జనునా ? కావున నీ గ్రంథములను బాగుచేయుటకుఁ గాని వేఱుగ్రంథములను రచించుటకుఁ గాని సాహిత్యపరిషత్తువారు పూని భాషాసేవ చేయఁగోరువారికి సాహాయ్య మొసరింతురు గాక. అట్టి ప్రశస్తగ్రంథములనె విద్వద్విరుదపరీక్షలకుఁ బఠనీయగ్రంథములుగ నేర్పఱచి విద్యాశాఖాఖవా రాంధ్రమహాశయులను గృతార్థులను జేయుదురు గాక!

—ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక; నళ - జ్యేష్ఠము
సంపుటము 5, సంచిక 3.

# అఖండవడి - పదునొకొండు శబ్దము

—శ్రీ రావూరి దొరసామిశర్మ

పూర్వస్వరము లోపించి తత్పూర్వహల్లుతోఁ బరస్వరము గదియుట యచ్సంధి యగును. (ఉ. రాజ + అనీక — రాజానీక ; చూచుచు + ఉండు — చూచుచుండు). ఇట్టి సంధ్యక్షరములు యతిస్థానపతితము లయ్యేనేని సంధి విడదీసి పరస్వరమునకే యతిమైత్రి ఘటియింపవలయు నని పెక్కు లాక్షణికులమతము. దీనినే స్వర ప్రధానవడి యన్నాఁడప్పకవి.

ఉదా. "అతులగుణధామ భానువంశాబ్ధిసోమ (వంశ + అబ్ధి)
ఆసభ కేకవస్త్ర యగునట్టి ననుం గొనివచ్చి నొంచు." (అగు + అట్టి)

పైస్థలములందు సంహితను వివక్షింపక యఖండశబ్దములుగా భావించి హల్మైత్రి గూర్పరా దని యప్పకవ్యాదుల తాత్పర్యమై భాసిల్లెడు. కాని నారాయణవేదండాదిశబ్దములు గొన్ని వ్యుత్పత్తిచే సంహిత గలవైనను వాడుకలో నఖండములుగా భావింపఁబడుటచే, నట్టివానికి గొన్నింటి కుభయయతి (స్వరవ్యంజనములలో నేయొక్కదానికేని యతి) ఘటించుట కనుజ్ఞ యిచ్చినారు లాక్షణికులు. ఇట్టివానినే యఖండయతు లనవలయు.

అప్పకవి యుభయ యతులక్రిందఁ బంద్రెండుతెఱఁగులు ప్రవచించెను. అయ్యవి యుష్మదస్మచ్ఛబ్ద, పరరూప, ప్రాది, సంస్కృతనిత్యసమాస, దేశ్యనిత్యసమాస, నిత్య, రాగమసంధి, విభాగ, నామాఖండ, పంచమీవిభక్తి, కాకుస్వర, ప్లుతయుగ విశ్రామములు. ఇందు గొన్ని ప్రాచీను లగు ననంతాదులు సైతము వక్కాణించియున్నారు. అప్పకవి యఖండవడిని జెప్పలేదు. అఖండవడిని సమ్మతించినచో సంధిగతాఖిలశబ్దముల కుభయయతిఘటన కనుజ్ఞ యిచ్చినట్లే యగు. అట్లేని యీయుభయ యతిప్రకరణ మనవసరమగు. ఇట్టి యతివ్యాప్తి నరికట్టుటకే విన్నకోట పెదనాదులు ప్రాదిదేశీయాదేశ ప్రభృతి నిత్యసమాసాది యతులు గొన్ని నిరూపించిరి.

అఖండయతిని అనంతుడు గాని, విన్నకోట పెద్దన గాని చెప్పలేదు. అప్ప కవియో యఖండవడి యగ్రాహ్యమని యనుశాసించినాడు. భీమకవియే ప్రప్రథమమున నఖండవడిని బేర్కొన్నవాఁడుగాఁ గానవచ్చెడి--

ఉ. ''మామగ విశ్రమాక్షర సమంచిత మై స్వర మూదినం దదీ
యానుగుణాక్షరంబ కొని యైనను జెప్పఁగ నొప్పు నీక్రియన్
భానుసహస్రభాసి వృష * ఖాధిపుఁ డన్నటు లర్థయుక్త మై
పూనినచో నఖండవడి పొల్పగు నాదికవిప్రణీత మై.'' (భీమన)

ఆతరువాతఁ చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహమున,

గీ. ''ఒక్కవర్ణంబు స్వర మూద నొకట స్వరము
గలయ కుండంగ గూర్తు రఖండయతులు
రామపదపద్మలోల వ-రాళి యనఁగ
భంజితాసురసముదాయ యాంజనేయ.''

అని యఖండయతికి లక్ష్యలక్షణములు రచించె.

ముద్దరాజు రామన కవిజనసంజీవనిలోను, కూచిమంచి తిమ్మన సర్వలక్షణ సారసంగ్రహముననను, కస్తూరి రంగకవి ఛందమునందును అఖండయతి సెప్పఁ బడియున్నది ఇవి యిట్లుండనిండు. అప్పకవి విషయము పరికింతము.

అప్పకవి దేశ్యనిత్య సమాసయతులక్రింద విమర్శించిన రీతిని దిలకింపుడు. (తృతీయాశ్వాసము ౨౦౨ పద్యము మొదలు ౨౧౨ వఱకు).

''నన్నయముఖ్య సత్కవిజనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియు బాఠకాధములు గొన్నియు బోకడ బెట్టి తక్కువై
యున్నెట కాంచి జానపదు లోడక దిద్దిన తప్పుత్రోవ లె
ల్లన్నిజ మంచు గై కొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే.''

వ.అది యెట్లనిన సులక్షణసారంబునందు లింగమగుంట తిమ్మన వ్రాసిన యప్రశస్తంబు లగు లక్ష్యంబులకు నాశ్చర్యంబు నొంది బహుపుస్తకంబులు నిరీ

---

* భీమన యీ యఖండ యతిపద్యమును నప్పకవి నిత్యసమాసయతుల క్రింద గైకొని యుపసర్గసంధియతి యని సరిపుచ్చినాడు. అతనిమతమున నఖండ యతి నిషిద్ధము గదా!

క్షించి వాని నెల్లను ప్రక్షిప్తంబులుగా నెఱింగినవాఁడనై లక్షణవంతంబు లగు పురాతనకవిప్రోక్తంబులు వివరించెద.

(౧) ఆదిపర్వంబునందు—

''నీవగచిన యాయర్థము
నూవె మనంబున దలంతు సుందరి యెపుడున్.''

(౨) ఉద్యోగపర్వము—

''సజ్జననుతమార్గమునను జరియింపంగా
నమలమతీ కన్నకొడుకుల ట్లరయఁ జనున్.''

(౩) అనుశాసనికము—

''అతిథి నిను గోరెనేనియు
నతి గింకిరి పడక యోల మాసపడక...''

(౪) రామాయణము—

''అనవు తండ్రియట్ల విను మంతియ కా దటఁమీఁద రాజ వే
మన్న గొఱంత లేదు మణిహారము లాదిగ బెక్కుకానుకల్...''

''ఓకపివీరులార సుగుణోదధి నీరఘురాము సర్వలో
కైకశరణ్యునిం గొలువ నిప్పుడు వచ్చితి నొండు గాదు...''

(౫) దేవకీనందన శతకము—

''చతురంభోధిపరీతభూవలయరాజన్యాలికోటీర రం
జితమాణిక్యవిరాజి తచ్చరణరాజీవుండు...''

(౬) ఆరణ్యపర్వము—

''ఉరమున రెండుగన్నులు...అశేషసత్వ సం
హరుఁడగుచున్న వాని దివిజారిఁ గబంధునిఁ గాంచి రచ్చటన్.''

పైపద్యములు లింగమగుంట తిమ్మన యుదాహరించినవి గాని యాతఁడొసఁగిన యఖండవడితోడి పాఠము లప్పకవీయమున సవరింపఁబడిన వని తెలియవలయు. పైపద్యములలో నెల్ల నఖండవడి ఘటిల్లెడి పాఠములు గలవు.

నేఁడు ప్రచారములోనున్న సులక్షణసారము తప్పులతడక. అందు నాల్గవ పద్యము మాత్ర మఖండవడికి లక్ష్యముగా నీబడియున్నది. నిక్కమగు సులక్షణ సార మొందు గల దనుచున్నారు. అయ్యది ప్రకటన భాగ్య మందలేదు. దానిని నే నెఱుంగను. కాన నాసులక్షణసారమున వీని కేపాఠాంతరము లున్నవో మన మెఱుఁగము. ముద్దరాజు రామన, కస్తూరి రంగకవి మున్నగువారు పై పద్యములం గొన్నిటి నఖండయతి పాఠములతో నుదాహరించి యున్నారు. పై పద్యములకు నేఁ జూపిన యఖండవడి పాఠము లీ క్రింద వరుసగా నిచ్చుచున్నాను.

(౧) "చూవె మనంబున దలచు + చుండుదు నెపుడున్."

(౨) "మా, ర్గమున జరింపంగా నమ
లమతీ నీ కొడుకు నట్టు + లరయంగ నగున్."

(౩) "మతి గింకిరి పడక యోల + మానవడక."

(౪) "అన్నవు తండ్రి యట్ల విను మంతియ కా దట మీఁద రాజవే
మన్నఁ గొఱంత లేదు మణిమండనముఖ్యము లైన కానుకల్."
'సర్వులో, కై క శరణ్యునిం గొలువఁగా నిఁడవచ్చితి నొండుగాదు.'

(౫) "చతురంభోధి పరీతభూవలయరా + జానీకకోటీర."

(౬) "అశేషస త్త్వఘ, స్మరుఁ డగుచున్న వాని
దివి + జారి గబంధుని గాంచి రచ్చటన్."

(అఖండవడి గల భాగము మాత్రము వాలు అక్షరములలో నున్నవి.)

ప్రసిద్ధముగా సహజముగా నఖండవడులతోడి యీపాఠములను స్వమత విరుద్ధము లగుటచే రూపుమాపి సవరించిన యప్పకవి కట్టకడపట నీ క్రింది పద్య ముదాహరించి తద్విషయ మిట్లు వ్రాసినాడు:

ఉద్యోగపర్వమునందు—

చ. అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిచిన మాటలాడి వినియంబునఁ బ్రార్థన సేసి మీరు మా
కొనరిన సైన్యముల్ పదునొ + కొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు నొప్పు నభిషేకము గైకొనుఁ డుత్సవంబునన్,"

వ. దీని మూఁడవపాదంబునందు "పదునొకొంటికి"నని యున్నచోట సంధి గూర్చి స్వర ప్రధానవడి గాను సోమయాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్యసమాసవడి యని యనుకొందురు- ఇది యప్పకవి విమర్శోక్తి.

ఇందు "మాకు + ఒనరిన-మాకొనరిన" అను సంధిగతశబ్దము నఖండముగా భావించి యేకశబ్ద మగు 'ఒకొంటికి' అనుదానిలోని కవర్ణమునకు యతి సంఘటింపఁబడి యున్నది.

ఒకొండు-ఒకండు అను శబ్దమునకు రూపాంతరము. ఔపవిభక్తిక ప్రత్యయయోగమున 'ఒకొంటికి' అయినది. ఇందు సంధిలేదు. ఇందలి 'కొ' వర్ణమునకును 'మాకొనరిన' యను సంధిగత శబ్దములోని 'కొ' వర్ణమునకును అఖండవడి చెప్పుకోవలయు ఇది యిట్లుండ దీనికిఁ బాఠాంతరము కల్పింపలేక కాబోలు నప్పకవి ఒక + రెండు-ఒకొండు' అని సంధి నేర్పఱచుకొని స్వర ప్రధానవడి యని నిర్దేశించినాఁడు. 'ఒకొఁడు-'ఏకదపద మనుకొని 'మాకొనరిన' అనుదానితో మైత్రి యఖండవడి క్రింద నిరూపించిన లింగమగుంట తిమ్మన, ముద్దరాజు రామనాదులను దేవానాంప్రియుల గణములోఁ జేర్చినాఁ డతఁడు.

అప్పకవీయవిమర్శనలో శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు ఈ విషయము విమర్శించుచు- "ఒక + ఒంటికి అని అప్పకవిగారి తాత్పర్యమని తోచుచున్నది పదద్వయవిభాగమునకు ప్రసక్తి కనిపించదు. ఆయన ముఖ్యాభిప్రాయ మొకటి; పైకి వ్రాసిన దొకటి. అఖండవడి యుండ దని ముఖ్యాభిప్రాయము. అందుకు నఖండవడు లున్నచోట ఆ-ఉచోట్ల దిద్ది పాఠములు వేరే కల్పించినారు ఇక్కడ దిద్దడమునకు శక్యము కాలేదు...

స్త్రీ పర్వంలో—

"పాండవుల వలన గీ డొ
క్కొండును లే దధిప నీదుకొడుకులు ధరణీ"

అని ఉన్నది. దీని కేమంటారు ? అఖండవడి అంగీకరించవద్దా ? గాని యిది నిజముగా వర్గయతి"-అని యప్పకవి మతమును ఖండించిరి. వెండియు, కూచిమంచి వేంకరాయడు తన సుకవి మనోరంజనములో నప్పకవి యీ వాదమును ఖండించినాఁ డని తెలిపినారు వారు,

పదునొకొండు శబ్దమును గూర్చిన యప్పకవిమత మసాధు వనియే యెల్లరు దలంచుచున్నారు. కాని యీ క్రింది తెనాలి రామకృష్ణ రచిత పాండు రంగ మహాత్మ్యపద్యముం బరికింప నప్పకవి యభిప్రాయము సమంజస మని తోచుచున్నది. చూడుడు :

గీ. "వాసుదేవాది నవశక్తి వైభవంబు
రుక్మిణీసత్యభామల రూపరేఖ
యిదియె వహియింపు నవ నల్వ యిడిన పదునొ
కొంటి లెక్కన గనుబొమ్మ లువిద కమరు." (౩-౧౯౮

ఇందుఁ జతుర్థపాదమున యతి విచారింపఁ దగినది. ఒకొండు శబ్దములో ఒక + ఒండు అను విభాగము చేసి పరస్వరమునకు యతిమైత్రి ఘటింపఁబడి యున్నది. ఇది సర్వప్రధానవడియే కదా ? 'ఒక+ఒంటి...బొమ్మలు+ఉవిద' అని పాదాదియందు యతిస్థానమందు బదచ్ఛేదము. పై తిక్కనగారి పద్యమున లాక్షణికులు విమర్శకులు వచించు నఖండవడి యిందుఁజెల్లదు. ఒకొండు శబ్దమున బదద్వయవిభాగప్రసక్తి నిక్కముగాఁ గలదని తెలియుచున్నది. అప్పకవి యీ భాషణము తథ్య మన్నమాట! తెనాలికవి మన యప్పకవికిఁ బూర్వుఁడు; కాని యప్పకవి తెనాలిప్రయోగమును బరికింపలే దని తలంచెద. వెండియుఁ గూచి మంచి వెంకటరాయలకుఁగాని, గిడుగువారికిఁగాని యీ ప్రయోగము గోచరము గాలేదు. పై తెనాలికవి పద్యపాఠమునకు బాఠాంతర మేమేని యుండునా ? నాకడ ప్రతిలో* నిట్లున్నది. ఎవరేని 'పదియు నొంటి లెక్కన' అని సవరింప సాహ సింతురేమో ! కూచిమంచి వేంకట రాయల గ్రంథము నే నెఱుంగను. అది ముద్రితమో యముద్రితమో తెలియరాదు.

కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహమున అఖండవడిని బేర్కొన్నాఁడు. అందు భాస్కరరామాయణ భైరవ శ్రీరంగమాహాత్మ్య మను చరిత్రారుణాచలపురాణములోని పద్యము లఖండవడికి లక్ష్యములుగా నిడఁబడినవి.

---

* నాకడఁ గల ప్రతి ౧౮౮౭ సర్వజిత్తులో-తెన్మఠం వేంకట నరసింహాచార్యుల లఘుటీకతో చెన్నపురి వసురత్నాకర ముద్రాశాలలో ముద్రితము.

వాని నుదాహరించి తరువాత, ''ఇట్టి ప్రయోగములు కలవు గాని అఖండయతికి త్రికవుల ప్రయోగములు లేవు గనుక ఇది సుప్రయోగము కాదు'' అని యొక వచన మనుబంధింపఁబడి యున్నది. (చూ. సర్వలక్షణ. ౨ ఆ.)

ఈతిమ్మకవిమతమున భారతమున నఖండవడులు లేవు; అప్పకవిమార్గానుయాయి యితఁడు కాఁబోలు! కాని, యితని రసికజనమనోభిరామమున నీ క్రింది పద్యము తృతీయపాదమున నఖండవడి గలదు.

గీ. ''తనకుఁదొమ్మిదిపాతఱ ల్ధనము గల ద
టంచు జక్కులఱేఁడు గర్వించు గాని
లెక్క యిడరాని రొక్కంబు + లీఁడు లేని
కొలుచుగల వెన్న నవ్వీటి కోమటులకు.'' (ప్ర. ౪౪)

దీనికిఁ బాఠాంతర ముండునా? ఇది మన కిప్పుడు చర్చింపఁ దావు గాదు. ప్రస్తుతమునకు వత్తము.

ఒకొండుశబ్దము సంధిగత మనుటకు సూర్యరాయనిఘంటువునను నీక్రింది యాధారము కానవచ్చుచున్నది. చూడుఁడు : ఒండు శబ్దము !

ఒండొ (సూ. నిఘంటు)- ఈ శబ్దము 'ఒక్క' శబ్దమునకు బర మయినపుడు 'ఒక్కొండు' అయి క్రమముగ 'ఒకొండు-ఒక్కండు-ఒకండు-ఒక్కడు-ఒకడు' ఇత్యాదిరూపముల నొంది 'ఒకటి' అనునర్థమున అమహదర్థక ప్రథమైక వచన రూపముగా వ్యవహరింపఁ బడుచుండెను - ఇత్యాది.

దీనింబట్టి ఒక + ఒండు అను భేదము కల దనుట తెల్లము గదా! ఇందు మఱియొకయంశము గమనింపవలయు. ఒకొండు సంధిగతశబ్ద మని వ్యుత్పత్తిం బట్టి నిర్ణయించినారము గాన, స్వరప్రధానవడికిఁ బై తిక్కన తెనాలి ప్రయోగములు లక్ష్యము లగుచున్నవి.

ఈ క్రిందిపద్యములో ఒకండు శబ్దమధ్యమాక్షరము హల్లునకే యతిమైత్రి ఘటిత మై యున్నది.

క. ''పాండవులవలని కీడొ
క్కొండును లే దధిప నీదు + కొడుకులు ధరణీ

మండల మంతయు బ్రమింగిరి
పాండునృపతిభావమునకుఁ బాపిరి వారిన్.''

(భారత. స్త్రీ. ౧-౮౩)

స్రగ్ధర : ''క్రూరేష్వాసంబు లే డొ + క్కొఁడు గలుగునె తద్ఘోర యుద్ధంబు సైపన్ (రాఘవపాండవీయము ౨-౧౦౬)

వీనిం బరికింపఁ దోచున దేమన, ఒకొండు - ఒక్కొండు శబ్దములు సంధిగతాఖండశబ్దములు, రూపఱు, క్రిక్కిఱియు, క్రచ్చఱ, ఇత్యాది దేశ్యనిత్య సమాసములం బోలినది. కాన ఒక్కొండు శబ్దమును దేశ్యాఖండయతిక్రింద గ్రహించి యుభయ యతి ఘటించుకొనవచ్చును.

ఈచర్చంబట్టి పై తిక్కనపద్యములోని వివాదభాగమగు — ''మా కొన రిన...పదునొకొంటికి''—అనుచోట, 'మాకు+ఒనరిన'... ఒక+ఒంటికి అని ఛేదనమొనర్చి, స్వరప్రధానవడిగానేని, సమస్తసంధిగతశబ్దముల కఖండయతి సమ్మతించు సహృదయుల మతమున — 'మాకొనరిన...పదునొకొంటికి—' అని యఖండవడిగా నేని చెప్పుకోవచ్చు నని ఫలితార్థము.

— భారతి

విరోధి - భాద్రపదము; సెప్టెంబరు 1949
సంపుటము 26; సంచిక 9.



# యతిప్రాసలు

— శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

ఈయతిప్రాసలనుగూర్చి ఆధునికపండితులలోను, కవులలోను భిన్నాభిప్రాయము లున్నవి. కావలయు నన్నవారు కొందఱు, వల దనువారు కొందఱు. మొదటితెగవారు తెల్పు అభిప్రాయములు ఇవి :

''ప్రాచీనులు యతిప్రాస లుంచుకొని గ్రంథములు రసవంతములుగాఁ జెప్పియుండ లేదా ? వారు సమర్థు లగు సర్వతోముఖపండితులు గనుక యతిప్రాసలకు 'జంకరైరి. ఆధునికులు భాషాపరిశ్రమ లేనివా రగుటచే కాశికిఁ బోయిన వారు ఇష్టము లేని శాకఫలాదులను విసర్జించునట్లే తమకుఁ గష్టముగా నున్న యతిప్రాసలు విడువ నెంచుచున్నారు. నదికి ఒడ్డులువలెఁ బద్యమునకు యతిప్రాసలు ముఖ్యములు'' - అని. వీరు కేవలప్రాచీనసాంప్రదాయికులు. నూతన సంప్రదాయవాసన బొత్తుగా గిట్టనివారు.

నూత్నసాంప్రదాయికులలోఁ గూడ నొకతెగవారు యతిప్రాస లుండవలెననియే వాదింతురు. కాని వారు తెలుపు క్రొత్త యుక్తు లేమియు లేవు.

కూడ దనువారు తెలుపు అభిప్రాయము : ''కవిత్వమునకు రసము ప్రధానము. వాక్యం రసాత్మకం కావ్యం అని సాహిత్యదర్పణకారుఁడును, సాధ్యో హి రసో యథా తథం కవిభిః అని ఆంధ్రశబ్దచింతామణికారుఁడును ఉచ్చకంఠములతోఁ జాటుచున్నారు. యతిప్రాసలు రసోత్పాదకములు గావు. ప్రత్యుత కొన్నిచోట్ల రసభంజకములు అగుచున్నవి. మఱియుఁ గవిత్వమునకు నిర్బంధములు గూడవు. యతిప్రాసలు నిర్బంధములలోఁ జేరినవి. పంజరములోని పిట్టవలె భాషానిర్బంధములలో బద్ధుఁడై కవి గిలగిల కొట్టుకొనును. వానికి స్వాతంత్ర్యము కావలెను ఆంధ్రమునందువలె సంస్కృతమున యతిప్రాసలు లేవు. అందు రస స్ఫూర్తి కలుగుట లేదా ? ఆంగ్లమునను గొంతమంది మహాకవులు నియమోల్లంఘనముఁ జేసి వ్రాసిన కావ్యములు రసవత్తరములుగా నుండ లేదా ? కనుక యతిప్రాసలు తీసివేసినచోఁ గవిత్వమునకు హాని రాదు. అది కావ్యము కాకపోదు. యతిప్రాస లున్నంతమాత్రముననే అది పద్యము కాదు. రసవంతమగు పద్యమును, గద్యమును గవిత్వమే. అయినచో పద్య మేల

వ్రాయవలెను ? రసవంతమగు గద్యమే వ్రాయరాదా ? పద్యము వ్రాసినపుడు యతిప్రాస లుంచరాదా' అందురా? అది ప్రశ్న గాదు. కవికిఁదోచిన భావము పద్యమునందు గణనీయమును బొంది యొకవిధ మగు సంగీతమునకు బద్ధ మై చిత్తాకర్షకతను వహించి మాధుర్యమును గూర్చుచున్నది. గద్యమునందు గణ నియమము లేకపోవుటచే సంగీతమునకు బద్ధము కాక చిత్తాకర్షణశక్తి లేని దై రసస్ఫూర్తియందు గొఱవడి యున్నది. మఱియు నొకటే భావమును గద్యము నందును, బద్యమునందును వ్రాసిచూడుఁడు. అప్పుడు మీ ప్రశ్నకుఁగల విలువ మీకే తెలియఁగలదు. కనుక యతిప్రాసలు తీసివేసినచో రసపిండము లగు కావ్యములు వెడలు ననుట నిస్సంశయము''— అని.

ఈమతములం దున్న సత్యాసత్యములను మనము విచారింపవలెను. అందు ముందు ఈయతిప్రాసలనియమము ఇతర భాషలలోఁ గూడఁ గలదా ? మనభాష యందు వీనిని నియమించినవారి అభిప్రాయ మేమి ? వారి అభిప్రాయ మెంత సమంజసము ? అను విషయమును బరిశీలింతము.

సంస్కృతభాషలో యతి, విశ్రాంతి, విరతి, విశ్రామము మొదలగునవి పర్యాయపదములు. ''యతి ర్విశ్రామ సంజ్ఞికా'' అని లక్షణము చెప్పఁబడినది. అనఁగాఁ బద్యపాదమును రెండువిభాగాలుగాఁ జేసి మొదటిభాగము చివరఅపుట, రెండుభాగములును ఏకసమాసాంతర్గతములై కూడ నుండవచ్చును. కాని ప్రథమ భాగాంతాక్షరమును, ద్వితీయభాగాంతాక్షరమును, ద్వితీయభాగాద్యక్షరమును ఏక పద గతములై యుండరాదు. కాని ఆంధ్రమందువలె సంస్కృతమున ప్రాసమే లేదు. కాని అంత్యప్రాసము గలదు.

''వృద్ధోయాతి గృహీత్వా దండం
తదపి న ముంచ త్యాశాపిండమ్.''.

ఇట్టి స్థలములందు అంత్యప్రాసము ఆంధ్రమందు పోతనకవిత్వమునందువలె హృద్యముగా నుండును. నిజమునకు మామూలు ప్రాసముకంటె అంత్యప్రాసము శ్రావ్యతరముగా నుండును అని నాతలంపు ద్రావిడకర్ణాటభాషలలోఁగూడఁబ్రాస నియమము గలదు. కాని యతినియమము లేదు. ''కన్నడక్కె యతి యిల్ల; కోణక్కె మతి యిల్ల'' అను కన్నడపు సామెత గలదు. అనఁగా కన్నడమునకు యతి లేదు. దున్నపోతునకు మతి లేదు అని అర్థము. ద్రావిడ భాషయందును

యతి లేదు. ఈ ప్రాస సంప్రదాయము ద్రావిడకర్ణాటభాషల నుండియు, యతి సంప్రదాయము గైర్వాణము నుండియు వచ్చియుండు నని నా తలంపు. యతికి సంస్కృతమునందువలెనే ఆంధ్రమునందును స్థాననియమ మేర్పఱచిరి కాని ప్రథమభాగాంతాక్షరమును, ద్వితీయభాగాద్యక్షరమును ఏకపదగతములై యుండరా దను నియమమును బాటింపరైరి. ఆంధ్రభాషలో ఈ యతి ప్రాసముల నేర్పఱచిన వారి అభిప్రాయము ఏమయి యుండునన్నచో, ద్రావిడకర్ణాటక భాష కంటె నియమబాహుళ్యముచే గొప్పఁదనము కలుగునని.

ఈ యతి ప్రాసములవలన రసస్ఫూర్తి కలుగునా? అనునది యొకప్రశ్న. తెలుఁగుభాషలోఁ బెక్కుసామెతలు యతిప్రాసములు గలిగియుండి రసస్ఫూర్తినిఁ గలిగించుచున్నవి- ''అంగటిలో అన్నీ ఉన్నవి - అల్లునినోట శని ఉన్నది;'' ''అప్పు లేకపోతే - ఉప్పుగంజి మేలు;'' ''అన్నీ ఉన్నవి - ఐదోతనము లేదు;'' ''ఉభయభ్రష్టత్వం - ఉపరిసన్యాసం;'' ''బ్రాహ్మణులలో చిన్న - బెస్తలలో పెద్ద;'' ''చచ్చినా పైకం దప్పు-దచ్చమ్మా నను తిట్టకు.''- ఇట్టితావులందు యతిప్రాసలు రసోత్పాదకములు గావని యెవరును జెప్పరు. రసోత్పాదక మనఁగా సౌందర్యోత్పాదకము అన్నమాట. ఈ సామెతలందువలె ఆంధ్రపద్యము లందు యతిప్రాసలు రసోత్పాదకముగా లేవు. దీనికిఁ గారణములు మూఁడు :

1. ఏఅక్షరమున కాయక్షరమును యతిస్థానమం దుంచకుండుట ;

2. యతిస్థానము సంస్కృతమునవలె విభక్తము గాకుండుట;

3. పాదమునకుఁ బాదమునకు ప్రాసాక్షరము దూరమై యుండుట.

ప్రాసాక్షరము సమీపమం దున్నచో అనుప్రాసమునందువలె ఇంపు గలుగును. దూరముగా నున్నచోఁ గలుగదు. ఇప్పటియతులలో వర్గయతియొక్కటియే శ్రావ్యతను గలిగించును గాని మఱేదియుఁ గలిగింపదు. సంస్కృతము నందును గొన్నిస్థలములం దీయతి పై సామెతలందు వలెఁ గనఁబడుచు శ్రవణసుఖము నిచ్చుచున్నది.

వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే.
అథ ప్రజానామధిపః ప్రభాతే.
నారాయణాయ నళినాయతలోచనాయ.

కనుక యతిస్థానమును విభక్తము గావించి ఏయక్షరమున కాయక్షరమును యతిగా నుంచినచో యతిశైలికి సొంపు నిచ్చి తద్ద్వారా రసోత్పాదనము కావచ్చును.

ఇఁక ప్రాస. నాలుగుపాదములకు ఏకాక్షరమునే నియమించుట మాని అదే పాదమునందు దగ్గరగా నేర్పఱచినచో శైలికి సొంపును, తద్ద్వారా రసమును ఉపస్కారకమును గాఁగలదు. ఎట్లన :

ఉ. అంతట సంతసంపడుచు అంబురుహానన వచ్చి భర్తపా
దమ్ముల కాదర మ్మెసఁగ దండము పెట్టియుఁ బల్కె నోప్రియా !
కన్నులకర్వు దీఱ నిను కాంచుట యెన్నఁడు కల్గు నంచు నా
దేవుని వేవిధంబులను దైన్యముతో సతతంబు వేడితిన్.

ఈ పద్యములో 1, 2, 4 పాదములలో ప్రాసాక్షరమునకు సమీపమందే ప్రాసము వేయఁబడినది. మూఁడవపాదములో ప్రాసము లేదు. ఉండఁగూడ దని నియమముకాదు. 'కన్నులకర్వుదీఱ' అనునది జాతీయము. ప్రాసకొఱకు దానిని విఱిచి వేయుట రసభంజక మగును. కనుకఁ దీసివేయ బడినది. మఱియును గద్యమునకును, బద్యమునకును ఒక్కటే వ్యాకరణ ముండుట యుక్త మని తోఁచదు. కవికి గద్యమునందుఁగల స్వాతంత్ర్యము పద్యమునం దుండదు. గణనియమమునకు దాసుఁడై యుండవలయును. అందుచే గద్యమునవలెఁ గాక భాషను స్వతంత్రముగాఁ ద్రిప్పుకొన వలసియుండును. అట్టి సమయములందు విసంధి మొదలగునవి దోషములు కా వనియు, యతి మొదలగువాని స్పష్టశ్రవణమునకై విసంధి మొదలగునవి తప్పకయుండుటయే మే లనియుఁ దోఁచుచున్నది. కనుకనే పైపద్యములో విసంధి చూపఁబడినది. గద్యపద్యములకు ఒకటే వ్యాకరణము గూడదను పరి భాషకు పూర్వకవుల వ్యాకరణవిరుద్ధప్రయోగములే జ్ఞాపకత్వము వహించుచున్నవి.

ఆంధ్రకవిత్వమునకు యతిని నియమించిన లాక్షణికులు పు, ఫు, బు, భు, ము - లకుఁ బరస్పరము మైత్రి చెప్పి, ప, ఫ, బ, భ, మ - లకుఁ గూడదనిరి. ఈ యక్షరములు ప్రత్యేకముగా వారికిఁ జేసిన మహాపకార మేమియో తెలియదు. మఱియును మైత్రిని జెప్పుటలో వ్యంజనములకు స్వరసాహిత్యముయొక్క మైత్రియు నిర్బంధముగా విధించిరి. పైసామెతలలో 'బ్రాహ్మణులలో చిన్న-బెస్తలలో పెద్ద' అను సామెతలో 'బా - బె' లకు యతి చెప్పఁబడినది. అందువలన రసభంగము అగుటలేదు. రసభంజకము కానప్పుడు స్వరమైత్రి యేల ఆవశ్య

ముగా నుండవలెనో తెలియకున్నది. కాని దయాపరు లగు లాక్షణికులు యతు లలోవలెనే ప్రాసములందును స్వైరమైత్రిని విధింపక కవికి స్వాతంత్ర్యం మిచ్చి నందులకుఁ గవి వారికిఁ గృతజ్ఞత చూపవలెను. కనుకఁ బైని నేను సూచించి నటులు యతిప్రాసములు పద్యమునకు సౌందర్యము నిచ్చు ననుటలో సందేహము లే దని నా మతము. ఒకానొకచో రసముకొఱకు యతిప్రాసములు విడిచినను హాని లేదు - ("కన్నుల కర్వుదీర" యందువలె). ఈ విషయమున నావ్రాసిన పద్య ముల నిం దుదాహరింతును :

క. శ్రీకృష్ణదేవరాయ
క్ష్మాకాంతు జన్మదినము మనరాజేశ
క్ష్మాకాంతు నాధిపత్యము
మాకుం బండుగలమీఁదఁ బండుగలు గదా!

మ. కనుచుండం గనె తెంపి యెల్ల విరులన్ గల్పించెఁ బూఁజెట్టు నూ
తనవైధవ్యముఁ గొన్న బాలఁగ దయాదాక్షిణ్యముల్ మాని ఆ
తని కీక్రౌర్యము కాదుకూడ దని బోధల్ సేయదో ? అంతరా
త్మ నిగూఢంబుగ, నంతరాత్మయును లేదో? వాని కేలేశమున్ ?

ఈరెండుపద్యములందును నాలవపాదమునందు యతి భ్రష్ట మయినది. కాని పోయిన దని చెప్పవలెకును దోఁపదు. ఏలన, అందలి భావసౌందర్యము పైకి హృదయము పోవును గాని యతిపైకిఁ బోదు.

మనము పద్యము చదువగానే బాగుగా నున్న దని చెప్పుదు రనుకొనుఁడు. వారిలో ఎంతమంది రసమున కానందించుచున్నారో, యతిప్రాసముల కెంత మంది ఆనందించుచున్నారో విచారింపుఁడు. పైని మొదటిపద్యములోని 'పండు గల మీఁదఁ బండుగలు' అనునది నానుడి. మాకున్ అకుమకారముతో యతి సిద్ధించుటకై యీ నానుడిని ఎగురఁబెట్టుట భావ్యమా? నానుడిద్వారా సిద్ధించు సౌందర్యము కొఱకు యతినిఁ దీసివేయుట యుక్తమా? లాక్షణికులారా! యోజింపుఁడు. మీ రొకవేళ "పండుగల మీఁదఁ బండుగలు గదా" అనుదానిని యతిత్వసిద్ధికై మంగళముమీఁదఁ "మంగళము గదా !" యనరాదా ? అప్పుడు సౌందర్యముచెడదు గదా అనవచ్చును. మంచిది. కాని 'పండుగలమీఁదఁబండుగలు' అనునానుడిలో నున్న సౌందర్యము 'మంగళముమీఁదఁ మంగళము గదా!' అను దినుకారములో లే దని నాతలంపు. ఏలన, రెండవది మొదటిదానికి సంస్కృతీకర

ణము. ఈ రెండింటికిని సహజమునకును, కృత్రిమమునకును గల భేదమే యుండును.

ఇఁక రెండవ పద్యములో నాల్గవపాదమునందు యతిత్వసిద్ధికై 'లేదో' అనుదానిని 'లేదా' అనరాదా అని మీ రడుగవచ్చును. మంచిది. కాని 'లేదా' అనునప్పటి అర్థము వేఱు. 'లేదో' అనునప్పటి అర్థము వేఱు. అర్థము మాఱి నచో అందము చెడును. దానితో రసభంగము. కనుక యతిత్వసిద్ధికై భిన్నార్థమును గలిగించి రసభంగముఁ జేయుట న్యాయమా? యతి భగ్నమైనను రసము పోషించుట న్యాయమా? విచారింపవలెను. కవిత్వమునకు జీవితము రస మని ఎల్లరును అంగీకరింతురు. మీరును భిన్న మని చెప్పరు. ఇట్టి యిక్కట్టులు గలిగినప్పుడు వృత్తమునే మార్చుకొని నానుడులు పోకుండను, భిన్నార్థకము రాకుండను, మఱియొక వృత్తములో వ్రాయరాదా అని మీ రడిగినచో, లక్షణమునందుఁ గల అభిమానముచేఁ జెప్పుచున్నారు గాని రసదృష్టితోఁ గాదని విస్పష్టము.

అదియుఁగాక కవి పద్యమును ప్రారంభించినపుడు ఫలానిపద్యమును వ్రాయవలె నని యనుకొనఁడు. అప్రయత్నముగా నేదో పద్యము ప్రారంభింపఁబడును. దానిని నడుపుచున్నప్పు డిట్టినానుడి తోఁచఁగానే అది ఆ పద్యమునకు సరిపోయి యింపు నింపఁగాఁ, గేవల యతిప్రాససిద్ధికొఱకు సౌందర్యమును ధ్వంసమొనర్చి పద్యమంతయు మార్చి, అట్లు సరిపోవువృత్తములో వ్రాయుమనుట కేవలలాక్షణికులకుఁ జెల్లునుగాని కవులకుఁ జెల్ల దని నామనవి. కనుక నానుడులకు భంగము వాటిల్లునపుడును, భిన్నార్థముచే రసభంగ మగునపుడును, మఱే విధముగాఁ గాని రసము తగ్గునపుడు ఔచిత్యమునకు లోపము రాకుండ లక్షణమును ద్రోసిరాజని రసమును బోషించుటయే నిజముగా కవికి అర్హకృత్యము.

యతిప్రాసలు తీసినంతమాత్రమునఁ జాలదు. అదియంతయుఁ గవిత్వము కాదు. యతిప్రాసలు లేని కొఱంత లేకుండ రసము గురిపించవలెను. అప్పుడు గాని ఆ కవిత్వము కవిత్వము గాదు. నిశ్చయమునకు నిర్బంధము లున్నప్పటి కంటె లేనప్పుడే కవికిఁ గష్ట మెక్కువ యని నా యభిప్రాయము. అప్పుడు పద్యమునం దొకవ్యర్థపద మున్నను రోఁత పుట్టించును. ఇప్పుడు యతిప్రాస స్థానము లందలి వ్యర్థపదములతో సగము పద్యము నిండియున్నను అడుగువారు లేరు. యతిప్రాసములు తీసివైచిన వైలక్షణ్యము కవిత్వమునఁ జూపవలెను. కానిచో

లాభము లేదు. కావున యతిప్రాసము లుండుటయే ఆవశ్యక మని యెంచినవారు పైమార్పులు చేసికొన్నఁగాని వానివలన సౌందర్యస్ఫూర్తి కలుగదు. మఱియు యతులలో వర్గయతిని మాత్రము స్వీకరించి దానిపై స్వరమైత్రిని వివర్జించుటయు నర్హము.

యతులు తీసివేసి వ్రాసిన నాపద్యములఁ గొన్ని యిట నుదాహరింతును.

*ద్వీపాంతరవాసము*

గీ. భటుల నా పేరు పెట్టి ముమ్మారు పిలిచి
రేను దద్ధర్మసభ కేఁగి కేలుదోయి
కట్టుకొని ప్రాడ్వివాకుని కట్టెదుటను
నిలిచియుంటిని గుండెలు కొట్టుకొనఁగ.

గీ. వారు నను గ్రుచ్చిగ్రుచ్చి ప్రశ్నములమీఁదఁ
బ్రశ్నములు వేసి దోషిగా నిశ్చయించి
నాకు ద్వీపాంతరప్రవాసంబు శిక్ష
వేసి పంపిరి నే నెంత మొత్తుకున్న.

సీ. ఒకసారి రెక్కల నూఁగించుచును మింటఁ
బఱచెడు పులుఁగులబంతిఁ గాంచి
ఒకతేప వాత్యాటిధూతంబు లై కడుం
గడుఁ బాఱుతెంచు మేఘములఁ గాంచి
ఒకమా రనంతసాగరము భేదించి యా
వలిగట్టు చేరు నావలను గాంచి
ఒకసారి యంత్రసామగ్రీబలంబుచేఁ
జదలఁ బర్విడు విమానములఁ గాంచి

గీ. తద్గతుల నభ్యసింపంగఁ దలఁచి తలఁచి
బిక్కమొగమునఁ బరికించి దిక్కు లకట!
దుర్మనాయమానుండ నై తొట్రుపడుచు
సంచరించుచు నుంటి నీస్థలమునందె.

గీ. ఇంక నీజన్మతో నాకు శిక్ష దప్పి
నీముఖాంభోజమును గాంచి యెల్లవేళలు
మఱచి ముచ్చటలను నాడుకొనుచునుండు
భాగ్య మది నాకుఁ బట్టునే ప్రాణసఖుఁడ.

ఇందు మనుష్యజన్మము ద్వీపాంతరవాసశిక్షగా రూపించి యందున్న శిక్షితుఁడు తన్మోక్షమునకు అవస్థపడుట చెప్పఁబడినది.

ఇందు కొన్నిస్థలములందు యతి యప్రయత్నముగాఁ బడినది. అట్లు గానిచోఁ బ్రయత్నింపఁబడలేదు.

యతిప్రాసలు తీసివేసినచో హాని లేదని నా మతము. మంచి కావ్యములు వ్రాయవచ్చు నని నా మతము.

—ఆంధ్రపత్రిక,
ప్రమోదూత సంవత్సరాది సంచిక.
1930-31 సంచిక : 21.

—(o)—

# పాళి - తెలుఁగు

—శ్రీ వింగళి లక్ష్మీకాంతం

ఆంధ్రభాష ద్రావిడమా, ప్రాకృతమా యను సందేహ మొకటి జిజ్ఞాసువులైన మనపండితులఁ బ్రస్తుతము పట్టి బాధించుచున్నవిషయము. పూర్వము మన వైయాకరణులు, ఆంధ్రము తత్సమ తద్భవ దేశ్యాత్మక మనియు, నందు సంస్కృత సమప్రాకృతసమములు తత్సమము లనియు, సంస్కృతభవప్రాకృతభవములు తద్భవము లనియు, దేశ వ్యవహారసిద్ధమైనది దేశ్యమనియు నిర్వచించిరే కాని, యది ద్రావిడ మగునో కాదో వారు విచారణ చేయరైరి. వారికా శంకయుఁ బొడమి యుండదు.

అట్లుండగా, బిషప్పు కాల్డువెలు తెలుఁగుభాష ద్రావిడభాషావర్గమున జేరినదనియు, ఆ వర్గము సంస్కృతముకంటెను ప్రాకృతముకంటెను స్వతంత్ర మైన సంప్రదాయముకల దనియు, చిల్లరబాస లటుండ, అఱవము, తెలుఁగు, కన్నడము, మళయాళము అను నాల్గుపెద్దభాషలు, తత్సంప్రదాయమునుబట్టి సజాతీయము లనియు నొక సిద్ధాంత మేర్పఱిచెను.

లోకమున భాషాతత్త్వము లారసి, తజ్జన్యజనకభావములను, సోదరభావములను నిర్ణయించు పండితు లెల్లరు సాధారణముగ రెండు ప్రమాణముల నాధారముగఁ గైకొందురు. అందు మొదటిది శబ్దసామగ్రి. రెండవది పదవాక్యకల్పనాసరణి. కాల్డువెలుకూడ ఆ రెండు ప్రమాణములు పురస్కరించుకొనియే పైన పేర్కొన్న సిద్ధాంతము నేర్పఱిచెను. ఆంధ్రాదులైన నాల్గుభాషలలోని దేశ్యశబ్దజాలము, కొంత సరూపమై యుండుటయు, ఆ భాషల పదకల్పనాపద్ధతియు, వాక్యఘటనా సరణియు సమానమై, సంస్కృత ప్రాకృతసరణి కంటె భిన్నముగా నుండుటను బట్టి యాపండితుఁడు ద్రావిడభాషలు స్వతంత్ర సంప్రదాయబద్ధము లనియు, సాజాత్యము లనియు నిర్ణయించెను.

ఈ సిద్ధాంతము జాతినేల వేరుపాఱినవృక్షమువలె భాషాప్రపంచమున స్థిరముగా నెలకొనెను.

ఇటీవల డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు కొంత శ్రమచేసి, కాల్డువెలు సిద్ధాంతము పూర్వపక్షము చేయు ప్రాకృతవాదమును వెలయించిరి. ఆ ద్రావిడ మనునదికూడ నొక ప్రాకృత విశేషమేయని వారి మతము, ఈ మతము నూతనభావ మగుటచే నింకను సర్వజన సమ్మతము కాలేదు. సత్యదర్శనమే జిజ్ఞాసకు లక్ష్యము గాన, ఆ నారాయణరావుగారి మాటలను త్రోసిపుచ్చక పండితులు విచారింపఁ దగుదురు

ఆంధ్రమున దేశ్యముగా గ్రహింపఁబడిన శబ్దజాలము, ప్రాకృతభవమే యని నారాయణరావుగారు కొంతవఱకు సమర్థించి చూపిరి. ఆ విషయమై యింకను బరిశోధనలు సాగునేని దేశ్యశబ్ద ప్రపంచమంతయును ప్రాకృతభవమే యని తేలునేమో? అట్లే యగుచో, మన పద వాక్యకల్పనాది విశేషములకును, ప్రాకృతపదవాక్యకల్పనాది విశేషములకును సామరస్యము పొసగునా, పొసగదా యను దానిని గూర్చి పిమ్మట విచారింతము.

మొదలు మన దేశ్యపదములు పోల్చిచూచుట యేప్రాకృతముతో? షడ్విధ ప్రాకృతములలో నేది, ఆంధ్రమునకు గాని, సాధారణ ద్రావిడమునకు గాని ప్రభవ కారణమై యుండును ? గాథాసప్తశతి, సేతుబంధము లోనగు కొన్ని గ్రంథములు దక్క ప్రాకృతసాహితీ గ్రంథములు పెక్కు లభింపవు. కాగా మన మేప్రాకృత సాహిత్యమును ఆధారముగాఁ గొని యీ పరిశోధన చేయవలెను?

ప్రథమమున పాళీభాష మనకు శరణ్య మగునని నా యభిప్రాయము. ఆ భాష ప్రాచీనతరమైన ప్రాకృతము. అందు గ్రంథజాలమును విస్తారము గలదు. అదియు బౌద్ధధర్మాశ్రయ మగుటచేఁ దొల్లిటినుండియు సహజశుద్ధ స్వరూపమును గోల్పోక నిలిచియున్నది.

మఱియు నాగరాజులు, ఆంధ్రరాజ్యము పాలించిన కాలమున బౌద్ధమత మున కాశ్రయ మిచ్చిరి. అది క్రీ. పూ. ఐదాఱుశతాబ్దముల ముచ్చట. పిమ్మట క్రీ. పూ. రెండవశతాబ్దిని ఆంధ్రభృత్యుఁ డగు రాజొకఁడు మగధరాజ్యమును జయించి యేలెను. ఇవి చరిత్రప్రసిద్ధములైన విషయములు. కనుక మనమును, మాగధులమును బూర్వకాలమున సన్నిహితబంధువులము. మాగధులభాషయే మాగధి. అదియే పాళీభాషకు మొదలింటిపేరు. కాగా పాళీభాషకును, ఆంధ్ర భాషకును ఏమేని సంబంధ ముండునేమో విచారించుట లెస్స. ఓపికమై పని

చేసినచో ప్రయత్నము రిత్తపోవదు. వింతగొల్పు విషయము లెన్నో బయల్వెడలు చుండును. సిద్ధాంతములు చేయుటనుగూర్చి పదపడి సమయ మగునెడ విచారింతము. నిదర్శనార్థము కొన్ని పదములు చూపెదను. చిత్తగింపుడు-

1. బొంది = శరీరము. ఇది శబ్దరత్నాకరమున దేశ్యముగా నుదాహృతమై యున్నది. కాని యిది పాళీభాషలో నున్నది. ఉదా : మహతీ వత తే బొంది నచపఞ్ఞా తదూపికా - (శుంశుమార జాతకగాథ). అర్థము : నీ శరీరము పెద్దదే కాని, ప్రజ్ఞ తదనురూపము కాదు.

2. పస్తాయించు – శబ్దరత్నాకరమున, నిది దేశ్యక్రియగా నీయఁబడినది. దీనికి ఆ నిఘంటువున లేని యింకొక రూపముగూడ నున్నది, "పచ్చాయించు" అని ఆ రూపము వాడుకలో నున్నది.

ఈ క్రియయు పాళీభాషలో నున్నది. ఉదా : సుంసుమారో పఞ్ఞాయంతో అత్తనో నివేసనట్ఠానం గతో (శుంశుమార జాతకము)= (మొసలి పస్తాయించుచు దన నివేశన స్థానమునకుఁ బోయెను.)

3. ఓర-ఇది యుగళపద మనియు (కొన్ని యర్థములయందు దేశ్యమును మఱికొన్ని యర్థములయందు వైకృతమును నైన పదము). దేశ్య మయినపుడు "అంచు","ప్రక్క"అని యర్థమనియు శబ్దరత్నాకరమున నున్నది. "దిగువ" "అంచు","ప్రక్క" అను నర్థమున, పాళీభాషలోఁగూడ ఈ పదమున్నది. ఉదా : దీపకస్స ఓరతో నదీ మజ్ఝే ఏకోపిట్టి పాసాణో అత్థి (వానరేంద్ర జాతకము)-(లంకయోర, ఏటినడుమ, నీటిమట్టమునకు పైగా నొక ఱాతిబండకలదు).

4. కూల్చు=పడచేయు: చంపు.

5. ఒడ్డు=పఱచు; ఒగ్గు; సాచు.

ఈ క్రియలును, దేశ్యము లనియే శబ్దరత్నాకరము. ఇవియు పాళీభాషలో కానవచ్చుచున్నవి. ఉదా : పోట్ఠపాదో ముమ్మురే ఉపకూళితో. (పోష్ఠపాదుఁడు. దాలిగుంట నిప్పులోఁ గూల్పఁబడెను). ఉదా : మిగలుద్దకో, పాసం ఒడ్డేత్వా అగమాసి (మృగలుబ్ధకుడు పాశ మొడ్డి వెళ్ళెను).

ఇవి దిక్ప్రదర్శకముగాఁ జూపితిని. ఇట్టివి మఱియెన్నియో కలవు. మఱి యెన్నియేని లభింపవచ్చును.

ఇప్పుడు, మనలో, పెద్దలు కొందఱు పాళీగ్రంథములు తెలిగించుచున్నారు. అది యెంతేని ప్రశంసార్హమైన కార్యము. వారు ఆంధ్రశబ్దములతో సారూప్యముగల యిట్టి పదములను సేకరించి ప్రచురించెదరేని భాషాచరిత్ర కెంతేని యుపయోగించును.

—భారతి

ప్రమోదూత-ఫాల్గుణము

1931. మార్చి :: సంపు. 8; సం. 3.

—::—

# భాషాశాస్త్రము - దాని క్రమాభివృద్ధి

—శ్రీ కోరాడ రామకృష్ణయ్య

భాషాశాస్త్ర మనునది యిటీవలికాలమున, అనఁగా నవీనయుగమున వృద్ధి నొందిన శాస్త్రములలో నొకటి. ఇది పాశ్చాత్యదేశములందు ముఖ్యముగా నైరోపా దేశమునఁదలి పండితులచే వృద్ధి నొందింపఁబడిన శాస్త్రము. అయితే ఐరోపాదేశ మున నీశాస్త్ర మభివృద్ధి యగుటకు ముఖ్యకారణము క్రీ. శ. 18వ శతాబ్దాంత మున నాదేశమువారికిఁ గలిగిన సంస్కృతభాషాజ్ఞానమే. దీనిఫలిత మపారమైనది. ఆంగ్లకవి యగు షేక్స్పియర్ దయాగుణమునుగూర్చి చెప్పినట్లుగా నీసంస్కృతభాషాజ్ఞానము కూడ "It blesseth him that gives, and him that takes"- ఇచ్చినవానికిని, పుచ్చుకొన్నవానికి నత్యంతలాభదాయకమై ఉభయతారక మైన దనవచ్చును. భాషాతత్త్వమునుగూర్చి చీఁకటిలో తడవులాడుకొనుచుండిన పాశ్చాత్య విద్వాంసుల కిది నూతనాలోకమును గల్పించినది. దీనివలన వారిలోఁ గలిగిన చైతన్యమును జూచి ప్రబోధమును బొందిన ప్రాచ్యులును తదాలోకమున తమ పూర్వులు సంపాదించి పెట్టిన విజ్ఞానరాసులను గుర్తించి పైకితీసి ప్రకాశింపఁజేయ మొదలిడిరి. పశ్చిమదిక్కునుండి వచ్చిన యీ నూతనాలోకము మూలముగా హైందవ విజ్ఞానము నూతనరాగరంజితమై మరింత వెలుగొందఁ జొచ్చినది. వేదములు, వేదాంతములు, పురాణములు, శాస్త్రములు, సాహిత్యము, వ్యాకరణము, ఆయుర్వేదాదివిద్యలు, కళలు, బౌద్ధజైన శైవవైష్ణవాదిమతవాఙ్మయములు మొదలగునవనేకములు నూతనచైతన్యముతో, నూతనకాంతులతో ప్రకాశింపఁజొచ్చినవి. అట్టివానిలో నీభాషాశాస్త్ర మొకటి. దీనియభివృద్ధికి సంస్కృతభాషాజ్ఞానమే కారణమైనను, అది పాశ్చాత్యదేశములందే పెంపొంది యిటీవలనే మనదేశమునకు వచ్చినది. దానిఫలములు నిప్పుడిపుడే చవిజూచి యానందింపఁగలుగుచున్నాము. కావున సంస్కృతభాషాజ్ఞానమీయాధునికశాస్త్రాభివృద్ధి కెట్లు తోడ్పడినదో తెలిసికొనినగాని దీనిక్రమాభివృద్ధి యెట్టిదో తెలిసికొనినవారము కాలేము.

వాస్తవముగా నాధునికభాషాతత్త్వశాస్త్రమునకు పునాది హిందూదేశముననే-వైదికయుగముననే-వేయఁబడినది. ఇట్టి భాషాతత్త్వపరిశీలనకుఁ గడంగినమరి

యొక పురాతనదేశము గ్రీసు. ఈ దేశమునను క్రీ. పూ. 3, 4 శతాబ్దముల కాలమున గ్రీకుతత్త్వవేత్తలు భాషాస్వరూపమునుగూర్చి భాషావిభాగములనుగూర్చి విచారింపఁ దొడగిరి. కాని యూరపుదేశములో 18 శతాబ్దిచరమభాగమున సంస్కృత భాషాజ్ఞానము వారికి కలుగువరకు, భాషాశాస్త్రమున చెప్పుకొనఁ దగినంత అభివృద్ధి కలుగలేదు. కాని భారతీయులు క్రీ. పూ. అనేక శతాబ్దముల క్రిందనే భాషావిషయక చర్చలను, భావాతత్వపరిశీలనమును ప్రారంభించిరి.

వేదములలో 'వాక్' ఒక దేవతగా భావింపఁబడి అనేకవిధముల స్తుతుల నందినది. భాషాప్రభావమునుగూర్చి యాకాలమువా రాశ్చర్యచకితు లైనట్లగపడును. భావమునకును, భాషకును గల సంబంధ మెట్టిది? మన భావముల నాయాధ్వనులచే నెట్లు వ్యక్తము చేయఁగలుగుచున్నాము? భాష ముందా, భావము ముందా? ఈ మొదలగు ప్రశ్న లాకాలమువారికిఁ గలిగినవి. వానికి సమాధానము లనేకములగు కథలమూలమునను, ఐతిహ్యములమూలమునను, మంత్రబ్రాహ్మణములలో వారు సూచించియుండిరి. ప్రధానముగా వారిదృష్టి యాంతరంగికము, ఆధ్యాత్మికము నగుటచే తదనుగుణముగనే యీ వాగర్థముల సంబంధమును నిర్వచింపసాగిరి. ఋగ్వేదములో వాక్కు ఒక దేవతగా భావింపఁబడినది. ఆ దేవత శక్తిస్వరూపములను గూర్చి యనేకవిధములగు స్తోత్రములు చేయఁబడినవి. ఋగ్వే. 10 మం. 125 సూక్తములో "అహమేవ స్వయ మిదం వదామి జుష్టం దేవేభి రుతమానుషేభిః. యం కామయేత త ముగ్రం కృణోమి తం బ్రాహ్మణం. తం ఋషిం, తం సుమేధాం"-తా నెవనిని ప్రేమించునో వానిని వీర్యవంతునిగను, బ్రహ్మస్వరూపునిగను (ఋషి), మేధావంతునిగను జేయుదు నని వాగ్దేవత చెప్పినట్లు తెలుపఁబడినది. ఈ దేవతయే ప్రజాపతికి సహచరియై లోకమందు అర్థసృష్టికి కారణమగును. కావుననే వాగర్థములు పార్వతీపరమేశ్వరరూపములు. వీని కవినాభావము. అనగా సృష్టి లోని వస్తువులకును వానిని బోధించు శబ్దములకును అవినాభావసంబంధము సూచితము. శబ్దార్థములసంబంధము నిత్యమని వైయాకరణులు, "సిద్ధే శబ్దార్థసంబంధే" యని భాష్యకారుఁడు పతంజలి వ్యక్తము చేసినాఁడు. శక్తిస్వరూప మగు శబ్దబ్రహ్మమే అర్థభావమున వివర్తమును బొందుటచే జగత్సృష్టి కలిగిన దను భావమును వైయాకరణభూషణకారుఁడు వెల్లడించుచున్నాఁడు. ఈ శబ్దబ్రహ్మభావమే వైయాకరణుల స్ఫోటవాదమునకు మూల మైనది. ఇది ఋగ్వేదమున

దెలుపఁబడిన వాగ్దేవతాప్రజాపతుల సహచరభావమును, సృష్టికారకత్వభావమునే యనువదించుచున్నట్లున్నది. బ్రాహ్మణములలోఁగూడ భావము-భాషలకుఁ గల సంబంధమును గూర్చిన కథలు గలవు. అవ్యాకృత మైన వాక్కు నింద్రుడు తొలుత వ్యాకరించినట్లు సూచించుకథ యొకటి శతపథబ్రాహ్మణమున గలదు. దీనినిబట్టి యీభాషకు తొలుత ఇంద్రుఁడే వ్యాకరణకర్త యయియుండు నని తెలియు చున్నది. పాణిని వ్యాకరణము బయలుదేరిన పిదప, నంతకుఁ బూర్వమునఁ గల వ్యాకరణములతోపాటు ఈ ఐంద్రవ్యాకరణముగూడ నశించినట్లు సోమదేవుని కథాసరిత్సాగరమఞ్జరి యొక కథనుబట్టి తెలియవచ్చుచున్నది. ఏమైనను పాణి నికి చిరపూర్వమే మంత్రబ్రాహ్మణులకాలమునుండి భాషాతత్త్వవిమర్శన మీదేశ మున జరుగుచునే యున్న దనుట స్పష్టము. వేదములందలి స్వరవర్ణోచ్చారణ రీతులు మారిపోకుండ అరికట్టుటకై 'ప్రాతిశాఖ్య' లను గ్రంథములు రచింపఁ బడినవి. ఇట్టి స్వరవర్ణోచ్చారణరీతులను దెలుపు భాగమునకు 'శిక్షాధ్యాయ' మని బ్రాహ్మణములలో పేరు పెట్టబడినది. "అథ శిక్షాం వ్యాఖ్యాస్యామః, వర్ణః స్వరః మాత్రాబలం, సామసంతానః ఇత్యుక్త శిక్షాధ్యాయః" అని తైత్తిరీ యారణ్యకము. ఇచ్చట వర్ణములు (letters), స్వరము (accent), మాత్ర (quantity) - హ్రస్వదీర్ఘప్లుతములు, బలం (organs of pronunciation), వర్ణోత్పత్తిక్రమము, సామ (delivery), ఉచ్చారణ రీతి, సంతానము (euphonic laws), వర్ణముల కలయిక, అందువలన గలుగు మార్పులు- వీనినిగూర్చి యీ శిక్షాధ్యాయము చెప్పుచున్నది. ఆధునికభాషాశాస్త్ర మం దవి యన్నియు ధ్వనిశాస్త్రము (Phonetics) అనుశాఖలోఁ జేరుచున్నవి. ప్రాతి శాఖ్యలనాటికే విభక్తులు సప్తసంఖ్యాకము లని నిరూపింపఁబడినది. యాస్కా చార్యుఁడు 'నామాఖ్యాతోపసర్గనిపాత'ములను భాషాభాగములను బేర్కొని యున్నాఁడు ఈతఁడు రచించిన నిరుక్తగ్రంథము మూలముగా నాకాలముననే భాషాతత్త్వపరిశీలన మీదేశమున నెంత యభివృద్ధి గాంచినదో వ్యక్తమగు చున్నది ఈతఁడు క్రీ పూ. 700 సం॥ల నాటివాఁడు. అంతకు పూర్వమే యెన్నో మతములు భాషా తత్త్వపరిశీలకులలో నున్న ట్లీతడు వారి ననువదించుట వలన దెలియవచ్చుచున్నది. "నైఘంటుకులు, నైరుక్తులు, వైయాకర ణులు, ఐతిహాసికులు, కాల్పనికులు, నైదానులు" మొదలగువారి యభి ప్రాయముల నీతఁ డనువదించినాఁడు. వేదములయందలి ప్రతిశాఖనుగూర్చి, యందలి వాక్యములు, పదములు, అక్షరములు, ధ్వనులు మొదలగువానిని వ్యాకరించి రచింపఁబడిన ప్రాతిశాఖ్యలే ఆ కాలమునందు జరిగిన భాషా పరిశ్రమకు నిదర్శనములు. యాస్కాచార్యులు ధాతువులనుండి శబ్దముల వ్యుత్ప త్తిని దెలుపుచు నందుఁగలుగు ధ్వని పరిణామముల నాధునిక శబ్దశాస్త్రజ్ఞుల

రీతినే వ్యక్తపరచినాఁడు. 'గం' ధాతువునుండి 'జగ్ముః'అను రూప మేర్పడి నప్పుడు పదమధ్యాల్లోపమును గుర్తించినాఁడు ఇది ఇప్పుడు syncope అను పేరఁ బరగు చున్నది. వర్ణవ్యత్యయము (Metathesis) మూలముగా నేర్పడిన శబ్దముల కుదాహరణముగా 'శ్చ్యుత్' ధాతువునుండి 'స్తోకా'; 'సృజ్' ధాతువునుండి 'రజ్జుః' కృత్ నుండి 'తర్కుః' (a knife) అనువాని నిచ్చినాడు. స్వరభక్తి (Anaplyxis) కుదాహరణముగా 'వృ'ధాతువు (=to cover) నుండి ద్వారః, 'భ్రస్జ'ధాతువు (=to fry) నుంచి 'భరూజాః' అనున వేర్పడినవి. 'తృచ' శబ్దము త్రి+ఋచ (=three stanzas) సమానాక్షరములు. సన్నిహితము లైనవు డొకదానికి లోపము. దీనినే ఇప్పుడు (Haplology) అనుచున్నారు. ప్రాచ్యపాశ్చాత్యదేశము లన్నిటిలో యాస్కుఁడే మొదటినిరుక్తకారుఁడు. ఈ నిరుక్తిరచనాసందర్భముననే యీతఁడు భాషాతత్త్వమునుగూర్చి తనముఖ్యభావములను ప్రకటించినాఁడు. భాషలోని పదములన్ని కొన్ని మూలధాతువులనుండి నిష్పన్నములై యుండును. పదముల వ్యుత్పత్త్యర్థమును దెలుపునపు డాశబ్దమునకు, మూలధాతువునకుఁ గల సంబంధము వ్యక్తము కావలెను. మార్పులు గలిగినచో నవి స్వరసూత్రానుగుణము లై యుండవలెను. సంజ్ఞారూపక మగు భాషకంటె ధ్వనిరూప మగు భాషకు ప్రయోజకత్వ మెక్కుడు. గ్రీకుతత్త్వవేత్తలకు వారికాలమునగూడ శబ్దములకు ధాతువు ప్రత్యయముల మూలముగా వ్యుత్పత్తి గల్పించుట తెలియదు.

భాష యసున దెట్లు పుట్టినది అనువిషయమునగూడ యాస్కునికాలమున విశేషచర్చ జరిగినట్లు తెలియుచున్నది. శబ్దము లన్నియుఁ గొన్ని మూలధాతువుల నుండి పుట్టిన వను నైరుక్తులవాదమునకుఁ జెందినవాఁడు యాస్కాచార్యుఁడు. గార్గ్యుఁడు మొదలగువారు దీని నొప్పుకొనలేదు. భాషలో ధ్వన్యనుకరణశబ్దములకు తావులే దను వాదములోనివాఁడు ఔపమన్యవుఁడు. అనఁగా నీకాలమునందలి "Onomatopoeia" వాదమునకు ప్రతిపక్షి అన్నమాట. ఇటీవల మాక్సుముల్లరు మొదలగువారు దీనినే "Bow-vow theory" అని పేర్కొనిరి. 'Bow-vow' వాదమును యాస్కాచార్యుఁ డొప్పుకొనకపోయినను భాషలో 'దుందుభి, కితవ, కృకవాక' మొదలగు ధ్వన్యనుకరణశబ్దములు లేకపోలే దని అతఁడు చెప్పినాఁడు. ఇట్లీయాస్కునికాలము దేశమున విశేషమగు భాషాసాహిత్యసంచలనము, శబ్దతత్త్వాన్వేషణపరత్వము కలిగినకాలముగాఁ గనఁబడుచున్నది.

ఆయాపదముల కర్థము 'స్వాభావికమా, సాంకేతికమా' యనువిషయమును గూర్చియు విచారణ జరిగినది. దీని నీకాలమున Semantics అని యందురు. నామవాచకపదములకు వానిగుణములనుబట్టియా, లేదా కర్మను బట్టియా ఆ పేరు వచ్చుట అను విషయములు చర్చింపఁబడిలేవి. తక్షకుఁడు-అనగా వడ్రంగి అనేకములగు పనులు చేయుచున్నను అతనికా పేరు వడ్రంగము పని చేయుట చేతనే వచ్చినది. అతఁడు చేయుపనులన్నిటిబట్టి చెప్పవలసినచో నాతని కనేకమైన పేర్లు పెట్టవలసి యుండును.

శబ్దార్థములకుఁ గల సంబంధము స్వాభావికమా, యను విషయమును పతంజలి విమర్శించినాఁడు. శబ్దార్థములసంబంధము నిత్యమే యైనను, ఈ శబ్దమున కీయర్థ మనునది లోకప్రయుక్తమే యని యాతఁడు తెలిపినాఁడు. ఇది తార్కికుల వాదమునకు భిన్నము. ఈశ్వరసంకేతమువూలముననే యీ యర్థబోధ కలుగుచున్నదని వారు చెప్పుదురు. "అస్మాత్పదాదయమర్థో బోద్ధవ్య ఇతి ఈశ్వరసంకేత శ్శక్తిః - శక్తం పదం" - ఈశ్వరుఁడే యీ శబ్దముల కీయర్థ మని నిర్ణయించి పెట్టినాఁ డని వారి మతము. గ్రీసుదేశమునఁ గూడ నీవాదము బయలుదేరినది Cratylus పదపదార్థసంబంధము స్వాభావికమే యని చెప్పఁగా Hermogenes అనునాతఁడు సాంకేతిక మని, కాలభేదముచే మారవచ్చునని చెప్పినాఁడు. కాని సోక్రటీసు నామముల పేళ్ళు స్వాభావికముగనే వచ్చిన వైనను 'సంకేతము' కూడ కొంత లేకపోలే తను భావము కలిగినవాఁడు

ఇట్లు ప్రాచీనకాలమున నీదేశమున భాషాతత్వపరిశీలనము, విచారణ విశేషముగా జరిగియుండెను గాని, తరువాతికాలమున వ్యాకరణశాస్త్రాభ్యాసము సుశబ్దాపశబ్ద పరిజ్ఞానమునకు, శబ్దప్రక్రియనుగూర్చినవివాదములకు, పూర్వపక్ష సిద్ధాంతములకు ప్రధానముగా మూల మగుచు వచ్చినది. కాని భాషాశాస్త్రాభివృద్ధికిఁ దోడ్పడలేదు పతంజలి చెప్పినట్లుగా వ్యాకరణశాస్త్రప్రయోజనము "రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనం-వేదానాం రక్షార్థ మధ్యేయం వ్యాకరణం" – వేదములను వైదిక కలాపమును రక్షించుటకే యనుదృష్టి ప్రబలి, తత్కర్మకలాపమునందు, తద్విజ్ఞాన ప్రచారమునందునే పండితులు నిమగ్నులై యుండిరి, ఇది దేవతలభాష యను భావము ప్రబలుటచే నితరదేశభాషలతోఁ బోల్చి పరిశీలింపవలయును నను దృష్టియు వారికి కలుగలేదు. కావుననే ౧౯వ శతాబ్ది నీశాస్త్రము యూరపుదేశమున వృద్ధి నొందుస్థితి యేర్పడినది.

యూరపుదేశమున ప్రాచీనకాలమున భాషాతత్త్వమును గూర్చి విచారింపఁ గడఁగినవారు గ్రీసుదేశీయులు. తరువాత రోమనులు వారిని కొంతయనుసరించిరి. గ్రీకుదేశీయు లితరదేశీయులను 'Barbarians' - అనాగరకులని తూలనాడు చుండు స్వభావము కలవా రగుటచేత. వారిభాషల నభ్యసించెడివారు కారు. కావున స్వీయభాషాసహాయముననే భాషాతత్త్వపరిశీలనకుఁ గడంగినవా రగుటచేత వారి పరిశీలనము సక్రమమార్గమున బడలేదు. తత్త్వపరిశీలనమునకు తారతమ్య పరీక్ష యత్యావశ్యకము. ఆధునికశాస్త్రజ్ఞానాభివృద్ధి కంతకు నీతారతమ్య పరిశీలనా దృష్టియే మూలాధార మని చెప్పవచ్చును. భాషావిషయమున గూడ నీదృష్టి ప్రబలుట చేతనే ఆధునికభాషాశాస్త్ర మభివృద్ధి గాంచినది. ౧౯వ శతాబ్దిలోగూడ రోమనుదేశములో కార్డినల్ మఃజఫాంటీ అను మతగురు వాదేశమును జూడవచ్చిన ప్రతివిదేశీయుని తోడను ఆ విదేశీయునిభాషలోనే సంభాషించుచుండెడివాఁ డఁట అనఁగా అతని కన్నిభాషలు వచ్చు నన్నమాట. కాని తద్భాషాజ్ఞాన మాతనిని భాషాతత్త్వపరిశీలనమున కేమాత్రము పురికొల్పలేదు. తారతమ్యపరిశీలనాదృష్టి లేకపోవుటచేతనే కావచ్చును. మనదేశమున రాజరాజనరేంద్రుని యాస్థానమున "యఃసంస్కృత కర్ణాటక ప్రాకృతపైశాచికాంధ్రభాషాసు కవిరాజశేఖరుఁ"డని బిరుదునొందిన నారాయణభట్టు కలఁడు. అతనికిఁ గాని, అతనిమిత్రుఁడు నన్నయకుఁ గాని కర్ణాటాంధ్రములకుఁ గాని, వీనికిని సంస్కృతప్రాకృతపైశాచీ భాషలకుఁగాని గల సంబంధమును గూర్చి విచారింపవలయునను తలంపు కలిగిన ట్లగపడదు. భాషలవిషయమున తారతమ్యపరిశీలనాదృష్టి ఆకాలమునఁ గలుగ లేదు.

ఆకాలములో గ్రీకురోమన్‌దేశములలో భాష యీశ్వరకల్పితమే యను భావ ముండెడిది. గ్రీకుభాష ప్రాచీనమైన దగుటచే తక్కినవన్నియు తజ్జన్యములే యని నమ్మెడువారు. క్రీస్తుమతము బయలుదేరిన తరువాత హీబ్రూభాషయే మత భాష యగుట చేత నదియే దైవదత్త మగు భాష యని, దానినుండియే ప్రపంచ మందలి భాష లన్నియు పుట్టినవని చెప్పెడివారు. ఇతర భాషాపదములను యత్కించిద్వర్ణసామ్యముచే హీబ్రూపదములనుండి పుట్టినట్లు నిరూపించెడివారు. ఇంతేగాక పదముల వ్యుత్పత్తిని గిట్టించుటకు హీబ్రూభాష కుడివైపు నుండి ఎడమవైపునకు వ్రాయఁబడుటనుబట్టి, యాశబ్దములలోని యక్షరములను తిరుగ వేసి చదివి వ్యుత్పత్తులను, పోలికలను సూచించెడివారు. పదములసామ్యమును బట్టి వాని జన్యజనకభావమును నిరూపించుటే గాని వాని నిష్పత్తిక్రమమును

గూర్చిన పరిశీలనదృష్టి వారికిఁ గలుగలేదు. ధాతువు ప్రత్యయము మొదలగు విభాగమే వారికి తెలియదు. పదవ్యుత్పత్తులను గూర్చి చమత్కారభావములు ప్రబలినవి. ఒకవస్తువు సహజగుణమును బట్టి గాక దాని విరుద్ధగుణమును బట్టి కూడ వ్యుత్పత్తులు కల్పించెడివారు. Bellumoth అనఁగా యుద్ధము. ఇది అందమైన అనునరము గల 'bellus' అనుదాని నుండి వచ్చినదఁట. ఏల యనఁగా యుద్ధమ అందమైనది కాదు గనుక. Feodus అనగాఁ శాంతి, సంధి అని అర్థము. ఇది వికారమైన అనుసర్థము గల 'Fedus' అను దాని నుండి వచ్చినది. కారణము సంధి, శాంతి వికారమైనవి కాదు గనుక. ఇట్టి వ్యుత్పత్తులను కల్పించినందులకే ప్లేటోకు 'నిరుక్తాచార్యుడు' అను బిరుదము కూడ వచ్చినదఁట! చర్చిలలో లాటిన్ భాషకుగల ప్రాముఖ్యమునుబట్టి యాభాషా వాఙ్మయమున విశేషపరిశ్రమ జరిగినది. దానివ్యాకరణము బాగుగా నభ్యసింప బడుచు వచ్చినది. దానివలనను సుశబ్దాపశబ్దజ్ఞానమును సంపాదించి యా భాషలో సిసిరో మొదలగు మహావక్తలవలె తప్పులు లేకుండ వ్రాయవలె నను దృష్టియే ప్రబలముగ నుండెడిది. ౧౫వ శతాబ్దిప్రాంతమున ముద్రణపద్ధతి కనుగొనబడిన పిదప ఇతర భాషల నభ్యసించుటకు సౌకర్య మేర్పడినది. భిన్నభాషలలోని పద ములు ప్రోవుజేయఁబడినవి. కాని లాటిన్ మొదలగు యూరపుభాషాపదములకుఁ గూడ దేవభాష యని, స్వర్గమున (Paradise) మాట్లాడఁబడుభాషయనితలఁప బడిన దగుటచే హీబ్రూ భాషాపదములనుండియే నిష్పత్తిని గల్పింప యత్నించు చుండిరి. ౧౮వ శతాబ్దమున భాషాసంబంధమునుగూర్చిన విచారణ బయలుదేరి నది. భిన్నభాషలలోని సమానార్థకపదములు ప్రోగుచేయఁబడినవి. లీబ్నిజ్ (Leibnitg) అను తత్త్వవేత్త ప్రోత్సాహము మూలముగా, పీటర్ది గ్రేట్, కాథరైన్ రాణియు వారిరాజ్యములోని సుమారు ౨౦౦ భాషలను గూర్చిన విష యములు సంగ్రహింపఁబడునట్లు చేసిరి. లీబ్నిజ్ హీబ్రూభాష తక్కినభాషలకు మూల మను వాదమును ఖండించి, యూరపు, ఆసియాదేశములలోని భాషల న్నియు నొకవర్గమునకుఁ జెందినవే యని సూచించినాఁడు. ఇండో యూరోపి యన్ భాషాకుటుంబమును తొలుత నేర్పరచినవాఁడు 'అడెలంగ్' అనునాతఁడు. హెర్వాస్ (Hervas) అనునతఁడు పదములపట్టికలకంటె భాషలసంబంధమును నిర్ణయించుటకు వ్యాకరణమే ప్రధానముగా గ్రహింపవలయునని సూచించినాఁడు. ఏమైనను ఈ కాలమున యూరపుదేశములో లాటిన్భాషా వ్యాకరణముల యభ్యా సమునకే ప్రాధాన్యము కలదు. మనదేశమున సంస్కృత భాషకుఁ గలిగిన స్థాన మునే యది యాదేశమున నాక్రమించినది. ఇతరభాషాలక్షణమంతయు - విభ క్తులు, క్రియారూపములు మొదలగునవి. లాటిన్వ్యాకరణ సంప్రదాయములను

బట్టి యేర్పడవలసినదే. కోశములలో - ఫ్రెంచి, ఇటాలియన్ పరిషత్తులు ప్రకటించిన కోశములలో ఉత్తములు, శిష్టులు ప్రయోగించఁదగిన శబ్దములకే స్థానము. ఇట్టి పరిస్థితి భాషాతత్త్వ పరిశీలనము విశేషముగా జరిగిన మనదేశముననే యిప్పటివరకు నట్లే యుండఁగా నాకాలమున యూరపులో నట్లుండుట కాశ్చర్యమేమి? క్రీ.శ. ౧౯వ శతాబ్దితో భాషాశాస్త్రాభివృద్ధి విషయమున నొక నూతనయుగము ప్రారంభమైనది. ఇంతకాలము నుండి లాటిన్ భాషావ్యాకరణముల యభ్యాసము వలన గలుగని విశేషప్రయోజనము నూతనముగాఁగలిగిన సంస్కృత భాషాజ్ఞానమువలన గలిగినది. భాషలవ్యాకరణము నభ్యసించుటే కాక వాని నిర్మాణక్రమమును బరిశీలించుట నూతన భావలతోఁబోల్చి చూచుటయందలి శ్రద్ధ, భాషల పరస్పర సంబంధబాంధవ్యముల నారయుట, వాని వర్గీకరణము, భాషారూపములను వ్యాకరించుటయే కాక, వాని ప్రాచీనచరిత్ర నన్వేషించి మూలరూపములను గనుఁగొనుట, భాషలలో కాలగతిని గలుగు మార్పులకుఁ గారణముల నారయుట - మొదలగునవి యీ యుగమునందలి భాషా పరిశీలనమున ప్రధాన విషయము లైనవి. చారిత్రక పద్ధతి యనునది చరిత్రకేకాక, భాషాపరిణామము విషయమునగూడ నన్వయింపఁబడఁ జొచ్చినది. తక్కినవాని చరిత్రల వలెనే భాషాచరిత్ర మనున దొకటి కూడ కలదని గుర్తింపబడినది. దీనికంతకు యూరపుదేశమున ప్రబలిన సంస్కృత భాషాజ్ఞానమే ముఖ్యకారణమనవచ్చును.

యూరపుదేశీయులకు ఇండియాను గూర్చి అలెగ్జాండరు దండయాత్రచేసి నప్పటినుండియు తెలియును. కాని వారితరదేశములవారిని బార్బేరియ న్లని, వీరు వారిని మ్లేచ్ఛు లని తలఁచియుండుటచేత ఒకరిభాషయం దొకరి కాదరము లేక పోయి యుండును. కాని పికనేమాదిశబ్దములు కొన్ని వైదికభాషలోనే చేరకపోలేదు. 'పిక' శబ్దము గ్రీకుభాషలోని 'Pecus' అను దాని నుండి వచ్చినదే యైనను, దీనికిసంస్కృత ధాతువునుండి వ్యుత్పత్తి కల్పింపఁజూచినారు సంస్కృత వైయాకరణులు. ''అపిహితం కాయతీతి పికః'' అని. ఇట్టివ్యుత్పత్తికల్పనము గూర్చియే కుమారిలభట్టు గట్టిగా వాదించినాఁడు.

తరువాత నింగ్లీషువారు, ఫ్రెంచివారు నీదేశము నాక్రమించుటకై పోరు సాగించునంతవరకు నీదేశమును గూర్చి యూరపుదేశీయుల కేమియుఁ దెలియదు. లాటిన్, సంస్కృతములకుఁ గల సంబంధమునుగూర్చి ఫ్రెంచివారికి తొలుదొల్త నొక వృత్తాంతమును బంపినవాఁడు ఫ్రెంచిమిషనరీ 'కోర్డో' అనునాతఁడు.

సంస్కృత భాష-దాని ప్రాచీనత, గ్రీకులాటిన్‌లతో దీనికిఁగల సన్నిహితసంబంధము, పదములవిషయమునందే గాక వ్యాకరణవిషయమునను వీనికిఁగల సామ్యము ఈ మూఁడు భాషలు నేకమాతృత్వములే, అను నీమొదలగువిషయముల నాంగ్లేయులకుఁ దెలిపినవాఁడు సర్ విలియం. జోన్సు (౧౭౮౬). ఈతడే కాళిదాసు శాకుంతలాది గ్రంథముల నాంగ్లములోని కనువదించినవాఁడు. సంస్కృతమునకు నితర యూరపియన్ భాషలకును గల సాజాత్యమును జూపుటయే గాక, యితర దేశభాషలనుగూడ పరిశీలించి ప్రాపంచికభాషలను సంస్కృతభాషావర్గమని,ఇతర భాషావర్గ మని విభజించినవాఁడు 'ష్లైగెల్' అను జర్మనుపండితుఁడు. ఎక్కడో దూరస్థ మగు హిందూదేశములోని సంస్కృతభాషకును, యూరపులోని ప్రాచీన భాష లగు గ్రీకులాటినులకును సన్నిహితసంబంధము కలదని తెలియుటతోడనే, యూరపుదేశములలోని విశ్వవిద్యాలయములు పెక్కింటిలో సంస్కృతభాషా పరిశీలన, పరిశోధనములకై ప్రత్యేకపండితస్థానము (Professorships) లేర్పాటుచేయఁబడినని. భిన్నప్రదేశములం దొక్కసారిగా సంస్కృతభాషా పరిశీలనము ప్రారంభింపఁబడినది.

డెన్మార్కు దేశములో నీపనికిఁ బూనినఁవాడు **రాస్కుపండితుఁడు.** బాల్యము నుండియు వ్యాకరణతత్వవేత్త. ఐస్లెండిక్ భాష నితరభాషలతోఁ బోల్చి విమర్శించిన వాఁడు. ఒకభాషనుబట్టి దానిని వ్యవహరించినజాతియొక్క ప్రాచీన చరిత్ర నన్వేషింప వచ్చును. వారిమతము, సాంఘికమర్యాదలు మారినను వారు వ్యవహరించుభాషలోని పదములను బట్టి వారిపూర్వచరిత్ర గ్రహింపనగును. పదము లొకభాషనుండి మరియొకభాషలోనికి సంక్రమింపవచ్చునుగాని వ్యాకరణసంప్రదాయము లట్లురావు. కావున వ్యాకరణపద్ధతియే భాషలసంబంధమును నిర్ణయించుటకు ముఖ్యసాధనము. ఇదిగాక అత్యావశ్యకము లగు వస్తువులను దెలుపుశబ్దములు, సర్వనామములు, సంఖ్యావాచకములు-వీనిలో సామ్యము గలిగినచో నాభాష లొక్కకుటుంబమునకు జెందినవే యని. నిర్ణయింపవచ్చును. ఈ శబ్దములనుబట్టి యాభాషలలోని ధ్వనుల మార్పులను గనిపట్టి స్వర సూత్రములను గల్పింపవచ్చును. ఈ పద్ధతి ననుసరించి యూరపు భాషల సంబంధములను నిర్ణయించి భిన్నశాఖలను విడదీసి చూపినవాఁడు రాస్కుపండితుఁడు. ఇండియా దేశమునకు వచ్చి హిందూదేశభాషలను గూర్చియు, పరిషియన్-జెండు భాషలను గూర్చియు లక్షణములను దెలిపినాఁడు. ఈ దేశము నందలి 'మలబారిక్'భాషలు-అనఁగా ఇప్పుడు ద్రావిడభాష లనఁబడుచున్నవి- సంస్కృతముకంటె భిన్న వర్గమునకుఁ జెందిన వని కనిపట్టి ప్రకటించినవారిలో 'రాస్కు'పండితుఁడే ప్రథముఁడు.

తరువాత "జేకబ్‌గ్రిమ్" అను జర్మనుపండితుఁడు జర్మానిక్ భాషలకు చారిత్రకవ్యాకరణమును రచించెను. భాషాశాస్త్రములో చారిత్రకపద్ధతిని ప్రవేశ పెట్టినవాఁ డీతఁడే. ఈతని చారిత్రకపద్ధతిలో తారతమ్యపరీక్ష కూడ లేకపోలేదు. ఒక భాష యొక్క భిన్నావస్థలనుగాని, అతిసన్నిహితము లగు భాషలలోని రూపములను గాని సరిపోల్చి వానిసంబంధమును కనిపట్టుటమూలముగా వారి చరిత్ర నన్వేషింపవలయు నని యాతనియభిప్రాయము. సన్నిహితభాషల తారతమ్యపరీక్షయే భాషాచరిత్రముగూడ నగుచున్నది. జర్మానిక్‌భాషలలో నిట్టి తారతమ్యపరీక్ష మూలముగా నొకధ్వని పరివర్తన మీఁతడు కనిపట్టెను. ఇతర ఇండోయూరపియన్ భాషలలోని ప, త, క అను ధ్వనులు జర్మానిక్‌భాషలలో (f, th, h) ఫ, థ, హ గా మార్పుజెందిన ట్లాతఁడు నిరూపించెను. సం. పితా, లాటిన్ - పెటేర్ శబ్దములు గాథిక్‌లో 'faeotor' అని మారుటచేతనే తరువాతి ఇంగ్లీషులో 'father' అనే శబ్ద మేర్పడినది. ఈ ధ్వనిసూత్రము 'Grim's Law' అని యాతనిపేరఁ బరగినది. ఇట్టి ధ్వనిసూత్రములలోఁ గొన్ని లోపములు తరువాత కనఁబడినను ధ్వనిసూత్రములను (Phonetic laws) కనుగొనుటయనునదే భాషాశాస్త్రాభివృద్ధి మార్గమున నొక క్రొత్తమెట్టుగా గ్రహింపఁబడినది.

భాషాశాస్త్రప్రవక్తృత్రయములో మూడవవాఁడుగా గ్రహింపఁబడినవాఁడు 'ఫ్రాంజ్‌బాప్' (Franz Bopp) అనునాతఁడుకూడ జర్మనుదేశీయుఁడే. ఈతఁడు ఇండో-యూరోపియన్ భాష లన్నిటికిని మొట్టమొదట సమగ్రవ్యాకరణము వ్రాసిన వాఁడగుటచే నీతనిగ్రంథముతోడనే భాషాశాస్త్రము పుట్టిన దని జర్మన్ దేశీయులు తలంతు రట. ధ్వనిసూత్రములవిషయ మంతగా నీతఁడు పరిశ్రమ చేయలేదుగాని, పదవాక్యనిర్మాణపద్ధతిని నిరూపించుటలో నీతని కభిమాన మెక్కువ. సంస్కృతభాషాస్వామ్యముచే నీభాషలలోని విభక్త్యాదివ్యాకరణరూపముల మూలరూపముల నన్వేషించి, గ్రీకులాటిన్ మొదలగు భాషలు సంస్కృతమునుండి పుట్టినవి కావనియు, దీనితోపా టన్నియుఁ గూడ వేరొకమూలభాష నుండి పుట్టిన వనియు, సంస్కృతముమాత్ర మితరసోదరభాషలకంటె మూలభాషాలక్షణములను నిలుపుకొని యున్నదనియు నాతని యభిప్రాయము. సంస్కృతభాషాలక్షణములలో గ్రీకు లాటిన్‌భాషాలక్షణములనుబట్టి సమన్వయించుకొనవలసినవిగూడ కొన్ని గలవు. ఈ భాషలలోని విభక్తిప్రత్యయములనఁబడునవి ప్రత్యేకార్థములు గల స్వతంత్ర శబ్దములనుండి యేర్పడినవే యని బాప్‌పండితుఁడు నిశ్చయించెను. భాషల నీతఁడు మూఁడువర్గములుగాఁ జేసెను.

(౧) ధాతుసంయోగము - వ్యాకరణము లేని చీనాభాష ; (౨) ఏకాక్షరధాతువులు, ధాతుసంయోగము - వ్యాకరణము కల ఇండో యూరోపియన్‌భాషలు : (౩) ద్వ్యక్షరధాతువులు - మూఁడేసిహల్లులతోఁ గూడిన ధాతువులు గల — సెమెటిక్ భాషలు.

జర్మానిక్‌భాషలకు 'గ్రిమ్' ధ్వనిసూత్రముల నేర్పరచినట్లే ఇండో యూరపియన్‌భాషల కన్నిటికి నన్వయించు ధ్వనిసూత్రములను పాట్ (Pott) అనునాతఁడు ప్రతిపాదించినాఁడు. భాషల సాజాత్యసంబంధములను నిర్ణయించుటలో నీ సూత్రముల ప్రాముఖ్యము నితఁడు నొక్కిచెప్పినాఁడు. కేవలధ్వని సాదృశ్యమునుబట్టి సంబంధమును నిర్ణయింపఁగూడదు. ఇంగ్లీషు 'bad' శబ్దమునకు పరిషియన్ 'bad' అనుదానికిని సారూప్యము కలదు గాని సాజాత్యము లేదు. cf. Eng. prop-Tel. ప్రాపు, mouth మూతి, Gastics గొల్లలు etc., పరిషియన్ xvahar = sister Oestic-O. ఈ రెంటికిని రూపసామ్యము లేకపోయినను, సాజాత్యము కలదు. అది ధ్వనిసూత్రములనుబట్టి నిరూపింపఁదగియుండును. ఇంక నీతఁడు ధాతురూపముల పట్టికలను తయారుచేసి పదవ్యుత్పత్తులను దెలుపు ధాతుకోశమును రచించెను.

ష్లైచర్ (Schleicher) అనునాతఁడు స్వరసూత్రముల సహాయముచే ఇండోయూరోపియన్ మూలభాషాస్వరూపమును కనిపెట్టవలయు నని యత్నించినవారిలో ప్రథముఁడు. దానినిబట్టి భిన్నభాషలలోఁ గలిగిన మార్పులను, వాని పరస్పర సంబంధమును దెలిసికొనవచ్చునని, ఆయాభాషల చారిత్రకవ్యాకరణ రచన కిదితోడ్పడు నని యాతని భావము. అట్టి మూలభాషలో నొకకథను వ్రాసి యీతఁడు చూపెను. ఈ కుటుంబమందలి భాషలకుఁ గల సంబంధమును జూపుచు నొక వంశవృక్షమును గూడ నాతఁడు సిద్ధము చేసియున్నాఁడు. ఈ మూలరూపము లనునవి యూహాకల్పితములే యని తరువాతివారీవాదము నొప్పుకొనలేదు. మూలభాషలోని యచ్చులు, హల్లులు నల్పసంఖ్యాకములే యని, పదనిర్మాణ మొక్కతీరుననే జరిగినదని, సంస్కృతమునందలి వర్ణములే మూలభాషకు చేరువగా నుండు నని యాతఁడు తలఁచెను గాని, తరువాతి కాలపు పరిశోధన లీవిషయమును ప్రత్యాఖ్యానము చేసినవి. సంస్కృతమునందలి అచ్చులకంటెను, హల్లులకంటెను హెచ్చువర్ణములే మూలభాషలో కలవని. సంధ్యక్షరములలో అఇ, ఎఇ, ఒఇ, ఆఇ, ఏఇ, ఓఇ, ఓఇ- అనునవి, హ్రస్వతర 'అ' కారము అజ్ఞక్షణమే గలిగిన l, m, n, r అను హల్లులు, మూఁడు రకములైన కంఠ్యములు మొదలగునవి ఇండోయూరపియన్ మూలభాషలో నుండెనని వెర్నగర్, బ్రుగ్‌మన్ మొదలగు పండితుల తరువాతి పరిశోధనల వలన వ్యక్తమైనది.

ష్లేచర్‌యొక్క భావముల ననుసరించి ఇండోయూరోపియన్ కుటుంబ భాషలకు సంబంధించిన పదజాలమును పోగుజేసి పెట్టినవాఁడు 'ఆగష్టుఫిక్కు' అను నాతఁడు. ఈ కోశమునం దీభాషలు ఇండోఇరేనియన్ అని, యూరపియన్ అని రెండువర్గములుగా జేయఁబడినవి. మూలరూపములను కనిపట్టుటలో కొన్ని లోపములున్నను ఇండోయూరపియన్‌భాషల కన్నిటికిని సంబంధిచిన జాతీయపదముల కోశమును తయారుచేయుటలో నీతఁడు ముందంజ వేసె నని చెప్పవచ్చును. ఇప్పటికి ఇండోయూరోపియన్‌శాఖాభాషల కన్నిటికిని చక్కని వ్యాకరణములు బయలుదేరినవి. లాటిన్‌నుండి బయలుదేరిన ౭, ౮ శాఖాభాషలను (Romance Languages) పరస్పరసంబంధము, క్రమపరిణామము నిరూపింపఁబడినది. ఈ పరిశోధనఫలితములను సులభముగ బోధపడునట్లు చేసినవాడు మాక్సుముల్లరు పండితుఁడు. ఆయన 'భాషాశాస్త్రోపన్యాసములు' సామాన్యునకుఁ గూడ భాషాశాస్త్రమునం దభిరుచి కల్పించుటకు దోడ్పడినవి. ఎన్నియో ముద్రణలందినవట. ధ్వనిపరిణామ సూత్రముల ప్రాధాన్యమును గుర్తించి వాని సమన్వయమున గలుగుచిక్కులకు సమాధానముల నారయుట, శబ్దముల వ్యుత్పత్తి విషయమున నూహాగానమున కవకాశము తగ్గించి, వానిపూర్వచరిత్ర నన్వేషించి నిర్ణయించుటలో తగుశ్రద్ధ వహించుట, ప్రాచీనభాషలపరిణామమును గుర్తించు విషయమున నాధునికభాషాపరిశీలనావశ్యకతను గుర్తించుట మొదలగు విషయములందు పరిశ్రమ విశేషముగా సాగఁజొచ్చిన దని, బాప్, ష్లేచర్‌లు ప్రారంభించినపని నంతసమర్థతతో బ్రుగ్‌మన్ కొనసాగించి యొకస్థిరరూపము నొందించినాఁ డనియు మాక్సుముల్లర్‌పండితుఁడు ౧౯ వ శతాబ్ద్యంతమున ప్రకటించిన భాషాశాస్త్రగ్రంథముయొక్క ఉపోద్ఘాతములో చెప్పినాఁడు.

ఈపనియంతయు నీభాషాశాస్త్రవిషయకజ్ఞానాభివృద్ధియంతయు నింతవరకు ఇండోయూరపియన్‌భాషాపరిశీలనమునకు సంబంధించినదిగా నేర్పడిన దగుటయే గాక విదేశములందు జరిగినదిగానే యున్నది. మనదేశమునందలి నందలి సంస్కృతభాషాజ్ఞానమే దీనికి మూల మైనది గనుక, తదభివృద్ధియంతయు మనదే యనుకున్నను ఈ యాధునికభాషాశాస్త్రపద్ధతు లీదేశమందలి యితరభాషలపరిశీలన కెంతవరకుపయోగించినవో, మనదేశీయు లెంతవరకీయభివృద్ధియందు పాల్గొనిరో యనువిషయము ముఖ్యముగా గమనింపఁదగి యున్నది.

*ఇటీవల జరిగిన భాషాశాస్త్రాభివృద్ధి :*

హిందూదేశమున నిటీవలికాలమున ఇండోయూరపియన్ కుటుంబభాషలను గూర్చి గాని, ప్రత్యేకసంస్కృతమునుగూర్చి గాని భాషాతత్వదృష్టితోఁ బరిశీలించినవారు చాల తక్కువ. అనగా ౧౯ వ శతాబ్దిరెండవభాగమున మద్రాసు ప్రెసిడెన్సీకాలేజి సంస్కృతభాషాచార్యులుగను, దేశభాషావిద్యాపర్యవేక్షకులుగ నుండిన ఎమ్. శేషగిరిశాస్త్రిలు (M. A.) గారుతప్ప-యీభాషలను గూర్చి పరిశోధనచేసినవారు గాని, క్రొత్తవాదములను బయలుదేరఁ దీసినవారు గాని మరెవ్వరుమ లేరనవచ్చును. కాని యీదేశభాషలనుగూర్చినపరిశీలనము కొంత జరిగినది. ఆధునికము లగు ఉత్తరహిందూస్థానభాషలనుగూర్చి బీమ్స్ (Beams) అను నాతఁడొక "తులనాత్మకవ్యాకరణము" (Comparative grammar of the Modern Aryan Languages of India) అనుదానిని రచించినాఁడు. డాక్టరు హార్నీలు అనునాతఁడు గౌడభాషల కట్టి వ్యాకరణమునే రచించినాఁడు. ఇఁక ఈదేశమునందలి ద్రావిడభాషాకుంబమునకుఁ జెందిన భాషలనుగూర్చి బాప్ ఇండోయూరోపియన్‌భాషలవిషయమున పరిశ్రమ చేసి వ్రాసినరీతిగనే "ద్రావిడభాషాతులనాత్మకవ్యాకరణము"ను వ్రాసినవాఁడు దక్షిణహిందూదేశమున మిషనరీగా నుండిన డాక్టర్ కాల్డ్వెల్ అనునాతఁడు. ఈదక్షిణహిందూదేశమునందలి తమిళము, తెలుఁగు, కన్నడము, మళయాళము, తుళు మొదలగుభాషలు ఉత్తర దేశమునందలి కురుక్, మాల్టో, కుయి, గాండ్, బ్రాహుయి మొదలగు వానితోఁగూడి సంస్కృతాది ఇండోయూరపియన్‌భాషలకంటె భిన్నము, ప్రత్యేకము నగు నొకకుటుంబమునకుఁ జెందిన వని ఇంతకు పూర్వము రాస్క్-పండితుఁడే తెలిపినాఁడు. కాని, వానినితఁడు 'మలబారిక్'భాష లని చెప్పినాఁడు. మాక్సుముల్లర్ తన 'భాషాశాస్త్రము'న ప్రపంచమునందలి భాషావర్గములనుగూర్చి వ్రాయుచు, వీనిని 'తములిక్' భాషలని పేర్కొనినాఁడు. ఈభాషలకు సమగ్రవ్యాకరణమును రచించుచు ద్రావిడభాష లని పేరుపెట్టినవాఁడు కాల్డ్వెల్ పండితుఁడే. ఈతఁ డీగ్రంథమును తొలుత క్రీ. శ. ౧౮౫౬ లోనే ప్రకటించినాఁడు. కాని యిది యీ దేశీయ పండితులను గాని, విద్యాధికులను గాని విశేషముగా నాకర్షించిన ట్లగపడదు. కాని మొట్టమొదట నీదక్షిణదేశమున నిండోయూరపియన్‌భాషలనుగూర్చిన బాప్ పండితుని వ్యాకరణమునుగూర్చిగాని, కాల్డ్వెల్‌పండితునికి దక్షిణదేశభాషావ్యాకరణమునుగూర్చి గాని యాకర్షింపఁబడి, వానియందు వారివలెనే విశేషపరిశ్రమ చేసి యొకనూతన మార్గమును త్రొక్కవలయు నని ప్రయత్నించినవారిలో మొదటి

వారు శేషగిరిశాస్త్రిగారే. ఆయన చిన్నప్పుడే మహారాష్ట్రము, అరవము, తెలుఁగు, కన్నడము మొదలగు భాషల నభ్యసించినవాఁ డగుటచే మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో నాంగ్ల విద్య నభ్యసించి పట్టభద్రుఁడగు నప్పటికే, భాషా తత్త్వజిజ్ఞాసయం దాదరము ప్రబలినది. పిదప మళయాళము, హిందూస్థాని, బెంగాలీ, ఓఢ్రభాషల నభ్యసించి, అప్పటి కాలేజీ ప్రిన్సిపాలగు 'థాంప్సన్' దొరగారి ప్రోత్సాహమున లాటిన్ గ్రీకు భాషలజ్ఞానమును గూడ సంపాదించి భాషాతత్త్వ పరిశీలన కార్యమున నిమగ్నుఁడయ్యెను. ౧౮౮౪ సం. మందే 'Notes on Aryan and Dravidian Philology'అనే గ్రంథమును బ్రకటించియున్నాఁడు. అప్పటికి ప్రెసిడెన్సీకాలేజీలో దేశభాషాశాఖకు పర్యవేక్షకుఁడుగ నుండిరి. ద్రావిడభాషలు తురేనియన్ కుటుంబమునకుఁ జెందిన వని తలఁచిన యప్పటిద్రావిడ భాషా పండితుల యభిప్రాయమునకు భిన్నముగా, నీ భాష లార్యభాషా కుటుంబమునకుఁ జెందినవే యని తా నభిప్రాయపడినట్లు వ్యక్తముచేసి, యందలిశబ్దముల కార్యభాషా శబ్దములతోడను, వ్యాకరణ పద్ధతుల కార్యభాషా వ్యాకరణరీతుల తోడను సంబంధము కల్పించి, వీనినుండి నిష్పన్నమైన వనియే చూపుటకు యత్నించినారు. ఇందు కుపబలకముగా తాను రచించుచున్న కోశములు, తులనాత్మకవ్యాకరణములే తన భావములను స్థిరీకరింపఁగల వని యాశించినారు. కాని, యవి ప్రకటితములై నట్లగపడదు. ఆంధ్రశబ్దతత్త్వమునకు సంబంధించిన 'క్రియారూపములు' అర్థానుస్వారతత్త్వము, తమిళ శబ్దతత్త్వము, అను గ్రంథములు మాత్రమే ప్రకటితములై యున్నవి. ద్రావిడభాషలగు తమిళాంధ్ర కన్నడ మళయాళములకుఁ గల పరస్పర సంబంధమును, సాజాత్యమును గుర్తించి, యాభాషారూపములను బరస్పరము పోల్చి పరిశీలించుటచే గలుగు విశేషలాభమును,గుణములను ఆయన బాగుగా గమనించి వ్యక్తము చేసినవాఁడే యయ్యెను. కాని వీని నార్యభాషలతోడను, సంస్కృతముతోడను ముడిపెట్టి రూపనిష్పత్తిని కల్పించుటలో స్వరసూత్ర కల్పనము చేయక తన కిచ్చవచ్చిన స్వతంత్ర పథమును ద్రొక్క యత్నించినవాఁ డగుటచే, నీతని మార్గము తరువాతి వారి కంత యాదరపాత్ర మగుట గాని, అదియొక శాస్త్రీయ పద్ధతిగా నాదరింపఁబడుట గాని తటస్థింపలేదు. భిన్న దేశీయములైన యనేకభాషలను గూర్చి చక్కనిజ్ఞానము సంపాదించుటే గాక అంతకుఁ బూర్వమునుండి వానిలో విశేష పరిశ్రమ చేసిన పాశ్చాత్యభాషావేత్తల వ్రాతలను, పద్ధతులను గూడ బాగుగ తెలిసికొనినవాఁడే యైనను స్వానుభవమునుబట్టి వారు చూపిన దానికంటె భిన్నమైన పద్ధతిని ఈ భాషలకుఁ గల సంబంధమును, శబ్దనిష్పత్తిని, అర్థపరిణామమును, వ్యాకరణవిశేషములును సాధింపవలె నని యత్నించినాఁడు.

ఇంతకుపూర్వ మీభాషలో పరిశ్రమ చేసిన బాప్, బెన్‌ఫీ మొదలగు వారును ఆర్యభాషావర్గములోని శబ్దముల సాదృశ్యసంబంధములను కనిపెట్టలేకనే పోయినా రని, కాని తా నవలంబించిన పదవర్గముల విధానమునుబట్టి శబ్ద నిష్పత్తినే సులభముగా సాధింపవచ్చునని యీయ నమ్మకము. ఇఁక ద్రావిడ భాషల విషయములో కాల్డ్వెల్ మొదలగు వా రవి 'తురేనియన్' కుటుంబమునకుఁ జెందిన వని చెప్పినను, అందలిపదముల కార్యభాషాపదములనుండియే నిష్పత్తి కల్పించి, ఆ భాషల నార్యభాషావర్గములోనికే తీసికొని రాగలితి నని యీయన తలఁచినాఁడు.

సంస్కృతము, గ్రీకు, లాటిన్‌భాషాపదముల సుసారూప్యమునుబట్టి, అర్థమునుబట్టి కొన్నివర్గములుగా విభజించి, వానిలో నొకదానినుండి మరియొకటి యెట్లు నిష్పన్న మయ్యెనో చూపినాఁడు. ఒకటి 'ఆత్మన్' వర్గము దీనినుండి స్వ, స్వర్, సుమేరు, మేరు, బాష్ప, నభస్, శ్వన్, త్మన్, ధ్మా (to blow) ధాతువు-ఇట్టి వింక ననేకములు గ్రీకులాటిన్‌శబ్దములేగాక, సెమిటిక్ కుటుంబమునకుఁ జెందిన హీబ్రూశబ్దములు శబత్, శెలమ్, గెబర్, బలగ్-వంటి వనేకములు నిష్పన్నము లైనవట. ఇట్లే దీనినుండియే తమి, మేడు, తె, మిట్ట మొదలైనవి కూడ నిష్పన్నము లైనవట. ఇట్లే కొన్నివర్గముంలో ననేకభాషాశబ్దములను జేర్చి వానికి నిష్పత్తి కల్పించినారు. నామవాచకశబ్దములనుండియే క్రియావాచకములు, ధాతువులు నిష్పన్నము లైనవని వీరివాదము, ఈ 'ఆత్మన్' శబ్దము నుండియే శుభ్, స్వప్, దీవ్, రుచ్, ముష్ మొదలగు ధాతువులు ముప్పది నలువదివరకు నిష్పన్నములైనవట. ధాతువులనుండి నామములకు నిష్పత్తి కల్పింపఁదలఁచుటచేతనే పాణిని ధాతువులపాఠము ౪౦౦౦ వరకు పెరిగిన దని వీరితాత్పర్యము. ఇఁక ద్రావిడబాషలలో 'మ్రాకులు' మొదలగువానిలోని 'కులు' తమి-కల్ అనునవి 'అవర్' అనుదాని రూపాంతరములే. 'చేతన్' = చేయి + అన్. ఇక్కడ 'య' కారమే తకారముగా మారినది. సరసముట్పులుక-సర సమ్ + ఇన్ + అలుక-అ యుండగా ఇద్ ఇట్ అయి,ఉగుగా మారినదట. చేసితిని: చేయు + ఇత్ + ఇన్-శెయ్దేన్ = శెయ్ + ద్ + ఏన్-వీనియందలి 'ఇత్', 'ద్' అనునవి సంస్కృతమునందలి 'పతిత', 'కృత' అనువానిలోని ఇత-త-ప్రత్యయములే ఇచ్చట చేరినవట. త-'ఒరువన్ + ఉ' > ఒర్వాడు > ఒవ్వాడు > ఒక్కడు (వ్వకారానికి కకారద్వయాదేశము) త. 'అవన్' - కి ఇప్రత్యయము చేర్పఁగా 'అది' అగును ఈ 'ది' అనునది స్త్రీలింగప్రత్యయము.

ద్రావిడభాషల కార్యభాషలతోఁగల సంబంధమునుగూర్చి మరియొక విశేషము గలదు. అవి తరువాతి సంస్కృతముతోకంటె వైదికభాషతోనేయెక్కుడు సంబంధము గలవి. శబ్దతత్వపరిశీలనము విషయము, మత చరిత్రవేదాంతముల విషయమున సంస్కృతము, లాటిన్, గ్రీకు, హీబ్రూభాషలు తప్ప తక్కిన యార్యభాష లన్నింటికంటె ప్రాచీనములని వారి యభిప్రాయము. ఈ విషయము రెండవ భాగమున బాగుగ ప్రతిపాదింపఁబడు నని వ్రాసినారు. కాని యారెండవ భాగము ప్రకటిత మైన ట్లగపడదు. ఆర్యద్రావిడభాషలతత్త్వమును గూర్చి శ్రీ శేషగిరిశాస్త్రులు వారాకాలమున చాలపరిశ్రమ చేసినవారిలో ముఖ్యులే యైనను, వీ రవలంబించిన మార్గము సరియైన శాస్త్రీయపద్ధతి కాకపోవుటచే గాబోలు నాకాలపు శాస్త్రజ్ఞులదృష్టి నాకర్షింపలేదు. కాని వీరితరువాత వీరి మార్గము ననుసరింప యత్నించి, తెలుఁగు ఆర్యద్రావిడ భాలలో నతిప్రాచీన మైన దని తలఁచి, ట్యూటానిక్ భాషా వర్గమునకుఁ జెందిన ఆంగ్లోసాక్సన్ మొదలగు భాషలలోని పదములకును, తెలుఁగుపదములకును గల సామ్యమును జూపుచు నట్టి సామ్యము గల పదముల పట్టికలను తయారుచేసి ప్రకటించినవారు శ్రీ దేకుమళ్ళ రాజగోపాలరావుగారు. వీరు మద్రాసు క్రిస్టియను కాలేజీలో నాంధ్రోపన్యాసకులుగ నుండి 'Sonth Indian Research' అను మాసపత్రిక సంపాదకులుగ నుండి యనేకభాషావిషయకవిన్యాసములను ప్రకటించు చుండెడివారు. శ్రీ శేషగిరి శాస్త్రులవారివలెనే వీరును ఆంధ్రముయొక్కయు, ద్రావిడభాషలయొక్కయు ప్రాచీనతనుగూర్చి వాని కార్యభాషలతోఁ గల జాతీయతనుగూర్చి నిశ్చయభావం కలవారై దానిని ప్రతిపాదించుయత్నము లనేకవిధముల సలిపిరి. కాని వీరి ప్రయత్నములును విశేషముగా ఫలించిన ట్లగపడదు.

పైయిద్దరివలె ద్రావిడభాష లనునవి యార్యభాషాజన్యములే యను వాదమును పురస్కరించుకొని శాస్త్రీయపద్ధతి నాభాషారూపములనిష్పత్తిక్రమమును నిరూపింప నిటీవల యత్నించినవారిలో శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు ప్రధానులు. వీరు పైవారివలె ద్రావిడభాషల ప్రాచీనత నొప్పుకొనరు. ఉత్తర హిందూస్థానము నందలి యాధునికార్యభాషలవలెనే యివియు ప్రాకృతాపభ్రంశములనుండి క్రీ. శ. ౮,౧౦ శతాబ్దములప్రాంతముననే బయలుదేరిన వని వీరు వాదింతురు.

బీమ్సు, హార్నీలు పండితు లుత్తర హిందూస్థానభాషలను గూర్చియు, కాల్డ్వెల్ పండితుఁడు దక్షిణదేశమందలి ద్రావిడభాషలను గూర్చియు తారతమ్య

పరిశీలనతోఁ గూడిన తమవ్యాకరణగ్రంథములను ప్రకటించిన తరువాత నీదేశ ములోఁగూడ దేశభాషాతత్త్వపరిశీలనము విషయమై కొంతసంచలనము కలిగినది. ప్రత్యేకభాషలనుగూర్చినపరిశీలనము, వాని కితరభాషలతోఁ గల సంబంధము, వానిప్రాచీనత, చరిత్రనుగూర్చిన పరిశోధనము ప్రారంభింపఁబడినది. ఉత్తర దేశమునందలి మరాఠీభాషకు బెంగాలిభాషకు సునీతకుమార చటర్జీపచిండితుని చేతను, ఆధునిక భాషాశాస్త్రపద్ధతులననుసరించి చారిత్రక వ్యాకరణములు రచింపఁబడినవి. దక్షిణదేశమున తమిళభాషావిషయమున 'పోప్'బండితుఁడును, కన్నడభాషావిషయమున కిట్టెల్, రైసుపండితులును, మళయాళమున గండర్ట్ పండితుఁడును, తెలుగుఁన బ్రౌన్‌దొరగారును విశేషపరిశ్రమఁజేసి, ఆయాభాష లకు వ్యాకరణములు, కోశములు, విమర్శగ్రంథములు రచించి ఆయాదేశముల భాషాసాహిత్యముల కొకనూతనోత్తేజమును గలిగించిరి. సంస్కృతబాషాజ్ఞానం కలిగిన పిదప యూరపుదేశమున కొనసాగింపఁబడిన ఇండోయూరోపియన్ భాషాతత్త్వపరిశీలనము మూలముగా బయలుదేరి నిర్ణయింపఁబడిన భాషాశాస్త్ర పద్ధతుల ననుసరించి దేశీయభాషలపుట్టుపూర్వోత్తరములను, వాని సహజలక్ష ణములను, తత్త్వమునుగూర్చి పరిశీలించుటయే యిటీవల మనదేశమున గలిగిన భాషాశాస్త్రాభివృద్ధి మార్గమని మనము గమనింపవలసియున్నది ఈ సందర్భ మున హిందూదేశ మంతటికిని సంబంధించినదిగా లేవనెత్తఁబడిన భాషావిషయక మగు మహోద్యమ మొకటి కలదు. అది గ్రియర్సన్ (Sir George Grierson) పండితుని యాధ్వర్యమున కొనసాగింపఁబడిన Linguistic Survey of india హిందూదేశభాషాసమీక్షణ మనునది. ఇది కాశ్మీరము మొదలుకొని కన్యాకుమారివరకుఁ గల మనదేశమునందు వ్యవహారములో నున్న భాషల స్వరూపలక్షణములు, సంబంధబాంధవ్యములు. ప్రాచీనత, చరిత్ర, వర్గీ కరణము మొదలగు వానినిగూర్చి విపులముగాఁ జర్చించి వ్రాయబడిన ౧౨ పెద్ద సంపుటములయుద్గ్రంథము. ఇందు ఇండోఆర్యన్‌భాషలు దార్దికు లేక పిశాచ భాషలు, ఐరేనియన్ భాషలు, ముండాభాషలు, ద్రావిడభాషలు - ఈ మొదలగు భిన్నవర్గములకుఁ జెందినవై హిందూదేశమున చిరకాలమునుండి వ్యవహరింపఁ బడుచున్న భాషలనుగూర్చి సవిమర్శముగ సోదాహరణముగఁ జర్చింపఁబడినది.

ద్రావిడభాషావర్గమునకు హిందూదేశమునందలి సంస్కృతాగ్యార్యభాషా కుటుంబముతోకంటె పూర్వాసియాభాగమునందలి సిథియన్ - లేదా తురేనియన్ భాషాకుటుంబముతోనే సన్నిహిత సంబంధము కలదని నిరూపింప యత్నించిన కాల్డ్వెల్‌పండితుని వాదమును ఖండించి, సిథియన్ లేదా తురేనియన్ కుటుంబ

మనునదే యొక ప్రత్యేకభాషాకుంటుంబముగాఁ జెప్పుటకు వీలులే దనియు, నందు చేర్పఁబడిన భిన్నవర్గములభాషకు సజాతీయసంబంధమే కానరాదనియు నట్టి సందర్భములో నీద్రావిడభాషల నాకుంటుబమునఁ జేర్చుట యేమాత్రము యుక్తము కాదు గావున, ద్రావిడభాషల నొకప్రత్యేకకుటుంబముగ గ్రహించుటయే న్యాయ మను నభిప్రాయమును గ్రియర్సన్ పర్యవేక్షణమున ద్రావిడభాషలనుగూర్చిన ౪ వ సంపుటమును సిద్ధము చేసిన 'స్టెన్‌కోనో' పండితుఁడు వ్యక్తముచేసినాఁడు. అప్పటినుండియు నీద్రావిడభాషలకు సంస్కృతప్రాకృతములతోఁగూడ సంసర్గజ మగు సంబంధమే గాని సాజాత్యసంబంధము లేదని, యవి యీదేశములో బహుశః ఆర్యజను లీదేశమునకు వచ్చుటకు పూర్వమునుండియు నెలకొనియున్న దేశీయభాషలే గాని యిటీవలిప్రాకృతాపభ్రంశములనుండి విజాతీయభాషాసంసర్గ ముచే నేర్పడియుండునని తలంపఁబడుచుండిన ఉత్తరహిందూస్థానభాషలవంటివి కావనియు పలువురుభాషాతత్త్వపరిశీలకులు తలచుచున్నారు. తమిళభాషలో విశేషపరిశ్రమ చేసిన 'పోప్' పండితుఁ డీభాషలకు సంస్కృతములోనే సన్నిహితసంబంధ మున్నదని తలఁచినను, కాల్డ్వెల్లే యాతనివాదమును ప్రత్యాఖ్యానము చేసి, సిథియన్ భాషాసంబంధమును జూప యత్నించినాఁడు. తరువాత సిథియను సంబంధవాదము కూడ ప్రత్యాఖ్యాత మైనది. కన్నడభాషలో విశేషపరిశ్రమ చేసిన కిట్టెల్‌పండితుఁడు, మళయాళకోశము రచించిన గండర్టు కూడ తద్భవ రూపములను వ్యక్తము చేయుచు, దేశీయశబ్దజాలమును ప్రత్యేకముగా నెత్తి చూపుటయే కాక, భిన్నభాషలలోఁగల సజాతీయరూపములతో వానిని బోల్చి మూలధాతుస్వరూపమును గుర్తించుమార్గముల నన్వేషించి వ్యక్తపరచియున్నారు. వారిమార్గము ననుసరించి యీ కన్నడ మలయాళభాషాతత్త్వపరిశీలనకుఁ గడఁగి, కన్నడమలయాళభాషాచరిత్ర నన్వేషింప యత్నించిన దేశీయపండిత ప్రముఖులగు ఆర్. నరసింహాచార్యులు, యస్. నరసింహయ్యగారలు, ఉల్లూర్ పరమేశ్వరయ్యర్, ఎల్. వి. రామస్వామయ్యర్ మొదలగువారుకూడ నాభాషలు సంస్కృతభాషాసాహాయ్యము నెంత పొందినను, తజ్జన్యములు మాత్రము కావనియు, తెలుఁగుతమిళాదులతో సజాతీయము లైన స్వతంత్రభాష లనియే తలఁచినారు. పోప్ తరువాతి తమిళభాషాపరిశోధకులుగూడ నీభావమునే యనువదించుచున్నారు. ఇటీవల నుత్తరహిందూస్థానభాషలలో నొకటి యగు బంగాళీభాషయొక్క ఉత్పత్తి వికాసములనుగూర్చి యగాధ మగు పరిశ్రమను సలిపి, రెండు సంపుటముల యుద్గ్రంథమును రచించిన సునీతకుమారఛటర్జీ పండితుఁడు కూడ వంగదేశమున కార్యభాషాసంసర్గము కలుగుటకు పూర్వ మనార్యజనులు, అనార్యభాషయు నాదేశమున నెలకొని యున్నట్లు నిదర్శనము

లగుపడుచున్న వనియు నార్యభాష లగు ప్రాకృతాపభ్రంశములలోను, అంత కంటె నెక్కుడుగ తరువాతి హిందూస్థానభాషలలోను గానవచ్చెడు అనార్య భాషాసంప్రదాయము లనునవి యీ ద్రావిడభాషాలక్షణములతో దగ్గరపోలిక పోలిక గలవై యుండుటచేత నాదేశ మొకప్పుడు ద్రావిడజనాకీర్ణమై యుండి యుండు ననియు, తద్భాషాసంప్రదాయములే యార్యభాషను ప్రాకృతములుగను, తరువాతి వ్యావహారికభాషలుగను మార్చియుండుననియు, కావుననే ద్రావిడ భాషాసంప్రదాయము లనేకము లీభాషలోఁ గానవచ్చుచున్నవనియు దెలిపి, యార్యభాషలోని ద్రావిడలక్షణములపట్టి నొకదాని నిచ్చియున్నాఁడు. దీనినిబట్టి ద్రావిడభాష లొకప్పు డీ దేశమునం దంతటను వ్యాప్తిఁజెందియుండిన వని, అవి కొన్నిసహజలక్షణములతో కూడిన స్వతంత్రభాష లని యాతని యభిప్రాయ మైన ట్లాగ్రంథమువలన దెలియుచున్నది.

ఆంధ్రదేశమున మాత్రము పెక్కురు పండితులలో నీయాంధ్రభాషను గూర్చియు, దీనితోపాటు తక్కిన దక్షిణదేశభాషలనుగూర్చియు భిన్నాభి ప్రాయము ప్రబలినది ''జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబు నన్'' అను సంస్కృతభాషాభిమాను లగు వైయాకరణులభావమే నిలిచి తెలుఁగు సంస్కృత ప్రాకృతభవమే యను వాదము ప్రబలినది. లాక్షణికులలో మొదటివాఁ డగు కేతన ''తల్లిసంస్కృతంబె యెల్లభాషలకును, దానివలన గొంత గానఁబడియె, కొంత తాన గలిగె నంతయు నేకమై, తెనుఁగుబాస నాగ వినుతి కెక్కె''- నని తెనుఁగు సహజముగఁ గొంత యున్న దనియే చెప్పినాఁడు. కాని తరువాతి పరిశోధకు లీ భాషయంతయు ప్రాకృతభవమే యనియు తక్కిన యాధునికార్యభాషలవలె ప్రత్యేకముగ తెనుఁగు దక్షిణదేశ భాషలును పైశాచీప్రాకృతపరిణామరూపములే యనియు, నివియు పైయార్య భాషలవలెనే క్రీ. శ. ౧౦ వ శతాబ్దినో, లేదా ౭, ౮ శతాబ్ద ప్రాంతముననో స్వతంత్రభాషలుగ మారినవి గాని యంతకు పూర్వము వీని స్వరూపమే కాన రాదనియు చెప్పి, తెనుగునందలి దేశ్యాదిశబ్దము లనేకాక, యందలి ధాతువులను వ్యాకరణరూపములను గూడ సంస్కృతప్రాకృతరూపములనుండి నిష్పన్నము లైనట్లు నిరూపించుటకు విశేషప్రయత్నము చేసినారు. ఇట్టివారిలో సిద్ధహస్తులు డాక్టరు చిలుకూరి నారాయణరావు గారు. వీరి ''Dravidian philology'' అను గ్రంథ మాంగ్లమున ప్రకటింపఁబడినది. ఆంధ్రభాషాచరిత్ర మను రెండు సంపుటముల గ్రంథ మాంధ్రవిశ్వవిద్యాలయమువారు ప్రకటించినారు. ఈ

యాంధ్రభాషాచరిత్రరచనలోనే ద్రావిడభాష లార్యభాషాజన్యము లను వాదమును వీరు బలపరచినారు.

ప్రాకృతపై యాకరణములలో కొందరు దాక్షిణాత్య, ద్రావిడి, కాంచీ దేశీయ మొదలగునవి దక్షిణదేశభాగమునందు వ్యాపించిన పైశాచీప్రాకృతరూపము లని చెప్పియుండుటచేత, దానిని పురస్కరించుకొని వీ రీదక్షిణదేభాష లన్నియు పైశాచీప్రాకృతభవము లని తలంచిన ట్లగపడును. పైశాచీప్రాకృతములను వాని స్వరూపలక్షణములను గూర్చి విశేషముగా తెలియదు. ద్రావిడభాషాలక్షణ ములతోఁ బోల్పదగియున్న స్వల్పవిశేషములను మాత్రమే లాక్షణికులు వాని ప్రత్యేకలక్షణములుగా నుదాహరించియున్నారు. గుణాఢ్యునిరచన పైశాచిలో నుండిన దన్నమాటయే గాని అది యెట్టిదో లోకమునకుఁ దెలియదు. ప్రాకృత భాషాలక్షణము లనేకములను విచారించి చూచినచో నవి విజాతీయభాషాసంప్ర దాయములవారు సంస్కృతభాషను నేర్చుకొనుసందర్భమున నాశబ్దములను స్వీయసంప్రదాయానుగుణముగా పలుకుచుండుటవలన గలిగిన మార్పులమూల ముగా నేర్పడిన వికారములే యని వ్యక్తము కాకపోదు. కావున నార్యభాషలు ప్రాకృతములుగా మారుటకు ముఖ్యకారణము వానిపైఁ గలిగిన విజాతీయభాషా సంప్రదాయప్రభావము (influence) అనక తప్పదు. ఆర్యులీ దేశమునకు వచ్చునప్పటి కీదేశము నిర్జనారణ్యముకాదు. ద్రావిడభాషలు మాట్లాడినవారు, కోలులు మొదలగువారు. నీయార్యులచే దస్యు లని, వ్రాత్యు లని, మ్లేచ్ఛు లని పిలువఁబడినవా రెవరెవరో కలరుగదా! వారిని వీ రణఁగద్రొక్కి సంఘములోఁ జేర్చుకొనినను, చేర్చుకొనకపోయినను వీరి భాషను వారు నేర్చుకొనునప్పు డైనను, వారి యుచ్చారణసంప్రదాయముల ననుసరించి యార్యభాష మారిపోక తప్పదు. క్రొత్త భాష లేర్పడక మానవు. "ఈ పిశాచజాతులవారు అంతకు పూర్వ మిచట నుండిన జాతులతో సంఖ్యము నెఱపి వారిని తమలోఁ గలుపు కొనుచుండిన కాలముననే" (ఆతరువాతనే) ఆర్యు లిందు ప్రవేశింపఁ జొచ్చిరి- (సం. I. ౫౫ పేజీ) అని పిశాచజాతులవారు, అంతకుపూర్వముండిన జనులు వారిభాషలతో నీదేశములో నార్యులు ప్రవేశించుటకుఁ బూర్వమే యున్నా రని శ్రీ నారాయణరావుగారే చెప్పుచున్నారు. వేదములకాలమునుండియు నీయాదిమ జను లార్యభాషను నేర్చుకొని భాషించు సందర్భమున నాభాష వీరి యుచ్చారణ సంప్రదాయముల ప్రభావముచే. దేశభేదమునుబట్టి భిన్నవిధము లగు ప్రాకృత

ములుగా మారిన దనుటకు సంశయ మేమి ? ఈ యాదిమఅనార్యజనులలో ద్రావిడభాషలను మాట్లాడిన జనులుకూడ నుండవచ్చు నని యొప్పుకొన్నప్పుడును, ప్రాకృతభాషలలోఁ గానవచ్చెడి యనార్యభాషాసంప్రదాయము లనఁబడునవి ద్రావిడ భాషాప్రసిద్ధములుగనే కనఁబడుచున్నప్పుడును, ఆ ప్రాకృతముల యొక్కయు, తరువాతి యార్యభాషలయొక్కయు ప్రాదుర్భావమునకు ద్రావిడ భాషాసంప్రదాయ ప్రాభవమే కారణ మని చెప్పుటకు వెనుదీయవలసిన పని యేమి ? సునీతికుమార ఛటర్జీపండితుఁడు తాను రచించిన బంగాళీభాషాచరిత్రలో నాధునికార్యభాషలపై ద్రావిడభాషసంప్రదాయప్రాబల్యమును నిరూపింపగల పట్టులను ప్రత్యేకించి చూపినాఁడు. వాని నన్నిటిని ఆంధ్రభాషాచరిత్రకారు లనువదించి తనగ్రంథములో (I - ౬౬ పేజీ) తెలుపుచు "ద్రావిడభాషలు ప్రాకృతములు కావనుకొనుటచే, నార్యభాషలు వే రనియు, ద్రావిడభాషల ప్రోద్బలమువలన నార్యభాషలు ప్రాకృతములుగాను నేటి యార్యభాషలుగాను పరిణమించిన వనియు చెప్పుట సంభవించినది" అని ఛటర్జీపండితు నెత్తిపొడిచినారు. వీరిగ్రంథము తెలుఁగులో రచింపఁబడుటచే ఛటర్జీగారికి తెలియలేదు. గాని-ఇది తెలిసియున్నట్లయితే - "అయ్యా, నేను ద్రావిడభాషలు ప్రాకృతములు కావనుకొన్న మాట నిజమే. కావుననే వానిప్రభావము వలన నివి బయలుదేరిన వని చెప్పినాను. మీరును ద్రావిడభాష ప్రాకృతజన్యములని, యేవిధముగా నైన, చూపవలెనని యనుకొనుటచేతనే గదా వారికి సూటిగా సమాధానము చెప్ప కుదరక, ఈపరిణామము సహజముగనే కలిగియుండవచ్చు నని లేదా ఇతర భాషలప్రోద్బలము (ఒక్కద్రావిభాషలు మాత్రము కాక- ఇతర అనార్య బాషలట ! - చేతనైనను కలిగియుండవచ్చు ననియు, ఇంక నేమేమో చెప్పి ద్రావిడ భాషలు ఆధునికార్యభాషలవలెనే క్రీ. శ. ౧౦ వ శతాబ్ది కిటీవలనే యేర్పడిన వని చెప్పవలసినస్థితి యేర్పడినది" అని వారు బదులు చెప్పియుండేవారే గదా! ప్రాకృతములోఁ గనఁబడు ద్రావిడభాషాసంప్రదాయము లనఁబడునవి ఇతర భాషాప్రోద్బలము వలన గగిలినచో వానిని ద్రావిడసంప్రదాయము లనవలసిన పనియేమి? ఇవి యే యితరభాషలలోఁ గనఁబడుచున్నవి ? ఈ ప్రశ్న రాకుండ చేయుటకే ప్రాచీన ప్రాకృతములకాలమున ద్రావిడభాషలు నేటిరూపమున నున్నవని చూపింపవలె నని వాగడుగుచున్నారు. ప్రాచీనప్రాకృతములకాలమున ద్రావిడభాషలుమాత్రము ప్రాచీన రూపముననే యుండును గాని నేటిరూపమున నెట్లుండఁగలవు ? అనార్యసంప్రదాయము లనఁబడునవి మాత్ర మాకాలపు ద్రావిడభాషలలోఁగూడ నిప్పుడువలెనే యుండకపోవు. అప్పుడు లేనివి యా భాషలలో నిప్పుడు కారణము లేకయే రావుగదా! ఆ కాలము లోను వీనిలో నున్న యనార్యసంప్రదాయములే వేదభాషలోఁ గాని,

సంస్కృతములోఁగాని కనఁబడక సామాన్యజనములు వ్యవహరించు నార్యప్రాకృతములలో మాత్రమే కనఁబడుటచేత అనార్యజనసంపర్కము గలిగిన వీరి భాషలలో నవి సంక్రమించియుండు నని తలఁచుట కవకాశము కలిగినది. అసలు ప్రాచీనప్రాకృతముల రూపమే యెట్టిదో నిర్ణయింప సుసాధ్యము కానప్పుడు ఆకాలపుద్రావిడభాష లిట్లుండె నని చూపవలసిన పనియేమి? చూపుటకు నిదర్శనము లెట్లు వచ్చును? వాస్తవముగా పైశాచీప్రాకృతస్వరూప మెట్లుండెనో ఎవరికి తెలుసును? ఏవో నాలుగైదువాక్యములనుబట్టి తరువాతి వైయాకరణులు చెప్పిన లక్షణపుముక్కలు తప్ప ద్రావిడి, దాక్షిణాత్య, కాంచీదేశీయ మొదలగువానిని పేర్కొనినవారు కేవలము అర్వాచీన ప్రాకృతభాషావైయాకరణులు గాని ప్రాచీను లెవ్వరును గారు. వీరి కాలమునకు 'జనని సమస్తభాషలకు సంస్కృత' మను భావము స్థిరపడినది. ప్రాకృత వైయాకరణులు ద్రావిడ, పైశాచీప్రాకృత వికార మన్నారు గనుక, దానినిబట్టి వీరును ద్రావిడభాషలన్నియు పైశాచీపరిణామ రూపములే యని నిరూపింప యత్నించినట్లున్నారు.

ఆధునికార్యభాష లన్నియు ౧౧ వ శతాబ్ది కిటీవల బయలుదేరినవే. వీనిలో ప్రాకృతములలోకంటె ద్రావిడసంప్రదాయచిహ్నములు విశేషముగాఁ గనబఁడుచున్నవి. ద్రావిడభాషలలోవలెనే వీనిలోనే నీవిజాతీయసంప్రదాయములు బయలుదేరిన వనిగదా వీరిభావము. కావున ద్రావిడభాషలనుగూడ ౧౦ వ శతాబ్ది ప్రాంతమునకే తీసుకొనిరావలసి వచ్చినది. ఇవి యంతకుపూర్వ ముండె నని చెప్పుటకు తగిన నిదర్శనములు లేవని భావించిరి. అయినను "తమిళములో ౫, లేక ౬ వ శతాబ్దినుండి గ్రంథములు కాన్పించుచున్నవి. తమిళము తరువాత లిఖితమైనది కన్నడము. ౭ వ శతాబ్దము. తరువాత లిఖితమైనది తెనుగు. ౯ వ శతాబ్దము" అని వారే చెప్పియున్నారు. క్రీ శ. ౫ వ శతాబ్దమువరకు భారతదేశమున ప్రాకృతభాషలు ప్రచారమం దుండినవి. నాటినుండి ౬, ౭ శతాబ్దముల వరకు దక్షిణదేశమున ప్రచారమం దుండిన భాషల స్వరూప మెట్లుండునో తెలుసికొనుట కాధారమే లేదట! (౬౦ పేజీ I సం) కావున ద్రావిడభాషల మూలమున ప్రాకృతభాషలు నేటియార్య భాషలును గలిగిన వనుట సమంజసము కాదని వారివాదము.

౬ వ శతాబ్దికి పూర్వమునందలి యాంధ్రదేశమును పాలించినరాజుల ప్రాకృతసంస్కృతశాసనములలోని తెలుగుదేశపుగ్రామనామములలో ద్రావిడ భాషాసహజము లగు లఘు శకటరేఫ 'ఱ'కారములు కనఁబడుచున్నవే. ఇంకను

అనేక దేశీయ శబ్దములు కనఁబడుచున్న వే. ఇవి యాదేశమున సంస్కృత ప్రాకృతములకంటె భిన్న మైన భాష యుండుటను సూచింపవా ?

తమిళములో క్రీ. శ. ౫, ౬ శతాబ్దములనాటికే గ్రంథములే కాన్పించుచున్నప్పుడు, ఆ శతాబ్దములలోనే కాని, అంతకు పూర్వమున గాని యాభాషకూడ ప్రచారములో నుండె ననుట యసమంజస మగునా ? ఉత్తరదేశమున ౫వ శతాబ్దమువరకు ప్రాకృతము ప్రచారమునం దుండినంత మాత్రమున ౫, ౬ శతాబ్దముల నాటికే తమిళభాషలో గ్రంథములు బయలుదేరినట్లు తెలియుచుండగా ౬, ౭ శతాబ్దముల నీదక్షిణదేశమున ప్రచారములో నుండిన భాషాస్వరూప మెట్లుండెనో తెలిసికొనుట కాధారములు లేకపోవు టేమి ? ఆయాకాలమునందలి గ్రంథము లప్పటు ప్రచారములో నున్న భాషాస్వరూపమును దెలుపలేవా ? కన్నడము ౭ వ శతాబ్ది వరకును, తెలుగు ౯ వ శతాబ్దివరకును లిఖితము కాలేదని ప్రాచీనశాసనపరిశోధకు లగు వీరే అట్లంటే, కేవలస్వీయవాదసమర్థనార్థమే అని అనుకోక తప్పదు గదా! ఈ భాషలలో ౬, ౭ శతాబ్దములవరకు శాసనములు కనఁబడలేదు గనుక, శాసననిదర్శనము లేదు గనుక, భాషలు కూడ నాకాలమున లేవనియే వీరు మరొకచోట ప్రతిపాదించిరి. ఒకభాషలో రచింపఁబడిన శాసనములు లేనిచో నాభాషయే లేదనగలమా ? ౫,౬ శతాబ్దములనాటికిఁ గల వన్న గ్రంథము లంతకుపూర్వ మాభాష కలదని చూపలేవా ? 'తిరునాథకున్రు' తమిళశాసనము, కన్నడమున 'హలిమిడి' శాసనము, తెనుఁగున చిక్కుళ్ళ శాసనములోని "విజయరాజ్యసంవత్సరంబుళ్" అను పదము ఆయాభాషలు ౪, ౫, ౬ శతాబ్దములలోఁ గలవని చూపఁగలవన్నచో నవి దొంగ (spurious) శాసనము లందురు గాబోలు! క్రీస్తు శకారంభమును పూర్వమునను ప్రాకృత శాసనములు మాత్రమే కనఁబడినంత మాత్రమున ద్రావిడభాషలు వ్యవహారముననే లేవనుట, హిందూదేశభాషలన్నియు ప్రాకృతజన్యము లను తమవాదమును సమర్థించుకొనుటకే గాని వేరుగా దనుట నిర్వివాదము.

ఇఁక నీవాదసమర్థనార్థమే యీద్రావిడభాషాధాతువుల శబ్దజాలమును, వాక్యరణరూపములను ప్రాకృతజన్యము లని నిరూపింప యత్నించిరి. ఈయత్నములో తెలుఁగురూపములనుమాత్రమే ప్రధానముగా గ్రహించిరి గాని ఇతరద్రావిడభాషారూపములతోఁ బోల్చి మూలరూపముల నన్వేషింపలేదు. వీలునుబట్టిమాత్రమే యితరభాషారూపములను గ్రహించిరి. ఉన్నఆధారము శబ్దరత్నాకరము. దానినే

వీరు వందలకు గాలించి ౨౫౦-౩౦౦ మించని దేశ్యధాతువులను గ్రహించిరి. వాని యంతములనుబట్టి కు, గు, చు, జు, టు, తు, డు వర్ణము లంతముఁ గలవిగా విభాగించిరి. సంస్కృతధాతుపాఠ మతివిపులమైనది. ఒక్కొక్కధాతు వనేక రూపములఁ గనఁబడును. ఒక్కగత్యర్థమున - ఉఖ, ఉఖి, నఖ, నఖి, మఖ, మఖి...ఈరీతిగా వందలు. ఈధాతువులతుదను తెలుగుధాతువులలో కు, గు, టు, డు ఇత్యాదివర్ణములను నిష్పత్తిచేయుటకు వీలైన మరియొకధాతువునో, ప్రత్యయమునో, లేదా మొదట ఉపసర్గనో చేర్చి, సామ్యము కనఁబఱచుట వీ రవలంబించిన పద్ధతి. ధూన్ + కృ > దూఁకు; కృశ్ + కృ = కెలకు: భీత + కృ = వడకు; ఏధ్ + కృ > ఎక్కు; నర్మ + ఇష్య = నచ్చు; పక్వ = పండు; విధృత = వెళ్ళు; కర్మిత = క్రుళ్ళు. పాణినీయధాతుకోశములోని ధాతువులు సరాసరిగా తెలుఁగులోనికి వచ్చినవి చాల గలవట! సం. అగ్ - తె. అగు; అణ్- అను; ఇల్ - ఏలు; కాశ్ - కాయు; పుషవ్ - పూచు; కృ - కొను ఇత్యాదులు (Mouth మూతి - Prop - ప్రాపు; eaten - తినెను మొదలగువానిని బట్టి తెలుఁగు ఇంగ్లీషునుండి వచ్చినదన్నవారును గలరు )

ఇఁక ద్రావిడభాషలలోని ప్రత్యేకవర్ణము లనఁబడు ఱ, ళ లను గూర్చి ఉత్తరహిందూస్థానభాషలలోఁ గూడ అనఁగా ౧౨ వ శతాబ్దినుండి వ్రాతలోనికి వచ్చినవానిలోఁ గూడ నీ 'ఱ' లేకపోలేదట. ఇది సంస్కృత ప్రాకృతములలో లేకపోయినను, క్రీ. శ. ౬ వ శతాబ్దినుండియు శాసనములలో ననేక దేశీయ శబ్దములలోఁ గానవచ్చుచుండినను, నీశబ్దములలో నీవర్ణము సంస్కృతశబ్దముల నుండిపుట్టినదనియే నమ్మవలెనట. దీనికి కారణముగా ౧౩ వ శతాబ్దిని శబ్దమణిదర్పణకారుఁడు 'ఘటికా' 'కుక్కుట' మొదలగు శబ్దములనుండి కన్నడమున గళిగె, కోళి మొదలగు శబ్దము లేర్పడిన వని చెప్పుటయే యని వారు గ్రహింతురు. ఇవి సంస్కృతశబ్దముల నుచ్చరింపలేని ద్రావిడజనులు తమ కలవాటైన 'ఱ'ను జేర్చిపలికిరేమో అన్నచో "ద్రావిడులు భారతవర్షమంతయు వ్యాపించియుండి రని (శాసన) ప్రమాణము చిక్కువరకు (సం. I-౨౩౭ పేజీ) మాటాడ కూడదట. 'ఱ' ౧౦ శతాబ్దికే తెలుఁగులో నంతరించినది, ళ ఇప్పటికి నిలిచియున్నదే. "ద్రావిడభాషలం దిది అనాదినుండియు ప్రత్యేక చిహ్నముతోఁ గాన్పించుచున్న" దట. (సం. I-౨౭౮). ద్రావిడభాషలు ప్రాకృతభాషావికారము లైనచో నీ శకటరేఫ మార్యభాషాశబ్దముతో సంబంధము కలిగియుండ

(డితీర)వలెనట." వికారములనియే వారు నిశ్చయించినారు గాన, సంబంధము కనఁబడకతీరునా? కాష్ఠమునుండి కట్టె, అర్వత్-ఏఱు, ఆరుహ్-తమి, పృష్ఠ,పిఱ్ఱ ఏట్,తె,ఎక్కు. ఇట్లె శకటరేఫము సంస్కృతమునుండి తెలుఁగునకు వచ్చినది.

ఇఁక 'సంధి' విషయమున "సంస్కృతమం దనేకవిధములుగా నుండిన సంధివిధాన మంతయు ప్రాకృతములందే (౧) అచ్చులు ప్రత్యేకముగా నిలిచి వాని నడుమ నొకయాగమాక్షరము చేరుట, (౨) పరరూపసంధి గలుగుట-అను రెండు విధానములుమాత్రమే నిలిచిన వట. సంస్కృతమునుండియే వచ్చిన యీ సంధిలో ఇంతమార్పు గలుగుటనుఁ గారణ మేమో ? అది సహజ మనియే నారాయణరావుగారి భావన. కాని ఈ సహజధోరణి ద్రావిడభాషలలోని ధోరణినే యనుసరించుటకు కారణమేమో ? విషయమును తిరుగవేయుటయే సమాధానము. "ద్రావిడభాషలలోని సంధికూడ నార్యభాషాసంప్రదాయానురోధియే కాని వేఱు కాదు" (I-33౪) అని వారి సమాధానము. సంధివిషయమున తమిళమళయాళములలోని దానిని చెప్పినారు. కాని అచ్చికశబ్దజాలము, ధాతువులు విషయమున నితరభాషారూపములతోఁ బోల్పఁబూనలేదు. పోల్చిచూడ నక్కఱలేకయే,'మూల ధాతువుల వైకృతత్వమునుగూర్చి యిదివరకే వివరింపఁబడిన' దని తృప్తిఁజెందినారు. ఈ తెలుఁగుధాతువులే సర్వద్రావిడభాషామూలరూపము లని కూడ వారు తలఁచిరి కాబోలును.

సంధిలక్షణమునుగూర్చి వలెనే సమాసలక్షణమునుగూర్చియు సంస్కృత వ్యాకరణమునకు సంబంధించినదంతయు తెలిపి సంస్కృతసమాసవిధానము తెనుఁగునకు "కొంతవఱకు మాత్రమే పొసఁగు" ననియు వ్యక్తము చేసినారు. కాని, యిందలి ఆవిశేలక్షణములైనను ఆర్యభాషలనుండి వచ్చినవేనా యను విషయమును బరిశీలింపలేదు.

సంస్కృతమున లింగము శబ్దగతము. శబ్దములయంతములనుబట్టి చూచినచో అనియతస్థితి కనఁబడవచ్చును. "ప్రాకృతమున లింగవిషయమున వ్యత్యయము గలిగినది. ద్వివచనము లోపించినది విభక్తిప్రత్యయములు నసుసిపోయినవి" (సం. II-౮౩౨). ఆధునికార్యభాషలలో నిదివరకే యస్తవ్యస్త మయిన శాబ్దికలింగము మరింత వ్యత్యయమంది విడనాడఁబడి జాతినిబట్టి లింగ మేర్పడఁ జొచ్చినది. అట్టిభాషలలో నీ విధానము చాలవరకు ద్రావిడ భాషా మార్గము

ననుసరించినది. (II-౮౩౪). ఈ ద్రావిడభాషలు ప్రాకృతజన్యములే యని చూపుటయే గదా వీరి ప్రయత్నమంతా. ఆధుని కార్యభాషలతోపాటు ఇవియు ప్రాకృతములనుండి పుట్టినవే. అట్టి సందర్భములో జాతినిబట్టి లింగ మేర్పడుట యీ ద్రావిడభాషలకు మాత్రమెట్లువచ్చును ? వీనితో సజాతీయములే యని చెప్పఁబడుచున్న యితరార్యభాషలు "ద్రావిడభాషామార్గము ననుసరించుట" యెట్లు పొసఁగును? ద్రావిడవిశిష్ట లక్షణము లనఁబడున వన్నియు ప్రాకృతముల నుండి వచ్చినవనియే కదా వీరి వాదము. సంస్కృతముననే జాతి, లింగము కలదని తరువాత చెప్పియేయున్నారు. అప్పుడు కోల్ భాషల సంపర్గమువలన నీమార్పు రావచ్చునను ఛటర్జీగారి వాదముతోనే పనిలేదు. కాని పైని ఆర్యభాష లీలింగవిషయమున ద్రావిడభాషామార్గము ననుసరించిన వని తామే చెప్పుచు "ద్రావిడభాషా సంపర్కము మూలముననే కలిగినదని ఛటర్జీగారు తెలిపిరి. కాని యీవిషయమున వారి భావనాశక్తియే మూలము" అని నారాయణరావుగారు చెప్పుదురు. తాము పైని చెప్పిన విషయమే ఛటర్జీగా రన్నప్పుడు అదివారిభావనాశక్తిమూలమైనదట! "ఆనాటి ద్రావిడభాష లనఁగా నేవో ? వాని స్వరూప మెట్టిదో ?"- సమాధానము ఛటర్జీగారు చెప్పవలెనట (II-౮౫౯). ఇతరార్యభాషలు ద్రావిడభాషాలక్షణమునే యెందు కనుసరించినవి ? ప్రాచీన ప్రాకృతమున లింగ మస్తవ్యస్త మగుటకుఁ గారణ మేమి? క్రీ.శ. ౫, ౬ శతాబ్దములనాఁడు గ్రంథములై యున్నవని తామే చెప్పిన ద్రావిడభాషలు అంతకు పూర్వము ప్రాకృతములనాడు లేవా ?

వచనము విషయమై కాల్డ్వెల్ చూపిన ద్రావిడార్యభాషలకుఁ గల భేద మొక్క తమిళమునకే వర్తించునట (II-౮౬౪). అన్ని విషయముల లోను గూడ నీ భాషలకు గల సామ్యభేదములు చూచి, మూల లక్షణములను కనిపెట్ట వలసి యుండునుగదా. తెలుఁగున గూడ నట్టివాడుక లేకపోలేదని వారేనిఅన్నారు. కాల్డ్వెల్ చూపిన తక్కిన భేదములను వీరు కాదనలేకపోయిరి. విభక్తివచనముల కొక్కేప్రత్యయ మార్యభాషలో నుండుట కాదందురా? అట్టి వీ ద్రావిడభాషలో గలవందురా? విభక్తి విధానమే విభిన్నము. క్రియావిభక్తి పద్ధతియు నట్టిదే.

"సంఖ్యావాచకములకు ప్రాకృతములందు గాని, ఇతరార్యభాషల యందు గాని పోలికలు చిక్కుట లేదట" (II-౧౧౮౪). యూరపియన్ భాషలలో గూడ సామ్యము కనఁబడుటలేదు. కావున దీనికిఁ గారణ మొక్కటేయై యుండును. దీనికి మూలమైన పైశాచీభాష ప్రచారమునుండి తొలఁగియుండవలయు ననుట.

లేదా, ఏ ఐరేనియన్ భాషాపదములతోనో ముడిపెట్టవలయునన్నచో నీభాషలలోని పదములరూపములను పోల్చిచూడవలసియుండును. 'ఒక' ఏకశబ్దభవమే కావచ్చును. కాదనుటకు కాల్డ్వెల్ అనవసరముగా బాధపడినాఁడు. రెండు=రొండు, ఇది దొందు > ద్వంద్వమునుండి వచ్చినది. మూఁడు, నాలుగు శబ్దములకు మూలము లేమియు కనఁబడ లేదని మాత్రము నిశ్చయించినారు. ఏను, అయిదు మొదలగు ద్రావిడరూపముల కన్నిటికి 'పంచన్' అనునదే మూలము. 'షష్' ప్రాచీనప్రాకృతములందే 'హర్-హర్' లుగ మారి "ఐరేనియన్ భాషలకు సంబంధించిన పైశాచికభాషలద్వారా ద్రావిడభాషలయందు మొదటినుండియు నెలకొనియున్నవని చెప్పవచ్చునట. (II-౧౧౮౮). ఐరేనియన్ భాషలకు సంబంధించి యిదివర కెప్పుడో బహుశః అంతరించిపోయి యుండిన 'పైశాచీభాషల' తోనే తక్కిన ద్రావిడభాషాలక్షణము లనుకొనుచున్న వన్నియు కూడ మొదటి నుండియు, క్రీస్తుశకము మొదటినుండియు నుండినవని ఏల తలంపఁగూడదు? అంతరించిపోయిన యా భాషలతోపాటు ద్రావిడభాషలు నా కాలముననే యుండి యుండును.

విశేషణములు విశేష్యములు లింగ, విభక్తి, వచనములనుబట్టి మారుచుండుట సంస్కృతములో నుండుటచే కాల్డ్వెల్లీ భాషలకు సంబంధము లేదన్నాఁడు. సంస్కృతములో నామార్పు విధి యేమైనను దానికి సంబంధించిన యనేకార్య భాషలలో ద్రావిడభాషల యందువలెనే అట్లు మారనక్కర లేదట ! కావున నా యార్యభాషలవలెనే ద్రావిడభాషలును సంస్కృతాదిభాషా జన్యములు కావలెనని వీరి భావము. ఈ భావమును సమర్థించుకొనుటకు తెలుఁగులో తత్సమవిశేషణముల లింగము మారుచున్నదని తెలుపుట. భాషయొక్క సహజ లక్షణమును గుర్తించుటకు ఇతర భాషలనుండి యెరువుతెచ్చుకొనిన సొమ్ములనా పరిశీలించుట!

ఉదా: సుగుణాభిరాముఁడు, రాముడు, భక్తవత్సల సీత కాపాడుగాత. ఇవి తత్సమభాషలో నుదాహరించుట. "ఇట్టివనేకములు సంస్కృతభాషావ్యాకరణముల ప్రభావముచే నీభాషలోనికి వచ్చినవి కలవు. వానినిబట్టియా యీభాషాసహజలక్షణములను కనిపెట్టుట? శ - ర - లోని తత్సమశబ్దజాలమునుబట్టియే యీ భాష సంస్కృతజన్య మని చెప్పఁదలచినట్లే యుండును. తరతమభావమును సంస్కృతమునందుకంటె భిన్నముగఁ దెలుపుట ప్రాకృతభాషలందే బయలుదేరినదట. కావున తెలుఁగునకు, సంస్కృతమునకు సంబంధము లేదని చెప్పగూడఁదట. ప్రాకృతములద్వారా సంబంధమట, క్రియలనిర్మాణవిషయమునగూడనాథుని కార్య

భాషలకును ద్రావిడభాషలకు నెంతో సామ్యము కలదట. కాని యాచాయల నార్య భాషలు ద్రావిడభాషలనుండి యెరువుదెచ్చుకొన్న వందురు. వా రీరెండువర్గము లకుఁ గల భేదములనుగూర్చియే యెక్కువగ నూది చెప్పుదురు'' అని వారి వాదము. సంస్కృతమునుండి వచ్చినభాష లగుటచే సంస్కృతభాషా సంప్రదా యము లనేకములు వీనిలో సంక్రమించి యుండుట సహజము. ఆ నిలిచియున్న సంస్కృత సంప్రదాయములు ద్రావిడభాషాసంప్రదాయములకు భిన్నములు కాక మానవు. ద్రావిడభాషాసంపర్కప్రభావముచేత ననార్యసంప్రదాయములు మరి కొన్ని వానిలోఁ జేరినపుడవి ద్రావిడభాషలతోఁ బోలికను కల్పింపకమానవు. కావున నీభేదము దృష్టిభేదమునుబట్టి యేర్పడినదిగాఁ గనఁబడక పోదు. 'సరళ దృష్టి' యనున దేది యనునదే విచార్యము.

ఈ దేశములోఁ గాని,యితరదేశములలోఁ గాని భాషాతత్త్వజ్ఞులగువా రనేకు లీద్రావిడభాష లార్యభాషాజన్యము లను వాదమును బలపరచువారుగాఁ గనఁ బడరు. పలువురు ద్రావిడభాషావిశేషలక్షణములనుగూర్చియు, నందలి ధ్వని సంప్రదాయములను ధ్వనిపరిణామరీతులను గూర్చియు, నీకుటుంబమునందలి ప్రత్యేకభాషల ప్రాచీనచరిత్రాన్వేషణము, ఆధునికమాండలికభాషలలోని పరి ణామవిశేషపరిశీలనము మొదలగువానిని గూర్చియే విశేషపరిశ్రమ చేయు చున్నారు. ద్రావిడభాషలలోని ధ్వనిపరిణామరీతులనుగూర్చి "London School of Oriental Studies" అను సంస్థలోని బరోన్, ఆల్ఫ్రెడ్ మాస్టరు, టర్నర్ మొదలగువారు కడుశ్రద్ధతో పనిచేయుచున్నారు. ఫ్రాన్సు దేశ మునగూడ Jules Bloch పండితుఁడు ద్రావిడభాషానిర్మాణలక్షణములను గూర్చి యిటీవలనే ఫ్రెంచిభాషలో నొక యుద్గ్రంథమును బ్రకటించినాఁడు. అమెరికాలోఁగూడ 'భాషాతత్త్వశాస్త్రపత్రిక' (Philological Journal)లో ద్రావిడభాషాతత్త్వమును గూర్చిన వ్యాసములు ప్రకటితములగుచున్నవి. ద్రావిడ భాషలప్రత్యేకతను, వాని విశేషలక్షణములనుగూర్చి యీదేశముననేగాక యితర దేశములలోఁగూడ విశేషపరిశ్రమ జరుగుచున్నది. మనదేశమందలి యువకులును భాషాతత్త్వశాస్త్రమునందును, ద్రావిడభాషాతత్త్వపరిశీలనమునందును నితోధిక శ్రద్ధ వహించి, తెలుఁగుభాష పుట్టుపూర్వోత్తరములను సరిగాఁ దెలిసికొని ప్రాచీనకాలమున నీభాషాశాస్త్రమునకు మనదేశమునఁ గల గౌరవమును నిలువ బెట్టుదురు గాక !

— భారతి - రజతోత్సవ సంచిక.
సర్వధారి - పుష్యము; జనవరి - 1949.
సంపుటము- 26; సంచిక-1.

# ధ్వని - వర్ణం

—డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి

ఒక వ్యక్తి మాట్లాడేటప్పుడు అత నుద్దేశించింది 'ఇది', 'అది కాదు' అని ఆ భాషావ్యవహర్తల కెలా తెలుస్తుంది ? ఈ ప్రశ్నను గురించి నిశితంగా ఆలోచిస్తే వ్యవహర్తలజ్ఞానంలో భాషాధ్వనులకు ఒక విలక్షణమైన కట్టుబా టున్నట్టు కని పిస్తుంది. ఉదాహరణకు 'ఉన్నావ్‌' 'ఉన్నావ్' అనే రెండు చిన్నవాక్యాలు తీసు కుందాం. ఈ రెండిటిమధ్య ఉన్న అర్థభేదం తెలుగువాళ్ళు ఎలా గుర్తిస్తున్నారు ? రెండువాక్యాల్లోనూ 'ఉన్నా' వరకు సమానంగానే ఉంది. అంటే ఈ భాగంవల్ల ఆరెండింటిమధ్య ఉన్నభేదం స్ఫురించటం లేదన్నమాట. ఒకవాక్యం చివర 'వ్‌' అంటంవల్ల రెండోవాక్యంచివర 'వ్' అంటం వల్లనే ఈ రెండూ ప్రత్యేక వాక్యా లని శ్రోత గుర్తిస్తాడు. ఇంకా వివరిస్తే 'ఉన్నావ్‌' 'ఉన్నావ్' అనే వాక్యాల మధ్య అర్థభేదం 'వ‌-వ'*ల ఉచ్చారణభేదాన్ని గుర్తించటంవల్ల ఏర్పడ్డ దని చెప్పవచ్చు. కాని 'ఉన్నావ్‌' అనే బదులు ఎవరన్నా 'ఉన్నామ్' అన్నారను కోండి; రాయలసీమ వ్యవహర్తలు చాలామంది సర్కారుల్లో 'వ‌' అనేచోట 'మ' అనే ఉచ్చరిస్తారు. ఇక్కడ 'వ‌' బదులు 'మ' ఉంచటం వల్ల అర్థభేదం రావటం లేదు. అంటే 'వ‌, వ'ల భేదం లాగా 'వ‌-మ'ల భేదం తెలుగులో ఏ మాండ లికంలోను అర్థభేదకం కాదన్నమాట. మరికొన్ని ఉదాహరణలు తీసుకుందాం. కాలం-గాలం, చూలు-జూలు, టోకు-డోకు, తగ్గు-దగ్గు, పాట-బాట; వీటెన్నంత తప్పక ఉచ్చారణభేదంతోనే అర్థభేదాన్ని కలిగించే ఇలాటి మాటల జంటల్ని పరిశీలిస్తే, ఆయాఉచ్చారణభేదాలు తెలుగువ్యవహారంలో అర్థభేదనసమర్థా లని తెలుస్తుంది. అంటే క-గ, చ-జ, ట-డ, త-ద, ప-బ లమధ్య ఉన్న ఉచ్చా రణభేదమే (పరుష-సరళభేదం) పై మాటల్లో భిన్నార్థస్ఫూర్తిని కలిగింప గలది. తెలుగు మాతృభాషగా మాట్లాడే వాళ్ళందరికి ఈ ధ్వనులమధ్య ఉన్న

---

* ఈ విధంగా ఉదాహరించిన చోట్ల ధ్వనులు కేవల హల్మాత్రాలుగానే గ్రహిం చాలి. 'మ' అంటే కేవలవ్యంజనం 'మ్' అనే గ్రాహ్యం. అకారసంయోజనం ఉచ్చారణకోసం మాత్రమే.

భేదం గుర్తించే శక్తి వ్యవహారశిక్షణలో చిన్నప్పట్నించి సహజంగా ప్రవర్తిస్తుంది. అలా ప్రవర్తించకపోతే ఒక అర్థం ఉద్దేశించినప్పుడు మరొకటి రాకుండా నివారించటం వీలు కాక వ్యవహారం కష్టమౌతుంది.

భాషలో ఉచ్చరించేధ్వనులు నియతసంఖ్యంగానే ఉంటాయి. కాని, అన్నిటి మధ్యా పై జెప్పినటువంటి భేదమే - అంటే భిన్నార్థస్ఫోరక మైన భేదం ఉండితీరాలన్న నియమ మేమీ లేదు. ఇంతకుముందు చెప్పినట్టు 'వ(-మ'ల భేదం ఇలాటిది కాదు. ఈ తరగతికి చెందిన మరికొన్ని ఉదాహరణలు తీసుకుందాం. కాశీ-ఖాశీ, కారం-ఖారం, జాజి-జాజి, ఈజంటల్లోని మాటలమధ్యగూడా ఉచ్చారణ భేదం (ధ్వనిభేదం) ఉంది. భౌతికంగా క-గ, చ-జల మధ్య ఉన్నది ఎలా భేదమనిపించుకుంటుందో, అదేవిధంగా క-ఖ, జ-జల మధ్యదిగూడా ఉచ్చారణ భేద మనే చెప్పాలి. కాని ఈ భేదం భిన్నార్థస్ఫూర్తిని కలిగించటం లేదు. అంటే క-ఖ, జ-జల భేదం క-గ, చ-జల భేదంలాగా మనవ్యవహారంలో ప్రవర్తించటం లేదు. కాని సంస్కృతంలో కళ-గళ, కర-ఖర, మొదలగుచోట్ల క-గల భేదంలాగానే క-ఖల భేదం కూడా ఆవశ్యక మైంది. ప్రాచీనతమిళంలో క-గల భేదం తెలుగులోలాగా భిన్నార్థ స్ఫోరకం కాదు. నేటితెలుగులో చాలామంది వ్యవహారంలో పదాదిగకారానికీ, పదంమధ్య అద్విరుక్తంగా వచ్చే గకారానికి ఉచ్చారణలో తేడా ఉంది, ఉదా॥ గాలి, గుర్రం, పగలు, మొగుడు. పదాది గకారాన్ని బరువుగాను పదమధ్యంలో వచ్చే గకారాన్ని తేలిగ్గాను ఉచ్చరిస్తాం. ధ్వనిశాస్త్రపరిభాషలో మొదటిరకం 'గ'ను కంఠ్యస్పర్శం అనీ, రెండోరకం 'గ'ను కంఠ్యోష్మం అనీ అంటారు. (చూ. అనుబంధం), ఎవరన్నా పైపదాల్లో ఉచ్చారణను తారుమారుచేసి 'గ'బదులు 'గ'కారం ఉచ్చరించినా అర్థసందిగ్ధత గాని, భేదంగాని ఏర్పడదు. అంటే 'గ-గ'లభేదం గూడా 'వ(-మ' 'క-ఖ'ల భేదంవంటిదే గాని 'క-'లభేదం వంటిది గా దని తెలుస్తున్నది. పై చర్చసారాంశం: ప్రతిభాషావ్యవహారంలోని ధ్వను లన్నిటిమధ్యా ఉచ్చారణభేదా లుంటాయి. ఈభేదాల్లో కొన్ని అర్థభేదనసమర్థాలు, కొన్ని అర్థభేదన అసమర్థాలు. భాషలో మొదటిరకం భేదాలు ప్రధానమైనవి. ప్రధానభేదాలనే వ్యవహర్తలు గుర్తిస్తారు. అప్రధానభేదాలు సామాన్యంగా ఉన్నట్టుకూడా వక్తలు, శ్రోతలు గుర్తించరు.

అప్రధానభేదం గల ధ్వనులమధ్య సంబంధం భాషలో నియతంగా ఉంటుంది. ఇక్కడ 'నియతం' అంటే ఆయాధ్వనులమధ్య ఉన్నఉచ్చారణభేదం ఏయేపరిస్థితుల్లో ప్రవర్తిస్తుందో సూత్రరూపంలో చెప్పవచ్చు ఇంతకుముందు

చెప్పిన ఉదాహరణల్లో 'వఁ-మ', 'క-ఖ', 'గ-గ' మొదలైనవాటిమధ్య ఉన్నది అప్రధాన భేదం అని చెప్పేం. ఈ అప్రధానభేదం రెండువిధాలుగా ఉంటుంది.

ఒకటి, స్థానభేదాన్నిబట్టి నిర్ణయింప దగినది. నేటి తెలుగులో ముఖ్యంగా సర్కారుప్రాంతం వ్యవహారంలో వినబడే 'మ-వఁ' 'గ-గ' లభేదం ఇలాటిది. పదాదిని, ద్విత్వమైనప్పుడు, ఓష్ఠ్యస్పర్శాలముందు 'మ్' అనే ఉచ్చారణ వినబడుతుంది. ఉదా: మాట, అమ్మ, గమ్ప, అమ్బలి; పదమధ్యంలో (అచ్చులమధ్య) అద్విరుక్తంగా వచ్చినప్పుడు, పదాంతంలోను, సంయోగంలో 'వ, స, హ'లు పరంగా ఉన్నప్పుడు 'వ్ఁ' అనే ఉచ్చారణ వినబడుతున్నది. ఉదా॥ మావఁ (మామ), పుస్తకవ్ఁ (పుస్తకం), సవ్ఁవచ్ఛరవ్ఁ (సంవత్సరం), మావ్ఁసవ్ఁ (మాంసం), సివ్ఁహవ్ఁ (సింహం); అలాగే 'గ-గ'ల భేదంగూడా స్థానాన్నిబట్టి నిర్ణయించవచ్చు. పదాదిని, ద్విరుక్తమైనప్పుడు, గకారోచ్చారణం, ఉదా: గాలి దగ్గు, మొ; అపదాదిని, అద్విరుక్తంగా వచ్చినప్పు డల్లా 'గ'కారోచ్చారణం, ఉదా॥ తగాదా, పగలు, మొగుడు మొ. నియతంగా వినిపిస్తుంది. తెలుగులో చ-చే, జ-జేల భేదంగూడా ఇటువంటిదే. తాలవ్యాచ్చులైన ఇ,ఈ,ఎ,ఏ, ఎ, ఏ లకు ముందు, చ-జలు గాను, కంఠ్యాచ్చులైన అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓలముందు, చేదువు, చేప, పలుకుతుంటాం. చిలువ, చీవఁ, చెంబు, చేదు, కుంచె, చేప చే జే-లుగాను చ్చేక్క, చేూపు, చేొప్ప, చేోటు.

పైన ఉదాహరించిన 'మ-వఁ'ల జంటలో, 'మ' వచ్చేచోట 'వఁ' గాని, 'వఁ' వచ్చేచోట 'మ' గాని ఉచ్చరించం. అలాగే 'గ-గ'లు, 'చ-చే'లు 'జ-జే'లు పరస్పరభిన్నపరిసరాల్లోనే ఉచ్చరిస్తాం. ఆ పరిసరాలను నియతంగా నిరూపించవచ్చు. కాని ప్రధానభేదం కల క-గ, చ-జ మొదలయిన ధ్వనుల జంటలు పరిశీలిస్తే వాటిమధ్య ఇలాటి నియతసంబంధము కనిపించదు. పదం మొదట, మధ్య, ద్విరుక్తమైనప్పుడు, అద్విరుక్తమైనప్పుడు గూడా 'క-గ'లు వ్యవహారంలో ఉన్నాయి. ఉదా: కాలం-గాలం, నకలు-నగలు, దక్కు-దగ్గు. 'మ-వఁ' మొ. వాటిలాగా పరస్పరభిన్నపరిసరాల్లోనే గాక 'క-గ'లు సమాన పరిసరాల్లోనే రావటంవల్ల వాటిసంబంధం నియతం అని చెప్పటానికి వీల్లేదు.

రెండోరక మయిన అప్రధానభేదం, పదంలో ఒకేస్థానంలో (పరిసరంలో) రెండుధ్వనుల్లో ఏఒక్కధ్వని ఉచ్చరించినా అర్థభేదం లేకపోతే, ఆరెండిటి మధ్య సంబంధం కూడా అప్రధానమైందే. ఉదా॥ కాశీ-ఖాశీ, కారం-ఖారం

మొదలైన చోట్ల, 'క'కారం ఉచ్చరించినా, 'ఖ'కారం ఉచ్చరించినా అర్థబోధకతలో సందిగ్ధత గాని, మార్పు గాని లేదు. ఈవిధమైన అప్రధానభేదంలో 'క-ఖ'లు 'మ-వ('ల లాగా పరస్పరవిభిన్నస్థానికాలు గాక, ఏకస్థానికాలు గానే ఉన్నాయి. 'కాలం-గాలం'లో గూడా క-గలు ఒకేస్థానంలో మారుతున్నధ్వనులైనా ఆ మార్పువల్ల అర్థభేదం ఏర్పడుతున్నది గాబట్టి, ఆ భేదం ప్రధాన మైనది. ఆ భేదంవల్ల 'కాలం-గాలం' రెండు భిన్నపదాలుగా గుర్తిస్తున్నాం. 'క-ఖ'లభేదం వల్ల అర్థభేదం రావటం లేదు. కాబట్టి 'కాశీ-ఖాశీ' ఏకపదంగానే గుర్తిస్తాం.

ఇకముందు ప్రధానభేదాన్నే 'భేదం' అని వ్యవహరిద్దాం. ఇప్పుడు వర్ణ స్వరూపాన్ని రెండుమూడుపద్ధతుల్లో నిర్వచించవచ్చు. వాగ్వ్యవహారంలో అర్థ భేదనసమర్థమైన కనిష్ఠాంశాన్ని 'వర్ణం' అనవచ్చు. 'క, గ, చ, జ' మొదలైనవి వర్ణాలు. ఇవి ఎలా అర్థభేదనసమర్థాలో ఇదివరకు చూపించేం. కనిష్ఠాంశం అనటంవల్ల 'క' అన్నదానిలోని ఏకదేశానికి భాషలో అర్థభేదాన్ని కలిగించే శక్తి లేదు. అంటే దాన్లో ఏకదేశం ఎలా ఉంటుందనవచ్చు. 'క'అన్న ఉచ్చారణ జిహ్వామూలం, మృదుతాలువును తాకి లోపలినుంచి వచ్చే శ్వాసను క్షణ కాలం నిరోధించి విడవటం వల్ల ఏర్పడుతున్నది. ధ్వనిశాస్త్రపరిభాషలో స్థానకరణాలనుబట్టి దీన్ని 'కంఠ్యం' లేక 'హనుమూలీయం' అనీ, ప్రయత్నభేదాన్ని బట్టి 'అఘోష (పరుష) స్పర్శ' మనీ అంటారు. పైన నిరూపించిన అస్య ప్రయత్నసర్వస్వంవల్ల 'క'కారోచ్చారణం ఏర్పడుతున్నా అప్రయత్నభాగాలకు (ఏకదేశసూత్రాలకు) వ్యష్టిగా భాషలో అస్తిత్వం లేదు. అందుకనే 'క'కారం భాషలో కనిష్ఠభేదకాంశం అన్నాం. తార్కిక భాషలో ప్రతిభేదకాంశమూ తానొకభేద మవుతుంది కాబట్టి, వర్ణం భాషలో 'కనిష్ఠ భేదం' అని ఇంకా సంగ్రహించి చెప్పవచ్చు. మిగిలినవా టన్నిటికంటే భిన్నమైంది భేదం. భాషలోని ప్రతివర్ణమూ, మిగిలిన వర్ణాలన్నిటినించి గుర్తించటానికి వీలైందిగా ఉండాలని తాత్పర్యం. అయితే అప్రధాన మైన భేదం కల ధ్వనులను ఈ నిర్వచనంలోనికి ఎలా సరిపెట్టటం అనేప్రశ్న వస్తుంది. అన్యోన్యప్రధానభేదం లేని ధ్వనులన్నీ కలిసి ఏకైకభేదంగానే భాషలో ప్రవర్తిస్తాయి. పైన నిరూపించిన 'మ-వ(,' 'గ-గ్,' 'చ-చే' మొదలైన జంటల్లో ఒక్కొక్కజంట ఒక్కొక్క వర్ణం. దీన్నిబట్టి వర్ణం అంటే ఉచ్చరితధ్వనిమాత్రమే కాదని విశదమౌతుంది. అందుకనే కనిష్ఠభేదం అన్నాం. ఉచ్చరించిన ధ్వనిప్రతిదీ ఏదో వర్ణానికి చెందుతుంది గాని, ప్రతివర్ణమూ ఒక్కొక్కధ్వనిసూత్రానికి గ్రాహకం కాదు. ఇప్పుడు 'వర్ణం' అన్నపదానికి నిర్వచనం మరికొంత ప్రపంచించవచ్చు.అప్రధానభేదం

కలిగి, అర్థబోధలో ఏకైకకనిష్ఠభేదంగా వర్తించే ధ్వనులసమూహం వర్ణం అన వచ్చు. ఒకేవర్ణానికి చెందిన ధ్వనులను, కొంతవరకు ప్రాచీనుల పరిభాషను బట్టి 'సవర్ణా'లని చెప్పవచ్చు. నేటితెలుగులో 'మ-వ' 'గ-గ్', 'చ-చే' మొదలైనవి సవర్ణాలు. సవర్ణాల మధ్య ఉచ్చారణసాదృశ్యం ఉండాలి. అవి భిన్నపరిసరాల్లో వచ్చేవిగానైనా ఉండాలి. లేక ఒకేపరిసరంలో పర్యాయవృత్తిగా వచ్చినా అర్థ భేదకాలు గాకుండా (స్వతంత్రపరివర్తనీయాలుగా) నైనా ఉండాలి.

రెండువర్ణాలమధ్య మనం గుర్తించే భేదం - అంటే రెండుసవర్ణసమూహాల మధ్య నుండే భేదం-ఉచ్చారణధర్మాల్లోని భేదంవల్ల నేర్పడుతున్నది. ఉదా॥ సవర్ణాలైన 'చ-చే'లు ఒకవర్ణం, 'జ-జే'లు మరొకవర్ణం (చూ. వెనుకటి పేరా). 'చ-చే'ల మధ్య ఉచ్చారణలో కొన్నిపోలిక లున్నాయి. రెండూ స్పృష్టోష్మాలు, రెండూ శ్వాసవద్ధ్వనులు, స్థానకరణాల్లో మాత్రం చిన్నతేడా ఉంది. 'చే'కు స్థానం దంతమూలం, కరణం నాలుకకొన; 'చ'కు స్థానం కఠినతాలువు, కరణం జిహ్వామధ్యం; అలాగానే 'జజే'లు కూడా స్పృష్టోష్మాలు, కాని ఈ రెండూ నాద వత్ధ్వనులు, 'చ'కు లాగానే 'జ'కు 'చే'కు లాగానే 'జే'కు స్థానకరణా లుంటాయి. 'చ-చే'లకు'జ-జే'లకు సాదృశ్యం స్థానకరణాల్లో ఉంది భేదం మొదటిజంట శ్వాస వంతం, రెండోజంట నాదవంతం;ఈ రెండుజంటల్ని రెండుభిన్నవర్ణాలుగాగుర్తింప జేసేధర్మం శ్వాస-నాదభేదం. 'చ-చే'ల మధ్యనూ స్థానకరణాల్లో భేదం ఉన్నా అవి భిన్నవర్ణాలు కావటం లేదు: 'చజే'ల మధ్య స్థానకరణాల్లో సమానత్వం ఉన్నా అవి ఒకేవర్ణంలో భాగాలు కావటం లేదు. అంటే రెండు జంటలకూ భిన్న వర్ణత్వం ఆరోపించే ఉచ్చారణధర్మం, శ్వాసనాదభేదం కాని, దంత మూలీయ తాలవ్యభేదం కాదు. 'చేల్లు-జేల్లు' అన్నప్పుడు ఇవి రెండూ భిన్నశబ్దాలు కావటం 'చే-'జేల భేదాన్నిబట్టే అలాగే 'చీడ-జీడి' అన్నప్పుడూ. 'చ-చ'ల మధ్య ఉన్న స్థానకరణభేదం అప్రధానం కాబట్టే ఎవరన్నా 'చ' అనవలసినచోట పొరపాటు వల్లనో, బుద్ధిపూర్వకంగానో 'చే' అన్నా అర్థసందిగ్ధత ఏర్పడదు. 'చూడు' అన్నది 'చూడు' అంటే ఏదో వింతగా అనిపించవచ్చు గాని అర్థభేదం కలగదు. అందువల్లవర్ణాలకు భిన్నత్వం చేకూర్చే ఉచ్చారణధర్మాలు ఏరెండువర్ణాల మధ్య కనీసం ఒకటైనా ఉంటుంది. సవర్ణాలమధ్యనుండే ఉచ్చారణలను భేదాలు భాషలో అప్రధానాలు. భిన్నవర్ణాల (సవర్ణసమూహాల) మధ్యనుండే ఉచ్చారణభేదాలు ప్రధానాలు. తెలుగులో శ్వాసనాదభేదం ప్రధానమైంది. అందువల్లనే, క-గ, చ-జ, ట-డ, త-ద, ప-బ మొదలైనవి భిన్నవర్ణాలుగా గుర్తిస్తున్నాం. కాని స్పర్శోష్మ

భేదం— 'మ-వఁ' 'గ-గ'ల మధ్య నున్నది-అప్రధానం. 'క-గ'లు రెండూ కంఠ్యాలు, రెండూ స్పర్శాలు. కాని ఒకటి శ్వాసవంతం (అఘోషం). రెండోది నాదవంతం (ఘోషం లేక సరళం). శ్వాసనాదభేదం, ఈ రెంటిమధ్యా కనిష్ఠం. 'క-ప'లు కూడా భిన్నవర్ణాలు. ఇవి రెండూ, స్పర్శలు పరుషాలు. కాని ఒకటి కంఠ్యం, మరొకటి ఓష్ఠ్యం. ఇక్కడ వర్ణభేదకత ఉచ్చారణ స్థానకరణాల్లోని భేధాన్నిబట్టి వచ్చింది. ఓష్ఠత్వం, కంఠ్యత్వం వర్ణభేదకధర్మా లన్నమాట. 'క-రలు' కూడా భిన్నవర్ణాలె. రెండింటిమధ్య ఉన్న ఉచ్చారణభేదం ఇక్కడ గరిష్ఠం. 'క'— స్పర్శం, కంఠ్యం శ్వాసవంతం. 'ర' దంతమూలీయం. రేఫ (కంపితం) నాదవంతం. ఈ విధంగా వర్ణాలను పృథక్కరించి గుర్తింప జేసే ఉచ్చారణవిశేషాలను (వర్ణ) భేదకలక్షణా లని చెప్పవచ్చును. వీటినే ఆంగ్లంలో Distinctive features అంటారు. ప్రతివర్ణాన్నీ మిగిలినవర్ణాలనించి వేరుచేసే భేదకలక్షణం ఒకటిగాని అంతకంటె ఎక్కువగాని ఉండవచ్చు. అటువంటివి స్థానకరణ ప్రయత్నాలనుబట్టి ప్రతిభాషలోను నియతసంఖ్యాకంగా నిరూపించవచ్చు ఈ విభజనప్రకారం కొన్ని భేదకలక్షణాలసమూహం వర్ణం అని నిర్వచించవచ్చు. వర్ణాలను వేరుచేసే భేదకలక్షణాలుగాని సవర్ణాలమధ్య నున్న ఉచ్చారణభేదాలు భేదకలక్షణా లనిపించుకోవు. నేటితెలుగులో శ్వాసవత్త్వం, నాదవత్త్వం, అనునాసిక్యం, స్పర్శత్వం, రేఫత్వం మొదలగునవి కొన్ని ప్రయత్నాల్లో భేదకలక్షణాలు. స్థానకరణాల్లో ఓష్ఠ్యత్వం, దంత్యత్వం, మూర్ధన్యత్వం, కంఠ్యత్వం మొ॥ కొన్ని భేదకలక్షణాలు, అచ్చుల్లో సంవార వివరాలు, కంఠ్యతాలుస్థానాలు కొన్ని భేదకలక్షణాలు. కాని తెలుగులో అచ్చుల్లో 'అనునాసిక్యం' భేదకలక్షణం గాదు. ఫ్రెంచిభాషలో సానునాసిక నిర నునాసిక స్వరభేదం అర్థభేదనసమర్థ మౌతుంది. తెలుగులో అలా లేదు. సంస్కృతంలో అల్ప ప్రాణమహాప్రాణాలు భేదక లక్షణాలు. అందుకనే క, ఖ, ప, ఫ మొదలైనవి భిన్నవర్ణాలు. ఆంగ్లంలో అల్పప్రాణమహాప్రాణధ్వనులు సవర్ణాలు, పదాదిన p, t, k వర్ణాలు, pin, kin, tin మొ... చోట ph-kh-, th-గాను, 's' వర్ణానికి పరంగా వచ్చినప్పుడు spin, skin, sting మొ; చోట్ల అల్పప్రాణాలుగాను ఉచ్చరిస్తారు. ఈ భేదం పరిసరభేదాన్నిబట్టి నిర్ణయింపదగినది గాబట్టి అప్రధానమైనది.

ఒకభాషలోని వర్ణసమామ్నాయం,ఆ భాషలోని కనిష్ఠభేదాలమొత్తం. భాషా వ్యవహారంలో వైవిధ్యం ఈభేదాలవివిధసంయోజనపద్ధతులవల్లనే ఏర్పడు తున్నది రెండుఅభిప్రాయాలభేదం ఏకైకభేదంవల్ల గాని ఏర్పడవచ్చు. ఈ వర్ణ

భేదాలు 'కాలం = గాలం' మొ, వాటిల్లో లాగా పదాదినే గాక భిన్నస్థానాల్లో గూడ ఉండవచ్చు. ఉదా॥ కాడి-గాడి, కాడి-కడి, కాడి-కాని, కాడి-కాడ. ఈ నాలుగుజతల్లోనూ వర్ణభేదాలస్థానం క్రమంగా మార్చటంవల్ల భిన్నశబ్దాలేర్పడ్డాయి. మొదటిజతలో 'క-గ'ల భేదంవల్ల. రెండోజతలో 'అ-ఆ'లభేదం వల్ల, మూడోజతలో 'డ-న'ల భేదంవల్ల, నాల్గోజతలో 'ఇ-అ'లభేదంవల్ల ఆయాశబ్దాలమధ్య భిన్నార్థస్ఫోరకత ఏర్పడుతున్నది. పైఉదాహరణ లన్నిటిలోను ఏకైకవర్ణభేదంవల్లనే అర్థభేదం ఏర్పడ్డది. కాని రెండుశబ్దాలమధ్య భేదం అనేక వర్ణకల్పితంగా కూడా ఉండవచ్చు. ఉదా॥ కాడి-మేడి, కాడి-జోలి, కాడి-మేకు; ఈ జంటల్లో రెండు, మూడు నాలుగు వర్ణాలు క్రమంగా భేదించడంవల్ల భిన్న శబ్దాలు ఏర్పడుతున్నాయి.

వర్ణాలను స్వరాలు (అచ్చులు), వ్యంజనాలు (హల్లులు) అని ప్రాచీనులు విభజించారు. కాని పై చర్చనుబట్టి భాషలో ప్రతి కనిష్ఠభేదకాంశమూ వర్ణమౌతుంది కాబట్టి మరికొన్ని రకాలభేదాలను గూడ వర్ణసమామ్నాయంలో చేర్చాలి. అవి కాలపరిమితి (దీర్ఘత), ఊనిక, స్వరం, విరామం, మొదలైనవి. తెలుగులో హ్రస్వాచ్చుల ఉచ్చారణకు, దీర్ఘాచ్చుల ఉచ్చారణకు కాలపరిమితిలోనే భేదం. స్థానకరణాలు సమానాలే. 'పడు-పాడు' అన్నచోట 'దీర్ఘత' అర్థభేదకం గాబట్టి దాన్ని గూడ వర్ణమనే వ్యవహరించాలి. ఒడియా, బెంగాలీ మొ, ఔత్తరాహభాషల్లో హ్రస్వదీర్ఘ భేదం అప్రధానం. పరిసరభేదాన్నిబట్టి హ్రస్వదీర్ఘాలు సవర్ణాలు. ఊనికభేదంవల్ల అర్థభేదం కలిగే భాషల తెగకు చెందినది ఆంగ్లం. 'Permit' అన్న మాటలో మొదటిఅచ్చుపై ఊనిక నిలిస్తే విశేష్యంగాను, రెండోఅచ్చుపై ఊనిక నిలిస్తే క్రియగాను ఆంగ్లభాషా వ్యవహారంలో ఉంది. 'Blackbird' అంటే ఒక పక్షి విశేషం. 'Black bird' అన్నప్పుడు నల్లని పక్షి అని అర్థం. ఇట్టిచోట్ల స్వరవ్యంజనభేదం లేకపోయినా ఊనికవల్ల అర్థభేదం ఏర్పడుతున్నది. కాబట్టి ఊనికలు గూడా ఆంగ్లంలో వర్ణాలే. వైదిక సంస్కృతంతో ఉచ్చనీచస్వరితాలు (high, low, mid) అని మూడు రకాల స్వరాశ్రయవర్ణాలు (Pitch phonemes) ఉన్నాయి. తెలుగులోను స్వరవర్ణాలున్నాయనే చెప్పాలి. కాని ఇవి వాక్యస్థితిలో ప్రవర్తిస్తాయి గాని, పదస్థితిలో లేవు. అంటే రెండుపదాలభేదం స్వరాశ్రయం గాదు. రెండు వాక్యాలమధ్య భేదం స్వరభేదాన్నిబట్టి నిర్ణయించవచ్చు. ఉదా॥ 'అది ?' 'అదిగాదు ఇది'. 'అది?' అన్నవాక్యంలో చివరిస్వరం క్రమంగా తక్కువ స్థాయినించి ఉచ్చస్థాయికి మారుతుంది. రెండోవాక్యాంతస్వరం ఉచ్చస్థాయినించి నీచకు దిగుతుంది. ప్రశ్నార్థకవాక్యాలను సూచించే స్వరం ↑ అని, నిర్దేశా

ర్థకవాక్యాంతాన వచ్చే స్వరం ↓ అని గుర్తుపెట్టుకోవచ్చు. స్వరభేదాలస్థాయిని 1, 2, 3 అంకెలతో నీచస్వరితోచ్చాలని ఉత్తరోత్తరప్రకర్షగా నిరూపించవచ్చు. పైనచెప్పిన రెండువాక్యాల స్వరభేదాలు నిరూపించటానికి వినియోగించే కనిష్ఠస్థాయిభేదాలనుగూడా వర్ణాలని పిలువవచ్చు; వ్యవధానాలూ, విరామాలు గూడా భాషలో అర్థభేదకాలే. ఉదాహరణకు ఈకింది రెండువాక్యాలు చూడండి. 'వాడు తెలిసీతెలేనట్టు మాట్లాడేడు', 'వాడు తెలిసీ. తెలేనట్టు మాట్లాడేడు.' ఈ రెండు వాక్యాలమధ్య ఉన్న అర్థభేదం — మొదటివాక్యం 'లెలిసీతెలేనట్టు' అని అవ్యవహితంగా ఉచ్చరించటంవల్లను, రెండో వాక్యంలో 'తెలిసీ, తెలేనట్టు' అని వ్యవహితోచ్చారణవల్లను ఏర్పడ్డది. అందువల్ల వ్యవధానాలు కొన్నిచోట్ల నిలపటం కొన్నిచోట్ల నిలపకపోవటం భేదకలక్షణాలుగా అన్నిభాషల్లోనూ ఉంటుంది.

## వర్ణం - లిపి

భాషలో వర్ణాలకే లిపిచిహ్నా లుండాలి గాని సవర్ణాలకు గుర్తులు పన్లేదు. సవర్ణాలన్నీ ఏకైక భేదంగా వర్తిస్తాయి. కాబట్టి వాటన్నిటికీ ఒకేలేఖనచిహ్నం చాలు. ప్రతివర్ణభాగా లయిన ధ్వనుల (సవర్ణాల)ను ఉచ్చారణస్థానభేదాన్నిపట్టి నిర్ణయించటానికి సాధ్యమౌతుందిగదా! వర్ణానికి పెట్టుకొనేగుర్తు కేవలసంకేతమాత్రమే కాబట్టి అందులో సౌలభ్యానికే ప్రాధాన్యం గాని ఉచ్చారణతో సంబంధం లేదు. సంప్రదాయాన్నిబట్టి మనం ఈనాటితెలుగులో సవర్ణా లయిన 'మ-వ(’లకు | మ | అనీ,' చ,చ'లకు | చ | అనీ, 'జ,ౙ'లకు | జ | అనీ 'గ, గ'లకు | గ | అనీ గుర్తులు పెట్టుకోవచ్చు.* కాని | మ | ధ్వని మాత్రం కాదనీ, కొన్ని భేదకలక్షణాలసమూహానికి (కొన్ని సవర్ణాలకు)సంకేతం మాత్రమే అనీ గ్రహించాలి. ప్రస్తుతం తెలుగులిపిలో | ఏf | వర్ణాలకు గుర్తులు లేవు. ఉదా : 'కొట్ప్తేడు, కాఫీ'; ఈనాడు శిష్టులవ్యవహారంలోను 'ఫ, ఫ' లను వేరుచేసే భేదకలక్షణం ఉచ్చారణలో లేదు. రెంటినీ 'ఫ' గానే ఉచ్చరిస్తాం. రెండూ ఒక వర్ణంగానే ప్రవర్తిస్తున్నాయి. అర్థభేదం సందర్భాన్నిబట్టి మాత్రమే తెలుసుకుంటాం. ఉదా : ''ఈ పద్యానికి అర్థమేమిటి ?'' ''ఆవగింజలో అర్ధభాగం కాలేదు''. సంస్కృతంలో వేరైన 'అర్థ, అర్ధ' శబ్దాలకు తెలుగులో భేదం పోయింది. ఇలాంటిచోట్ల ఒకేసంకేతం చాలు. ప్రాచీనాంధ్రంలో 'అ-ర'లు

* వర్ణాలను ధ్వనులనుంచి వేరుగా సూచించటానికి ఇకముందు | | గుర్తులు ఇరువైపులా ఉపయోగింపబడతాయి.

ప్రత్యేకవర్ణాలు. నేటి తెలుగులో ఇవి సవర్ణాలు. ద్విరుక్తమైనప్పుడు 'ఱ' కారో చ్చారణం. అన్యత్ర 'ర' కారోచ్చారణం వినిపిస్తుంది. గొఱ్ఱె, మారటం; అందు వల్ల ఈ రెండు సవర్ణాలను | ర | గుర్తుతోనే సూచించవచ్చు. | గొర్రె |, | మారటం |. భాష మారుతున్నప్పుడు ముందున్న వర్ణాలు కొన్ని జారి పోతుంటాయి. కొత్త వర్ణాలు అన్యభాషాసంపర్కంవల్ల వచ్చి చేరుతుంటాయి. సమాజంలో వచ్చేమార్పులతోపాటు వ్యక్తులు మారుతున్నట్లే, చరిత్రలో వచ్చే మార్పులతోపాటు ప్రతిభాషలోని వర్ణసమామ్నాయంకూడా మారుతుంటుంది. ఆ మార్పులు లేఖనచిహ్నాల్లో చూపకపోవటంవల్ల, చదువుకొనేటప్పుడు కొన్ని అర్థ సందిగ్ధతలు ఏర్పడుతుంటాయి.

*ప్రాచీనుల మతం :*

పాణిన్యాదులు భాషాశాస్త్రవేత్తలు. ఆధునికభాషాశాస్త్రానికి పునాదులు వీరి రచనలే. ఇంతదాకా చేసిన ఈ వాదం వీరి రచనల్లో లేకపోయినా, దానికి కావలసిన భావబీజాలుమాత్రం అక్కడ ఉన్నాయి. సంస్కృతభాషావ్యాకర్తలు వర్ణశబ్దాన్ని కేవలలేఖనచిహ్నం అనే అర్థంలో ఉపయోగించలేదు. వారు విధిం చిన వర్ణాగమాదేశలోపాదికార్యాలు ఉచ్చారణభేదాలకు చెందినవి గాని లిఖిత చిహ్నాలకు గాదు. అప్రధానోచ్చారణభేదా లున్నచోట వాటిని ప్రత్యేకవర్ణాలని వారు వ్యవహరించలేదు. ఉదా : 'యవ'లకు భిన్నపరిసరాల్లో వచ్చే లఘ్వ లఘూచ్చారణభేదం అలాటిది. పాణిని ప్రధానంగా అచ్చులకే 'వర్ణ' శబ్దం ఉప యోగించాడని, అందులోను, స్థానకరణతుల్యత ఉన్న అచ్చులన్నీ ఏకవర్ణ గ్రాహ్యాలుగానే పరిగణించా డని విమర్శకుల అభిప్రాయం. 'ఇ' వర్ణం అంటే హ్రస్వదీర్ఘప్లుతభేదాలు కల 'ఇ, ఈ, ఇ3' లకు గ్రాహకం. కాని పాణిని ప్రతి కనిష్ఠభేదానికి 'కార' ప్రత్యయం చేర్చి వ్యవహరించాడు. ఇకారం, ఈకారం, చకారం. కకారం ఇత్యాది. కాని ఈవర్ణం, చవర్ణం మొ., వ్యవహృతి అష్టా ధ్యాయిలో లేదని పండితుల నిర్ణయం.

ఆతర్వాత వ్యాకరణసంప్రదాయంలో 'వర్ణ-కార' శబ్దాలు పర్యాయాలు గానే ప్రయోగించారు. కాని వర్ణసమామ్నాయంలో ఉపదిష్టాలైనవి చాలవరకు కనిష్ఠభేదాలే గాని ఉచ్చరితధ్వని సర్వస్వంగాదు.

ఇక సవర్ణా లంటే తుల్యాస్యప్రయత్నాలు కలవి అని ప్రాచీనులమతం. ఈవ్యాసంలో అప్రధానభేదం కల వర్ణధ్వనులను 'సవర్ణా'లనిపిలవటానికిఆధారం

చిన్నయసూరి సూత్రం 'దంత్యతాలవ్యంబు లయిన చజలు సవర్ణంబులు' (బాలవ్యా-సంజ్ఞా. 7) మాత్రమే. కాని సూరిగారి అభిప్రాయం అటు ప్రాచీనుల మతానికీ చెందదు, ఇటు నవీనులమతానికీ చెందదు. తుల్యాస్యప్రయత్నం చ-చే, జ-జేల మధ్యనే రాదు, చే-జే, చ-జలమధ్య గూడా ఉంది గదా! పోతే 'చ,చే'లు ఒక జ వర్ణం 'జ-జే'లు ఒక వర్ణం అని వారి అభిప్రాయం అయితే, వర్ణసమామ్నాయంలో 'తెనుఁగునకు వర్ణములు ముప్పదియారు', అన్నసూత్రంతో చ-చే. జ-జేలు నాలుగు భిన్నవర్ణాలుగా పరిగణించారు. ప్రౌఢవ్యాకరణ కర్తగూడా వీటిని నాలుగు వర్ణాలుగానే చెప్పారు (సంజ్ఞా. సూ. 1).

ఈ వ్యాసంలో 'ధ్వని' అంటే ఉచ్చరిత మైన భాషాధ్వని. 'వర్ణం' అంటే భాషానిర్మాణక్రమంలో కనిష్ఠభేదం, లేక భేదకాంశం. 'సవర్ణం' అంటే వర్ణగత ధ్వని, ఆంగ్లంలో వీటిని క్రమంగా phone, phoneme. allophone అంటారు.

## అనుబంధం

భాషాధ్వనుల ఉత్పత్తిక్రమాన్ని గురించి చెప్పే శాస్త్రాన్ని ధ్వనిశాస్త్రం లేక శిక్ష అంటారు. సంస్కృతధ్వని నిరూపణం చాలా శాస్త్రీయంగా శిక్షల్లోనూ, ప్రాతిశాఖ్యల్లోనూ కనిపిస్తుంది. పారిభాషిక పదాలు చాలవరకు మన ప్రాచీనులవే ఉపయోగించుకున్నా, వాటి అన్వయవివరణాల్లో ఆధునికధ్వనిశాస్త్రానుగుణంగా కొన్ని మార్పులు చేసుకోవాలి. పెదవుల మొదలు కాకలకందాకా ఉన్నప్రదేశాన్ని ఆస్యం లేక వక్త్రం అంటారు. ఉచ్చారణావయవా లన్నీ ఈ భాగంలోనే ఉన్నాయి. ఓష్ఠాలు (కిందిది, పైది), జిహ్వ (అగ్రం, మధ్యం, మూలం), దంతాలు, దంత మూలం (పైపండ్ల చిగురు), తాలువు (పూర్వభాగం, మూర్ధం), అంగిలి (మృదు తాలువు), సప్తపథ, కాకలకం లేక స్వరపేటిక (నాదతంత్రులు, Vocal chords)—ఇవన్నీ ధ్వనుల ఉత్పత్తికి కారణా లైన వక్త్రాంగాలు. వీటిల్లో కొన్ని స్థానాలు, కొన్ని కరణాలు; కదలిక గల అవయవాన్ని కరణం అనీ, లేనిదాన్ని స్థానం అనీ చెప్పుకోవచ్చు. సాధారణంగా కిందిపెదవి, నాలుక(కొస, మధ్య, మొదలు)కరణాలు. పైపెదవి, పైదంతాలు, దంతమూలం, తాలువు, అంగిలి—ఇవి స్థానాలు. ఊపిరితిత్తులనుంచి నిర్గమించేగాలి కంఠబిలం మొదలు పెదవులుదాకా ఉన్నప్రాంతంలో పొందే మార్పును ప్రయత్నం అంటారు.

స్థానకరణప్రయత్నభేదాల్నిబట్టి ధ్వనులను విభజించవచ్చు. స్థానకరణాలనుబట్టి చేసే విభజన;

ఓష్ఠ్యాలు - స్థానం : పై పెదవి; కరణం : కింది పెదవి.

దంతోష్ఠ్యాలు - స్థానం : పైదంతాలవెనకభాగం; కరణం : కింది పెదవి.

దంత్యాలు - స్థానం : పైదంతాల వెనకభాగం; కరణం : నాలుకకొసగానీ అంచుగానీ.

దంతమూలీయాలు - స్థానం : దంతమూలం; కరణం : నాలుకకొసగానీ, అంచుగానీ.

తాలవ్యాలు - స్థానం : కఠినతాలువు, కరణం : నాలుకముందు లేక మధ్యభాగం.

మూర్ధన్యాలు - స్థానం : కఠినతాలువు చివరి భాగం, దీన్నే 'మూర్ధం' అంటారు; కరణం : మడతవేసిన నాలుక కొస.

కంఠ్యాలు - స్థానం : అంగిలి లేక మృదుతాలువు; కరణం : జిహ్వామూలం.

కంఠమూలీయాలు - స్థానకరణాలు ; నాదతంత్రులు.

ప్రయత్నాలు కొన్ని సామాన్యాలు, కొన్ని విశిష్టాలు, విస్తృతప్రయోజనం గలప్రయత్నాలు సామాన్యాలు. అవి శ్వాస, నాద, అల్పప్రాణ, మహాప్రాణా లని నాలుగు విధాలు. నాదతంత్రులను కంపింపజెయ్యకుండా నిర్గమించే ఊపిరి 'శ్వాసం'; నాదతంత్రులను కంపింపజేస్తూ వెలువడే ఊపిరి 'నాదం'. శ్వాసం వినబడదు. నాదం వినబడుతుంది. నాదనిర్గమనం జరిగేటప్పుడు రెండుచెవులూ మూసుకుంటే 'గుఁయ్ఁ' అనే ధ్వనికంపన వినవచ్చు. శ్వాసనిర్గతితో అది వినిపించదు. నిర్దిష్టకాలంలో స్వాభావికోచ్చారణకు వెలువడే గాలి 'అల్పప్రాణం'' అంతకంటే ఎక్కువ ఒత్తిడితో వెలువర్చినఊపిరి 'మహాప్రాణం'. అచ్చుల్లో వచ్చే ఒకప్రయత్నభేదం అనునాసిక్యం. ఇది నాసికారంధ్రాలద్వారా నాదవంతంగా గాలిని నిర్గమింపజేయటం.

ఇక విశిష్టప్రయత్నాలవల్ల ఏర్పడే ధ్వనిభేదాలు : గాలిని క్షణకాలం స్థానకరణాలు నిరోధించి విడవటంవల్ల ఏర్పడే ధ్వనులు - స్పర్శాలు; స్థానకరణభేదాలనుబట్టి ఓష్ఠ్యస్పర్శాలు, దంత్యస్పర్శాలు, ఇత్యాదిభేదాలు. వీటిల్లో శ్వాసనాద, అల్పప్రాణ, మహాప్రాణ భేదాలనుబట్టి సూక్ష్మతరవిభజన చేయవచ్చు. స్థానిక

నిరోధం లేకుండా గాలి స్థానకరణాల సంకుచితావకాశంగుండా ఒరుసుకొని రావటంవల్ల ఏర్పడే ధ్వనులు ఊష్మాలు, శషసహలవంటివి. గాలి నాసికారంధ్రాల ద్వారా వెలువడే ప్రయత్నంతో ఉచ్చరించేధ్వనులు అనునాసికాలు, ఙఞణన మాదులు, నాలుక ఇరువైపులగుండా గాలి వెలువర్చటంవల్ల ఏర్పడేధ్వనులు పార్శ్వికాలు, ల-ళ మొదలైనవి. కరణం అవ్యవహితంగా కంపించటంవల్ల ఏర్పడేధ్వనులు, కంపితాలు లేక రేఫలు, 'ర-ఱ' మొదలైనవి. ఈషత్స్పర్శవల్ల ఏర్పడే ధ్వనులు శిథిలస్పర్శలు. హిందీలో ఉచ్చరించే 'ఢ़' (ఉదా॥ 'లడ్కా') ఇటువంటివి. ఊష్మాలకున్నంత ఒరపిడి లేకుండా గాలి జారిపోయే ప్రయత్నం వల్ల ఏర్పడే ధ్వనులు అంతస్థాలు, యవ మొదలైనవి. భాషల్లో ఇవి కొన్నిచోట్ల అచ్చులుగాను, కొన్నిచోట్ల హల్లులుగాను ప్రవర్తిస్తాయి. ఈ రెండువరుసలకు మధ్యస్థంగా ఉంటాయి కాబట్టి అంతస్థా లన్నారు. చ-చే, జ-జల ఉచ్చారణలో మొదట స్పర్శప్రయత్నం, చివర ఊష్మప్రయత్నం ఉండటంవల్ల వీటిని స్పృష్టోష్మాలని గాని, స్పర్శోష్మాలని గాని పిలవ్వచ్చు. తాళపత్రగ్రంథాల్లో చకారాన్ని 'త్స'గా రాయటానికి హేతువీప్రయత్నవిలక్షణతే కావచ్చు.

అచ్చులు ఉచ్చారణస్థానభేదాన్నిబట్టి తాలవ్యాలు,కంఠ్యాలు అని ద్వివిధం. నాలుక మధ్యభాగం కఠినతాలువును సమీపించేటప్పుడు క్రమంగా ఏర్పడే అచ్చులు ఎ, ఎ, ఇ లు. నాలుక వెనుకభాగం మృదుతాలువును సమీపించేటప్పుడు క్రమంగా ఏర్పడే అచ్చులు, అ, ఒ, ఉలు. ఇ, ఉలను ఉచ్చరించేటప్పుడు వక్త్రంలో అవకాశం తక్కువగా ఉంటుంది. ఎ, అలను ఉచ్చరించేటప్పుడు ఈ అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఈ ప్రమాణాన్నిబట్టి ఇ, ఉలను సంవృతాచ్చులనీ, ఎ, అలను వివృతాచ్చులనీ వ్యవహరించవచ్చు. ఎ, ఒలను అర్ధసంవృతాలనిగాని, అర్ధవివృతాలనిగాని అనవచ్చు. తాలవ్యాచ్చులు తెలుగులో నిరోష్ఠ్యాలు. కంఠ్యాచ్చులు (అకారంతప్ప) ఓష్ఠ్యాలు.

—భారతి

1959, అక్టోబరు. సంపు. 36. సంచిక 10.

---

# తెలుగు కన్నడ సాహిత్యాల బాంధవ్యం

—శ్రీ కె. సుబ్బరామప్ప

తెలుగుల, కన్నడిగుల సంబంధబాంధవ్యాలు చాలా ప్రాచీన మైనవి. ఆచారవ్యవహారాలలోకూడా ఉభయులకూ వ్యత్యాసాలు లేవు. ఒకరు ఎయేపండు గపబ్బాలు ఆచరిస్తారో యింకొకరూ అవే ఆచరిస్తారు. నృపతుంగుడు 9వ శతాబ్దంలో "కవిరాజమార్గంలో" "కావేరియింద గోదావరి వరిగె" అని కన్నడ దేశవిస్తారాన్ని గూర్చి చెప్పుకొన్నాడు; దీన్నిబట్టి చూస్తే 9వ శతాబ్దినాటికి యీనాడు అచ్చతెలుగు దేశమైన గోదావరీతీర ప్రాంతానికి కన్నడభాష వ్యాపించి వుండిందని తెలుస్తుంది.

భాషాసాహిత్యవిషయాలలో తఱచిచూస్తే తెలుగువారికి ఒక నిర్ణీతమైన లిపీ, సాహిత్యమూ, రాకపూర్వమే కన్నడిగులకు అవి యేర్పడి ఉండినా యని తెలుస్తుంది. అంటే 9వ శతాబ్దంలో నృపతుంగరచితమైన లక్షణగ్రంథం "కవిరాజమార్గం" మూలాన అంతకుపూర్వమే కన్నడభాషలో కొందరు గ్రంథాలు వ్రాశా రని తెలుస్తుంది. "ప్రయోగశరణం వ్యాకరణం" కదా! తెలుగువారిలో చూస్తే 11వ శతాబ్దంలో నన్నయభట్టు భారతం వచ్చేవరకు కావ్యాలు లేవు. ఇదే తెలుగువారి తొలికావ్యం, అనాటికి తెలుగువారు కేవలం "కాసటబీసటే" చదువుకొని "గాథలు త్రవ్వుతూ వుండేవారట. 11వ శతాబ్దికిపూర్వం తెలుగువారి సాహిత్యం అంతా జానపదసాహిత్యం అయిన స్త్రీలపాటలు, జోలపాటలు, ఊడ్పు పాటలు మొదలైనగేయరూపంలో వుండేది. కన్నడంలో కావ్యరచన తెలుగువారి కంటే ముందే జరగడంచేతను, వారికి ఒకనిర్దుష్టమైన లిపి వుంటూ వచ్చి వుండటంచేతను, తెలుగులిపికీ కన్నడలిపికీ అట్టే వ్యత్యాసాలు లేకపోవడంచేతనూ తెలుగువారుకూడా కన్నడిగుల లిపినీ సాహిత్యరీతులనూ అనుకరించారని చెప్పవలసివస్తుంది. దీనికి కారణాలు ఉన్నాయి. ఈమాట నేను అంటే తెలుగువారు తక్కువ అనీ కన్నడిగులు ఎక్కువ అనీ ప్రతిపాదిస్తున్నానని తెలుగుబాంధవులు నన్ను ఆక్షేపణ చేయవచ్చును.

కన్నడ తెలుగుసాహిత్యాలలో ఇచ్చిపుచ్చుకోవడం అనాదిగా ఎలా జరిగిందో మనవిచేస్తాను.

కన్నడిగులకు పంప, రన్న, పొన్న అనే రత్నత్రయం ప్రాచీనపుకలలో వున్నట్టు తెలుగువారికి నన్నయభట్టు, తిక్కనసోమయాజి; ఎఱ్ఱాప్రెగ్గడ అనే కవిత్రయం వున్నారు. తెలుగువారికి నన్నయ ఆదికవి. కన్నడిగులకు నృపతుంగుడు ఆదికవి అయినా అతడు లక్షణగ్రంథం వ్రాయడంచేత పంపడే ఆదికవి అయినాడు. పంపకవి వ్రాసిందీ నన్నయ్య వ్రాసిందీ భారతమే. పంపని కాలం 10వ శతాబ్దం. నన్నయ్యది 11వ శతాబ్దం. ఉభయులూ చాళుక్యరాజుల ఆస్థానాల్లో ఉండినవారు. పంపడు పశ్చిమచాళుక్యులను ఆశ్రయించాడు. నన్నయ్యభట్టు పూర్వ చాళుక్యులను చేరాడు. చాళుక్యులు కన్నడిగు లని నేలటూరి వేంకటరమణయ్యగారు సమర్థించారు. పంపకవీ నన్నయ్య విభిన్నమతాల కోసరం సాహిత్యాన్ని ప్రచార సాధనంగా వుపయోగించాడు. ఒకరు జైనమతం, ఇంకొకరు వైదికమతం అవలంబించి, కావ్యరచన సాగించారు.

పూర్వకాలంలో మతము నాశ్రయించుకొని సాహిత్యం అభివృద్ధి చెందినదనే అంశం మనం మఱచిపోరాదు. కన్నడసాహిత్యంలో చూడండి! జైనయుగమనీ, వీరశైవయుగమనీ, బ్రాహ్మణయుగమనీ, సాహిత్యయుగవిభజన చేసుకున్నారు. కన్నడరత్నత్రయం జైనమతావలంబులై ఆ మతప్రచారంకోసం సాహిత్యరచన చేశారు.

పంపడు తొలుత ఆంధ్రదేశం అయిన వేంగిమండలంలోని వేంగిపట్టులో నుండినవాడు. ఆనాడు అక్కడ మతంలో ఒక విప్లవం బయలుదేరింది. జైన బౌద్ధమతాలను అడుగంటింప చేసి వైదికమతాన్ని స్థాపించాలని ప్రయత్నాలు జరిగినాయి. ఆసందర్భంలో పంపడు పశ్చిమచాళుక్యరాజైన అరికేసరియొక్క ఆస్థానానికి వచ్చి చేదోడు వాదోడుగా వుంటూ, రాజుతో యుద్ధరంగాలకు కూడా పోయి ఆదిపురాణాన్ని విక్రమార్జునవిజయం పేరుతో భారతాన్నీ వ్రాశాడు. ఆదిపురాణంలో వున్నంత జైనమతప్రచారతీవ్రత భారతంలో లేదు. భారతం అలా తీసుకుని రావడానికి వీలుకాలేదు. ఎందుకంటే దానికి మూలం సంస్కృత భారతం. వేదవిహితంగా మూలగ్రంథం రచింపబడివుంది. కాని పంపడు అక్కడక్కడ కొన్నిమార్పులు చేసుకున్నాడు. తనభారతానికి అర్జునుడు నాయకుడు. ధర్మరాజు కాడు. ద్రౌపదికి అయిదుమంది భర్తలు లేరు. అర్జునుని భార్యమాత్రమే ఆమె. శ్రీకృష్ణునికి పంపభారతంలో ప్రాధాన్యం లేదు. ఆనాడు ఇంకొక విశేషం ఏమిటంటే కన్నడిగులూ తెలుగువారూ సంస్కృతభాషను

పూర్తిగా ఆశ్రయించి ఉపయోగించుకున్నారు. సంస్కృతానికి ఈ భాషలపైన యెంత ప్రభావం వుందో చూడండి. కన్నడ, తెలుగువ్యాకరణగ్రంథాలను సంస్కృతభాషలో వ్రాశారు అప్పటి కవులు. నాగవర్మ "కర్ణాటకభాషా భూషణం," భట్టాకళంకుడు "శబ్దానుశాసనం", నన్నయ భట్టు "ఆంధ్రశబ్దచింతా మణి" సంస్కృతంలో వ్రాశారు. సంస్కృతంలో వున్న వాటి సూత్రాలకు ఆయాభాషల్లో యితరులు వ్యాఖ్యానం వ్రాసుకోవలసి వచ్చింది తర్వాత.

పంపభారతం 10వ శతాబ్దంలో వచ్చేవేళకు తెలుగుదేశంలో కూడా అది చాలవఱకు వ్యాప్తికి వచ్చిందని చెప్పవచ్చు. కన్నడప్రాంతంలో వుండిన కన్నడ కవి నారాయణభట్టు అనే వైదిక కవి అక్కడ చెలరేగుతూ వున్న జైనమతం గిట్టక పూర్వచాళుక్యరాజ్యమైన గోదావరీతీరస్థమైన రాజమహేంద్రవరానికి వచ్చి రాజరాజనరేంద్రుని ఆస్థానం చేరుకున్నాడు. 11వ శతాబ్దంలో నన్నయ వ్రాసిన తెలుగు భారతరచనలో "తన కిష్టుడును సహాధ్యాయుడును" అయిన నారాయణ భట్టు 'అభిమతంబుగ తోడయి,' 'భారతఘోరరణంబునందు నారాయణు నట్లు' సహాయంచేశాడని నన్నయగ్రంథాదిలో చెప్పకున్నాడు. ఇంతటి గొప్పసహాయం కన్నడకవి తన కేమి చేసివుంటాడు ? తప్పకుండా పంపభారతాన్ని ఆద్యంతాలు చదివి వినిపించి పంపకవిరచనావిధానాన్నీ, రీతినీతులనూ వివరించి వుంటాడు. అందువల్లనే పంపభారతంలోని ఛందోనుకరణాలు, వర్ణనాసన్నివేశాలూ, రచనా రీతులూ, కొన్ని తెలుగుభారతంలోనికి వచ్చినాయి. పంపడు తనకు పోషకుడైన అరికేసరికి అంకితం చేసినట్లే నన్నయ్య తనకు పోషకుడైనరాజ రాజనరేంద్రునికి తనగ్రంథం అంకితం చేశాడు. క్షితిపతిని వర్ణించడంలో ఉభయుల రచనలలోను పోలిక లున్నాయి. ఆశ్వాసాదులలో పద్యంవెంటనే గద్యం రెండుగ్రంథాలలోను వుంది. ఆశ్వాసాంత్య గద్యాలూ అంతే. మధ్యాక్కర, మధురాక్కర మొదలైన క్రొత్తవృత్తాలను పంపని రచనలనుండే నన్నయ్య గ్రహించాడు. "లలితపదం," "ప్రసన్నకథాకవితార్థం," "అక్షరరమ్యత" - ఇవి పంపడు ఉపయోగించు కొన్నవి. అలాగే నన్నయ్య అనుకరించాడు. గ్రంథాదిని దేవతాస్తుతికూడా పంపడు చేసినట్లే చేశాడు. కన్నడపదాలు ప్రత్యయభేదాలతో కొన్ని నన్నయ్య భారతంలో ప్రవేశించినాయి. ఉదాహరణకు: అరణ్యపర్వం, 3 ఆశ్వాసం, 380వ గద్యంలో "కెలసమునకు మెచ్చి" అని వుంది (కెలస=పని). పంపభారతంలో పాండురాజు దర్శించిన శతశృంగ పర్వత వర్ణననూ, అచ్చటి మున్యాశ్రమంలో వైరివర్గానికి చెందిన జంతుజాలం అన్యోన్యంగా వుంటూవున్న పరిస్థితినీ,

వేదాలను చదువుతూ వుండే చిలుకలూ మొదలైన వర్ణన అంతా నన్నయ్యభట్టు దుష్యంతుడు ప్రవేశించిన కణ్వాశ్రమంలో వున్నట్టు ఒక సీసపద్యంలో వర్ణించాడు. (సీ॥ ''శ్రవణసుఖంబుగా సామగానంబులు చదివెడి శుకముల చదువు దగిలి'' మొ. ఆది 4 ఆశ్వాసంలో శకుంతలోపాఖ్యానం).

''చోద్యంపట్టు'' అని పంపడు ముగిస్తే నన్నయ్య ''చోద్యమంది'' అని యీ వర్ణన ముగించాడు. విభక్తిపల్లవాలలో గూడా పంపని అనుసరించిన పట్టులు తిలకించండి :

''నారదనపేళ్ధు'' (6-21) ''వైరియ మాడిద'' (8-90), తన్ననుడిద (12-190), నరకాంతకనంనుడి నరేంద్రం (12-129). వీనిని తెలుగుచేస్తే అదే రకమైన విభక్తిపల్లవాలు నన్నయ్య అనేకచోట్ల వాడినా డని తెలుస్తుంది. నారదుని చెప్పిన, వైరి చేసిన, తనచెప్పిన, నరకాంతకుని నరేంద్రుడు పలికెను— ఈలాగే పంపభారతంలో ఆఖరున అర్జునునికి పట్టాభిషేకం చేసే సందర్భంలో నదీ జలాలు, సముద్ర జలాలు, దేవేంద్రలోకంలోని పువ్వులూ తెచ్చి అభిషేకించినా రని వర్ణించిన నాలు గైదు పద్యాలను పోలిన పద్యాలు నన్నయ్య భట్టూ వ్రాశాడు. పంపని సంస్కృతసమాస భూయిష్ఠమైన పద్యాలలోని కన్నడ ప్రత్యయాలకు బదులు తెలుగు ప్రత్యయాలు చేర్చితే నన్నయ పద్యాలనే శంక కలుగుతాయి.

కన్నడ దేశంలో వీరశైవమతం బసవణ్ణ వచనాలద్వారా వ్యాప్తికి వచ్చిన వైనం చూచి యీ మతావలంబిఅయిన పాల్కురికి సోమనాథుడు తెలుగుదేశంలో యీ మతాన్నివ్యాపకం చేయడానికి దేశికవితారచనకుదిగి బసవణ్ణవచనాల మాదిరి జనప్రియత్వానికి రాగల్గిన ద్విపదచ్ఛందస్సులో ''బసవపురాణము'', ''పండితారాధ్య చరిత్ర'' లను వ్రాసి వీరశైవ మతవ్యాప్తికి తోడ్పడ్డాడు. ఈ తెలుగు గ్రంథాల బహుళ వ్యాప్తిని కన్నడదేశంలో గుర్తించుకుని 14వ శతాబ్దంలో భీమకవి బసవపురాణాన్ని కన్నడంలోనికి అనువాదం చేశాడు. పాల్కురికి సోమనాథుడు తనకు స్వప్నంలో కనిపించి బసవపురాణాన్ని కన్నడీకరించమని చెప్పినాడని భీమకవి గ్రంథాదిలో చెప్పికొన్నాడు. సోమనాథుని ''పండితారాధ్య చరిత్ర'' లోని ''గురుభక్తి యాండారు చరిత్ర''ను 1650లో పాసభూషణ పెమ్మిశెట్టి అనే కవి వార్ధకషట్పదులలో కన్నడీకరించాడు. ఇది ఇంకా అచ్చుకాలేదు. దీని మూడు తాటాకుప్రతులు మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో వున్నాయి. ఇతడు గ్రంథాదిలో ఇలా వ్రాసుకొన్నాడు: ''పాల్కురికి సోమనాథను తందె

భాషె యల్లిబరెద ద్విపది ఆరాధ్యచరిత్రెయ గురుభక్తి యాండారుచరిత్రెయు కనండిసి''(అనగా పాల్కురికి సోమనాథుడు తనతండ్రి భాషలో వ్రాసిన ద్విపద ఆరాధ్యచరిత్రలోని గురుభక్తి యాండారుచరిత్రను కన్నడంలో అనువదించు చున్నాను అని) తండ్రిభాష తెలుగైనప్పుడు తాయిభాష (మాతృభాష) కన్నడం అయి వుండవలెకదా ! మూడు తాటాకు ప్రతులలోను యిలాగేవుంది. పాల్కురికి సోమనాథుణ్ణి గూర్చి కన్నడ దేశంలో సుమారు 12 మందికిపైగా వీరశైవ కవులు తమ గ్రంథాలలో పేర్కొన్నారు. సోమనాథుడు కన్నడంలో ''శీల సంపాదనె'', ''సద్గురురగళె''. ''చెన్నబసవస్తోత్ర'', ''శరణబసవరగళె'' వ్రాశాడని తెలుగుకవి చరిత్రలే చెప్పుతున్నాయి. కన్నడదేశంలో జనప్రియత్వం అందిన ''హరహరా శ్రీ చెన్నసోమేశ్వరా!'' అనే మకుటంతో వ్రాయబడిన ''సోమేశ్వర శతకము'' ఈతడు వ్రాసిందే. కన్నడసాహిత్యపరిషత్తువారు దీన్ని ప్రకటించారు. వారు ప్రకటించిన పీఠికలో పాల్కురికి సోమనాథుడే వ్రాసినట్లు శంకించారు. కన్నడ దేశంలో ఇంతటి ప్రసిద్ధి చెందిన ఇతని స్వస్థలం మైసూరు సంస్థానానికి చేరిన తుంకూరుజిల్లాలోని యీనాటి హాల్కురికి అని కొందరు విమర్శకుల అభిప్రాయం. కీ. శే. డాక్టరు చిలుకూరి నారాయణ రావుగారు కూడా పండితారాధ్యచరిత్రకు పీఠిక వ్రాస్తూ యిదే అభిప్రాయా న్నిచ్చారు. ఇప్పటి హాల్కురికి సోమనాథుని కాలానికి (12 శతాబ్దం) పాల్కురికిగానే వుండేది. 10 నుండి 14 శతాబ్దంవరకు కన్నడంలో ''ప'' కారంతో ఆరంభం అయ్యే పదాలు ''ప''కారంగానే వుండేవి. అవి ఈనాడు హకారంగా మారిపోయినాయి. పంప భారతంలో ''కోగిలెపాడువ''. ''యుద్ధమల్లమహీపతిగె పుట్టి'', 14 వ శతాబ్దంలో వ్రాసిన కన్నడబసవ పురాణంలో ' పక్కిగళుగగనక్కెనెగెదెవు'' అనే ప్రయోగ లున్నాయి. ఆ పదాలు ఈనాడు హకారాదిగా ఉచ్చారణ చేస్తారు పాడువ - హాడువ అనీ, పుట్టి - హుట్టి, పక్కి-హక్కి. అలాగే మరికొన్ని చూడండి. పత్తి-హత్తి, పల్లు-హల్లు, పగలు-హగలు, పల్లి-హళ్ళి; పంపయ్య-హంపయ్య; పాము-హావు. అదేరీతిగానే పాలు-హాలు అని మారివుండి తీరాలి. తెలుగుదేశంలో పాల ''కుర్రి'' వుందికాని పాలకురికిగాని పాలకుర్కిగాని లేదు. ''కురికి'' లేక ''కుర్కి''తో అఖరు అయ్యే గ్రామాలపేర్లు కన్నడదేశంలో వున్నాయి గాని తెలుగుదేశంలో లేవు. ఉదా : కోలారు జిల్లాలో కుందలకుర్కి, ఆగలకుర్కి అనే గ్రామాలున్నాయి. కాబట్టి సోమనాథుని నివాసస్థానం అయిన పాల్కురికి మైసూరు సంస్థానం లోని తుంకూరు జిల్లా లోనిదే అయి వుండాలి. ఇది గాక శివకవులు తమ్ముగూర్చి గాని, భవులనుగూర్చిగాని, తమగ్రంథాలలో పొగడుకొనే ఆచారం లేదు. సోమనాథుడు ''బసవని పుత్రుండ, బసవని

గోత్రుండ'' అని చెప్పుకున్నాడే కాని తనతల్లిదండ్రులనుగూర్చికూడా యెక్కువగా చెప్పుకోలేదు. అందుకనే వీరికాలమూ నివాసస్థలాలు మొదలైనవి విమర్శకులు ఊహ చేసుకోవడానికి ఆస్పదం అయినాయి.

తెలుగులోని యింతటివిద్వాంసుడు కన్నడదేశీయు డని, కన్నడం మాతృభాషకలవాడు అని చెప్పడం సాహసం కదా అని అనవచ్చు. ఇది సాధ్యమని ఋజువు చేయవచ్చు. కన్నడసాహిత్యానికి అపారంగా సేవచేసి పేరుప్రతిష్ఠలు గడించిన వారిలో అనేకులు అచ్చుకన్నడిగులు కారు. వారిమాతృభాషలు వేరు. మొట్టమొదట కర్ణాటక కవిచరిత్ర వ్రాసిన కీ.శే. ఆర్. నరసింహాచార్యులుగారు, వచనభారతం వ్రాసిన శ్రీ అలసింగాచార్యులుగారు, శ్రీ మాస్టి వేంకటేశయంగారు, టి. పి కైలాసం (సుప్రసిద్ధ నాటకరచయిత), కె. వి. అయ్యర్ (ఈతని నవల ''శాంతలా''ను ఢిల్లీసాహిత్యఅకాడమీవారు 13 భాషల్లోకి అనువాదం చేయించడానికి తీసుకున్నారు.) వీరిది తమిళం. కన్నడిగుల ఆస్థానకవి గోవిందపైగారిది కొంకణభాష. సుప్రసిద్ధకవి ద. రా. బేంద్రెగారిది మరాఠి. కన్నడప్రొఫెసర్ కీ. శే. వెంకన్నయ్య, ప్రసిద్ధనవలారచయితలు, త. రా. సుబ్బారావు (''త.రా.సు.'') వీరకేసరి, సీతారామశాస్త్రి, దేవుడు నరసింహశాస్త్రి-వీరిదితెలుగు. ఇంతెందుకు అచ్చ తెలుగువాడైన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు మైసూరు చేరినతర్వాత కన్నడం నేర్చుకుని కన్నడంలో వ్రాసిన ''సాహిత్యమత్తు జీవనకలె'' అనే పుస్తకం యీ సంవత్సరం (1958) కన్నడ బి.ఎ., (ఆనర్సు) తరగతికి పాఠ్యగ్రంథం.

ఇది ఒకవివాదాస్పదమైన స్వారస్యమైన సంగతి. విమర్శకులు, పరిశోధకులు పరిశీలించతగిన విషయం.

ఏది యెట్లున్నా వీరశైవమతవ్యాప్తికోసరం తెలుగు కన్నడకవులు ఏకమైనారు. ఒకరిని యింకొకరు అనుకరించారు. కన్నడకవి చామరసు వ్రాసిన ''ప్రభు లింగలీల''ను అనుసరించి తెలుగులో పిడపర్తి బసవన గ్రంథంవ్రాశాడు. అచ్చు అయి యీనాడు తెలుగుసాహిత్యంలో ప్రచారంలో వుంది.

కన్నడసమ్రాట్టు అయిన బుక్కరాయని ఆస్థానంలో నాచనసోముడు ''ఉత్తర హరివంశం'' అనే గ్రంథం వ్రాసి తెలుగుసాహిత్యానికి అపారమైనసేవ చేశాడు. ప్రౌఢదేవరాయని ఆస్థానంలో కవిసార్వభౌముడైన శ్రీనాథుడు గౌడ డిండిమభట్టును ఓడించి అతని కంచుఢక్కను పగులగొట్టించి ప్రౌఢ

దేవరాయలచేత ముత్యాలమంటపంలో కనకాభిషేకం చేయించుకున్నాడు. శ్రీనాథునికి కన్నడభాషగూడా బాగా తెలుసు. ఎవ్వ రేమనుకున్నను నిజముగా తాను కర్ణాటభాషను ఆడుతున్నానని అన్నాడు.

పిమ్మట కృష్ణదేవరాయని కాలం వస్తుంది ఈ కాలాన్ని తెలుగుసాహిత్యంలో స్వర్ణయుగ మని అంటారు. కన్నడసమ్రాట్టు అయిన యీతని ఆస్థానంలో అష్టదిగ్గజాలు అనే యెనిమిదిమంది తెలుగుకవు లుండేవారు.తెలుగుదేశాన్ని యెక్కువ భాగం యేలినవాడవడంచేత, తెలుగుభాష నేర్చుకుని తెలుగుభాషామాధుర్యాన్ని మెచ్చుకుని "దేశభాషలందు తెలుఁగు లెస్స" అని తాను తెలుగులో వ్రాసిన "ఆముక్తమాల్యద"లో పేర్కొన్నాడు. ఇది యితడు వ్రాయలే దనీ, పెద్దన్న వ్రాసి అతనిపేరు పెట్టాడనీ ఒక విమర్శ బయలుదేరి యిప్పుడు అణగిపోయింది. "దేశభాషలందు తెలుఁగు లెస్స" అనే మాటలు తెలుగువారు సగర్వంగా చెప్పుకుంటారు. పరాయివాడు అన్నాడు కాబట్టే మన కింతగర్వకారణం. ఈతని ఆస్థానంలో కన్నడ కవులు, తమిళకవులుకూడా వుండేవారు. కన్నడ భారతం వ్రాసిన కుమారవ్యాసుడు, తిమ్మణ్ణకవి యీతని ఆస్థానంలోనివారే. రాయల ఆజ్ఞప్రకారం తిక్కనసోమయాజి వ్రాసిన భారతాన్ని అనుకరించి కన్నడంలో కుమారవ్యాసుడు వ్రాయక వదలిన ఎనిమిదిపర్వాలను తిమ్మణ్ణకవి పూర్తిచేశాడు. ఈ విషయం తిమ్మణ్ణభారతంగ్రంథాదిలో వుంది. మన ముక్కుతిమ్మన (నంది తిమ్మన) పారిజాతాపహరణప్రబంధం వ్రాసి కృష్ణరాయలకు అంకితం చేశాడు కదా ! దీనికి మూలం ఒక కన్నడకవి వ్రాసినకావ్యం. 13వ శతాబ్దంలోని కన్నడ కవి రుద్రభట్టు "జగన్నాథవిజయం"లో కృష్ణపారిజాతకథలు 200 పద్యాలలో వర్ణించాడు. ఆ కథాభాగాన్ని ముక్కు తిమ్మన 509 పద్యాలుగ పెంచి గొప్ప ప్రబంధంగా రచించాడు. రుద్రభట్టు వ్రాసిన ప్రకారం నారదాగమనం, నారదుడు పారిజాతపుష్పాన్ని శ్రీకృష్ణునకు రుక్మిణి యింటిలో నుండగా ఇవ్వడం, పారిజాత పుష్పమహిమవర్ణనవల్ల సత్యభామకు కోపం రావడం, అలగడం, కృష్ణుడు అలకతీర్చడం (సత్యభామ కాలితన్ను మాత్రం ముక్కుతిమ్మన సృష్టి. ఇది ఆకాలంనాటి రసికత్వాన్ని సూచిస్తుంది.) పారిజాత వృక్షాన్నే తెచ్చి పెరటిలో నాటించడం - ఇవన్నీ యథాక్రమంగా ముక్కుతిమ్మన అనుసరించాడు. ఒకటి రెండు కన్నడపద్యాలకు సరియైనభావం వచ్చే తెలుగు పద్యాలు యివ్వబడినాయి, చూడండి ;

'జగన్నాథవిజయం' నుండి :

''బగవందీ సొబగీ మహాత్మెగుచితం, ప్రద్యుమ్ననం తెప్పు, పె
న్మగనంపెత్త, మహత్వ దగ్రమహిషీ సంపత్తి యింతాళ్ది దీ
కెగె లక్ష్మివనితావతార గెనుతుం, మిక్కాంగనా వృందము ఈ
ర్షెగళం మాణ్దిరె, సత్యభామె తళెదళ్ సౌభాగ్యమాత్సర్యమం''.

ముక్కు తిమ్మన :

ఉ అందరిలోనపెద్ద మహిమాన్విత రుక్మిణి గాన పూవు గో
విందుఁడు దాని కిచ్చె తగవే యని లక్షణ యోర్చె, సైచెఁ గా
ళింది, శమించె భద్ర, యవులెమ్మని యూరడిలెన్ సుదంత, లో
గుందుట మానె జాంబవతి, కోప మడంచెను మిత్రవిందయున్.

జగన్నాథవిజయం :

౧. తడవే పుణ్కెగె దివ్యం
బడిపం రుక్మిణి యొళల్లిదిం హరిమెరిదుం
గడ సత్యభామె గెఱగం
ముడిక్కిద నార్ప రెత్తి కొళ్ళం సభయోళ్.

౨. అబలు యరొళ్ ముయ్యాంపళ్
సొబగింగా సత్యభామె బేడెంతెనెగా
సొబగీ అలరం ముడిదరె
సొబగే కచ్చుఁ తమాయు భీష్మకసుతెయా.

ముక్కుతిమ్మన :

౧. ఇన్నిదినంబులన్ సవతు లిందరిలో ... ... ... (I-65)

౨ చక్కనిదాన నంచు నెలఁజవ్వని నంచు ... ... (I-66)
అనే పద్యాలలో చేర్చినాడు.

పారిజాతపుష్పవర్ణనలో జగన్నాథవిజయంలోని వర్ణననే ముక్కుతిమ్మన అనుసరించాడు

౧. అలినీలాలక, ౨. అడిగినయంతలోన, ౩. వేసవిచలువయు — ఈ పద్యాలకు తగిన కన్నడపద్యా లున్నాయి.

అల్లసాని పెద్దన 'నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము' అను ఈ పద్యం రాయల ఆస్థానంలో నిర్మోహమాటంగా చెప్పి సెబాస్ అనిపించుకొన్నది, పెద్దన్నకు సుమారు మున్నూరేండ్లకు ముందుండిన కన్నడకవి మల్లికార్జునునిది. ఈ కన్నడపద్యమును తిలకించండి :

''నిరుపహతిస్థలం, మృదుకరాసన, మెల్లణి సింపుదంబులం
నరపిద పుస్తకప్రతతి, లేఖకవాచకసంగ్రహం నిరం
తరగృహనిశ్చితస్థితి, విచారకసంగతి, సత్కళత్రసా
దరతయు నుళ్ళ సత్కవియు మీసువదాగదె కావ్యవార్థియుం''

కృష్ణదేవరాయని సామంతరాజైన యలహంకప్రభువు, బెంగుళూరు నిర్మాత. కేంపేగౌడ తెలుగులో ''గంగాగౌరీవిలాసం'' అనే యక్షగానం వ్రాశాడు. బ్రౌన్ దొర వ్రాయించి పెట్టివుండే దీని వ్రాతప్రతి యిప్పుడు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో వుంది. (నెం. సూచిక 8 యక్షగానములు నం. 1864, పుట 2097-98).

తరువాత కన్నడ - తెలుగు సాహిత్యాలతో సంబంధం కలిగిన ప్రధానమైన వ్యక్తులు వేమన - సర్వజ్ఞ కనిపిస్తారు. వీరిరువురు సమకాలికులై ఉభయులూ భేటీ అయి సంభాషించుకొన్నట్టు తెలుస్తూంది. ''సర్వజ్ఞ - వేమన సంవాదం''అనే ఒకపుస్తకం మైసూరు ఓరియంటల్ లైబ్రరీలో వుంది. ఇందులో సర్వజ్ఞ వచనాలకు సరియైన భావం వచ్చే వేమనపద్యాలు కన్నడలిపిలో ప్రకటింపబడి వున్నాయి ఉభయుల జీవితాలలోను సాదృశ్యం వుంది ఇద్దరూ మొదట సంసారబంధంలో వుండి కష్టసుఖాలను అనుభవించి సంసారబంధాలను త్రెంచుకొని విరక్తులై సన్యాసులై దేశాటనం చేశారు. సంఘాన్ని, దురాచారాలను విమర్శిస్తూ, వచనాలను పద్యాలను చెప్పారు ఉభయులూ లోహాలను బంగారం తయారు చేయడంలో ప్రయత్నించి విఫలురైనారు, చూడండి:

సర్వజ్ఞ :

''సీగె బాగయునారు, కాగె మోరెయ గద్ద
సాగరద సత్తు వొడగూడలు
హేము ఆగలే అక్క సర్వజ్ఞ''.

వేమన :

1. చెట్టుమీద కాయ గట్టుమీద మన్ను
పుట్టలోని వాని బడుగు దడుగ
గట్టిగా యీ మూడు కనకంబు తానయా, విశ్వ.

2. ఇంగిలీక మహిమ హేమింపనేరక
చిత్రపటము వ్రాసి చెఱచినారు
బొందజెముడు పాల పొంగింప నేరరు, విశ్వ.

సర్వజ్ఞ :

"ఎత్తుగాణవ హొత్తు స్తుతిబందరె యేను ?
చిత్తదలి శివనె నెయదె దేశవను
సుత్తిఫలవేను సర్వజ్ఞ".

వేమన :

ఆత్మలోని లింగ మదియును గానక
తీర్థవాసు లంచు తిరుగువారు
గంధంబు మోసిన గార్దభంబులు గార, విశ్వ.

సర్వజ్ఞవచనాలు మూడుపాదాలు - వేమనపద్యాలు మూడుపాదాలు.

మైసూరును ఏలిన రాజులుకూడా తెలుగుసాహిత్యానికి పోషకులైనారు. చిక్కదేవరాయనికాలములో (1720) అతని దళవాయి కళువె వీరరాజు తెలుగు వచన భారతం వ్రాశాడు. ఇదే తెలుగులో మొదటివచనకావ్యం. తెలుగుసాహిత్యంలో యీ వచనకావ్యం బయలుదేరినపిమ్మటే ప్రత్యేకముగా వచనగ్రంథాలు బయలు దేరినాయి.

ఈతనితండ్రి కళువె సంజరాజు తెలుగులో ''హాలాస్యమాహాత్మ్యం'' అనే గ్రంథం వ్రాశారు. మైసూరురాజు కంఠీరవ నరసరాజు (మూకరసు) తెలుగులో యక్షగానాలు వ్రాశారు. కొన్ని యిపుడు మదరాసు ఓరియంటల్ లైబ్రరీలో వున్నాయి. ముమ్మడి కృష్ణరాయని ఆస్థానకవిగా వుండిన కుందలకుర్కి చంద్రకవి ''కృష్ణభూపాలీయం'' అనే పద్యకావ్యం వ్రాశాడు. దీనిని మైసూరు సర్కారువారు అచ్చువేశారు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పీఠిక వ్రాశారు. నన్నయ

భట్టు వ్రాసిన ''ఆంధ్రశబ్దచింతామణి''కి తెలుగుభాషాంతరీకరణ మిది. ఇవి గాక భాషా సాహిత్యవిషయంలో ఆదానప్రదానాలు ఈనాటికీ జరుగుతూ వున్నాయి. ఢిల్లీ సాహిత్య అకాడమీవారి ఆశ్రయంక్రింద కన్నడగ్రంథాలు తెలుగులోనికి, తెలుగు గ్రంథాలు కన్నడంలోనికి పరివర్తనం అవుతున్నాయి. ఈ గ్రంథాలే గాక ఉత్తమమైన కన్నడ తెలుగుగ్రంథాలు అనేకం యీరీతిగా ఒకభాషలోనుండి ఇంకొకభాషకు రాదగినవి అనేకం వున్నాయి. ఆంధ్రసాహిత్యఅకాడమీవారు, కన్నడసాహిత్య పరిషత్తువారు ఈ పనికి పూనుకోవలెనని కోరుతున్నాను.

*ఏకలిపి ఆవశ్యకత :*

తెలుగుకన్నడిగులయొక్క మధురబాంధవ్యాలు మరింత నికటంగా పెంపొందా లంటే ఉభయులకూ ఒకేలిపి వుంటే యిది సిద్ధిస్తుం దని నా ఆశయం. ఈ సంగతిని నేను అనేక కన్నడిగుల సమావేశాల్లోనూ, తెలుగువారి సమావేశాల్లోనూ వివరించాను. ఇటీవల కర్ణాటకంలో సంచారం చేస్తూ ఆచార్య వినోబా భావేకూడా దీన్ని సమర్థిస్తూ ఉభయభాషలవారూ ఈకృషికి ప్రయత్నించా లని హుబ్లీలో కన్నడ సాహితీవేత్తలను కోరారు. రెండుభాషలలిపిలోను అట్టే వ్యత్యాసాలు లేవు. నే నిప్పుడు కన్నడ ఆనర్సువారికి తెలుగు అనుబంధవిషయంగా బోధిస్తూ తెలుగులిపి సుళువుగా వారికి నేర్పిస్తున్నాను. స్వరములలోను. వ్యంజనాలలోను చిన్నమార్పులు చేసుకుంటే ఇది సాధ్యమవుతుంది. టైపురైటరు, లినోటైప్ మొదలైన వానిని దృష్టిలో పెట్టుకుని రెండుభాషల ప్రతినిధులు చేరి ఒక నిర్ణయానికి వస్తే ఉభయులకూ సన్నిహితత్వం మరింత బాగుపడుతుంది.

—భారతి

మే 1958, సంపుటము 35; సంచిక 5.

—::—

# ద్వి ప ద క వి త్వ ము

—శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

"క్రియాసిద్ధి సత్వే భవతి మహతాం నోపకరణే"-అని సంస్కృతమునం దొక న్యాయము కలదు. సమర్థులగు మహానుభావులకు కార్యసిద్ధి సత్వమునం దుండునే కాని ఉపకరణములఁ (సాధనముల)యం దుండ దని పైదాని కర్థము. ప్రకృతము మనము పరిశీలింపఁబోవు ద్విపదకవిత్వముగూడ పైన్యాయము నను సరించియేయున్న దని పరిశీలకు లగువారికి తోఁచకమానదు. అయినను, గతానుగతిక న్యాయముచొప్పున లోకమునం దీకాలమువఱకును 'పదకవిత ముదిమి వనితయు' అని యొకప్రవాదము మాత్రము ఆబాలగోపాలము వ్యాప్తి గాంచి యున్నది. ప్రవాదము లెప్పుడును అనాలోచితముగ ప్రవర్తిల్లి యంధపరంపరగా వ్యాప్తినొందుచుండుట సాజము. మనీషులగువారి కిట్టిప్రవాదములఁ దుదిముట్టఁ బరీక్షించి యథార్థమును లోకమునకు రూపించుట స్వధర్మము. నేను మనీషిత్వముతోఁ గాకున్నను, సహజము నలౌకికము నగు పదకవిత్వముపై నొకవిధ మగు ననురాగము కలిగియున్నవాఁడ నగుటచేతఁ ప్రస్తుతమీవ్యాసము నందు ద్విపదకవిత్వమును విమర్శింపఁబూనితిని.

*ద్విపద యన నేమి?*

కవిత్వము సాధారణముగా గద్యపద్యస్వరూపమున వెలయుచుండును. గద్య కవిత్వము ప్రాయికముగా ఛందోవిన్యాసనిబంధనరహితమై యుండును. పద్యకవిత్వము ఛందోబద్ధమై తనరుచుండును. ఈ రెండువిధములు మాత్రమే గాక గద్యపద్యములు రెండును మేళవించిగూడ కూర్పఁబడిన కావ్యములు పెక్కులు గలవు. అట్టికావ్యములను సంస్కృతమునందు చంపువు లనియు తెలుఁగునఁ ప్రబంధములనియు వ్యవహరించుచున్నారు. ఇఁక రెండవది యగు పద్యకవిత్వము వృత్తములనియు, జాతు లనియు రెండుభేదములచే నొప్పారుచున్నది. పైఁజెప్పిన జాతివృత్తములు గూడ జాత్యుపజాతిభేదములఁ బరఁగినవి. షడ్విధకందములు (అనఁగా నాఱువిధములగు కందపద్యభేదములు) గాక ఉత్సాహ తరువోజ పంచవిధాక్కఱలు అనునవియు, ద్విపదత్రిపదచతుష్పదపంచపాద షట్పద వృత్తములును రగడమొదలగు నితరవృత్తములును గలిసి మొత్తముపైని జాతు లనఁబడు

నని ఛందోవేత్తల భావముగాఁ గనుపట్టెడిని. ఇట్లే గీతపద్యములోని భేదములును, సీసపద్యములు నుపజాతు లని గూడ నెఱుంగనగును. కావున ద్విపద యనునది జాతి వృత్తములోని యొకభేదము అని పర్యవసించినది. ఇందులకుఁ బ్రమాణంబుగా నప్పకవి చెప్పిన యీ క్రిందిపద్యమును గ్రహింపఁదగును.

సీ. "కందభేదము లాఱుఁగాక యుత్సాహము
తరువోజమధ్యాక్కఱలు నైదు
దీపించు మంజరీద్విపద త్రిపద చతు
ష్పద పంచపాద షట్పదవిధములుఁ
దొమ్మిదివిధములతో నొప్పు రగడలుఁ
గళికలు నుత్కళికలును గూడ
జాతులు నవవిధగీతంబులును సీస
సప్తకంబును నుపజాతు లయ్యె

ననుచు నన్నయభట్టు భీమనయుఁ బెద్ద
సచివుఁడును మూర్తి తాత యజ్వయు ననంత
మంత్రియును దిమ్మరాజు నిమ్మాడ్కిఁ జెప్పి
రందముగ వారు చేసిన ఛందములను"

— అప్పకవీయము

అప్పకవి చెప్పిన యీ పద్యమును సావధానముగాఁ బరికించినచో, పైని బేర్కొనిన వృత్తవిభాగక్రమమును భిన్నవృత్తములును నన్నయభట్టారకాద్యాంధ్ర కవిజనసమ్మతములు మాత్రమే గాక, వారువారు తమతమ గ్రంథములయందు సందర్భానుసారముగ నచ్చటచ్చట నయ్యెఛందముల నందముగలుగుఁ ఛందముల బ్రయోగించి రని తోఁచుచున్నది. కాని, ఆంధ్రశబ్దానుశాసనుఁ డనియు,(కొందఱ యభిప్రాయము ననుసరించి) ఆంధ్రమున నాదికవి యనియుఁ బేరొందిన నన్నయ భట్టారకుని మహాభారతమునందు అచ్చటచ్చటఁ దరువోజ*, మధ్యాక్కఱ, యుత్సాహము, కందము, మున్నగు వృత్తములను పరిశీలించి కనుఁగొనవచ్చును గాని ద్విపద మాత్ర మెచ్చోటను మందునకైనను కాన్పింపదు. భాషాంతరము

* తరువోజ యతిప్రాసనియమంబున కొంచెము మార్పు నొందిన ద్విపదయే యని యెఱుంగునది-సంపాదకుఁడు.

నొనర్చుటలోను పదవిన్యాసమును సోమయాజి మున్నగువారు నన్నయకంటె భిన్నమార్గప్రవృత్తులుగనే యున్నను ఛందోవిన్యాసమునందు మాత్రము ప్రాయికముగా నన్నయ త్రోవ నవలంబించిరేగాని స్వతంత్రించి ద్విపదప్రభృతి వృత్తములఁ గూర్పరైరి యని కొందఱ యభిప్రాయము.

పై పద్యమునందు వారు చేసిన ఛందములను అని యుండుటబట్టియు పద్యములోఁ గీర్తితు లగు కోవిదులలోఁ జాలవఱ కందఱు లక్షణగ్రంథప్రణీత లగుటం బట్టియు, వృత్తవిభాగమును తల్లక్షణములను తమతమగ్రంథములలోఁ జర్చించి నిర్దేశించిరే కాని వేఱుగా దనియు కావున భారతాదులలో ద్విపదలను కూర్పకపోవుట లోపము గాదనియు మఱికొందఱ సమాధానము. ఈ ప్రశ్నోత్తరములవలన మనము ద్విపదకవిత్వము నన్నయాదులకంటె ప్రాచీన మని యొక వాదమును నవీనమని యొకవాదమును అనుపూర్విగా వచ్చుచున్న వని జ్ఞప్తియిం దుంచుకొనవలయును.

ఏది యెట్లున్నను (అనఁగా పూర్వపక్షోత్తరపక్షములవారిశంకాసమాధానములు ఏతీరున నున్నను), నన్నయభట్టారకుని కాలమునాఁటికే ద్విపద ప్రచారమున నుండె ననియు ఇయ్యదియే ఆంధ్రభాషయందు సంస్కృతమున ననుష్టుప్పురీతిని-ప్రాథమికవృత్తమై యొప్పె ననియు నొప్పుకొనక తప్పదు. ఏలయనగా ద్విపద యని యొకవృత్త ముండినఁ గాని అందులకు లాక్షణికులు లక్షణములను చేయునవసరము సంభవింపదు. తఱుచుగా లక్ష్యలక్షణములలో లక్ష్యములే ప్రథమము లనియు బిమ్మటివి లక్షణము లనియు విజ్ఞులకు విదితమే యై యున్నది. మఱియు, ప్రాజ్ఞు లగువారికి లక్షణములందుకంటె లక్ష్యములపైనే ప్రామాణ్యమెక్కుఁ డనుటయు సుప్రసిద్ధము. కావున ద్విపదకవిత్వము నన్నయభట్టారకుని నాఁటికే ప్రచారమున నున్నదనుట నిర్వివాదముగా నొప్పుకొనఁ దగి యున్నది.

నన్నయాదులనాఁడు ద్విపదకవిత్వము ప్రచారమున నున్నచో నిప్పుడా కాలమునాఁటి గ్రంథము లేల కానరావు? అని కొంద ఱడుగవచ్చును. కాని, పృచ్ఛకులు నన్నయభట్టు కాలముకంటెను మిక్కిలిపూర్వమున నున్నవై కవిత్వమున నింతకంటెను రసవంతములైన కావ్యము లెన్నియో కాలవశమున లుప్తములై యుండుటను జ్ఞప్తి నుంచుకొనఁ బ్రార్థించెద.

మఱియు, నిచట నింకొకవిషయము మనము పరిష్కరింపవలసియున్నా రము అయ్యది యేకవృత్తమునఁ గృతినిర్మాణ మనునదియే. సంస్కృతాంధ్ర ములలో నింతదనుక ప్రాయశః కావ్యలక్షణములలో నేమి రచనాసంవిధానము లలో నేమి ప్రబంధనిబంధనములలో నేమి మహాకావ్యము లుపకావ్యములు ఖండ కావ్యములు నాటకములు మున్నగునవి యేకవృత్తనిర్మాణముపట్ల సారూప్యమును పొందియేయున్నను, ఆంధ్రకావ్యములలో మాత్రము భిన్నవృత్తతను పాటించిరి. 'సర్గాంతే భిన్నవృత్తతా' యని కావ్యలక్షణములు సంస్కృతము నుంటయు కావ్య మంతయు (కొన్ని యెడల సర్గయంతయు) నొక్కవృత్తముతోనే సమాప్తి నొందించుచుండుటయు కనుఁగొనవచ్చును. మన యాంధ్ర కావ్యములం దట్లు కాక యేప్రబంధ మేకావ్యము పరికించినను చంపువులయందుఁ బోలె వివిధవృత్తములు కనుపట్టుచుండును. ఇపుడు భిన్నవృత్తత కావ్యముల సమంజసమా యసమంజ సమాయను విషయమును మనము విచారింపవలయును. సమంజస మంద మన్నచో భిన్నవృత్తములు గల సంస్కృతకావ్యములు తెలుఁగుగ్రంథము లన్నియు నగ్రాహ్యములు కావలసివచ్చును. మనకుఁ గల యనుభవము కొలఁది పరికించినచోఁ గాళిదాసుని మేఘసందేశమును ఆర్యాసప్తశతి మొదలగు సంస్కృతకావ్యములును గుణాఢ్యుని ప్రాకృతకావ్యములును ఆంధ్రభాషలోని శతకగ్రంథములును ఏకవృత్తపూర్ణము కదా! ఆకావ్యములను పఠించుచో నెవరైనఁగాని ఏసందర్భమునఁ గాని ఎప్పుడుగాని విముఖత నొందిరా? రసము గ్రహింపఁజాలకపోయిరా? లేదుగదా, కావున, భిన్నవృత్తత సమంజస మనుటకు వీలులేదు.

పోనీ, భిన్నవృత్తత యసమంజస మనుకొందుము. కానీ,వృత్తభేదముగల కావ్యము లెన్ని రసపూర్ణములై సకలజనహృదయరంజకములై యలరారుట లేదు? కావున గ్రంథములలో భిన్నవృత్తములు కూడునా కూడవా యని వివరిం చుట కంటెను ఇష్టము వచ్చిన వృత్తములతో కావ్యమును రసోదంచితముగను సహృదయహృదయాహ్లాదకరముగను గమనించి వ్రాయుట శ్రేయము. ఇదియ నిక్కమగు కవిత్వతత్త్వము. దీనిఁ గనిపెట్టినవాఁడె కవి. ఇట్టివానికవిత్వమే సకలజనశ్లాఘ్యమై యలరారుచుండును.

అయినను,ప్రబంధములయం దేకవృత్తతనుపాటించు నాచారము దూరము పరికించినచో మనయాంధ్రభాషయందు లేకపోలేదు. పరికింపుఁడు.ద్విపదకావ్య

ములు, శతకములు, బిరుదావళులు, స్తుతిపాఠములు మొదలగువానిలో నేకవృత్త తయే పాటింపఁబడినది.

కవి సమర్థుఁడై చతురుఁడై లోకజ్ఞుఁడై, భువనరంజకుఁడై వశ్యవచనుఁడై వెలయవలయునే కాని కవిత్వము ద్విపదలో జెప్పెనా ? త్రిపదలోఁ జెప్పెనా ? పదములఁ జెప్పెనా ? పాటలఁ జెప్పెనా ? పద్యముల జెప్పెనా ? గద్యములఁ జెప్పెనా ? యను విషయము ప్రధానము కాదు. కావున, నేవృత్తములలోఁ జెప్పినను విబుధులు అల్పానల్పముల నపేక్షింపక, రసము ఔచిత్యము లోకజ్ఞత మున్నగు గుణములచేత ప్రకృష్టతరమై యొప్పుచున్నచో నట్టి కవిత్వము ను నిష్పక్షపాతులై గుణముల గ్రహించి యాదరింపవలయు ననియు నిరాదరించుట తగదనియు నా యభిప్రాయము.

ఇఁక, నన్నయాదులకాలము నాఁటికే ప్రచారమున నున్న ద్విపదకవిత్వము మధ్యకాలమున నెందులకై హీనము కావలసి వచ్చెననుట విచార్యము. ద్విపదకవిత్వము ప్రాచీనమై ఆంధ్రసారస్వత మహావృక్షమున కాదిమూలమై పండిత పామర జనుల కెల్లర కాదరణీయమై తుడుము మొదలుకొని దేవతార్చనము వఱకుఁగల వాఙ్మయ రాశిలో నేదో యొకరీతిని ప్రవేశించి తన విశ్వవ్యాపిత్వము నిప్పటికిని మనకనులకుఁ గాన్పింపఁ జేయుచున్నదే కాని యూరకుండ లేదు. చూడుడు, మన గృహములలోఁ బూర్వకాలిక లగుస్త్రీలు చేయు పూజా పురస్కారములు మొదలుకొని అద్వైతోపదేశముల వఱకును గల వాఙ్మయమంతయు, అనఁగా అప్పగింతల పాటలు, దక్షయజ్ఞము, సీతపాట, పుత్రకామేష్టి, పార్వతీపరిణయము, లక్ష్మణమూర్ఛ, అంగద రాయబారము, ఆత్మబోధ మున్నగు పాటల కథలన్నియు, అవి యివి యననేల ? జనసామాన్యమునకు నీతిమతములఁ గఱపి లోకతంత్రవిదులఁ జేయ ననువగు విషయము లన్నియు ద్విపదలలోనే కూర్చఁబడియున్నవి.

కేవల మింతమాత్రమే కాక పండిత జనాదరణీయములును, వేదవేదాంగాదుల లోని దగు విజ్ఞానమున కంతకును నిధు లనఁదగు భారత భాగవత రామాయణములు గూడ ద్విపదలందు జనానుగ్రహకాంక్షు లగు కవీశ్వరులు రచించి కృతార్థత నొందిరి. పండితునకైనను పామరునకైనను విన్నంతనె హృదయము నాహ్లాదింపఁజేయు శక్తియున్నఁగదా నిక్కముగా కవితయనిపించు కొనఁదగును! ఇట్టి కవిత్వముఁ జెప్పి ప్రజల నారాధింపవలయు నని కోరెడి కవికి పరిపూర్ణ మగు స్వాతంత్ర్య ముండవలయును.

స్వాతంత్ర్యమనఁగా, కొందఱు తలంచునట్లు యతిప్రాసాదినియమరహితముగ కవిత్వముఁ జెప్పుట యనిగాని పర్యాయపదములు అలంకారములుమున్నగునవి లేకుండ చెప్పుట యని గాని తలంపఁజనదు; విపుల మగు భావము ఉచితజ్ఞత రసస్ఫూర్తి మున్నగు గుణములు వెల్లడించుటకు నిర్బంధమును కలిగించు పరికరములను విసర్జించు నధికార మని మాత్రమే యర్థముఁ జేసికొనవలయును. వృత్తములు పెద్దవిగా లేకపోయినప్పటికిని చిన్నచిన్న పదములఁ జెన్నుమీఱునట్లు చెప్పుటకు వీలుకలుగఁ జేయుట గూడ నొకవిధముగ స్వాతంత్ర్యమే యనఁదగును. ఇట్టి స్వాతంత్ర్యమును కవి పూర్ణముగా వహించుటకు ద్విపదయొక్కటి తప్ప మఱియేయితర మగు ఛందమును అనువుపడి యుండదు. కనుకనే ద్విపద జనసామాన్యమున విశేషముఁగా ప్రచారమునకు వచ్చె నని నిశ్చయింపఁదగును.

ఈరీతిగా జనసామాన్యమున కీద్విపదకవిత్వము మిగుల ప్రేమాస్పదమై యలరారుచున్నను చిరకాలమునుండి యుండినను రానురాను ఏల యియ్యది కుంఠిత యై మూలఁబడవలసివచ్చె నని యెంతటి నైపుణ్యమునఁ బరికించినను తగినంతటి కారణములు కనుపట్టవు. కాని, రాజాశ్రయాభావము నిస్సారమగు కవిత యని కొందఱును, ద్విపదకవిత్వము నధికారిభేదము లేక వ్రాసినచోఁ దమతమపాండిత్య ప్రకర్ష లపకర్షత నొందునని మఱికొందఱును, పామరజన రంజకము లగుటఁబండితు లాదరింపమి యని యింకఁగొందఱును ఇందులకు గారణములుగఁ జెప్పెదరు. కాని, యిందేవియు తగినంతటి యుపపత్తిని జూపి సమర్థింపఁజాలవు.

ఏల యనెదరా ? రాజాశ్రయాభావాదులు కారణము అనినచో రంగనాథుఁడు స్వయముగా రాజా ? అతనిగ్రంథమును లక్షణవేత్త లందఱు నుదాహరింపలేదా ? అట్లయినను దాని కేల సార్వజనీనత రాలేదు ? నిస్సారత్వము మున్నగునవి కారణము లనియెదరేని పద్యకావ్యములలో మాత్ర మెన్నిలేవు పై మాటలకు గుఱియగునవి ? కావున, నాలోచించుకొలఁది ద్విపద కావ్య ప్రచారము లుప్తమగుటకు మనవారిలోఁ బాదుకొని వేళులు పాఱియున్న యహంపూర్ణ మగు మౌఢ్యమే గాని వేఱు కాదని తోచుఁను.

ఈ మాటలను నేను ప్రాచీనులను దూషింపతలంపున ననుటలేదు. సర్వజన శ్లాఘ్య మగు వైదుష్యమున నొప్పారె శ్రుతిస్మృతీ తిహాసాదులఁ గరతలామలకములఁబోలె నొనర్చికొని సమయస్ఫూర్తిగ నుపన్యసించు జాణతనమున

నలరారి తనకాలమున నున్న పరవాదులగుంపియల్లి జల్లురు మని విజృంభించి తా నుత్తమ శ్లోకత నొంది వీరమాహేశ్వరపరిష్ఠ(త్రై వెలసిన పాల్కురికి సోమ నారాధ్యుల నాఁటికి ద్విపదకవిత్వముపై సి లోకమున కేవిధమగు నభిప్రాయ ముండెడిదో, ఆ మహామహుని గ్రంథమునందలి ద్విపదపంక్తులు కొన్ని సూక్ష్మ ముగా తెలియఁ జేయఁగలుగును :

''......ఒప్పునే ద్విపదకావ్యోక్తి నా వలవ
దారూఢగద్యపద్యాదిప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు
నట్టులుగాక కావ్యప్రౌఢిపేర్మి
నెట్టన రచియింప నేర్చినఁ జాలు
నుపమింప గద్యపద్యోదాత్తకృతులు
ద్విపదయు సమమ...''

దీనినిబట్టి యారాధ్యులవారు పండితునిచరిత్రమును ద్విపదకావ్యమునఁ జెప్పబూనుకొనినట్లును అప్పటికే యనఁగా సోమనారాధ్యుని కాలమునకె ద్విపద కవిత్వ మన్న నేవగించుకొనుపండితు లుండి రనియు, తాము చేయుకృతి పండి తులకంటెఁ బామరజనమునకే యెక్కు డుపయోగపడవలసి యుండుటచేతను, గద్య పద్యములతోఁ బ్రౌఢిగా రచించుచేప్ప తమ పన్నను జనసామాన్యమున కట్టిక్కృతులు (అనఁగా ప్రౌఢములగు గద్యపద్యకృతులు) సంస్కృతపదబాహుళ్య ముచేఁ జెన్నారు చుండుటవలన సంతుష్టిని కలుగఁజేయఁ జాలక యుండుట చేతను తాము ద్విపద కావ్యవిరచనమునకుఁ బూనుకొనవలసి వచ్చె నని కారణ ములఁ జెప్పియు నంతటితోఁ దృప్తినొందక, అనఁగా నామాత్రపుసమాధానము చేత లోకులకుఁ దృప్తి గలిగింపఁజాలక, ఎట్టకేలకు ద్విపదకును బద్యగద్య కవిత్వమునకును భేదములేదని నిరూపింపవలసివచ్చినట్లు తేలుచున్నది.

మఱియు, గద్యపద్యోదాత్తకృతులకును ద్విపదకృతులకును సాదృశ్య మును సంఘటింప నుపక్రమించి సరళత ప్రసన్నత మొదలగు గుణములచే సమృద్ధమై యుండిన కవిత్వ మేయేవృత్తములం దున్నను కవిత్వ మనిపించుకొను

ననియు, అట్టిగుణములు పరిపూర్ణముగా సంఘటించుటకు కేవల మొకజాతులు (అనఁగా నుపజాతులు) మాత్రమే తగియున్న వనియు, అందును జల్లిశబ్దములను ప్రయోగించుట మొదలైన దోషములు పరిహరింపఁబడిననే సహృదయుల కానందము గలుగుననియుఁ గంఠోక్తిగాఁ జెప్పి తాను రచింపఁదొరకొనిన పండితారాధ్యచరిత్రమును పైనిజెప్పిన సల్లక్షణములతో నలరారునట్లు చేసెద నని యీ క్రింది ద్విపదలో వక్కాణించుచున్నాఁడు. పరికింపుఁడు :

''అటుగాన నభివినుతానందితోక్తి
బటుపద్యగద్యప్రబంధసామ్యముగఁ
గావ్యకళాప్రౌఢిఁ గల్పింతుఁ గవిత
కావ్యంబు భావ్యంబు గాఁగ నట్లయ్యు
నవికల వేదవేదాంతేతిహాస
వివిధాగమపురాణవిహితసూక్తముల
నిదమిత్థ మనుచోట నివియ ప్రామాణ్య
పదములు గాఁగ ద్విపదలు రచింతు.'' —పం. ఆ. చరిత్ర.

మఱియు, కవి తనకుఁ గల కవిత్వశక్తిచేత వృత్తములకు నితివృత్తములకు సొంపు నింపురే గాని వృత్తములు నితివృత్తములును కవి కుత్కర్ష గూర్పఁజాలవు. కావున సత్కవి యగువాఁడు తనప్రతిభావిశేషమున నేఛందమునైన నందము నొందఁజేయఁగలఁ డని తన యుద్యమమును సమర్థించుకొని, ద్విపదకవిత్వము గూడ నిక్కముఁ బరికించినచో సమర్థత యున్ననే చెప్పఁ జొప్పడు ననియు, అందును ముఖ్యముగా ననర్థముఁ బొరయనిరీతిని వళ్ళను ప్రాసములును బొందుపడి యుండవలయు ననియు చెప్పుచు, ద్విపద యైహికాముష్మికము లగు పదద్వయమునకు సాధన మగుటవలన ద్విపద యని పేర్కొనఁబడియె ననియుఁ జెప్పెను. చూడుడు :

'' ... ... ... ... ద్విపద
కొలఁది నే పలుకుటకును మది మెచ్చి
వ్రేలిముద్రిక రత్న కీలన సేయు
చో లేశ మనఁగవచ్చునె ? రత్నమెంత
సొటైన రత్నంబుచుట్టును బసిడి
గట్టుట యది వివేకం బది యట్ల !

దేసిగా రచియించు ద్విపదకు వఖ్ఖ
ప్రాసంబులును బొందుపడఁగఁగా వలయు
ననుచుఁ దదీయ సూక్ష్మాక్షరపంక్తిఁ
జెలకక యింతొప్పఁ జెప్పునే యనుచు
సన్నుతి సేయుచు సత్కవు లలరఁ
దిన్ననిసూక్తుల ద్విపద రచింతు
నదియును గా కైహికాముష్మికద్వి
పద హేతు వగుట ద్విపదనాఁగఁ బరఁగు.''

ఈ యుదాహరించిన వాక్యసందర్భములఁ బట్టి పైని నేను చెప్పిన విషయములు యథార్థము లని తమకు తోఁపకపోదు. కాన, నిఁక నిప్పుడు ద్విపదతోఁ గవిత్వము చెప్పిన కావ్యములు పద్యప్రబంధములశైలికి సమముగా నుండునా? లేక న్యూనము లగునా? ఆధిక్యము నొందునా? యను విషయములు నిర్ణయింప వలసియున్నది. నాకుఁ గల యభిజ్ఞానము కొలఁది పరికించిచూచిన (ద్విపదకావ్యములు పద్య ప్రబంధములతో సామ్యతా విషయమునఁ బరీక్షించినచో) కవితయందుఁ గాని భావప్రపూర్ణతఁ గాని శైలివిషయమునఁ గాని ఉక్తివైచిత్ర్యమునఁ గాని ఏ మాత్రమును తీసిపోకుండుట యట్లుండఁగా పై పెచ్చు ఒకవన్నె యందమును ఆధిక్యమునే ప్రదర్శించు ననుటలో నతిశయోక్తి యిసుమంతయు లేదు. కావున, నిటుపైని ద్విపద కావ్యములకును పద్య ప్రబంధములకును పరస్పర సాదృశ్య మవ్యవహితముగఁ గలియు సందర్భముల నేర్పఱచి ప్రదర్శించుచున్నాఁడను. అందును, మనకు భారత భాగవత రామాయణములకంటెఁ బావనత్వమున నేమి ప్రమాణవిషయమున నేమి యసాధారణములగు గ్రంథములొండు లేకుండుట వలనను రమారమి పై మూఁడు గ్రంథములును గద్యపద్యాదులలోను ద్విపదలోను పూర్వకవులే పరిణమింపఁజేసి యుండుటవలనను మున్ముందు భారత భాగవత రామాయణములలోని ఘట్టములను స్థాలీపులాకన్యాయమున దోలనము నొనర్చి యటుపైని ద్విపదయందుఁగల వర్ణనాచాతుర్యములను కృతులను సంగ్రహముగాఁ బేర్కొనియెదను. చూడుఁడు- భాగవతమునందు చతుర్థస్కంధములోని దక్షుఁడు శివుని ద్వేషించు కథాభాగము :

''ఇందఱు నను గాంచి యెదు రేఁగుదెంచి
వందనంబు లొనర్చి వర్తింపఁ గనియుఁ

గంటిరే మునులు ! ముక్కంటి తా నిచట
నొంటిమైఁ గదలక యున్న చందంబు
గరువంబుతో నన్నుఁ గని లేవకున్నఁ
బెరిగెనే బొజ్జ ? తాఁ బెద్దవాఁ డగునె ?...
ఏ మామనే ? నాకు నీతఁ డల్లుండె ?
కుటిలమాటలకు సాకూళికాపురము
పలుకూడు నడత రూపము చూడ రోత
ఎక్కుడు ముడిగిబ్బ యెమ్ములసొమ్ము
కక్కురం బగు తోలు కట్టెడు వలువ
పునుక కంచము కాటిబూదియ పూఁత
ధనమును నహియుండు తా వది సున్న
పుట్టువు దెలియ దెప్పుడు నొంటి గొట్టు
పెట్టువోతలు మందు ప్రియము దూరంబు
ఈ పిశాచంబుల యేలిక కకట !
నాపట్టి నిచ్చితి నాకర్మవశత
శ్రుతిఁ జతుర్థునకు నేర్పుట గాదె తెలిసి
యితని నాబిడ్డ నిచ్చుట దెలియ. —ద్విపద భాగవతము.

సీ. పరికింప నితఁడు దిక్పాలయశోహాని
కరుఁ దీక్రియాశూన్యపరునిచేతఁ
గరమొప్ప సజ్జనాచరితమార్గము దూషి
తం బయ్యె నెన్నఁ గతత్రపుండు
మహితసావిత్రీసమానను సాధ్వి న
స్మత్తనూజను మృగశాబనేత్ర
ననలభూసురబంధుజనసమక్షమున మ
ర్కటలోచనుఁడు కరగ్రహణ మర్థిఁ
జేసి తా శిష్యభావంబుఁ జెందు టాత్మఁ
దలఁచి ప్రత్యుద్గతాభివందనము నెలమి
నడపకుండిన మానసీ నన్నుఁ గన్న
నోరిమాటకుఁ దన కేమి గోరవోయె.

సీ. అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మాని
హీనుఁడు మర్యాద లేనివాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు దిగం
బరుఁడు భూతప్రేతపరివృతుండు
తామసప్రమథభూతములకు నాథుండు
భూతలిప్తుం డస్థిభూషణుండు
నష్టశౌచుండు మన్మనాథుఁడును దుష్ట
హృదయుఁ డుగ్రుఁడును పరేతభూని
కేతనుఁడు వితతస్రస్తకేశుఁ డశుచి
యైన తన కొక్క శివనామ మనుప్రవాద
గలిగెఁ గాని యశివుఁ డని కాన కెఱిఁగి
యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చునట్లు.'' —పద్యభాగవతము

శ్లో. ''ఏష మే శిష్యతాం ప్రాప్తః, య న్మే దుహితు రగ్రహీత్
పాణిం విప్రాగ్నిముఖత, స్సావిత్ర్యా ఇవ సాధువత్,
గృహీత్వా మృగశాబాక్ష్యాః, పాణిం మర్కటలోచనః
ప్రత్యుత్థానాభివాదార్హే, వాచా ప్యకృతనోచితమ్
లుప్తక్రియా యాశుచయే, మానినే భిన్నసేతవే
అనిచ్ఛన్నప్యదాం బాలాం, శూద్రా యే వోశతీం గిరమ్,
ప్రేతావాసేషు ఘోరేషు, భూతైః ప్రేతగణై ర్వృతః
అట త్యున్మత్తవ న్నగ్నో, వ్యుప్తకేశో హసన్ రుదన్,
చితాభస్మకృతస్నానః, ప్రేతస్రజస్థిభూషణః
శివాపదేశో హ్యశివో మత్తో మత్తజనప్రియః
తస్మా ఉన్మత్తనాథాయ నష్టశౌచాయ దుర్హృదే
దత్తాబత మయాసాధ్వీ చోదితో పరమేష్ఠినా.''
—సంస్కృత భాగవతము.

పై నుదాహరించిన సంస్కృతాంధ్రగ్రంథభాగములను పరికించినవారికి పద్యద్విపదలయందైన భాషాంతరీకరణములలోని భేదములు కనుపట్టకపోవు. ఉదాహరించినగ్రంథములలోఁ దొలుతది కోనేరునాథకవి రచించిన (ద్విపద)బాల

భాగవతము. రెండవది పోతనగారి పద్యకావ్యము. మూఁడవది వ్యాసకృతి యని చెప్పబడుచున్న భాగవతము. ఇందు పరికింపవలసిన విషయములలో మూలమునకు సరిగా 'తుచ' తప్పకుండ భాషాంతరీకరణ మున్నదా లేదా యనువిషయముకంటె ఎవ్వరి భాషాంతరీకరణము ప్రాకృతజనులకు సైత మింపు నింపెడి రచనలతో ముద్దులుమూటగట్టుచు నౌచిత్యమును పరిహరింపక, చదువరుల నాకర్షించునను విషయము ముఖ్యమైనది. ఇచ్చట నింతమాత్రము సహృదయులు పరికించిన చాలును.

మఱియు, ఈ బాలభాగవతమునందలి కవిత్వపు సొంపుఁ జూపుటకై యందలి యొకటిరెండుప్రదేశములను దిగ్దర్శనన్యాయమున ప్రదర్శించెను.

*వనవర్ణనము :*

"పచరించు కన్నులపండువు నెలమి
నచట నైశ్రేయసం బను నుపవనము
పల్లవ విలసనపదము గాకయును
బల్లవ విలసనాస్పద మనఁబరఁగి
విలసితమధుపాయి వికృతిగాకయును
విలసితమధుపాయి వికృతినాఁ బరఁగి!"

*గంగానదీ వర్ణనము :*

"కమలాధివాసతా కమనీయ యగుచుఁ
గమలలోచనుని వక్షస్థలి వోలె
సమలకంకణయు క్తహంసక యగుచు
సమరఁ గై సేసిన సతివయు వోలె."

ఈబాలభాగవతము రచించిన కోనేరునాథకవి తనగ్రంథమును చంద్రగిరి రాజగు తిరుమలరాజు ప్రోత్సాహముచేత నతనితమ్ముఁ డగు చినతిమ్మరాజునకంకితముగా నొనర్చెను. మఱియు, నీకవి నన్నయభట్టు తిక్కన భీమకవి మొదలగు నాంధ్రకవులు ప్రబలినకాలమునందే తనభాగవతమును ద్విపదలతో వ్రాయుటంజేసి యప్పటి సామాన్యలోకమునకు ద్విపదపై నేపాటిగౌరవ ముండినదియు తేటతెల్లమగుచున్నది. ఈకవి తా నింతకుమున్ను పద్యకవిత్వమున భాగవ

తమును వ్రాసియే యున్నను, బాలురును, స్త్రీలును సులభముగాఁ జదివి యానందించునట్లు దీనిని వ్రాయఁబూనుకొనుటయు తాను 'విలసిత సాహిత్య విశ్రాంతి మంతుఁ'డు, విను తాష్టభాషాకవిత్వ ప్రచండుఁ'డని ప్రఖ్యాతిఁగన్నవాఁ డైనను ద్విపదతో వ్రాయఁ బూనుటయు ద్విపదకవిత్వమున కానాడు గల ప్రజాదరమును తప్పక సూచించు చున్నది.

ఇఁక మహాకవి వాల్మీకిమునిపుంగవ విరచిత రామాయణమును మన యాంధ్ర వాఙ్మయమున నేరీతిని ద్విపదకవిత్వమునఁ గూర్చినదియు విచారింతము. అయోధ్యా కాండమునందు రామునివనవాసము నర్థించు పట్టపుదేవి యగు కైకేయిని దశరథుఁ డాక్రోశించు పట్టును చూడుఁడు :

* "కోమలి ! కేకయకులమునఁ బుట్టి
ఈమాట లాడ నో రెట్లాడె నీకు ?
అడవులపాలు గమ్మని రాముఁ ద్రోయ
నెడపక తొల్లి నీ కెగ్గేమి చేసె ?
కౌసల్యకంటె నిన్ ఘనతగాఁ జూచు
నీ సేవ లొనరించు నీపనుల్ సేయు
నటువంటి సుగుణాఢ్యుఁ డైన శ్రీరాము
నెటులు పొమ్మని యంటివే దయమాలి ?
అడవుం కతని నీ వంపు మటన్న

---

* "వేఁడిన వేఁడి మాట నృపవీరుఁడు సైఁపక కర్ణరంధ్రముల్
సూఁడినభంగిఁ దాఁకుటయు స్రుక్కి మనంబున నొచ్చి నిన్ను నే
నాఁడు నృపాలపుత్రి వని నమ్మి వరించితిఁ గాక యిమ్మయిన్
నేఁ డొక కాలసర్ప మయి నీవిటు నేయుట నాకుఁ దోచెనే ?
ఉ. కీడున కోడ కించుకయుఁ గేక యభూపతి యింటఁ బుట్టి చొ
ప్పొదక పాపజాతి వయి తక్కుట యిట్లని వేడ నెట్లు నో
రాడెఁ ద్రిలోక పూజ్యుఁ డగు నా కొడు కేమిట నీకు నొప్పఁదే
పాడి తలంప కీపణకుఁ బల్కితి దోసము నాక నాకదన్."
—భాస్కర రామాయణము

భాస్కర రామాయణము నే నీ వ్యాసమును వ్రాయు నాఁటికి లభింపలేదు. కాని పై నుదాహరించిన పద్యములు ద్విపదలకంటె మిన్నగ నున్నవని విన్నవించెదను.

యెడఁ జూచి చూచి నే నెటుల పొమ్మందు
నృపపుత్రి వని నిన్ను నెమ్మిఁ గైకొంటి
చపలలోచన కాలసర్పంబు వైతి.''
—రంగనాథ రామాయణము.

పై నుదాహరించిన ద్విపద గ్రంథమునకు మూలభూతము లగు వాల్మీకి రామాయణములోని యీ క్రింది శ్లోకములను చిత్తగింపుఁడు. పిమ్మట మీ మనములకు తనంత తానే రచనా సౌష్ఠవము గోచరింపఁ గలదు.

''నృశంసే ! దుష్టచారిత్రే ! కులస్యాస్య వినాశిని !
కింకృతం తవ రామేణ ? పాపే పాపం మయాపివా
సదా తే జననీ తుల్యాం వృత్తిం వహతి రాఘవః
తస్యైవ త్వ మనర్థాయ కిం నిమిత్త మి హోద్యతా
త్వం మయాత్మ వినాశార్థం భవనం స్వం ప్రవేశితా
అవిజ్ఞానా న్నృపసుతా వ్యాళీ తీక్ష్ణవిషా యథా '' —వా. అ.

వాల్మీకి రామాయణమును తొలుదొలుత తెలుఁగు సేసిన కవి ఈ రంగనాథుఁడే. ఈయన పండ్రెండవ శతాబ్దివాఁడని కవి చరిత్రకారుల యభిప్రాయము రంగనాథ రామాయణమును కోన బుద్ధారెడ్డి తన తండ్రియగు విఠలరాజు పేర రచించె నని ఈ గ్రంథమునందు కనుపట్టునే గాని రంగనాథుఁడు రచించినట్టు లిఖిత దృష్టాంతములు గానరావు అయినను, లోకమునందు రంగనాథ రామాయణ మనియే ప్రతీతి కలిగియున్నది. కాని, రంగనాథుని గుఱించిన నైజమగు వార్త యింతటి వఱకు నుపలబ్ధి కాకుండుటకై ఆంధ్రులు ఖేదింపఁదగియున్నది. రంగనాథుని గుఱించి పలు విధములఁ జెప్పికొందురు. నన్నయభట్టు రచించు భారతముఁ జూచి తానికఁ బద్యరచన యందుఁ బ్రావీణ్యము గాంచు టరిదియని యధైర్యపడి ద్విపదను రామాయణము రచించినట్టు గొందఱు వాక్రుచ్చెదరు. కాని, యిందుల కేవిధమైన ప్రబలాధారములును గానరాకపోవుట యట్లుండ కావ్యమంతయు కాగడా పెట్టి వెతకినను పైఁ జెప్పిన చొప్పదంటుశంక కెడమీయఁగల పద మొక్కటి యైనఁ గానరాదు.

పైఁ గాఁ గావ్యమంతయు రసోద్బోధకము లగు పదజాలము చేత నెచ్చట జూచిన నచ్చట నింపు వెలయించుచు నన్నయాదులలో లేని యపూర్వ వర్ణనా కౌశలమున వెలయుచున్నది. రంగనాథుని రామాయణము ఇప్పటికినాంధ్ర

దేశపు పశ్చిమ భాగములలో వీథిబడులలో పాఠ్యముగను పండితులకు పురాణ పఠన గ్రంథముగను వెలయుచుఁ బూర్వకాలము ప్రజల కీగ్రంథము పైని అందును ద్విపద కావ్యముల పైని గల యసాధారణ మగు ననురాగమును వేయి నోళ్లఁ జాటి చెప్పుచున్నది.

కావ్యమునకు జీవితప్రాయ మగు నౌచిత్యము గమనించుటలోను ద్విపద యైనను రస ముట్టిపడునట్టును పాత్ర లిప్పుడు చదువరుల కన్నులయెదుట నున్నట్లును వర్ణించు కౌశలము ఈకవికున్నట్టులు మఱియితరులకు లేదనియే చెప్పవలసి వచ్చును. ఈవిషయమును సొంతగాఁ బరీక్షింపఁ దలంచువారు గ్రంథములోఁ దమ కిచ్చవచ్చిన యేభాగమును జదివినను తప్పక కృతార్థు లయ్యెద రనుటలో సందియము లేదు.

ఇఁక భారతమును పరామర్శింతము. 'ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు' నుపశ్లోకింపఁబడి, ఆర్యవిజ్ఞాననిధి యనఁ దగినదీ గ్రంథము. వ్యాసమహర్షి లోకానుగ్రహకాంక్షచే వేదసారము నిందు వెలయించెను గదా! మహర్షియొక్క యిట్టి పవిత్రమగు మనోరథమును ఆంధ్ర కవితల్లజులు గమనించి యాంధ్రమున సామాన్యజనుల కెల్లరకును ఛందముగా నుండునట్టు విరచించినందులకై ప్రతియాంధ్రుఁడును తప్పక ఋణియై యుండ వలసినదే.

సీ. ''తెల్లంబుగాదె మీకెల్ల సుయోధను
చేసిన కుటిలవిచేష్టితంబు
లశట మాతో మీరు నడవుల నిడుమలఁ
బొందితి రొకకథంగిఁ బోయెఁ గాల
మిది పదమూఁడగు నేఁడు మాకజ్ఞాత
వాసంబు సలుపంగవలయు నిందు
ధార్తరాష్ట్రులు సూతతనయపౌబలులును
చెఱుపఁగా వేతురు చిన్నసన్న
యెఱిఁగి రేని చాలనెగ్గు వాటిల్లు న
ట్లగుట మమ్ము నింక నతిరహస్య
వృత్తిమై నిర స్తవిఘ్నులరై చరి
యింపుఁ డని యనుగ్రహింప వలయు

— తిక్కన విరాటపర్వము.

ఇయ్యది పాండవులు అరణ్యవాసకాలమును ముగియఁజేసికొని యజ్ఞాత వాసమున కుపక్రమింపఁబోవుచు నంతవఱకును తమతోఁ గలసిమెలసి తమకష్ట సుఖములఁ బారమార్థికచింతతోఁ బాలుగొనిన బ్రాహ్మణబృందమును వీడిపోవలసి వచ్చినందులకు చింతిల్లుచు విడువలేక విడువలేక చివరకుఁ దమదైన్యమును వెలిబుచ్చుచు నను జ్ఞ నడిగెడి సందర్భము. ద్విపదకావ్యపద్యకావ్యములకు కథానకమున భేదము సుంతయైన లేకున్నను, ఈసందర్భమునందు ద్విపద కావ్యమునఁ గల యీక్రింది బంతులను విలోకించినచో నందలి పసందు పొందు పడఁగలదు.

"... ... ... ... ...
ఓమహాత్మకులార ! యోపుణ్యులార !
ఓమహీసురులార ! యుగ్రాటవులకు
మామీదఁ గృప గల్గి మముఁ గూడి వచ్చి
యలవిసేయఁగరాని యలజళ్ల కోర్చి
కలసి యుండితి రింతకాలంబు దనుక
నింక గోప్యము లేల నేఁడాది మాకు
శంకింప నొకచోటి కరుగంగవలయు
రాయిడి పుట్టించి రారాజు మరల
కీయవస్థలు దెచ్చు టెఱుఁగరే మీరు ?
వాఁడింక నజ్ఞాతవాసంబు వలనఁ
బోడిమి మనురోయఁ బుత్తెంచు జనుల
మీరు మే మొకచోట మెలఁగఁగాఁజనదు
మీ రింక మముఁ బాసి మిత్రోవఁ జనుఁడు
ఏకాలమున మిమ్ము నెడసి పోనీక
చేకూఱఁ బరిచర్య సేయలే దయ్యె."

అర్జునుఁడు విరాటనగరమునందు ఉత్తరగోగ్రహణము జరిగినప్పు డుత్తరుని సారథిగాఁ జేసికొని కౌరవుల వెన్నంటుటకై యుద్యమించి తొలుత నరిహృదయవిచ్ఛేదన మగు దేవదత్తమును పూరించునప్పటి సందర్భమును పరీక్షింపుఁడు. ఇచ్చోటఁ బైస్థలమునందుకంటె విస్పష్టముగా నుభయకవితలకుఁ గల తార తమ్యము తేటతెల్లము కాఁగలదు.

మ. "కలఁగెన్ తోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతన్ బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దలమందెన్ త్రిదశేంద్రుపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్."

— తిక్కన విరాటపర్వము.

"ఆమహారవమున సంభోధి గలఁగె
హేమాద్రిశిఖరంబు లిట్టట్టు వడియె
అద్రిజ భీతిల్లి హరుఁ గౌఁగిలించె
నిద్ర మేల్కాని శౌరి నింగికైఁ జూచె
బలభేది వెఱచి గీష్పతి వంకఁ గాంచె
లలి పద్మభవుఁడు కాలము నెన్నఁ జొచ్చె
ఉత్తరుండును మూర్ఛ నొరగెను హరులుఁ
నెత్తిన లేపలే కలమీఁదఁ బడియె!"

—ద్విపద విరాటపర్వము.

మహాభారతమును ద్విపదగా నొనర్చినకవి తిమ్మకవి. ఈయన వల్లభ సూరికి కొమరుఁడని గ్రంథాద్యంతముల వాక్యములవలన విశద మగుచున్నది. ఈకవి యొక్క కవిత్వము కొన్నిచోటుల మూలాతిగామి యైనను జాతీయము లతో చెలువొప్పుచుండును. కొన్నిచోటుల తిక్కనఫక్కికిఁగూడ వన్నె పెట్టఁ జాలి యుండును. అట్టి సందర్భములను పైని బ్రదర్శించియే యున్నాఁడను.

ద్విపదకావ్యములను గుఱించిన ప్రస్తావనను ముగించుటకు ముందింకొక విషయమును గుఱించి ముఖ్యముగా చెప్పవలసి యున్నది. లోతుపాతులకు దిగి పూర్వోత్తరముల విచారణ సేయుటకుఁ గడంగెడి కొలందిని ఈకావ్యములు శైవ మతవిజృంభణకాలమునందు వృద్ధి నొందె నని యనవలసి వచ్చుచున్నది. మఱియుఁ బైకారణమే దృఢమగునది యైనచో తొలుదొలుత ద్విపదయందే యాంధ్రకవితాలత స్వయంభూరూపమున జన్మించి రానురాను గీతములు, కంద ములు, సీసములు మున్నగువాని యాధారమున క్రొత్తత్రోవలఁబట్టి యల్లికొనియె నని నిశ్చయింపవలసివచ్చును. ఈమాయూహ కాధారముగ కొందఱు విజ్ఞులు "శివకవులకు నవ కవులకు" అను వేమనకందపద్యమునందలి శివకవిశబ్దము నకుఁ బ్రబంధరచయితలగు కవిజన మనియు నర్థము చెప్పుచున్నారు. పరికించి

నచో కవితాభివృద్ధిని సూక్ష్మగతి నరసినవారి కియ్యది నిక్క మనియే తోఁచును. కావున, ద్విపదకవితోజ్జృంభణ కాలమునందలి గ్రంథములను సంగ్రహముగాఁ బేర్కొని విమర్శింపవలసియున్నది. శైవసమయమునందు వెలసిన ద్విపద కావ్యము లన్నింటిలో బసవపురాణము, పండితారాధ్యచరిత్రము నను నీరెండు గ్రంథములును ముఖ్యములైనవి. ఇందు తొలిదానియందు వీరశైవమతోత్పాదకుఁ డగు బసవేశ్వరుని యవతారచరిత్రములు ద్విపదలతో వర్ణింపఁబడినవి. రెండవ దానిలో బసవేశ్వరుని శైవమతమును ప్రచారమునకుఁ దెచ్చి భక్తాళి ననేకము లగు మహిమలఁ గనబఱచి లోకము ననుగ్రహించిన పండితారాధ్యులవారి విజయ మును మతప్రచారమార్గములను దెలుపు విషయములు వర్ణింపఁబడి యున్నవి.

ఈరెండుగ్రంథములు నెక్కడ చూచిన నక్కడ నవరసములు పొంగి పొరలి పోవునంతటి రసోదంచితములుగ ద్విపదలలోఁ గూర్పఁబడినవి. హిమ వద్భూధర గుహాగ్రములనుండి యనర్గళముగా దుమికివచ్చెడు గంగాప్రవాహముం బోలె నీమహా మహునికవిత్వము పాఠకులమనంబుల నానందపూరమున నోల లాడించుచుండును. భక్తశిరోమణి యగు పోతన్న భక్తిపారవశ్యపుకవిత్వమున కును, కవిసార్వభౌముఁడగు శ్రీనాథమహాకవి నుడికారముల గడుసుతనంపు చిన్నెలకును, కర్ణాటరాజ్యరమానాథుఁడు నాంధ్రభోజుఁడు నాంధ్రకవియు నగు కృష్ణదేవరాయమహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతులలోని యద్భుత వర్ణనపటిష్ఠము లగుసందర్భములకును, దీనికి దానికని యేల ఇంతదనుక మన యాంధ్రసారస్వతమునఁ గల హృద్యములగు రసవద్వర్ణనోదంచితములగు కావ్యపుమెఱుఁగుల కన్నిటికిని, ఈరెండు ద్విపద కావ్యములే మార్గదర్శికములై విరాజిల్లినవి యనుటలో నేమియు సందియము లేదు. పాఠకులమనఃపరితృప్తికై పైగ్రంథములలోని యొకటిరెండు సందర్భముల నీక్రిందఁ బొందుపఱచుచున్నాను.

ఈక్రిందనుదాహరించిన భక్త్యుద్రేకజనితములగు పండితారాధ్యు గూర్చిన నుతివాక్యములఁ జూడుఁడు:

"చిరతమోగుణపరిస్ఫీతుండు శివుఁడు
వరసత్వగుణవికస్వరుఁడు పండితుఁడు
అసమలోకాధీశు డంబికాధవుఁడు
అసమలోకారాధ్యుఁ డాపండితయ్య

లోకానుసారిశీలుఁడు పండితయ్య
... ... ... ... ...
అసితకంఠుఁడు దా నసమలోచనుఁడు
భసితకంఠుఁడు దాఁ బండితస్వామి
మల్లికార్జుననామి మల్లికార్జునుఁడు
మల్లికార్జునకీర్తి మల్లికార్జునుఁడు.''

వెలనాటిచోడుని యాస్థానమున నున్న పండితబృందము పండితారాధ్యుల పాండిత్యప్రకర్షను సహింపఁజాలక యందఱును గలిసి పండితుని వాదమునకు రప్పింపుఁడని రాజును గోరి యనంతరము తా మొకపెద్దసభఁ గూర్చి పండితునితో వాదముఁ జేసి యోడిన సందర్భమునందలి యీక్రిందిద్విపదలు విష్ణుచిత్తుఁ డొనరించిన వాదఫక్కిని మీఁటి చదువరులమనంబులకు ప్రత్యక్ష మయ్యెడిని పరికింపుఁడు.

''గరిడికెక్కిన యంకకాఁడును బోలె
... ... ...
నెడ విడివడ్డ మత్తేభంబువోలె
వడి మృగంబులఁ గన్న వ్యాధుండువోలె
పరఁగఁగ పంతంపుబంటునుబోలె
పగవంగ పసిగన్న వ్యాఘ్రంబవోలె
నాసురవృత్తిఁ గోపాటోపవృత్తు
డై సమయుల సమయూథముఁ జూచి
యెక్కడి వైదికుం డెక్కడిబౌద్ధుఁ
డెక్కడివైష్ణవుం డెక్కడిజోగి
యెక్కడి చార్వాకుఁ డెక్కడి సాంఖ్యుఁ(డు)
... ... ...
ఉర్వీశుపరివార ముర్వీశుబంటు
లుర్వీశుప్రజలు నీయున్నవా రెల్ల
ప్రకటింప వేయునులకత్రాళ్ళు గూడి
యొకమ్రోకు సరె సభ్యుఁ డొకఁడైన వలదె
ఇందుఁ దా సభ యన నెద్ది వినంగ
నిందు సభాపతి యెవ్వండు చెప్పుఁడు?''

ఇంక నీవిషయమును జాలించి ద్విపదకావ్యములలోని మనోజ్ఞవర్ణనము లను ఒకటిరెండింటి నుదాహరించి యటుపైని ద్విపదకావ్యములలో రసవంతము లగు కావ్యముల పేరులను మనవి చేయుదును.

వనవర్ణనము :

"దిగ్గున వికసించి తెలుపొందు విరుల
వలుదగుత్తుల నెత్తు వలపుల మించి
నలికంపుపూపలై నలి నొగ లెక్కి
కాయలై పులుసునఁ గరిగట్టఁ గలిగి
పాయక ఫలములై పదియారువన్నె
బంగారుచాయరాఁ బండిన పండ్లు
పొంగారు కొమ్ములఁబెంపున విరిగి
వనమహీరుహములవరుసఁ బెం పెసఁగె."

ఈవర్ణనము నవనాథచరిత్రమునందలిది. మత్స్యనాథుఁడు మొదలగు తొమ్మండ్రుసిద్ధులచరిత్రము లిందు వర్ణింపఁబడినవి. ఈగ్రంథప్రణేత సుప్రసిద్ధుఁడగు గౌరనమంత్రి.

వర్షబాధ :

"... ... ...
ఫాలలోచనుతీవ్రపావకశిఖలఁ
బొగసెడి దిగధీశపురముల నెల్ల
నెగసి భుగుల్లను నెఱమంట లనఁగ
మెఱపులు తళతళ మెఱయక మున్నె
యుఱుములు పెళపెళ యుఱిమె నయ్యుఱుము
లట మిన్నుతల మ్రోయు నంతకు మున్నె
పెటపెట పెటిలి పెన్పిడుగులు వడియెఁ
బిడుగులు నుఱుములుఁ బేర్చువేగమున
బడబడ వడగండ్లు వడియె నెల్లెడల
వడగండ్లకంటెను వాన మున్నాడి

కడవల జలము లొక్కట వంచినట్లు
బోరన గురిసె నద్భుతమైన వాన.''

ఇట్టిమనోహరము లగు వర్ణన లెన్నియేని ద్విపదసారస్వతమునఁ గలవు. చరిత్రాత్మకము లగు గ్రంథములలో (1) నవచోళరాజులచరిత్రము (2) పాండ్య రాజులకథలు (3) పతివ్రతలకథలు (4) ఛళ్ళాణరాజుకథ (5) కాటమరాజుకథ (6) కరికాళచోళకథ (7) ప్రతాపచరిత్రము (8) వెలనాటివిజయము (9) పల్నాటి వీరచరిత్ర (10) బొబ్బిలికథమున్నగు గ్రంథములును, వేదాంతగ్రంథము లలో (1) మాయాచిదానందమంజరి (2) ఆత్మైక్యబోధము (3) ప్రభులింగ లీలలు (4) రాజయోగామృతసారము (5) తత్త్వానుసంధానము మున్నగున వియు, పురాణములగు గ్రంథములలో భారతభాగవతరామాయణములు, శివపురా ణ బసవ పురాణములు మున్నగునవియు ముఖ్యములైనవి, ద్విపదకవిత్వమున గలవు. ఇందుఁ గొన్నిటిని (అప్రసిద్ధములై యున్నవానిని) సూక్ష్మముగాఁ బేర్కొని యొండురెండుబంతుల నందం దుదాహరించెదను.

*1. మాయాచిదానందమంజరి:*

కృతికర్త నాదెండ్ల యుమాపతి.

''నవరత్నకనకాది నవలోహమయము
దివిజదానవయక్షతిర్యఙ్మనుష్య
పశుపక్షికీటవిబంధురానేక
విశదరూపవిచిత్రవిస్మితాకరము
సకలవైశిష్ట్యసత్వౌఘభాసురము
నకలంకసప్తాబ్ధి యను సరోవరము''

*2. ఆత్మైక్యబోధము:*

కృతికర్త లింగగురుని శిష్యుఁ డగు యోగానందుఁ డఁట.

''శ్రీమన్మహాభాగ్యశృంగార మగుచు
నామరూపుల కెల్ల నాటప ట్టగుచు
వేదాంతములయందు వివరింపఁబడుచు
నాదాంత మై లోకనాయకుం డగుచు.''

''సకలవేదార్థంపు సారమై యున్న
యకలంక మాత్మైక్య మది విస్తరించి
ఒప్పైన ద్విపదగా నున్నదున్నట్లు
చెప్పితి విబుధులు చిత్తగింపుండు.''

*3. లక్ష్మణమూర్ఛ:*

(ద్విపదశైలి నించుకరభేదము గల ఛందము)

''కాఱుటడవులు దాఁటి కాలనేమంతలో
మకరి యున్నా బావిమందటను నిలిచె
మనోవేగము గల మరీచతనయుండు
మాయవనముల మధుమయము గావించె.''

*4. ఇంద్రజిద్యుద్ధము:*

''ఇంద్రజిత్తుఁడు వీరవిక్రమంబునఁ జెలఁగి
రాజసుతుపై నేసె తేజశరములను
హనుమంతుపై నేసె నతిఘోరబాణముల
నక్షయునిఁ ద్రుంచె నను నలుక మదిఁ బూని.''

మఱియు పైని పేర్కొనినగ్రంథములు మాత్రమేగాక గోపీగోపాలసంవాదము, తారాశశాంకము, రంగనమంత్రి రచించిన శివభక్తిప్రదీపిక, నాదెండ్లగోపప్రధానులచే రచిత మగు కృష్ణార్జునసంవాద మను భగవద్గీతాశాస్త్రము, కాచనకవినాథుడు కూర్చిన మైరావణచరిత్రము, కపోతవాక్యములు, చేమకూరి అప్పకవిప్రణీతమగు సారంగధరచరిత్రము రత్నాకరము గోపాలకవియొక్క సౌగంధికాపహరణము, పరమానందప్రణీత మగు శివజ్ఞానమంజరి, రుక్మిణీకల్యాణము నలచరిత్ర లను సుప్రసిద్ధకావ్యములు, యోగానందావధూతవిరచిత మగు గురుశిష్యసంవాదము మున్నగు ననేక గ్రంథములు పూర్వకవులచే లోకానుగ్రహార్థమై ద్విపదలఁ గూర్పఁబడి విరాజిల్లుచున్నవి. ఇయ్యవి ప్రాచీనము లగు పద్యకావ్యములకుఁ గాని ఆధునికము లగు గద్యపద్యోభయకృతులకుఁ గాని ఏవిషయమునను తీసిపోకుండుట మాత్రమే గాక ఆంధ్రులయొక్కయు నాంధ్రభాషయొక్కయు పూర్వపుటున్నతిని వేయినోళ్ళఁ జాటుచున్నవి. కావున, దేశాభిమానులును స్వభాషాభివృద్ధికాంక్షులు నగు నాంధ్ర మహాశయులు జీర్ణములై

పోవుచున్న ద్విపదకృతులను బ్రచారమునకుఁ దెచ్చి యాంధ్రమాతృత్రాణమును దీర్చి దేశీయుల కృతజ్ఞతాసూచకము లగువందనముల నభివంద్యు లయ్యెదరు గాక యని ప్రార్థించుచు నింతతో విరమించుచున్నాను.

—ఆంధ్రపత్రిక పదియవ సంవత్సరాది సంచిక,
సిద్ధార్థి ఉగాది - 1919 సం. మే నెల 28వ తేది.

—) o (—

# ఆంధ్ర ప్రబంధములు

—శ్రీ గంటి జోగి సోమయాజి

భాషకు వివిధగ్రంథ బాహుళ్యము, వృక్షమునకు శాఖా బాహుళ్యము వంటిది. వృక్ష మెట్లనేక శాఖాయుక్తమై ఫలపుష్పపత్ర సహితమై శోభిల్లుచుండునో యట్లే భాషయు గ్రంథబాహుళ్యంబున శోభిల్లుచుండును. గ్రంథము లనేక రకములుగా నున్నవి. ఏ భాషయందు వివిధములైన గ్రంథజాతు లుద్భవించుచుండునో యది యభివృద్ధి గాంచుచుండును. పద్యగద్యశ్రవ్యదృశ్య కావ్యములని నాలుగుతరగతులుగా నాలంకారికులు విభజించియున్నారు. ఆంధ్రభాషకు నాదర్శమై ప్రాచీనభాషలలో నెల్ల ప్రాచీనమైన సంస్కృతభాష యందున్న గ్రంథ జాతులును కావ్యముల యొక్క యుత్పత్తియు నీసందర్భమున గొంచెము ప్రసంగింపవలసి యున్నది. సంస్కృతమునందు గద్యకావ్యములు బహుస్వల్పము. ముచ్చిముమ్మా రన్నట్లు మూఁడుకావ్యములు మాత్రము కన్పించుచున్నవి. వైద్యమును గురించి వ్రాసినను నది శ్లోకరూపముగానే రచియింపఁబడినది. దృశ్యప్రబంధములు మహోన్నతస్థితికి తేఁబడినవి. అందు విషాదాంత నాటకములు బహిష్కరింపఁబడినవి. తరువాత రఘువంశ, మేఘసందేశ శిశుపాలవధాది కావ్యము లెక్కుడుగా గాన్పించుచున్నవి. ఈ కావ్యముల ఫక్కిని కనిపెట్టిన వారిలో మొదటివాడు విరించితుల్యుఁడగు వాల్మీకి. ఆయన వ్రాసిన రామాయణము కావ్యములలోఁ జేర్పఁబడినది. తదనంతరము రచింపఁబడిన భారతము పురాణమై యొప్పుచున్నది. వైపుల్య మనులక్షణము భారతమందుఁ బెంచఁబడి తరువాతి పురాణసాహిత్యకి మార్గదర్శకమై యున్నది. వాల్మీకి ప్రథమ కావ్యరచయిత యగుట తరువాత కవులాతని ననుసరించియు వైపుల్య మంతగా లేని కావ్యముల రచించుట ప్రారంభించిరి. వారిలో ముఖ్యుఁడు కాళిదాసు. తరువాత నింకను గావ్యము లనేకములు సంస్కృతభాషయం దుద్భవించినవి, కాని తత్కావ్యములయందుఁ బ్రథమరచయిత యగు వాల్మీకియందుఁ గల గుణములు లేకపోయినవి. తరువాత రచించిన కాళిదాసు వాల్మీకి గుణముల ననేకముల గ్రహించి తనకు వీలైనయంతమట్టునకు వన్నె ఘటించుటకు ప్రయత్నించెను గాని వాల్మీకికంటె మిన్నగా వ్రాసెనని మాత్రము మా యభిప్రాయము గాదు మొట్టమొదట నాదికావ్యము ననుసరించి వ్రాయఁబడినకావ ములు పెద్దదారిఁ

బట్టి శిశుపాలవధ వ్రాయుకాలమునాటికి గేవల వర్ణనాప్రధానములై కథారంజకత లేక చిత్రకవిత్వబంధకవిత్వములకు గూడ నాస్థానములై యొప్పినవి. తరువాత నాలంకారికులు తత్కాలమం దుత్తమగ్రంథములుగాఁ బరిగణింపఁబడిన కొన్ని గ్రంథముల గ్రహించి కావ్యలక్షణములను ధ్రువపరిచిరి. అట్టి స్థితిలో నున్న సంస్కృతకావ్యములును దల్లక్షణవ్యంజకములైన యాలంకారికుల గ్రంథములును నాంధ్రభాషలోని కావ్యనిర్మాణకర్తల కాదర్శము లయ్యెను.

ఇఁక నాంధ్రప్రబంధములకు మార్గదర్శకు లెవ్వరు? వా రేవిధి నీసాహిత్యమును వృద్ధిపరచిరి ? యను విషయముఁ జర్చింపవలయును. ఆంధ్ర భాషను సంస్కరించి పురాణ మగు భారతమును తెనిగించినవాఁడు నన్నయభట్టు. అం దాతఁడు ప్రబంధలక్షణము లగు వర్ణనలను రచియించెను. తరువాత రచియించిన ప్రబంధములకు, మఱ్ఱిచెట్టునకు బీజమువలెనే భారతములోని వివిధస్థలములలోని వర్ణనములే యాధారము లని చెప్పవచ్చును. నన్నెచోడ టేంకణాదిత్యుని కుమార సంభవము కావ్యఫక్కిని జూపించుచున్నది. అది సంస్కృత కుమారసంభవము చదివిన కవిచేతనే వ్రాయఁబడినదని చెప్పక తప్పదుగాని యందులో నున్నగుణముల నన్నిటినిగాని కథావిధానమును గాని కవి యనుకరింపకపోయెను. కథాసంవిధానమున (న॥ని) కుమారసంభవము పురాణములనే పోలియున్నది గాని కావ్యములఁ బోలియుండలే దని చెప్పకతప్పదు. నాచనసోముని హరివంశము చాల మట్టునకుఁ బ్రబంధములఫక్కికి దారిఁ జూపించినది. కథాబాహుళ్యము కలిగినను వర్ణనల పట్టునను భావస్ఫురణపట్టునను నాంధ్రప్రబంధములకు మార్గము చూపిన దని చెప్పక తప్పదు. తరువాత చెప్పవలసినవాఁడు శ్రీనాథుఁడు. ప్రబంధ సాహిత్యమునకునై స్పష్టముగా మార్గము చూపినవా డితఁడు. ఇంతకు ముందు కేతనాదులు దశకుమారచరిత్ర కాదంబరి మొదలగు గ్రంథములను దెనిగించిరి గాని యంతకంటె నెక్కుడు ప్రబంధమార్గదర్శకముగా గ్రంథరచనము చేయలేదు. శ్రీనాథుఁడు ముఖ్యముగా సంస్కృత గ్రంథములఁ జదువుకొని పాండిత్యము సంపాదించినవాఁడు. ఆతని కాలమం దాంధ్రభాష సంస్కృత భాషాచ్ఛాయయై యొప్పుచుండెను. ఈతని గ్రంథములఁ జదివినవారి కెవరికైన నీతని సంస్కృత భాషాపరిచయము బోధపడక పోదు. సంస్కృతకావ్యముల నన్నింటిని జూచిన శ్రీనాథుఁడు ''నైషధం విద్వ దౌషధ''మ్మనియు ''కాశీఖండ మయఃపిండ'' మ్మనియు దుర్భేద్యంబు లని పేర్వడియున్న గ్రంథముల రెంటిని దెలుఁగుఁ జేసెను. అందు శృంగారనైషధముచేఁ బ్రబంధ రచనాసౌధమున కింకొక పెద్ద

సోపానమును కల్పించెను. ఆతఁడు వ్రాసిన గ్రంథమందలి కథాసరళియు వర్ణనావిధానమును భావనాపద్ధతియును తరువాతికవుల కాధారము లయ్యెను. ఈతఁడు సంస్కృత నైషధములోని వర్ణనల నన్నింటిని మక్కికి మక్కిగా దెలుఁగు చేసెను. తనకు దుర్ఘటమగు పంచనళీయవర్ణనము మొదలగు చోట్ల కొన్ని విశేషణములను విడిచివేసి తనశక్త్యనుసారము రచించెను. తరువాత ప్రబంధరచనకు సోపానము గట్టినవాఁడు పిల్లలమఱ్ఱి పినవీరన. ఈతఁడు శృంగార శాకుంతలమును రచించినవాఁడు. ఈ శృంగారశాకుంతలము స్వతంత్రగ్రంథము. కథ మాత్రము భారతమునుండి గ్రహింపఁబడినది. కాళిదాసకృత సంస్కృత నాటకమునుగూడ చదివినవాఁడె యీ కవి. అయినను కాళిదాసుచే చేయఁబడిన వర్ణనా చమత్కారమును, బాటింపఁబడిన పాత్రౌచిత్యమును నీ కవియందుఁ గానరావు. భారతములో కేవలము రసాభాసముగను విరసహేతుకముగను నౌచిత్యహీనముగను వర్ణింపఁబడిన స్థలములయం దీతఁడు కథావిధానమును మార్చి స్వారస్యము పుట్టింపఁ దలచెను. కాని యీతని కల్పనయు నంత సమంజసముగా కన్పింపలేదు. పూర్వకవి కాళిదాసకృత శాకుంతలమందలి కథపట్టుల నీతఁ డనుసరించిన యెడల నీతనికి స్వాతంత్ర్యము తక్కువయని జనులు హర్షింపరేమో యని యీతఁడు తనదారి తొక్కినట్లు తోచుచున్నది. కాని నయమున నేమి భయమున నేమి యీతఁడు చూపించిన స్వతంత్రత తరువాతి కవులకు మార్గదర్శకమయ్యెను. కావ్యములయందు రసవిరోధకముగా గాని నాయకవిరోధకముగా గాని యున్న మూలకథను బరిత్యజించి యితివృత్తమునందు మార్పు నొనర్చుకొన వచ్చునను ధనంజయ సూక్తిని నాంధ్రకవు లంతగఁ బాటించినట్లులేదు. పిల్లలమఱ్ఱి పినవీరన కథా సందర్భమున స్వతంత్రపుమార్పుల నొనర్చినను బద్యరచనా సందర్భమునను నింకఁ గొన్ని సందర్భములను శ్రీనాథుని ననుకరించియే యున్నాఁడు.

తరువాత వర్ణనాప్రధానములగు నాంధ్ర ప్రబంధములకుఁ బ్రథమగ్రంథమగు మనుచరిత్ర యల్లసాని పెద్దనామాత్యునిచే రచియింపఁబడెను. ప్రకృతమందున్న ప్రబంధసాహిత్యమున కంతటికిని నియ్యదియే మార్గదర్శకమై యొప్పుచున్నది. ఈతఁడు పురాణాంతర్గతమైన కథను గ్రహించి స్వతంత్రము లగువర్ణనల సంఘటించి పాత్రౌచిత్యాదులఁ బాటించి సరసముగా మనుచరిత్రమును రచించెను. ఇదియే వర్ణనాప్రధానమగు ప్రబంధసాహితికి మొదలని చెప్పక తప్పదు. తరువాత వసుచరిత్రమును రచించి రామరాజభూషణుఁడు ప్రబంధలోకమున నింత

కంటె నెక్కుడు వన్నెగలుగు ప్రబంధము వ్రాయుట కవకాశము లేదని చూపి వేసెను. వసుచరిత్రతోఁ బ్రబంధసారస్వత మంత మందినను నాంధ్రసాహిత్యమున కేకౌరంతయును రాఁబో దని చెప్పవచ్చును. తక్కినప్రబంధములందు ముఖ్యములగునవి రాఘవపాండవీయమును నాముక్తమాల్యదయు నై యున్నవి. రాఘవ పాండవీయము ద్వ్యర్థికావ్యములలోఁ బరిగణింపఁ బడవలసినదే గాని ప్రబంధములం దంతగాఁ బరిగణింపఁ బడవలసినది గాదు. ఆముక్తమాల్యద పేరు గాంచిన ప్రబంధ మైనను ననేకములందుఁ బూర్వపద్ధతుల ననుసరించి వ్రాయ బడినదే గాని నూతన మేమియును గన్పట్టదు. మిగిలిన ప్రబంధలోకమం దంతటను వసుచరిత్ర ననుకరించి వ్రాయఁబడిన గ్రంథములే గన్పడుచున్నవి. తరువాత వారు వర్ణనలయందుఁ గాని కథపట్టుల గాని స్వతంత్రము లగు మార్పులఁ జేయఁ జాలక పూర్వులదోషములను మాత్ర మనుకరించి యున్నారు. అట్టి యనుకరణములను ననుసృతులు నాంధ్రప్రబంధలోకమునకు సామాన్యమై కవిసమయము వంటిదిగాఁ బరిగణింపఁబడిన యనేకోదాహరణములతో బ్ర. వ. చి. సీ. శాస్త్రిగారు తమ వసుచరిత్రవిమర్శయం దుదాహరించి యున్నారు.

తెనుఁగుబాస సంస్కృతమునే యాదర్శప్రాయముగా నొనర్చుకొనుట చేతను నన్నయభట్టు కాలమునాఁడు మాత్రమే తలయెత్తి మాట్లాడుట కారంభించుటచేతను సంస్కృతభాష కనేకవిధముల నభివృద్ధియందు తీసిపోవు ననుటకు సందియము లేదు.

సంస్కృతమునుండి ప్రథమమున బురాణములు తెనిఁగింపఁబడిన వని పూర్వము వ్రాసియే యున్నాను. అట్టి పురాణరచన యైన తరువాత నారంభించిన ప్రబంధరచన నవీనయుగారంభమునాటికి నంతమొందినది. తనతల్లి యగు సంస్కృత భాషవలెనే తెనుఁగు గద్యకావ్యరచనయందు ప్రవేశించియుండలేదు. లక్షణగ్రంథములుగూడ పద్యములలోనే వ్రాయఁబడినవి. ఆకారణమునం జేసి నవీన యుగారంభమునకు (అనగా 20వ శతాబ్ది) ముందుండిన యాంధ్రసారస్వతమునం దాహ్లాద జనకములైనవి ప్రబంధము లొక్కటియే యని చెప్పక తప్పదు. అట్టిప్రబంధములలో నుత్కృష్టమైనవి నాలుగు మాత్రము కనుబట్టుచున్నవి. అవి: మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవపాండవీయము, ఆముక్తమాల్యద. ఈ గ్రంథముల ననుసరించియు సంస్కృతములోని కావ్యములంబట్టి రచింపబడిన యలంకారగ్రంథముల బట్టియు నాంధ్రమున బ్రబంధలక్షణములు, అప్పకవ్యాదులచే

నిర్వచింపఁబడినవి. ప్రబంధమునం దిరువదిరెండువర్ణన లుండవలయు నని వారిచే నిర్ణయింపఁబడినది. ఇట్లు తాత్కాలిక మగు ప్రబంధములను సంస్కృతకావ్యములను బరీక్షించి తల్లక్షణములను సర్వప్రబంధములకు సామాన్యముగా నుండవలసిన లక్షణము లని చెప్పి భావికవులస్వేచ్ఛను నిరోధించిరి. రాజకీయ విధానమునం దెట్టిపారతంత్ర్య మనుభవించుచున్నామో యట్టిపారతంత్ర్యమునే సారస్వతమునందుగూడ ననుభవించుట మనకవుల కాచారమైపోయినది. మన పూర్వు లగు మహాకవులు వ్రాసినమార్గములనే త్రొక్కి వారు వ్రాసిన పుస్తకములకుఁ గాని కల్పనలకుఁ గాని వన్నె పెట్టుటకు శక్తిచాలక వానిదోషంబులనుమాత్ర మనుకరించి తుట్టతుదకు ప్రబంధము లన్నియు నొకరిది చూచి యొకరును నింకొకరిని దగ్గర నుంచికొని పైవారును వ్రాసినట్లు తోపింపఁజేయుచున్నవి. దృశ్యకావ్యము లనియు శ్రవ్యకావ్యము లనియు రెండు విధములుగా సారస్వతమును విభజించినప్పుడు శ్రవ్యకావ్యములయం దన్నిటియందును మహాకావ్యమున కుండవలసిన వర్ణన లన్నియు నుండక తప్పదని శాసించుట కెవరి కధికార మున్నది? అట్టివారు శాసించినను దానినేప్రమాణముగ గొని 'I.P.Code' వలె దాని నాదరించి యభివృద్ధి గాంచనివా రెంత శ్లాఘాపాత్రులు.

నైషధకాలమునుండి యాంధ్రమునందు రచింపబడిన ప్రబంధము లన్నియుఁ బరీక్షింపఁగా నొకకొన్నిసామాన్య మగు లక్షణములు గన్పించుచున్నవి. సుమారు మూడువంతులప్రబంధములయందు శృంగారమే ముఖ్య రసము. స్వీయ, పరకీయ, సామాన్యలలో నెవరో యొక్క రగు నాయిక యొక నాయకునిఁ జూచి మోహించుట, సందర్శన వియోగాదులచే, సంభోగవిప్రలంభ శృంగార వర్ణన,విప్రలంభశృంగారములో వృక్షములనుమృగములను సంబోధించుట చంద్రమన్మథోపాలంభనము,మన్మథపూజ మొదలగు కొన్నిసామాన్యమైనసిద్ధగుళికలు. ఏ కవి వ్రాసినను నా విప్రలంభమే, యా శృంగారమే,యా గుళికలనే పుస్తకములనిండ నింపివేసిరి. రసనిష్పత్తి యగుట కిది యొక్కటియే మార్గ మని వారి యభిప్రాయము కాబోలు- నవరసము లని యాలంకారికులు మొరపెట్టుచుండగా నందులో నొక్కరస మగు శృంగారమునే తీసికొని వర్ణించుటయం దీకవులయభిప్రాయ మేమియో గన్పించుట లేదు. మిగిలిన వీరశాంతాదిరసములను వీరేమి చేసిరో తెలియకున్నది. ఒక మతోద్ధారకుని చరిత్రగాని యొక్క వీరాగ్రేసరునిచరిత్ర గాని యింకొక మహాపురుషుని చరిత్రమును గాని వీ రెందుకు పరిపోషకముగా రచియింపఁ గూడదు ? అందుచే వీరి కల్పనాసామర్థ్యమునకు నుపాసనకును వన్నె వచ్చియుండును గదా ?

ఇదిగాక పైశృంగార రచనయందు వీరుచేసిన మహాదోష మొకటి కలదు. సంభోగ శృంగారరచనయందు నాయికానాయకుల రహస్యావస్థలను బహిరంగపరచి పాన్పు లపయి ప్రౌఢోక్తులు, గర్భాదానపుగదులందు శ్లేషవాక్యసంఘటనలు నింక ననేక ములు కల్పించి,వీరు కొన్నిచోట్ల నసభ్యపుశృంగారమును చూపించియున్నారు. స్త్రీ పురుషులయన్యోన్యవాంఛలచేతను, వా రొకరియం దొకరు చూపించిన ప్రేమాతి శయంబుచేతను, హావభావంబులచేతనే రసనిష్పత్తి కలుగును గాని కవి శయ్యా మందిరమున నాయికానాయకులతో సమానముగ నిద్దురమాని యుండుటచేఁ గాదు గదా! నేను పైనుదాహరించిన వర్ణనాదివిషయము లందరికిని సామాన్యముగా నెఱుకపడినవి యగుచే నుదాహరణముల నిచ్చుట మానుకొంటిని.

అలంకారములతో నెంతమట్టు కాకవులు తమగ్రంథములయందుఁ బ్రస క్తినిగలిగించి రను విషయమును విమర్శింపవలసి యున్నది. కొంచె మించు మించుగా నలంకారము లేని పద్యము లిందులో లేనేలే వని చెప్పవచ్చును. అతి శయోక్తి, ప్రౌఢోక్తి, కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి, ఉదాత్త, ఉత్ప్రేక్షా ద్యలంకా రము లన్న వీరి కెంతయో యిష్టము. ఉత్ప్రేక్షలకు మేరయే లేదు. రసనిష్పత్తి కలంకారము లెంతవఱ కావశ్యకములో విచారింతము. నాటకములందు ధీరోదా త్తాది నాయకవ్యవహారమును జూచి మనకు రసానుభవ మెట్లు కలుగుచున్నదో యటులనే శ్రవ్యకావ్యములందును రసనిష్పత్తికి ముఖ్య మగునవి పాత్రలు, పాత్రౌచిత్యము, తదవస్థలు, కథాసంవిధానములే గాని యలంకారము లంతగాఁ గారణములు గావు. ఈ యభిప్రాయమునే విశ్వనాథపంచాననులవారు, "శబ్దార్థ యోరస్థిరా యే అలంకారా స్తేఽంగదాదివత్" అని చెప్పియున్నారు. అలంకార ములు కావ్యకన్యక కంగభూషణములవంటివి. నైజసౌందర్యముచే నలరారువారికి నలంకారముల ప్రసక్తిలేనేలేదు. అట్టి నైజసౌందర్యము లేనివారి కెన్నిభూషణ ములు పెట్టినను సౌందర్యము రానట్లు స్వతస్సిద్ధముగాఁ బసలేని కావ్యమునం దెన్నియలంకారము లుంచినను బస కానఁబడదు. దీని కనుగుణముగా కాళిదాసు "కి మివ హి మధురాణాం మండనం నాకృతీనాం" అని చెప్పియే యున్నాడు. అదిగాక "షట్పదశ్రేణిభి రేవపంకజం సశైవలాసంగ మపి ప్రకాశతే" అనియుఁ గూడ చెప్పియున్నారు. స్త్రీకి శరీరమునం దుండు- ముత్యములోని కాంతి వలె బ్రకాశించుచుండెడు ప్రత్యంగ సౌందర్యజనితమగు- లావణ్య మెట్లో యట్లే కావ్యమునకు బాత్రౌచిత్యాదులవంటివి. ప్రబంధకవులు వారిగ్రంథములలో రస

నిష్పత్తికి నలంకారముల కీయవలసిన ప్రాధాన్యమునకంటె చాల నెక్కుడుగా నిచ్చి కొన్నిస్థలములయందు వానినే ముఖ్యకారణములుగా నెంచియున్నారు.

తరువాత నెంచవలసిన విషయము వర్ణనాపద్ధతి. ప్రబంధములయందు ముఖ్యముగా బాటించినది వర్ణనమే. ఇట్టిపద్ధతు లుద్భవించుటకు వీరు ప్రథమ కారకులు గారు. వీరి కుపాధ్యాయులు మేష్టరు లగు సంస్కృతకవు లీవిషయ మున నెక్కువ గరిడిదేరినవారు. మాఘకావ్యమునందు రైవతకాద్రివర్ణన కొన్ని సర్గలలో చేయఁబడినది. వాల్మీకి వర్ణనాపద్ధతిని కొంతవరకు బాటించినను నాతని వర్ణన లతిదీర్ఘములు గాక సమయానుకూలములుగా ప్రదర్శింపఁబడినవి. ఆతఁడు వర్ణ్యమును దగుమాత్రము లగు సరసములైన చిన్నచిన్న యుపమాన ములచే పాఠకుని హృదయమునందు హత్తించియున్నాడు. యొక్కొక్కయుప మానముచే నొక్కొక్కవిజాతీయ మైన వస్తువును, దద్దర్శనములును మానసా క్షికి గోచరము లగును. సీతాదేవిని లంకలో నున్నపుడు వర్ణించుపట్ల—

''ఆమ్నాయానామయోగేన విద్యాం ప్రశిథిలా మివ''
''ప్రతిపత్పాఠ్యశీలస్య విద్యేవ తనుతాం గతా''
''ప్రాలేపతవరారోహ ప్రవాతే కదళీ యథా...కురరీ మివ''
''ఆశాం ప్రతిహతా మివ-''

ఇత్యాదు లనేకములు గలవు. అందును కొన్నివిషయములు విపులముగా వర్ణింపఁ బడినవి. గాని యయ్యవి తద్గ్రంథదైర్ఘ్యమునకు సరిపోయి యున్నవి.

వాల్మీకి తరువాతఁ గాళిదాసువర్ణనములతోఁ గావ్యములు వ్రాసియున్నాఁడు. ఆ వర్ణనలయందు మాధుర్యమును స్వభావోక్తులును సరసత్వమును గాన్పించు చున్నవి తరువాత కావ్యములయందు వర్ణనావైపుల్యము పెరిగిపోయి యానందజన కత క్షీణించినది. అట్టికావ్యములవర్ణనయే యాంధ్రప్రబంధముల కాధారమైనది. ఆంధ్రప్రబంధకారు లుపయోగించినకథలును వర్ణనలును నొక్కయచ్చున దీసిన ప్రతిమ లగుటచే వర్ణనలును గూడ నట్టే కావలసివచ్చెను. కోటను వర్ణింపవలసి వచ్చినప్పుడు ప్రథమకవిచే నేలక్షణములు ప్రథమదుర్గమునకు చెప్పఁబడినవో యవియే తిరిగి తక్కినకవులచేఁ జెప్పఁబడినవి. ఒకరు బంగరుకోట యని వర్ణిం చిన తోడనే ప్రతికవియు దనప్రబంధమునందును బంగరుకోటనే వర్ణింపవలయు నని గాబోలును దానినే యింకొక యలంకారముచేఁ గొంచెము ప్రౌఢముగాఁ

జెప్పి యున్నారు. కొంద రాబంగరుకోటనే శివునిచే విడువఁబడిన విల్లా యనునట్లు గన్పించు నని యుత్ప్రేక్షించి చెప్పియున్నారు. ఇట్లు ప్రబంధప్రపంచమునందు గోట లన్నిటికిని స్వర్ణమయత్వము నౌన్నత్యమును బరిఖయొక్క యగాధతయును ముఖ్య లక్షణముగాఁ గన్పట్టుచున్నయవి. కవియనువా డొకశిల్పి. చిత్రకారుఁడే విధముగా గతములైన యాకారములను దూరస్థములైన వైచిత్ర్యములను రమణీయముగా యథార్థముగా జిత్తరువులను వ్రాసి యక్షిసంయోగము వలన మనోవేద్య మొనరించుచున్నాఁడో యదేవిధముగాఁ గవియుఁ గూడ మాటలచే గర్ణముల ద్వారా వర్ణిత వస్తువులయాకారములను మనోవేద్య మొనర్చుచున్నాఁడు. కనుక కవి వర్ణించువర్ణన యేవిధముగా నుండవలయు ననఁగా వర్ణనము జదివినయంతనే మనస్సునందు వర్ణ్యవస్తువుయొక్క స్వరూపము పొడకట్టవలయును. అట్టి రూపస్ఫురణశక్తి లేక మాటలపోగువలె నున్న వర్ణనలు రుచింపవు. దేవేంద్రునిపట్టణములో వర్ణింపఁబడిన కోటలకును నితరరాజులకోటలకును భేదములు గాన్పింపవలయును. ఒకరాజు కోట నొకకవి వర్ణించినప్పుడు కొన్ని లక్షణములు గోచరమై యొక్కప్రత్యేక రూపము స్ఫురించినట్లు రచించినయెడల నింకొకకవి యింకొకకోటను వర్ణించునప్పుడు తద్భిన్నత్వమును సూచించిన గాని యది శిల్పము కానేరదు. పరమేశ్వరుని సృష్టియందు మనము కోట్లకొలది మనుష్యులను జూచుచున్నాము. సజాతీయములైన వారివారి రూపములయం దెట్టిభేదములు గన్పించుచున్న నొకదానికొకటి పోలకుండ నున్నవో యట్లే కవికల్పితములైన ధర్మములును బ్రత్యేక లక్షణములచే నొప్పుచుండవలయును. సామాన్యలక్షణములను మాత్రము ప్రతికవియును వర్ణించినయెడల నది వర్ణన యనిపించుకొనదు. చదివిన వాని కానందము కలుగజేయదు. ప్రతికురంగమునకును నాలుగుకాళ్ళును నొకతలయును దెక్కలును లక్షణము లని వానినే వర్ణించుచు వచ్చినయెడల నందు స్వారస్యంబు లేదు. ఒక రాజకన్యక యొకలేడిని బెంచుకొనిన దని కవి చెప్పి దానిని వర్ణించునప్పుడాత డొక ప్రత్యేక మగు లేడియొక్క వ్యక్తిని వర్ణించుచున్నాఁడు. గాని సర్వమృగ సామాన్య విశిష్ట మగు లేడియొక్కలక్షణమును వర్ణింపలే దని జ్ఞాపక ముంచుకొన వలయును. తాను వర్ణించుపదార్థముయొక్క యాకారము కవి మనఃఫలకమునందుఁ బ్రథమమున నొప్పుచుండిన గాని యట్లు వర్ణించుట కవికి సాధ్యము కానేరదు. వస్తు రూపమునందుఁ గల భిన్నత్వమును జూపించుట చాల కష్టమైనపని. పూర్వకవులు చేసిన వర్ణనలను, గోశములను, ముందుంచికొని మాటలను మాత్రమే మనస్సునం దూరించుచుండునెడల నట్టిప్రత్యేకరూపము రానేరదు. వర్ణన సేయునపుడు కవి కేవర్ణ్యముయొక్కయాకారము మనస్సునందు స్ఫురింపక

పోయినయెడల దద్వర్ణనముచే బాఠకుని కట్టిస్ఫురణ మెట్లు సంభవించును? సర్వవర్ణనలయందును ప్రబంధకవు లీవిధముగానే సంచరించిరి. నిజగ్రంథమం దుండు నాయికలవర్ణన సేయునప్పుడు కవు లందరు నొకేపక్ష నవలంబించి యున్నారు. స్త్రీయొక్క నఖము లారంభించి కచాంతమువఱకును ప్రత్యేకవిభాగ మొనర్చి యొకొక్కయంగము ననేక కల్పనలచే వర్ణించియున్నారు. ఇట్టిప్రత్యే కాంగవర్ణన మొనర్చినమహాకవులలోఁ గాళి దాసు మొదటివాఁడు, అతఁడొక్కొక్క యంగము నొక్కొకశ్లోకముచేఁగాని రెంటిచేఁ గాని స్వాభావికముగా వర్ణించి తద్రూపనిష్పత్తి యొనరించెను. ఆ మార్గమునే తరువాతికవు లనుసరించిరి గాని తద్భిన్న మగు మార్గము నవలంబింపలేక పోయిరి. ప్రత్యేకాంగవర్ణనమునే గ్రహించి యొకొక్కయంగమును గురించి యెన్నియో పద్యములు వ్రాయుచు వచ్చిరి. స్త్రీస్వరూపమును వర్ణించునప్పుడు శరీరమునందలి యేవియో కొన్ని ముఖ్యాంగములను ముఖ్యలక్షణములను గాని వర్ణించి రూపమునంతను మనో గోచరమగునట్లు చేయగలశక్తిని వీరెవ్వరును జూపియుండ లేదు. ఆ ప్రత్యేకాంగ వర్ణమునందును గూడ కవిసమయసిద్ధము లగు కొన్ని యుపమానంబుల మాత్రము గ్రహించి రచియించిరి. ముఖవర్ణన మొనరించినప్పుడు చంద్ర కమలములును, గన్నులను వర్ణించునప్పుడు కలువలు, తామరలు, చేపలు, నింక నావిధముగానే పూర్వకవులచే వాడఁబడిన యుపమానంబులనే మక్కికిమక్కిగాఁ గొని కొంచెము రంగుపూసి గాని చూపించుచు వచ్చిరి. అందులోఁ గొంచెము పేర్వడినకవులు తదుపమానంబుల గ్రహించి వానినే యాధారములుగా గూర్చుకొని భ్రాంతిమత్తులు, అతిశయోక్తులు, ఉదాత్తాలంకారములు మొదలగు పల్టీలు వేయుచుండిరి. ఒకరు నక్షత్రములకు గోళ్ళను నింకొకరు ముఖమునకు జంద్రుని నుపమానంబులుగాఁ జెప్పిన నాభావముల రెంటిని గ్రహించి కలిపి ముఖము చంద్రుని కాంతి హరించు టచే దరహాసకందళమున (అనగా వెన్నెలచే) మనుపు మని ప్రార్థించుటకు పాద ముల నాశ్రయించిన విధునికొమ్మలో యను నటుల నాయింతి గోరు లొప్పుచుండె నని వర్ణించెను. కల్పన ప్రౌఢముగానే యున్నది గాని యుత్తమ కవిత్వలక్షణ ములుమాత్రము పట్టలే దని చెప్పవచ్చును. ఉత్తమ ప్రబంధములయందలి యుదాహరణ గావుననే కొంచె మాహ్లాదజనకముగా నున్నది గాని యితర ప్రబంధములయందలి యుదాహరణలు కొంచెమును సరసముగా నుండవు. వీరు వర్ణించిన రూపముల వర్ణనలయం దిది యొక దోషము కన్పట్టుచున్నది. రుక్మిణి, సత్యభామ, ద్రౌపది మొదలగు ననేక నాయికల ననేక కవులు

వర్ణించియున్నారు. అందరికిని ముఖములు పద్మములే, పాదములు పంకేరుహములే, జంఘలు బూరాలే, కన్నులు కల్వరేకులే యైనయెడల నీప్రత్యేకవ్యక్తుల యందుగల భేదమును గవు లేమి సూచించిరి ? వారు వర్ణించిన రూపమునే మనమును వర్ణించిన యెడల పైవారు వెక్కిరింపరాయను నంశము నైన వీ రేల తలంపలేదు ? ప్రపంచమునందు మన మెందరినో యందగత్తియలను జూచుచున్నాము. వారందరు నొక్కరూపముననే యున్నారా? లేకపోయినందున వారి యందమునకు గొరంతయున్నదా ? రుక్మిణి మొగము కోలగానున్నట్లు గన్పించును గాని చూచినవారి మనస్సులను హరింపగలుగునట్లు మనోహరమైన విశాల నయనములచే నొప్పారు చుండు నని యింక నసుగుణములగు లక్షణములను వచించిన యెడల నావర్ణనకు గాని కవి ప్రదర్శింపఁదలచినరూపమునకు గాని గొరఁత కలుగదు కదా? అట్లు వర్ణించుటచేఁ గవి మనోమండలమున నుండు ప్రత్యేక రూపము పాఠకునికి గోచరించి రుక్మిణీవ్యక్తియొక్క ప్రత్యేకత స్ఫురించునుగదా ! పోనీ యుపమానముల నైన మార్చి యుపమానభావములను గ్రంథములనుండి గ్రహింపక వీరిమనస్సులచే నాలోచించి వారియనుభవమునకు గోచరించిన యుపమానముల నేల వ్రాయఁగూడదు?

ఇంక వీరిగ్రంథములయందలి కథాంశములను బరీక్షింతము. ప్రబంధమునందు బురద్యూతాది వర్ణన లిరువదిరెం డుండవలె నని నిర్ణయించుటచే గదా చమత్కార మొకదానికంటె నింకొకప్రబంధమునందు వృద్ధిసేయుట కవకాశము లేకపోయినది? ఒక ప్రబంధమునందలి యితివృత్త మింకొకప్రబంధమునందలి యితివృత్తమునకు చాయవలెఁ దోచుచున్నది. ఒకటిరెండుప్రబంధములయందు దక్కఁ దక్కినవానియందు బస కానరాదు. కథ బహుస్వల్పము. వర్ణన బహుళము. వసుచరిత్రకారుడు కొన్ని దృశ్యప్రబంధము నందలి రీతుల ననుకరించి కొన్నివిధముల నాహ్లాదజనకత కలుగఁజేసెను. కథయు హ్రస్వమును దీర్ఘమును గాకుండ సమముగానే యున్నది. వర్ణనాభాగముమాత్రము హెచ్చుగా నున్నది. మనుచరిత్రయందుఁ కథ పెద్దది గాని యందు వస్త్వైక్యము కానరాదు. అందలి మనోహరమైన కథ స్వరోచి జన్మముతో నంతమొందును. తరువాతికథ యంతయు నొక కథయుఁ బూర్వకథయంతయు నింకొకటిగాను గన్పించుచున్నది. ఆ రెంటికిని కవి యతికిన యతు కతుకుగానే యున్నది. కథాసంవిధానమున నూతనపక్కి ననుసరించినవాఁడు పింగళి సూరన. ఈతడు కళాపూర్ణోదయమునఁ గాదంబరి ననుసరించి కథాకల్పన మొనర్చెను. ఇట్టి కల్పన యాంధ్ర

ప్రబంధములయం దపూర్వము. గ్రంథమునందు నిజముగా నాహ్లాదజనకతకుఁ గారణము కథాసంవిధానము. కథయందు పాత్రములకు గొన్నికొన్ని స్థితులను గలిగించి వానివలన బాఠకులయందు శృంగారాదిరసముల నుద్దీపనము జేయుట కవియొక్క పని. అట్టిస్థితులు వచ్చుటకు కథయందాస్కారము లేనప్పు డాగ్రంథమునం దాహ్లాదజనకత్వము సిద్ధింపదు.

ఇఁక మన మెంచవలసినవిషయములలోఁ బాత్రపోషణ మొక్కటి మిగిలి యున్నది. ఇందుఁ గవి ముఖ్యముగా గమనించవలయు విషయము లనేకములు గలవు. ఒకపాత్రను సృష్టించి యాపాత్రచే నొకమహోన్నతకార్యము నొనరింపఁ జేయునప్పుడు స్వాభావికముగా నట్టిపాత్రకుఁ గావలసినపరికరములను సమకూర్చికొని యాపాత్రయందలి గుణములను క్రమవృద్ధి నొందింపవలెను. ఒక పాత్రయందు ముఖ్యగుణ మొకటి యుండిన యెడల దాని యారంభమునకును బరిణతికినిఁ గావలసినవిధిని కవి స్వాభావికముగా వర్ణింపవలెను. కవి పురాణములలోని గాథల గ్రహించినప్పుడు, మూలకథయందు నాయకుఁడు నాలుగేండ్లకే నిరుపమాన పాండిత్యమును సంపాదించినాఁ డని చెప్పబడిన యెడలఁ నట్టివిషయమును దీసివేయుట గాని లేక యానాయకుని కంత చిన్నవయస్సునకు ఆజ్ఞానము వచ్చుటకుఁ దగిన కారణములను ముందు సూచన యొనర్పవలెను. ఇట్టి రచనకు ప్రబంధ సాహితి యందు తావు గన్పింపదు. ఈ విషయమును ప్రబంధకవులు పాటించుటయే లేదు. ఒక్క మనుచరిత్రయందు మాత్రము ప్రవరాఖ్యపాత్రయందు కవి యిట్టి నియమమునుఁ బాటించినవాఁడు వరూధిని వంటికన్యక స్వయంద త్తయై వచ్చినప్పుడు నిరాకరించుటకు దగిన ధైర్యమును ప్రవరాఖ్యునియం దుంచుటకు ముందు తదనుగుణమైన వర్తనను వానియందు నిల్పియున్నాఁడు.

ప్రబంధసాహిత్యమునందు గమనింపవలసిన విషయములను సాధ్యమైనంత క్లుప్తముగ పొందుపరచియున్నాను. ఆంధ్రప్రబంధ సారస్వతమునందలి లోటులను బరీక్షించినయెడల నాభాగము నింక ననేకమార్గములయందు వృద్ధి నొనరింపవచ్చునవి చెప్పకతప్పదు. నే నుదాహరించిన యభిప్రాయములను కవులగువారు గమనించి పైలోపములను బూరిచేసి యాంధ్రమునకు వన్నెదెత్తురు గాక! నేను పైనుదాహరించిన విషయములలో స్ఖాలిత్యములు గాని వానిగురించి యభిప్రాయభేదములు గాని యున్న యెడల సహృదయులు మన్నింతురు గాక!

—శారద.

క్రోధన - జ్యేష్ఠము; జూన్ 1925.

8వ సంవత్సరము; సంపుటము 1- సంచిక 2

# బొమ్మలాట - యక్షగానము

—డాక్టర్ యస్వీ జోగారావు

మనదేశంలో బొమ్మలాట అతిప్రాచీనకాలం నుంచీ ప్రసిద్ధమైన జానపద కళావినోదంగా పరిఢవిల్లుతూ వచ్చింది. అసలు నాటకకళాభివృద్ధికి దారి దీసింది అదే అనవచ్చు. బొమ్మలాటకు బ్రహ్మలాంటివాఁడు సూత్రధారి. సూత్రధార శబ్దం తరువాత తరువాత ఔపచారికంగా రూపకప్రస్తావనల కెక్కినా బొమ్మలాటకు కుదిరినంతగా రూపకానికి కుదరదు. సూత్రం పట్టుకుంటేనేగాని బొమ్మల ఆటే లేదు. అంచాతే ఆ మాట పుట్టింది. రూపకంలో స్థాపనతో సరి సూత్రధారునివాలకం. తెర మరుగైనా బొమ్మలాటలో చిట్టచివరిదాకా అతనిఅవసరం వుంటుంది. భరతనాట్య శాస్త్రంలో సూత్రధారశబ్దం వున్నదంటే క్రీస్తుపూర్వం రెండుమూఁడు శతాబ్దాలనాటికే బొమ్మలాట ప్రదర్శనాలు ప్రసిద్ధి వహించాయన్నమాట.

క్రీస్తుశకం పదోశతాబ్దినాటి కివి దేశాంతరాలకు గూడా వ్యాపించాయి. జావాలో వీటిని వాయంగ్ వినోదా లంటారు.[1] అవి క్రీ.శ. 1000 నాటికే కడు ప్రసిద్ధములై యీనాటికీ మన రామాయణ మహాభారతగాథలనే ప్రదర్శిస్తూ ప్రజామోదం పొందుతున్నాయని తెలుస్తోంది.[2] ఈనాడు బొమ్మలాట ప్రపంచమంతటా ప్రసిద్ధిపొందింది. మనఆంధ్రదేశంలో కూడా యీ బొమ్మలాట చాలాకాలంనుంచీ ఉంటున్నట్లు ఊహించవచ్చు. పాల్కురికిసోమనాథుని కాలంనుంచి మనసాహిత్యంలో బొమ్మలాటల ప్రసక్తి తరచుగానే కనిపిస్తోంది. ఉదాహరణకు పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణంలో 'భారతాదికథలఁ జీరమకుఁగుల నారంగ బొమ్మలనాడించు వారుఁ, గడునద్భుతంబుగఁ గంబసూత్రంబు-లదరంగ బొమ్మల నాడించువారు' అని వుంది. ఇందులో వరుసగా తోలుబొమ్మలాట, కొయ్యబొమ్మలాటా, రెండూ సూచింపఁ బడ్డాయి. వాటినే కన్నడంలో వరసగా చక్కలద గొంబె, సూత్రదగొంబె అని అంటారు.

---

1. 'వాయంగ్ ఆటలు - జావాద్వీపవాసుల వినోదములు' - అను శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్యాసము. ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచిక.

2. 'The Mahabharata and the Wayang in Java' - By Dr. B R. Chatterjee - 'India and Java' (Greater India Society Bulletin No. 5. Part I pp 48-50.)

మన ఆంధ్రదేశానికి బొమ్మలాట మహారాష్ట్రలనుండి దిగినట్లు పెద్దలు చెబుతారు. అసలు యీనాటికిగూడ అటు రాయలసీమా యిటు కోస్తాజిల్లాలలోనూ అక్కడక్కడ మిగిలివున్న బొమ్మలాటవాళ్ళను యోగక్షేమంచేస్తే వాళ్ళు మరాటీ వాళ్ళని తేలుతుంది. మనరాష్ట్రంలో వాళ్ళపూర్వులస్థితిగతులెలావుండేవో చూచాయగా చెప్తాను. శా.శ. 1130 అంటే క్రీ. శ. 1208లో వేయబడిన దుర్జయాన్వయులైన విప్పరుల కొండప గుండప నాయకుల ముక్కామల భూదాన శాసనంలో 'సూత్రధారి బోమలయ' అనునత డొకప్రతిగ్రహీతగా పేర్కొనబడ్డాడు.[3] అతఁడు బొమ్మలాటవాడే కావచ్చు. కాకతీయులనాటి వరంగల్లుజిల్లా గూడూరు శాసనం[4] చివర 'సూత్రధారి కొమ్మోజన బరహ' అంటే సూత్రధారి కొమ్మోజు వ్రాసినది అని వుంది. ఇది తెలుగువృత్తాలలో నున్నశాసనం. ఒక పానుగల్లుశాసనంలో[5] తూర్పువైపునన్నవ్రాతలో 'సూత్రధారి బ్రమ్మోజు బెరసిన సూత్రధారుల కాస్యపల్లిని బానుగంట దళవృత్తి పుడపండ్లు 20 భీమసముద్రము వెనుక పుడమయితురు' అని వుంది. ఆ సూత్రధారి కొమ్మోజు బ్రమ్మోజులు పేళ్ళను బట్టియే బొమ్మలాటవారైనట్లును, మహారాష్ట్రులైనట్లును ఊహించవచ్చు. మహారాష్ట్రమునకు సన్నిహితమైనది కన్నడదేశం. అదీకాక బొమ్మలాట దేశద్రిమ్మరుల కనేక భాషలు రావటమన్నది సహజం. అసలా మరాటీ బొమ్మలాట వాళ్ళు తొలుత కన్నడ దేశానికి వచ్చి పిదప ఆంధ్రరాష్ట్రానికి ప్రాకివుంటారు. పై శాసనాలనుబట్టి పదమూఁడో శతాబ్దినాటికే మనరాష్ట్రంలో వాళ్ళు రాజప్రాపకమునఁత భూవసతులు సంపాదించు కొంటూ వున్నట్లు, స్వయంగా తెలుగులో పద్యాల్లో కూడా శాసనాలు వ్రాయగల సామర్థ్యం గలవారైనట్లూ తెలుస్తోంది. తత్రాపి వారు గ్రంథరచనా ప్రోత్సాహకులూ, స్వయం గ్రంథకర్తలు కూడా అయినట్లు ఈ క్రింది విషయాలవల్ల తెలుస్తోంది. ఆంధ్ర కవితరంగిణి తొమ్మిదో సంపుటంలో ఉదాహరింపబడిన కోడూరి వల్లభసూరి

3. South Indian inscriptions Vol X No.247.

4. *తెలంగాణా శాసనాలు, ప్రథమ సంపుటము. కాకతీయులవి నెం. 55.

5 *తెలంగాణా శాసనాలు - చిల్లర శాసనములు నెం. 18.

*(లక్ష్మణరాయ పరిశోధక మండలి ప్రచురణ, హైదరాబాదు 1935).

చరిత్రంలో అతడు పాటిగణితం అనే గ్రంథమును కర్ణాటసింహాసనాధీశ్వరులగు కృష్ణదేవ-అచ్యుతదేవరాయళ్ళను కొలిచి మన్నన లందిన "బొమ్మలాట విరుపాధిపకాళని ప్రేరణంబునన్" రచించితి నని చెప్పుకున్నాడు. ఆకాళయ కుమారు తాతాచార్యుని శిష్యు డయినట్లు నెఱదాతయైనట్లును వల్లభసూరి చెప్పాడు. పెనుగొండలో కృష్ణరాయల కోశాధికారిగా వుండి శిల్పకళానిక్షేప మగు లేపాక్షి దేవాలయాన్ని నిర్మించా డని చెప్పబడే విరూపన్న యీ కాళయతండ్రియే యగునా యని అనుమానము. బొమ్మలాటవారిగురించి శ్రీ చాగంటి శేషయ్యగా రొకశాసన విషయము నుటంకించారు. కడపమండలమందలి కమలాపురముతాలూకా చిడిపిరాల గ్రామమును చంద్రమయ్య యను నతఁడును (ఇతనిని బొమ్మలాట రయితు అని యందురు), బొమ్మలాట యమృతకవి యను నతఁడును తెర నాటకము లాడుటకై పెదచిట్టయ్య యను నతని కిచ్చిన ట్లొక శాసన మున్నది అని. దీనినిబట్టి వారికి బొమ్మలాటలందే కాదు, తెరనాటకములందును గల అభిమానము తేటతెల్ల మగు చున్నది. అంతేకాదు, ఆ తెరనాటకము లాడువారికి వీరొక గ్రామం దానం చేశారంటే ఆనాటివారిహుందాగిరీ ఎంతటిదో తెలుస్తోంది. అంటే అప్పటికే ఏరాయలవారి అనుగ్రహంవల్లనో వారిసీమలో వీరికి కొన్ని వృత్తులేర్పడివుండవచ్చు. వారివృత్తికి స్మారక చిహ్నాలుగా నీనాడు రాయలసీమలో కొన్ని గ్రామనామాలు వినిపిస్తాయి. వాటిని బట్టియో, అసలు కులవృత్తినిబట్టియో వాళ్ళ కాబొమ్మలాట అన్నదే యింటి పేరుగా పరిణమించి వుండొచ్చు. పైశాసనంలో పేర్కొనబడ్డబొమ్మలాట అమృత కవి రచన లేవో మనకు తెలీవు. ఒకబొమ్మలాటకుటుంబమునకు చెందిన ఒక్క తెలుగుయక్షగానరచన మనకు దక్కినది. అది కిరాతార్జునీయ మను[6] యక్షగానము. కర్త బొమ్మలాట సాంబయ్య లేక సంబయ్య. అతనితండ్రి బొమ్మలాటశాసనుడు, మోహనకవి బిరుదాంకుడు నైన సిద్ధయ. బొమ్మలాటశాసనుడంటే బొమ్మలాట అనే గ్రామానికి కరణం వంటివాడు—ఆమోహనకవిరచన లేవో తెలీదు. సంబయ్య కిరాతార్జునీయము ప్రశస్తరచన గల యక్షగానం.

---

6. దీనిప్రతులు: మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారము- నెంబర్లు D. 1849, 1850, 1851 & R 1143; తంజావూరు సరస్వతీ మహలు- D. C. No. 476; అడయారు దివ్యజ్ఞాన సమాజ గ్రంథ భాండాగారము- Shelf Nos. 32 E 11 & 32 F 7. (గమనిక: తంజావూరు, అడయారు ప్రతులలో నిది సంబయ్యసోదరులు రచించినట్లున్నది. కాని సంబయ్యయే రచించియుండు నని నా నమ్మకము).

ఇందు లేపాక్షి వీరభద్రస్తుతి వుంది. లేపాక్షి అనంతపురంజిల్లా హిందూపురం తాలూకాలో ప్రసిద్ధమైన శివక్షేత్రం, ఆంధ్ర శిల్పకళానిక్షేపం. అక్కడి కిరాతార్జునీయ కుడ్యశిల్పాల దొకప్రత్యేకత యందురు. సంబయ్య బహుశా ఆ ప్రాంతం వాడై వుంటాడు. అతని కృతిరచన కవే ఉద్బోధకాలై వుంటాయి. ఈ సంబయ్య కన్నడంలో కూడా కరియబంటనవిజయము[7] సారంగధర చరిత్రము[8] అనే యక్షగానాలు రచించాడు. అంచాత కర్ణాటక కవిచరిత్రకు నెక్కినాడు. అం దితని కాలము అనే యక్షగానాలు రచించాడు. అంచాత కర్ణాటకకవిచరిత్రకు నెక్కినాడు. అం దితనికాలము క్రీ. శ. 1750 ప్రాంత మని చెప్పబడింది.

మనకు తెలియవచ్చిన బొమ్మలాటవారి తెలుగురచన మరియొకటి బొమ్మలాట హాస్యనాటకము. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున దాని కొక తాళపత్ర ప్రతిగలదు. (నెంబరు R. 1394) అది యొకబొమ్మలాటప్రదర్శనకు ప్రస్తావన. వ్యావహారికధోరణిలో నొక చక్కనిమాండలికపు నుడికార ముట్టిపడు వచన ప్రచురమైన సంవాదశైలిలో సరసములైన హాస్యప్రసంగములతో సాగిన రచన. అసలు బొమ్మలాటవా రాడదలచుకొన్నది శ్రీకృష్ణవిలాస మట. కాని కేతిగాని పెళ్లి యిందలి ముఖ్యవిషయము. గ్రంథకర్త యెవ్వరో తెలీదు. కాని ఈగ్రంథ మధ్యంలో ఒక పంచాంగ ప్రసంగసందర్భంలో 'నందన సంవత్సర భాద్రపద శుద్ధ అష్టమి బుధవారం' పేర్కొనబడింది. అది గ్రంథరచనాకాలమున కొక భంగ్యంతరసూచన అనుకొంటే స్వామికన్నుపిళ్ళెగారి ఇండియన్ ఎఫిమెరిస్ ప్రకారము క్రీ. శ. 1-9-1652 తేదీకి సరిపోతోంది. గ్రంథంలో పలుతడవ లది 'దక్షిణసింహాసనాధీశ్వరుండు విజయసేతురఘునాథభూపాలునినాటకశాలకు సంబంధించిన' దని వుంది. ఆసేతుశబ్దమునుబట్టి యిది ఆ కాలమున రామనాథ శివగంగమండలాధీశ్వరు లగు సేతుపతులకు సంబంధించిన దని తోస్తుంది. వారిలో విజయరఘునాథనామధేయు లాపదునేడవశతాబ్దినడుమ గలరు.[9] అం దొకరిప్రాపకమున నీగ్రంథము వెలసియుండవచ్చు.

ఇంతవరకు చెప్పినవిషయాలనుబట్టి యిప్పుడు బొమ్మలాటవారిస్థితిగతు లధ్వాన్నంగా వున్నా వెనక భేషుగ్గా వుండేవని తోస్తుంది. ఇంక బొమ్మలాట

7. ప్రా. లి. పు. భాం. D. No. 1169.

8 ప్రా. లి. పు. భాం. D. Nos. 1212 & 1220.

9. Vide South Indian Epigraphy, Annual Report for 1928-29. Part II. Item No. 76 i.c. Sivapuri Record from Ramnad Dt., No. 46. Dated Saka 1590 = 1668 A. D.

కీయక్షగానాదులకూ వున్న సంబంధం స్థూలంగా పరిశీలిద్దాం. ఏవో నాలుగు బొమ్మల నటూయిటూ ఆడించేటంతమాత్రాన అది బొమ్మలాటప్రదర్శనం అనిపించుకోదు. ఒక కథ తీసుకొని అందలిపాత్రలకు అనుగుణంగా బొమ్మలు తయారుచేసుకుని వాటి నాడిస్తూ వెనుకనుంచి పద్యాల్లో పదాల్లో దరువుల్లో ఆయాపాత్రలప్రవేశ ప్రసంగాదులు నడుమ అప్రదృశ్యకథానుసంధానం చేసే సంధివచనాలూ వినిపించాలి. అందుకు సాహిత్యాన్ని ఆశ్రయించాలి. బొమ్మలాటప్రదర్శనాల్లో కేవలగద్య రక్తిగట్టదు. అందుకే ఏదేశంలోనైనా బొమ్మలాటప్రదర్శనానికివెనక గేయభాగాధిక మైన రచననే ఉపయోగిస్తారు. పాశ్చాత్య దేశాల్లో సాధారణంగా 'ఓపెరా'లను గేయనాటికల నుపయోగిస్తారు. వాటికిగల సంబంధం గూర్చి 'పపెట్ బుక్' (The Puppet Book*) అనే గ్రంథంలో యిలా వివరింపబడింది :

"Musical plays and operas if specially arranged, can be given by puppets. One advantage of opera on the puppet stage is that the conventional gestures of the singers are well within the capacity of the puppet but besides that there is the possible influence any production might have towards increasing interest in the opera."

అంటే గేయ నాటిక లను ప్రత్యేక దృష్టితో రచిస్తే బొమ్మలద్వారా ప్రదర్శించవచ్చు. అలాప్రదర్శించడంలో కేవల గేయనాటకప్రదర్శకులు సాంప్రదాయికంగా చూపించవలసిన అభినయాంశాలను ఆ బొమ్మలే ఆడుకోగలవు. అంతేకాక అసలా గేయనాటక ప్రదర్శనయెడల కలిగే ఔత్సుక్యము ప్రభావం యీ బొమ్మలాటగేయ రూపక ప్రదర్శనం యెడలకూడా కలుగుతుంది. జావాద్వీపవాసులు వారి వాయంగ్ వినోదాల్లో ఉపయోగించే లాకన్లు అను రచనావిశేషాలుగూడా యిల్లాంటివే. సంస్కృతంలోగూడా చర్మపుత్రికా ప్రదర్శనల కుద్దిష్టమై ఛాయానాటకాలని వున్నాయి. ఇంగ్లీషులో చెప్పవలసివస్తే 'షాడో ప్లేస్' (Shadow plays) అన్నమాట. తోలుబొమ్మలను ఆటలో తెరవెనుకా దివ్వెకు ముందూ వుంచుతారు. ప్రేక్షకులకు కనపడేవి వాటిఛాయలు మాత్రమే అందుకే ఆ పేరు. కొయ్యబొమ్మలాటలో బొమ్మలకు తెరమరుగు వుండదు. కాని వాటికిగూడ ఛాయానాటక గ్రంథభాగాలు పనికి రాకపోవు.

---

* Edtd. By L. V. Wall, B.A., Published by Faber and Faber Ltd., 24 Russel Square, London, W.c.i. Park 5, Item No. 27, Pp 187-198.

సంస్కృత నాట్య విషయిక గ్రంథాల్లో ఎక్కడా ఛాయానాటక ప్రసక్తి వున్నట్లు కానరాదు. సంస్కృతమహాభారతంలో (XIICCXE V, 5) రూపోప జీవనం అనే విషయం గురించి నీలకంఠ పండితు డిలా వ్యాఖ్యానించాడు: 'రూపోప జీవనం జాలమండపి కేతి దాక్షిణాత్యేషు ప్రసిద్ధమ్। యత్రసూక్ష్మవస్త్రం వ్యవధాయ చర్మమయై రాకారైః రాజామాత్యాదీనాం చర్యా ప్రదర్శ్యతే' అని, అంటే రూపోపజీవన మనునది జాలమండపిక అను పేర దక్షిణదేశమున ప్రసిద్ధమైనది. అందు పలుచనిబట్టపై చర్మపుత్రికలద్వారా రాజామాత్యాదులచర్యలు ప్రదర్శింపబడును అని అర్థము. ఈవిషయము నాకు డాక్టరు ఎమ్.కృష్ణమాచార్యుల వారి (History of Classical Sanskrit Literature) గ్రంథంనుండి ఎరుకపడినది. అందులో దేశంలో వివిధప్రాంతాలకూ వివిధకులాలకూ సంబంధించిన కొన్నిఛాయానాటకాలు పేర్కొనబడ్డాయి. అవి అన్నీ పన్నెండోశతాబ్ది కిటీవలివే. అంతకుపూర్వపు రచనలగురించి తెలియవచ్చుట లేదు. ఆ ఛాయానాటకకర్తలు చాలమంది రాజాస్థానము లలంకరించినవా రగుట గమనింపదగినది. ఆయాఛాయానాటకేతివృత్తములు అన్నీ పౌరాణికాలే గాని విశలకవికృతి మాత్రము విశిష్టమైనది. అది చారిత్రకము క్రీ. శ. 1489-1660 సం॥ల నడుమ బీజపురమును పరిపాలించిన ఆదిల్షారాజ వంశచరిత్రకు సంబంధించినది. సంస్కృతఛాయానాటకములందు సుభటుని దూతాంగదము ప్రసిద్ధమైనది. అది క్రీ శ. 1242 ప్రాంతమున అనిహిల్ విద్ ప్రభువు త్రిభువనపాలదేవుని కొలువున ప్రదర్శింపబడినది. దూతాంగద మచ్చైనది.[10] అందు గద్యభాగముకంటె పద్యభాగమే ఎక్కువ. కడమ ఛాయానాటకములు నట్లే యుండు నని ఊహింపవచ్చును.

బొమ్మలాటలకు పాశ్చాత్యదేశాలలో ఓ పెరాలు, జావాద్వీపములలో లాకన్లు, మనదేశంలో సంస్కృతమున ఛాయానాటకాలూ మొదలైనవాటివలె తెలుగులోనూ కన్నడంలోనూ యక్షగానా లుపయోగపడుతూ వచ్చాయి. యక్షగానము పిదపకాలమున ఒక విశిష్టరూపకక్రియగా రూపొందినా, మొదట గేయ రూపమున కథాఖ్యానమే ప్రధానాశయంగా ప్రారంభింపబడింది. అందులో పదద్విపదలు, గద్యపద్యాలు, రాగతాళధారాళము లగు దరువులూ ఒకటేమిటి ఎటువంటి ఛందోబంధమైనా, ఎటువంటిరచనావిశేషమైనా యిమిడిపోతాయి. అందుచేత నాటకంలాగ ప్రయోగించడానికి గాని, హరికథలవలె ఆఖ్యానించ

10. Published by Panduranga Jawaji Nirnayasagar Press, Bombay, Kavyamala Series, 28, Fourth edition 1922.

గాని, పురాణంలాగ పఠించడానికిగాని పనికివస్తుంది. బొమ్మలాట ప్రదర్శనకి వెనక పాటగా మరింత సౌలభ్యం వుంది యక్షగానంలో. ఈనాటికీ కన్నడ దేశంలో మైసూరు ప్రాంతమున వారిబొమ్మలాటలు చక్కలద సూత్రద గొంబెలకు రెంటికిని యక్షగానాలకూ అనుబంధం వుందని తెలుస్తుంది.[11] అలాగే మన ఆంధ్రదేశంలో ఈనాడు అక్కడక్కడ మిగిలివున్న బొమ్మలాటవారి ప్రదర్శనలు చూస్తే వాళ్లు ఆయాప్రాంతపు యక్షగాన కవులరచనలను వినియోగించుకొంటున్నట్లు తెలుస్తుంది. బొమ్మలాటలగురించి జానపదులలో కొన్ని నమ్మకా లున్నాయి. ఉత్తరగోగ్రహణం ఆడిస్తే వానలు కురుస్తాయిట! వానలకీ ఆ కథకీ వున్న సంబంధం ఏమిటో తెలీదు కాని యీనాడును కాకినాడప్రాంతపు పల్లెప్రజ లానమ్మకంతో వానలు పడనప్పుడు మాధవపట్నం బొమ్మలాటవారి నాహ్వానిస్తారు. వాళ్లు చెప్పే ఉత్తరగోగ్రహణంలో ధేనువుకొండ వెంకయ్యగారి విరాటపర్వ యక్షగానంలోని దరువులను గుర్తించవచ్చు.

క్రీ. శ. 1850 ప్రాంతమున గంజాంజిల్లా గుజ్జువాడనివాసి మరింగంటి భట్టరు రామానుజాచార్యులు రచించిన శ్రీరామనాటకము బొమ్మలాట రామాయణముగా[12] ప్రసిద్ధిపొందింది. ఇందలి కథ లక్ష్మణమూర్ఛ. మాధవపట్నం బొమ్మలాటవారి లక్ష్మణమూర్ఛలో యిందలి పద్యాలూ, దరువులూ వినిపిస్తాయి. అసలు

11. Vide : (a) 'Bhagavata Plays in Mysore', a paper by Sri L. Narasimhachar, chap. X, item II, The Eghth All India Oriental Conference, Mysore, 1935.

Vide : (b) 'Yakshagana and other plays of Mysore' an article by Sri S. Srinivasachar, March of Indid Vol IV, No. 6. July - August, 1952.

12. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున దీని కొక తాళపత్ర ప్రతి గలదు. నెం. R. 966. రాజమంద్రి గౌతమీ గ్రంథాలయమునను నొక ప్రతి గలదు. దాని నెం. 98. అసలిది లక్ష్మణమూర్ఛ యను పేరితో 1908లో ఎద్దనపూడి సంజీవయ్య అండ్ సన్ వారిచే మదరాసు మురహరి ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి ప్రకటింపబడినది. తద్గ్రంథ సంపాదకులగు యర్లంకి శ్రీ వెంకటేశ్వర్లు నాయుడుగా 'రిది' చర్మపురి విగ్రహములతో నాట్యము చేయుచుండగా...డామాకు అనుకూలం బగునట్లు...పరిష్కరించిన ట్లుపోద్ఘాతమున గలదు.

కొందరు యక్షగానకవులు బొమ్మలాటలను దృష్టిలో పెట్టుకొని రచించడంకూడా కద్దు. ఉదాహరణకు 19వ శతాబ్దిచివర వీణె సుబ్బరాజు, గాజులపెండ్లూరి శేష గిరిరాజు అనువారు రచించిన సంతవేలూరు కుశలవుల నాటకము 'ఆరురాత్రిళ్ళ నాటకమునకును బొమ్మలాటకును ఉపయోగముగా రచింపబడి' నట్లు గ్రంథముఖ పత్రముమీదనే గలదు. (ఒక ప్రచురణ: వెస్టువార్డు అండు కంపెనీ, మదరాసు, 1931), పర్లాకిమిడికడ నున్న పాతపట్నము వాస్తవ్యుడు కోట వెంకటప్పయ్య శాస్త్రి అనునాయన క్రీ. శ. 1893 లో బాణాసురనాటకం రచించి, దానికి పీఠిక తానే వ్రాస్తూ, అందులో ఈ గేయప్రబంధము చర్మవిగ్రహములచే నాడించుట కును, వేషముల ధరించి నాటక మాడుటకును అనుకూలముగ నుండునటుల రచింపు డని నా మిత్రు లొకకొందఱు ప్రోత్సాహపఱచినందున నే నందుల కియ్య కొంటినని వ్రాసెను. (ఇది మదరాసు ఇండియన్ లా ప్రెస్సులో ముద్రితము-1894లో) ఇందు లొట్టకిత్తడు, రత్నాలు, పోలిగాడు అనువారి హాస్యప్రసంగ మచ్చు బొమ్మలాటలలోని జుట్టుపోలిగాడు, బంగారక్క, గంధోళిగాళ్ల ప్రసంగం లాగే వుంటుంది. అసలు వాళ్లసంబంధం, సందర్భం అటువంటివే. బొమ్మలాట వాళ్లు గొల్లకలాపాల్లోవలె తరచు అమరశ్లోకముల నేకరువు పెడతారు. అమరశ్లో కము లుదాహరింపబడిన యక్షగానము లనేకము గలవు. ఉదా: జిల్లెళ్ళమూడి వెంకటరామదాసామాత్యుని జాంబవతీమానము (ఆంధ్రసాహిత్యపరిషత్తాళపత్ర పత్రి నెం. 3066) మొదలైనవి. అట్టివి కొన్ని బొమ్మలాటలకు నుద్దిష్టములైనవే అని చెప్పవచ్చు. బొమ్మలాటల్లో కేతిగా డొక సాంప్రదాయిక హాస్యపాత్ర. కేతినాయడి వాలకం చాలా యక్షగానాల్లో కూడా వస్తుంది. కొన్ని అచ్చయిన యక్షగానాల్లో అందలి పాత్రల బొమ్మలుకూడా అచ్చుకాబడి వుంటాయి. అవి చూస్తే చాలా మట్టుకు బొమ్మలాట వాలకాలే గుర్తుకొస్తాయి. పైన పేర్కొనబడిన బొమ్మలాట హాస్యనాటకంలో కొన్ని ప్రదర్శనసూచనలు వున్నాయి.— 'బొమ్మలాటకు మొదట తోడియమంగళం పాడి, ఆవెనక విఘ్నేశ్వరునీమీద పదంపాడుచున్నె విఘ్నేశ్వ రునీ కొలువెత్తి సభావర్ణనచదివి ఆవెనక విఘ్నేశ్వరునినాట్యం యెత్తి ఆడించేది. ఆనాట్యంవెనక తెరహాస్యంచెప్పి కొలువుపదం పాడి కథకు మొదట కొలువెత్తేది- ఇక్కడ కోటిమేళం చేసేది' మొదలైనవి. ఆ ప్రదర్శనకు హంగుదారులు 'వురు ములు 'వూదేవారున్ను,' వుపాంగాలు గొట్టేవారున్ను, మత్తళాలు మీటేవారున్ను, తాళాలు తెన్నేవారున్ను, దండెలు ఎగరవేసేవారున్ను' నట. ఈ ప్రదర్శనప్రక్రియ కొంతమట్టుకానాటి దక్షిణదేశీయ యక్షగానప్రదర్శనసంప్రదాయసంవాదిగా వుంది.

బొమ్మలాట సంబయ్యే యక్ష గానాలనే రచించడం చూస్తే తమ బొమ్మలాటల కోసమే రచించాడా అనిపిస్తుంది. ఆయా విషయాలనుబట్టి చూస్తే బొమ్మలాటవాళ్ళకి నోట తెలుగు పట్టినప్పటినుంచీ, తెలుగులో యక్షగానాలు పుట్టినప్పటినుంచీ బొమ్మలాటలకూ యక్షగానాలకూ అనుబంధం యేర్పడి, అది తరాలు గడచినకొద్దీ పెంపొందుతూ వచ్చిందనిపిస్తుంది. ఇటీవల నాటకాలూ సినీమాలూ వచ్చాక యక్షగానాలు మూలబడ్డాయి; బొమ్మలాట ప్రదర్శకులకు కసలే గతులు లేవు. కాని ప్రభుత్వం కాస్త పూనుకొంటే వారి ప్రసంగాలు రికార్డు చేసి, వారి ప్రదర్శనలకు డాక్యుమెంటరీ ఫిల్ములు తీసి, సచిత్రములైన తచ్చరిత్ర గ్రంథములను తయారు చేసి, ఆ విషయమైన మన ప్రాచీన సంస్కృతీ స్వరూపం తరువాత తరాలవారి తలపోతల నెమరువేతలకైనా అందించవచ్చు.

—భారతి

ఆగస్టు 1955, సంపుటము 32; సంచిక 8.

—o—

# బ్రౌనుదొర - నిఘంటు నిర్మాణము

—డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు

బ్రౌనుదొర రచనలలో ఆంధ్రపండితలోకమును విశేషముగ నాకర్షించినవి అతని నిఘంటువులు. ఆతనికి నైఘంటికునిగ వచ్చినంత పేరు ఇంక దేని వలనను రాలేదు. ఆతడు వ్రాసిన వాచకములు, వ్యాకరణము ఆంధ్రపండిత లోకమున అంత ప్రశస్తి సంపాదింపలేదు. అవి, ఆంధ్రభాష నభ్యసింపఁ గోరు పాశ్చాత్యులకును, ఆంగ్లము నభ్యసింపఁ గోరు దేశీయులకును ఉపయోగపడుటకై వ్రాసినవే గాని, ఆంధ్ర పండితులకొరకు గాదు. ఈ గ్రంథములకు నిఘంటువులకు వచ్చినంత పేరు రాకుండుట కిదియే ముఖ్యకారణము.

ఈతని నిఘంటువులు పండిత పామర రంజకములు. అకారాదిగా తెలుగునకు నిఘంటువును కూర్చుటలో అతడు మొదటివాడు కాకపోయినను, ఆతని నిఘంటువులు నాటికి నేటికి కూడా వైశిష్ట్యమును కలిగియున్నవే. కొన్ని విషయములలో మార్గదర్శకములే. అవి వ్యావహారికభాషావాదులకును, గ్రాంథిక భాషావాదులకును గూడ కావలసినవే. బ్రౌనుదొర నిఘంటువులకు ముందే సుప్రసిద్ధముగ నున్న నిఘంటువు, 1821 లో 'కాంబెల్' (Compbell) దొర ప్రచురించినది. అక్షరక్రమముగ నున్న నిఘంటువులలో ఇది ప్రథమ నిఘంటువని శ్రీజయంతి రామయ్య పంతులుగారి అభిప్రాయము.[1]

బ్రౌనుదొర నిఘంటువులకన్న ముందే యున్న నిఘంటువులలో జె. సి. మారిస్ (J. C. Morris) దొర కూర్చిన దొకటి. దీనిని కాలేజీబోర్డువారు 1835-1839 సంవత్సరముల నడుమ ప్రచురించిరి. ఇది ఉత్తమశ్రేణికి చెందినదైనను, బ్రౌనుదొర దీని నెందులకో పేర్కొనలేదు. బ్రౌనుదొరకు ముఖ్యముగా సాయపడిన నిఘంటువులు రెండట. మొదటిది 'కాంబెల్‌దొర' నిఘంటువు. రెండవది 'విల్సన్' (Wilson) దొర ప్రకటించిన సంస్కృతనిఘంటువు. నిఘంటు నిర్మాణ విషయమున రెండవది బాగుగ తోడ్పడిన దట.

---

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక-పరీధావి; మార్గశీర్షము.

బ్రౌనుదొర పేర్కొనిన తెలుగు నిఘంటువులలో ముఖ్యమైనది మచిలీ పట్టణమునకు చెందిన మామిడి వెంకయ్యయొక్క ఆంధ్రదీపిక. ఇది 1816లో పూర్తిచేయబడిన దట. 1848లో మద్రాసులో ఒక ముద్రణము జరిగినది. తెలుగు కావ్యములలో ఉపయోగింపబడిన పదములు మాత్రమే ఇందు కలవనియు, వ్యావహారికభాష జోలికి ఇదిపోలే దనియు బ్రౌనుదొర వ్రాసెను.

ఆంధ్రభాషార్ణము, మరియు దానివంటివే పద్యములలోనున్న ఐదు నిఘంటువులను, అకారాదిగా కూర్చి బ్రౌనుదొర ఉపయోగించుకొనెను. కాని ఈ నిఘంటువులలోని పదజాలమునందు క్రియలకంత ప్రాముఖ్యము లేదనియు, క్రియలే ఏభాషకైనను ప్రాణమువంటివనియు బ్రౌనుదొర అభిప్రాయము పడెను.[3] ఇవికాక ఆంధ్రభాషాభూషణము,[4] ఆంధ్రనామసంగ్రహము,[5] కర్ణాంబాడినిఘంటువు.[6] ఒరంగల్లు పదజాలము[7] అతనికి బాగుగ ఉపయోగించినవి. ఈ కర్ణాంబాడి నిఘంటువు అనేకములగు నిఘంటువుల చేరికవలన ఏర్పడినది. దీని యందు ఆంధ్ర నామసంగ్రహము, ఆంధ్ర నామశేషము, వేంకటేశనిఘంటువు,

---

2. C.P. Brown's Telugu-English Dictionary; Page viii, 1852 Edition.
3. Ibidem, Page vii.
4. "Andhra Bhashabhushanam" ఆంధ్ర భాషాభూషణము, a vocabulary of Synonymes, in verse-Ibidem: Page vii
5. "A vocabulary written in verse"-Ibidem;Page vii.
6. "The కర్ణాంబాడి నిఘంటు an alphabetical glossary, framed at my desire; It contains all the words found in the ఆంధ్రనామ సంగ్రహం, in the ఆంధ్రనామ శేషము, in the వెంకటేశనిఘంటు and in the సాంబనిఘంటు" - Ibidem, Page x.
7. "The ఒరంగల్లు పదజాలము Orangallu Glossary, this is alphabetically arranged, and is a supplement to Mamidi Vencanna's Andhra Dipica; it is anonymous and probably is the work of the same author. The only title is దేశీయతెలుగులు that is, local words or dialects. But it explains many expressions used in the leading poems."-Ibidem; Page xi.

సాంబ నిఘంటువు, విష్ణు ఆంధ్రము[8] మొదలగు వానిలోగల పదజాలమంతయు కల దట. దీనిని బ్రౌను దొరయే సిద్ధము చేయించెను. ఇంక ఒరంగల్లు పద జాలము (ఒరంగల్లు దేశీయ తెలుగులు) అనునది మామిడి వెంకన్నయొక్క ఆంధ్ర దీపికకు పరిశిష్టభాగము కావచ్చు ననియు, దానికర్త పేరు తెలియుట లేదుగాని, వెంకన్నయే దానినికూడ చేసియుండవచ్చు ననియు బ్రౌనుదొర వ్రాసెను.

ఇవి గాక కన్నడ[9], తమిళ[10], వంగ[11], సంస్కృత[12] భాషల నిఘం టువులను గూడ పరీక్షించి తనకు పనికివచ్చునంతవరకు బ్రౌనుదొర వానిని గూడ వినియోగించుకొనెను. వృక్షశాస్త్రము మొదలగు శాస్త్రములకు సంబంధిం చిన పదముల అర్థములను వ్రాయుటకు, ఆయాశాస్త్రములకు సంబంధించిన ఆంగ్ల సంస్కృత నిఘంటువులను పరిశీలించెను. ఉదాహరణముగ మనము 'క్వాథ శాస్త్రము'[13] అను వృక్షశాస్త్ర సంబంధమైన పదములు గల 'పదజాలము' ను గ్రహింపవచ్చును. ఇట్టిశాస్త్రములకు సంబంధించిన పదములు దేశీయపండితులలో కూడ కొందరికి తెలియ వని బ్రౌనుదొర వ్రాసెను.[14] నిఘంటువు సాధ్యమైనంత వరకు సంపూర్ణముగా నుండవలెనను అతని పట్టుదలయే ఈ కృషికి మూలము.

ఈవిధముగ వివిధభాషల నిఘంటువులనుండి, శాస్త్రములనుండి, అంతకు పూర్వ మున్న ఆంధ్రభాషానిఘంటువులనుండి పదములను కృతజ్ఞతతో గ్రహించు టయేగాక, తాను స్వయముగ మహాపండితులసాయముతో తెలుగులోని ఉద్గ్రం థములను చదివి, వానిలోని వివిధపదముల నన్నింటిని ఎత్తివ్రాసికొని, తన నిఘంటునిర్మాణమునకు సామగ్రిని కూర్చుకొనెను. ఈ సందర్భమున వ్రాయుచు, విశేషముగ పరిశ్రమ జరుగనిభాషకు నిఘంటువును నిర్మించునపుడు సులభముగ

---

8. "Vishnu Andhram. A glossary included in the Karkambadi Nighant' : Ibidem Page xiv.
9. Kannadi English Dictionary by Reeve - Ibidem Page x.
10 Rottler's Dictionary. Tamil and English - Ibidem P. xii.
11. Houghton's Bengali and English Dictionary - Ibidem p. ix.
12. శబ్దకల్పద్రుమ by Radhakanta Deva (వంగలిపి) - Ibidem P. xii.
13. "The క్వాథశాస్త్రం A Botanical Vocabulary in Sanskrit with Telugu Synonymes" - Ibidem, P xiii.
14. Ibidem, Page xiii.

తప్పుదారి త్రొక్కుట జరుగునని వ్రాసెను. ఇట బ్రౌనుదొరకు 182? లో భారతము చదువుచున్నప్పుడు కల్గిన ఒక అనుభవమును గూర్చి తెల్పుట అప్రస్తుతము కాదు అతనికి భారతము చదువుటయందు తోడ్పడిన విద్వాంసుడు కష్టమైన పదములకు వ్యావహారికాంధ్రమందు గాని, సంస్కృతములోగాని, హిందీలోగాని అర్థము చెప్పెడివాడట. ఆ పదములకు ఆ యర్థము బ్రౌనుదొర వ్రాసికొనెడివాడు. ఆ పదమే గ్రంథమందు మరలమరల రాగా, ఆ పండితుడు దానికి సందర్భానుసారముగా అర్థము చెప్పుచు వచ్చెడివాడట. కొంతసేపటికి, ఒకే పదమునకు పరస్పర విరోధముగల అర్థములు రాగా, బ్రౌనుదొర అతనిని "ఏమి టీవింత?" అని ప్రశ్నించెనట. అందుల కాపండితుడు, "అయ్యా ! మీ రిలా నేను చెప్పిన దంలా వ్రాసుకొంటూ, చివరికి నన్నిలా నిలవదీసి అడుగుతే నేనేమి చెప్తాను? ఒకవేళ మీరడిగిన మాటకు నాకు అప్పుడర్థం తెలియకపోవచ్చు. లేదా సమానార్థకపదం ఏదీ అప్పటికప్పుడు తట్టకపోవచ్చు" అన్నాడట ! అప్పుడు బ్రౌనుదొర నవ్వి "మరి మీరిలా నన్ను తప్పుదారి తొక్కించడం భావ్యమా" అన్నాడట. కాని, ఈ క్రింది వాక్యము—ఆ పండితుని గురించియే బ్రౌనుదొర అన్నది - అతని యొక్క సహృదయతకు తార్కాణము "The Pandit was a sound scholar but not accustomed to construing."

ఈ కార్యమున తనకు సాయము చేసిన పండితులను గురించి బ్రౌనుదొర "వారికి సంస్కృత వ్యాకరణము పరిచితము. కాని, వారిమాతృభాషకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానము చెప్పుటకు వారి కంత సంసిద్ధత లేదు" అని వ్రాసెను. ఈ దురవస్థకు కారణము "సంస్కృతం వస్తే తెలుగువచ్చినట్టే," అను దురభిప్రాయము పండితులలో కొందరియందు ప్రబలియుండుటయే ! ఇది ఇప్పుడైనను పూర్తిగా పోయినదా? ఈ యభిప్రాయము ప్రబలుటకు ముఖ్యకారణము తెలుగు తత్సమపదబహుళ మగుట

ఇట్లు అనేకములగు వ్యయప్రయాసల కోర్చి, బ్రౌనుదొర తన నిఘంటువులను సిద్ధము చేసెను. ఇంగ్లీషు - తెలుగు నిఘంటువునకు సంబంధించిన ప్రణాళిక 1832లోనే సిద్ధమయినను అచ్చువేయుట ప్రారంభించునప్పటికి అంతయు మరల వ్రాయవలసి వచ్చెనట. 'షేక్స్పియరు' మొదలైన ఆంగ్లఉద్గ్రంథములను క్షుణ్ణముగ అంతకు పూర్వమే చదివియుండుటచే, తా నాపనికి సిద్ధముగనే యుంటినని అతడు వ్రాసెను తనతోటి పనివారుకూడ, తనకు ఆంగ్లసాహిత్యమునందున్న పాండిత్యమునకు మెచ్చుకొని, తనకు 'బైబిలు,' 'షేక్స్పియరు,' 'మిల్టను'లు

నోటికి వచ్చినట్లున్నవని పలికెడివారని కూడ బ్రౌనుదొర వ్రాసెను. ఈ ఇంగ్లీషు-తెలుగు నిఘంటువును కూర్చుటలో అతని ముఖ్యోద్దేశము, ఆంగ్లసాహిత్యము మనవారికి అందుబాటులోనికి రావలెననునది. ఇట్టి సదుద్దేశముతో శ్రమించి ఉద్దేశసాఫల్యమును పొందెను.

ఈ ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు ప్రథమ ముద్రణము ఫిబ్రవరి 1845లో ప్రారంభింపబడి. మార్చి 1853 లో పూర్తి అయినదట !*...

ఈ నిఘంటువు బ్రౌనుదొరయొక్క తక్కిన నిఘంటువులవలెనే విశేష ప్రఖ్యాతిని ఆర్జించినది. దీనిసాయముతో ఎందరో-బ్రౌనుదొర ఆశించినటుల - ఆంగ్లభాష నభ్యసించి. ఆ సాహిత్యమును చవిజూచియుందురు. దీని ఉపయోగము కాని, విశిష్టత కాని నేటికిని తగ్గిపోలేదు. వ్యావహారిక భాష ప్రాబల్యమును పొందిన ఈ దినములలో వ్యావహారిక భాషాపదములు విశేషముగ నున్న బ్రౌనుదొర నిఘంటువులు మన కింకను మిక్కిలి ఉపయోగకారులు, ఉపాదేయములు. పందొమ్మిదవ శతాబ్దిలోని వ్యావహారిక తెలుగుపదములను గుర్తించుట కిది యొక ఘంటాపదము.

ఈ నిఘంటువుయొక్క ద్వితీయ ముద్రణము 1895లో జరిగినది. బ్రౌను కీర్తిశేషుడైన (1884) తరువాత పదునొకండవ సంవత్సరమున ముద్రింపబడిన దీనిని ప్రెసిడెన్సీ కాలేజిలో ఇంగ్లీషునకు అసిస్టెంటు ప్రొఫెసరయిన ఎమ్. వెంకటరత్నం బి.ఏ., గారు సంస్కరించి, విపులీకరించిరి. దీనియందు 'బ్రౌనుదొర సాహిత్యజీవితము' (Literary life) ముద్రింపబడినది. ఈ వ్యాసమును మిత్రుల ప్రోత్సాహమువలన, తాను ఇండియాను విడిచి (1855)లో పోవుటకు ముందు బ్రౌనుదొరయే వ్రాసెనట. కాని, దీనిని ప్రచారమునకై అచ్చువేయలేదు గనుక, ఈ వ్యాసములోని విషయములు బహిరంగపరుపక 'కాలేజీ బోర్డు' వారును జాగరూకత వహించిరి.[15] అంతడు చనిపోయిన తరువాత అచ్చు

---

15. "On the eve of leaving of India, their late learned colleague was induced by his friends to compile some details of his own literary life. But as this narrative was not printed for publication, the Board do not deem it proper to make free with his contents'' —D. F. Carmichael, Secretary, Board of Examiners' Office, March 23rd, 1858. (Preface to a Catalogue Raisonnee of Oriental Manuscripts in the library of college, 1857; Page xxiii.)

వేసిన ఈ నిఘంటువు ద్వితీయముద్రణమున దీనినికూడ ప్రచురించిరి. బ్రౌను దొర సాహిత్య జీవితముపై వ్రాయువారికి ఇది అమూల్యమైన వ్యాసము. ఈ వ్యాస ముండుటయే ఈ పునర్ముద్రణయొక్క వైశిష్ట్యము.

తెలుగు - ఇంగ్లీషు నిఘంటువుకూడ, దాని తోబుట్టు వగు ఇంగ్లీషు-తెలుగు నిఘంటువుతో సమానమైన ప్రాముఖ్యము గలదే. దీనిని బ్రౌనుదొర తాను తెలుగు నేర్చుకొనుచున్న దినములలో తనకు సాయ మగుటకు సిద్ధము చేసికొనెనట.[16] దీనిని అచ్చువేయవలెనను సూచన 1844వ సంవత్సర ప్రారంభముననే వచ్చెనట. ఆ సంవత్సరము మధ్యభాగమున అచ్చుపని ప్రారంభింపబడెను. ఎన్నో మార్పులు, దిద్దుబాట్లుకూడ చేయవలసి వచ్చెనట. నూటికంటె ఎక్కువమంది తెలుగు గ్రంథకర్త లందు ఉదాహరింపబడిరి. ప్రతి ఉదాహరణమును పరిశీలించి, నిర్ణీతస్థానములో ఉంచె నాతడు.* బ్రౌనుదొర వ్రాయసగాండ్రను పెట్టి, తన పర్యవేక్షణముక్రింద పని నంతయు పూర్తిచేసెను. ఉదాహరించినభాగము లేయే గ్రంథములందలివియో సరిగా పరీక్షించి, నిఘంటువున నిలిపెను. నిరాధారము లగు నవేవియు నందు లేవు. ఇట్టి ఋజుత్వము, నిష్కర్ష లేనిచో పరిశోధకుని పనికి గౌరవము గాని, ఆతనికృషివలన మిగిలినపరిశోధకులకు లాభము గాని ఉండదు. అందుచేతనే ఉత్తమపరిశోధకుడగు బ్రౌనుదొర తనతరువాతలకు రుజువులను చూపించుచు వచ్చెను.* నిఘంటువులో పేజీ ఒక్కింటికి పదిమొదలు ఇరువదివరకు తెలుగుకవులరచనలనుండి ఉదాహరణములు కలవనియు, వాని నన్నింటిని తానే స్వయముగ గ్రహించితి ననియు, తన యొద్ద నున్న పండితులు, వానిని అచ్చునకు సిద్ధము చేసిరనియు అతడు వ్రాసెను.* దీనినిబట్టియే ఆతనికి ఆంధ్రభాషలోగల పాండిత్యము, ఆంధ్రసాహిత్యముతోగల పరిచయము స్వయం వ్యక్త మగుచున్నది గదా ! ఈ నిఘంటువు ముఖపత్రమునకును, ఇంగ్లీషు-తెలుగు నిఘంటువునకున్న ముఖపత్రమునకును భేద మంతగా లేదు.[17]

---

16. "The present Dictionary was written to assist myself in learning the Telugu Language" — Telugu - English Dictionary, 1852; Page iv.
17. A Dictionary, Telugu and English, explaining, The Colloquial Style used in Business, and the Poetical Dialect, with Explanation. In English And in Telugu, 1852. ఇదికాక మిగిలిన భాగమంతయు రెండింటికిని సమానమే.

ఈ రెండు నిఘంటువులును జోడుగా పెరిగినవి. రెండును ఇంచుమించుగ ఒకేసారి అచ్చొత్తింపబడినవి. ఒక నిఘంటువునకై ఎత్తివ్రాసికొనినవి, కొన్ని ఉదాహరణములు, రెండవదానికిని ఉపయోగించెడివట. ఈవిధముగా రెండింటిని సమకాలీనముగ బ్రౌనుదొర పెంచుచువచ్చెను * వ్రాయసగాండ్రను పెట్టి, కంపోజిటర్లు కూర్చగలిగినంత వేగముగను తాను వారికి పనిచెప్పుచుండెడివా డట.*

తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులలో బ్రౌనుదొర చేసిన ముఖ్యమైన మార్పు-హల్లులతోప్రారంభించుపదములయొక్క స్థానమునకు సంబంధించినది. నేడు మన కున్న అకారాది నిఘంటువులలో 'కచటతప' అను వర్గక్రమమున అక్షరక్రమము తప్పకుండుటయు, ప్రతి అక్షరమునకును గుణింతము అచ్చులక్రమమున వచ్చుచుండుటయు మనకు తెలిసినదే బ్రౌనుదొర నిఘంటువున ఈ క్రమము పాటింపబడలేదు. ఒకవర్గములోని వివిధాక్షరములతో - అనునాసికాక్షరమును విడిచి - ప్రారంభించు పదజాలమునంతయు, అకారాది అచ్చులక్రమమున ఒకచోటనే ఇచ్చుట బ్రౌనుదొర చేసిన ముఖ్యమైనమార్పు.[18] ఇట్లు చేయుటవలన, నిఘంటువు ఉపయోగించుకొనుట సులభ మగు నని బ్రౌనుదొర ఊహ. 'యరలవ'లు వేరు వేరుగనే కలవు. మరల 'శ,ష,స'లను కలిపినాడు. ఈ ఏర్పాటువలన - కోత, గోత్రము, ఘోణి-మొదలగు పదములు ఒకదానితరువాత ఒకటి ఒకే శీర్షిక (కో, ఖో,గో, ఘో) క్రింద వచ్చినవి.[19] అట్లులనే-జిగి, చిగురు, జిఘాంసుడు మొదలగు పదములును[20] శాతము, షాడబము, సాతాని మొదలగు పదములును[21] వచ్చినవి ఇతర పదములును ఇటులనే.[22]

ఈ విషయమును పురస్కరించుకొని బ్రౌనుదొర తన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు 'ఉపోద్ఘాతము'న సుదీర్ఘముగ వ్రాసినదాని కిది అనువాదము: "ముప్పది సంవత్సరములక్రిందట నేను తెలుగుకావ్యములు చదువుచున్నప్పుడు

18. కఖగఘ, కాఖాగాఘా, కిఖిగిఘి మొదలగునవి.

19. Telugu - English Dictionary, 1852, page 287.

20. Telugu - English Dictionary, 1852, page 230.

21. Telugu - English Dictionary 1852, page 1050.

22. "I have made an improved arrangement of the consecutive initial cosonants: uniting such as in Telugu are commutable (Ibidem, page iv).

'గ'తో ప్రారంభించినపదములు (గోరువంటివి) చాలసారులు రాగా, మా గురువు గారు నన్ను 'ఆంధ్రదీపిక'లో ఆ పదమునకై 'కోరు' క్రింద చూడు మని చెప్పు చుండిరి. 'జ' మొదటి అక్షరముగ (జెంగు) కల పదములు 'చ' క్రింద కన బడుచుండెడివి. 'ద'తో ప్రారంభించు పదములు వానిచిత్తమువచ్చినట్లు 'త'తో ప్రారంభించెడివి. దోవ, తోవ,[23] రెండును 'రోడ్డు'నకు పదములే. 'పులి' అనగా పులి గదా! కాని సమాసములలో 'ప' అను అక్షరము 'బ'గా మారి 'బెబ్బులి' అను రూపము వచ్చుచున్నది. 'శ'తో ప్రారంభించు కొన్ని పదములు 'స'తోకూడ వ్రాయవచ్చును గదా! ఈ సంశయమునుండి నన్ను పెద్దలుకూడ విముక్తుని చేయ లేదు. నేను వారి నడిగినప్పుడు, "రెండువిధములుగను వ్రాయవచ్చును" అను చుండిరి. చివరకు నిఘంటువు రమారమి సగమునకు పూర్తి అయినతరువాత, మార్పును అంగీకరించు ప్రథమాక్షరములు గల పదములను గలిపివేసి, మరల నిఘంటువును వ్రాసి, ఈ సంశయమును తొలగించివేసితిని.

"ఇక్కడ ఒక ఉదాహరణను ఇచ్చెదను. 'దీపిక'లో 'దువాలించు'[24] అను క్రియ యొకటి కలదు. కొందరు కవులు దీనిని 'త' తో ప్రారంభింపగా, కొందరు 'ధ'తో ప్రారంభించిరి. కనుక, ఈ క్రియ నిఘంటువులో మూడుచోట్ల కనబడవలసివచ్చును. కాని, ప్రథమాక్షరములను కలుపుటవలన, క్రమలేకుండ అవి కనబడును. ముందుముందు, వీనిని విడదీసి చూపవలె నని ఎవరైనను అనుకొనినను అది అంత కష్టము కాదు. కాని, అట్లు చేయుటవలన భాషను నేర్చు కొను ప్రారంభకునకు కష్టమగును. తెలుగులో కొంత కృషిచేసినవారికందరకును నేను చేసిన మార్పులోని విలువ తెలియగలదు. పూర్వపద్ధతిలో పండితులకే సంశయము కలిగెడిది. ఇప్పుడు మార్గము సుగమమైనది."[25]

ఈ పద్ధతి దేశీయులైనపండితుల ఆదరాభిమానములను అంత చూరగొన్న ట్లు లేదు. బ్రౌనుదొరకాలమునను పండితులందరును ఈ పద్ధతిని ఆదరించినట్లు లే దని ఆతని ఈ క్రింది వాక్యములే తెలియజేయుచున్నవి. "ఈ నిఘంటువు

23. తోవ, త్రోవ, దోవ N. S Way Road, Way or Means (Ibidem, page 465).

24. తువాళించుట, ధువాళించుట V.N. To dance (Ibidem page 432).

25. Ibidem, Preface, page iv,

విషయమున నాకు నా పండితుల సమ్మతి ఉన్నది. కాని కొందరు పండితులు (శాస్త్రులు) నా వర్ణ క్రమపద్ధతిని అంగీకరింపలేదు.''[26]

బ్రౌనుదొర తరువాత, నైఘంటికులు ఈపద్ధతిని అంతగా ఆదరింపలేదు. నిఘంటువులో అతడు వ్యావహారికపదములను ఉచ్చరించెడి రీతిగానే - చేర్చుట, పండితులకు నచ్చినట్లు లేదు. తరువాత నైఘంటికులలో బ్రౌనుదొరను తీవ్రముగ విమర్శించినవాడు శ్రీ శంకరనారాయణ. అతడు తన ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో[27], 'On the contrasts between English and the Indian vernaculars and a common Alphabet for the different languages of India' అను శీర్షికక్రింద వ్రాయుచు; బ్రౌనుదొరకు తెలుగు సంధిసూత్రములు బాగుగా తెలియవు అనుట మొదలుకొని, అతడు వ్యావహారిక పదములకు తన నిఘంటువులో స్థాన మిచ్చి, తెలుగును పాడుచేసినా డన్నంత వరకు విమర్శించెను. ఇటుల విమర్శించినను, బ్రౌనుదొర నిఘంటువులను ఉపయోగించుకొను విషయములో శ్రీ శంకరనారాయణ వెనుకాడినట్లు లేదు. ఈ తీవ్ర విమర్శకు కారణము, బ్రౌనుదొర వ్యావహారిక భాషకు తననిఘంటువున అతిప్రముఖస్థాన మిచ్చుటయే కావచ్చును. శ్రీ శంకరనారాయణకు కోపకారణమైన వ్యావహారికపదములలో కొన్ని ఈ క్రింద నిచ్చుచున్నాను : అరవయ్యో (Sixtieth), చంద్రుణ్ణి, వొప్పుకోవడము, పధ్నాలుగు, అదీ, నేను.

---

26. "...In composing this work I have had the approbation of many learned assitants. But some (sastries) scholars have disapproved the spelling here exhibited" - Ibidem, page v.

27. An English - Telugu Dictionary by P. Sankaranarayana, Published by V. Ramaswamy Sastrulu & Sons, 1928. ఈ ముద్రణమునకు డాక్టరు జి. వి సీతాపతిగారు సంపాదకులు. సంపాదకులు Preface లో, "This edition of Sankaranarayana's English-Telugu Dictionary in the first edition published after the lamented death of the author..." అని వ్రాసిరి. దీనియందు, శ్రీ శంకరనారాయణగారు మూలగ్రంథమునుండి పైశీర్షికలు గల వ్యాసమును తీసి పునర్ముద్రించిరి.

ఏది ఎట్లున్నను, తన నిఘంటువు పండితపామరజనోపయోగము కలదిగా నుండవలె నని ఆత దాశించెను గాని వేరుకాదు. కేవలము ఛాందసులైన పండితుల మెప్పు పొందవలె నని ఆత డెన్నడును కృషి చేయలేదు. ఆతడు విదేశస్థు డగుట ఇట్టి సందర్భములలో అతనికి ఉపకారక మయ్యెను. దేశీయపండితులలో కొందరను పట్టిబంధించు సంప్రదాయశృంఖలములు ఆతని నంటలేదు. కనుకనే ఆతడు పామరులను, వారిభాషను ఈసడించలేదు. విశాలదృష్టిగల విజ్ఞాని గనుక, పండితుల ప్రతిభను గుర్తించి, వారి నెన్నడును తూలనాడలేదు. ఈ తటస్థదృష్టి ఆతనికి కలుగుటకును; దానిని నిలుపుకొనగలుగుటకును, ఆతడు విదేశస్థు డగుట మిక్కిలి అక్కరకు వచ్చినది.

వీలున్నచోటులం దెల్ల ఆతడు ప్రజలభాషకు ప్రాముఖ్య మిచ్చుచునే యుండెను. నిజమైన విద్వాంసులు, సాహిత్యప్రియులు తన ఉద్యమములో బాసటగా తనకు నిల్చి రని ఆతడే వ్రాసెను. సాధారణముగా పద్యకావ్యములలోను, వ్యవహారమునందును ఉపయోగింపబడు పదములు కాక, మారుమూలపదములను వాడుచు, అందులకు గర్వించుచు విఱ్ఱవీగువిద్వాంసుల నాతడు గౌరవింపలేదు.[28] వారివలన నుపయోగము లేదని ఆత డెరుంగును.

తన నిఘంటువులు, సాధ్యమైనంతవరకు పూర్ణముగ (జీవద్భాషకు పరిపూర్ణ నిఘంటువు అనునది ఉండదని అతనికిని తెలియును) నుండుటకు చేయవలసిన కృషినంతను బ్రౌనుదొర చేసెను. కొన్నికొన్నిపదములకు అర్థవివరణ పండితులచే చేయించియు, వారు దూరస్థులైనచో ఉత్తరములద్వారా సమాధానములు తెప్పించుకొనియు, వారినిర్ణయములను సంపాదించి తన నిఘంటువునందు కూర్చుకొనెను. ఈ సందర్భమున ఒకటి, రెండు ఉదాహరణలను పరీక్షింపవచ్చును.

ఆరోజులలో మదరాసులో సుప్రసిద్ధులగు ఆంధ్రులలో ఏనుగుల వీరాస్వామయ్యగా రొకరు. (1760 ప్రాంతమున వీరి జననము. 3-10-1836 న

28. "Instead of that found in poems and used in ordinary life they (Sastris) wish us to practice a pedantic style! which is admired because conceited and far from clear. Such refinements are disregarded by men of real learning, who are therefore considered vulgar by some who are inferior in sound scholarship." Preface-page iv-Telugu, English Dictionary, 1852.

మృతి). వీరు చెన్నపట్టణములో, ఇప్పటి హైకోర్టునకు పూర్వ మున్న సుప్రీమ్ కోర్టులో-తెలుగు, అరవము, ఇంగ్లీషు భాషలలో 'దుబాసి.' వీరు బ్రౌనుదొరకు స్నేహితులు. వీరు 1830-'31 సంవత్సరములనడుమ (18-5-1830 నుండి 3-9-1831 వరకు) కాశీయాత్ర చేసిరి. ఆ చరిత్ర చక్కని వ్యావహారిక భాషలో లేఖలరూపమున తమ మిత్రు లగు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారికి వ్రాసిరి. ఇది 'కాశీయాత్ర చరిత్ర' అను పేర ఇప్పటికి మూడుసార్లు ముద్రింపబడి నది.[29] ఈవిధముగా గ్రంథకర్తగా కూడ పేరుపొందిన వీరాస్వామయ్యగారిని, బ్రౌనుదొర తన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులో-ఇంద్రాణి, పలవర మొదలగు పదముల అర్థవివరణమునకు ప్రమాణముగ గ్రహించిరి.

"ఇంద్రాణి - Name of the wife of Indra; A sort of bracelet, Orangallu Glossary; 'Dowager' a Bramin widow, Enugula. 28th July 1830."[30]

"పలవర - The name of a certain tree much cultivated in the neighbourhood of Hyderabad for its fruits. పలవర ఆకులు its leaves, are used to manure land. See description in the Kasi Yatra, date 7th September 1830".[31]

విక్రమార్కుని కథలు (1819), పంచతంత్రము (1834), తెలుగు వ్యాకరణము (1836) మొదలగు గ్రంథములను వ్రాసిన, "చెన్నపట్టణ పాఠశాలలో ఆంధ్రభాషకు మొదటి యుపాధ్యాయుఁడైన"[32] శ్రీ రావిపాటి గురుమూర్తి

29. కాశీయాత్రచరిత్ర ప్రథమముద్రణము 1838 లో శ్రీనివాసపిళ్లగారి బాధ్యతను జరిగినది. ద్వితీయముద్రణము 1869 లో 'గవర్నమెంటు వారి ఉత్తరువు'చే జరిగినది. తృతీయముద్రణము 1941లో జరిగెను. తృతీయముద్రణ భారమును శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారు వహించిరి.

30. Telugu-English Dictionary; page 80.

31. Telugu-English Dictionary; page 564.

32. శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి 'తెలుగు వ్యాకరణము' ప్రథమ ముద్రణము (1836) పీఠికలోని వాక్యము. ఈ వ్యాకరణము A. D. Campbell దొరకు అంకిత మీయబడినది.

శాస్త్రిగారు (1770-1836) బ్రౌనుదొరకు గురుతుల్యులు. ఆయన బ్రౌను దొరకు కొన్ని పదముల అర్థవివరణము చేసి, దూరమున నున్నచో, జాబుమూలముగ కూడ పంపుచున్నట్లు తెలియజేయు లేఖ నొకదానిని ఉదాహరణముగా ఇచ్చుచున్నాను.

[1827 నవంబరు 22 తేదీని శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు బ్రౌను దొరకు వ్రాసిన లేఖకు నకలు].[33]

"మహారాజరాజశ్రీ ఛా. ఫి. బ్రౌనుదొరవారి సముఖానకు—ఆశ్రితుఁడు రావిపాటి గురుమూర్తి శాస్త్రి అనేకములైన సలాములు చేసి వ్రాసుకొన్న విజ్ఞాపన పత్రిక—

తమరు అలవోక - డాబాలు అనేశబ్దములకు అర్థము వ్రాసి పంపించుమని వ్రాయించినారు. అలవోక శబ్దమునకు స్వేచ్ఛ - అనిచ్ఛ - అప్రయత్నము—అశ్రమము - కారణము - అని నానా అర్థములు వున్నవి. ఆయా స్థలములకు తగినట్లుగా చెప్పుకోవలసినది.

డాబాలు అనేది డాబా అనేదానికి బహువచనాంతము. డాబా అనగా వెండితోగాని బంగారుతోగాని చేసిన మొలత్రాడుయొక్క బిళ్ల. ఉత్తరదేశములో బంగారుతోగాని వెండితోగాని చేసిన మొలత్రాడు నాలుగైదువరుసలుగా చుట్టి అతికించి బిళ్లలువేసి మొలను ధరించడము కద్దు. అటువంటిత్రాడు డాబా మొలత్రాడు అని చెప్పబడుచున్నది.

కాలేజీవారు కోరిన 500 రూపాయల పుస్తకములవైనం నాకు యెంతమాత్రమున్నూ తెలియదు. చిత్తగించవలెను. ఇదిగాక తమరు హంసవింశతిలోని కొన్ని పద్యాలకు శబ్దార్థమున్నూ తాత్పర్యమున్నూ వ్రాసి పంపించుమని వ్రాయించినారు. తోచినమట్టుకు వ్రాసి యిందులో బిడాయించి సముఖానకు పంపించినాను. చిత్తగించవలెను. నేను నడచుకోగలందులకు ఆజ్ఞాపత్రిక దయచేయించవలెను. ఇదే అనేకములైన విజ్ఞాపనలు.

చెన్నపట్నం,
1827 నవంబరు 22 తేదీ

రా. గురుమూర్తి శాస్త్రి.

32. శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి 'తెలుగువ్యాకరణము'నకు 1951వ సంవత్సరములో జరిగిన ముద్రణము పీఠికలో ఈ లేఖ ముద్రింపబడినది.

ఈ విధముగ లేఖలమూలమున తనకు కావలసిన శబ్దములకు అర్థవివరణము తెప్పించుకొనియు, విద్వాంసులైన తనమిత్రులగ్రంథములనుండి ప్రయోగములను గ్రహించియు బ్రౌనుదొర తన నిఘంటువున కొకవైశాల్యమును కల్పించుకొనెను. సమకాలికులగు పండితులప్రయోగములను గౌరవించి, వానికి తన నిఘంటువున స్థానమిచ్చి, సమకాలమువారి రచనలను గౌరవించుటలో దోషము లేదను సంప్రదాయము నొకదానిని నెలకొల్పెను. ఈ సత్సంప్రదాయమును, నవీన నైఘంటికులు కూడ నవలంబించుట మంచిది.

1855లో తాను మనదేశమును విడిచి ఇంగ్లండు వెడలిపోయినను, బ్రౌనుదొర ఈ రెండునిఘంటువులను మరచిపోలేదు. తనకు ఆరోగ్యము సరిగలేకున్నను, వయసు మళ్లినను తన కృషిని మానలేదు. వీలుచిక్కినప్పుడెల్ల, వానిని సవరించుచునే యుండెను. క్రొత్తక్రొత్తపదములను చేర్చుచునే యుండెను. జీవద్భాషకు శాశ్వతమైన నిఘంటు వనునది ఉండజాలదనియు, భాషతోపాటు నిఘంటువును, వ్యాకరణమును మార్పులను పొందుచుండ వలెనను పరమసత్యము అతనికి తెలియనిదికాదు. లండనులో తనకు తీరిక దొరికినప్పుడెల్ల తన నిఘంటువులకును,వ్యాకరణమునకును అతడు చేర్పులు, మార్పులు చేయుచునే యుండెనట. దీనివలన అవి మొదటికంటె రెట్టింపు పెరిగినవని అతడు వ్రాసెను.*

బ్రౌనుదొరకు, నిఘంటువులకు క్రొత్తపదములను అందిచ్చుటలో ఒక ఫ్రెంచి-తెలుగునిఘంటువు మిక్కిలి ఉపయోగించెనట. దానినాతడు 1855లో ఇంగ్లండు పోవువరకు పరిశీలించుటయే జరుగలేదట ! 1700 ప్రాంతమున మన దేశమున కృషిచేసిన మిషనరీలు తమిళ-ఫ్రెంచి; తెలుగు-ఫ్రెంచి నిఘంటువులను కూర్చిరట! ఆ నిఘంటువులలో తెలుగు-ఫ్రెంచినిఘంటువునకు Dictionaire Telongou ou Badaga అని పేరట. దీనిలో వ్యావహారిక పదములే విశేషముగ కలవని బ్రౌనుదొర వ్రాసెను. ఈ నిఘంటువును సిద్ధపరచిన మిషనరీలు తమ పేరులను ఇయ్యలేదట. దీనినుండి బ్రౌనుదొర వేయిపదము పదబంధములను గ్రహించెను.

ఇంగ్లీషు-తెలుగు; తెలుగు-ఇంగ్లీషు నిఘంటువులను కూర్చుటలో బ్రౌనుదొర మహాప్రతిభను జూపుటయేగాక, దూరదృష్టిని, హృదయవైశాల్యమునుగూడ ప్రకటించెను. తన రచనలు, ''ముఖ్యముగ తెలుగునేర్చుకొనువారికి'' ఉపయోగ

పదవలె నను ఉద్దేశముతో వ్రాసినను, వానికి విశేషవ్యాప్తి, తెలుగువారిలో కూడ వచ్చుటకు ముఖ్యకారణము వాని పాండిత్యప్రౌఢిమ.

దేశభాషలలో కృషిచేయు విదేశస్థులు, ఆయాభాషల సహజప్రకృతులను అర్థము చేసికొని కృషిచేయవలెనే గాని, ఆభాషలప్రకృతులనే మార్చవలెనని కృషిచేయుట వ్యర్థమని కూడ అతడు గ్రహించినాడు. ఏభాషనైనను మార్చ గలిగిన వారు, నూతనపదజాలమును సృష్టింపగలవారు ఆ భాషాభాషీయులైన ప్రజలే గాని అన్యులు కారను చరిత్రసత్యమును బ్రౌనుదొర ఎన్నడును మరువ లేదు. తెలుగులో తా నెంత కృషిచేసినను, ఎంతపాండిత్యమును సంపాదించు కొనినను, ఎన్నిగ్రంథములు రచించినను ఈ భాషవిషయమున 'తుదిమాట'తెలుగు ప్రజలదే అను పరమ సత్యమును గుర్తించియే బ్రౌనుదొర తనకృషిని చేసెను. తనకృషి ఫలించుటకై అత డనేకులసలహాలను స్వీకరించెను. పండితులభాషను పామరులభాషను సమానముగనే గౌరవించి యాదరించెను. అహంకారమును విడిచి ప్రజలయొద్దనుండి వారియభిప్రాయములను గ్రహించి వానిని మన్నించెను. తననిఘంటువులలో తెలుగుప్రజలకు సులభముగా అర్థముకాని నూతనపదములు- అనావశ్యకమైనప్పుడు కేవలపాండిత్యప్రకర్షకై - సృష్టింపలేదు. తన 'ఎల్లలను' తాను గుర్తించి కృషి చేసినాడు గనుకనే బ్రౌనుదొర శిష్టులలో విశిష్టుడు.[34]

నిఘంటువులలో ఆంగ్లము నభ్యసింపగోరు తెలుగువారికి వీలగునట్లు మార్పుల నెన్నింటినో బ్రౌను చేసెను. కొన్ని కొన్ని ఇంగ్లీషు పదములకు తెలుగులో అర్థమును వ్రాయుచు, అర్థము బాగుగా అగుటకు, తెలుగువారికి బాగుగా తెలిసెడివారి సాహిత్యమునుండియే ఉదాహరణ లిచ్చి, నిఘంటువు విశేషముగ నుపయోగకారి యగునట్లు చేసెను.[35] చేసిన కృషివలన ఎంత ఎక్కువమంది ఉపయోగమును పొందుదురు? అని ఆలోచించి బ్రౌనుదొర గ్రంథములను రచించెను గాని స్వీయ పాండిత్యప్రకటనకై కాదు. ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు పీఠికను మనము జాగరూకతతో పరీక్షించినయెడల, బ్రౌనుదొరకు తెలుగుభాషలో ఎంతటి నిశితమైన పాండిత్యము కలదో స్వయంవ్యక్త మగును. ఆంగ్లభాషాసంపర్కము వలన తెలుగు భాష మారుచున్నదనియు, ఈమార్పు సహజమే యనియు, అంతకు పూర్వము ముస్లిము ప్రభుత్వకాలమునగూడ తెలుగుభాష పాలకుల భాషను బట్టి

34. English - Telugu Dictionary - Preface, page 5.

35. English - Telugu Dictionary - Preface; page 5.

మార్పులను జెందిన దనియు వ్రాసి తనచరిత్ర దృష్టిని చూపెను. ఈ ఆంగ్లభాషా సంపర్కము వలన ఎన్నియోపదములు తెలుగులోనికి వచ్చి చేరుచున్న వనియు, పండితులు ఆంగ్లపదములను ఒల్లక, తత్సమపదములను సృష్టించి వాడుచున్నను, ప్రజలు మాత్రము ఆంగ్లపదములనే ఉపయోగించుచున్నారనియు బ్రౌనుదొర వ్రాసెను.[36] దీనిని బట్టి బ్రౌనుదొర నాటికి వ్యావహారికాంధ్రమందు ఆంగ్ల పదములు బాగుగ స్థిరపడిన ట్లెంచవచ్చును.

''ఆంగ్లభాషాపఠనము హిందువుల మనోవికాసమునకు మార్గము కాగలదు'' అని వ్రాసిన బ్రౌనుదొర తనకృషికి గల చరిత్రలోని స్థానమును పూర్ణముగ గ్రహించినాడనియే చెప్పవలెను. తనకృషి సార్థకమగును గాని వ్యర్థము కాదని గ్రహింపగలిగిన దూరదృష్టి ఆతనిది.

బ్రౌనుదొరయొక్క నిఘంటువులను ఎవరెట్లు విమర్శించినను, ఆతని నిష్కాపట్యమును, సత్యనిష్ఠను శంకించువారుండరు. ఒక యుగసంధిలో ఆతడు కృషిజేసి, దాని ఫలితముగ ఒక సమన్వయమైన దృక్పథమును పండిత పామరులలో ప్రచారమునకు తెచ్చెను. తరువాతి నైఘంటికులు అంగీకరించినను, అంగీకరింపకున్నను - బ్రౌనుదొరకు, ఆతనినిఘంటువులకు ఎంతయో ఋణపడి యున్నారు.[37] కాని మనవారికి ఋణగ్రస్తులగుట తెలిసినట్లు, కృతజ్ఞతను, తెలియ జేయుట అంతగా తెలియదు గనుక, తరువాత నైఘంటికులలో అనేకులు బ్రౌను దొరను 'ఉపయోగించుకొని' మాటాడక మిన్నకుండిరి. ఏది ఎట్లైనను బ్రౌణ్య నిఘంటువుల తరువాత బయలుదేరిన నిఘంటువులలో, బ్రౌణ్యము నుపయోగించు కొననిది[38] లేదని చెప్పిన సత్యదూరము కాదు.

---

36. Ibidem, preface – page 5.

37. ''శబ్దరత్నాకరమునకు బ్రౌణ్యనిఘంటువే ఆధారము'' - కళాప్రపూర్ణ శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - విమర్శనము - 12-7-1939). ఈ వ్యాసము శ్రీవారి స్మారక సంచికయందు (ప్రతిభ, సంపుటి ౪) ప్రకటింపబడినది కూడ. అందు, పైవాక్యము 41 వ పేజీలో గలదు.

38. ''ఈనిఘంటునిర్మాతలు (సూర్యరాయాంధ్రనిఘంటువు) బ్రౌణ్యనిఘంటువు ప్రమాణముగా స్వీకరించినారు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను.'' శ్రీ గి. రామమూర్తిపంతులుగారు (శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు - విమర్శనము - ప్రతిభ, సంపుటి 4 - 20 వ పేజీ).

ఉగ్రత్రసిద్ధములై న ఈ రెండు నిఘంటువుల తరువాత చెప్పుకొనవలసిన నిఘంటువుల నింకను కొన్నింటిని బ్రౌనుదొర కూర్చెను. కృషి విషయమునను, పాండిత్య విషయమునను పైవాని కేమాత్రమును ఇవి తీసిపోవు వీనిలో 'మిశ్ర భాషానిఘంటువు' ఒకటి, బ్రౌనుదొర ప్రతిభకు తార్కాణముగ నున్నది. ఇట్టి నిఘంటువు ఒకదానిని కూర్చవలె నను భావము కలుగుటలోనే అతని వై శిష్ట్యము, భావమును క్రియగా ప్రవర్తింపజేయుటలోనే అతని ప్రతిభా ప్రాగల్భ్యమును కాన వచ్చును. దీనిలో తెనుగు, పర్షియను, ఇంగ్లీషు లిపులు మూడును వాడబడినవి; తెలుగులిపిలో పదము, దానికి పర్షియను లిపిలో వ్రాత, ఆంగ్లలిపిలో పర్షియను ఉచ్చారణ, ఇంగ్లీషులో అర్థము-ఇవిగాక తెలుగులో ఆ పదమునకు అర్థ వివర ణము. "తెలుగుభాష నుండి కాలక్రమమున ఈ అన్యభాషాపదములు తొలగించు టకు వీలుగా ప్రతి పదమునకును పర్యాయపదముగ తెలుగు పదమును ఇచ్చి తిని"[39] అని వ్రాసిన బ్రౌనుదొర తెలుగు భాషాభిమానమును ఏమని కొనియాడు దుము !

మిశ్ర భాషా నిఘంటువు (A Dictionary of the Mixed Dialects and Foreign words used in Telugu) 1854 లో ముద్రింపబడినది.[40] పీఠిక తరువాత, దీనిలో 'ఆంధ్రాక్షరము'లను గూర్చిన దీర్ఘ వ్యాస మొకటి కలదు. ఆంధ్రవ్యాకరణమునకు ఇది ప్రథమ వాచకముగ గ్రహింపవచ్చునని బ్రౌనుదొర వ్రాసెను. ఆతడు వ్రాసిన తెలుగు వ్యాకరణము రెండవ ముద్రణము నుండి ఇది కొలది మార్పులతో గ్రహింపబడినదట.[41] ఈ భాగమును చదువుచున్నప్పుడు బ్రౌనుదొరకు గల తెలుగుభాషా పాండిత్యమే గాక, ఆతని సమన్వయ దృష్టి, మన సంఘ సంప్రదాయములను గూర్చి ఆతనికి గల విజ్ఞానము మనలను ఆశ్చర్యచకితులనుగ చేయక మానదు. మన ఆచార వ్యవహారములతో మంచిచెడ్డలతో ఆతనికి గల సానుభూతి మనల నాతనిని గౌర వించునట్లు చేయును.[42]

---

39. "To each word in this vocabulary I have appended Telugu Synonyme. This will aid those who wish to get rid of these foreign words" (Dictonary of mixed Telugu, 1854 - preface, page iv)
40. Ibidem - preface, Page iv.
41. Ibidem - page xxviii.
42. "The native tutors also complain that English pupils touch their mouths with hand; and then defile books with hands thus dirtied. Hindus hold

ఈ నిఘంటువును కూర్చుటలో అతని ముఖ్యోద్దేశము ముస్లిముల పరిపాలన వలన తెనుగు భాషలోనికి వచ్చి చేరిన అన్యదేశ్యములను అర్థ వివరణముతో చూపుటయే. అరబ్బీ, పారసీక, ఉర్దూభాషలోని పదములనేగాక ఇతర భాషల నుండి కూడా తెనుగులోనికి వచ్చిచేరిన పదములనుగూడ అతడు గ్రహించెను. తెనుగు భాషలో నున్న అన్యదేశ్యము (Foreign words or loan words) లను గూర్చి పరిశోధన చేయువారికీ ఈ నిఘంటువు రత్నాకరము.

బ్రౌనుదొర - న్యాయస్థానములలోను, వాణిజ్యకేంద్రములలోను విరివిగా వాడబడు ఈ 'మిశ్రభాష'ను; లా-లాటిన్ (Law-Latin) తోను, లా-ఫ్రెంచి (Law-French) తోను పోల్చి వాక్యనిర్మాణ విషయములోను, కారక మునందును ఈ భాషకును 'తెనుగు'నకు పోలిక చాలతక్కువ అని చెప్పుచు-ఈక్రింది ఉదాహరణను ఇచ్చెను. "ఈ నంబరులో డిఫెండెంటు సమ్మను చూచి సైను (or దస్కత్) చేశి వాయిదాచొప్పున కోర్టులో హాజరు అయి ఆన్సరు యియ్యక పోయినందున యిందులో యెక్సపార్టి దర్యాప్తు చేయవలెనని ప్లేంటిఫ్ ప్లీడరు మోశను చేసినాడు గనుక ఆ మోశనురికార్డులో దాఖలు (or ఫయిలు) చేశి అందులో దర్ఖాస్తు చేసిన చొప్పున నడిపించేలాగున ప్రొసీడింగుసులో ఆర్డరు యెంటరు చేయడం అయినది. [43]

ఈ నిఘంటువు తన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువునకు పరిశిష్ట భాగమువంటిదనియు, సాధారణముగా ప్రజలు వాడుచున్న పదములేగాని, వాడుకలోలేని 'అన్యదేశ్యము' లిందు లేవనియు బ్రౌనుదొర ఈ నిఘంటు పీఠికలో[44] వ్రాసెను. అవసరము లేనప్పుడు మాటలలో గాని, వ్రాతలలోగాని ఈ మిశ్రభాష' నుపయోగించుట మంచిది కాదనియు, సాధ్యమైనంతవరకు దీనిని పరిహరింపవలెననియు,[45] వ్రాసిన బ్రౌనుదొరయొక్క ఆంధ్రభాషాభిమానమునుగూర్చి వేరుగా చెప్పవలెనా!

---

spittle in abomination. We should respect their prejudices and treat them kindly." (Ibidem-page x - Foot Notes).

43. Ibidem-Preface-page iii. (ఇవి మచిలీపట్టణపు 'కోర్టుజర్నలు' నుండి సంగ్రహింపబడినవి).
44. Ibidem-Preface-page iii.
45. Ibidem-Preface - page iv.

ఈ నిఘంటు నిర్మాణములో ఆతనికి బాగుగా తోడ్పడినవి (1) అతడే ఎనిమిది వాల్యూములలో సేకరించి యుంచిన జాబులు: (ii) అరువదిరెండు వాల్యూములలో నున్న 'స్థానికచరిత్రలు.[46] వీని సాయముతోను, తాను కోర్టువ్యవహారములలో నున్నప్పుడు సేకరించిన 'రికార్డుల'తోను, ఈ నిఘంటువును బ్రౌనుదొర చక్కగ కూర్చెను.

ఈ పెద్దనిఘంటువులేగాక, తాను వ్రాసినవాచకాదులందు; చిన్ననిఘంటువులను, 'పదజాలముల'ను ఎన్నింటినో బ్రౌనుదొర తెలుగు నేర్చుకొనగోరువారికి వీలుగ నుండుటకై ముద్రించెను. తెలుగుభాషలో కృషిచేయనెంచువారికి ఏ కష్టమును-తనకు మొదట కలిగినట్లు-కలుగకుండుటకై ఎంతవరకు శ్రమింపవచ్చునో అంతవరకును ఈతడు కష్టపడి పనిచేసెను. ఆ పని, ఉత్తమగ్రంథములరూపమును పొందినది.

ఇవిగాక జిల్లాలలో జరుగు కార్యకలాపములకు సంబంధించిన పదజాలముగల, జిల్లానిఘంటువు (1852) నొకదానిని బ్రౌనుదొర ప్రకటించెను. అతడు చేసిన పనులలో ఇది అత్యల్పమైన దైనను, దీనిమీద విమర్శమాత్రము కఠినముగ వచ్చినది. తరువాత ఇది విల్సన్‌దొరయొక్క 'కోర్టు-రెవిన్యూపదముల పట్టిక'లో 1855 లో విలీన మైనదట *

బ్రౌనుదొర ఆంగ్లనిఘంటువునకుగూడ ఒక అనుబంధమును కూర్చెను. డాక్టరు జాన్సన్‌యొక్క నిఘంటువును తీసికొని, అచ్చుకాగితములనడుమ తెల్లకాగితములు వేయించి సిద్ధము చేసిన ప్రతిలో ఎన్నోక్రొత్తప్రయోగములను-టాడ్, వెబ్స్టర్, క్రైగ్ మొదలగువారు చూపకవిడిచినవానిని - సేకరించి వ్రాసియుంచెనట.[47] దీనిని బట్టి ఆతనికి స్వభాషయైన ఆంగ్లమున ఎంతటిపాండిత్యము కలదో వ్యక్తమగుచున్నది. అతడు మనదేశమునకే రాకయుండిన, స్వభాషకే సేవచేసి, ఆంగ్ల సాహిత్యమున శాశ్వతకీర్తి నార్జించియుండెడివాడు. ఆతనికీర్తికి ఎక్కడైనను అడ్డము లేదు. కాని, అత డిచ్చటకు రానిచో మన భాషా సాహిత్యములకు అతని ప్రతిభతో గూడిన సేవ లభించెడిది గాదు.

---

46. Ibidem - Preface - page iv.

47. "ఈ వ్రాతప్రతి తనకు లభింపలేదని, ' ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు ' ద్వితీయ ముద్రణమును సంస్కరించిన ఎమ్. వెంకటరత్నంగారు వ్రాసిరి.

ఇంతే కాక 'ఫ్లెమింగ్' 'బిటిస్'లు కూర్చిన ఫ్రెంచినిఘంటువునకు కూడ నూటికంటె ఎక్కువగ పదములను చేర్చెనట.*చిన్ననాటనే అతడు నేర్చిన 'ఫ్రెంచి భాష' అతని కీవిషయమునను, 'తెలుగు-ఫ్రెంచినిఘంటువు' నుపయోగించుకొను విషయమునను, బాగుగా తోడ్పడినది.

ఈ విధముగా బ్రౌనుదొర సర్వతోముఖప్రజ్ఞను చూపి, కృషిచేసెను గనుకనే, అతడు ధైర్యముగ ''నేను ఒక్కరికొరకే శ్రమింపలేదు''[48] అని వ్రాయగలిగెను. వ్రాసినది సార్థకమును గూడ.

భారతదేశములోని సమస్తభాషలతోను-ఇంచుమించుగ—పరిచయమున్న బ్రౌనుదొర[49] తెనుగుభాషను తన అభిమానభాషగ స్వీకరించి కృషిచేయుట మన భాషకు జరిగిన మహోపకారము. ఇట్టి మహానుభావునికృషిలో, కొన్ని లోపములున్నవని అనువారును లేకపోలేదు. దోషములును, లోపములును అందరకునుగలవు గాని, ఇంతకృషి చేసిన ఘనతమాత్రము అందరకును లేదు. ''ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి.,'+

—భారతి
జయ - చైత్రము; ఏప్రెల్, 1954
సంపుటము 31; సంచిక—4.

48. ''I did not labour for one tribe alone.''

49. ''Distinguished by his attainments in nearly every other language of India, whether vernacular or classical, Mr. Brown particularly attached himself to the study of Telugu,-D.F. Carmichael, Secretary, Board of Examiners' Office, March 23rd, 1858. (Preface to a Catalogue Raisonnee of Oriental Manuscripts in the Library of the College, 1857).

+ ఈ వ్యాసము ''బ్రౌనుదొర జీవితవిశేషములు-నిఘంటు నిర్మాణము'' అను శీర్షికతో భారతిలో ప్రకటితము. * ఇట్టి గుర్తులున్నచోట నా తెలుగు వాక్యములకు మూలములైన ఇంగ్లీషు వాక్యములు - బ్రౌను స్వయముగ వ్రాసిన వ్యాసములోనివి-అధఃసూచికలలో నీయబడియున్నవి. వ్యాస పరిమాణమును సంగ్రహించుటకై వానిని వదలుట యైనది.

—(సంకలనకర్త.)

# ఆంధ్ర విషాదనాటకము

—శ్రీ తణికెళ్ళ వీరభద్రుఁడు

ఆంగ్లభాషాపరిజ్ఞానము కలవారికి విషాదనాటకములే యాంగ్లసారస్వతమునందు ముఖ్యకావ్యము లని తప్పక తోఁచును. మన యాంధ్రవాఙ్మయమునందు విషాదనాటక మనునది గగనకుసుమ మైనది. మన సారస్వతమున విచారనాటకము లేదను నంశము కడుశోచనీయము. ఆంధ్రభాషయందలి నాటకము లన్నియు సాధారణముగా మంగళాంతములుగా నుండును. కొన్ని నాటకములు మొదటినుండి తుదవఱకు శృంగారవిషయములగూర్చి గాని ప్రాణులసుఖజీవనమును గూర్చిగాని వ్రాయఁబడుటచే నవిపూర్తిగ మంగళప్రదములైనవి. అట్టినాటకములు కథానాయకుల వివాహములతోను వారి జయధ్వానములతోను నంతమొందును. కాని, అట్టిరూపకములందు మానవులబాధలకును వారిక్లేశములకును స్థలముండదు. చిత్రనళీయము వంటి నాటకములందు విచార మంతగా లేకపోలేదు. నలదమయంతులకు కలిగిన కష్టములను చూచి కంట తడిపెట్టనివారును, జాలి నొందని వారును సభ్యులలో నుండరు. నాటకమందు చాలవఱకు విచార మున్నను తుద కెన్నఁడయిన నాసతీపతులు కలియఁగలరని యాశ వీడమనివారు చదువరులలోఁగాని, దిదృక్షులలోఁగాని యుండుటరుదు. అంతమందు సర్వజనులును సౌఖ్య మొందుటచే ఈ నాటకములు మంగళాంతములను నామమును ధరింపవచ్చును. నాటకములలో మరియొకజాతి గలదు. కొన్నికథలు మానవుల యాపదలను మనఃక్లేశములను వర్ణించును. నాటక మంతయు విషాదపూరితమై యుండును. ప్రారంభించినదిమొదలు పంచమాంకము వఱకును నరుల లోపములును వారి దుష్కార్యములును వానివలన సంభవించు నాపదలును నాటకమునకు కథాభాగములుగా నేర్పడును. సత్పురుషులకుఁగలిగిన విపత్తులకు మనము కుందుదుము. పాపభీతిలేక ప్రాపంచికమాయకు లోనై జనుల కపకారము చేయుటయే యుద్దేశముగాఁ గల యపరాధులను చూచి యాగ్రహము నొందుదుము. వారికి శిక్ష గలుగవలెననియు నిరపరాధులు సురక్షితముగా నుండవలె ననియు కోరుచుందుము. ధర్మమునకై జీవము సయితము విడిచిన సారంగధరుని చరిత్ర నిజముగ విషాదనాటకమున కుచితమైనది. అనేక

కవులీ నాటకము రచించిరి. ఎల్లరును దీనిని మంగళాంతము(గావించిరి. కారణ మరయుట శ్రమ కాదు.

తెను(గునందు దుఃఖాంతరూపకములు లేకుండుటకు కారణములు పెక్కులు కలవు. మన ప్రాచీనగ్రంథములందు ఇట్టివి లేవుకాన తెను(గునందు కూడ ఇట్టివి వ్రాయ(గూడ దనునది మొట్టమొదటి కారణము. వాస్తవముగ పూర్వాచారపరాయణత్వము శ్లాఘాపాత్రమే కాని, ఒకానొకసమయమున త్యజింపవలయును గదా! మరియొకకారణమును కలదు. సృష్టిలో హరిశ్చంద్రసారంగధరాది పుణ్యాత్ములు సత్యమే ముఖ్యమని యెంచి దానిని కాపాడు యత్నమున ప్రాణములు సైతము కోల్పోవుటకు సిద్ధపడినపుడు తుదకు వారికి సౌఖ్య మబ్బక పోయెనా, ''ధర్మ ఏవ జయతి'' అనుమాట నిష్ఫల మగును(ట! సజ్జనరక్షణమును, దుష్టవినాశమును లేనప్పుడు పరమేశ్వరు(డు లోకమందు ధర్మమును స్థాపించు ననుమాట కర్థమేమి? మొత్తముమీ(ద ధర్మనిరతులకు జయము రాకపోయెనా, జనావళికి ధర్మమందలి నమ్మకము పోయి, వారి ధర్మాభిలాష క్రమముగా క్షీణించునని కొందఱి యభిప్రాయము. ఇట్లు పలుతెఱంగుల యోచనలచే విషాదనాటకము జననమొందుటకు వీలైనది కాదు కీర్తిశేషు(డగు ధర్మవరము కృష్ణమాచార్యునిచే రచియింప(బడిన ''సారంగధరము'' తప్ప, మనయాంధ్రభాషయందు విషాదరూపక మను నామమునకు తగిన వేఱొండు నాటకము కానరాదు. జితేంద్రియు(డును సద్గుణమూర్తియునగు సారంగధరునిచరిత్రము మిక్కిలిప్రఖ్యాతి గాంచిన దగుటచే నా కథను గూర్చిన నాటకము లెన్నియో కలవు. కాని, నాటకమందంతటను విషాదము వ్యాపించియుండినను, అంత్యరంగమున సిద్ధు(డేతెంచి సకలజనులను సజీవులను చేయుటచే నాటకము దుఃఖాంతమును కోల్పోవుచున్నది, కృష్ణమాచార్యుని గ్రంథమందు మాత్రము సిద్ధు(డును ఆకాశవాణియును కోర(బడకపోవుటచే అది పూర్ణమైన విషాదనాటక మైనది ప్రథమమున కన్యాన్వేషణమునకై పంప(బడిన విభావసు(డను బ్రాహ్మణు(డు చిత్రాంగి సందేశమును సారంగధరున కెఱింగింపకుండుట విషాదమునకు మూలాధారమై యున్నది. చిత్రాంగికి సారంగునియందు మిక్కుటమగు ప్రేమ. తా వలచినవా(డు దక్కకపోవ, విధివశముచే నొకముదుసలికి పరిణయ మాయె మొదటినుండియు ఆ నవమన్మథుని యందు గాఢముగ నాటుకొనిన యనురాగమును మరల్చుటకు యత్నించి క్రమముగ పరితాపము హెచ్చ, తుదకామె సారంగధరుని లో(బఱచుకొనుటకు కృతనిశ్చితురాలాయెను. మహాపాప

మున కొడిగట్టెను. చిత్రాంగిపాత్రసంపోషణక్రమ మత్యద్భుతముగ నుండును. న్యాయస్థానమందు సారంగధరునిపై నింద నిర్ధారణము చేయఁబడ, అతఁడు శిక్షితుఁ డాయెను. క్రమముగ చిత్రాంగిదౌరాత్మ్యము వెలువడ రాజు విచారింపఁ జొచ్చెను. సారంగధరునిరక్షణసమయము దాఁటిపోయెను. చిత్రాంగి భీతిచెంది ప్రాణము గాపాడుకొనుటకు సకలప్రయత్నములను చేసినది. నింద మోపఁ బడఁగా ఆమెహృదయము వ్రక్కలయ్యెను. రాజు పుత్రశోకముచే మూర్ఛ నొందెను. అతని మతి చాంచల్య మొందెను. కావున పంచమాంకమందు ముఖ్య పురుషు లందఱును ఇహలోకమును విడిచిరి.

ఈ విషాదసారంగధరము బహువిధముల నాంగ్లభాషయందలి దుఃఖరూపక ములను పోలియున్నది. ఆంగ్లమున షేక్స్పియరు అను కవిసార్వభౌముఁడు ''హామ్లెట్'' ''ఒథెల్లో'' ''మేక్‌బెత్'', ''లియర్'' మొదలగు నాటకములను రచియించెను. వీనిని జాగ్రత్తగా చదివిచూడ, విషాదరూపకములందలి చమత్కృతులను షేక్స్పియరుకవియొక్క యభిప్రాయమును పద్ధతులను - వేయేల విషాద నాటకసారాంశము లెల్లను మనకు విశదము కాగలవు. ప్రతినాటకమందును ఎన్నియో పాత్రము లున్నను, కడపటి యంకమున కథానాయకుని జీవచరిత్ర లోని కష్టకాలమే వర్ణింపఁబడును. మొదట అతనిగుణములును అతనిస్థితియును అతని రాఁబోవు చిక్కులును సూచింపఁబడును. క్రమముగ నాపదలు వృద్ధి కాఁగా, అతనిపరితాపము హెచ్చును. త్వరలో అతనిని అతనితోడిసంబంధము కలవారిని మృత్యుదేవతకు బలిగా నిచ్చుటకు తగినసన్నాహములు జరుగుటయు, తుదకు వారందఱును కడపటి రంగమున పరలోకప్రాప్తి చెందుట చూచుటయు తటస్థించును. కాని, కొంత వఱకు ఈ కష్టములన్నియు మానుషప్రయత్నము లగుటచే పరులను నిందించుట యనావశ్యమని తోఁచుచుండును. ఈనాటకములందు కథాభాగమునకును దృఢమైత్రి గలదు. స్థితినిబట్టి పాత్రస్వభావోద్భవమును పాత్రముల వర్తనము ననుసరించి కథయు మార్పు చెందుచుండుటను చూడ గలము. ''హామ్లెట్'' తనపినతండ్రి దుర్మార్గుఁ డని యెఱిఁగి యతనిని వధింప వలెనని ప్రతిజ్ఞపూని ఆ పౌరుషమును క్రియలో చూపకపోవులోప మెవ్వరిది ? ఆ రాకొమరుని మనము చింతతో నిండి యున్నమాట నిజమే కాని, ఆ దోషిని హత్యకావించు సమయము వచ్చినపుడు వెఱ్ఱి యాలోచనలచే వెనుదీయకపోయెనా, తన ప్రాణమును నమ్మిన చెలిప్రాణమును కోల్పోయియుండడు గదా ?

కథానాయకుఁడు సత్పురుషుఁడు కావలె నను నియమ మెన్నఁడును లేదు. క్రూరులును ధనార్జనపరులును రాజద్రోహులును కూడ నాయకులుగా నుండుటను

చూచుచున్నాము. క్రూరులను చూచినపుడు భీతియు నిరపరాధులను చూచినపు డెల్ల కనికరమును చూపఁబయం దుద్భవించుచుండును. కథానాయకుని యత్నము సదుద్యమ మైనచో, అతనిని చూచి మనము జాలిపడవచ్చును. సాహసము కల వాఁడు దుర్మార్గుఁడైన నేమి? అతని శక్తిసామర్థ్యములను చూచి యాశ్చర్యము నొందనివా రుండరు. రాజద్రోహి (మెక్బెత్) కథకు నాయకుఁడై నంతమాత్ర మున, ఆ కథను చదువుట మానితిమా? చిత్రాంగి దుర్మోహమునకు పాల్పడె నని ఆనాటకమందలి కవితాచమత్కృతి తగ్గెనా? దుర్మార్గుల గూర్చియు వారు ధర్మ నిరతులను జయించుటకు చేయుప్రయత్నములను గూర్చియు వినుట మనకు నీతి దాయకముకాదా? కథానాయకుఁడు మంచివాఁడైనను అతనిసుగుణములే అతనికి ముప్పు కలుగఁజేయును. ఒథెల్లోయందు ఒకప్రధానగుణమున్నది. అతఁడు మను ష్యులు చెప్పుమాటలను నిష్కల్మషబుద్ధితో విశ్వసించును. దానికై అతనిని మనము ప్రస్తుతింతుము గదా? కాని, ఇంచుకైన ననుమానము లేక పరమ చెండాలుఁ డగు "ఇయాగో" చెప్పినమాటలను నమ్ముటచే కదా పతివ్రతాశిరోమణి యగు సతీతిలకము నతడు మృత్యువునోటఁ బడఁవైచెను. చిత్రాంగికి వివాహ పూర్వము నుండియు సారంగధరునియందలిప్రేమ మత్యద్భుతము. ఆసుందరాంగు గునియం దమోఘమైన యనురాగ ముండుటయు, అతనినే దైవముగా పూజించు నిశ్చలభక్తి కలుగుటయు శ్లాఘాపాత్రములే. కాని, ఆమె చెడునడతకును దౌరాత్మ్యమునకును మూలకారణము సారంగునియందలి మోహము కాదని యెవరైన చెప్పఁగలరా?

నాటకరచనయందు షేక్స్పియరు రెండువిషయములలో నెక్కుడు శ్రద్ధ వహించును. నాటకమున కంతకును ఇతివృత్తమును పాత్రపోషణమును ముఖ్య మైనవి. ఈరెండుభాగములందును అద్భుతమైన శక్తి గలదు. కావుననే, అతని రూపకములు రసభరితములగుటయు, ఈ కవి నాటకర్తల కందఱకును చక్రవర్తి యని పేరు సంపాదించుటయుసమకూడినవి. ఈరెండును గాక, మరియొకమూఁడవ ఘనత యితనియందు లేకపోలేదు. కాళిదాసాదిమహాకవుల మూలధనమగు కవితా చమత్కృతి యనుమహామంత్రశక్తి ఇతనియందుఁ గూడ నున్నదిగాని, అది కావ్య రచనకు చెందును గాన ప్రస్తుతము దానిమాట యటుండనీయవచ్చును. ఈ నాటకములందు ఇతివృత్త ముత్పాద్య మని చెప్పఁజాలము, కథ ప్రఖ్యాతమైనను దానిని మార్చి రసపూరితముగా చేయుటచే ఈనాటకములు షేక్స్పియరుచే కల్పింపఁబడిన వనియే చెప్పవచ్చును. అతడు కథాసందర్భమును చూచి పాత్రములను

సృజించును. క్రమముగా కథ పరిపక్వమగుటయు, దాని ననుసరించి పాత్రముల స్వభావములు మాఱుటయు చూచెదము. మొట్టమొదటినుండియు కథాభాగమునకును పాత్రపోషణమునకును పరస్పరసంబంధము గలదు. చిత్రాంగికి సారంగధరునియందు ప్రేమ యున్నమాట సత్యమే. రాజరాజనరేంద్రుడు వేటకు పోవుటచేతనే కదా ఆమె మనము వికల మగుటయు మదనతాపము నోర్వఁజాలకపోవుటయు ఘోరపాపమునకు సాహసించుటయు సంభవించినవి? ఇవ్విధమునఁగాక, కథాభాగము వేఱుగాను పాత్రపోషణము వేఱుగాను నున్నచో, తీర్థమునకు తీర్థము ప్రసాదమునకు ప్రసాద మని చెప్పవచ్చును. పాత్రపోషణ మనఁగా నెట్టిదో మన గ్రంథకర్తలకు చాలమందికి దుర్జ్ఞేయము; వట్టి వర్ణనమని వారి యభిప్రాయము. ప్రబంధములందు ప్రాచీనకవులు రాజులయం దేసుగుణములు వర్ణించిరో అవియే ప్రతి కథానాయకునియందును చూపింపఁబడుచున్నవి. మొదటి నుండి తుదవఱకు ఒకనిగుణములే కవి పూర్తిగా వర్ణించినచో అంత రసముండదు. వ్యంజనయే కావ్యమునకు పరమాత్మవంటిది. ఒక పాత్రము చేయు కార్యములను బట్టియు, వివిధావస్థలయందును ఆ పురుషుఁడుకాని స్త్రీకాని యాడు పలుకులంబట్టియు మన కాపురుషునిం గాని స్త్రీనిగాని గూర్చి యోచించుట కవకాశ ముండవలెను. అంతేకాక, ప్రతి కథానాయకుఁడును సద్గుణరాశియని చెప్పనాధారము కలదు. నాటకమునందు సత్పురుషులవర్ణనము కూడ కావలసియున్నది. మూర్తీభవించిన పుణ్యగుణములో యనఁదగు హరిశ్చంద్రాది దివ్యపురుషులను గూర్చి చదివి దైవసమాను లగు నమ్మహానుభావులను గుఱించిన ధ్యానముచే మానవ మన స్సించుకసేపైనను ప్రపంచసహవాసముచేఁ గలిగిన మలినమును వదల్చుకొని ఆ సత్పురుషులసంపర్కముచే లభించు నానందమును పొందుననుట నిక్కవము. కాని, నాటకము వ్రాయుసమయమున నాయకుఁ డెంత గొప్పవాఁడైనను అతఁడును మానవుఁడే కనుక అతనియందుకూడ ఏదో యొక్క లోప ముండవచ్చు నని యూహింపవచ్చును గదా? సారంగధరుఁ డన్నివిధముల మంచివాఁడే కాని, తనప్రాణమిత్రుఁ డగు సుబుద్ధి చిత్రాంగి యువతి యనియు రాజూర లేనపుడు తనయింటికి దాసి నంపుట మిగుల సందేహాస్పద మనియు, ముమ్మాటికిని చెప్పి ఆమెయింటికి పోవల దని నిర్బంధపెట్టినను, దూషించి, వలదన్న కార్యముచేయఁబూనుట గొప్పలోపము కదా? మరియు న్యాయస్థానమందు న్యాయాధిపతి సారంగధరుని సాక్ష్యము కోరగా, నే నేమియు చెప్ప నని యూరకుండి తాను చిత్రాంగి యింటికి పోయినమాట సత్య మని యంగీకరించి తన

మీఁద నీనింద యేల యారోపింపఁబడిన దని ప్రశ్నించినపుడు మౌన మూనుట వలన కదా ఈ యుపద్రవము! అతఁడు తనపినతల్లి మానమును గాపాడ యత్నించెను గాని, నిజ మెట్లున్యాయాధీశునకు తెలియఁగలదు? నాటకములందును మరి యితరకావ్యములందును పురుషులను వర్ణింపవలసివచ్చినపుడు మహాపుణ్యాత్ములను గూర్చి వ్రాయవలెనా లేక లోకమందు సర్వసాధారణముగా మనకు కనుపించు ప్రాణులను గూర్చి వర్ణింపవలెనా యను నంశము యోచింపఁదగినది. నిత్యమును మనకండ్లయెదుట కనుపించు సామాన్యమనుష్యుల సాధారణజీవితమును వర్ణించినచో చదువరుల కానందముకలుగదు సరికదా, వారు నేర్చుకొను నూతనాంశమేదియు నుండదు. లేక దైవసమాను లగు మహాపురుషులజీవితమును కావ్యమందు చిత్రించినచో వారిచారిత్రము మనకు మిక్కిలినీతిదాయకమే. కాని, అట్టి విచిత్రపురుషుఁడు మానవకోటియందు కలఁడా యను సందియము కలుగుచుండును. ఆ పురుషుఁడు మానవేతరుఁడైనచో వానిజీవితమునకును మనజీవితమునకును సంబంధము లేదు గాన, వానిప్రవర్తనము మన మనుసరింపఁ బనిలే దని కొంద అభిప్రాయపడుదురు. అట్టిమహానుభావుఁడు సృష్టియం దుండునా యని యనుమానము కలుగును. వ్రాయఁబడిన యంశమందు సందియ మించుకైనను కలిగినచో ఆ కావ్యమందలి రసమును పూర్తిగా గ్రోలుటెట్లు? షేక్స్పియరు దీనిని గ్రహించియే, తనకథానాయకు లెంతగొప్పవారైనను మానవులే కనుక వారు లోపములును మరియితర మానవచిహ్నములును కలిగియున్నట్లు చూపించియున్నవాఁడు ఒకవేళ దుర్మార్గుఁ డెక్కడనైన కథానాయకుఁడైనచో అతఁడును మనుష్యుఁడే కనుక నేదైనసుగుణమును గాని మరియితర మానవగుణమును గాని కలిగియుండును.

కృష్ణమాచార్యుని సారంగధరము తప్ప మనయాంధ్రభాషయందలి విషాద నాటకములపద్ధతి మన కంతగా రుచింపదు. నాటకమం దంతటను మానవుల దుఃఖము చిత్రింపఁబడును. కాని, చిట్టచివరకు ఆకాశవాణి వచ్చి యథార్థము తెలియజేసి కథయందలి బంధవిమోచనమును చేయుటో లేక ఏదో యొకసిద్ధుఁ డేతెంచి మృతినొందినవారికి సంజీవి నిచ్చుటో చూచుచుందుము. ఇది యనుభవవిరుద్ధము. కృష్ణమాచార్యుఁ డీరెంటిసాహాయ్యమునుకూడ కోరలే దను నంశము సంతోషదాయకము. చిత్రాంగి రారాజును మోసపుచ్చి సారంగధరుని ప్రాణములు హరించినది. సారంగుఁడు శిక్షకు పంపఁబడినవెనుక చిత్రాంగిదుష్ప్రవర్తనము క్రమముగా చీఁకటిలోనుండి వెలికి వచ్చినది. ఆ రహస్య మెట్లు బయల్పడెనో ఎంతకాలమైనతరు

వాత నెన్ని నిదర్శనములు చూచిన యనంతరము రాజామెను శిక్షించుట కుద్దేశించెనో విశదీకరింపవలెను గాని ఇతివృత్తచమత్కారము తెలియక ఆకాశవాణి వచ్చి యథార్థము వాక్రుచ్చె నన్న మాటవలన లాభములేదు. నాటకమునందలి యందము చెడును. ఈ విషయము కృష్ణమాచార్యుని గ్రంథమందు నైపుణ్యముతో చూపఁబడి నది. విషాదనాటకము విషాదముతోనే ముగియవలెను. నాటకము విషాదాంతము కావలసినదియు మంగళాంతము కావలసినదియు గ్రంథకర్త కథాభాగమును పాత్రములను ఏవిధమున చిత్రించెనో అదియే సూచించును. విషాదనాటకమునకు మంగళాంతమును గూర్చుట మిక్కిలి యన్యాయము. ఈ నాటకములందు పాత్ర ముల మనస్సులు మార్పులను చెందక తప్పదు. సాధారణముగా కథానాయకుని హృదయమందు ఒకవిధమైన సంగ్రామము ప్రారంభించును. క్రమముగా నీపోరా టము తీక్ష్ణమై యతని మనస్థ్సైర్యము చెడును. పంచమాంకము చేరుసరికి మనః పరితాపము హెచ్చుటయు ఆతఁడు దానిని భరింపఁజాలక పోవుటయు తుద కతనికిని అతనికి సంబంధించినవారికిని ఈశరీరమున్నంతకాలము మనశ్శాంతి కలుగ దనియు మనకు నిశ్చయముగా తెలియును. అట్టి ధగధగ మండుచుండు నగ్నిహోత్రము చల్లారు టెట్లు ? ఒథెల్లో నాటకమందు కథానాయకునకు ప్రాణము కన్న నెక్కుడుగా భావించిన తనప్రియసతియందు దురదృష్టవశముచే నను మానము కలిగినది. ఆ యనుమానము మితిమీఱినది. ఆ మనోవేదనను భరింపఁ జాలక అతఁడామెను వధింపఁబూనెను. అట్లు చంప నుద్యుక్తుఁడైనను ఆమె కోమలశరీరమును చూచి రక్తమయము చేయఁగూడ దని యోచించెను. ఆమె సౌందర్యవిలాసవైభవమును ముఖవికాసమును కడసారి తిలకింప మది ప్రేమ ముప్పొంగినను వెనుదీయక యామెను తనయాగ్రహమునకు బలిగా నిచ్చిన ఒథెల్లో తనభార్యను వధింప కూరకుండునా ? ఆ దంపతులు తదనంతరము సఖ్యపడి జీవింతురా ? వేయేల ? ఒథెల్లో తిరిగి తనయర్థాంగిని కన్నార తిలకింపఁ గలడా ? మరియు చిత్రాంగి మన్మథ ప్రేరితురాలై కుమారునిఁ గవయఁ గోరు నంతటి యఖండపాపమునకు సాహసించినది. విఫలప్రయత్నయై తనబాళి నంతయు వెలిబెట్టినందులకు లజ్జించి యాగ్రహము పూని మహాక్రూరత వహించి సారంగధరుని మృతునిఁ గావించి తిరిగి యాసుందరుఁడు సజీవియై తన్ను జూడవచ్చినపు డెదుఁరేగి "కుమారా ! క్షేమమా? నా తప్పు సైరింపుమా!" అని యతనిని పలుకరించు నని కలలోనైన నూహింపఁ గలమా ? లేక, చిత్త

చాంచల్యముచే మూర్ఛనొందిన రాజనరేంద్రుఁడును పుత్రశోకమసుమహా సముద్రమున పాతాళము నంటిన రత్నాంగిదేవియు కుమారునిఁ జూచి "తండ్రీ సారంగధరా! ఎంతయాలస్యము చేసితివి ? నీకై చూచుచుంటిమి. ఆశీర్వాదము గైకొమ్మా" అని చెప్పుదురా? మనస్తాపము మితిమీఱి పరాకోటిని చెందినపుడు నాటకము విషాదాంతము కావలసియుండును. మంగళాంతము చేయవలె నని గంథకర్త యూహించినచో పాత్రములయం దంత మనోవేదనమే కల్పింపఁడు, తా మెన్నఁటికైన సుఖ మనుభవింపఁ గల మనెడి యాశను వారియందు పుట్టించును. వీరందఱును కలియుటకును వారికష్టములు దరిచేరుటకును తగినయవకాశము కలదని మనకును సూచించుచునే యుండును. చిత్రనళీయమందు నలదమయంతులకు ఎడఁబాటు కలిగినది. మనకు విచారమును కనికరమును ఉద్భవించును. ఎన్నఁటికిని తనప్రియసందర్శనము కా దను నిరాశమాత్రము సతీపతులలో నొకరికిని లేదు. ఆ సమావేశ మెప్పుడు వచ్చునా యని వా రువ్విళ్ళూరుచుండిరి.

సీ. "ఎన్నఁడు నాదండ కన్నులార ముదంబు
తోడ నాప్రాణేశుఁ జూడఁగలుగు ?
ఎన్నఁడు నాముద్దుచిన్నారిసుతుఁ గాంచి
యింపు మీఱఁగ గౌగిలింపఁగలుగు ?"

అని దమయంతి తనలో తా ననుకొనుచుండుటను చూచి తనభవిష్యత్సౌఖ్యమం దామెకు కొంతయాశ కల దనియు ఆ యాశ నెఱవేఱు ననియు దిదృక్షులకు తోఁచుచుండును

షేక్స్పియరునాటకములందు ఎవరిసుఖదుఃఖములకు వారే కర్తలైనను కొంత దైవికయత్నముకూడ లేకపోలేదు. విషాదాంతము కాక తప్పదనురంగమునకు కథాభాగము వచ్చినపుడు కర్మవశ మనునది కూడఁ గాన్పించును. హఠాత్తుగా కర్మవశముచే నొకానొకసమయమందు లాభమును మరియొకసమయమందు నష్టమును సంభవించుట లోకమందు చూచుట లేదా ? రాజనరేంద్రుఁడు చిత్రాంగి క్రౌర్యము కనుఁగొని సారంగధరుని శిక్ష యాపుచేయవలె నని పంపిన సేవకుఁడు దారిలో తలఁవని తలంపుగా నాలస్యమై యాకుసుమకోమలుని కరపాదిచ్ఛేద మొనరించిన మరుచటి క్షణమువఱకు చేరకపోవుట దైవికమే కదా ? ఆదికాలమున చిత్రాంగి తనయనురాగమును సారంగధరునితో మనవిచేయు మని విభావసునితో చెప్పినపు డాబ్రాహ్మణుఁడు సందేశమును పూర్తిగ మఱచెనని నామాట యెవరినేర

మని యెంచగలము? అది విధివశమున కాక మరి యేమి? ఒకానొకప్పుడు పురుషులు సదుద్దేశముతో నొకయత్నము చేయఁబూనినను, తగినకారణములేకయే వారికార్యము ఫలవంతము కాకపోవుటయు వారు దుర్మార్గులచే హింసింపఁబడు టయు చూచుచుందుము. వారు సత్పురుషులై ఉత్తమోద్దేశముతో వర్తించునపుడు వారికి బాధ కల్గెనా; విధికాక మరి యెవరు కారణము? ఇట్లు మనుష్యయత్నము నకును కర్మవశమునకును పోరాటము జరుగుచున్నట్లు లోకమందు చూచు చున్నాము. మార్లో వంటి విషాదనాటకకర్త లీసంగ్రామమును తమ గ్రంథము లందు చర్చించిరి.

విషాద నాటకములు వ్రాయుటకు కొన్నియభ్యంతరములు కలవని పలు వురు వక్కాణించుట వినియున్నాము. దుష్టులను చిత్రించుటయు వారి చరిత్రలను చెప్పుటయు హేయమైన దనియు దుర్నీతిదాయక మనియు వారు వాదింతురు. మన యభిప్రాయముకంటె ఆంధ్రనాటక పితామహుఁడని వన్నెకెక్కిన కృష్ణమా చార్యుని వ్రాఁతయే దీనికి సరియైన ప్రత్యుత్తరము.

"దుర్నీతి నించుకైనను ప్రకటింపకున్న నీతికి కాంతి కలుగదు. రావ ణుని దుర్నీతి లేకున్న శ్రీరాముని కంతకీర్తి కలుగునా? దుర్యోధనుని దుర్నీతి లేకున్న పాండవుల కింతటిఖ్యాతి కలిగియుండునా? కావున, నీతి కుదుర్పవలె నన్న దుర్నీతి నించుక ప్రకటించియే తీరవలె నని నా సవినయ విజ్ఞాపనము. రుచిభేదములును అభిప్రాయభేదములును ఉన్న నుండుగాక! విశ్వామిత్రుడు క్రోధమే లేక యతఁడు వసిష్ఠునితో కయ్య మాడకుండెనా, హరిశ్చంద్రుని సత్య వాక్పరిపాలనమును పరీక్షించు టెట్లు?"

విషాదనాటకము చదువరుల కానందము నీయ దనియు సదా విచారము కలుగఁజేయు ననియు కొందఱూహింతురు లోకములో సుఖము కోరువారు దుఃఖ మునకు కూడ భాగస్థులు కావలయును. ఎల్లప్పుడును సౌఖ్యమందున్న వానికి కష్ట మనఁగా నెట్టిదో తెలియదు. పిన్ననాఁటి నుండియు ధనములో మునిగితేలువాఁడు దరిద్రునిఁజూచి నవ్వుట యాశ్చర్యమా? సకలైశ్వర్యములతో తులఁదూఁగు మనుజుడు, శోక మన నెట్టిదో గ్రహింపఁజాలడు. హిందూమాతకు ప్రియపుత్రుఁ డగు గౌతమబుద్ధుఁడు దయార్ద్రహృదయుఁ డయ్యును తాను హంసతూలికాతల్ప మున శయనించుచు తనహర్మ్యమందున్నంతకాలము మానవకోటికష్ట మననెట్టిదో తెలియఁగల్గెనా? అఁతడు వీధివెంట బయలుదేఱి మనుష్యులబాధలను చూచిన తత్క్షణమే ప్రాణికోటిని రక్షింపవలె నని గ్రహించుట తటస్థ మయ్యెను. బంగార

మగ్నిలో కాలినఁగాని శుద్ధిని పొందదని మనకెల్లరకు తెలిసిన యంశమే. "హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిశ్శ్యామికాపి వా" అని కాళిదాసు చెప్పిన మాటలయాథార్థ్యమును సందియపడువాఁ డెవఁడు? మనస్సును నిర్మలము చేయుట కును ఆత్మను సంరక్షించుకొనుటకును మనకు తఱచు కష్టములు రావలెననియు లేనిచో మనము మనయాదర్శములను మఱచిపోవుట కవకాశము కలుగుననియు తలఁచుచుందుము. మనకు బాధలు వచ్చినపుడే హృదయము విశాల మగుటయు పరులకష్టములను జూచి జాలినొందుటయు వారిక్షేమమును గోరుటయు సంభవిం చును. "తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబును" జరుపు బాలభక్తుని గాఢప్రజానురాగ మబ్బవలె నన్న, ఎన్ని కష్టములు పొందియుండ వలెను? కాఁబట్టి చదువరుల హృదయములను విశాలములను చేయుటకు విషాద నాటకములే యుచితములు. ఇంతకును షేక్స్పియరునాటకముల వంటి నాటకములు చదువుటవలన విచారము కలుగునో లేక ఆ విచారముతోపా టానంద ముద్భవింప ఆ నాటకములందు వర్ణింపఁబడిన మహాపురుషుల సంపర్కముచే నొక వింతవికాసము కల్గునో యనుభవజ్ఞులు గ్రహింపకపోరు.

విషాదములవలన జనసామాన్యమునకు సద్గుణములుండుటచే ప్రయోజనము లేదని యభిప్రాయము కలుగును గాన, సత్పురుషులు సుఖమును దుర్మార్గులు తుదకు దుఃఖమును పొందవలెనని యనేకులు వాదింతురు. కాని, మనకు సాధార ణముగా లోకములో సత్యసంధులు హింసింపఁబడుటయు దుష్టులు జయ మొందు టయు గోచరమగుచున్నది. "సత్పురుషుల కెందుఁగాని ప్రాయికముగా బాధలు వచ్చుటయే మనము కనుచున్నాము. అదిగాక లోకమున జరుగువిషయములలో నెన్నియో పొరపాటులు కలవు గదా? సద్గుణములు కలవా రెంతఱకో దుఃఖము కల్గుట చూడమా? వానికన్నిటికిని కారణము చెప్పుట సాధ్యమా?" అని రామ కృష్ణమాచార్యుఁడు వ్రాసెను. విషాదనాటకములయందు సత్పురుషులు దుఃఖాంత మొందుటచే లోకమందు న్యాయము లేదనియు భగవంతుని న్యాయశీలనమందు నమ్మకము చెడు ననియు కొందఱి భయము. అది పొరపా టని యూహింప వలెను. మన మందఱమును శ్రీకృష్ణుని భగవంతునిఁగా పూజించుచుంటిమి గదా!

శ్లో. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"

అని శ్రీకృష్ణుఁడు చేసిన ప్రతిజ్ఞయందు మనకు దృఢమైననమ్మకము కలదు. ఆ పరమేశ్వరుఁడు మనలనందఱను న్యాయముతో నేకచక్రముగా నేలు చున్నాఁడని యెఱింగి మనకు ముక్తినిమ్మని యతనినిగూర్చి సదా ధ్యానించుచుందుము. కాని, ఈ ధైర్యమెల్ల ప్పుడును స్థిరముగా నుండునా? జన్మ మెత్తిన తర్వాత నెప్పుడును దుష్కృతమనఁగా నేమో యెఱుఁగని మనకుఁగాని లేక స్వప్నావస్థ యందైనను పాప మన నెట్టిదో తెలియని మన ప్రాణసమాను లగు బంధుమిత్రుల కెవరికిఁ గాని యొక మహావిపత్తు సంభవించినపుడు మన మన స్సెంత బేల యగును? ''ఆ సాధ్వీమ తల్లికి అట్టియాపద సంప్రాప్తించు నని కలనైన తలఁచి యెఱుగము. ఈ ప్రపంచమంతయు మాయ తప్ప వేఱుకాదు'' అని మనము వేసరుచుండలేదా? లోకమునకు పాలఁకుడే యున్నయెడల ఇట్టిన్యాయము జరుగఁగూడదు కావున జగదీశుఁ డెవ్వఁడైనను కలఁడా లేఁడా యని మనము ప్రశ్నించుట లేదా? కాని, హృదయమందలి ఈ యధైర్య మచిరకాలములోనే యదృశ్యమై యొకవిధమైన మనోవికాసము కలుగ మనప్రస్తుతకష్టమంతయు ప్రాక్తనజన్మకర్మఫల మని యూరట చెంది పరాత్పరుఁడు న్యాయశీలుఁడే యనియు అతడే కరుణాసముద్రుఁ డనియు అతని యందలి భక్తి క్రమముగా హెచ్చుటయు చూచుచుంటిమి. అవ్విధముననే యొకవేళ కొందఱు పాఠకులకు విషాదనాటకములు చదివినతర్వాత మనుష్యసౌఖ్యమును గూర్చి భీతియును నిరాశయును కలిగినను పరమేశ్వరుఁడు న్యాయశీలుఁడా కాఁడాయని సందియము తోఁచినను కొలఁదికాలములోనే ఈ మేఘములన్నియు చెల్లాచెదరగుటయు జ్ఞానోదయము కలుగుటయు జగదీశ్వరుని న్యాయవర్తనమున నధిక విశ్వాసము కలుగుటయు సంభవించును.

కావున విషాదనాటకములవలన లాభము లేదని వాదించుట గొప్పపొరపాటు మనకు నిజముగా నీతి బోధించుట కుచిత మదియే. దానియందు మానవునియావజ్జీవమును చిత్రించుటకును వానికష్టసుఖములను మనకండ్లయెదుట చూపుటకును వీలగును. మానవహృదయమందలి తీఁగెల నన్నింటిని వాయించుటకు అవకాశ మీకావ్యమం దున్నట్లు మరియెక్కడను గాన్పింపదు. ప్రకృతి యొక్క ప్రతిబింబమును చూపుటయే నాటకపుముఖ్యోద్దేశ మని యొకమహాకవి వాక్రుచ్చెను కావున మన సుఖదుఃఖములను వర్ణించి మనల నంధకారమునుండి వెలుతురులోనికి తీసి, లోకతత్త్వ మెఱింగించి జగదీశచింతనామృతమును గ్రోలుటకు తగుసమర్థత నిచ్చు గ్రంథమే కావ్య మను నామమునకు తగినది.

—ఆంధ్రపత్రిక ఎనిమిదవ సంవత్సరాది సంచిక
పింగళ నామ సం॥ ఏప్రిలు 1917.

# అమలిన శృంగారతత్త్వము

—డాక్టర్ సి. నారాయణరెడ్డి

రాయప్రోలు సుబ్బారావుగారి కావ్యములలో లలిత, తృణకంకణము, కష్టకమల, స్వప్నకుమారము ప్రణయము ప్రధానవస్తువుగా గలవి. ఈ కావ్యములకు అచ్చమైన లక్షణము లనదగిన సిద్ధాంతములు వారి రమ్యాలోకమున మాధురీ దర్శనమున నిక్షేపింపబడినవి. మాధురీదర్శనములోని 'రతి' మీమాంస, 'స్త్రీపుంసయోగ' చర్చ, రమ్యాలోకములోని సంభోగ వియోగ శృంగారాదుల చర్చ, వాత్సల్యాది భావచర్చ, సౌందర్యార్చనాచర్చ మున్నగునవి రాయప్రోలు వారు ప్రతిపాదించిన ప్రేమసిద్ధాంతమునకు బహుముఖములుగా విస్తరించిన శాఖలే. వీనిలో ప్రధాన వస్తువు 'అమలిన శృంగారము'. తెలుగులో 'అమలిన శృంగారము' అను సిద్ధాంతమునకు నారుపోసినవారు, నీరు పోసినవారు రాయప్రోలువారే. తెలుగు సాహిత్యములో సరిక్రొత్తగా కనిపించెడు ఈ సిద్ధాంతము యొక్క స్వరూపస్వభావములను పరిశీలించుటయే ఈ వ్యాస పరమోద్దేశ్యము.

రాయప్రోలువారు కరుణశృంగారరసములు రెండే రసవికాసమునకు సమర్థము లని అభిప్రాయపడిరి పూర్ణానందాస్వాదమునకు శృంగార రసము, మనోదోష శుద్ధికి కరుణరస ముపయుక్తములని వీరి భావము. వీనిలో రెండవది అరిస్టాటిల్ ప్రతిపాదించిన కెథార్సిస్ (Catharsis) అను లక్షణమునకు సరిపోవుచున్నది. ఈ రెండు రసములలో శృంగారరసశేఖరత్వమును వీరంగీకరించిరి. శాంతము రసము కాదు పొమ్మనిరి. శాంతరసస్థాయిలో అంతఃకరణము విషయ విముక్తమై పోవును. విషయవికారమున్నప్పుడే రసప్రసక్తియుండును. అది లేనిది రసము కాదని, అన్నిరసములకు పర్యవసాయియైన దశయైనచో కావచ్చునని వీరి అభిమతము. రసానుభూతి విషయసంవలితమైయైనరసము బ్రహ్మానందసహోదర మను ప్రాచీనుల మత మెట్లు సమర్థనీయమగునను ప్రశ్న ఇచ్చట జనించును. ప్రాచీనులు తెలిపిన బ్రహ్మానందము ఇంద్రియములకు, మనస్సునకు అతీతమైనది. రసానుభవ మట్టిదికాదు. అది ఇంద్రియములకు మనస్సునకు లోబడియే యుండును.

1. Catharsis అనగా 'through pity and fear to purge the feelings' అని అరిస్టాటిల్ Poetics లో వివరించెను.

కావున బ్రహ్మానంద రసానందముల కేకత్వము లేదను మతము పై రాయప్రోలు వారి సిద్ధాంత మాధారపడియున్నట్లు తోచును. శృంగారరసమునకు సంభోగము అవధియన్న పూర్వుల సిద్ధాంతమునుగూడ వీరు త్రోసిపుచ్చిరి. సంభోగ శృంగారము ఉపాధిమాత్రమైనది కాబట్టి క్షయిమైన దని, వియోగ శృంగారము అనుపాధికము కాబట్టి అక్షయమైనదని అదే శ్రేష్ఠమని, వీరి సిద్ధాంతము. ఉపాధి యనగా లాక్షణికులు చెప్పిన ఆలంబన విభావము. వియోగములో ఈ ఆలంబన విభావము ప్రత్యక్షముగా ఉండదు. అది కేవలము మనోగమ్యము. అట్టి అనుభూతియే అనుపాధికమగు వియోగశృంగార మని రాయప్రోలువారి అభిప్రాయము. స్థూలముగా చూచినచో, సౌందర్యము శృంగారము ఒక్కటే. కాని, వీరు ఈ రెంటి కీవిధముగా తారతమ్యము చూపిరి. ''ఉపాధిగతము సౌందర్య; మనుపాధికము రసాధికారి శృంగారము'' (రమ్యాలోకము). సౌందర్యము శరీరగతము. అనగా అవయవ నిష్ఠము. ఇది శరీరముక్తమైనప్పుడే శృంగారమగు నని వీరి భావము. ఈ విధముగా ఉపాధి నాశ్రయించని శృంగారము విశ్వశ్రేయఃకారి యని వీరి అభిప్రాయము. 'సౌందర్యలహరి'లో 'అంబా' శరీరవర్ణనము స్థూలముగా ఉపాధిగతముగా కనిపించినను తద్విశిష్టమైన నిగూఢార్థము దానిలో ఉన్నది. అనగా అది శరీరముక్తమైన ఆత్మసౌందర్యవర్ణనయే. అది అమలిన శృంగార స్థాయికి చెందినది. ధ్యాన ప్రపంచమున ఉన్నప్పుడు సర్వము అనుపాధికముగానే భాసించును. దానికి ఆశ్రయ ప్రసక్తి లేదు. నవ్యులు భావప్రపంచమున ఈయనుపాధికమైన సౌందర్యమును సాధించుచున్నారని ''ఏతదమలసౌందర్యార్చనాతిరేకము'' ఆత్మభావనచేత ఆనందమై ఫలించు నని రాయప్రోలువారి వాద సారాంశము. ఇంతకు, సౌందర్యమువలన శృంగారమువలన వీరు పొందునది అమలినమైన ఆనందము. 'అమలినానందము' అనగా లౌకికవాసనల కతీతమైన ఆనందము. అదే రసానందము. ఈ యానందమే రాయప్రోలువారికి ధ్యేయము.[2] వియోగ శృంగారములోని పావిత్ర్యమును దృష్టిలో నిడుకొని వీరు 'అమలిన శృంగారము' అను క్రొత్తసిద్ధాంతమును లేవదీసిరి. ఇది అలవోకగా చేసినది కాదు-ఉపనిషత్తులు మొదలుకొని, ఆలంకారికుల లక్షణ గ్రంథములవరకు గల

2. ఈ ఆనంద ప్రాధాన్యమునే ఉపనిషత్తు లీ రీతిగ ఉగ్గడించినవి:

''ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్
ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే
ఆనందేవ జాతాని జీవంతి
ఆనందం ప్రయం త్యభినం విశంతి." —తైత్తిరీయోపనిషత్తు.

రససిద్ధాంతములన్నింటిని అవలోడనముచేసి మధించి తీసిన నవ్య 'నవనీత'మిది. అమలిన శృంగారమునుగూర్చి రాయప్రోలువారి సిద్ధాంతమును పరిశీలించుటకు ముందు శృంగారరసమును, దానికి సన్నిహితములైన ప్రేయో వాత్సల్యాదులను, పాశ్చాత్యుల Platonic Love యొక్క తత్త్వమును చర్చించుట అవసరము.

*శృంగార రసము :*

భరతుడు శృంగార రసమును త్రివిధముగా విభజించెను. 'త్రివిధాకృతికః శృంగారో జ్ఞేయో ధర్మార్థకామకృతః' అని అత డిచ్చిన లక్షణము.[3] ధర్మశృంగారమనగా ధర్మబద్ధమైన శృంగారము. బాహ్య సౌందర్యముచేతనే ఆకృష్టులు గాక, ఆత్మసౌందర్యమును పెంపొందించుకొనుట, తాత్కాలి సౌఖ్యమునుగాక, భవిష్యత్ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొనుట ఈధర్మశృంగార లక్షణములు. సీతారాముల శృంగార మిట్టిదే. అర్థము దృష్ట్యా జరిపినది అర్థశృంగారము. అన్న భార్యకొరకు అన్నను చంపి, ఆమె నేలుకొనుట అర్థశృంగారము క్రిందనే చేరును. దశకుమార చరిత్రలో ఉపహారవర్ధన కథ యిట్టిదే.

ఇక కామప్రధానమైనది కామశృంగారము. రావణుని సీతావ్యామోహ మిట్టిదే. ఈ మూడింటిలో ధర్మశృంగారమే ఆచరణీయ మని భరతాది లాక్షణికులు అభిప్రాయపడిరి.

శృంగార రసమునకు రసరాజ్ఞీత్వమును ప్రసాదించినవాడు భోజుడు. కామము సృష్టికి మూలమైన దను అభిప్రాయము నాధారముగా చేసికొని భోజుడీ సిద్ధాంతమును స్థాపించెను ఉపనిషత్తులలోను కామమే సృష్టికి మూల మని కలదు. ఆత్మసంకల్పమే మిథునముగా రూపొందె నని, సృష్టియంతయు దీని పరిణామమే యని బృహదారణ్యకోపనిషత్తు తెలుపుచున్నది. మహాభారతములో కామస్తుతి

---

3. అర్థ కామ శృంగారములకు భరతు డిచ్చిన వివరణ మిది :

''అర్థ స్వేచ్ఛా యోగాత్ బహుధా చైవార్థతోఽర్థ శృంగారః.

... ... ... ...

కన్యావిలోభనం వా ప్రాప్తం స్త్రీపుంసయోస్తు రమ్యం వా
విప్రతం వాసావే జానీయాత్ కామ శృంగారమ్.''

—నాట్యశాస్త్రము : అధ్యా.28.

కలదు. బ్రహ్మ, ఈశ్వరుడు మున్నగుదేవతల కన్న కామమే ఆదిశక్తియనియు, ఈ స్తుతులలో కలదు. మనువు 'అకామస్య క్రియా కాచిత్ విద్యతే నేహ కర్హిచిత్' అను సూత్రమున కామప్రాబల్యము నుద్ఘాటించెను. భగవద్గీతలో 'ధర్మావిరుద్ధ మైన కామము నేనే' అని ఈశ్వరు డభిప్రాయపడి నట్లున్నది. కామముయొక్క ఈ అధిక్యమును గుర్తించియే భోజుడు శృంగార రస శేఖరత్వమును స్థాపించెను.

అతని సిద్ధాంత మిది :

> ''రసోభిమానోహంకారః శృంగార ఇతి గీయతే
> యోర్థః తస్యాన్వయాత్ కావ్యం కమనీయత్వ మశ్నుతే
> విశిష్టాదృష్ట జన్మాయం జన్మినా మంతరాత్మసు
> ఆత్మ సంయగ్గుణో ద్భూతే రేకో హేతుః ప్రకాశతే.''
>
> —సరస్వతీ కంఠాభరణము.

శృంగారమునకు అహంకారము, అభిమానము, రసము పర్యాయ వాచకములు. ఈ శృంగారమువలననే కావ్యము కమనీయ మగును. ఇది అనేక జన్మల వాసనలఫలితము. సర్వగుణోద్భూతికి ఈ శృంగారమే హేతువు. ఇది భోజుని శృంగార నిర్వచనము. ఫ్రాయిడ్ సిద్ధాంతములకు మూలమైన 'Ego' అనునదే భోజుడు చెప్పిన అహంకారము. అదే అన్నిటికి మూలము. అదే కామము. అదే శృంగారము.

## ప్రేయోరసము :

రాయప్రోలువారు శృంగారమునకు ప్రేమో వాత్సల్యములకు లంకెవేసినారు. అందువలన వీని సంగ్రహ స్వరూపమును నివేదింతును.

రుద్రటుడు తొలిసారిగా ప్రేయోరసమును ప్రతిపాదించినాడు. దండి భామహులు దీనిని అలంకారముగా మాత్రమే గ్రహించిరి. 'స్నేహః ప్రకృతిః ప్రేయాన్' ఇది అతడిచ్చిన సూత్రము. స్నేహము కారణము, ప్రేయస్సు కార్య మని దీని భావము. అనగా స్నేహము స్థాయీభావము, ప్రేయస్సు రసము. మృచ్ఛకటికములో మైత్రేయుడు తన మిత్రుడగు చారుదత్తుని కొరకు ప్రాణ మిచ్చుటకు సిద్ధపడును. ఇక్కడ ప్రేయోరస మున్నది. స్నేహమునకు సాహచర్యము ప్రధానమని రుద్రటుడనెను. యువతీయువకుల ప్రేమయేగాక. మాతాపుత్రుల ప్రేమ, మిత్రుల

మధ్యగల ప్రేమ మున్నగునవి లోకమున ఉన్నవి కాబట్టి శృంగారముకన్న విల క్షణమైన మరియొక రసముయొక్క అవశ్యకమును గుర్తించి రుద్రటుడే ప్రేయో రసమును స్థాపించెను. నిర్వ్యాజమైన నర్మ వాక్కులు, ఆర్ద్రాంతఃకరణము, అన్యోన్య సుహృద్భావము ప్రేయోరస లక్షణములు. ఇవి కేవలము పురుషుల మధ్యనో, స్త్రీల మధ్యనో ఉండనక్కరలేదు. స్త్రీ పురుషుల మధ్య నున్నను అది ప్రేయోరసమే యగును.

**వత్సల రసము :**

వత్సల రసమునకు లక్షణము చెప్పినవారిలో విశ్వనాథుడు ప్రముఖుడు. ఆత డిచ్చిన లక్షణ మిది :

> "స్ఫుటం చమత్కారితయా వత్సలం చ రసం విదు
> స్థాయీ వత్సలతా స్నేహః" —సాహిత్య దర్పణము.

చమత్కారకారి యగుటవలన వత్సలము గూడ రసమని, దానిస్థాయి స్నేహమని విశ్వనాథుని అభిప్రాయము. ఈ రసమునకు పుత్రాదు లాలంబనములు. వారి చేష్ట లును, విద్యా శౌర్యోదయాదులును ఉద్దీపనములు. ఆలింగనము, గాత్రస్పర్శ, శిర శ్చుంబనము, ఈక్షణము, పులకింత, ఆనందబాష్పములు మున్నగునవి అను భావములు. అనిష్టశంక, గర్వము, హర్షము మున్నగునవి సంచారి భావములు. రఘువంశమున రఘుబాల్యము, దిలీపుని వాత్సల్యము, వత్సల రసమునకుదా హరణములు. ఇది పితాపుత్ర సంబంధము. భ్రాత్రాలంబనముగూడ ఈ రసము లోనే చేరును. రామ లక్ష్మణుల ప్రేమ వత్సలరససంబంధియే. వత్సలరసము నకు స్థాయి యేదను విషయమున లాక్షణికులలో భిన్నాభిప్రాయము లున్నవి. మందార మరంద చంపువులో దీనిస్థాయి కారుణ్యము లేక కరుణ యని చెప్పబడి నది. కవికర్ణపూరగోస్వామి 'మమకారము' దీనిస్థాయి యనివ్రాసెను. ఇందుకు యశోదా కృష్ణుల సంబంధము నుదాహరించెను జగన్నాథుడు వత్సల రసము రసము కాదు, భావము మాత్రమే యని అనెను.

కొందరు లాక్షణికులు స్నేహమునుగూడ రస మనిరి. వీరి అభిప్రాయ రీత్యా ఆర్ద్రత దీనిస్థాయి. స్నేహము, వాత్సల్యము మొదలగునవి 'రతి' యొక్క రూపాంతరములే యని హేమచంద్రు డభిప్రాయపడెను. కాని, ఇది ఆలోచించ వలసిన విషయము స్నేహము రతికి రూపాంతర మన్నచో రాము

సుగ్రీవుల స్నేహము శృంగారరస మగును. సోదరప్రేమ రతికి రూపాంతర మన్నచో రామ లక్ష్మణుల ప్రేమ శృంగార మగును. అట్లే వాత్సల్యము రతిభేద మైనచో యశోదా కృష్ణుల ప్రేమ శృంగార మనవలసి వచ్చును. హేమచంద్రుని అభిప్రాయమును నిశితముగా పరిశీలించినచో ఇన్ని విప్రతిపత్తు లున్నవి. వీరి దృష్టిలో వాత్సల్యాదులు కేవలము భావములే కావచ్చును. వీనికి రసత్వసిద్ధికి కావలసిన ఉత్కర్షలేదని వీరి అభిమతమై యుండవచ్చును. కాని, ఇది సమంజస మైనది కాదు యశోదా కృష్ణుల వాత్సల్యము, రామవియోగానంతరము దశరథుని స్థితి రససిద్ధి నందుకోగలిగినంత ఉత్కర్షలేని భావములా ? కావున వాత్సలాదు లకు రసత్వము లేదనుట చెల్లదు.

ప్లేటో ప్రేమసిద్ధాంతము (Platonic Love):

ఆధునిక విమర్శకులు రాయప్రోలువారి అమలిన శృంగారమునకు Platonic Love తో పోలిక యున్నదని అన్నారు. Platonic Love ను గూర్చి వ్రాసినవా రెల్లరును సంయోగ రహితమైన స్త్రీ పురుషుల ప్రేమయే Platonic Love అని చెప్పి ఊరుకొనిరేగాని, దాని మూలతత్త్వము నావిష్కరించలేదు. ప్లేటో ప్రతిపాదించిన సిద్ధాంతములను క్షుణ్ణముగా పరిశీలించి ననే గాని, రాయప్రోలు వారి సిద్ధాంతమునకు దానికి గల సంవాదమును చర్చిం చుటకు వీలుపడదు

Platonic Love ను గూర్చి Encyclopaedia Britannica ఇచ్చిన నిర్వచన మిది :

> "A term commonly applied to an affectionate relation between a man and a woman into which the sexual element does not enter."

ఈ నిర్వచనము స్థూలదృష్టితో చేయబడినది. స్త్రీ పురుషుల మధ్యగల పవిత్రసంబంధమే Platonic Love అని దీని ప్రకారము బోధపడుచున్నది. పలువురు ఈ అభిప్రాయమే ప్రమాణ మని నమ్మిరి. కాని, ఇది సరియైన నిర్వచ నము కాదు. ముందుముందీ విషయము తెల్లమగును.

ఈరాస్ (Eros) గ్రీకుల ప్రేమదేవత.[4] ఈ దేవత ఉదాత్తకార్యములకు ఉన్నతాశయములకు ప్రేరక మని ప్లేటో అభిప్రాయపడెను. ఈ ప్రేమ రెండు

4 క్రమముగా ఈ పదము ప్రేమకు పర్యాయమై పోయినది.

విధములు : ఒకటి 'Eros of Aphrodite Pandemos' పురుషుడు స్త్రీ సౌందర్యమును వలచుట ఈ శ్రేణికి చెందిన ప్రేమ. రెండవది 'Heavenly Aphrodite.' ఇది పురుషుల మధ్య ఉండెడి ప్రేమ. శరీరమునకు బదులుగా ఆత్మనిష్ఠమైన ప్రేమ. ఒకేజాతికి చెందిన మానవుల Homo-Sexual లోనే పవిత్ర ప్రేమ సాధ్యమగునని, వీరికి శారీరక సంయోగ ప్రసక్తి లేదని ప్లేటో తెలిపెను. అయితే వీరిలో గూడ (ముఖ్యముగా పురుషులలో) సంయోగవాంఛ కలుగవచ్చునని, దానిని దమించుకొనుట వారి కర్తవ్యమని, Homo-sexual సంబంధము తుచ్ఛ మని తన 'రిపబ్లిక్' అను గ్రంథమున ఖండించెను. ప్రేమకు ఆత్మనిగ్రహమెంత అవసరమైనదో ఈ విధముగా ప్రవచించెను :

> "In addition Love is richy endowed with self-control. Every one admits that self-control is mastery over pleasures and desires, and that no pleasure is stronger than Love."[5]

ఈ వాక్యములలో ఆత్మనిగ్రహము వలన సాధ్యమగు ప్రేమ అన్నిటికన్న శ్రేష్ఠమని ప్లేటో అభిప్రాయపడెను.

ప్లేటో దృష్టిలో స్త్రీ పురుషులు సమానులు (Equals) కారు. అందుచేత సమానులుకానివారిమధ్య ప్రేమసంబంధము నీతడు నిరసించెను. ఇతనికి ముందు సమాజములో స్త్రీకి గౌరవస్థానము లేదు. ఇతడు స్త్రీలకు 'సమాన హక్కు' లను కోరినను, లైంగిక సంబంధమైన విషయములందు మాత్రము స్త్రీపురుషుల సమానత్వమును గుర్తించలేదు. పైగా స్త్రీ పురుషుల మధ్య అక్షయప్రేమ ఉండుటకు వీలులేదని భావించెను. స్త్రీపురుషులు కేవలము సంతానార్థము సంబంధము జరుపుకోవలె నని అభిప్రాయపడెను.[6] ఈవిధమైన స్త్రీపురుషసంయోగము సృష్టి ప్రయోజనము మాత్రమే కలదని, ఇది ఉదాత్తాశయములు సాధించునది కాదని, జీవితమును ఉన్నతపథమున నడుపు ఆత్మైక్యము(Union of the souls)

---

5. 'Symposium' అను గ్రంథములో.
6. "The actual Law which he (Plato) proposes, in consequence, forbids homo-sexual relations altogether, and allows intercourse only with the woman by whom one intends to have a child."
—Plato's Thought by G.M.A, Grubbe.

స్త్రీ సాంగత్యముతో సాధ్యము కాదని, ఒక పురుషునికి సమానస్కంధు డైన (Equal) మరియొక పురుషుని సాంగత్యముతోనే ఇది సాధ్యమని ప్లేటో స్పష్ట పరచెను. స్త్రీ శారీరక సౌందర్యము పురుషుని అధఃపతితునిగా చేయునని, అందువలననే శారీరకప్రేమ తుచ్ఛమైనదని ఈతడు నిరసించెను.

> "The bad man is the common or Vulgar Lover, who is in love with the body rather than the soul, he is not constant because what he loves is not constant; as soon as the—Flower of physical beauty which is what he loves, begins to fade, he is gone even as a dream and all his professions and promises are as nothing." —Symposium.

ప్లేటో కాలమునాటి సాంఘికవ్యవస్థ అతని అభిప్రాయములపై ప్రధాన ప్రభావము వేసినది. ఆనాట సమాజమున స్త్రీకి పురుషునితో సమాన ప్రతిపత్తి లేకపోవుట, సైనికులు తప్ప విజ్ఞానులు మేధావులు స్త్రీతో లైంగిక సంబంధమును నిరసించుట- ఈ రెండంశముల ప్రభావము ప్లేటో ప్రణయతత్త్వముపై పనిచేసి యుండవచ్చును. ఇందు కాతని జీవితము గూడ తోడైనది. ప్లేటో తన జీవిత ప్రారంభదశలో సైనికుడుగా ఉండెడివాడు. తర్వాత తాత్త్వికుడుగా మారినాడు. అతని గురువగు సోక్రటీసు మరణానంతరము ప్లేటో తత్త్వచింతనలో పడి ఒక పీఠము స్థాపించి గురుపదవి నధిష్ఠించెను. అందువలన అతని జీవితములో ఎన్నడును స్త్రీ సాంగత్యమునకు వీలు కలుగలేదు. అతడు ఏ స్త్రీని ప్రేమించినట్లు ప్రమాణములు గూడ లేవు. అందుచేతనే ప్లేటో స్త్రీసాంగత్యము నంత హేయముగా చిత్రించెను. ఏది యెట్లున్నను స్త్రీపురుషుల మధ్య ఉదాత్తప్రేమ ఉండుటకు వీలులేదను విషయము విచారింపదగినది. పురుషుడు స్త్రీ కలసి యున్నప్పుడతడు శారీరక సౌందర్యమును జూచి స్పందింపక తప్పదని, పురుషుడు పురుషుడు కలిసి యున్నప్పుడు దీని కవకాశము లేదని ఒక భావ మేర్పరచుకొని, ఆయన స్త్రీపురుషులప్రేమను తిరస్కరించినట్లున్నది.

పురుషుల శరీర సౌందర్యమును గూడ ప్లేటో అల్పముగానే భావించెను. అయితే బాహ్యసౌందర్యము నందుకొనుటకు సాధ్యమైనచో క్షంతవ్య మని అభిప్రాయపడెను. సోక్రటీసు గూడ ఈవిధముగానే భావించెను, సోక్రటీ సొకమారు

అందమైన ఒక యువకుని చూచి, 'ఈ అందమైన శరీరమునకు తగినట్లుగా అందమైన ఆత్మ యున్నచో ఎంత బాగుండు' నని అన్నాడట. సాధారణముగా యువకుడు మొదట ఒకానొక వ్యక్తి ఆంగిక సౌందర్యమునకు ముగ్ధుడై ప్రేమించసాగునని, క్రమముగా దానిని దాటి ఆత్మసౌందర్యమువైపు మొగ్గుచూపు నని ప్లేటో అన్నాడు.[7] ఈ ఆత్మసౌందర్యమే దివ్యసౌందర్యము (Divine Beauty) అని, ఆత్మసౌందర్యోపాసనము వికసిత హృదయులకు,పరిణతబుద్ధులకు మాత్రమే సాధ్యమని, ఆ వ్యక్తులు గూడ పురుషులైనప్పుడు మాత్రమే సంభవ మని ఈతడు సిద్ధాంతీకరించినాడు.

ప్లేటో ప్రతిపాదించిన ఈ ప్రేమసిద్ధాంతము రినైజాన్సు యుగమున కొంతవరకు అవహేళన పాలైనది. ఐతే క్యాస్టిగ్లియాన్ (Castiglione) మున్నగు విజ్ఞానులు సరిక్రొత్త వ్యాఖ్యానముతో దీనిని నిలబెట్టుటకు ప్రయత్నించిరి. ఇంద్రియశర్పణమొనర్చు సౌందర్యమునుండి ఆత్మికమైన సౌందర్యమువైపు, ఆత్మికసౌందర్యమునుండి ఆధ్యాత్మికసౌందర్యమువైపు మానవుని నడిపించు మహత్తరశక్తియే Platonic love అని వీరు వెనుకటి అభిప్రాయమునకే వెల్లవేసి చూపిరి ఉత్తమప్రేమికుడు తాను ప్రేమించిన స్త్రీతో Intellectual గా తాదాత్మ్యమును పొందవలె నని, అందుకు చుంబనము చక్కని సాధన మని క్రొత్త సిద్ధాంతము లేవదీసిరి.[8] వీరు చుంబనమును శారీరకమైన క్రియ గాక ఆత్మైక్యమునకు సాధన మని చెప్పుట విచిత్రముగానే యున్నది. Platonic Lover యువకుడుగా ఉండరాదని కూడ క్యాస్టిగ్లియాన్ అభిప్రాయపడెను. అరువది మూడేండ్ల వయస్సుగల మైకెలేంజెలో (Michelangelo) నలుబది యేండ్ల విక్టోరియా కొలోనా (Victoria Colonna) అను స్త్రీని ప్రేమించుట Platonic Love కు ఆదర్శమని ఈత డనెను. ఈ Platonic Lover తరుణవయస్కుడైనచో శారీరకవాంఛావలయమును దాటిపోవలె నని ఈతడు సూచించెను.

7. "The next stage is for him to reckon beauty of soul more valuable than beauty of body." —Symposium.

8. "For the Kiss, says Castiglione, is rather of soul than body, since it has power to draw the soul to itself and separate it from the body."— 'The Religion of Beauty in women' by J B. Fletcher.

ఈ వాదము ప్రకారము స్త్రీ పురుషుల మధ్య పవిత్ర రాగబంధ ముండుటకు వీలున్న దని తెలిసినది. ఇది ప్లేటో ప్రతిపాదించిన సిద్ధాంతమునకు భిన్నమైన దని స్పష్ట పడినది. ప్లేటో సిద్ధాంతమునకు భిన్నముగా క్యాస్టిగ్లియాన్ ప్రభృతులు చేసిన సిద్ధాంతమే Platonic Love అగు ననెడి అభిప్రాయము రాను రాను ధృవపడినది. క్రమక్రమముగా పదునేడవ శతాబ్దిలో ఇది పరిహాస పాత్రమైపోయినది జాన్ క్లీవ్‌ల్యాండ్ (John Cleaveland) అను కవి 'Platonic Love is nothing else but merely melancholy" అని విమర్శించెను సక్లింగ్ అను రచయిత ఎగ్లోరా (Aglaura) అను నాటకమున Platonic Love ను ఎగతాళి చేయుటకు ఒక పాత్రచేత ఇట్లనిపించెను: "A mere trick to enhance the Price of Kisses etc."[9].

ఈ విధముగా Platonic Love రాను రాను ఎగతాళి పాలైనను కొందరు మహాకవు లీ సిద్ధాంతమునకు లక్ష్యము లనదగిన కావ్యములు సృష్టించిరి. డాంటే వ్రాసిన Divine Comedy లో, స్పెన్సరు వ్రాసిన Four Hymnes లో ఈ సిద్ధాంతచ్ఛాయలే యున్నవి. స్పెన్సరు Hymne in Honour to Beauty లో ఇంద్రియాతీత ప్రేమ, Hymne to Intellectual Beautyలో ఆత్మ పరమాత్మల సమైక్యము నిరూపింపబడినది. సానెట్లలో గూడ ఈ సిద్ధాంతమే తొంగిచూచుచున్నది. షెల్లీ ప్రేమతత్త్వములో దీని ఛాయ లున్నవి.

*అమలిన శృంగార చర్చ :*

రాయప్రోలువారు ఆశ్రమములన్నిటిలో గృహస్థాశ్రమ ధర్మమువైపే మొగ్గు చూపిరి. మంత్రమహిమానుభూతి కలిగి తురీయాశ్రమము నవలంబించు బ్రహ్మర్షి గణము, 'సీతిబాహాబలస్ఫూర్తి'తో క్షాత్రధర్మము చేపట్టు నృపకులము ప్రేమ సూత్రమును విడిచినవారు కారు. యాజ్ఞవల్క్యాదులగు బ్రహ్మర్షులు, జనకాది రాజయోగులు గృహస్థాశ్రమ ధర్మను నిర్వర్తించినవారే, అనగా వారును శృంగారము నాశ్రయించినవారే. శృంగారము గృహస్థాశ్రమ ధర్మములలో

9. విలియం కార్ట్‌రైట్ అను కవి ఒక గీతములో ఇట్లు పరిహసించెను.
"I climbed from sex to soul, from soul to thought
But thinking there to move,

Headlong I rowl'd from thought to soul, and then
From soul I alighted at the sex again"

ముఖ్యమైనది. కాబట్టి రాయప్రోలువారు గృహస్థాశ్రమధర్మమును పైకెత్తిరి. తైత్తిరీయోపనిషత్తులో 'ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః' అని యున్నది. ఈ ప్రజా తంతువును అవిచ్ఛిన్నముగా కొనసాగించుటకు గృహస్థాశ్రమమే కదా మూలము! కాళిదాసు గూడ రఘువంశమున 'ప్రజాయై గృహ మేధినాం' అని ఈ ధర్మమునే బలపరిచెను. గృహస్థాశ్రమములో సంతానము కొరకు శృంగారమును నిర్వర్తించుట రాయప్రోలు వారికని సమ్మతమే. సంభోగ విధి 'సుప్రజాతంత్ర నిర్వాహ సూత్ర' మగుట వలన దానిని దంపతీనిష్ఠ ధర్మముగా భావించుచున్నారు. కాని, శృంగారమునకు సంయోగమే యన్న భావమును వీ రంగీకరించలేదు. కారణ మేమనగా సంభోగవిధి విషయమయమైనది. అది కార్యము. కార్య మెప్పుడును అక్షయమైనది కాదు కాబట్టి దంపతీనిష్ఠ మైనప్పు డీసంభోగశృంగారము సమాదరణీయము కాని, 'నవ్యాల' దృష్టిలో 'అక్షరానందసిద్ధి' దృష్టిలో అది అప్రధాన మనిరి. ఇందుకు వారు పండితరాయలు వ్రాసిన 'మూఢాస్సంభోగ మిచ్ఛంతి' అను శ్లోకమును తెలుగులో అందించిరి. ఇచట మూఢులనగా మూర్ఖులను వ్యావహారికార్థము కాదు. మోహబద్ధు లని అర్థము. మోహమతులు కేవలము సంయోగము నిచ్ఛగింతురు. తాను మాత్రము 'వియోగ మాధుర్య లీలా విపాక మనుభవింప నల్లాడెద' నన్న పండితరాయల భావమును తనదిగా ప్రవచించినారు రాయప్రోలువారు ఈ యమలిన సౌందర్య (శృంగార) సమర్చనమే తమ ధ్యేయ మని వీరు వక్కాణించినారు. ఈ భావమునకు ఉపశ్రుతివంటి దిది:

> ''సురతసంస్పర్శ లేని ఈ శుచి మదమల
> జీవితానురాగాదులన్ చిలరించు
> కానరాని శృంగారము—" (రమ్యా)

''శృంగారః శుచి రుజ్జ్వలః'' అన్న ప్రాచీనుల సూక్తియే వీరి అమలిన శృంగారమున కాలంబనము. శృంగారము సంయోగములో వికారము నొందును కాబట్టి దానిని వీరు పరిగణించలేదు. ప్రాచీనులు 'రతి'ని సంభోగ శృంగారమునకు స్థాయిగా పేర్కొనిరి, 'రతి'యనగా సురతమని స్థూలముగా వ్యవహారార్థ!మున్నది. దీనిని వీ రొప్పుకొరు రతి వేరు ' సురతము వేరు. సురత మనగా స్త్రీ పురుషుల లైంగిక సంబంధము. రతి 'రమ్' ధాతువునుండి వచ్చినది. 'రమ్' (క్రీడాయాం) అనగా ఆనందించుట యని అర్థము. యోగులు ఆత్మారాములు అనగా ఆత్మరతి కలవారు. వైదిక సాహిత్యమున 'రతి' ఆనందపరముగానే యున్నది. భగవద్గీత

లోను ఈ యర్థములోనే యున్నది. 'యస్త్వాత్మరతి రేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః'-ఆత్మరతునికి కర్తవ్యా కర్తవ్యములు లేవని దీని తాత్పర్యము. రాయప్రోలువారు దీనిని ఈ యర్థములోనే గ్రహించిరి. మాధురీదర్శనములో 'రతి' స్వరూపమును చర్చించిరి. వైష్ణవమతములోని 'మహామాధురీభావము'సు దృష్టిలో పెట్టుకొని దీనిని సమర్థించిరి. ఇందుకు నన్నయ వ్రాసిన 'శ్రీవాణీగిరిజాశ్చరాయ' అను శ్లోకములోని 'స్త్రీపుంసయోగము'ను సరిక్రొత్తగా వ్యాఖ్యానించిరి. స్త్రీపుంస యోగ మనగా కేవలము సంయోగము కాదు. సాయుజ్యయుక్తి. ఈ యర్థములో గ్రహించి స్త్రీపురుష సంయోగమునకు యోగ ప్రతిపత్తి భాసింప జేసినారు వీరు. ప్రాణులకెల్లను రతి సర్వాంగీణమై విలసిల్లునని, కాని అది అమలినమై 'కళ్యాణ పరమ వర్చస్కధురీణమై' మహామాధురీభావము నందుటకు (ఆత్మలు లయమగుటకు) పీ లెక్కడున్నదని వీరు ప్రశ్నించిరి. రతి చిత్పదార్థము. అది మొదట బీజప్రాయముగా నుండి క్రమక్రమముగా విస్ఫుటించి, పల్లవించి, కుసుమించి, ఫలించునని వీరి అభిప్రాయము. 'తరుణోదయ' (యౌవనోదయ) కాలమున అది పయోధరసుందరమై కామాభిముఖముగా నున్నను, క్రమేశః 'మిథు బంధ' మున 'నిర్జర పరిణతి' గొనునని వీ రనిరి. మొదట 'అంగజ ధర్మ కలాపము'గానున్న 'రతి' అనంగ పరానంద శోభనస్ఫూర్తి' పొందుననిరి. అనగా ప్రాథమిక దశలోని కాయసంబంధమైన విషయకలాపము, అనుభావాదులచేత ఉత్తుంగమై, తుదకు అశరీరమైన పరానందములలో లీనమగును. సూక్ష్మసుందరములై మనస్సులో ద్రవించిన 'ద్రవరతులు' (Emotions) అశరీరమైన మథనములో బడి అమృతస్థితిని పొందునని, అదే ఆనందమని వీరి అభిప్రాయము.

ఈ విధముగా 'రతి'కి 'సురతము'నకు వీరు భేధము పాటించిరి. సురత స్పర్శలేని శుద్ధమైన అనురాగము గల 'అబోధ శృంగారము' సర్వోత్తమమైనదనిరి. అయితే దంపతులలో సురతస్పర్శలేని శృంగారము ఎట్లుండునను ప్రశ్న జనించును. ప్రజాతంతువు కోసమేకదా గార్హస్థ్యము ! సంయోగము లేనిది అది యెట్లు సాధ్యమగును ? వీరు ప్రజాతంత్వర్థము దంపతుల సంయోగసిద్ధిని సమర్థించినవారే. అయినను అది యొక అవస్థకు మాత్రమే పరిమితమైయుండవలె నని క్రమక్రమముగా ఉత్తమ సంస్కారముగల దంపతులు శరీర విముక్తమైన సౌందర్యమును అర్చించవలె నని వీరి అభిప్రాయము. వయసు గడచిన కొలది వారి శృంగారము స్నేహపర్యవసాయి కావలె నని వీరి అభిమతము. కాలము గడ

చిన కొలది భార్యాభర్తల సంబంధము కేవలము స్నేహాత్మకముగా పరిణమించు నన్న భవభూతి భావమునే వీరు గ్రహించిరి.[10]

శృంగారమునకు రెండు దశ లున్నవి. ఒకటి సంయోగము, రెండవది వియోగము. ఈ రెంటిలో వీరు వియోగమునకే ప్రాధాన్యము నిచ్చిరి. ఇది ఎంత వరకు సమంజసము ? లాక్షణిక దృష్ట్యా వియోగ మన్నది ఒక అవస్థయే కాని, గమ్యమో లక్ష్యమో కాదు. 'నవినా విప్రలంభేన సంయోగం పుష్టి మశ్నుతే' అని కదా లాక్షణికోక్తి. విప్రలంభము లేనిదే సంయోగమునకు పుష్టి కలుగదని దీని తాత్పర్యము. భంగ్యంతరముగా ఇందులో సంయోగమే లక్ష్య మని చెప్పబడినది.

కాళిదాసు వియోగములోనే ప్రేమ రాశీభూత మగునని చెప్పెను.

''స్నేహో నాహుః కిమపి విరహో హ్రాసినస్తేహ్య భోగా
దిష్టేవస్తు న్యుపచితరసాః ప్రేమ రాశీ భవంతి."

—మేఘ సందేశము.

దీనినే రాయప్రోలువారు

''సరస సాంగత్య సుఖ వికాసములకన్న
దుస్సహవియోగభరమె మధురము సకియ''

—తృణ కంకణము.

అని చెప్పిరి. అయితే కాళిదాసాదులు చెప్పిన వియోగము ఎప్పుడో ఒకప్పుడు సంయోగమునకు దారి దీయునదే. రాయప్రోలువా రట్లుగాక వియోగమునకే చరమ స్థాయి కలిగించినారు. అయితే వీరి విప్రలంభము విరక్తికి సన్నిహితమైనదికాదు.

''కనుల నొండొరులను జూచుకొనుటకన్న
మనసు లన్యోన్య రంజనల్ గొనుటకన్న
కొసరి 'యేమోయి' యని పిల్చుటకన్న
చెలుల కిలమీద నేమి కావలయు సఖుడ !''

అని తృణకంకణ నాయికచేత వీరనిపించిరి. దీనినిబట్టి చూడగా వీరు ప్రతిపాదించిన వియోగము శరీరస్పర్శ లేనిదిమాత్రమే యని తెలుసు, లాక్షణికులు దశా

---

10. ''కాలే నావరణాత్యయాత్ పరిణతే యత్ స్నేహసారేస్థి తః
భద్రంతస్య సుమానుషస్య కథమప్యేకం హితత్ ప్రాప్యతే.''
—ఉత్తర రామ చరిత్రము.

వస్థలని చెప్పిన 'చక్షూరాగ మనస్సంగా'దులలో వీరు చక్షూరాగము మనస్సంగ మము, ప్రలాపము (పిలుపు) ధ్యేయములని చెప్పిరి. పూర్వసంప్రదాయములో ఇవి సంయోగశృంగారమునకు సోపానముల వంటివి మాత్రమే. వీనికి ప్రాధాన్య మిచ్చుటలోనే వీరి ప్రత్యేకత యున్నది. వీరి కావ్యములలో తృణకంకణము ఈ యమలిన శృంగారమునకు ముఖ్యగ్రంథము. ఇందులోని యితివృత్త మిది. ఇరువురు యువతీయువకులు చిననాటినుండి ప్రేమించుకొందురు. విధివశాత్తున వా రిరువురికి వివాహము జరుగలేదు. వారిలో యువతికి మరియొక పురుషునితో పరిణయమైనది. యువకుడు భగ్నాశుడై ఆమెను ధ్యానించుచునే కాలము గడుపు చుండును. వా రిరువురు కలిసికొన్నప్పుడు వారిలో ఏమాత్రము కామవికారము గాని, సంయోగకాంక్షకాని కలుగదు. విధికి విలపించుటయే తప్ప వీసమెత్తయి నను వారు మనోవికారములకు లోనుగారు. దర్శన భాషణములతో మనస్సులలో ఒండొరుల స్మరించుకొనుటతో జీవితమును గడిపివేయుటకు నిశ్చయించుకొం దురు. యువకుడు వివాహము చేసుకోక అట్లే ఉండిపోవును. ఆ ఇరువురి మధ్య వెనుకటి చెలికారము మరింత పక్వమైనది. ఇరువురు అనుభవించినది వియోగ మునే. ఆ వియోగబాధలోనే ఒక మాధుర్యమున్నదని, ఆ మాధుర్యమునే వారు జీవితమంత అనుభవింతురని రాయప్రోలువారి సిద్ధాంతము.

వీ రీ సిద్ధాంతమును లేవదీయుటకు రెండు కారణములు ఊహ కందు చున్నవి. ఒకటి: ప్రబంధకావ్యములలో ప్రాయికముగా స్త్రీ భోగ్యవస్తువుగా చిత్రింపబడినది. కచ కుచ వర్ణనలతో కవులు తృప్తిపడక నాభిని, నూగారును, వళులను గూడ వర్ణింపసాగిరి ఈ ధోరణి తత్పూర్వకావ్యములలో సైత మున్నను ముఖ్యముగా ప్రబంధ క్షీణయుగములో 'వేలము వెర్రి'గా మారిపోయి నది. రాజకుమారి కనిపించగానే రాజకుమారునికి మరులు పుట్టును. ఆమెకు అట్లే జరుగును. ఫలితము విరహజ్వలనము. తదనంతరము శైశిరోపచారములు, దౌత్యము, పరిణయము, సంతానప్రాప్తి. ఈ విధముగా స్త్రీని కేళివస్తువుగా పరిగ ణించుట రాయప్రోలువారికి బాధాకరముగా తోచినది. రెండవది: నాటి సమాజ మున అప్పు డప్పుడే ఆంగ్ల విద్యా నాగరికతల సంపర్కమువలన నూతన భావ ములు వీవసాగినవి. 'కాలేజీ విద్యల' వలన యువతీయువకులు పరస్పరము చూచుకొనుటకు, మాటాడుకొనుటకు, కలిసి తిరుగుటకు వీలు చిక్కినది. వారు ఒకరి నొకరు ప్రేమించుకొనసాగిరి. సమాజములో ప్రాచీన విశ్వాసము లింకను

పెళ్ళగిల్లిపోలేదు. నవీన భావములు స్థిరపడలేదు. వానిపై పెద్దల ముద్ర పడ లేదు. ఒకరకముగా ప్రాచీన నవీన భావములు ఘర్షణస్థితిలో నున్న సంధియుగ మది. ఈ స్థితిలో యువతీయువకుల స్వచ్ఛందప్రేమ ఎన్నో ప్రతిఘాతములకు దారి తీసినది. నాటి కులపతవర్ణవ్యవస్థ వారికి అడ్డు నిలిచినది. తత్పర్యవసాన ముగా వారి ఆశలు నడుమంతరముననే అడుగంటినవి. కొందరు సాహసులు తెగించి ముందు కడుగు వేసిరి. సాంఘికవ్యవస్థకు ప్రతికూలముగా తిరుగుబాటు చేసిరి. ఫలితము, వారి జీవితములు చితికిపోవుట. ఈ విధముగా నాటి సమాజ ములో ప్రేమ సిద్ధాంతమువలన కలుగుచుండిన దుష్పరిణామములను గమనించి రాయప్రోలువారు దీనికి పరిష్కారముగా 'అమలిన శృంగార' తత్త్వమును, వియోగాధిక్యమును సిద్ధాంతీకరించిరి. వట్టి మాటలతో చెప్పక గట్టి కావ్యముల ద్వారా నిరూపించిరి. స్త్రీని కేవలము భోగ్యవస్తువుగా చిత్రించిన ప్రాచీనవ్యవ స్థను, కట్టుత్రెంచుకొనిపోవు యువతీయువకుల నవీన ప్రేమావస్థను అదుపులో పెట్టుట కీసిద్ధాంతమును స్థాపించిరి. ఈ దృష్ట్యా చూచిననేకాని వీరి సిద్ధాంత ముల సారస్యము సుబోధము కాదు.

ఇక ప్లేటో ప్రేమసిద్ధాంతమునకు, వీరి అమలిన శృంగారమునకు గల తారతమ్యము పరిశీలింతము. ప్లేటో దృష్టిలో స్త్రీ పురుషుల ప్రేమ నిషిద్ధ మని ఈవరకే తెలిపియుంటిని. ఈ విషయములో వీరు పరస్పర భిన్నమార్గములలో ఉన్నారు. రాయప్రోలువారు సంభోగశృంగారము అప్రధాన మని యన్నను స్త్రీని తుచ్ఛముగా చూడలేదు. పైగా స్త్రీని పురుషునికన్న ఒకమెట్టు ఎత్తుగానే చూచిరి. వీరి కావ్యములలోని పాత్రలలో స్త్రీలకే ప్రాధాన్యమున్నది. వారినే ధీరస్వాంతు లుగా సహనమూర్తులుగా, త్యాగజీవులుగా చిత్రించి, పురుషులకన్న వారిని ఉన్నత పీఠము అధిష్ఠింపజేసినారు కాబట్టి ఈవిషయములో వీరికిని ప్లేటోకు ఏమాత్రము, పోలికలేదు. ప్లేటో స్త్రీ పురుషులమధ్య ఆత్మసంబంధమైన ఐక్యమునకు వీలులేదని స్త్రీతో చెలిమి చేసినచో ఆమె శరీరసౌందర్యమునకు లోబడక తప్పదని, అందు వలన స్త్రీ పురుషుల స్నేహమున కర్థములేదని అన్నాడు. రాయప్రోలువారు దీనికి భిన్నాభిప్రాయము ప్రతిపాదించిరి. ప్రకృతికి ప్రతినిధి స్త్రీ. ఆమె అవస్థా భేద మునుబట్టి ప్రేయసిగా, ఇల్లాలుగా, భగినిగా, 'సహచారి'గా, జననిగా రూపొందు నని, 'పురుషవృషభము'ల అంతరంగములను మసృణీకరించునది స్త్రీయే యని రాయప్రోలువారి విశ్వాసము. పైగా వీరి కావ్యములలో నాయికా

నాయకులు సమానస్థాయిలో నుండి స్నేహము నెరపినవారు. కాబట్టి ఈ విషయములోను వీరికి ప్లేటోకు పోలిక లేదు ఇక ఉన్న సామ్య మొక్కటే. శారీరక సౌందర్యముకన్న ఆత్మసౌందర్యము గొప్పది. ఆంగికసంయోగము కన్న ఆత్మల సంయోగము గొప్పది. ఈ తత్త్వమును ఇరువురు ఇంచుమించుగా ఒకే విధముగా ప్రతిపాదించిరి. అంతమాత్రముననే వీరి 'అమలిన' శృంగారము (Platonic Love) ఒక్కటే యనుటకు వీలులేదు. పైగా మూలతత్త్వములోనే ఈ రెండింటికి ఎంత భేద మున్నదో పైన నిరూపింపబడినది.

ప్లేటో ప్రేమ సిద్ధాంతముగాని, మన ప్రాచీనుల శృంగార రసతత్త్వముగాని సాధింపని మరియొక సిద్ధాంతమును రాయప్రోలువారు ప్రతిపాదించిరి. అదే శృంగార ప్రేయో వాత్సల్యాది రసముల విచిత్ర సమీకరణము. శృంగారమునకు శుచి యను నామాంతర మున్నది. శుచి యనగా జుగుప్సాది విరహితమై ప్రకాశించునది అని అర్థము కదా. ఈ విశాలమైన అర్థములో రాయప్రోలువారు స్నేహమును, వాత్సల్యమును, శృంగారమునకు రూపాంతములుగా గ్రహించిరి. శృంగారమునకు మమత, ప్రేమ, అనురాగము, ప్రణయము, స్నేహము మున్నగు అనేకార్థములను భావించుకొనిరి. ద్వేషాభావ మైన సర్వ ప్రవృత్తులను 'శృంగార' వలయములోనే చేర్చుకొనిరి. స్నేహ సురత వాత్సల్యములు ప్రేమకు అంగములని, ప్రేమయే అంగి యని అనిరి (రమ్యాలోకములో). ప్రేమ శబ్దమును శృంగార పర్యాయముగానే గ్రహించిరి.

> "విప్రలంభ సంభోగముల్ విస్తరించి
> సంగ్రహించిరి శృంగారశాఖ లయిన
> స్నేహ వత్సలాదుల; నతి స్నిగ్ధహృదయు
> లగు కవుల కిపు డవి వరేణ్యంబు లయ్యె." —రమ్యాలోకము.

అను పద్యములో శృంగారమునకు స్నేహ వత్సలాదులు అంగము లని (శాఖలని) స్పష్టముగా తెలిపిరి. ఇది అలంకారశాస్త్రదృష్ట్యా పరిశీలించినచో నిలుచు సిద్ధాంతముకాదు. అందుకే వారే దీనికి క్రొత్త వ్యాఖ్యానము కల్పించుకొనిరి. శృంగారమునకు స్థాయీభావమైన 'రతి'ని ప్రాచీన లాక్షణికు లన్నట్లుగా సంయోగము, కామము అను అర్థములలో గాక, చిత్పదార్థము, ఆనందబిందువు అను అర్థములలో వీరు స్వీకరించిరి. శృంగారమునకు ఆనందరూపాంతరమైన 'రతి'ని స్థాయిగా స్వీకరించినప్పుడు ప్రేయోవాత్సల్యాదులు శృంగారవలయములోనే వచ్చి చేరునని వీరు భావించిరి

ఈ విధముగా సరిక్రొత్త వ్యాఖ్యానములతో రాయప్రోలువారు తమ సిద్ధాంతమును నెలకొల్పిరి. తల్లికి పుత్రుని గండచుంబనముతో కలిగెడు పులకరింపు ఒక రకమైన శృంగారమే యని వీరి భావము. పూర్వావస్థలో అనగా పురుషసాంగత్య దశలో తరుణి పొందలేని అక్షరానందమును శిశుచుంబనాదులలో పొందు నని వీరి అభిప్రాయము. దీనిని వీరు పుత్రశృంగార మని యన్నారు. తల్లి పసివాడైన తన పుత్రునిముందు గూడ వక్షోజములపై పైట లేకుండ ఉండ లేదు. ఈ లౌకిక సత్యములోని ఔచిత్యమును వీరు తమ సిద్ధాంతమునకు సమన్వయింపజేసిరి. ''స్నానమాడి, పెన్నెరుల జార ముడిచి, నొసట కుంకుమ పాదాల పసుపు మెఱయ'' తెల్లని వలువ ధరించి తులసిపూజ చేయు మాతృమూర్తి ధీరమంగళరూపము మాతృశృంగారమనిరి. ఈ దృష్టితో చూచినచో శంకరాచార్యులవారు దేవీ స్తనకలశములను వర్ణించుట మాతృశృంగారమే అనవలసి వచ్చును. భువనసమ్మోహనుడైన పురుషుని జూచి 'ఇతని కే తల్లి పాలిచ్చినదో' యని జనులకు కలిగెడు భావములో మాతృ శృంగారమే తొంగిచూచుచున్న దని వీ రభిప్రాయపడిరి. స్త్రీ పురుషుల మధ్యగాని, లేక ఏకలింగమునకు చెందిన వ్యక్తుల మధ్యగాని ఉండెడు సురత ప్రసక్తిలేని స్నేహభావమును వీరు స్నేహ శృంగార మనిరి- రతి దేవతాపరమైనచో భావ మని మన లాక్షణికుల అభిప్రాయము.[11] రాయప్రోలువారు దీనినే ఆప్తశృంగార మనిరి. దేవతలు ఆప్తకోటిలోనివా రేకదా! ఇక సోదరీసోదరుల నడుమ గల ప్రేమ భావమును వీరు సోదరీ శృంగార మనిరి. ఈ విధముగా శృంగారపరిధిని విస్తరింపజేసి, సమస్తద్వేషా భావ ప్రవృత్తులను, ఆనంద మూలకములైన భావములను శృంగార రసములో పర్యవసించునవిగా నూత్న సిద్ధాంతమును స్థాపించిరి. అయితే Platonic Love వలె వీరి తర్వాత ఈ అమలిన శృంగారము అవహేళన పాలు కాలేదు. అంతగా ఆదరింపబడలేదు గూడ. నాయని,కృష్ణశాస్త్రి,వేదుల ప్రభృతుల వియోగ శృంగార కీర్తనముపై వీరి ప్రభావ మున్నది. అంతేగాని వీరివలె 'అమలిన శృంగారము'ను సమర్థించు కావ్యములు వారు వ్రాయలేదు. ఈ సిద్ధాంతములోని గుణాగుణముల కేమిగాని,అమలిన శృంగార మను పేర సరిక్రొత్త ప్రయోగము చేసిన గౌరవము మాత్రము రాయప్రోలువారికి దక్కినది. అభినవ కవితకు ఆచార్య సదృశులు రాయప్రోలువారు.

—ఆంధ్రపత్రిక
శోభకృతు సంవత్సరాది సంచిక
ఏబదినాల్గవ సంచిక (1963-64)

11. ''రతిర్దేవాది విషయవ్యభిచారీ తథాంచితః భావః ప్రోక్తః''
—కావ్య ప్రకాశము.

# ఆంధ్ర గ్రంథవిమర్శన ప్రకారలేశము

—మహోపాధ్యాయ, 'కళాప్రపూర్ణ' శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

కామాన్ దుగ్ధే ఆవిర్భూత

సాహిత్యమీమాంసయే కావ్యవాఙ్మయ విమర్శవిద్యకు మూలాధారము.

మనదేశమం దచ్చు లేనందునను, పృథ్వి (ఇండియా) అతివిపుల యగుటయు, షట్పంచాశద్దేశములనుడింయు కావ్యవాఙ్మయ ముప్పతిల్లుచునే యుండుటచేతను, సంస్కృతవాఙ్మయవిషయములో మనపూర్వులు ప్రత్యేకకావ్యవిమర్శలు వ్రాయరైరి. మఱి యెల్లకావ్యముల గుణదోషములను ఎఱుంగుటకు సాధనమయిన శాస్త్రమును రచించినారు. అదియే సాహిత్యమీమాంస. అదియే మనకు కావ్యప్రకాశము, భావప్రకాశము, సరస్వతీకంఠాభరణము, సాహిత్యచింతామణి, కావ్యానుశాసనము, కావ్యాలంకారము, కావ్యాదర్శము, రసార్ణవము, సాహిత్యరత్నాకరము, రసార్ణవ సుధాకరము, ప్రతాపరుద్రీయము, సాహిత్యదర్పణము ఇత్యాదిగ్రంథరూపమున లభించియున్నది.

ఆ మీమాంసలో గుణదోషస్వరూపచర్చయుం గలదు. పూర్వోక్తగ్రంథములయం దెల్ల గుణపరిచ్ఛేద మొకటియు, దోషపరిచ్ఛేద మొకటియుఁ గలవు.

దోషములు రసదోషములు, పదదోషములు, వాక్యదోషములు, పదవాక్యదోషములు, అర్థదోషములు అని అయిదుతెఱంగులు.

ఔచిత్యము గుణములకు మూలము. అనౌచిత్యము దోషములకు మూలము. క్రమముగా : నైషధాదులందలి మానుషనాయికానాయకశృంగారవర్ణన; కుమారసంభవము నందలి పార్వతీపరమేశ్వర శృంగారవర్ణన. అశ్లీలతాగ్రామ్యతా ప్రభృతిదోషములు పెక్కులు అలంకార గ్రంథములందు నిరుక్తములు.

కవిసమయములు స్వభావవిరుద్ధము లయ్యును అవిలంఘనీయములు. ఆకాశము నలుపు, పాపము నలుపు; యశఃకీర్తిహాసములు తెలుపు; క్రోధానురాగములు ఎఱుపు; నదీసముద్రములందు తామరలు, కలువలు వర్ణింపఁబడును; జలాధారములందెల్ల హంసాదిజలపక్షులు విహరించుచుండును; చకోరములు వెన్నెలం

ద్రాగును; మేఘాగమమున హంసలు మానస సరోవరమునకు తరలిపోవును; పూఁబోఁడుల పాదతాడనముచే నశోకమును, నోటిసుర నుమియుటచే బొగడయు పూచును; విరహతాపముచేత యౌవనవంతుల యెడలహారములును, హృదయమును వ్రస్సిపోవును; మదనునికి ధనుర్బాణములు పువ్వులు; అల్లెత్రాడు తుమ్మెదలబారు; ఇతని బాణమునకును స్త్రీ కటాక్షమునకును యువజనులహృదయము వ్రీలిపోవును; పగలు తామర, రాత్రి కలువయు వికసిల్లును; అశుక్లపక్షమునందును వెన్నెల కాచును; ఉఱుమునకు నెమళ్ళాడును; అశోకమున కాయలు లేవు; వసంతమును జాతిపుష్ప ముండదు; గంధపుఁ జెట్లయందు పూవులుం గాయలు లేవు; ఇంకను ఇట్టివి సత్కవిప్రబంధములవలన నెఱుంగఁదగును.

కాళిదాసును ఖూనీ చేయించిన వేశ్య కవిసమయ మెఱుఁగని దైనందుననే భోజునికి పట్టువడినది.

''రాజన్ తవ ముఖాంభోజే దృష్ట మిందీవరద్వయమ్
కుసుమే కుసుమోత్పత్తిః శ్రూయతే న చ దృశ్యతే ''

వర్ణ్యము నేపదములతో నుద్దేశింపఁదగునో, వేనితో నుద్దేశింపఁ దగదో కవిసమయము బోధించుచున్నది.

సీ. మదిరాక్షిచెవులు తొమ్మిదిలెక్క లనరాదు
ముద్దియకనులు తమ్మ లనరాదు
శుకవాణిబుగ్గలు ముకురంబు లనరాదు
చెలిపండ్లు మల్లెమొగ్గ లనరాదు
గజయానచండ్లు బంగరుగిండు లనరాదు
సతిబొడ్డు సుడిని మెచ్చ దనరాదు
సరసిజాననముడ్డి సైకతం బనరాదు
హరిమధ్యకాళ్ళగు శ్ళనగరాదు

గీ. క్రమత వీనికి వీనులు కన్నుదోయి
చెక్కులును బలువరుసయు నిక్కఁజన్ను
గవయుఁ బొక్కిలి పిఱుఁదు చొక్కంపుటడుగు
లనుచు మును వాడి రవియ చేకొనఁగవలయు.

ఈకాలమందు కువిమర్శకులు తండోపతండము. వీరి కారణమున సుకవులు గ్రంథరచన మానుకొనుటయుం గలదు. కొందఱు విమర్శకులు సమకాలిక

కవియొక్క ధీరతను సహింపరు. ప్రాచీనకవుల యాత్మశ్లాఘము మెచ్చుకొందురు. నక్కవినయమునకు హర్షింతురు. కవి యెట్టివాఁడయిన నేమి విమర్శనీయవాఙ్మయము ఆతనిగ్రంథమే గాని యాతఁడే కాఁడు.

ఉ. అంకెకుఁ దార్చెనే రసికునంగల భారతి ప్రౌఢనీతి నా
కింకిరి నాంధ్రి ద్రావిడియుఁ గేరుచు దైవియుఁ గూడి రెవ్వరిన్
జంకు కళంకు లేని కవిచంద్రుఁడు తోషితకోవిదేంద్రుఁ డా
వేంకటరాయశాస్త్రికృతి వెంగలిమూక కెఱుంగ శక్యమే ?

ఆ. "కవితఁ జెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరఁగ దశకుమారచరితంబుఁ జెప్పిన
ప్రోడ నన్ను వేఱ పొగడ నేల."
"మన్దః కవియశఃప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్;
ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః"

ఇందు తొలియుదాహరణమున సూత్రధారుఁడు ప్రరోచనార్థము కవి నగ్గించుచున్నాఁడు. ఇది సంప్రదాయమాత్రనిర్వహణ మనియు, దీనిచే కవియొక్క సౌజన్య దౌర్జన్యతదన్యతరములు రూఢి కెక్క వనియు కువిమర్శకు లెఱుంగవలయును రసార్ణవసుధాకరము (III-94, 95, 96) తృతీయవిలాసముం బరిశీలించిన ఈ విషయము స్పష్టపడును

"కవయస్తు ప్రబంధార స్తే భవేయు శ్చతుర్విధాః,
ఉదాత్త ఉద్ధతః ప్రౌఢో వినీత ఇతి భేదతః,
అంతర్గాఢాభిమానోక్తి రుదాత్త ఇతి గీయతే."

యథా మాలవికాగ్నిమిత్రే —

"పురాణ మిత్యేవ నసాధు సర్వం తథాపి కావ్యం నవ మి త్యవద్యమ్
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః."
"పరాపవాదా త్స్వోత్కర్షవాదీ తూద్ధత ఉచ్యతే."

యథా మాలతీమాధవే —

"యేనామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కి మపి తా న్ప్రతి నైష యత్నః;

ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపి సమానధర్మః
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ.''
''యుక్త్యా నిజోత్కర్షవాదీ ప్రౌఢ ఇత్యపరే జగుః.''

**యథా మమ ఇవ:**

''నేదానీ న్తనదీపికా కిముతమ స్సంఘాత మున్మూలయేత్
జ్యోత్స్నా కిం న చకోరపారణకృతే తత్కాలసంరోహిణీ,
బాలః కిం కమలాకరాన్ దినమణి ర్నోల్లాసయే దఞ్జసా
తత్సంప్రత్యపి మాదృశా మపి వచః స్యాదేవ సప్రీతయే.''
''వినీతో వినయోత్కర్షాత్ స్థాపకత్వ ప్రకాశకః''

**యథా రామానన్దే —**

''గుణో న కశ్చి న్మను వాఙ్నిబంధే లభ్యేత యత్నేన గవేషితోఽపి:
తథా ప్యముం రామకథా ప్రబంధం సన్తోఽనురాగేణ సమాద్రియన్తే.''

*వార్తాపత్రికలందలి విమర్శలు :*

కొందఱు వార్తాపత్రికాధిపతులు విద్వాంసులగ్రంథములపై ఎవరేకువిమర్శ వ్రాసి పంపినను నిజపత్రికలో ముద్రింతురు. తాము స్వయము గుణదోషము లెఱుంగని యపండితులై యట్లు చేయుటచేత భాషాదేవతకు తా మొనర్చుచున్న చేటును వా రెఱుగరు. వారి లోఁగు ట్టేమనఁగా ఆ ప్రముక్కడి విమర్శనందుకొని గాసింబడి యీసెత్తి ఆ విద్వాంసులు ఆత్మగౌరవముం గాచికొనుటకై వ్రాసెడి వైదుష్య భూయిష్ఠ వాద ప్రతివాద ఖండన మండన ఖండముమండన వ్యాసములతో తమ పత్రికలు నిండి జనరంజకములై 'చందా'లం బెంచుంగాక యని.

అట్లే ఒకానొక పత్రికాధిపతి, 'తవనాసికా ఇకోయణచీవ భాతి' అని వాదమునకు పిలుచుటగా మదీయప్రతాపరుద్రీయనాటకమందలి కవివాక్యమును ''అంతట నిద్రితుఁడు రాజు ప్రవేశించుచున్నాడు'' అనుదాని నిట్లాక్షేపించు వ్యాసమును ప్రకటించుకొన్నాడు: ''నిద్రితుఁ డెట్లు ప్రవేశించును? ప్రవేశించుటకు మెలఁకువ వలయును. నిద్రలో గమన మెక్కడిది? ఈ ప్రకారము మేము చిరకాలము ప్రశ్నలు వేయుచుండెదము. దీనికిని భావివానికిని శాస్త్రులవా రుత్తర మీఁగలిగిన యెడల నీయవలసినది'' అని. దీనికి నేను భయపడి యుత్తరమీయ లేదు. పత్రికాధిపతికి మదీయవ్యాసములు లేకపోయినవి. ఇట్టి యవిద్వత్సంపాది

తము లగు పత్రిక లంతరించుటయు, సాధువిమర్శలం బ్రకటించు విద్వత్సం పాద్య మాసపత్రికలు చిరాయువులగుటయు సహజమే గదా!

కొందఱు కవులు నిజగ్రంథములు బహుళములై వానియందు దోషములు మెండయి దూషకులు దండియైనప్పుడు తామే పత్రికలు నడుపుచుండువా రగుదు రేని వానియందు, లేనిచో క్రొత్తగా వైరినిబర్హణార్థము పత్రికలం బెట్టికొని వాని యందేని పూర్వోక్తదూషకులను గసిదీఱ తిట్టుదురు. ఎట్లన-ఇంచుక యుదాహర ణము- "అశోకవనికం బెకలించిన యాంజనేయా, నా గ్రంథమును విమర్శించిన యల్ల యాశాస్త్రిగానిని సమూలముగా పెకలించి వైవుము." ఇది విమర్శకు ఉత్తరము.

కవి కావించిన భాషాచిత్రవధ కాయాసపడి విమర్శకుఁడు విమర్శలోఁజూపు కటుత్వమును తొలఁగఁబెట్టి పఠితలు విమర్శయొక్క పటుత్వాపటుత్వములనే పరికించుకొనుట మేలు.

దొంగలకును, నరహంతకులకును అధికరణకుండు వోలె కాకవికి సాధు విమర్శకుఁడు దోషోద్ఘాటకుఁడును శాసితయు నగును. దొంగను "శ్రీయుతులైన యోదొంగయ్యగారూ, తమరు ఇట్టి చౌర్యమును కావింపవలసినవారు కారు. మహానుభావులరు. మఱి తమరు 8 సంవత్సరములు కారామందిరంబున వఱకంబు గావించి రాజకీయమైన విందారగించుచు మమ్ముఁ గృతార్థులం గావింపుఁడు" అని యధికరణకుఁడు వేఁడుకొనుట లేదు అట్లే సాధు విమర్శకుఁడును కాకవిని వేడుకొనవలసిన పనిలేదు.

గ్రంథకర్తలు అచ్చునుండి తమ గ్రంథము వెలువడిన వెంటనే మెచ్చు వాక్యమాలకై పలువురకుం బ్రతులం బంపుదురు. గ్రంథమును పంపిన గౌరవము నకు లోఁబడి యాపలువురలో పెక్కురు ఈ కర్తను ఏతదీయగ్రంథమును స్తుతించుచు బదులు వ్రాయుదురు. వీరిలో నెవ్వఁడేని గ్రంథమందలి దోషము లను బయటఁ బెట్టెనా, అంత నాయిరువురకును గజకచ్ఛపయుద్ధము. వీరికై శ్రీమన్నారాయణుఁడు చేయిచేసికొనఁడు గావున నీ యుద్ధము తీఱదు. మఱి ఉద యించునపుడు పూర్ణచంద్రుఁడు "రాత్రి శైలూషికిన్ పరుస న్మౌక్తికపట్టమై నిటలమై వక్త్రంబు నై" దోఁచి లోక మెల్ల వెన్నెల వెదచల్లునట్లు వాద ప్రతి వాద వాఙ్మయోదయము జాబులై, పుస్తకములై పత్రికలై దేశమం దెల్ల తొమ్మి దవయట్టంపుఁ బారాయణముగా పర్వుచుండును.

ఇప్పటి మనబుద్ధిమంతులు తాము హూణసారస్వతమున నలవరించుకొన్న పాటి వైదుష్యమును ఆంధ్రసారస్వతమున నలవరించుకొని యుండినచో దేశమునం దసాధువిమర్శలు, అసాధుప్రతివాదములును దగ్గును. సాధువిమర్శలే హెచ్చును.

సాధువాఙ్మయసంరక్షణకై యొకవిద్వత్సంఘము అపేక్షణీయమై యున్నది. అందులకై నేను రెండు మూడు మాఱులు యత్నించి నెఱవేఱక మానితిని. అది లేమిచే

"దేవు నాన మున్ను దేశాన కొక్కఁడు
కవియుఁ గలఁడొ లేఁడొ కలియుగమున
ఇపుడు వీథివీథి నింటింట నూరూరఁ
గవులు గలరు జగతిఁ గఱవుతోడ."

అని పెద్దలు చెప్పినను కవిగానివాఁ డేనియు నుండుంగాని విమర్శకుఁడు గానివాఁడుండఁడు. ప్రతివిద్యార్థియు విమర్శకుఁడే. (తప్పుడు పుస్తకములు వ్రాసి పండితులచేత దిద్దించుకొనియో, దిద్దింపకయో ముద్రించుకొని దారి యెఱిఁగి పాఠశాలలలోఁ బఠనీయములుగాఁ బెట్టించుకొని జీవించువాఁడును విమర్శకుఁడే.) పండితప్రణీతగ్రంథములకును, వానికిని అరుణపటబలీవర్ధన్యాయము. వీనికి అర్థము గానిదెల్ల కఠినము; మృదుమధురము గాదు; సంస్కృతపదము కంటిపోటు; క్రొత్త పదము ప్రాణగొడ్డము.

"శ్రీనాథుండు ధరాభరం బుడుప నాజిం బెట్టుడుం దానవీ
రానీకంబు లురఃక్షతాధ్వమున డాయం డూయ నెవ్వాఁడు క
న్గోనా తేనియపట్టాకో తితఉవాక్కోఁ నాఁగ శర్మార్థి యా
భానుం డేనవజార్జిలోపపతి సర్వశ్రీయున్ జేయుతన్."

విద్యాధికారి- అయ్యా, యీవేంకటరాయశాస్త్రిని కవన మెవరు పింగటించ మన్నారయ్యా-తితఉవేమిటండీ తితఉవు! ఇటువంటిశబ్ద ముంటుందండీ భాషలో! దీనికర్థం కూడా వుంటుందండి! నే నెప్పుడు యెఱగనండీ ఇలాంటిశబ్దాన్ని.

శాస్త్రి: అయ్యా, తితఉ వనఁగా జల్లెడ. 'చాలనీ తితఉః పుమాన్' అని యమరుఁడు.

విద్యా: నాందీపద్యంలో జల్లెడవర్ణ నేమిటండీ, శివకేశస్తుతి యుండవలయుగాని. ఆయినాగానీ మనతెలుగు కీసంస్కృతంతోటి సంబంధం వదలాలండీ, అప్పటికి గాని మనభాష బాగుపడదు.

శాస్త్రి: వదలాలంటారు, మళ్ళీ మీరే సంస్కృత శబ్దాలు ప్రయోగిస్తారు. సంస్కృత మేమిటి ? సంబంధ మేమిటి ?

విద్యా: అది భాషపేరు, ప్రాపరునేము. ఇది వాడుకమాట.

శాస్త్రి : ప్రాపరునేను ఇంగ్లీషుభాషా యేమిటి? కానీ సంస్కృత మనుదానికి వేల్పు బాస యనవచ్చునే ! సంబంధానికి తగులాట మనవచ్చునే ! భాషకు బాస అనవచ్చునే ! అప్పటికి మీ తెలుగు బాగా కీసటబాసట అవుతుంది. పోనీ మీ రన్నట్లు సంస్కృతమాటలు వాడడం వాడుకే గనుక మీలాగే ఇతరులను కూడా వాడనిత్తురూ.

విద్యా : శాస్త్రులవారూ, మీతో వాదం చెయ్యలేమండీ. మీకు నమస్కారము. ఈ బళ్లారి సరసవినోదినీసభవారిచాత ఈశాస్త్రిగారి పద్యాలనాటకాలనిగురించి ప్రహసన మాడిస్తామండీ. నాటకమంటే పాటలమయంగా వుండాలి.

ఇట్టి విద్యాధికారి విమర్శకులం గూర్చియే పూర్వులు :

''విపులహృదయాభియోగే ఖిద్యతి కావ్యే జడో నమౌర్ఖ్యేస్వే;
నిన్దతి కఞ్చుక మేవ ప్రాయ శ్శుష్కస్తనీ నారీ.''

''పనివడి నారికేళ ఫలపాకమునం జవి యైన భట్టహ
ర్షని కవితానుగుంభములు సోమరిపోతులు కొంద అయ్య లౌ
నని కొనియాడనేర రది యట్టిద లేజవరాలు చెక్కుఁగీఁ
టిన వసవల్చు బాలకుఁడు డెందమునం గలగంగ నేర్చునే.''

ఇందుల మూలము :

''మమ క్తి శ్చే ద న్తర్మదయతి సుధీభూయ సుధియః
కి మస్యానామ స్యాదర సపురుషానాదరభరైః;
యథా యూన స్తద్వత్పరమరమణీయాపి రమణీ,
కుమారణా మ న్తఃకరణహరణం నైవ కురుతే.''

ఇందుతోడిదే ఇంకొకటి :

''గ్రన్థగ్రన్థి రిహ క్వచి త్క్వచి దపి న్యాసి ప్రయత్నాన్మయా;
ప్రాజ్ఞమ్మన్య మనా హఠేన పఠితీ మాస్మిన్ ఖిలం ఖేలతు,
శ్రద్ధారాద్ధ గురుశ్శ్లథీకృత దృఢగ్రన్థి స్సమాసాదయ
త్వే తత్కావ్యసుధోర్మిమజ్జన సుఖవ్యాసజ్జనం సజ్జనం.''
''ఇతర పాపఫలాని యథేచ్ఛయా వితర తాని సహే చతురానన;
అరసికేషు కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ''

ఇందులకు తెలుఁగు మదీయము :

"ఇతరపాపఫలము లిచ్చువచ్చినయట్లు
వ్రాయవయ్య నొసట వనజభవుఁడ !
అరసికాళిమ్రోల సరసకావ్యము చెప్ప
వ్రాయవలదు వలదు వలదు వలదు."

అని హెచ్చరించినారు.

ఇప్పటి గ్రథనము లిరుదెఱంగులు- ఎ. తర్జుమాలు, బి. స్వతంత్రములు. తర్జుమాలయందు (1) మూలార్థము తెలియక రసమును పాడు చేయుటయు, (2) లక్షణము తెలియమిచే భాషను పాడు గావించుటయు నుత్కటకోటికములు. ఇవి పద్యకావ్యములుగాని, ఇతరములు గాని పూర్వోక్తదోషములతో నిండియుండినచో వీనిని విమర్శించువారి కిందుం బొగడుట కేమి మిగిలియుండును ? ఇట్టి గ్రంథములను విమర్శించువారిని 'దోషములనే చూపిరి, గుణములను చూపరైరి' అని నిందించుట న్యాయముగాదు.

మూలమునకు మెఱుఁగువెట్టిన శృంగారనైషధకవిని పొగడనిరసికు లెవ్వరు?

మ రణకండూభర దుస్సహం బయిన యారాజేంద్రదేవేంద్రు ద
క్షిణబాహాగ్రమునం జనించిన మహాకీర్తి ప్రవాహంబు కా
రణసంక్రాన్త గుణానుషంగముననో ప్రస్ఫీతదిఙ్మత్తవా
రణగండస్థలకుంభకూలములపై రాయుం దివారాత్రముల్."

ఇందులకు మూలము :

"యశోదయస్యాఽజని సంయుగేషు
కండూలభావం భజతా భుజేన;
హేతోర్గుణాదేవ దిగాపగాళీ
కూలంకుషత్వవ్యసనం తదీయమ్."

దిక్కులు ఆపగ లయిన ఏవి వానికిం జెప్పిన కూలము లయినవో తెల్పమి యిట సొంపు గాదని శ్రీనాథుఁడు కీర్తినే ప్రవాహముం గావించి దానికి దిగ్గజగండస్థల కుంభములను కూలములం జేసినాఁడు.

ఉ "ఇప్పటి నీతలంపు తెఱఁ గిట్టిద యిం కిటమీఁద నెప్పు డే
చొప్పున నుండునో నిజముసుద్ది యెఱుంగము గాని యుగ్మలీ
చెప్పెడిదేమి బాలికలచిత్తము లంబుతరంగలోలముల్
తప్పునొ తాఁకునో కుసుమధన్వునియేటులు దైవికంబునన్."

ఇందులకు మూలము :

"త్వచ్చేతసః స్థైర్యవిపర్యయంతు సంభావ్య భావ్యస్మిత మజ్ఞ ఏవ
లక్ష్యే హి బాలా హృది లోలశీలే దరాపరాద్ధేషు రపి స్మర స్స్యాత్."

"బాలికల చిత్తము లంబుతరంగలోలముల్" అను నుపమ దీనికై అక్షరలక్షలు చేయును.

మ. "ఇదె వీక్షింపు చకోరశాబకనిభాక్షీ, దీర్ఘికాహంసి యి
ష్టదకాంతఃప్రతిబింబితున్ గగనమధ్యోపస్థితున్ జంద్రునిన్
మది దర్శించి నిజాధినాథుఁ డనుచున్ వాత్సల్య మేపారఁగాఁ
జదు రొప్పం బరిచుంబనం బొనరిచెన్ జంచూపుటాగ్రంబునన్."

ఇందులకు మూలము :

"పశ్యోచ్చసౌధస్థితిసౌఖ్యలక్ష్యే త్వత్కేళికుల్యాంబుని బింబ మిన్దోః
చిరం నిమజ్జ్యేహ సతః ప్రియస్య భ్రమేణ యచ్చుంబతి రాజహంసీ."

"గగనమధ్యోపస్థితున్" అను విశేషణము దీనికి జీవాతువు.

ఆధునికులలో ఇట్టి పరశువేధి యెవనికిఁ గలదు ! చెత్తను బంగార మను టెట్లు ? మఱి స్వతంత్ర గ్రంథము లన్నవో 1. ఔచిత్యబాహ్యత, 2. భాషా సంహారము అను నీరెండుదోషములతో నిండియున్నచో నవి పూర్వోక్తములైన ప్రముక్కుడితర్జుమాలతోఁ గూడ పరీక్షలకుం బెట్టుటకు యూనివర్సిటీవారికిని, తిట్టుచుం బాఠము చెప్పుటకు మనీషులకును, ఏడ్చుచుం జదువుటకు విద్యార్థుల కును, 'చోరాయ గడ్డిలాభాయ' అని డబ్బు గడించుకొనుటకు కవికిని చెక్కు బుక్కులుగా పనికివచ్చునే గాని భాషానాశకములు గాక యెట్లు తప్పును? విమ ర్శకులకును రసజ్ఞులకును ఎట్లు హృద్యము లగును ? నాచనసోముని హరివంశము పనికిరాదఁట ! కాకవికృతి పనికివచ్చునఁట ! ఏలయన వాఁడు మనవాఁడట ! కటకట !

యూనివర్సిటీవారు పరీక్షలకు పాఠ ముంచుట గ్రంథప్రాశస్త్యమూలక మని తలపఁగూడదు తద్విక్రయకారణ మని మాత్రము తలంప నగు.

ఒకానొక పాడుగ్రంథమును యూనివర్సిటీవారు పరీక్షకుం బెట్టిరి. దానిం బెట్టుదు రని పండితు లెవ్వరును తలంపలేదు. పెట్టినందుల కాశ్చర్యపడిరి. గ్రంథకర్త అందలి యనంతదోషములను లోకు లుద్ఘోషింపఁగా విన్నవాఁడై పరీక్షకై విద్యార్థులు చదువందొడంగు నాలోన ఆ తొలుతటిముద్రణమును యూని వర్సిటీవారు నియమించినదానిని నాశనము చేసి పండితులచే కొన్నివందలతప్పులు

సవరింపించుకొని శేషించిన కొన్నివందలతప్పులతో ద్వితీయ ముద్రణమును ప్రకటించి విద్యార్థులకు విక్రయించును. అందులకు యూనివర్సిటీవా రాక్షేపింప కుండుటను ఎఱిగి యున్నారము.

స్వతంత్రగ్రంథములం బెక్కింట లక్షణమును, ఔచిత్యమును సర్వమంగళంబులు. ఒకానొకస్వతంత్రనాటకమున రంగ మఁట! ఆ రంగమంతయు దర్శించినను అందు చేతులు,పృష్ఠములుం ద్రిప్పుచున్నపాత్రము లెవరో తెలియదు.

ఇట్టి కవనములుం గలవు. 'పడతీ వినవది పలికిన పలుకులు, విడచుము దానిని బిలచిన బలకడు.' ఇంతకన్న వీథినాటకము ఈ విషయమున మేలు. అందు 'వందార్ వందానరే వేదవియాశర్ వందార్ వందానరే' అని, 'చందా మార్కు లదుగుదెంచెను' అని ఆయాపాత్రమే తనపేరు చెప్పుకొనుచుం బ్రవేశించుటయేని కలదు. ఇది సంస్కృతము రాక, భరతసూత్ర మెఱుంగక, నాట్యశాస్త్రము తెలియక, ''నాసూచితస్య పాత్రస్య ప్రవేశో నిర్గమోఽపివా'' అన్న నియమమును వినియుండక, ఆంధ్రగీర్వాణవిద్యలయందున్నయు విసర్గయునై, కతిపయ హూణాక్షర దుష్పరిచయముచే ఆకాశబాణములవలె సాహసించి యెగసిన వారు గావించినది. నేల విడిచిన సాము.

ఒకానొక స్వతంత్రనాటకమున మంత్రి రాజును ''ఓ నరనాథ! యావనట నోర్వర'' అని యోదార్చుచున్నాఁడు. ఇంకొకదాన (అదియుం బరీక్ష కుంపఁబడిన దాని తమ్ముఁడే) కథానాయిక యయిన యమ్మాయి తండ్రిగారి మంత్రిని 'చూడర' అనియు 'ఏలరా సుమతీ' అనియు పల్కరించుచున్నది. ఇందుకై నాయన హర్షించి దానికి మంచివరుని వెదకుచున్నాఁడు. రాజును దాసి ''విక్రమ వర్మ మహాప్రభూ'' అని పేరు పెట్టి సంబోధించుచున్నది. అందుకై ఆ రాజు ఆ దాసికి ముండన కశాఘాతాదిసత్కారంబులం గావింపక కేవలము హర్షించినాఁడు. నాయిక (మహారాజపుత్రి) నాయకుని (ఒకానొక మహారాజు కుమారుని) గూర్చి 'వాఁడు', 'వానిని' అనియే పలుకును. ఇంతకన్న విజయసేనుఁడో ఎవఁడో వాని పేరే పెట్టి 'ఆ విజయ సేనిగాఁడు, ఆ విజయసేనిగానిని' అన్న మెఱుఁగని నా భావము. ఒకానొక మహారాజ పట్టమహిషి దాసిని 'భర్తగారు వచ్చినారా' అని యడిగెను. ఇంతకన్న 'మా'శేక మదరాసు మర్యాద ప్రకారము 'మన - మగఁడుగారు వచ్చినారా' అన్న మేలని నా తాత్పర్యము. ''మగఁడుగాఁడు'' అన్నను మేలే. గాఁడుచేత ననురాగాతిశయము రూఢికెక్కును. గాఁడుపట్టియే కదా నాటకముల కెక్కుట

నాయిక చెలులు స్వయంవరసమాగత మహారాజకుమారుల నుద్దేశించి "వీడో, వాఁడో, ఎవఁడో నీకు భర్త యగునులే" అని నాయికతోఁ బల్కుట. ఇది యీ క్రిందిపాటకుఁ దివిసిపోక యున్నది.

అవన్ వందా వందాండీ, పోనా పోనాండీ అవన్
అవన్ పోనా నమకేండీ, వందా వందాండీ
కట్టుమిల్లే మెత్తయిల్లే కాలిపుడిక్కతాశి యిల్లే-అవన్ వందా ...

ఇంతకన్నను శృంగారము వలయునేని "నితంబముల్ పెద్దవి యౌట" అను ప్రయోగమం దున్నది. ఇందలి పెద్ద శబ్దమును ఆ గ్రంథమునం గల శృంగార రసమును వడఁబెట్టి యాసారమునం జేసిన గడ్డలుగాఁ జెప్పవచ్చును. దీనిని ఆధునికరసికులు 'సులభశైలి' యందురు. ఈ శృంగారమును సైతము మించవలయునన్న ఇందలి 'నితంబములను' త్రోసివైచి అలసాని పెద్దనాదులకు సయితము కైవసముగాని 'పిఱ్ఱలం' బెట్టుటయే సాధనము. అప్పటికి శృంగారము పరమావధిం బొందును. దానినిగూడ మించవలయునేని 'ముడ్డి' యనఁదగు. అప్పటికి శృంగారము పరమావధిం దాటి చక్రవాళ పర్వతమున దుస్సికొని వెలికి వెల్లువ గట్టును. అప్పకవి 'సరసిజానన ముడ్డి సైకతం బనరాదు' అన్నాఁడే గాని 'పెద్దది యనరాదు' అనలేదు గదా ! ఈ పెద్దనితంబములు పరీక్షల కిడం బడినవే.

మెట్టవేదాంతు లని కొందఱు గలరు. వారు విమర్శకులం గొందఱను లక్షణ విరోధ మాత్ర విమర్శకు లని నిందింతురు. లక్షణ మనఁగా ఛందోవ్యాకరణములు మాత్ర మని యావేదాంతుల యభిప్రాయము. వాస్తవ మట్లు గాదు. విమర్శనీయ విషయమెల్ల లక్షణగ్రస్తమే అగుగాక ! ఈ ఛందోవ్యాకరణ విరోధ మాత్ర విమర్శంబును అత్యావశ్యకమే. వ్యవహారోపదేశమేని, మూలానుసరణమేని, కవనసౌభాగ్యమేని లేక అనఁగా నుపాదేయ మేమియు లేక కర్ణకఠోరము లయిన ముక్కిడిగ్రంథములలో శబ్దమాత్రమేని సాధువుగా నుండవలదా ? కావ్యేందిరకు శబ్దార్థములు దేహము గదా !

"తను వగు శబ్దార్థంబులు
ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరు గుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకున్."

— నరసభూపాలీయము.

దేహము నాశ మయిన దేహి యెట్లుండును ?

ఔచిత్యపరీక్షలో నీ క్రింది విషయముల నవధరింపవలయును.

౧. ఒకానొక రుక్మిణీపరిణయ నాటకమున రుక్మిణికిని చేటికలకును విధవా వివాహవాదము-అతి తీవ్రమ్ముగ.

౨. ఇంకొక రుక్మిణీపరిణయ నాటకములో బ్రాహ్మణుఁడు రుక్మిణీ సందేశమును శ్రీకృష్ణులవారి కందించును. శ్రీకృష్ణుఁడు, ఇప్పటి ఇంగ్లీషు స్టూడెంటు వలె కన్నెను చూడక విద్యావిశేషములు సంభాషించి కనుంగొనక వివాహ మాడ నని చెప్పి ఆమెను కలిసికొనుటకై కుండినపురమునకు బ్రాహ్మణునితో వచ్చి యాతనియింట వేచియుండుట. బ్రాహ్మణుఁడు కృష్ణాగమనమును నివేదించుటకును, ప్రమదవనమున సమాగమము కల్పించుటకును ఉద్యుక్తుఁడై రుక్మిణికడకుం బోవుట; బ్రాహ్మణుఁడటు తరలఁగానె బ్రాహ్మణి (అనఁగా నాతని యిల్లాలు) కామక్రీడకై శ్రీకృష్ణుల వారిని పైకొనుట. ఇవి భాగవతకథపై యింప్రూవుమెంట్లుఁట.

౩. రంగమందు చావుం జూపుట. పైగా మృతుని సోఫాపైని పరుండబెట్టి; తద్భార్యను సోఫాకాళ్ళకుం గూర్చుండఁగట్టి శోకవరాళిం బాడించుట. దీని పేరు 'ప్యాథా' సఁట.

౪ హిందూప్రభువు, చక్రవర్తి, క్షత్రియపుంగవుఁడు, సదాజేత, కృష్ణదేవరాయని యల్లుఁడు, తురకదాని నుంచుకొని దానిగర్భమున జనించిన తన తురకకొమరుని ద్రోహముచేత రణనిహతుఁ డగుట. అంతటితో దక్షిణహిందూస్థానమున హిందూరాజ్య మంతరించుట. ఆతని యాతురకసంబంధమునకు పెద్దలెల్ల తలవంచుకొనుట. అందుల ఫలమైన క్షత్రియ రాజ్యనాశనమునకు చాతుర్వర్ణ్యమెల్ల దుఃఖించుట. దీనిపేరు 'ట్రాజడీ' యఁట.

మఱియొక నేటికాలపు స్వతంత్రనాటకమున సుభద్రాదేవిని దుర్యోధనునికి ఉంపుడుగత్తెగా నిత్తమా, మాఱుమనువుపెండ్లాముగా నిత్తమా అని యామె యన్నలకు పెనురగడ జరిగినది. కాని, తుద కామె రాక్షసవివాహమునం దన్నుఁగొనిపోయిన యర్జునునికే చిన్నన్నమాటప్రకారము వదలంబడినది. ఔచిత్యలోపము లేకుండుటకై యామె 'వాడపదినె గాద'నియుఁ జెప్పఁబడినది.

ఆధునికులలోఁ బలువురు (1) ఛందశ్శత్రువులు గాను, (వీరి మతమును నేను మరియొక యుపన్యాసమున వివరించెద) (2) సమాసశత్రువులు గాను, 'మాషంచశరచ్చంద్రచంద్రికాధవళం దధి' అను కాళిదాసప్రోక్తార్థశ్లోకమునకు సమాస మున్నను అక్షర లక్షలు వచ్చినవి...సమాసమును విడఁదివిచిన ఆ గేదె

పెరుఁగు గడ్డవిఱిఁగి చిద్రుపలై విఱిగిపోయిన పాలపెరుఁగై పనికిరాకపోయి యాలక్షలం గోలుపోయి శిక్షలం దెచ్చికొనును. (3) అలంకారశత్రువులుగాను 'కైతకశిఖాలీలాయిత'మ్మన్న యుపమకే భవభూతి కవనముకన్న కాళిదాస కవనము భారతీకర్ణావతంసకహ్లారకశికామధూళీమాధుర్యముచేత నుత్కృష్టమై ప్రాసులో ప్రెుగ్గు చూపినది. అట్లే 'జంబూఫలాని పక్వాని పతన్తి విమలే జలే, తాని మత్స్యా నఖాదన్తి జాలగోళకశంకయా' అను శ్లోకమున కడపటిసాలంకార పాదమునకు మాత్రమే యక్షరలక్షలు వచ్చినవి. (4) లక్షణశత్రువులుగాను నడిఁకట్టుదురు. ఇందులో మహాజనప్రార్థన నంగీకరించి యూనివర్సిటీవారును, దొరతనమువారును వ్యాకరణశత్రువులను నివారించినారు. కాని వారి కపజయము జయతుల్యమే యయినది. ఎట్లన వారిప్రభావముచేత పాఠశాలలయందు వ్యాకరణ ప్రవచనము మాన్పఁబడినది. ఈ శత్రుత్వ మెల్ల నశక్తత్వము గాని మఱి యొకటి గాదు.

శ్రీనాథుఁడు శృంగారనైషధములో తన పాటించిన యాంధ్రీకరణకవన ప్రకారము నిట్లు వక్కాణించినాఁడు: "అశేషమనీషిహృదయంగమంబుగా, శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱ్ఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, ఔచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకాను సారంబుగఁ జెప్పఁబడిన యీ శృంగార నైషధ కావ్యంబు... విలసిల్లు నాచంద్రా ర్కంబు." మఱియు "మృదుమధురచిత్ర విస్తరకవితావిలాస వాగీశ్వరు లగు కవీశ్వరులును...పరివేష్టింపం గొలువుండి" అని నైషధకృతినాయకుని వర్ణించి నైషధకావ్యము మృదుమధురకవన మని నిజాభిప్రాయమ్ముం దెలిపినాఁడు. దానినే యిప్పటికి కొందికలు కొందఱు ఇనుప గుగ్గిళ్ళనియు శిలావర్షమనియు వాక్రుచ్చు చున్నారు. నాఁటికిని నేఁటికిని కవిత యింతటి తీసిగట్లయినది.

మఱియు నీకాలమున దోషములు గుణములుగాను, గుణములు దోషములు గాను ఎన్నఁబడుచున్నవి. గ్రంథచౌర్యము = బహుగ్రంథపాండిత్యము; అజ్ఞానము = వినయము; పేలవము = లలితము; దుర్వాదము = జయభేరి; అనౌచిత్యము = ప్రతిభ; తప్పుడుప్రయోగములు = భాషాభివృద్ధి; శృంగారము = బూతు.

అత్యంతమనోహరము లయిన గ్రంథములు కొన్ని ముద్రణవివరణాంధ్రీకరణములచే పాడగుట కొకకొన్ని యుదాహరణము లొసంగి యీ యుపన్యాసము నుపసంహరించెద.

క. స్మరశశితటిదజపవమా
నరవిసుధాసలిలమున్యనంతారిష్టా
సురమ్మృత్యుజ్వలనఁ జెలఁగు
సురవేశ్యలు గొలిచి రంత సుబ్రహ్మణ్యున్
(పాండురంగమాహాత్మ్యము, 1-167)

ఇందులకు టీక : 'స్మర...జ్వలనన్' = మన్మథుఁడు చంద్రుఁడు మెఱుపుయొక్క ప్రకృతివాయువు సూర్యుఁడు అమృతము జలము సప్తమహర్షులు భూమి శివుఁడు వీరియొక్క ప్రకాశముచేత, చెలఁగు = అతిశయించునట్టి.'

ఈక్రింది కాదంబరీవాక్యముం గన్నం బద్యార్థసాధుపాఠములు తెల్ల మగును.

''యథా విబుధసద్మన్యప్సరసోనామ కన్యాకా స్సన్తి. తాసాం చతుర్దశ కులాని ఏకం భగవతః కమలయోనే ర్మనసః. అన్యద్వేదేభ్య స్సంభూతమ్; అన్య దగ్నే రుద్భూతమ్ అన్య త్పవనా త్ప్రసూతమ్. అన్య దమృతా న్మథ్యమానా దుత్థితమ్.అన్య జ్జలాజ్జాతమ్.అన్య దర్కకిరణేభ్యో నిర్గతమ్ అన్య త్సోమరశ్మిభ్యో నిపతితమ్ అన్యద్భూమే రుద్భూతమ్. అన్య త్సౌదామినీభ్యః ప్రవృత్తమ్. అన్యన్మృత్యునా నిర్మితమ్. అపరం మకరకేతునా సముత్పాదితమ్. అన్యత్తు దక్షస్య ప్రజాపతే రతి ప్రభూతానాం కన్యకానా మ్మధ్యే ద్వేసుతే మునిరరిష్టాచ బభూవతు, స్తాభ్యాం గంధర్వైస్సహ కులద్వయం జాతమ్. ఏవమేతాన్యేకత్ర చతుర్దశకులాని '.

—కాదంబరి పూ.భా, ౨౭౭-౮ పు. బొంబాయి ము.

గీ. తప్పు గల్గిన చోటనే యొప్పు గల్గు
సరసికావలి కవితల యవగుణములు
సరసఁ గవితావళోక్తులసరణియందు
నమృతధారాప్రవాహంబు లడరుఁగాదె'
—౧-౧౪.

క. శ్రీద్యుతి సువర్ణరేఖా
విద్యోతితసదననికషవిద్వదనీక
ప్రద్యోతన నుతగుణశత
వేద్యారామానుజేంద్ర వేదాద్రీశా !
—౪-౧.

ఇందులకు టీక : ప్రద్యోతన=సూర్యుఁడా !- విద్వాంసుల యొరయికచేత త్వష్ట చేత సానపెట్టఁబడిన సూర్యునివలెఁ ప్రకాశించువాఁడా !

గీ. అచమూరువు యూథంబుఁ ద్రోచి పఱచె
వింట నమ్మేర్చి బోయ వెన్వెంటఁ దఱుము
లోలజిహ్వాకరాళవిశాలముఖత
నోలి భీతేందుమృగశాబమో యనంగ.

బోయ రాహువు; వానిచేతియలుగుతోడి మండలీకృతచాపము రాహువుయొక్క లోల జిహ్వాకరాళ విశాలముఖము; చమూరువు ఇందు మృగము; యూథము ఇందుఁడు. మోవిగాని నోలిగాదు.

క. నీయిచ్చయె మిన్నక పో
వోయి మునిప్రవర నిన్ను మెప్పింతును భూ
నాయక సభ నిందులకై
నీయత్నము వలవ దవల నే నున్నాఁడన్.

—ఆముక్త మాల్యద, ౨-౪.

మెప్పింతు ననిన యతిభంగము. ఒప్పింతు ననవలయు. సిద్ధసమాసమేని భూనాయక సభమున అనవలయు.

చ. సగరు నలుం బురూరవుఁ ద్రిశంకుసుతున్ బురుకుత్సుఁ గార్తవీ
ర్యు గయుఁ బృథున్ భగీరథు సుహోత్రు శిబిన్ భరతున్ దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వ శశిబిందు ననంగుని నంబరీషుఁ బూ
రుఁ గురుని రంతి రాఘవు మరుత్తుని గాలము కోలుపుచ్చదే.

ఇందులకు టీక: ''షోడశమహారాజు లగు ౧.గయుని, ౨.పృథుని, ౩ భగీరథుని, ౪. సుహోత్రుని, ౫. శిబిని, ౬. భరతుని, ౭. దిలీపుని, ౮. పరశురాముని ౯, ౧౦. శశిబిందునియౌవనాశ్వని (అనఁగా మాంధాతను), ౧౧. అనంగునిన్, ౧౨ అంబరీషుని, ౧౩. పూరుని, ౧౪. కురుమహారాజును, ౧౫. రంతిదేవుని, ౧౬. రామునిన్, ౧౭. మరుత్తుని-వీరలను'' అని పంచపాండవుల లెక్కకు విపరీతముగా నున్నది. పూరుగురుని అనునది సమానము. యయాతి నని యర్థము.

''గయాంబరీషౌ శశిబిం ద్వనంగౌ, పృథు ర్మరుత్తో భరత స్సుహోత్రః
రామౌ దిలీపో నృగు రన్తిదేవౌ, యయాతి మాంధాతృ భగీరథా శ్చ.''

వీరు షోడశమహారాజులు.

"హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవః
సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః" —వీరు షట్చక్రవర్తులు.

మ. "పవిధారాపతనంబు గైకొనని యప్పౌలస్త్యుమై సప్తధా
తువులం దూఱఁ బరిశ్రమంబునకు నుద్యోగించె నా సప్తసా
లవిభేదం బొనరించి నిల్వక వెసం జన్నట్టి యుష్మన్నరు
జ్జవనాస్త్రం బొసగు న్నిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా." -౪-౨౬

ఇందు మూఁడవ పాదమున లజయతి. 'సలీలం జన్న' అని పఠింపవలయును.

చ. "రయమున వృష్టికై యొదిఁగి రచ్చలపై విధియింతు రుగ్రతన్
హయపతిమీఁద దంతిపతి నాతనిపై నృపతిన్ గడాదిని
ర్ణయముల మొత్తులాడుదురు మట్టొకయించుక విప్ప విచ్చు వెం
గయి మఱి పోటి పోవుదురు సమస్తదిశాగతులైన యధ్వగుల్." ౪-౧౩౧

ఇందు మూఁడవ పాదమున ర్ణమయతి. మ్రబ్బని పఠింపఁదగు.

శా. "ఏణీశాబవిలోలనేత్ర కనుఁగొంటే వీరు విద్యాధరుల్
మాణిక్యోజ్జ్వలరత్నకుండలులు సన్మార్గైకచారుల్ లస
ద్వీణాపాణులు చంద్రికామలశిరోవేష్టుల్ త్రిపుండ్రాంకితుల్
నాణీయస్తనతారహారులు శివధ్యానైక నిష్ఠాపరుల్."
—పారిజాతాపహరణము.

ఈ ముద్రణమున 'శిరోవేష్టుల్' అను పుల్లింగముచేతను శిరోవేష్టముచేతను (అనఁగా తలపాగాచేతను) సూచితులైన పురుషులకు చతుర్థపాదమున స్తనములు చెప్పంబడుట యాశ్చర్యము. 'నాణీయస్త్సర' అని పఠింపవలయు.'కరము దొడ్డ' యని యర్థ మగును.ఇది నాకావించిన సవరణ.ఇందులకుయైతిహ్యములు.ఇప్పటికి రమారమి ౩౭ సంవత్సరములకు మున్ను ఈ పద్యము గల పారిజాతాపహరణ భాగము యఫ్. ఏ., పరీక్షకు పఠనీయముగా నుండినది. ప్రవచనక్రమమున నీ పద్యము రాఁగా, మదరాసు క్రిస్టియన్ కాలేజిలోని యాంధ్రప్రధానపండితులు శ్రీమాన్ నిశ్చింతతేవప్పెరుమాళ్ళయ్యగారును, పూర్వము నాకు నార్మల్ స్కూలులో నాంధ్రోపాధ్యాయులుగా నుండి యేతద్వృత్తాంతకాలమున ప్రెసిడెన్సీకాలేజీలో నాంధ్రప్రధానోపాధ్యాయులుగానుండిన శ్రీచదలవాడసీతారామశాస్త్రులవారును దీని కర్థము పిమ్మట యోజించి చెప్పెద మని విడిచివైచిరి. ఆ కాలములో నేను

కార్యవశమున మదరాసులో నుంటిని. అప్పుడు నాయొద్ద క్రిస్టియన్‌కాలేజి యఫ్. ఏ, విద్యార్థి నాబాల్యమిత్రము శ్రీయుత ద్రోణంరాజు వేంకట కృష్ణరావు గారు నిత్యము మాయింట నీపుస్తకమును చదువుచుండిరి. ఆ పాఠసమయమున నొకనాఁడు మద్గురువర్యులు సీతారామశాస్త్రులవారు నాయున్నవీథికి కార్యాంతరమున వచ్చి నాకును తమదివ్యసాన్నిధ్యము ననుగ్రహించి, "గ్రంథ మేమి? ప్రకృత మేమి?" అని ప్రశ్నించిరి. ఇప్పుడే 'ఏణీశాబ'కు అర్థము చెప్పితి నని విన్నవించితిని. ఎట్లు చెప్పితి వనిరి. స్తనమును తరప్ప్రత్యయముగా మార్చితి నంటిని. సవిస్తరముగాఁ జెప్పు మని యానతిచ్చిరి. ఇట్లు వాక్రుచ్చితిని: "ఇటఁ బద్యమున విద్యాధరులతారహారములు చెప్పఁబడినవి. మేఘోద్భవమౌక్తికములు కుక్కుటాండప్రమాణము లనియు, అవి నేలంబడకముందే అంతరాళముననె విద్యాధరులు హరింతు రనియు రత్నపరీక్షాగ్రంథమందు చెప్పఁబడియున్నది. అణీయస్ అన కడుంజిన్న. నాణీయస్ అనిన కడుందొడ్డ. నాణీయస్తర అన్న కడుంగడుందొడ్డ. కుక్కుటాండప్రమాణము లగుటచే నట్టివర్ణన విశేషాధాయకము; విద్యాధరు లగుటచే సముచితము. నఅణీయస్ అని ఛేద మున్నందున ధ్యానశబ్దములోని 'య'తో యతి సరిపడును" అని. అంతట వారు "ఇయస్ తర ప్రత్యయములు సమార్థకములు. ఇవి యొకటిదానిపై నొకటి రాఁదగునా" యని యాక్షేపించిరి. "శ్రేష్ఠతమాయకర్మణే ఆప్యాయధ్వమ్" అని శ్రుతి నుదాహరించితిని. అది వైదికప్రయోగము. లోకమున నెట్లు పనికివచ్చు ననిరి. లోకమునం గూడదని నిషేధములే దని చెప్పుకొంటిని. ఇట్టి ప్రయోగాంతరము భాషలో చూపఁగలవా అనిరి. ఈ పద్యము నుదాహరించితిని: ఆముక్తమాల్యద ౩-౯౨

స్రగ్విణి: "ఆస్థితాహీంద్రశయ్యాదవీయస్తర
ప్రస్థితాంఘ్రిశ్రితవ్రాతచేతోముదా
కస్థలప్రస్ఫురత్కాశియశ్శ్వేశమూ
ర్ధస్థలీనృత్తమత్తల్లిహల్లీసకా."

అంతట వారు "అంగీకరించితిని, సంతోషించితిని. ఈ పద్యమునకు నేను అర్థము చెప్పక విడిచితిని. నేఁడు చెప్పెదను" అని సెలవిచ్చిరి. అంతట నేను ప్రాంజలినై కృతార్థతం తెలుపుకొంటిని. నాఁటినుండియు అప్పుడప్పుడు ప్రసంగవశంబున ఎఱుఁగఁగలవారితో నేను నాకడమసవరణతో దీనినిం బ్రస్తావించుట గలదు. పిమ్మట పారిజాతాపహరణమును ఈ సవరణతో ముద్రించితిని. ఇతరుల తదనంతర ముద్రణలకును ఈ సవరణ యెక్కిన దని తలంచెద.

ఉ. హారిమయూరవిభ్రమము లంచలఁ జెందఁగఁ దద్విలాసముల్
బారలఁ జేరెఁ బుష్పితకదంబవిజృంభణస ప్రవర్ధనా
నారుచిరప్రసూనభజనం బొనరించి శరత్సమాగమం
బారయ నంబుదాగమమహామహిమోన్నతి నాక్రమించినన్.

ఉ. బాలలు లీలతో బలుసుఁబండులచాయఁ దనర్చి పండికై
వ్రాలిన రాజనంబులకు వచ్చు శుకంబులఁ జేరనీక పోఁ
దోలి రవంబుతోఁ జెఱకుఁదోఁటల నీడలనుండి పాడి రు
న్మీలితహావభావరమణీమకరాంకుని సాహసాంకునిన్.

(జక్కన. విక్రమార్కచరిత్ర-శరదృతువర్ణనము -౪-౩౬,౩౯.)
రవము విని వీ రున్నారని యెఱింగి చిలుకలు తొలఁగిపోవు నవి భావము.

దండయాత్ర :

మ. "దివిజస్త్రీకుచకుంభకుంకుమముతో దివ్యాంగనాపేటికా
నవకర్పూరరజంబుతో నమరకాంతాదేహహారిద్రపం
కవిశాలోన్నతితో సుధీనిటలభాగన్యస్తకస్తూరితో
నవనీరేణువు సాటియై పరఁగె నాశాకాశసీమంబులన్. —౪-౯౦.

పీటిక ర్థమే గదా పేటికలో నుంచుట; మఱియు పేటికలో నుంచుటకన్న బరిణలో నుంచుకొనుట స్వాభావికము. వస్త్రములను పేటికలో నుంచుకొందురు. కావున పీటికా అనవలయు. ప్రక్రమము దివిజస్త్రీసంబంధి వస్తువులై యుండ నడుమ సుధీసంబంధివస్తువుం జెప్పుట ప్రక్రమభంగము గాదా. పైగా సుధీమాత్రులకు కస్తూరీతిలక మేమి? ప్రభువులకైనం దగుఁ గాక. కావున సురీ అనవలయు.

సురతావసానవర్ణన :

సీ. తొంగలిఱెప్పలతుదలఁ గైవ్రాలిన
కొసరుఁజూపులయందు మిసిమి దోఁపఁ
దారహారములనంతరఁ గళాసించిన
కుచకుంభములు మీఁదఁ గొంత నిక్క
గుంతలంబులత్రుళ్లగింతలు సడలిన
కెమ్మోవిచుంబనక్రీడ కెలయ
మణికాంచివలయంబు మౌనంబు గైకొన్న
యురునితంబము కేళి కుత్సహింపఁ

గీ. జెమట చిత్తడి మైపూఁత దెమలి చనిన
నెమ్మనంబునఁ దమకంబు నివ్వటిల్ల
నున్న జలజాక్షియొప్పు నృపోత్తమునకు
మదనపునరుద్భవనికారమంత్ర మయ్యె. —౪-౨౨౬.

తుదలన్, నర్తనన్ అను పదములు ప్రథమాంతములుగా నుండవలయు. క్రైవాలిన, కళాసించిన, సడలిన, క్రైకొన్న అనుభూతార్థక్రియావిశేషములు చేదాద్యర్థకములుగా నుండవలయును. పునర్భవనికారమంత్రము పునర్భవనకారిమంత్రము గావలయును. తదనుగుణముగానే దీని కవతారికాప్రాయమగు నవ్యవహిత పూర్వపద్యము.

క. సురతావసానలీలా
పరిరంభముమీఁది రతికిఁ బ్రారంభముగాఁ
దరుణియు నరుఁడు రమించిరి
కర మరుదుగఁ జతురశీతికరణప్రౌఢిన్. ౪-౨౨౫.

ప్రమదవనవిహారము :

చ. "అలరులతోటలోన విరులన్నియుఁ గోసితి రంచు కోటుఅన్
సొలయఁగనేల బాల యిటుచూడఁగదే లతికావనీరుహం
బులదెసఁ ద్రవ్వి తండములు పుష్పము లున్నవి యంచుఁ బోఁడ యై
పలుకు వయస్య నేర్పుకల భామిను లెల్లను మెచ్చి రిచ్చలన్."
—౫-౩౫.

ఇట వయస్యపల్కున నేర్పేమున్నది? ప్రౌఢి యేమున్నది? జక్కన ప్రతి పద్యము చోద్యముగాఁ జెప్పఁబ్రతినపట్టినవాఁడు.

క. "ప్రతిపద్యము చోద్యముగాఁ
గృతి చెప్పిన నొప్పుగాక కృతి నొకపద్యం
బతిమూఢుఁ డైన జిత్రతఁ
బ్రతిపాదింపఁడె ఘుణాక్షరన్యాయమునన్." —౧-౧౩.

ఇందు చోద్య మేమున్నది? పువ్వులు తనకు లేవాయెనని యలయుచున్న ముగ్ధను విక్రమార్క చక్రవర్తి నవవధువును తదీయవీక్షణమాత్రముచే 'తిలకో వీక్షణేన చ' అని దోహదకళయందుఁ జెప్పినరీతిగా తిలకములు పూచును గావున

ప్రౌఢవయస్య వానిని చూడు మన్నది. ఇందలి చమత్కారమును వివరింపం బని లేదు. ఉన్నభామినులు కోపనలందఱు. ''కోపనా సైవ భామినీ''. నవ్వి రనుట మందము. మాటనేర్పునకు మాటనేర్పరులు హర్షించి రనుట సుందరము; కావున ''తిలకావనీరుహంబు'' లనియుఁ, ''కలభాషిణు'' లనియుం బఠింపవలయు.

సీ. ''పదునాల్గుజాతులఁ ద్రిదివకాంతల మీఱు
పద్మినీజాతి సౌభాగ్యవతులు.''

—రాఘవపాండవీయము. ౧-౧౨.

''అఖిలదిగ్దేశభూపసమర్పితంబు
లగుచు నరణము గతిఁ దోన యరుగుదేరఁ
దను వరించు జయశ్రీలఁ గొనుచు నతఁడు
పురికి జనుదెంచు సొంపు వాగగోచరతఁ బరఁగె''

అని వాక్యశేషము. దశరథమహారాజునకును పాండురాజునకును వారిచే దిగ్విజయమున జితులైనరాజులు పదునాల్గుజాతుల పద్మినులను అర్పించి రని టీకాసారము. ఆ పదునాల్గుజాతులను టీకాకారుఁడు ఇట్లు పరిగణించినాఁడు : ''బ్రహ్మ, క్షత్ర, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాహణ, కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకర, తిలఘాతక, లుబ్ధక, చండాల, మాతంగు లనెడి పదునెమిదిజాతులలో బ్రాహ్మణజాతియు, నరబాహ్య లయిన లుబ్ధకచండాలమాతంగజాతులయందును'' అరిగాఁపులిచ్చిన యీ పద్మినుల యందలి రజక, చర్మకరపద్మినులును. దశరథపాండులకు భోగ్యలా ? కారేని వారి పద్మినీత్వప్రస్తావన యేల, తదర్పణ మేల? 'పదునాల్గుజాతుల త్రిదివకాంతలన్' అని సమాసముం జేయవలయును. పై పాండురంగమాహాత్మ్యగత 'స్మరశశీ'త్యాది పద్యముద్రణ విమర్శయందుఁ జెప్పఁబడిన పదునాల్గుతెగల యప్సరస లర్థము వారిని మీఱు పద్మినులను అరిగాఁపురాజు లిచ్చిరనుట సమంజసము.

గీ. ''జగతిఁగోసలకేకయమగధుల తన
యలవరించిన యాజ్ఞలో మెలఁగఁజేసె.''

ఇట టీకాకారుఁడు రామాయణార్థమున 'కోసల...తనయులన్' అని సమాసముగాఁ గొని భారతార్థమున 'మగధులన్' అని విడఁదీసి ''ఈ దేశములరాజులను'' అని

యర్థము వ్రాసి ద్రుతకార్యము రామికి గతి వ్రాయకదాఁటినాఁడు. 'మగధుల' ఇందలి తుదియకారము అవధారణార్థకము. లక్షణచే కోసలకేకయమగధరాజులు సయితము, అనఁగా అంతటి గొప్పరాజులు కూడ అని యన్వయము సేయ వలయును.

భారతము-ధర్మజు వాక్యము - కర్ణుని గుఱించి :

చ. ''అతనికి నాకునుం గలిగె నాహవ మింతకుమున్న యందుఁ బా
ర్షదుఁడును సత్యకాత్మజుఁడు శాంతనవాంతకరుండు ద్రౌపదీ
సుతులును జూడఁగా నతఁడు సూతహయధ్వజపాతనంబు సే
సి, తనువుఁ దీవ్రకాండములఁ జెంఁదగ నే వెగడందితిం గడున్.''
కర్ణప. ౩-౩౦.

ఇట్టి పద్యము ప్రాచీనభారతముద్రణమందును, శబ్దరత్నాకరమందును గలదు. ఇందలి తదప్రాసముం గని కొంద రిదానింతనులు తదప్రాసముం బ్రయోగించిరి; ప్రమాణ మడిగినవారికి దీనినే చూపించిరి. ఇందలిది పార్షతశబ్దము గాని పార్షద శబ్దము గాదు పృషతుఁ డనురాజర్షియొక్క గోత్రాపత్య మగుటంబట్టి దృష్టద్యు మ్నుఁడు పార్షతుఁడు, ద్రౌపతి పార్షతి. ఇంచుక పొరబాటు ఇంతచెట్టం దెచ్చినది.

గీ. ''తరుణి నతనాభిమండలోదంచనాభి
రామరోమావళీజ్యావిరాజమాన
నీదు తను వుండఁజేసి తానెఱఁకునేయు
రతివరుఁడు హారగుళికల రాజవదన.''

—శృంగారనైషధము.

దమయంతిని ఉండచేసిన పిమ్మట పెండ్లి యెవరికి? ఎవరి నెఱుకులకును వేయును? ఆమెనే గోతములో కట్టి ఎముకలు విఱుగఁగొట్టునా ? ఇట్లు పఠింపవలయు. ''ఉండఁజేసితా'' అను దానిని ''ఉండవిలుసేసి'' అనియు, ''రాజసదనను'' ''రాజహంసు''గాను పఠించునది. ఇందులకుమూలము :

''త్వద్గుద్భావళి మౌక్తికాని గుళికా స్తం రాజహంసం విభో
ర్వేధ్యం వద్ధి మనోభువః స్వమపితాంమంఙుం ధనుర్మఞరీమ్
యన్నిత్యాఙ్క నివాసలాలిత తనుజ్యాభుజ్యమానం లస
న్నాభీమధ్యబిలావిలాస మఖిలం రోమాళి రాలమ్బతే.'' —౩-౧౨౩

మహా. స్రగ్ధర :

''రతిక్రీడాహంసమోహగ్రహణశశిభృశప్రార్థనోన్నిద్రతారా
పతియై దుఃఖించు సత్యప్రసృమరనిజదృగ్బాష్పధారాగతుండున్
ప్రతిబింబప్రాప్తలాభప్రముదితసుతయై రంజిలున్ రాత్రు లేతత్
ప్రతిపక్షక్షోణిపాలప్రమదగిరిదరీప్రాంతకాంతారభూమిన్.''

ఇది యన్యముద్రణపాఠము ఇందు పూర్వార్ధమునం బదియక్షరదోషము లున్నవి. 'రతి క్రీడా' 'గ్రహణ' 'శశి' 'ప్రార్థనో' 'సత్య' 'తుండున్' అను నాలుతుండ్లను మార్చి యీ యర్థము నిట్లు పఠింపవలయును.

''రతిఁ గ్రీడాహంసమోహగ్రహిశ శిశుభృశప్రార్థితోన్నిద్రతారా
పతియై దుఃఖించు సద్యఃప్రసృమరనిజదృగ్బాష్పధారాగతేందు.''

ఇందుకుమూలము :

''ఏతద్భీతారినారీగిరిబిలవిగళద్వాసరానిస్సర స్త్రీ
స్వక్రీడాహంసమోహగ్రహిశశిశుభ్నశ ప్రార్థితోన్నిద్రచంద్రా;
ఆక్రన్దద్భూరియత్త న్నయనజలమిళచ్చంద్రహంసానుబింబ
ప్రత్యాసత్తిప్రహృష్యత్తనయవిహసితై రాశ్వసీన్న్యశ్వసీ చ్చ.''
—౧౨-౨౮.

ఆంధ్రప్రసన్నరాఘవనాటకము-V. ఇందు ఈక్రిందిశ్లోకమున క్వ శబ్దము నాంధ్రీకర్త యేవాక్యములోని కాకర్షించికో కనుటకై దాని తెలుగుం గనఁగా అది యిట్లుండినది. రసాభాసము నేను చెప్పనక్కఱలేదు.

''మాతస్తాతః క్వయాతః సురపతిభవనం హా కుతః పుత్రశోకాత్
కోఽసౌ పుత్ర శ్చతుర్ణాం త్వ మవరతయా యస్యజాతః కిమస్య
ప్రాప్తోఽసౌ కాననాన్తం కి మితి నృపగిరా కింతథాఽసౌ బభాషే

మద్వాగ్బద్ధః ఫలం తే కి మిహ తవధరాధీశతా హా హతోఽస్మి.''

ఇది మాతులగృహాగత భరత కైకేయీ సంవాదము :

శా. ''అమ్మా యెక్కడి కేగెఁ దండ్రి? సుత! యింద్రాస్థాని; కేలా వియో
గమ్ముం గల్గగ నాత్మపుత్రు నిధి పోఁగా నేల యాతం ధర

ణ్యమ్ముం గూర్చి నృపోక్తి నాతఁ డెటు లన్యాయంబుగం బల్కె వా
క్య మ్మెబంధము గాఁగ నాదిఫల మేమౌ నీకు రాజ్యం బయో.''—V

జామదగ్న్యుఁడు - (విలోకించి) వీఁ డర్ధముగ్ధుఁడు గదా ! ఎందువలన ననన్ వీనిఁ గామించుచున్నాఁడు. చెప్పుటయందు రాముఁడని పల్కుచున్నాఁడు. IV.

ఇందులకు మూలమైన దుష్టముద్రణము. ''అర్గముగ్ధః ఖల్వయం జనః, యదేనంకామయత. వక్తవ్యే రామ ఇతి జల్పతి.''ఆంధ్రీకర్త ''కామయతః''అను పదమును 'కామయతే' అను నర్థమునం గొనెఁ గావలయు.ఇందులకు సాధుముద్రణము 'అర్ధ...కామ ఇతి వ్యక్తవ్యే రామ ఇతి జల్పతి." కామ అనుటకు రామ అనుటలో మా సరి, రా తప్పు కావున సగమే మూఢుఁ డనుట.

—భారతి

ప్రమోదూత, జ్యేష్ఠము - జూన్, 1930
సంపుటము 7; సంచిక. 6.



# ఆంధ్ర జానపదగేయ సాహిత్యము

—డాక్టర్ బి. రామరాజు

పద్యము కన్న పదమే ముందు పుట్టిన దనియు, ఆ పదము (గేయము) కూడ నాగరకతాప్రారంభమున మానవుడు సంతోషసమయమున చిందులువేయుచు కూనిరాగముల నాలపించుచు లయాన్వితము లగు మనోభావముల వెలార్చుటచే నుద్భవించిన దనియు సాహిత్యతత్త్వజ్ఞుల యభిప్రాయము. కొందఱు పండితులు పనిపాటలు చేయు మానవులు తమకష్టము కనబడకుండుటకై య్రప్రయత్నముగా నేవో మాటలు లయాన్వితముగా గేయరూపమున బహిర్గత మొనర్చి రనిరి. ఇందేది సిద్ధాంత మైనను కవిత్వ ముల్లాసమునకును కష్టనివారణమునకును పుట్టిన దని భావింపవచ్చును. భారతదేశమున పూర్వమును ఇప్పుడును జనపదములే కనుక నిట్టి గేయములకు పుట్టినిండ్లును జనపదములే యగును జానపదులందే ప్రచారమునునుండుటచే నిట్టి గేయములకు జానపదగేయము లని సర్వసాధారణ మగు పేరు కలిగినది. జనపదజానపద శబ్దములు క్రమముగా దేశ భాగమునకును అందుండు ప్రజలకునుమన పూర్వసాహిత్యమునవాడబడినవి. జానపదగేయములనే పల్లెపాటలందురు కూడ. ఔత్తరాహులు లోకగీతము లందురు. ఇంగ్లీషులో వీనినే 'ఫోక్‌సాంగ్సు' అందురు. ఇది జర్మనుభాషాజన్యము. పాశ్చాత్యదేశములందు సాహిత్యాభిమానులును, నృత్యశాస్త్రవేత్తలును కడచిన రెండు శతాబ్దములనుండి ఇట్టి గేయములను, వాఙ్మయమును సేకరించి పరిశోధనలు సలుపుచున్నారు. ఆయాజాతులకును భాషాసాహిత్యములకును ఇట్టి గేయములే మూలకందము లని వార లభిప్రాయపడియున్నారు.

జానపదగేయమునకు ముఖ్యలక్షణములు ౧. అకర్తృత్వము లేదా సామూహికకర్తృత్వము ౨. స్థిరరూపరాహిత్యము ౩. రచనాకాలము తెలియకపోవుట ౪. మౌఖికప్రచారము ౫. అకృతకశైలి ౬. గేయత్వము ౭. ఆశురచనము ౮. పునరావృత్తి ౯. జనసామాన్యపరిచితవస్తువు. ప్రతిగేయమున ఈ లక్షణము లన్నియు నుండ నవసరములేదు. కాని యీ లక్షణము లన్నింటి కూడలి యగు ప్రధానతత్త్వము-అజ్ఞాతశిల్పము మరియు సార్వజనీనత యున్న చాలును. కనుక ప్రాక్తనమానవుని మనోగతభావవ్యక్తీకరణము లైన లయాన్వితము లగు నుడు

గులు మొదలుకొని యఖండపాండితీమండితుల జనామోదము గల పదకవితలును జానపదగేయములే యగును. ఒక్కొక్క లక్షణమును బట్టి ఏది జానపదగేయమో ఏదికాదో నిర్ణయించుట కన్న సాహిత్యతత్వము ననుసరించి కవిత్వమంతటిని రెండు పెద్దవిభాగములు చేయవచ్చును. ఒకదాని తత్వము జ్ఞాతశిల్పము, మరింకొకదాని తత్వ మజ్ఞాతశిల్పము. మొదటిది భావుకుడైన కళాకారుని ప్రయత్నమున దిద్ది తీర్చబడినది. రెండవది జానపదుని సృష్టి. మరియు నప్రయత్నముగా ఒకనోటినుండి ఇంకొక నోటి కెక్కి ఒకప్రాంతమునుండి ఇంకొక ప్రాంతమునకు ప్రాకి తనకు తానే రూపుదిద్దుకొన్నట్టిది. మొదటిది ఏకకర్తృకము. రెండవది అజ్ఞాతకర్తృకము లేదా సామూహిక కర్తృకము. మొదటిది నాగరకతామందారసౌరభ్యసంవాసితము. రెండవది ప్రాకృతత్వపృథ్వీగంధబంధురము. మొదటిది రెండవదాని క్రమపరిణామ వికాసరూప మని విజ్ఞుల యభిప్రాయము. ఆంధ్రకవిత్వముకూడ ఇట్టి క్రమపరిణామమునకు వెలయైనది కాదు. జానపదగేయములే దేశికవితగా పరిణమించినట్లు మనకనేకాధారము లున్నవి. సీస, గీత, రగడ, ద్విపద, మధ్యాక్కర, తరువోజాది దేశీయఛందములు కొన్ని జానపదగేయముల కొలదిమార్పులతో నల్లబడినట్లు భావింపనగును.

పండిత సారస్వతమున కన్న జానపద సాహిత్యమునకు నిత్యజీవితము నలముకొను శక్తి హెచ్చు. రాజపోషణమున పండితప్రకాండుల యాదరణమున శిష్టసాహిత్య మభివృద్ధి నందినది. కాని జానపదగేయ సాహిత్యము మాత్రము కేవలము ప్రజానీక మిచ్చిన కేలూతవలననే కాలు నిలద్రొక్కుకున్నది. ప్రౌఢోక్తులచేతను, కవిసమయములచేతను, పాండిత్యప్రకర్షాప్రకటనముచేతను శిష్టసాహిత్యము జానపదులకు బెదురుబొమ్మ యైనది. జానపదగేయములం దిట్టి ప్రౌఢోక్తులు గాని పాండిత్యప్రకర్షగాని యుండుటకు వీలులేదు. ప్రజలు నిత్యజీవితమందు వాడుకొనెడు వ్యావహారికభాషయందు సులభశైలిలో సాధారణరీతిలో మనోభావములు వెలార్చునట్టి జానపదగేయములే వారికి ప్రీతిపాత్రములు. ఇదిగాకను జానపదగేయము లాయాదేశములందలి మతపరిణామములను, మనస్తత్వములను, వీరుల యుదంతములను, పతివ్రతల కథలను, అత్యాచారములకు గురియైనవారి గాథలను, ఆచారవ్యవహారములను, విశ్వాసములను వినోదములను, విందులను వేడుకలను, అన్యోన్యానురాగములను, వియోగసంయోగములను, సౌందర్యసౌభాగ్యములను, సుఖదుఃఖములను జాతీయత ప్రతిబింబించుటచే నిజాన

పదగేయములు నిసర్గమనోహరములుగా నుండును. ఆంధ్రదేశమందును కళల వలెనే కవిత్వముకూడ నిత్య జీవితము నాక్రమించి యలముకొన్నది. కట్టుబొట్టు, ఇండ్లువాకిండ్లు, పాత్రలు, ఆభరణములు కళామయము లైనటులే కూలిపని,పడవ లాగుట, విసరుట,దంచుట మొదలగు ప్రతి పనికిని కవిత్వ మూతగా నిలబడినది. జాతీయత నింతగా పుంజి కొన్నవి. కనుకనే ఈ పదకవితలు దేశికవితగా పరిణతి పొందినవి. దేశీయులగు కవులు మార్గకవిత్వముపై తిరుగుబా టొనర్చి దేశీయ వృత్తముల దీసికొని దేశి ఛందములందు దేశీయుల కనువైనట్లు చెప్పిరి. సంస్కృతమార్గ మవలంబించిన కవులకు పండితులకు ఈ విధానము నచ్చలేదు. సంస్కృత కవులకును ప్రాకృత కవులకును ఇట్టి వైమనస్యమే యుండినట్లు తెలియుచున్నది.

గేయసాహిత్యము చిరకాలమునుండి తెలుగునాట వృద్ధియైన దనుటకు శిష్ట కవులు పేర్కొన్న సమకాలిక గేయములే గొప్ప సాక్ష్యము. గేయములన్నియు మాత్రాఛందమున నుండును. గేయకవితలు దేశికవితలుగాపరిణతి నొందిన ట్లిది వరకే చెప్పితిని. ఆదికవి యని పలువు రామోదించిన నన్నయకు పూర్వమున నున్న శాసనములందే దేశికవితారీతులు గాన్పించుచున్నవి. పొట్లదుర్తి మాలెపాడు శాసనమున (6 వ శతాబ్ది) రగడ, గుణగవిజయాదిత్యునికాలము (845) నాటి పండరంగుని శాసనమున తరువోజ, యుద్ధమల్లుని బెజవాడశాసనమున మధ్యాక్కరలున్నట్టు లంద రెరిగినవిషయమే. స్వయముగా నన్నయభట్టారకుడు తరువోజ, మధ్యాక్కర, అక్కర, మధురాక్కరలను వాడెను. నన్నెచోడుడు దేశి కవిత్వమును దేశిసత్కవులను సంస్తుతించెను. తన కాలమున ప్రచారమున నున్న కొన్ని గేయరీతుల నాతడు పేర్కొనెను. అంకమాలికలు, ఊయలపాటలు, ఆలతులు, గౌడుగీతములు, రోకటిపాటలు మున్నగునవి నన్నెచోడుడు పేర్కొనెను. నన్నెచోడుని తరువాత మన కీ గేయముల జాడ యధికముగా గానబడునది పాల్కురికి సోమనాథుని రచనములందు. స్వయముగా సోమనాథుడే శైవమత ప్రచారమున కనుకూలమగు దేశిఛందము చేపట్టి "ఉరుతర గద్యపద్యోక్తుల కంటె, సరసమై పరగిన జానుతెనుంగు, చర్చింపగా సర్వమాన్య మగుట కూర్చెద ద్విపదలు కోర్కి దైవార" నని సాహిత్యమం దొక నూత్నమార్గము నుద్రొక్కెను. సోమనాథుని కవిత్వమునకాధారము లానాడు ప్రజలు భక్త్యుద్రేకములతో పాడుకొన్న గేయములే నట. "అతతబసవపురాతనభక్తిగీతార్థ సమితియే మాతృక గాగ" నాతడు కవిత్వమునకు గడంగెను. సోమనాథుడు రోకటిపాటలను, తుమ్మెద, ప్రభాత, పర్వత, ఆనంద,

శంకర, నివాళి, వాలేరు, గొబ్బి, వెన్నెల పదములను పేర్కొనెను. కాల మిదమిత్థముగా తెలియని ఏగంటి వారి వచనము లాంధ్రదేశమంతటను ప్రాకిపో యినవి. వారి కాలజ్ఞానవచనములందు తుమ్మెదపదములు, ఏలపదములు, లెల్లె పాటలవంటివి గలవు. పోసెట్టి లింగకవిచే నవచోళచరిత్ర ప్రస్తావనలో నాదిమ శివభక్తిస్తుతిలో బాల్కురికి సోమనాథుని పిమ్మట సుప్రసిద్ధగేయరచయితగా స్తుతింపబడిన గార్లపాటి లక్ష్మయ్యగారే యాగంటి లక్ష్మయ్యగా రని విజ్ఞుల యభి ప్రాయము. లక్షణకారు లుదాహరించిన నాచనసోముని జాజరపాట ఛందముననే ఇప్పటికిని తెలంగాణమున జాజరపాటలు కామునిపున్నమపండుగ సందర్భమున జానపదులు పాడెదరు. కేతన దశకుమారచరిత్రమున మూలమందు లేని పాటల ప్రసక్తి కలదు. శ్రీనాథుడు యక్షగానములను జాదుర (జాజర) లను తడవెను. మంచనశర్మ టిట్టిభశెట్టి మిత్రద్వయ మోరుగల్లు చూడబోయి ద్విపదప్రబంధ మున వీరానీకముం బాడు వనితను, పరశురాముని కథలను బాడు బవనీల చక్ర వర్తిని, కామవల్లీమహాలక్ష్మీకైటభారివలపు వాడుచువచ్చు జక్కులపురంధ్రిని గాంచెను. పోతన్న గోవిందుమీది పాటలు వినెను. కొఱవిగోపరాజు వెన్నెలగుడి పాటను పేర్కొనెను. పదకవితాపితామహు డని పేరెన్నిక గన్న తాళ్ళపాక అన్నమాచార్యులవారు తమకాలమందు వినబడుచుండిన జానప గేయముల మాది రులకన్నిటికిని సరిపోవునట్లు సంకీర్తనల రచించిపెట్టిరి. ఈయన భార్య తాళ్ళ పాక తిమ్మక్కగారికృతి సాగిన దీపాటబాటయందే. తాళ్ళపాకవంశము పదకవిత లకు పంటపొలము. చినతిరుమలాచార్యుడు పదములు వ్రాయుటయే కాక సంకీర్తన లక్షణముగూడ రచించెను. తాళ్ళపాకవారి రచనములు జానదగేయములు కాక పోయినను గేయస్వరూపములను వాని పరిణామమును మాత్రము సూచించును. సంకీర్తన లక్షణములందు ఏలలు, గొబ్బిళ్ళు, చందమామ పదములు, అర్ధచంద్రి కలు మొదలగు గేయముల లక్షణములు వివరింపబడినవి.దిగ్విజయార్థము బయలు దేరనున్న శ్రీకృష్ణదేవరాయల కపరిమితోత్తేజ మొకజానపదగేయము కలిగించిన యైతిహ్యమంద రెరిగినదే. స్వయముగా నామహారాజు ప్రాతర్వేళల "సంధు యంత్ర నతి కృత్రోద్గీతగేయౌఘము" ల్వినెను. లభించినంతవరకు మొదటి దిగా భావింపబడు కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయ యక్షగానమున వివిధము లగు గేయఫణితులు కాననగును దామెరల వెంగళభూపాలుఁడు, జాజరపాటలను ధవళములను కళ్యాణపు పాటలను పేర్కొనెను. కదరీపతి నాయకుడు "సువ్వాలు

న్నోళ్ళనములు ధవళాలు న్మొదలైనపాట''లే కాక ఏలపదములు, రాట్నము పాటలు, గొబ్బిళ్ళపాటలు, పరశురామునిపై పాటలు దడవెను. నాయకరాజుల కాలమందు పదకవిత్వము పరాకోటి నందినది. రంగాజి రామభద్రాంబ కృష్ణాజి మొదలగు కవయిత్రులే కాక విజయరాఘవనాయకుడు మొదలగువారును, పద కవిత ల్లిరి. భద్రాచల రామదాసు పాడినపాటలు జానపదగేయములుగా ప్రచార మందినవి. క్షేత్రయ్యగారు మువ్వగోపాలుని మోహించి పాడినపాటలును, అన్న మాచార్యుని భక్తిసంకీర్తన పథమున నడచిన త్యాగరాయలవారి కీర్తనలును కర్ణాటకసంగీతసరస్వతికి తలమానికము లైనవి. పదకవిత్వమునకు గల ప్రచార మును జూచి పండితకవుల పండ్లుగూడ పులిసినవి. ఎలకూచి బాలసరస్వతి, కంకంటి పాపరాజు, గోగులపాటి కూర్మనాథకవి, అల్లూరి కుప్పనవంటి పండిత కవులుగూడ పదరచనమునకు చేయి చేసికొనిరి. వీరి దంతయు పదకవిత్వమే యైనను ప్రౌఢమైనది. ఇది దేశిసారస్వతమున జేరిపోవుచు. కాని గేయకవితా పరి ణామమును కనుగొనుటకు మాత్రము తోడ్పడును. ఇది నన్నయకు పూర్వము నుండి త్యాగరాజువరకు వచ్చిన సాహిత్యమున పదకవితాప్రసక్తి మాత్రమే.

త్యాగరాజు తరువాత స్వయముగా జానపదులు రచించినవి లేదా జనప దములందు ప్రచారముగాంచినవి గేయము లనేకము దక్కిన వనుకొనవచ్చును. కొన్ని కాలగర్భమున గలిసిపోయి యుండును. ఏ సాహిత్యమునకును ఈవిపత్తు తప్పినదికాదు. భద్రపరచెడువా రుండినచో యాగంటి లక్ష్మయ్యగారి వచనముల వలెనే అతిప్రాచీనగేయములు మనకు మరికొన్ని యైనను దక్కియుండును- ప్రాత తాళపత్ర గ్రంథములం దచ్చటచ్చట కొన్నిపాటలుమాత్రము కనబడు చున్నవి-ముద్రణా సౌకర్యములు కలిగిన ప్రకాశకులు తమ లాభముకొఱకు చేసిన పనియే యైనను ఈ గేయసాహిత్యమునకు కొంత మేలే జరిగినది-ముద్రితగేయ ములం దధికభాగము ఆధునిక మే. మౌఖికప్రచారమున నున్న చిన్న చిన్నగేయము లాధునికు లగు ఉత్సాహవంతులు సేకరించి ప్రకటించుచున్నను సేకరించవలసి నవి ప్రచురింపవలసినవి అధికము. వానిసంఖ్య లక్షల కెక్కును. వాని చావు పుట్టుకలు పెరుగుటవిరుగుటలు జానపదుల జిహ్వాంచలములందే జరుగుచున్నవి. ఏ గీత మెప్పటిదో ఎన్నియెన్ని మార్పుల నందినదో తెలిసికొనజాలము.

ఇట్టి జాతీయసంపదగూర్చి తొలిసారిగా నాంధ్రలోకమునకు కనువిప్పు కలి గించినది బ్రౌనుమహాశయుడు. తెలుగుభాషయందున్న గొప్పదనమును తెలిసికొని

ప్రపంచమునకు చాటిన బ్రౌనుమహాశయుడే ఆంధ్రజానపదగేయములకు ప్రజల యందున్న ప్రాచుర్యమును పండితుల కీసాహిత్యముపై గల ఈసడింపును చక్కగా నుల్లేఖించెను. ఆయనయే గేయములు సేకరించుటకు పూనుకొన్నచో మనకు శిష్ట సాహిత్య మెంత సమృద్ధిగా సంక్రమించినదో అంతియ జానపద గేయ సంపద లభించి యుండును. ఆయన చేసిపోయిన సేవ వేరు. తరువాత ముప్పదేండ్లకు మరల నొక పాశ్చాత్యపండితుడు తొలిసారిగా జానపదగేయముల సేకరించెను. ఆయన జె.ఎ. బాయ్‌లీ ఎం.సి.యస్., గారు. ఆయన రాయల సీమలో రాజకీయోద్యోగిగా 1874 ప్రాంతములం దుండెను. అప్పటికే గోవరు మహాశయుడు దక్షిణ భారత జానపద గేయములను ప్రకటించియుండెను. దానిలో తెలుగుపాటలు లేవు. తమిళ, కన్నడ, మళయాలభాషలం దున్న గేయ ములను కూర్చి తెలుగు గేయములకు మారుగా వేమనపద్యములను చేర్చెను. ఇది చూచిన బాయ్‌లీగారు కొన్ని జానపద గేయములను సేకరించి ప్రకటించెను. తరువాత ఇరువదియవ శతాబ్ది ప్రారంభమున నుత్సాహవంతులగు పండితులును ప్రచురణకర్తలును ఈ గేయములు సేకరించి ప్రకటించిరి.

ఇప్పటికి లభించిన ముద్రితాముద్రిత జానపదగేయము లన్నింటిని విమ ర్శనా సౌలభ్యమునకై కొన్నిభాగములుగా విభజించుకొనవచ్చును.

౧. పౌరాణికగేయములు : జానపదగేయములుకూడ మన శిష్టసాహిత్యము వలెనే వివిధపురాణేతివృత్తములు కలవి బహుళప్రచారమం దున్నవి. సంస్కృత విషయ మెట్లున్నను ఆంధ్రమున మాత్రము శిష్టసాహిత్యమందలి వస్తువు, జానపద గేయమందలి వస్తువు ఈ రెండును ఒకదాని కొకటి సహాయపడినట్లు భావింప వచ్చును. స్వయముగా పాల్కురికి సోమనాథుడు బసవపురాణరచనకు మూలము ప్రజ లందు ప్రచారమునను్న భక్తులచరిత్రములే యని చెప్పియున్నాడు. అనువాదము లగు రామాయణభారతాది గ్రంథములందును మూలమున లేని కథలు పెక్కు లున్నవి. అట్టివి జానపదగేయములందుగూడ నుండుటచే ఇట్టి కూర్పులు సంస్కృ తమునుండి ఆంధ్రానువాద మొనర్చిన శిష్టులు చేసినతరువాత నాగాథలు వినిన జాన పదులు వానిని స్వీకరించిరో లేక జానపదులలో ప్రచారమందున్న ఈ మూలాతి శాయివిషయములు తమకు రుచించుటచే పండితులు చేపట్టిరో ఇదమిత్థముగా చెప్ప జాలము. కాని ఈ రెండును పరస్పరోపకారము లని మాత్రము భావింపవచ్చును- జానపద గేయములలో మనము శిష్ట సాహిత్యమం దున్న ప్రసిద్ధ పౌరాణిక గాథ

లన్నియు చూడగలము. పౌరాణికగాథలపై జానపదుల కమితమైనభక్తి.పండితులు సుహృత్సమ్మితముగానందించిన అగమార్థములను ఆక్షరాస్యులు పురాణములనుండి గ్రహింపగా పామరు లీజ్ఞానామృతమును జానపదగేయముల వలన గ్రహించిరి-ఇవి వారికి దెలిసెడుభాషలో వారిచిత్తవృత్తుల కనుకూలముగా మలచబడినవి. వారి వారిచిత్తవృత్తులననుసరించి ఆయాకథలందు వింతవింతలగు మార్పులు కలిగినవి. కూర్పులు కుదింపులైనవి.రామాయణభారతభాగవతాదులందలి కథలును, అష్టాదశ పురాణములందలి ప్రసిద్ధకథలును, జానపదులచిత్తవృత్తి ననుసరించి మలచబడి నవి. శిష్టవాఙ్మయమున రామాయణమూలకగ్రంథములు తదితరగ్రంథములకన్న నెక్కుడుగా నున్నటులే భారతభాగవతాదిగ్రంథముల కథలకన్న రామాయణగాథలు చెప్పెడు జానపదగేయములును అధికసంఖ్యలో గలవు. మూలమున లేనిగాథలు కొన్ని రంగనాథభాస్కరరామాయణములం దున్నవి. అట్టిగాథలే కాక మరికొన్ని గాథలుకూడ జానపదగేయము లందున్నవి. ముద్రింపబడినరామాయణగాథాగేయ ములసంఖ్య నూటికి మించదు. అముద్రితములంతకన్న నెక్కుడు గలవు. కూచ కొండ రామాయణము,శారద రామాయణము,ధర్మపురి రామాయణము, రామకథా సుధార్ణవము. మోక్షగుండ రామాయణము, సంక్షేప రామాయణము, సూక్ష్మరామా యణము, గుత్తెనదీవిరామాయము, చిట్టిరామాయణము, శ్రీరామదండములు, రామాయణగొబ్బిపాట, శ్రీరామజావిలి, అడవి, శాంత, పెండ్లిసేతు గోవిందనామ ములవంటివి రామాయణగాథాపాదప్రపూరములు.ఇంకను "విద్దెకూచిరామాయణ మారుకాండముల నచ్యుతజాగరవేళ బాడి" నట్టివెన్ని మృగ్యమైపోయెనో తెలియదు. ఇక రామాయణమునందలి కొన్నికొన్ని భాగములనే తెలుపునవి శాంతాకల్యాణము, పుత్రకామేష్టి, కౌసల్యాబైకలు, శ్రీరాములఉగ్గుపాట, రాఘవకల్యాణము, రాముల వారి అలుక, సుందరాకాండపదము, ఋషులఆశ్రమం, సుగ్రీవవిజయం, కోవెల రాయబారం, అంగదరాయబారం,లక్ష్మణమూర్ఛ, లంకాయాగము, గుహభరతుల అగ్నిప్రవేశము, శ్రీరామపట్టాభిషేకము, లక్ష్మణదేవర నవ్వు,ఊర్మిళాదేవి నిద్ర, కుశలాయకము, కుశలవకుచ్చలకథ, కుశలవకుచ్చలచరిత్ర, కుశలవయుద్ధము, వేషూరిబ్రతుకమ్మ కుశలవపాట, పాతాళహోమము, శతకంఠరామాయణము వంటివి లెక్కకుమిక్కిలి. ఒక్క సీతాదేవిగురించియే సీతపుట్టుక, సీతాకల్యాణం, సీతనత్తవారింటికంపుట, సీతసమర్త, సీతశుభగోష్ఠి, సీతగడియ, సీతవామన గుంటలు,సీతామ్మవారి అలుక, సీతవసంతం, సీతదాగిలిమూతలు, సీతసురటి, సీత ముద్రికలు, సీతఆనవాలు, సీతఅగ్నిప్రవేశం, సీతవేవిళ్ళు వంటివెన్నియో పాటలు

గలవు. సీతమ్మచెర, మాయలేడిపాట వంటివి అముద్రితములు. ఈ పాటలం దన్నిటను భాష, భావము, కల్పన, నడక మున్నగునవి యన్నియు జానపద వాసన వెలార్చుచుండును.

రామాయణగాథల తరువాత భారతగాథలు లెక్కింపదగినవి. నలచరిత్ర దేవయానిచరిత్ర, సుభద్రాకల్యాణము, సుభద్రసారె, ధర్మరాజుజూదము, ద్రౌపది వల్వలు, పండుపాట, విరాటపర్వము, పద్మవ్యూహము, విశ్వరూపము, భగవద్గీత, కథాగీతము, సావిత్రిబ్రతుకమ్మపాట, శశిరేఖాపరిణయం, గయోపాఖ్యానం, పరాశరమత్స్యగంధీసంవాదం వంటివి జానపదుల నోళ్ళయందు బ్రతికియున్న భారతగాథలు. విరాట, కర్ణ, శల్యపర్వములును ఉత్తర దక్షిణ గోగ్రహణములవంటివి పెద్దపదములు. ఇటులే భాగవతగాథలు కూడ జానపదు లనేకము పాడుకొందురు. శ్రీకృష్ణపరమాత్ముడు భక్తసులభు డగు శృంగారమూర్తి. జానపదుల పామర హృదయములం దాతని పాదపంకజము లతిసాంద్రముగా ముద్రితములు. వేదాంతవేత్తయగు పోతన్నను భక్తివిషయమున జానపదు లందు కొనగలిగిరి. శృంగారమున వారిదే ముందడుగు. భక్తి యాత్మగా శృంగారము శరీరముగా జన్మించిన జానపదులు (గోపస్త్రీలు) -తాము కృష్ణతత్వ మనుభవించి, తేన్పినట్టి పరిమళమే లీలాశుకజయదేవాదిశిష్టుల కాస్వాదయోగ్య మైనది. భక్తి శృంగారములతోపాటు జానపదులను శ్రీకృష్ణుని చిలిపిచేష్టలు మరింత పరవశులను చేసినవి. భాగవతమునకు సంబంధించిన కథలందు ప్రహ్లాదచరిత్రపదము, వామనవిజయము, వామనచరిత్రము, అంబరీషోపాఖ్యానము, గజేంద్రమోక్షము, శ్రీకృష్ణజననము, కాళింగమడుగుపాట, శ్రీకృష్ణునిచల్దులు, బాలకృష్ణలీలలు, గుమ్మడుపాట, యశోదకొంగపాట, గోపికాస్త్రీలజలక్రీడలు, రుక్మిణీకల్యాణము, చిలుకరాయబారము, సత్యభామ సరసము, రుక్మిణీదేవి ముచ్చట, రుక్మిణీదేవి సీమంతము, పారిజాతపల్లవి, ఉషాస్వప్నము వంటివి ముఖ్యములు. కుచేలోపాఖ్యానము, భ్రమరగీతలవంటివి ముద్రితములు. సత్యహరిశ్చంద్ర, చంద్రమతీదేవి బ్రతుకమ్మపాట, అనసూయబ్రతుకమ్మపాట. గోవుపాట, దత్తాత్రేయజననము, దక్షయజ్ఞము, గంగావివాహము, గంగాగౌరీసంవాదము, సవతులకయ్యము, ఈశ్వరభృంగివాదము, మేనకపార్వతిసంవాదము, లక్ష్మీపార్వతులసంవాదము, త్రిపురాసురసంహారము, సురభాండేశ్వరము, మార్కండేయజననము, సిరియాళమహారాజుచరిత్రము, భల్లాణరాయకథ, కొమిరెల్లి మల్లన్నకథ, వరదరాజు పెండ్లిపాట, ఆండాళ్ చరిత్రము, శ్రీరంగమాహాత్మ్యము, తిరుమంత్రముపాట,

దశావతారములపాట, లక్ష్మీదేవిసొగటాలాట, లక్ష్మీదేవివర్ణనము, వెంకటేశ్వరుల వేట, చెంచితకథ, సవతులకయ్యము, ఏకాదశీమాహాత్మ్యము, వరహావతార చరిత్రము, నూటయెనిమిది దివ్యస్థలములు, వెంకటేశ్వరమాహాత్మ్యము వంటివి ఇతరపురాణములకును మాహాత్మ్యములకును సంబంధించినగేయములు. ఇట్టిగేయము లందంతటను మనకు కాన్పించునది జానపదుల తాదాత్మ్యము, మూలకథలకును గేయములందలి కల్పనలకును భేద మరసి దానిని జానపదుల జీవితముతో పోల్చి చూచిన జానపదుల చిత్తవృత్తులు వారి కాయా పురాణపురుషులయెడ గల యభిమానము భక్తిప్రేమలు తెల్లమగును.

*౨. చారిత్రకగేయములు :* జానపదగేయ వాఙ్మయమున చరిత్రకు సంబంధించిన గేయముల కొక విశిష్ట స్థానము కలదు. వస్తువునందును శైలియందును కథాకథనపద్ధతియందును తక్కిన జానపదగేయములకన్న నివి భిన్నముగా నుండును. చారిత్రక గేయములను పాశ్చాత్యులు Historical Ballads అందురు. కొందరు వీనినే వీరగీతము లని పిలిచిరి. కారణము వీనియందు వీరరసము ప్రధానముగా నుండుటయే. చారిత్రకవీరగీతములు తత్తదుచిత వీర సంఘటన మేదియో జరిగిన వెంటనే యుద్భవించును. ఆ సన్నివేశమును కన్ను లార గాంచియో లేక చెవులార వినియో జానపదు డొక డుద్వేగముతో గాన మొనరించును. ఆ పాట యంతట ప్రాకిపోవును. ఇట్లు విస్తరించుటలో పాటయొక్క వస్తువు కాలక్రమమున మార్పులనందును. ఒక క్రొత్తపాటయం దభివర్ణింపబడిన సంఘటనలకు ప్రాతకాలపు గానప్రవాహమందలి సంఘటనలు తోడై ఊహింప రాని మార్పులు కలుగును. ప్రాతపాటలందలి పేరులు క్రొత్తపాటలందో లేదా క్రొత్తపాటలందలి పేరులు ప్రాతపాటలందో దూరును. ఇటులే గ్రామ నామములు, వ్యక్తులపేరులు, సన్నివేశములు, యుద్ధతంత్రములు, పరికరములు, కాలబద్ధ ముకాని విషయములొకదానిలో నొకటి కలిసిపోవును ఎప్పుడో లిఖితమైపోయిన యట్టి చారిత్రక గేయములందు సిసలైన చరిత్రము లభించును. కేవల మౌఖిక ప్రచార మందున్న గేయములలో కొంతమార్పు కలిగినను వానికి నాధార మగు చారిత్రక గాథల నొక్కొక్కప్పుడు గుర్తించుటకు వీలగును. ఇట్టి గేయములు రానురాను పూర్తిగా మారిపోయి గుర్తించుటకు వీలుకాక అస్పష్టచారిత్రకములు (Quasi-historical) గా పరిణమించి, మరికొన్ని దినములకు పుక్కిటి పురాణములుగా- కల్పిత కథలుగా మారిపోవును. పుక్కిటిపురాణములై పోయిన

వానినుండియు, అస్పష్ట చారిత్రకములనుండియు నిజమైన చరిత్ర త్రవ్వివోయుట కష్టసాధ్యము. కొన్ని సమయముల పూర్తిగా నసాధ్యము. ఇట్టి పరిస్థితి ప్రతి దేశమునకును ప్రతిభాషకును గలదు.

వీరగీతము లాయాసంఘటనము లాధారముగా గొనిగాని, జైత్రయాత్రకు వెడలు వీరుల నుత్తేజపరచుటకు గాని ఏనాయకుడో, లేదా తదాశ్రితుడైన ఏ వీర గాయకుడో వీరగీతముల వెలార్చును. సైనికుల నుత్సాహపరచుటకు పూర్వము మన సైనికవ్యవస్థయందు వీరపాన ముండినటులే వీరగానము కూడ ఉండియుం డును. ఆయారాజుల, దండనాథుల, పాలెగాళ్ళ వీరుల యశోగాన మొనర్చుటకు వారివారి ప్రాపున వందిమాగధులో, భట్లో, పిచ్చుకకుంటువారో, శారదకాండ్రో, గొల్లసుద్దులవారో యుండెడు వారు. అట్టివారే తమ వంశమువారికిని, తదితరుల కును ఈ వీరగీతములను నేర్పుచుండెడివారు. కాలక్రమమున వీరయశోగానమే వారికి వృత్తిగా పరిణమించెను. ఇట్టి వృత్తులవా రిప్పటికిని గలరు. వీరగేయముల కును తదితర జానపదగేయములకును ధ్యేయములు వేరువేరు. ఉత్సాహోల్లాసము లకు గాక వీరగీతము లవబోధమును కలిగించుటకై పాడబడును.

ఆంధ్రదేశము తొలినుండి వీరప్రసువు. తెలుగు తల్లి తన చలువదోసిళ్ళతో నెందరెందరో వీరాధివీరులకు పురుడు వోసినది. ఈ గడ్డపై బ్రహ్మనాయని వంటి బాహుబలప్రౌఢులే కాదు, బాలచంద్రుని వంటి కుమారయోధులే కాదు, మాంచాల రుద్రమదేవి పార్వతీదేవివంటి వీరనారీమణులును ఉద్భవించిరి. తెలుగువారికి వీరాభినివేశము మెండు. కనుకనే తెలుగునాట వీరపూజలు పాదుకొన్నవి. కారెం పూడి తిరునాళ్ళలో పల్నాటివీరారాధనము, నెల్లూరి గంగజాతరలు, మన మత ప్రస్థానములు, చారిత్రక గేయములు, అస్పష్టచారిత్రక గేయములు కూడ అసంఖ్యా కములుగా నున్నవి. ''తెలంగాణమందే మియాసాబ్, సోమనాద్రి, రామేశ్వరరావు, రాణీశంకరమ్మ, సన్నై వెంకటరెడ్డి, కుమారరాముడు, కర్నూలు నవాబు మున్నగు వారి కథ లున్న"వని కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు పేర్కొనిరి. ఇవిగాకను సదాశివరెడ్డి, పర్వతాల మల్లారెడ్డి, సర్వాయి పాపడు, బల్లూరి కొండ్రాయుడు వంటి తెలంగాణపు వీరుల కథలును బహుళప్రచారమందిన గేయములు కలవు. చారి త్రకముగా పల్నాటివీరులకథలు ప్రాచీనములు. "పడతి పల్నాటివీరుల బాడునపు" డని క్రీడాభిరామమం దుండుటచే శ్రీనాథు డీవీరచరిత్రము ప్రజాముఖమున విని

తాను చేపట్టి యుండు నని భావింప నగును. శ్రీనాథుని బాలచంద్రయుద్ధ మొక్క టియే ఇప్పటికి ముద్రింపబడినది. ప్రా.పు. భాండాగారమున నీవీరులకథ లనేక ములు మూలుగుచున్నవి. కోళ్ళ పోట్లాట-గోవు యుద్ధము, రాయబారము-యుద్ధ సన్నాహము, గురజాల యుద్ధము పూర్వభాగము. కల్లు ప్రతిష్ఠ, బాలునికథ, బాలుని యుద్ధము, కన్నమనేని యుద్ధము- గోవు సంస్కారము, కొమ్మరాజు యుద్ధము, బ్రహ్మనాయని విరుగు వంటి కథలు పాఠభేదములతో గలవు.

పూర్వ మోరుగల్లు పట్టణమున "శిలబ్రహ్మాది వీర నాసీరచరిత" "గచ్చు చేసిన చిత్రంపు గద్దెపలక"పై వ్రాయబడి యుండినట్లును, ఆ కథల నొక్కతె "ద్విపదప్రబంధమున బాడినట్లు"ను సాక్ష్యమున్నది. ఆనాడు వ్యాప్తిలో నున్న ద్విపదప్రబంధము లెట్టివో తెలియదు. గుంటూరు మండలమున పల్నాటి వీర చరిత్రమువలెనె నెల్లూరు మండలమున కాటమరాజుకథకు ప్రచార మెక్కువ. తెలంగాణమున ఎఱ్ఱగొల్లలును, మందుచ్చవారును, బీరన్నలవారును, కాటమరాజు కథలు చెప్పెదరు. కాటమరాజుకథను శ్రీనాథుడు ద్విపదగా వ్రాసెనట. అది మనకు లభించలేదు. శ్రీనాథు ననుసరించి గుఱ్ఱముకొండ భక్తవత్సల కవి దానినే పద్యప్రబంధముగా వ్రాసెను. "పినయెల్ల యనువాడు ప్రియము దీపింప వలనొప్ప శ్రీనాథు వచన పద్ధతిని" యదుశాస్త్రుచరిత మంతయు బాడెను. ఈ కాటమరాజు కథ మరియు దీని కనుబంధముగా భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షము తెచ్చేకథ, ఎఱ్ఱగడ్డ పోట్లాటలును కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సంపాదకత్వమున ప్రచురింపబడినవి. ఇంకను కొన్ని గేయము లముద్రిత ములు. కాటమరాజాంధ్రదేశమున దేవుడై వెలసినాడు. గోరంత చారిత్రకాంశము కొండంత పురాణముగా బెరిగిన కథ లందు "కుమార రాముని కథ" యగ్ర గణ్యము. అభిమన్యుని వలె నధర్మయుద్ధమున కాహుతి యైన కుమార రాముని కథను చిలువలుపలువలుగా చేసి, అతిలోక ఘటనలు చేర్చి, జానపదులు పాడు కొను చున్నారు. ఇది శ్రీ నేలటూరి వారి సంపాదకత్వమున ప్రచురింప బడినది. "రెడ్డొచ్చె రెడ్డొచ్చె రెడ్డొచ్చె నమ్మా" యను చిన్న చారిత్రక గేయము రెడ్లనాటి యశోప్రాభవమును;నాటి ప్రజాజీవితమును చాటుచున్నది."కొండవీడుమనదేరా" యనునది మరియొక చిన్న చారిత్రక గేయము. సాహితీసమరాంగణసార్వభౌముని పరిపాలనమున రజకులు గూడ నిట్టి వీర గీతము లాలపించి రనుట ఆంధ్రుల వీర ప్రతిభకు జయపతాక. పదునెనిమిదవ శతాబ్ది ప్రారంభమున అటు ఓరుగల్లు నుండి ఇటు గోలకొండ వరకున్న భూభాగము

నట్టుడికించిన తెలంగాణా వీరుని చారిత్రక గాథ సర్వాయి పాపని కథ. ఇంచుమించుగా నిదేకాలమునకు సంబంధించినది దేశింగురాజు కథ. కథాస్థలము (జింజి) తమిళ దేశ మైనను ఈ కథ ఆంధ్రదేశమున కూడ ప్రాకిపోయినది. తెలుగు వారు వీరవిక్రమ్ములనియు అభిమానధను లనియు, వారి శౌర్య మఖండ మనియు చేయెత్తి చాటు నట్టిది బొబ్బిలి కథ. వీరగీతములందింత సార్వజనీనత కల గేయ మింకొకటి లేదు. సిసలైన జానపదవీరగేయమున కుండవలసిన లక్షణము లన్నియు దీనికి గలవు. దీనికి మూడు పాఠాంతరములు కాన్పించు చున్నవి. ప్రాంతీయముగా ప్రచారమందిన వీరగాథ "పెద్దాపురము కోడి పందెముల పాట." తెలుగువారి శౌర్యప్రీతికి కోడిపందెములు వినోదచిహ్నములు. ఆంధ్రుల రక్త మాదినుండి ఇప్పటివరకును వేడిమి కలదని నిరూపించునట్టి ఈ శతాబ్ది ప్రథమ పాదమునకు చెందిన "అల్లూరి సీతారామరాజు కథ." హైదరాబాదు స్వాతంత్ర్య సమరమున వ్యక్తులుగా సంఘములుగా సాయుధులుగా నిరాయుధులుగా పోరాడి నిరంకుశ ప్రభుత్వము నెదిర్చి ప్రాణము లొడ్డిన మొన్న మొన్నటి స్వాతంత్ర్యవీరులగాథలు సముద్రతరంగముల ట్లంతటను వ్యాపించుచున్నవి. వాని కింకను సార్వజనీనత కలిగిన తరువాత పూర్వ చారిత్రక గేయములవలె వింతమార్పుల నందుననుటలో సందియము లేదు.

ఇక అస్పష్టచారిత్రకగేయముల సంగతి ఇప్పటికిని అస్పష్టచారిత్రకములు. భావిపరిశోధకులు వీని చరిత్ర త్రవ్వవచ్చును. ఇంతవరకు చరిత్రము సరిగా తెలియనట్టి గేయము లందు బంగారు తిమ్మరాజు కథ యొకటి. చంద్రశేఖర శతక కారుడు "ఇంటిని తిమ్మరాజు కథ" యనిన దిదియే కావచ్చును ఇట్టిదే "ఆరె మరాఠీల కథ." తెలంగాణమం దనేక గ్రామములం దారెమ జాతి వారు కలరు. మహారాష్ట్రమున కప భ్రంశరూప మగు ఆరెబాస వారి మాతృభాష. వృషాధిప శతకమున సోమనాథు డారెబాస గూర్చి చెప్పుటచే తెలంగాణమున నీజాతి వారప్పటికే యుండి రనుకొనవచ్చును. బల్లూరి కొండ్రాయునికథకూడ చరిత్రకు సరిగా తెలియని గేయమే చెఱువు నీటి మూలముగా రెడ్డివీరు లొకవైపునను వెలమవీరు లొకవైపునను చేరి పోరిన గాథ యిది.

జానపదులదృష్టిలో శౌర్యము వీరము లనగా నెట్టివో తెలిసికొనుట కీచారిత్రక వీరగేయములు తోడ్పడును. పల్నాటివీరులకథలు సదాశివరెడ్డికథ ధర్మపక్షము యొక్క శౌర్యధైర్యాదులను వర్ణించునట్టి గాథలు. పల్నాటివీరుల కథల

కన్నను సదాశివరెడ్డికథ ఉదాత్తధర్మకీర్తనము సేయునట్టిది, పల్నాటి కథ, ఆరెమరాఠీలకథ దాయాదుల పోరాటములు. శౌర్యమే ప్రధానముగా వానియం దాకర్షణము గల గుణము. కాటమరాజుకథ బొబ్బిలికథ ధర్మముకన్న పగ దీర్చుకొనుట నెక్కువగా కీర్తించునట్టివి. వీనిలోని సంఘమరణములు సహగమనములు మాత్రము జానపదుల జాలిగుండె గరిగించినవి. బొబ్బిలి వెంగళ్రాయుడు బాలచంద్రుడువంటి వీరుల యనాలోచితము మరియు నంధశౌర్యము జానపదుల మెప్పునకు వెలికాలేదు. ఇక బంగారు తిమ్మరాజు దేశింగురాజుల యుద్ధమరణములును, వారిపక్షమున నున్న న్యాయమును వారిని శాశ్వతముగా వీరుల నొనర్చినవి. కుమారరాముడు, సోమోజి, చిన్నపరెడ్డి వంటి వారధర్మయుద్ధములలో పరాజితులై పట్టుపడిరి. ఒకవీరునితో నొక్కవీరుడే తలపడవలయు నను నది భారతమునాటినుండి బొబ్బిలినాటివరకున్న మన యుద్ధనీతి ఇట్టి యుద్ధసమయమునకు బలియైన వారందరును జానపదులకు వీరులే. విశేషించి మోసమునకు పట్టుబడిన బందిపోటుదొంగ చిన్నపరెడ్డివంటివాడు కూడ జానపదులకు బంగారపుకడ్డీ యైనాడు. ఇట్టి గుణములే జానపదులకు శౌర్యవీరములందు ప్రగాఢాభిమానమును కలిగించినవి. ఆ సంస్కారబలమున వారాయా పదముల తరతరముల నుండి పాడుకొనుచు వచ్చుచున్నారు. క్రొత్తగా జరిగెడు సంఘటనములం దీగుణలేశములు కనిపించినంతనే వానిని గూడ వీరపదములుగా పాడుకొనుచున్నారు.

*పారమార్థిక గేయములు* : భక్తికర్మజ్ఞానమార్గములు మూడును మోక్షసాధనము లని భారతీయుల నమ్మకము. ఆ యా మతముల వారు వీనిలో తరతమ భేదము లేర్పరచిరి. సూక్ష్మములకు దిగి తర్కములు పెంచుకొన్నచో నాయా విభేదములు పండితులకు గానుపించునేమో కాని జానపదులం దిట్టి విభేదములు లేవు. అనగా "కృష్ణా రాంరాం గోవింద హరిహరి" యని యేకతార మీటుచు పాడుకొనెడు భక్తుడే "గూట చిలుకేదిరా చిన్నన్నా గూడు చిన్నబోయెరా" యను తత్వములు పాడుకొనుచు, తెల్లవారగానే ఏ వ్రతమునకో ఏ కర్మకో కావలసిన సంభారములను సిద్ధము చేయుటలో నిమగ్నుడగును.

పై మూడుమార్గములందును భక్తిమార్గము సులభసాధ్యము. ఆంధ్రప్రదేశమున శైవవైష్ణవ భక్తిగేయములు కీర్తనలు లక్షలకొలది రచింపబడినవి. పూర్వ

శైవుల తుమ్మెద పదము లిప్పటికిని నిల్చియుండుట మన భాగ్యవిశేషము. తాళ్ళ పాకవారు, క్షేత్రయ్య, త్యాగరాజు కీర్తనలును, క్షేత్రయ్య మరిమళరంగని పదము లును, ఘట్టుపల్ల, ధర్మపురి, ఛత్రపురి జావళీలును సంగీతజ్ఞుల సొమ్మైపోయినవి. ఇవి జానపదులనోటి కెక్కలేదు. అధ్యాత్మరామాయణ కీర్తన లటునిటు మ్రొగ్గి నవి. జానపదులం దధికాదరణము పొందిన గేయ కర్తలలో నగ్రగణ్యుడు భద్రాచల రామదాసు. తూము నృసింహదాసు, పరాంకుశదాసు, నిట్టల ప్రకాశ దాసు, తాటంకము వెంకటదాసువంటి భక్తులగేయము లూరూర దిరిగెడు హరి దాసుల కన్నము బెట్టించుచున్నవి, మొన్న మొన్నటివరకు తెలుగుదేశమంతటను ప్రతి గ్రామమున భజనమందిరములో భక్తకూటములో నుండెడివి. భజనకీర్తనల పుస్తకములు ముద్రింపబడినవి. రఘుపతి దాసు గురుపూజ కీర్తనలు, కరిమేల హనుమయ్య రామనామము, చెంచురామకవి రామనామమాహాత్మ్యము, ఎన్. వి. గోపాల్ కంపెని వారి భగవన్నామ సంకీర్తనలు, భోజదాసు హరిభజన కీర్తనలు, కొల్లా మల్లయ్య శ్రీరామ భజనామృత సంకీర్తనలు, కొంతం కొండలావు భజన కీర్తనలు, అల్లూరి వెంకటాద్రిసాముల హరినామ సంకీర్తనలు, నరసింహాచార్యుల తిరునామములు, నారాయణదాసు పాండురంగ బృందావన సంకీర్తనలు, నిత్యా నందస్వామి భజన కీర్తనలు, నాగదాసు భక్తిసారసంగ్రహ కీర్తనలు, రాపాక రామకవి భజనమాల, ఇంద్రగంటి సూర్యకాంతము, కాలేషా మస్తాన్ దేవుని కీర్తనలు, చందన సాంబశివరావు కుసుమహరనాథ కీర్తనలు, సుమారిరువది మంది రచయితల కీర్తన లున్న భగవన్నామ సంకీర్తనలు, శ్రీశైల భ్రమరాంబి కాష్టకము, నూతన భజన కోలాట కీర్తనలు, రాకమచర్ల వెంకటదాసు కీర్తనలు, స్త్రీలపాటల సంపుటము లందును, గంగాధరంగారి ప్రచురణములందును ఇట్టి భక్తి సారస్వతము ముద్రింపబడినను మౌఖికప్రచారమున ప్రాణములు నిలుపు కొనుచున్న గేయములు లక్షోపలక్షలు.

ఈ భక్తిగేయములందు సంకీర్తనములు, పదములు, దరువులతోపాటు మేలుకొలుపులు, లాలిపాటలు, జోలపాటలు, కోలాటములు, మంగళహారతులును చేరిపోవును. కోలాటపాటలందు మధురభక్తి మెండు. కోలాటములందు సంగీత సాహిత్యములతోపాటు కొంత నృత్యము గూడ చూడనగును. ఔత్తరాహుల కోలాటమును లకుటరాసమందురు. పాల్కురికి సోమనాథుడు కోలాట గొడియల దడవెను. సోమనాథుడు పేర్కొన్న ప్రభాతపదములు మేలుకొలుపులై యుండును. ఇండ్లయందును, గుడిగోపురములందును, ప్రభాత సమయమున నీ మేలుకొలుపులు

వినబడుచుండును. వీనినే భూపాలము లందురు. భూపాలరాగమున పాడబడుటచే నివి భూపాలములైనవి. ఇవి పరమేశ్వర విభూతిని తెలుపును. కొన్ని వేదాంత పరము లగు మేలుకొలుపులును కలవు. వైష్ణవపరముగా నున్న మేలుకొలుపు లందు-సాధారణముగా కృష్ణు నుద్దేశించిన వానిలో మధురభక్తి కాన్పించును. మేలుకొలుపు లధికముగా ముద్రణ భాగ్యమందలే దేలనో ? మంగళహారతులనే మంగళారతు లందురు. పూజాదికము లందుగాని శుభకార్యములందుగాని మంగళము పాడుట భారతదేశ మందంతటను కలదు. మంగళహారతి శబ్దము నివాళి కర్థము. కాని రానురాను నివాళి నిచ్చునప్పుడు పాడెడుపాట కర్థమైనది. ఆలతి యను మరియొక శబ్దమున్నది. అరము రాగాలాపనము. నన్నిచోడుడు "ఆలతు లొగి చేసి పాడి రభినవలీలన్" అనియును, "అలతులు నిల్వ హస్తమున" ననియు "అలతుల్ నూల్కొనచేసి" యనియు ప్రయోగించెను. అభినయము చేయుచు హారతు లెత్తెడు నాచార మిప్పటికిని కొన్ని దేవళములం దున్నది. గుండారు వేంకటదాసకవి బలరామచరిత్ర, గణపరపు వేంకటకవి ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసములందు ఆరాత్రికలు పేర్కొనబడినవి. హారతికి నివాళి పర్యాయపదము. పాల్కురికి పేర్కొన్న నివాళి పదములు మంగళారతులై యుండుచు. దీపారతులు, ధూపారతులు మున్నగునవి తత్సంబంధములే. తెలుగు దేశమున వ్రాయనేర్చిన ప్రతి కవి యొక మంగళారతి వ్రాసియుండును. పాడనేర్చిన ప్రతి స్త్రీ యొక మంగళారతి పాడగలదను కొందును. ఈయాదేవత యనక మంగళహారతు లని దేవతలకు సంబంధించినవి కలవు. వర్ణనాత్మకము గను, స్తోత్రరూపమునను, సేవారూపమునను, భక్తి వేదాంత శృంగార పరములు గను మంగళహారతు లున్నవి.

*వేదాంత సంబంధములు:* పాశ్చాత్యులు భారతదేశమును వేదాంతులుండు దేశమనుటకు కారణము మనదేశమున శిష్టనాగరికులేకాక పామరులగు జానపదులు కూడ నేవో గహనములగు తత్త్వవిషయము లాలపించుటచేతనే. "తొలుత బ్రహ్మాండంబు తొట్టిగావించి"యని జోల పాడుచును, "ఓం నమశ్శివాయ అరక్షరములు తొట్టి" యనుచు ఉయ్యాల లూపుచు పంచదశిసారమును పాలబుగ్గల కందించు శక్తి తెలుగు తల్లుల కలవడినది. ఇట్టిగేయములందలి భావములు జానపదుల కెంతవర కనుభవసిద్ధము లను మాట వేరు. తత్త్వవిషయము లుండుటచే నిట్టి గేయములకు తత్త్వములను పేరు కలిగినది. ఈ తత్త్వము లధికముగా నద్వైత వేదాంతపరములు. తత్త్వములను వ్రాసినవారును ప్రచారము చేసినవారును

నధికముగా బ్రాహ్మణేతరులు. అద్వైతమున జీవుని బ్రహ్మత్వము ప్రతిపాదిత మగుటచే సంఘవ్యవస్థ యందున్న ఎక్కువతక్కువలు వేదాంత విచారమున నుండవు. అందును నించుకంత చైతన్యము కనబరచినచో "నీ దేకులమ"ని యవరజులను ప్రశ్నించు బ్రాహ్మణులు మరియు నగ్రవర్ణములవారు కుమారాస్త్ర విద్యా ప్రదర్శనకాలమునుండి కనకదాసు మరియు వీరబ్రహ్మముల కాలమువరకు నుండిరి. ఇట్టి ప్రశ్నములకు "ఏ కుల మని నను వివర మడిగితే ఏమని తెల్పుదు లోకులకు పలుగాకులకు" అను తత్త్వములు సమాధానములు కనుక అధికారులు బోధనకై అనధికారులు సంతుష్టికై యిట్టి పాటలు పాడుట ఆచారమైనది. కను కనే అగ్రజన్మములవారి వర్ణాశ్రమాచార విధులు, పూజాపురస్కారములు, ప్రవచనములు మున్నగునవి కొన్ని తత్త్వములందు గర్హింపబడినవి.కాని వేమనయోగి వంటి సంస్కారపరుల మాట లూతగా గొని యాథార్థ్య మెరుగని తరువాత యోగిబ్రువులు, కపటసన్యాసులు, ఇట్టి చిలుకపలుకులు పలికి, ప్రజలకండ్ల మట్టి గొట్టి పొట్ట పోసికొనుట గూడ యలవాటైనది. తత్త్వములందు కొంత మర్మకవిత్వము కూడ కలదు. ఏగంటివారు, పోతులూరి వీరబ్రహ్మము, వేమనయోగి, సిద్దప్ప, శేషాచలస్వామి, పరశురామపంతుల లింగమూర్తి, భోజదాసు, ఎడ్ల రామదాసు మున్నగువా రనుభవజ్ఞులైన యోగులెందరో తత్త్వములను వేదాంత గేయములను రచించి యున్నారు. సీతపాట, నారాయణశతకము, రామనామశతకము, ఆత్మబోధామృతతత్త్వములు, కవిప్రమాణ తత్త్వకీర్తనలు,కాలజ్ఞానతత్త్వములు; శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థదరువులు, తారకామృతసారము, శ్రీరామగీత, గురుజ్ఞానామృతము, వేదాంత కుచ్చెలకథ, బ్రహ్మానందకీర్తనలు వంటి ముద్రిత గ్రంథములందలి గేయములు జానపదుల నోటికెక్కినవి. సాధారణముగా నీ తత్త్వములందు రాజయోగము, అచల వేదాంతము, గురుభక్తి, నీతిబోధము, సంఘసంస్కార పరాయణత్వము, వర్ణాశ్రమాచారనిరాసము, వైరాగ్యబోధము, అహింస, సత్ప్రవర్తనము మున్నగు విషయములుండును.

*కర్మమార్గ సంబంధములు:* యజ్ఞయాగాదికర్మలు మహాకష్టసాధ్యములు. సామాన్యజనము కవియందుబాటులోనివికావు. మీదుమిక్కిలి వేదకర్మాచరణమున కందరికి నర్హతలేదు. పురాణోక్తముగానున్న కర్మకాండము వ్రతములు నోములు మున్నగునవి అందరి యందుబాటులో నుండుటచే నట్టి వాఙ్మయముకూడ బాగుగా ప్రచారమందినది. ఇట్టి కర్మకాండయందు పురుషులకన్న స్త్రీలకెక్కువ అభిమాన

మగుటచే స్త్రీలపాటల రూపముననే ఇట్టి వాఙ్మయ మధికముగా గాననగుచున్నది. వ్రతములకు నోములకు సంబంధించిన పాటలనేకము ముద్రింపబడినవి. శ్రీ నేదునూరి గంగాధరంగారు, శ్రీ బాలాంత్రపు వెంకటరావుగారు, శ్రీ గూడూరు కోటేశ్వరరావుగారు వంటివార లిట్టి కథలను పాటలను ప్రకటించియున్నారు. మదన ద్వాదశి వ్రతము (చిలుకముగ్గులపాట), నిత్యదానము నోము, దీపదానము నోము మోచేటిపద్మము నోము, చాతుర్మాస్యవ్రతము, కృత్తికదీపాల నోము, పెండ్లిగుమ్మడి నోము, వరలక్ష్మిపాట, తులసినోము, లక్షవత్తుల నోము, కామేశ్వర వ్రతము, శ్రావణశుక్రవారము, శ్రావణ మంగళవారము వంటి పాటలు నలుబది యేండ్లు పైబడిన తెలుగుస్త్రీ లందరకును కంఠస్థములు. వీనిలో కామేశ్వరిపాట క్రీడాభిరామము కాలమునుండి తెలుగునాట వినబడునట్టిది. దుష్యంతుని సభలో శకుంతల "నుడువులువేయు నింకేల యిప్పాటి నోములు దొల్లి కడిగి నోచితినిగాకేమి" యనుటచే నన్నయనాటి నుండి మన కీవ్రతములు బహుశః స్త్రీలకును చాతుర్వర్ణ్యములవారికిని పూజాధికారము కల్పించుటకుద్దేశింపబడినవై యుండును. వీరశైవ వీరవైష్ణవ మతోజ్జృంభణ ఫలితముగా నిట్టి సంస్కారమునకు తావు లభించినదని ఊహింపనగును. తెలంగాణమున బొడ్డెమ్మ బ్రతుకమ్మ వంటి పండుగల నాధారముగా చేసికొని మనోహరమగు జానపదగేయములు పుట్టినవి. అగ్రవర్ణములవారికి లక్ష్మీగౌరీ వ్రతములు పూజలున్నటులే శూద్రులకు ఎల్లమ్మ, మైసమ్మ, పోచమ్మ, బాలమ్మ మున్నగు క్షుద్రదేవతాపూజలు కలవు. ఈ దేవతల కొలువులు పల్లెటూళ్ళయందు బవనీలు మున్నగు వారు చేయుదురు. ఎల్లమ్మయే రేణుకాదేవి క్రీడాభిరామమున బవనీల చక్రవర్తి "పరశురాముని కథలెల్ల ప్రౌఢిఁబాడి" నట్లున్నది.

**స్త్రీల పాటలు:** సంసారయాత్రలో గృహలక్ష్మికిగల ప్రాధాన్యము పురుషునకు లేదు అటులే గృహజీవనమున కష్టసుఖములకుగూడ స్త్రీలే అధికముగా నాలంబనములు. ఇట్టి పాటలను కేవలము స్త్రీలపాటలని పిలువవచ్చును. వీనిలో కల్పనకన్న వాస్తవికత హెచ్చు. మాతృత్వము భారతస్త్రీ కెనలేనిసంపద. దాని నాధారముగా చేసికొని ఎన్నియో గేయములు పుట్టినవి. సంతానమునకై స్త్రీలు పడెడు బాధలు, నోచెడు నోములు, మ్రొక్కులు, గొడ్రాండ్రస్థితి అట్టిపాటలందు వర్ణితము. సంతానము కలిగిన వెంటనే లాలిపాటలు జోలపాటలు వచ్చును. లాలించుటకు లాలిపాటలను, జోకొట్టి నిద్రపుచ్చుటకు జోలపాటలను పాడెదరు. ఈ పాటలందు తల్లులు తమ సంతానమును రాముడుగనో, కృష్ణుడుగనో, శంకరుడుగనో, సీత

గనో,రుక్మిణిగనో,పార్వతిగనో వర్ణించుకొందురు. ఈ పాటలు శంకరాభరణము, నవరోజు, ఆనందభైరవి, శ్రీరాగముల కనుకూలముగా నుండును. పుత్రోత్స వములందు పాడెడుపాటలుగూడ కొన్ని గలవు. స్త్రీ జీవితమున వివాహ మత్యంత ప్రధానసమస్య. ఆ సమస్య నాధారముగా చేసికొని ఎన్నియో సంఘటనలు, వాని నాధారము చేసికొని ఆచారవ్యవహారములు-వేడుకలు వినోదములు, వాని ఫలిత ముగా ననంతమైన గేయసాహిత్యమును ఉధ్భవించినవి. వీనినన్నింటిని గలిపి పెండ్లిపాట లనవచ్చును. ఈ పెండ్లిపాటలకు కొట్నములు నాందిగా అప్పగింతలు భరతవాక్యముగా గ్రహింపవచ్చును. వీనిలో కొట్నాలపాటలు, నలుగుపాటలు, గంధంపాటలు, కల్యాణపు పాటలు, తలుపుదగ్గర పాటలు, బంతుల పాటలు, బువ్వము పాటలు, వధూవరులపాటలు, అలుకపాటలు, ముఖముకడుగు పాటలు, కట్నాలపాటలు, మిధునవిడెముల పాటలు, అవిరేణిపాటలు, అప్పగింతలపాటలే కాక ప్రతిచిన్నవిషయమునకును, అనగా పసుపునకు, తిలకమునకు, తలంటు లకు, ఊయలకు, వసంతములకు, పానుపులకు సంబంధించిన పాటలుకూడ కలవు. గాంధర్వవివాహములు ప్రబలమైపోవుచున్న నీకాలమున నిట్టి పాటలు పాడుట కవకాశము సన్నగిల్లుచున్నది. వధువు అత్తవారింట చేరిన పిమ్మట అత్త మామల భక్తి పతిభక్తి ఆలుబిడ్డలభక్తి తోటికోడండ్రతో బావమరదులతో మెలగ వలసినరీతి దెలుపు పాటలును గలవు. గృహజీవనము పొరపొచ్చములు లేక సాగెనా సరేసరి. లేనిచో అత్తల ఆరండ్లు, తోడికోడళ్ల సాధింపులు, ఆడుబిడ్డల ఘాతుక చర్యలు సమస్యలై సంసార మొక నరకకూప మగును. ఇట్టి బాధల నాశ్రయించికూడ కొంత సాహిత్యము పెరిగినది. ఇట్టి పాటలందు సాంఘిక జీవ నము సమగ్రముగా కాననగును.

*శ్రామిక గేయములు :* జానపదగేయముల యుత్పత్తిగూర్చి చర్చించి నప్పుడు కవిత్వ ముల్లాసమును కలిగించుటకే కాక కష్టనివారణమునకు గూడ నుదయించునని తెలిసికొనియుంటిమి. మానవులు శ్రమించునప్పుడు కష్టము కన బడకుండుటకై అలసిపోకుండుటకై అప్రయత్నముగా కూనిరాగములు తీయుట, లయాన్వితములగు నేవోమాట లుచ్చరించుట జరుగును సామూహిక కర్తృత్వ మున నట్టి రాగములు మాటలు జానపదగేయములుగా పరిణమించి వ్యాప్తిగాం చును. ఇల్లలుకునప్పుడో, పిండివిసరునప్పుడో, వరినాటు, కలుపు కోతలప్పుడో, మోట తోలునప్పుడో, ఏతామెత్తునప్పుడో, నాగలి దున్నునప్పుడో, కుప్ప గొట్టు

నప్పుడో, పడవ నడుపునప్పుడో, బరువులు మోయు నప్పుడో, రోడ్డువెంట రోలరును లాగునప్పుడో, రాళ్ళుపగులగొట్టునప్పుడో, దిమ్మిస వేయునప్పుడో, కావడి, పాలకి, మేనాలు మోయునప్పుడో, శ్రమాపదమునకై పాటలు పాడువారిని మనము చూచుచునేయున్నాము. హృదయ-లేదా-మేధాగత భారమును తొలగించి ఉల్లాసమును కలిగించునటులే శారీరక శ్రమమును పోద్రోలి యుత్సాహమును కలిగించుటకును గేయములు తోడ్పడును. శ్రామికగీతములనే కొందఱు పాటకజనసారస్వతమనిరి. మరికొందరు కార్మిక కర్షక గీతములనిరి. శ్రామికగీతములందు వస్తు వెద్దియైన నుండవచ్చును. వృత్తికి సంబంధించిన పాటలు, శృంగారగేయములు, స్థానిక వృత్తాంతములు, విషాదగాథలు, భక్తిగేయములు మున్నగు తీరుతీరులపాటలు శ్రమికులు పాడుకొందురు. ఈ గేయములు కూడ కొలదిగనే ముద్రింపబడినవి. శ్రమికగేయము లన్నియు సాధారణముగా వారివారి కృషికి సంబంధించిన లయకు సరిపోవునట్లుండుట గమనింపదగిన విషయము. శ్రమికుల కాలుసేతుల కదలికలో, ఊపిరితిత్తుల భారోచ్ఛ్వాసనిశ్వాసములలో ఈ గీతములకు తాళలయలు సమకూరును. సంగీతమే కాక శరీరసుఖమునకు సంబంధించిన యూహలు కూడ శ్రమికుల కుత్సాహమొసంగును. ఇట్టిపాటలు 'ఘుమఘుమాపాటల' పేరుతో కొన్ని ప్రచురించబడినవి. శ్రమికుల జీవితమున వేషభూషణముల యాడంబరము ఆధిక్యము, ఆహారపానముల సౌఖ్యము తక్కువ. వారికి మిగిలినది శరీరసుఖమే. వారి ముక్తాయింపులు మొత్తముమీద విషయసుఖమువైపునకే మ్రొగ్గుచూపుటకిదియే కారణము. ఫ్రాయిడ్ మహాశయుడు తన 'లిబిడో' సిద్ధాంతమున దీనిగూర్చి చెప్పెను. శ్రమికుల పనిపాటలం దీ లిబిడో స్ఫుటముగా ధ్వనించును. విలాసముగా పాడెడు గారడివాని పాటలం దాకర్షించుటకును, బరువులు లాగెడు పాటలందు శ్రమాపనోదనమునకును బూతులు ప్రవేశించును. శ్రమికుల గేయములందెన్నియో బూతుపాటలు గలవు.

**బాలగేయములు:** జానపగేయములందు బాలగేయముల దొక ప్రత్యేకశాఖ. పసిపిల్లల లేతహృదయము లెంత నిష్కపటములో, నిర్మలములో, స్వచ్ఛందములో, మృదువులో, వారి గేయములు కూడ నంత నిష్కపటములు, నిర్మలములు, స్వచ్ఛందములు, మృదువులు. పాశ్చాత్యులును, తదితర భారతీయులును బాలవాఙ్మయమునుగూర్చి చేసిన సేవ యపారము. మన తెలుగువారి దృష్టి ఇప్పుడిప్పుడే ఇటు మరలుచున్నది. బాలగేయములు రెండు విధములు: బాలురకొరకై పెద్దలచేరచింపబడి తరతరములనుండి వచ్చునవి ఒకవిధము. బాలురచేతనే రచింప

బడి ఒకతరమునుండి మరియొకతరమువారినోటి కందెడునవి మరియొకవిధము. పెద్దలు పిల్లలకొరకు రచించిన పాటలందు కూడ రెండు విధములు కలవు. పిల్లలను లాలించుటకు పాడెడు లాలిపాటలును, నిద్రపుచ్చుటకు పాడెడు జోల పాటలును ఒకతీరువి. పిల్లలనే వస్తువుగా గ్రహించియో లేక నేవేని కథావిషయములనో, ప్రపంచమందలి మనోహరవిషయములనో గ్రహించి పిల్లలకానందము గూర్చుటకై ఆటలాడించుటకై రచింపబడినవి ఇంకొకతీరుపాటలు. లాలిజోల పాటల భావములను పిల్ల లెంత మాత్రము ననుభవింపరు. కేవల మాసంగీతము మాత్రము వారిని నిద్రపుచ్చుటకో ఏడుపు నాపుటకో ఉపకరించును. ఇక పెద్దలు రచించిన బాలగేయము లనుభూతికి వచ్చుటకు పిల్లలకు తగినవయస్సు రావలయును. పిల్లలు కూర్చుండుట కలవాటు పడినప్పటినుండి పెద్దలపాటలు నిచ్చెన మెట్లవలె క్రమక్రమముగా పెరిగి పిల్లలు తాము తల్లిదండ్రులవలననో లేక ఇతరులగు పెద్దలవలననో విన్నపాటలు స్వయముగా పాడునంతవరకు సాగి యాగిపోవును. ఆపైన వారి స్వంతకవిత్వ మారంభమగును. పెద్దలపాటలందు మొదట నాదము, తరువాత లయ, ఆతరువాత అభినయనము పిల్లల కలవడునట్లు చేయుక్రమము కానుపించును. మొదటిది ఆకర్షణము, రెండవది యుత్సాహము, మూడవది వారి శరీరమునకు శక్తికూర్చెడు మెట్లు. శిశువులకు రెండేండ్లు వచ్చు నప్పటికి చిన్నచిన్నమాటలు రానేవచ్చును. తల్లిదండ్రులు వారికి మెల్లమెల్లగా చిన్నపాటలు పద్యములు నేర్పెదరు. తల్లిదండ్రులు పాడగా విన్నపాటలు సులభ గ్రాహ్యము లగునవి వారికి కంఠస్థమైపోవును. ఈ తరుణమున తలిదండ్రులు తమ పిల్లలకు భక్తి నీతి వినయము విజ్ఞానము గలపాటల నొక్కొటొక్కటిగా నేర్పుచుందురు. యతిప్రాసములు తాళలయలు మున్నగువాని జ్ఞాన మీపాటల వలన పిల్లలకు సులభముగా పట్టువడును. పిల్లలకు నాలుగైదేండ్లు వయసు వచ్చునప్పటికి సొంతకవిత్వ మారంభమగును. బాలగేయములందు రెండవ ప్రధానశాఖ బాలురనేతనే రచింపబడి తరతరములనుండి ప్రవాహరూపమున వచ్చుచున్న గేయములు. పిల్లల సొంత రచనములందు రెండు రకముల గేయము లున్నవి. పెద్దల ననుకరించి వారి పాటలందు తమ కవిత్వము చేర్చి పాడుకొను నవి కొన్ని, పూర్తిగా స్వకపోలకల్పితములగు గేయములు మరికొన్ని. పెద్దల నుండి సంక్రమించిన పాటలలో పిన్నలు తరములు గడచిన కొలది తమ కవిత్వమును చేర్చి ఒకరినుండి మరియొకరి కందించుకొనుచు వచ్చెదరు. ఇట్టి పాటలు కేవల మొక ప్రాత యాచారము వలె రానురాను అర్థవిహీనములై పోవును. తలిదండ్రులు పాటలనుండి తాము గ్రహింపగలిగిన ఆద్యంత ప్రాసములు, యతులు, యమకములు మాత్రమే పిల్లలకు చక్కగా పట్టుబడును. ఈ వ్యుత్ప

త్రితో వారు కూర్చెడు పాటలలో వీనికిమించిన సొగసు లుండనేరవు కదా! అందుకే ఇవి ఇంగ్లీషులో 'Nonsense Rhymes' అను పేరు పొందినవి. 'Nursery Rhymes' పిల్లలకొరకు పెద్దలు రచించినవైనచో 'Nonsense Rhymes' పిల్లలు సొంతముగా రచించిన గేయములని చెప్పవచ్చును. నాలు గేండ్లనుండి పిల్లల జీవితమంతయు నాటపాటల మయము. ఈ యాటలందును మగవారికి వేరు మరియు నాడువారికి వేరు ఆటలు గలవు. కొన్ని ఇరువురును చేరి యాడుకొనునట్టివి. ఈ క్రీడల నాధారముగా చేసికొని వానికి తగిన పాటలు పెక్కులు బయలుదేరినవి. చెమ్మచెక్క, బిత్తితిరుగుట, గుడుగుడుగుంచం, బుజబుజరేకులు, గొబ్బిళ్ళు, చిఱ్ఱగోనె, కోతికొమ్మచ్చివంటి యాటలతోపాటు పాటలును గలవు.

*శృంగార గేయములు :* జానపదసాహిత్యమున శృంగారము ప్రధాన రస మైన పెక్కు గేయములు కలవు. శిష్టుల నిర్వచనము ప్రకారము అవి శృంగార కావ్యములు కాజాలవు. ఆధునిక భావకవులు రచించిన ఖండకావ్యము లటులే జానపద గేయములు కూడ విభావాది సామగ్రిని సంపూర్ణముగా ప్రవచించునవి గాక నేదో యొక సంచారిభావము నాశ్రయించినవిగా నుండును. జానపద గేయ వాఙ్మయమున నితర శాఖలతో పోల్చి చూచినచో, ముద్రితములగు శృంగార గేయముల సంఖ్య తక్కువ. అవి యెంత బహుళసంఖ్యలో నున్నవో యంత విరళముగా ముద్రింపబడినవి. ఇట శృంగారము పరకీయమా స్వకీయమా ఉత్తమ నాయికానిష్ఠమా లేక ప్రాకృతనిష్ఠమా యను చర్చ లనవసరము. శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు జానపదగేయములందలి శృంగారమంతయు నీచ మనియు దుష్ట మనియు కేవలము కామప్రేరిత మనియు నిందించిరి. వెంకయ్య చంద్రమ్మ పాట, నారాయణమ్మ నాయుడుబావ పాట వంటివి వారి యాగ్రహమునకు గురైనవి. వారి దృష్టి కది యుచితముగనే తోచినది. ఇది జానపదుల-ప్రాకృతుల వాఙ్మయమే కనుక శిష్టుల-ఆలంకారికుల విమర్శనము లట నతుకవు. మరియును జానపదులు చిత్రించిన సీతారామాది యుత్తమ నాయికా నాయక గత శృంగారము కూడ పామరభావసమన్వితమే యని గ్రహింపవలయును. జానపదుల పేరిట నున్న వాఙ్మయమందంతటను గోచరించునవి వారి భావములే కాని ఆయాపాత్రముల భావములు కావు. ఎట్టి గేయములందైనను జానపదుల ప్రేమకలాపములు, సాంఘికనియమోల్లంఘనములు, పరస్పరాకర్షణములే కాననగును. జానపద వాఙ్మయమందు జీవితము యథా

తథముగ నగ్నతేజముతో భాసించును. కావ్యధర్మమైన ఔచిత్యవిచారము జీవితమునం దంతగా నగుపింపదని యంగీకరింపక తప్పదు. జానపదవాఙ్మయమున ఔచిత్యపోషణోద్దేశముతో పాత్రములకు మెఱుగుపెట్టుపద్ధతి లేదు. జీవితమునం దెంత వైవిధ్యము ప్రత్యక్షమగునో అంతయు జానపదకావ్యమునందు ప్రత్యక్షమగును. అచ్చట నుదాత్తతయు, సభ్యశృంగారము, రసాభాస శృంగారము, నీచశృంగారము మొదలగునవియన్నియు నొకదానితో నొకటి బుజము లొరసి కొనుచుపోవుచుండును. ఐనను ధర్మావలంబనము గల ప్రేమ శృంగారములతో నొప్పు గేయములుకూడ అనేకములు గలవు. రామాయణ గేయము లందు సీత గడియ, సీతామ్మవారి అలుక, సీతాదేవి వేవిళ్ళు, ఊర్మిళాదేవి నిద్ర, సీతాదేవి ఆనవాలు మున్నగు పాటలందు శృంగారమునకు వెలికాని మనోహరభావము లున్నవి. సుందర కాండ పదమున వియోగశృంగారము చక్కగా ప్రదర్శింపబడినది. కుశలవ యుద్ధము వంటి పాటలలో శృంగారము మితి మీరినది. భారత సంబంధ గాథలందు నలచరిత్ర పదము, సుభద్రాకల్యాణము, శశిరేఖాపరిణయము, దేవయానిచరిత్రమువంటి శృంగార గేయములు కలవు. నలచరిత్ర పదమున దమయంతి విరహము శిష్టసాహిత్యము నధఃకరించును. దేవయాని జంగంకథ, ఏకత్రైవానురాగ మను రసాభాసమున కుదాహరణము. శశిరేఖా పరిణయము పూర్తిగా శృంగార గేయము. ఇక భాగవత కథలందున్న శృంగారమునకు మితియే లేదు. గోపికాస్త్రీల జలక్రీడలు, ఉషాస్వప్నము, రుక్మిణీదేవిముచ్చట రుక్మిణీదేవిసీమంతము, చిలుకరాయబారము, సత్యభామ సరసము, పారుజాతపల్లవి, రుక్మిణీ కల్యాణము, భ్రమరగీతలు వంటి స్త్రీలపాట లన్నియు శృంగార రస తుందిలములు. చారిత్రక గేయము లందుకూడ శృంగార భావము లున్నవి. పల్నాటి వీరచరిత్రమున శ్యామాంగి ప్రదర్శించిన భావములు జారిణీ శృంగారమునకును, మాంచాల యను భావ ముత్తమ శృంగారమునకును ఉదాహరణములు. దేశింగు రాజు, పెద్దబొబ్బిలిరాజు కథ, సదాశివరెడ్డి కథలందు వీర దంపతుల యనురాగ ముత్తమశ్రేణికి చెందినది. కరుణారస పూరితమగు కథలందు లక్ష్మమ్మ, సన్యాసమ్మ, మందపేట పాపమ్మ, నల్లతంగాళ్, ఎరుకల నాంచారి, వీర రాజమ్మ గేయములందు ధర్మస్వభావులైన జానపద దంపతుల యుత్తమ శృంగారము ధ్వనించుచున్నది. ఒక్క సారంగధర చరిత్రమున మాత్రము తుచ్ఛశృంగార భావము లున్నవి. జానపదుల శృంగారము నీచమను విద్యాశేఖరుల యభిప్రాయమునకు సన్యాసమ్మ, మందపేట పాపమ్మ, కామమ్మ, ఎరుకల నాంచారివంటి జానపదనాయికల పవిత్రచరిత్రము సరియైన సమాధాన మీయగలదు. కమ్మవారి

పణతి, కాంభోజరాజు, గాంధారి, ధర్మాంగద చరిత్ర మున్నగు అద్భుతకథలం దున్న శృంగారము కూడ అనౌచిత్య దోషదూషితము కాదు. శైవవైష్ణవమతము లకు సంబంధించిన గేయములం దనేకములు శృంగారకళాఖండములు. గంగా వివాహమున హరుడు చక్కని దక్షిణనాయకుడు. కొమిరెల్ల మల్లన్నకథకూడ అంతియ. సురాభాండేశ్వరమున పరకీయశృంగార మున్నది. వరదరాజు పెండ్లి, అండాళ్ చరిత్రము, వెంకటేశ్వరవేట, చెంచితకథ పాటలందు చక్కని శృంగార మున్నది.

పైగేయములందు శృంగార మంగము. శృంగారము ప్రధానముగాగల ఖండ కావ్యములవంటి గేయములు లక్షోపలక్షలు. చల్ మోహనరంగ, వెంకటయ్య చంద్రమ్మపాట, నారాయణమ్మపాట, సిరిసిరిమువ్వ కరంగంపదములవంటి కొంచెము పెద్దపాట లచ్చైనవి. అముద్రితములే యధికము. కామునిపున్నమ నాటిపాట లన్నియు శృంగారకళాఖండములు. కోలాటములుకూడ చాలవర కిట్టివే

*అద్భుతకథలు :* శిష్టులకన్న జానపదుల కద్భుతరసాభినివేశము మెండు. సాధారణవిషయములం దలౌకికములు నద్భుతములు నగు కల్పనలుగూర్చి పెద్ద చేయుట వారికి వినోదముతోపాటు భక్తియో భయమో పెంపొందించుకొనుట కుపకరించునట్టిది. మానవు డెప్పుడును ఆశాజీవి. అడుగడుగునను కడగండ్లు మానవునకు కష్టములేక కలిగెడు సంపద. కథలలో నడ్డుపడిన దేవతలో, మంత్ర దండమో, పావుకోళ్లో, సంచియో, భూతద్ధమో, బీజాక్షరములో తమకును ఇట్టి కష్టములందు సాయపడు నని జానపదుల నమ్మకము. ఇట్టిది సంభవమైనను కాకున్నను మనమునకు మాత్రము పెట్టనికోటయని భావింపవచ్చును. దుర్భర మగు సంఘటనము కలిగినప్పుడుగాని అసాధ్యమగు విషయము నాకాంక్షించి యత్నులు సాచునప్పుడుగాని ఏమానవాతీతమగు శక్తియో యడ్డుపడి చిక్కును మంచుతెరవలె తొలగించిన నెంతబాగుండుననుకోరిక అసాధ్యమైనదైనను మానవ సహజమే. ఇట్టి కోరిక నాధారముగా చేసికొని పొటమరించినవో లేక గాని ననుసరించియే ఇట్టి కోరిక లుద్భవించినవో కాని ఇట్టి యద్భుతములు కల థాగేయము లనేకము ప్రచారమందున్నవి. అద్భుతకథలం దన్నిటికన్న నధిక పచారము గాంచినది బాలనాగమ్మ కథ. మాయలఫకీరు, తలారి రాముడు, ాలవర్థిరాజు, గాండ్ల సంగు, తంబళి పెద్దవ్వ, చాకలి తిప్పడు, చంద్రాయుధము—వీనికి నాంధ్రదేశమున కావలసినంత కీర్తి. బాల నాగమ్మ కథాకాలము నిదమిత్థముగా చెప్పజాలము. ఇది దక్షిణ భారతమున తురకలు పాదుకొన్నతరువాత జరిగిన కథయైయుండును. మహబూబునగరముజిల్లా

యందున్న పానుగల్లు బాలనాగమ్మ కథారంగస్థలమని యధిక ప్రచార మున్నది. కథయందలి యంతస్సాక్ష్యము దానినే బలపరచుచున్నది. ఇది ప్రాంతీయమగు రామాయణగాథవంటిది. సీతాదేవికి ప్రతిగా బాలనాగమ్మను, రావణునకు ప్రతిగా మాయలఫకీరును, శ్రీరామునకు ప్రతిగా బాలవర్ధిరాజును, త్రిజటకు ప్రతిగా తంబలి పెద్దమ్మను భావింపవచ్చును. నమ్మరానంత యద్భుతకృత్యములతో, అలౌకికవిషయములతో నిండినగాథ కమ్మనివారి పణతిపసల బాలరాజుకథ. దీని జీవము వర్ణాంతర వివాహ మని తెలియనగును. దీనిలో నొకటిరెండు యాధునిక భావము లున్నను వాతావరణము మాత్రము పుక్కిటిపురాణయుగమునాటిదిగా గాన్పించును. అద్భుతకథాగేయములందు గాంధారికథ యగ్రగణ్యము. పురాతనముకూడ కావచ్చును. ఇటులే కాంభోజరాజుకథ, ధర్మాంగద పాముపాట, బాలరాజుకథవంటి యద్భుత కథలు జానపదులకు భయభక్తులను కలిగించి, సత్యధర్మములకే జయ మనుదానిని చాటిచెప్పి వారి జీవితమును దిద్దుచుండును.

*కరుణరసాత్మకములు:* జానపదులు శృంగారము తరువాత కరుణాద్భుతములకు రెంటికిని సమాన ప్రాధాన్యమిచ్చిరి. నిత్యజీవితమున సుఖమునకన్న దుఃఖమేయధికమగుట తత్ప్రభావితులైన జానపదులు ఆయాసంఘటనముల సహజముగనే చిత్రింపగలిగిరి. శిష్టులకున్నట్టి యాదర్శదృక్పథము, అనగా దుఃఖము నధిగమించి యాదర్శజీవితనిర్మాణమునకై సాహిత్యమును సాధనముగా, నుద్దేశపూర్వకముగా మలచుకొను గుణము వీరియం దంతగా లేదనుకొనవచ్చును. జానపదుల కౌతిదృష్టి తక్కువ. కనుకనే వీరగాథలలో కథాభాగమునకున్న ప్రాధాన్యము వ్యక్తికుండదంటిమి. వీరగాథలు కేవలము వ్యక్తులకు మాత్రమే కాక సాధారణముగా రెండు జాతులకును లేదా రెండు తెగలకును సంబంధించియుండును. జాతి మరియు వంశము దాటినచో జానపదుల దృష్టి నాకర్షించెడువారు వ్యక్తులు. వారి శౌర్యమునకు త్సాహము, దుర్మరణమునకు జాలి-ఈ రెండుభావములును పామరులచే వారి చరిత్రములను పాడించినవి. ఉత్సాహము తరువాత జానపదులను సులువుగా నావరించునది జాలి. వీర గీతములం దుత్సాహము మెప్పుతోపాటు ఈ జాలికూడ కథారచనమునకు వారి నెగ్రదోయుననుట యసత్యముకాదు. బొబ్బిలిని కొట్టుటకు దండువిడిసిన విజయరామరాజునకు మల్లమ్మదేవివ్రాసిన యుత్తరమును ఆక్షేపయోక్తులతో రచించుటలో జానపదకవి యౌచిత్యదృష్టికంటె జాలియే యెక్కువగా గోచరించును. జనకంటకుడుగా జీవితమును గడిపిన గుత్తాం గోపి రెడ్డిని పలువురు పట్టి చేలనడుమ చంపవలసివచ్చినది. నలుగురు చేరి ఒక్కని

చంపినారేయన్న జాలి "శేరు శేరు యెండిమురుగుల్ సేతులాకు బెట్టుకోని, కట్ట మీదయెల్లావుంటే కలకటే రనుకొంటిర కొడక" యని పాడించినది. ఈవిధమైన జాలి జానపదులకు సార్వత్రికము. దీనికి తోడావ్యక్తిజీవితము సవ్యమగు ధర్మ మార్గమున నడచియుండినచో జానపదులు వానిచరిత్రకు జల్లుజల్లుమందురు. కనుకనే ప్రతిభాషయందును జానపదులు పాడుకొన్నట్టి కరుణరస పూరితము లగు గాథలు పెక్కులు కాననగుచున్నవి. ఆంధ్రజానపదగేయములందును ఇట్టి కరుణాపూరితములు చిత్తద్రుతి కారణములును నగు కథ లనేక మున్నవి. అత్త పెట్టిన ఆరడివలననో, కట్టుకొన్న భర్త యొనర్చిన యత్యాచారమువలననో, తోడికోడండ్ర యసూయచేతనో, ఇరుగుపొరుగుల దౌష్ట్యము వలననో, దైవదుర్విపాకము వలననో ఇడుమలపాలైన స్త్రీలకథలు, జానపద వాఙ్మయ సముద్ర మందలి కన్నీటికెరటములు జరిగిన విషాదగాథలకు జానపదులు కొంతమాహాత్మ్యమును జేర్చి భయభక్తులకు దారితీయునవిగా చేసిరి.

దేశీయేతివృత్తములందు ప్రాచీనమైన కరుణాపూరితగాథ కన్యకామ్మ వారి కథ. ఈమెయే కన్యకాపరమేశ్వరి. వైశ్యుల కిలువేల్పు రెండవది సారంగధర కథ. ఈ రెండును రాజరాజనరేంద్రునకు కళంక మాపాదించునట్టివి. వీనికి చారిత్రకాధారములు లేవు. కామమ్మకథ పిచ్చుకకుంట్లకు కల్పవృక్షము. ఇది యాంధ్రదేశమంతటను వ్యాపించిన పదము. కథావృత్తాంత మాంగ్లేయు లీదేశము పాలించిన తొలిదినములకు సంబంధించినది. సతియాచారము ప్రభుత్వము తొలగించిన పిదపకూడ కొందఱు పతివ్రతలు ప్రత్యేకముగా బ్రిటిషువారి యనుమతి పొంది సహగమనము చేయుచుండిరి. అట్టివారిలో కామమ్మ యొకటి. కామమ్మకథలో నున్న మాహాత్మ్యములు జానపదుల కల్పనలు. అనవసరమగు నతిశయోక్తులుగాని అద్భుతకల్పనలుగాని లేక జరిగినకథ జరిగినట్లుగా హృదయ విదారకముగా కరుణరసపూరితముగా నున్న కథలందు లక్ష్మమ్మ కథ యగ్రగణ్యము. సౌశీల్యము, పాతివ్రత్యము మూర్తీభవించిన స్త్రీమూర్తి లక్ష్మమ్మ. ఆమె సహనము, త్యాగము మున్నగు గుణములు తెలుగుజాతికి గర్వకారణములు. అత్తగారి యారడి, తోటికోడండ్ర ఈర్ష్యాసూయలకు పాల్పడి భర్తతో సహగమనము చేసిన సన్యాసమ్మగాథ మఱియొకటి. అవిభక్తకుటుంబమున కనిష్ఠులు పడెడు బాధల నీకథ చక్కగా వివరించును. గోదావరీ మండలమునకే సంబంధించిన మరియొక పేరంటాలు కథ మండపేట పాపమ్మ కథ. కరుణరసాత్మక గాథలందు ఈ పేరంటాండ్రగాథల కొక ప్రత్యేకతగలదు.

భర్త శరీరముతో సహగమనముచేసిన సుమంగళులను పేరంటాండ్రందురు. కామమ్మకథ, మందపేట పాపమ్మకథ, శృంగవరపుకోట యెరుకమ్మ కథ, సన్యాసమ్మకథ, తిరుపతమ్మకథవంటి పేరంటాండ్ర కథలు ముద్రితములు. వీరందరును సహగమనము నిషేధింపబడిన తరువాత విశేషయత్నము చేసి సాగుమానము చేయుటకు అనుమతి తెచ్చుకొన్నవారు. ఈ సుగుణము జానపదుల నాకర్షించినది. పేరంటాండ్రందరును దేవతలై మ్రొక్కులు దీర్తు రనునది ఈ గాథలయందలి మరియొక విశేషము. తమిళదేశమునుండి తెలుగుదేశమునకు వచ్చిన కరుణాపూరితగాథ నల్లతంగాళ్ కథ. పలనాటి సీమలో నధికప్రచారము గాంచిన కథలందు వీరరాజమ్మకథ యొకటి. తెలంగాణమున ప్రశస్తి నార్జించినవి - ఎరుకల నాంచారి, రాములమ్మ, సరోజని, మూసిపొంగు కథలు.

హాస్యపుపాటలు : నవరసములందు హాస్య మొకటి. తక్కినవారివలెనే హాస్యముకూడ బ్రహ్మానంద సహోదరమని మన పూర్వాలంకారికు లంగీకరించుట భారతీయులకు హాస్యముపట్లగల యభిమానము చాటుచున్నది. పాశ్చాత్యుల హాస్య రచనములు చూచి మనవా రట్టి సాహిత్యము మనకు లేదని పెదవి విరచెదరు. అట్టి సాహిత్యము మన కధికముగా లేనిమాట వాస్తవమైనను కొరమాత్రము లేదు. వికృతములైన యాకారము, వాక్కు, వేషము, చేష్టలు మున్నగువానియొక్క వేడుక వలన హాస్యము కలుగు ననియు, దానికి హాస్యము స్థాయిభావ మనియు మన పూర్వులు చెప్పియున్నారు. ఇంకను హాస్యమును మనవా రారువిధములుగా విభజించి, ఉత్తమాధమ నిర్ణయమునుకూడ చేసియున్నారు. జగన్నాథపండితరాయ లింకను సూక్ష్మములకు దిగి హాస్యమును ఆత్మస్థము పరస్థములుగా విభజించెను. వీని లక్ష్యలక్షణ సమన్వయ మాయాయాలంకారికు లీవరకే యొనర్చియున్నారు. నాగరకులకు గల సుఖదుఃఖానుభూతులు జానపదులకును గలవు. వీనిబాహ్య చిహ్నము లగు నవ్వు ఏడ్పులును గలవు. ఏడ్పునుగురించి చెప్ప నవసరములేదు. జీవిత మధికముగా దుఃఖమయము కనుక ఏడ్పు తప్పదు. తాత్కాలికముగ నైనను ఏడ్పును తొలగించి దుర్భరజీవితమును కొంత సుగమ మొనర్చి మనమును సుప్రసన్న మొనర్చి జీవితమును పెంచునది నవ్వు. అట్టి నవ్వు ఎప్పు డెప్పు డేయేవిధముగా జానపదులకు కలుగునో, ఆది వారి సాహిత్యమున నెట్లు ముద్రితమైనదో పరిశీలింతము.

రామాయణ సంబంధ మగు ''శాంతగోవిందనామము'' లను పాటలో ఋష్యశృంగు డాలంబనము. అతని వింతయాకారమే కుసుమాస్త్రిని సాయకముల

వంటి దివ్యస్త్రీలకు నవ్వుపుట్టించుచుండ నాతని యమాయకపుమాటలు మఱింత నవ్వుపుట్టించినవి. ''అడవి అనే చరగోవిందనామము''లందు కుంభకర్ణుని నిద్రను వర్ణించి వర్ణించి కవి మనకు నవ్వుపుట్టించుచున్నాడు. మఱియు దీని వికారితము (caricature)గా కూడ చెప్పవచ్చును. ''సూక్ష్మరామాయణము''న శూర్పణఖా వర్ణనము హాస్యరసపూరితము. శూర్పణఖ వికృతాకారమువలన కలిగిన హాస్యమున కన్న నట్టి వికృతాకారము గల శూర్పణఖ శ్రీరామచంద్రుని మెచ్చుట మఱియు నాతని మోహించి కోరుట ఉత్తమశ్రేణికి చెందిన హాస్యమును కలిగించును. ''సీత గడియ'' పాటలో హాస్యశృంగారములకు మైత్రి సీతమ్మ నర్మగర్భముగా నన్న మాటలు, పరిహాసోక్తులు. ఇది వాక్చమత్కృతికి సంబంధించిన హాస్యము. వీధ్యంగము అందు చెప్పబడిన ''వ్యాహారము'' న కిది జానపదగేయములందు కాననగు ఉదాహరణము, ''ఊర్మిళాదేవినిద్ర'' లో సీతా శాంతలకు నడచిన సరస సంభాషణము చక్కని హాస్యమున కుదాహరణము. ''శ్రీరామపట్టాభిషేకము''న శంకరుడు చేసిన వేళాకోళ ముత్తమకోటికి చెందిన హాస్యము. భారతసంబంధగాథ యగు ''శశిరేఖా పరిణయము''న ఘటనావికృతికి చెందిన (Absurdity in action) హాస్య మెంతయో గలదు. చారిత్రక గేయములందు కూడ అట నట చక్కని హాస్యము కనిపించును పల్నాటి వీర చరిత్రమున వేశ్యమాత వర్ణన మాకారవికృతికి సంబంధించిన హాస్యము. పల్నాటి చరిత్రమున మరియు కాటమరాజు కథలందలి యుద్ధభీరువుల వర్ణనమున వాక్చేష్టలకు సంబంధించిన హాస్యము కలదు. కాటమరాజుకథలో భట్ల సంవాదమున వ్యాజస్తుతి, వ్యాజనింద, వక్రోక్తి, నర్మోక్తి, నీచోపమ, కాక్వాక్షేపము మున్నగు నలంకారములతో నర్మసంబంధమగు వికృతి కల్పించి వాచ్యముగను వ్యంగ్యముగను చక్కని హాస్యము పోషింపబడినది. శైవవైష్ణవ మతవాఙ్మయమున సంవాదముల కొక ప్రత్యేకత గలదు. గంగాగౌరీసంవాదము, ఈశ్వర భృంగి సంవాదము, లక్ష్మీ పార్వతీ సంవాదము, సవతుల కయ్యము, చెంచులక్ష్మికి కృష్ణునకు సంవాదము, చెంచితకు లక్ష్మికి సంవాదము మున్నగు వానియందు నర్మోక్తులు, దెప్పిపొడుపులు, అవహేళనలు, వ్యాజోక్తులు గలిగిన చక్కని హాస్య మున్నది. లక్ష్మీపార్వతుల సంవాదము ''మృదవ''మున కుదాహరణము. సవతులకయ్యము 'నాళిక' కుదాహరణము. ఈశ్వర భృంగి సంవాదము ''అవస్పందితము''న కుదాహరణము.

కేవలము హాస్యపూరితము లగు గేయములు మనకు కొలదిగనే లభించుచున్నవి. అట్టివాని నధికముగా ముద్రించినటుల లేదు. తెన్నేటి తిరుమలదాసుగారి వేడుక పెండ్లిపాటలందును కర్రా లచ్చయ్య అందు సన్నువారి స్త్రీజనానంద నవీన

కల్యాణ పాటలందును స్త్రీలపాటల సంపుటములందును పెండ్లికి సంబంధించిన వియ్యాలవారి హాస్యపుపాటలు కొన్ని ప్రకటింపబడినవి. కొండపల్లి వీరవెంకయ్యగారి హాస్యపుపాటలపుస్తకమునందు తీరుతీరుల హాస్యపుపాట లున్నవి. శ్రీ గంగాధరంగారి సెలయేరు ప్రకీర్ణములుగా కొన్ని పాట లున్నవి. సుమా రేబది హాస్యపు పాటలు తెలంగాణమునకు సంబంధించినవి నేను సేకరింపకలిగితిని. వీనిలో హాస్యానుకృతులు (Parodies) కూడ కలవు. ఉద్ఘాత్యకమునకును, ఛలమునకును చక్కని యుదాహరణ లీ జానపదగేయములందు కొల్లలు. జానపద సాహిత్యమున నధిక్షేపగేయము (Satire) లు కొలదిగనే యున్నవి. హాస్యపాత్రములుకూడ కొలదియే జానపదగేయములందు గానుపించు హాస్యము మన జాతీయహాస్యము. ఇందు సున్నితహాస్యముతోపాటు మోటుహాస్యము కూడ కలదు. ప్రపంచమందలి సాహిత్యము లన్నింట నిట్టి హాస్యములు గోచరించుచునే యుండును. స్త్రీలపాటలందధికముగా మృదువై నభ్యమైన హాస్యముండును. ఇట్టి హాస్యము జానపదుల నిత్య జీవితమును సుఖమయముగా నొనర్చుటకు దోహద మొసంగును.

ఇంతవరకు జానపదగేయముల పుట్టుపూర్వములు, వాని లక్షణములు, వాని ప్రశస్తి, వాని విభేదములు నానేర్చినభంగి దిఙ్మాత్రముగా ప్రదర్శించితిని. వానిలోని విశేషము లెత్తిచూపుట కిట తావు చాలదు. తెలుగుదేశమున నున్న నదీనదములు సెలయేళ్లు వాగులు వంకలు ''సాగరోగతిః'' యైనటులే ఈ జానపద గేయస్రవంతి కూడ ఇప్పటికే చాలభాగము మనకు దక్కకుండ లుప్తమైపోయినది. ఉన్నదానినైన భద్రపరచుకొనుట తెలుగువారి కర్తవ్యము. పండితులు విమర్శకులు జానపద గేయములందున్న సాహితీవిషయము లెత్తిచూపవచ్చును. సామాజికశాస్త్రవేత్తలాసంపదలో తమకు గావలసిన యమూల్యమణు ల్వెదకవచ్చును. చేయిదిరిగిన కవులు రచయితలు కళాకారులు వానియందు ఉపలబ్ధమగు దేశీయ వస్తు సంపదను దిద్దితీర్చవచ్చును జానపదకవితారీతుల నందరికన్న నెక్కుడుగా సద్వినియోగము చేసినవారు రాజకీయపక్షములవారు, తమ తమ రాజకీయసిద్ధాంత ప్రచారములకై బుఱ్ఱకథలు, జముకుల కథలు, గేయములు రచించిన వీరి యాశయము కొనియాడదగినదే. స్వరాజ్యోద్యమసమయసాహిత్యమున వెలువడిన ''మాకొద్దీతెల్లదొరతనము'', ''దండాలు దండాలు భరతమాతా'', ''కొల్లాయిగట్టితేనేమీ'' వంటి రచనములు పూర్తిగా జానపదుల సొమ్మైపోయినవి. స్వరాజ్యోద్యమము, సంస్కరణోద్యమమునకు తోడ్పడిన గేయములు పుంఖలకొలది వెడలినవి. వీనిప్రయోజనము తాత్కాలికమే యైనను

ప్రభావము మాత్ర మనంతము. చేయిదిరిగిన రచయితలు జానపదగేయము లందున్న వస్తువును సీకరించి కలమందుకొనవలెగాని రవ్వలు రాల్చవచ్చును. ఆంధ్రభాషామతల్లి కెనలేని తొడవులు సవదరింపవచ్చు. జానపదగేయములం దుండు జాతీయములు, నానుడులు, వింతవింత పలుకుబడులు శిష్టు లాకళించు కొనవలసిన యమూల్యసంపద. నవ్యభారతపునర్నిర్మాణమున వివిధప్రణాళికా ప్రచారమునకును ప్రజావబోధమునకును జానపదకవితారీతు లుపయోగించు నంతగా నితరము లుపయోగపడవన్న నతిశయోక్తి కాదు. ఔత్తరాహులు, ముఖ్యముగా హిందీబెంగాలీభాషలవా రీమార్గమున చాలదూరము సాగిపోయినారు. ఇరుగుపొరుగువారిని జూచియైనను తెలుగువా రభినివేశము కల్గించుకొన్నచో నాంధ్రదేశమునకు నాంధ్రభాషామతల్లికి నాంధ్రవిజ్ఞానమునకు మేలగు నని సప్రశ్రయముగా నివేదించుచున్నాను.

—భారతి

1956, నవంబరు, డిసెంబరు.

సంపుటము 33; సంచికలు 11, 12.



# గ్రామ్యవాదుల భాషాపవాదము

—శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహరావు

హరిహరీ ! మనగ్రాంథికాంధ్రభాష మరణించినదా ? ఎప్పుడు ? ఎవ్వరును వినలేదే ? ఈ యాకస్మికోపద్రవ మేల కలిగినది ? ఈ నడుమ భాష కస్వస్థత యని కూడ వినలేదే. ఆరోగ్యముగనే యున్న దని యందఱుఁ జెప్పుకొనుచుండిరి కదా ! అందులో నలువదియేఁబదిసంవత్సరములనుండి మఱింత నీరోగస్థితిచే విరాజిల్లుచున్నదే ! దేహదార్ఢ్యముకలిగి హృదయోల్లాసము కలిగి చకచకలాడుచు నెక్కడఁ జూచినఁ దాన యై ప్రకాశించుచున్నది కదా ! మునుపటి తట్టురాగిడులతో, బుట్టకొప్పులతో వెఱ్ఱిగా సింగారించుకొనుట మాని నూతన నాగరకత కర్హములైన యొకటి రెండుభూషణములు మాత్రమే ధరించి ముసిముసినగవుల మిసమిసలతో బుగ్గగులాబుల బుగబుగలతోఁ గన్నులపండువు సేయుచున్నదే ! ప్రస్తుతకాలానుసారముగఁ బ్రస్తుతజనచిత్తరంజకముగఁ బ్రాచీనబడబడాయమాన శబ్దాడంబరములు, సందిగ్ధసంభాషణములు, వివిధాభిప్రాయప్రకాశకవచోవైఖరులు, నాంతరంగకాఠిన్యము వదలుకొని పువ్వులవలె నవ్వులవలె మృదులములైన ముద్దుముద్దుపలుకులతో - స్పష్టములై స్వచ్ఛములైన దాఁపఱికము లేని విడివిడి పలుకులతో నేకాభిప్రాయబోధకము లగు టకుటుక్కు మను సూటిపలుకులతో - నరఁటిపండు దొలిచి చేతఁ బెట్టినట్లు కులుకుచుఁ గులుకుచుఁ బలుకుచున్నది కదా ! కొందఱను దనచుట్టుఁ గూర్చుండఁ బెట్టుకొని వారికిఁ జిత్రచిత్రకల్పనలు గల స్వకపోలకల్పితకథలను - నేదేని పరభాషాకథలను - సరసముగ సమంజసముగ సందర్భముగఁ జెప్పి హృదయరంజన మొనర్చుచున్నదే ! మఱియొకచో నాటకరంగములఁ జేరి బంగరుగజ్జెలు గట్టుకొని తాండవమాడుచు ద్రష్టలను గూడఁ దెయితక్కలాడించుచున్నదే ! మునుపటి బెక్కు, మునుపటి బిగువు, మునుపటి "నన్ను ముట్టికొనకుఁదనము" విడిచి యాంగ్లేయభాషలో నున్న ప్రకృత్యాదిశాస్త్రములలోని విలువగల పదార్థముల నొడిలో వైచికొని తెచ్చి మనకుఁ గాసంత కాసంతగఁ గోరుముద్దల క్రిందఁ బెట్టి నోరూరఁజేయుచున్నదే ! ఎక్కడఁ జూచినఁ దానయై సభాముఖముల నీతినిగూర్చి, రాజభక్తిని గూర్చి, తనసేవనుగూర్చి సింహఘోషమున నుపన్యసించుచున్నదే ! లోకవార్తాబోధనమున జనులకు లౌకికజ్ఞానసంపద నీయఁదలంచి యిటు బ్రహ్మపురము మొదలుకొని యటు

బొంబాయివఱకు నొక్కటే ప్రమోతగఁ బ్రతిధ్వను లిచ్చునట్లుగఁ బలుకుచున్నది కదా ! తననివాసముకొఱకుఁ బట్టణ మనక, పల్లె యనక యవకాశ మున్నంత వఱకుఁ గొన్నిస్థలములందు మందిరములను గట్టినదే ! కొన్నిచోటులఁ గట్టు చున్నదే- మఱికొన్నిచోటుల శంకుస్థాపనమునకు యత్నించుచున్నదే ! బ్రదుకఁ దలఁచి- చిరకాలము బ్రదుకఁదలచి- శాశ్వతముగ బ్రదుకఁ దలఁచి, బ్రదు కనఁగ నింతపామరత్వమునఁ బ్రాకులాడు భాష మరణించిన దని గ్రామ్యవాదులు కఠోరముగఁ బలికిరా ! పాపము శాంతించును గాక !!

శత్రుత్వ మున్నయెడల సాధించురీతిని సాధింపవలయును గాని చావు వార్తలు వైతురా ? నోటి కందదని, వెగటని, కటువని, కొఱుకఁబడదని, పాషాణ మని భాష ననేకవిధముల దుర్భాష లాడినారు.ఈ వాగ్దోషము చాలదా? భాషను సేవించి, పూజించి, దాని సాన్నిధ్యముననే నిల్చి, దానికిఁ బామర జనస్పర్శముచే నపవిత్రత గలుగకుండఁ గాపాడుచు, దానికి శక్తివంచనము లేకుండ సర్వోపచారములు సేయుచు, దానికటాక్షమువలననే జీవయాత్ర నడుపు కొనుచు,దానికై తమ తనువులను బ్రాణముల నర్పింపఁ దలఁచి పాటుపడుచుండు పండితోత్తములను బుంఖానుపుంఖముగఁ దిట్టినారు ఈ పండితద్వేషము చాలదా? భాష చచ్చిన దని నోరారఁ బలికినఁ గాని పగ తీఱలేదా ?

పేరులేనిసామాన్యజనుని యథార్థమృతివార్తనే జనులు వెల్లడిచేయుట కిష్ట పడరు కదా ! మనజాతిలోని భూతభవిష్యద్వర్తమానప్రాణముల కన్నిటికిఁ బ్రాణ మైన మనతెనుఁగుబాస చచ్చిన దను నసత్యవార్త వీ రెట్లు నోటఁ బలుకుటకు సాహసించిరో ! అంతటితో నూరకుండక యీ వార్తను గ్రంథస్థము సేయుటకు వీరిగుండె లెట్లు తాళెనో ? గ్రామ్యవాదులు విద్యావంతులు బుద్ధిమంతులు గాని వేఱుకారు. వారు బుద్ధిపూర్వకముగ నసత్య మాడువారు కారు. అందులో నిట్టి లోకోపద్రవకరమైన యసత్య మాడుదురా? ఈ మాయ యేమో బోధపడకున్నది. బాషలోనే యీ యింద్రజాలము నీ కనుకట్టు నీ ద్విముఖత్వము నున్నదేమో ? మనకందఱకు జీవ కళలను గనఁబఱచి వారి కందఱకుఁ బ్రేతకళలు గనఁ బఱుచుచున్నదేమో ? ఇంకొక చిత్రము ! మ. రా. సెట్టి లక్ష్మీనరసింహము గారు, రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారు నొక్కయయ్యవారుల యొద్ద విద్య నేర్చినవారే కద ! ఒక్కతీరు పలుకాడువారే కద ! ఒక్కదారిని బోవు వారే కద ! రామమూర్తి పంతులుగారి కనులకు భాష మొద్దువలె నున్నది. లక్ష్మీనరసింహముగారి కనులయెదుట ఖిలఖిల

లాడుచున్నది. అందుచేతనే కదా- "Every living language is in a state of continuous growth and development, it is only when it becomes dead, that it becomes stationary. Telugu is not a dead lauguage" అని శ్రీ లక్ష్మీనరసింహముగారు భాషకుజీవపత్రికను దయచేసి యున్నారు. అన్యోన్యనిరుద్ధముగఁ బల్కు నీగ్రామ్యవాదులలో మనకు సూత్రకారులెవ్వరు? 'గ్రీకుమిత్రుఁ. బొప్పరుపా' ఁేత్యాద్య లౌకిక గ్రంథసంధానధురంధరు లగు లక్ష్మీనరసింహముగారా! వారికంటె వయోవృద్ధులుఁ బ్రాపంచికజ్ఞానవృద్ధులు నగు రామమూర్తిపంతులుగారా? వీరి మాటలు నమ్మి భాషకు త్తరక్రియ లారంభింపవలసినదా? వారి మాటలు నమ్మి యుపచారక్రియ లారంభింపవలసినదా? కాని వీ రిట్టి చావుబ్రదు కెఱుఁగని మాటలు మాటలాడుచున్నారేమి? రామమూర్తిపంతులుగారీ దిగువ వాక్యములలో భాషామృతిని స్పష్టపఱచినారు. వారి- "A memorandum on modern Telugu"లో "I understand that some of the educated men in the Telugu country are desirous of reforming the modern language and the old grammar and modern vocabulary. This is, in my opinion, unscientific, unnatural and impracticable. This is simply a quixotic method of reforming a language. It is like putting into the skull of a Mummy the brains and eyeballs of a living body and hoping to make it think and see." మఱియొకచో నాగ్రంథమునందె "The dead language of his poetry which he has substituted Etc., Etc." మఱియొకచోట "Latin, the old literary language of Italy has been dead and unintelligible to the people (old literary Telugu is now like Latin)" మఱియొకచోట "The Pandit who has no sense of the correct usage of old words naturally commits serious blunder when he attempts to write in a dead language." గ్రాంథికభాష మృతభాష కాదని మా యభిప్రాయము. ఏలయన గ్రాంథికభాషాపదములనే కొన్ని కొన్ని మార్పులతో మనము మాటలం దుపయోగించుకొనుచున్నాము. మాటలలోని యీ మార్పు లనునవి వ్యాకరణ జ్ఞానశూన్యత్వముచేతను, బలుకుబడిలోని తొందరచేతను, నిజమైన యుచ్చారణము తెలియక పోవుట చేతను, మఱికొన్ని యితర కారణములచేతను గలుగుచున్నవి. శబ్దములలోని యీ

దోషములు మనదోషమువలననే కలిగినవి. ఇట్టి దోషము లుత్తమవచనగ్రంథము లలో వర్జింపవలసినదని యూనివర్సిటీవారు ద్రావిడభాషాసందర్భమున నిట్లు తీర్మానించియుండిరి: "That slang and other similar irregular forms of expression which are either the result of violation of accepted rules of grammar or are produced by means of contractions or other modifications due to hurry, indiference and ignorance be declared to be unacceptable to dignified prose composition.' ఇట్టిదుష్టరూపములుపదములకుఁబూర్వోదాహృతకారణములవలన వచ్చియున్నంతమాత్రముచేత నీ శబ్దములు పూర్వ శబ్దముల కంటె భిన్నము లని చెప్పఁదగదు. అట్లు చెప్పుట మిక్కిలి యప్రాజ్ఞత. కుష్ఠరోగముచే నాకని కొదలంతయు వికృతరూప మొందియున్నను నాతఁడు మనుపటివాఁడే కాఁడా ? నల్లనియాతఁడు శ్వేతరోగముచే వర్ణవ్యత్యాస మొందినంతమాత్రమున నాతఁడు మఱియొక్కఁ డగునా ? కాలును దెగఁగొట్టించుకొనినంతమాత్రమున నరుఁడు క్రొత్తయాతఁ డగునా ? వీపుపైఁ బెద్దకంతి నూతనముగఁ గలిగిన నరుఁడు కంతి కారణమున మఱియొక మానిసి యగునా ? అటులే శబ్దము పైఁజెప్పిన కారణములచే నడిమినడిమివర్ణములలో వ్యత్యాదశ గలిగినఁ గాని, రూపమునఁ గొంత హ్రాస మొందినఁ గాని, లేక కొంత యాధిక్య మొందినఁ గాని యదియే శబ్దము కాని వేఱు కానేరదు. కావున సంభాషణము లోని శబ్దము లన్నియు గ్రాంథిక శబ్దములే యని యొప్పుకొనక తీరదు. కాని యవి కొందఱమనుజుల దంతముల క్రిందఁబడి నలఁగినవి;తెగినవి;సాఁగినవి; చప్పఁబడినవి.కానిండు! ఎటులైన నవి గ్రాంథిక శబ్దములే.ఇట్టి దుర్దశనందినయట్టి గ్రాంథికభాషనే మనము సంభాషణములో నుపయోగించుకొనుచున్నాము. ఏదీ ? ఒక్క తెలుఁగుపదము—గ్రాంథికభాషలో లేనిది, గ్రామ్యభాషలో నున్నది, మీరు చెప్పఁగలరేమో యోజించుకొనుఁడు అట్లుండుటకు సాధ్య మెట్లున్నది ? కావున సంభాషణలో నుపయోగించుకొనుచున్న భాష గ్రాంథిక భాష- చెడిన గ్రాంథిక భాష- దురవస్థ నొందిన గ్రాంథిక భాషయై యున్నది.

అట్టి గ్రాంథిక భాషను సంభాషణములో వాడుక చేసికొనుచు "గ్రాంథికభాష మాటలలో నుపయోగింపఁ బడునది కాదు, కావున నది చచ్చిన" దని వాదించుట ప్రాజ్ఞలక్షణమా ? అది మననోటఁ బడకపోవుటచేత జచ్చిన దనుటకంటె నోటఁ బడుటచేతనే చావునకు సిద్ధమై యున్నదని యనుట యథార్థముగ నుండును గదా?

బొబ్బిలిపాట బజారుశో విని మాయింటిప్రక్కనుండి వారియిండ్లకుఁ బోవు నిద్ద తీట్లనుకొనుచుండిరి : "ఇజానగరంరాజు మామోసం చాసాడ్రా. బూసీతో యాకమై పంఉంటి బొబ్బిలోరని పాడు చేసాడ్రా" యని యొక్కఁడనఁగ, 'బొబ్బిలోరు బొబ్బిలో రంటే నాకు బోదపళ్ళే దెవర్రా" యని యింకొక్కఁ డనెను. అంత మొదటివాఁడు "రామేశ మంతా యిని రాఁవుడికి చీత యామౌ ద్దన్నట్టుందిరా! బొబ్బిలో రనఁగ మఱిగత్తే మనవూ రెలమోరేరా! శెన్నపట్టంమాయన్ని మన పెద్దరాజుగారు దత్తు చేసుకొన్నట్టే బొబ్బిలి రాజుగారు మనరాజుగారి తాతగారిని గంబోర్లా దత్తుచేసుకొన్నారు. అది తాతల్నాటి కత"యని పలికెను. ఈ సంభాషణములోని పదములు గ్రాంథికపదములు కావా? పరమమూఢులు సహితము గ్రాంథికభాషాపదములనే యుపయోగపఱుచుకొనుచున్నారు. తప్పుగ నుపయోగపఱుచుకొనుటకు వారిమౌఢ్యమే కారణము. తప్పుగనో యొప్పుగనో పండితులు పామరులు నందఱును గూడ గ్రాంథికభాషాపదములనే యుపయోగించుకొనక తప్పదు. గ్రామ్యభాషలో నతిసులభముగ గ్రంథము వ్రాయ సంకల్పించుకొనిన మ. రా. శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారు తమ "Greek myths" అను గ్రంథము రెండవభాగమున 82వ పేజీలో 22 పంక్తులలో 29 సంస్కృతపు మాట లుపయోగించిరి. "రాజకీయవ్యవహారము, హ్రస్వాంగుఁ"డను మొదలగు సమాసముల సహిత మొక్కమాటగనే గణించితిమి. మన మనసులోని గంభీరాభిప్రాయములను వెల్లడింపవలయు ననిన గ్రాంథికభాషకంటె మఱియొకదారి లేదు. ఏల? మాటలాడుకొనుభాషలో ననఁగ-గ్రామ్యభాషలో నేమంత పదజాల మున్నది! ఆహారనిద్రాసంగమవిషయికాభిప్రాయముల వెల్లడించుటకుఁ దగిన కొన్నిమాటలే కాని యంతకంటె నెక్కుడు మాట లెక్కడివి? రాజసేవార్హము లైన మాట లేవి? సభాసమర్హము లైన మాట లేవి! దేవప్రార్థనాదికార్యార్హము లగు మాటలేవి? మతవిషయికము లగు మాట లేవి! నీతిప్రతిపాదకములగు మాట లేవి! బహిః ప్రాపంచిక బోధకము లగు మాట లేవి! అంతరప్రాపంచికజ్ఞానబోధకము లగు మాట లేవి? "రాజు"నకు గ్రామ్యమున నే మున్నది? "ఏలిక" యని యున్న దందురేమో! కాని 'యేలిక' యని మాటలలో వాడుకొనుచుంటిమా? 'మంత్రి' కే మున్నది? 'మనుష్యున' కే మున్నది? "ప్రాణము"న కే మున్నది? మనస్సు, దేవుఁడు, ధాన్యము, నీతి, వీథి, పుస్తకము, దయ, దానము, ధర్మము, సత్రము, వ్యవసాయము (కృషి యను నర్థమున), వేదము, పురాణము, ప్రపంచము, నీరము మొదలగు పదములకు గ్రామ్యమున నే మున్నవి? కూటిగుడ్డమాటలతో గుడుగుడుగుంచము లాడఁ

దగిన గ్రామ్యభాషలో వేలకొలఁది యిట్టి గ్రాంథికభాషాపదములను వాడుకొనుచు గ్రాంథికభాష వాడుకలో లేదని యనుటకు నోరెట్లు వచ్చినదో వింతగ నున్నది. గ్రాంథికభాష నంతబహుళముగ నుపయోగించుకొనుచు నది లేకుండిన యెడల నొకనియభిప్రాయ మొకనికి వెల్లడి కాకపోవుటచే మనమే చావవలసి యున్నప్పు డది చచ్చె నని పలుకుట భాషయెడల బూర్ణమైన విశ్వాసఘాతుకత సూచించు చున్న దని మా యభిప్రాయము. నిత్యోపయోగములో నున్న భాష చచ్చిన దని చెప్పుటయు, సూర్యుఁడు కాంతిహీనుఁడని చెప్పుటయు నొక్కటియే భాష చచ్చిన దనుమాట కేవల మసందర్భము. అహేతుకము.

సంస్కృత భాష మృతభాష యని సామాన్యాభిప్రాయ మై యున్నది. కాని సంస్కృతభాషాపరిచయము పూర్ణముగ సంపాదించి యున్న పాశ్చాత్యు లలో మహనీయుఁ డగు Max Muller దొరగారు వేఱుగ నభిప్రాయ పడు చున్నారు. వారి మాటలను గ్రింద నుదాహరింతును :

'Sanskrit, therefore, as a language spoken by the people at large had ceased to exist in the third century B.C. Yet, such is the marvellous continuity between the past and the present in India, that in spite of repeated social convulsions, religious reforms and foreign invasions, Sankrit may be said to be still the only language that is spoken over the whole extent of that vast country-'

అని చెప్పియున్నారు. భరతఖండమునం దంతట నిప్పటివఱకు సంస్కృత మొక్కటే సంభాషణమున కుపయోగింపఁ బడుచున్న భాష యని కంఠోక్తిగఁ జెప్పినారు. సంభాషణార్హ మైన భాష చచ్చిన దని గ్రామ్యవాదు లనఁగలరు; కాని గ్రాంథికభాషాపండితుఁ డగు Max Muller గా రనుటకు సాహసింతురా? అంతేకాక దాదాపుగ నన్నివిధము లగుల్రాఁతలు నప్పటికి (1882) సంస్కృత ముననే వ్రాయఁబడుచున్నవని యిట్లు వారు చెప్పుచున్నారు :

"Though the Budhist sovereigns published their edicts in the veraculars, public inscriptions and private official documents are composed in sanskrit to the present day .the literature of India never ceased to be written in Paninean Sanskrit. .Even at the present moment after a century of English rule and English Teaching, I believe

that Sanskrit is more widely understood in India than Latin was in Europe at the time of Dante.

Whenever I receive a letter from a learned man in India it is written in Sanskrit. Whenever there is a controversy on questions of law and religion the pamphlets published in India are written in Sanskrit There are Journals written in Sanikrit which must entirely depend for their support on readers who prefer that classical language to the vulgar dialects. There is the "Pandit" published at Benares containing not only editions of ancient texts but treatises on modern subjects, reviews of books published in England and controversial articles all in Sanskrit.

* * * *

Still more extaordinary is the number of Sankrit texts issuing from native presses for which there seems to be a large demand, for if we write for copies to be sent to England, We often find that after a year or two, all the copies have been bought up in India itself. That would not be the case with Anglo-Saxon texts in England or with the Latin texts in Italy. But more than this we are told that the ancient epic poems of Mahabharata and Ramayana are still recited in Temples for the benefit of visitors." ఇటులే Max Muller గారు సంస్కృతభాషావ్యాప్తిని గూర్చి మఱికొన్ని యంశములు వ్రాసిరి. సంస్కృత భాషలో 1892 సంవత్సరమువఱ కనేకగ్రంథములు పుట్టుచున్న వనియును, ననేక పత్రికలు ప్రకటింపఁబడుచున్న వనియుఁ, బురాణాదులు సంస్కృతమునఁ బఠింపఁబడుచున్న వనియుఁ,దనకు త్తరములు సంస్కృతమున వచ్చుచున్న వనియు, శాస్త్రవాదములు సంస్కృతమున జరుపఁబడుచున్న

వనియు,నెన్ని సంస్కృతగ్రంథము లైనను గాలాతీతమగునెడల నింగ్లాండువారికి మిగులకుండ హిందూదేశముననే పాఠకులు కొనుచున్నా రనియు, భాషాజ్ఞానము భరతఖండమునం దంత వ్యాపించియున్నదనియు, సంస్కృత భాషను ధారాళ ముగ మాటలాడ సమర్థులగు పండితులు గలరనియు, నది Anglo-Saxon, Latin వంటి మృతభాష కాదనియు, నొక్క సంస్కృత భాషయే భరత ఖండమునందంత సంభాషణములో నున్నభాష యని చెప్పవచ్చు ననియు వారు వెల్లడించిరి. అందుచే నొకవిధముగ సంస్కృతభాష చావలేదనియే వారి యభి ప్రాయ మైనట్లు స్పష్టమగు చున్నది. "India-What it teaches" అను వారిగ్రంథములో మూఁడవయుపన్యాసము భాషాభిమాను లందఱుఁ జదివి సంత సింప వలసిన దని మా ప్రార్థన.

సంస్కృతభాషయే మృతభాష కాదని స్పష్టముగఁ గనఁబడుచుండగ నిఁక నాంధ్రభాష మృతభాష యని చెప్పనొప్పునా ? ఊరెగిరిపోవునట్లు మాటలాడు చున్న యుపన్యాసకర్త మూఁగవాఁ డని చెప్పుటకుఁ జెవిటివాఁడైన సాహసిం చునా ? నిరంకుశముగ నాకసమున నెగురుపక్షికి ఱెక్కలు లేవని వాదింప వచ్చునా ? సంవత్సరమున కొక్కపిల్లను గనునిల్లాలు గొడ్రాలని పలుకఁదగునా? ఉన్నవాఁడు లేనివాఁడని యనవచ్చునా? ఆంధ్రభాషలో సంవత్సరమున కెన్నియో గ్రంథములు పుట్టుచుండఁగా, జిల్లాకు మూఁడేసి నాలుగేసి యాంధ్ర పత్రికలు ప్రచురింపఁబడుచుండఁగా నెల కెన్నియో యుపన్యాసము లాంధ్రమున బయలు వెడలుచుండగా నుదయమున లేచినది మొదలు తిరుగఁ బండుకొనువఱకు నాంధ్ర భాషలోఁ దఱుచుగ మనము మాటలాడుకొనుచుండఁగా, నిద్రలో-సన్నిపాతరోగా వస్థలోఁ గూడ నాంధ్రమునే మన ముచ్చరించుచుండఁగా నాంధ్రభాష చచ్చినదా!! మనకు భాషాభిమానము చచ్చినది గాని భాష చావలేదే ! మనకు భాషాజ్ఞానము చచ్చినది కాని భాష చావలేదే ! భాషను వృద్ధిపఱుచుకొను నేర్పు మనకుఁ జచ్చినది కాని భాష చావలేదే! మన సంబంధమైన దేదైనఁ జచ్చియుండును, జావ వచ్చును గాని మన భాష మాత్రను చావలేదు; చావదు.

గ్రాంధిక భాష మృతభాష యను నంశమే గ్రామ్యవాదులవాదమున కాయువు పట్టు. ఇది నిలువఁబడినగాని వారి వాదము నిలువఁబడదు, అది యీయుర్గ్రంథి యన్నమాటయే కాని యీ ముడి ముట్టుకొనుసరికే వీడిపోవుచున్నది. శ్రీ శంకరా చార్యులవారు బౌద్ధమతఖండనప్రశంసలో బౌద్ధవాద మిసుకసూఁఖువలె నున్నదని సెలవిచ్చిరని వింటిమి. ప్రయత్నమునఁ బూడ్వ నక్కఱలేకుండఁ దనంతఁదాను

బూడిపోవుచున్నదఁట. గ్రామ్యవాదుల భాషామృతి వాదముకూడ నష్టేయున్నదని మా యభిప్రాయము. దీనినిగూర్చి విశేషచర్చ యావశ్యకము కాదు. అయినను వారిరాకడ మరియొకతీరున నుండునేమో యదియుఁ గూడ యోజింతము.

గ్రామ్యవాదు లిట్లందు రని యూహించుకొందము, "గ్రాంథికభాషలోని శబ్దములే దాదాపుగా సంభాషణములో వాడుకొనుచున్నమాట సత్యమే; కాని గ్రాంథిక భాషలోని యనేక శబ్దములను యథారూపములతో వాడుకొనుచుండుటలేదు. క్రియలకు భూతాదికాలములలోను, ప్రథమాదిపురుషములలోను గ్రాంథికభాషలోఁ గలుగు మార్పులను వాడుకలో మన ముపయోగించుచుండుట లేదు. ఆ మార్పులు శాస్త్రీయమైనవి కావు. వైయాకరణుఁ డిష్టానుసారముగ శాసించినవి. అందుచే నవి సహజమైన గ్రామ్యభాషలో నిలువఁబడలేదు. వేఱురూపము లొందినవి. ఇట్టి వేఱురూపములు Phonetics అను శాస్త్రము ననుసరించి కలిగియున్నవి ఇవి స్వభావసిద్ధములగు రూపములు. "వచ్చుచున్నాడు" అనునది గ్రాంథికభాషలో "వచ్చు" క్రియకు ప్రథమైకవచనము. ఇది "Natural laws" వలన వస్తు న్నాడుగా మాఱినది. గ్రాంథికభాష చచ్చిన దనఁగ శబ్దాంతములందలి యీ ప్రత్యయాదిరూపములు చచ్చినవని మా యభిప్రాయము. వాడుకలో లేని హేతువుచే నవి చచ్చె ననుట తప్పులేదు." ఇది గ్రామ్యవాదులవాద మని యనుకొందము. మనము దీనినిగూర్చి యీయఁదగిన ప్రత్యుత్తర మీక్రింద నుదాహరింతుము.

Natural laws వలనఁ గలిగిన శాస్త్రీయస్వరూపము లని గ్రామ్యవాదులు చెప్పునవేవో యవి యజ్ఞతాది దోషములవలనఁ గలిగిన తప్పు లని మేము చెప్పుదుము. "Natural laws" అను పదము మిగుల స్థూలమైనది. అవి రెండు విధములు. బాహ్యప్రపంచముతోఁ జేరినవి. ఆంతర ప్రపంచముతోఁ జేరినవి. గ్రహాదుల యాకర్షణశక్తి మొదలగునవి బాహ్యప్రపంచముతోఁ జేరినవి. స్వరక్షణాశక్తి మొదలగునవి యాంతర ప్రపంచముతోఁ జేరినవి. మొదటివానిని గూర్చి విచారణము మన కిప్పు డక్కఱలేదు. ఆంతర ప్రపంచ తత్త్వమును బాగుఁగ బరిశీలించినయెడలఁ గేవల మన్యోన్యవిరోధము గల రెండు విధములగు శక్తులు దానిలో నగపడుచున్నవి. Emotion (హృదయానుభవము) సంబంధ మగు శక్తి యొకటి; Intellect (జ్ఞాన) సంబంధ మగు శక్తియొక్కటి, మొదటిదానికి సంబంధించిన Natural laws (స్వాభావిక శాసనములు) కొన్ని యున్నవి. రెండవదానికి గొన్ని యున్నవి. Emotion తో సంబంధించిన శాసనములు మనుజుని యాముష్మికసుఖమున కెగలాగుచుండును.

రూపవతి యగు పరకాంతను జూచినపుడు మనుజునికి దానిపై నపేక్ష పుట్టించు నది Emotion తో సంబంధించిన శాసనమై యున్నది. పరస్త్రీవాంఛ పాప మనియు నింద్రియనిరోధ మొనర్చినఁ గాని యాత్మ కుత్తమగతి కలుగ దనియు బోధించి మనసున కైహిక వైరాగ్య మిచ్చునది Intellect తోఁ జేరిన శాస నమై యున్నది. మొదటిది మన పూర్వతత్త్వమగు పశుత్వమునకై పడలాగు చుండగా రెండవది మన పరతత్త్వమగు దైవత్వమునకు నెగద్రోయుచుండును. రెండును గూడ స్వాభావిక శాసనములే (Natural laws). మనుజుఁడు వేశ్యాదాసాధముఁ డగుటయు వేదాంతశిఖామణి యగుటయు Natural laws ప్రకారమే; న్యాయాధిపతి యగుట Natural laws ప్రకారమే; వానిచే మరణదండనము నొందు మనుజఘాతుకుఁ డగుటయు Natural laws ప్రకారమే; వితరణపరాయణుఁ డగుటయు Natural laws ప్రకారమే; తస్కరాధముం డగుటయు Natural laws ప్రకారమే; పరబ్రహ్మ యగు టయు Natural laws ప్రకారమే; పశుహంత యగుటయు Natural laws ప్రకారమే. కాని వేశ్యాదాసుని జనులు తిట్టుచున్నారు; వేదాంతిని స్తుతించు చున్నారు; త్యాగిని గౌరవించుచున్నారు; తస్కరుని శిక్షించుచున్నారు; న్యాయ కర్తను మన్నించుచున్నారు; నరహంతను బూతులు తిట్టుచున్నారు. అటులే Natural laws వలనఁ గలిగిన శబ్దములలో నుత్తమము లగువానిని గ్రంథా ర్హములని గ్రంథకర్తలు గ్రహించుచున్నారు; కొన్నిటిని నిందార్హములని పరిత్యజించుచున్నారు. కావున Natural laws వలనఁ గలిగిన వను కారణ ముచే నన్నిశబ్దములు శాస్త్రీయము లని దోష రహితము లని గ్రాంథికభాషా పరిగ్రహణ యోగ్యము లని వాదించు గ్రామ్యవాదుల వాదము హాస్యాస్పదము.

దీనికి గ్రామ్యవాదు లిట్లు ప్రత్యుత్తర మిచ్చెద రనుకొందము: "మీరు తెచ్చిన సామ్యము దీనికి సరిపోదు.సర్వశాస్త్రసంబంధ మగు స్వాభావిక శాసనము లలోఁ గొన్నిశబ్దములను బాడుచేయునవి కొన్ని బాగుచేయునవి లేవు శాసనాను సాధ్యముగ శబ్దములలో వచ్చుమార్పు లన్నియు సహజములే. అందుచే నన్నిశబ్ద ములు గ్రాహ్యములుఁ కాదగును."సరే వీరివాద మసమంజసము.యుక్త్యను వాదార్థమై సమంజస మని కొంతసేపంగీకరింతము.Natural laws చే మార్పులు గలుగు సమస్త శబ్దములుఁ గూడ గ్రాంథికభాషాపరిగ్రహణయోగ్యము లని వీరి సిద్ధాం తము. "చూచినాను" అనునది గ్రాంథికశబ్దము. "చూచాను;చూశినాను;చూశాను; చూచా;చూశా" అనునవి Natural laws ననుసరించి వచ్చినమార్పులు. కావున నివియన్నియు గ్రంథములలో నుపయోగింపఁదగినవే యగును. కాని గ్రామ్యవాది

“చూచాను” అను రూపమునే గ్రంథస్థము చేయుట కంగీకరించును గాని మిగిలినవి నిరాకరించును. ఎందుచేత? మిగిలినవి కేవలము పామరులు మాటలాడుకొను మాట లగుటచేత వానిని నిరాకరించును. Natural laws యొక్క నియమములనకు శబ్దముతోనే కాని పండితపామరభేదముతో నిమిత్త మేమున్నది? “చూచాను” అను రూపము కంటె Natural laws యొక్క పనిచే “చూశాను” అను రూపము మిక్కిలి నిగ్గు సాపు కలది. దానికంటె “చూశా” యను రూపము సంక్షేపపుఁ గట్టుదిట్టముచే మఱింత ప్రశస్తమైన రూపము. ఇట్లు Natural laws యొక్క చేతుల క్రిందఁ గాళ్ళక్రిందఁబడి నలఁగినలఁగి శబ్దము లింకను వంకలుతీరి — నున్నఁబడి - నిగనిగలాడి - ప్రశస్తమములు కానున్నవి కావా? అందుచే గ్రామ్యవాదుల వాద ప్రకారము మాదిగవాండ్రలో నధమాధముఁడు మాటలాడు మాటలు మహాప్రశస్తములు. మహోద్గ్రంథవినియోగార్హములు. వీరి వింతవాదముచే జాతిప్రపంచము శబ్దప్రపంచముఁగూడఁ దలక్రిందైనవి.

కాని గ్రామ్యవాదులు సూక్ష్మబుద్ధి కలవారు. తెలియక తెచ్చుకొనిన “Natural laws”ను నమ్ముకొన్నయెడల నీబాధ యున్న దని యెఱిఁగి యుండియే, “Natural laws” అను పెద్దమాటలు బండితులు గడగడలాడుటకై పైడాబునకై కల్పించి తదనిష్టనివారణార్థముగ “Upper classes” (ఉత్తమజాతులవా) రుపయోగించు శిష్టగ్రామ్యమే పరిగ్రహణయోగ్య మని బందుకట్టొకటి నిర్మించి కొనిరి. శబ్దప్రయోగమున శిష్టుల కెంత స్వేచ్ఛయో యశిష్టుల కంత స్వేచ్ఛయే కద! శిష్టులు నశిష్టులు నను భేదము గ్రామ్యవాదులు చేయఁగలరు గాని Natural laws అట్టి భేదమును జేయునా? పామరుల మాటలు కేవలము నింద్యము లని వారు శాసించుటకుఁ బామరులు చేసికొన్న పాప మేమి? అటుగాక వారిమాటలను నిందించుట Natural laws యొక్కపనిని దిరుగఁదోయుట, పాడుచేయుట కాదా? అట్టి యసహజమైన పనికి గ్రామ్యవాదు లేల పూనుకొనవలయును? గ్రామ్యవాదులారా! అధమజాతులవారిమాట లెందునకు నింద్యము లయ్యె నని మీ రాలోచించితిరో మనస్ఫూర్తిగఁ జెప్పుఁడు. Natural laws గీచురల్‌లాస్ అని యర్థము లేనిమాటలను జెప్పకుఁడు. వాండ్రు కేవలము ఏవ్యాకరణ్యులు, నాగరికత లేనివారు, సత్సహవాసము లేనివారు, మంచి చెడ్డ లెఱుఁగనివారు కావున వారిమాటలు తప్పు లని - కేవలము తప్పు లని-వట్టి తప్పులని మీ యభిప్రాయము. ఆంతరంగికాభిప్రాయమై యుండును లెండు. దాని

కేమి? యథార్థముకూడ నదియే. అందుచేతనే "Upper classes" అను నపురూపపుఁగల్పన మొక్కటి మీకుఁ గావలసివచ్చినది. శిష్టులమాటలు మాత్రమే పరిగ్రహణయోగ్యము లని హంస పాదము పెట్టవలసివచ్చినది. అధమ జాతులవారికంటె శిష్టులు విద్యాబుద్ధిసత్సహవాసనాగరకతాసదసద్వివేచనములు కొంచెము హెచ్చుగఁ గలవారు. అందుచే వారికంటె వీరిమాటలలోఁ దప్పులు కొంచెము తక్కువగా నుండును. మిక్కిలి తప్పులున్న యధమజాతిమాటలను వదలి తక్కువతప్పు లున్న శిష్టులమాటలను దీసికొనవలసివచ్చినది. తప్పులు తక్కువ యని మాటవరుస కనుట గాని వీరికి మాత్రము తప్పు లేమంత తక్కువ? బ్రాహ్మణులలోనే, నూటి కఱువదిమంది కేవలపంచములవలె విద్యాశూన్యు లని శ్రీ॥రా॥ పంతులుగారే సెలవిచ్చి యుండఁగ నిట్టివిద్యాహీను లెట్టి తప్పులతడకలుగ మాటలాడుదురో వేఱె చెప్పవలయునా? కేవలపంచములకంటె వీరొక్కరేఖామాత్ర మైన మెఱుఁగుగ నుందురు కావున వారి మాటలనే గ్రంథార్థములు సేయవలసివచ్చినది. మడికట్టుకొని మఱి తేగలు ఫలాహార మెందులకు? కృష్ణాజినపుసంచిని దాఁచిపెట్టిన జగన్నాథప్రసాదమునే కన్నుల కద్దికొని స్వీకరింపరాదా? తప్పులతడక లనుకారణమున నధమజాతివారి మాటలు వదలుకొన్నప్పుడు స్వచ్ఛమై-పవిత్రమై-పూజనీయమైన గ్రాంథిక భాషలోని పదములనే యంగీకరింపక, యటు లిటులుకాని మతిలేని మాధ్యమిక మార్గ మెందులకు?

మేము Natural laws ను నిందించువారము కాము; కాని, వానివలనఁ గలుగు రూపము లన్నియు మంచి వని చెప్పఁగలవారము కాము. మంచిరూపములు మాత్రమే పరిగ్రహింపఁ దగును. ఇట్లు పూర్వవ్యాకరణవేత్తలు, పూర్వగ్రాంథికులు పరిగ్రహించియే యున్నారు. వారు Natural laws నెఱుఁగని వారు కారు కాని Phonetics అని స్వాభావిక శాసనము లని బెదురుపుట్టు మాటలు వారు మనవారివలె మాత్రము పై కనలేదు. కాని కవిత్రయప్రయోగములకు భిన్నము లగు ప్రయోగము లుండఁగూడ దని చల్లఁగ నిమ్మళముగ నొక్కశాసనమును వారు చేసినారు. దీనినిబట్టియే వారి స్వాభావిక శాసనజ్ఞానమును మీరు తెలిసికొనవచ్చును. స్వాభావిక శాసనముల పని సదేపనిగ హద్దు లేకుండ వెఱ్ఱికొట్టుగఁ బోనిచ్చినయెడల భాష ధ్వంసమై పోవు ననియు, నొకని మాట యొకనికిఁ దెలియకుండఁ దలలు పగులఁగొట్టికొని జనులు సంఘమరణముల నొందుదు రనియు వా రిట్టి యమూల్యమగు శాసనము చేసిరి. ఈ శాసనమునకు మాత్రము వారు కారణము చెప్పలేదు.

ప్రాతస్స్నానము చేయవలసిన దని చెప్పిన పెద్దలు దానికిఁ గారణమును జెప్పిరా ? అటులే దీనికిఁ గూడ వారు కారణమును జెప్పలేదు. అందుచే వారి యభిప్రాయమును మన మెఱుఁగలేక వారు భాషాభివృద్ధి నెఱుఁగని వారని-స్వాభావికజ్ఞాన శూన్యు లని - వారిని మనము నోటికి రాని మాట లాడు చున్నాము. యథార్థముగ భాషాభివృద్ధి నెఱుఁగనివారము మనము. స్వాభావిక శాసనజ్ఞానశూన్యులము మనము. మనకుఁ దగిన బిరుదములను మన ముంచు కొనవలసినదే కాని యనర్థుల నెత్తిఁ గట్టనేల ?

స్వాభావిక శాసనములఁబట్టి కలిగిన ప్రత్యయాదిరూపములలో సుష్ఠుగ నున్న వేవో శబ్దశాస్త్రజ్ఞులు గ్రంథకర్తలు నిదిఅకే పరిగ్రహించిరి. కావున మిగిలిన యన్నిరూపములు నింద్యము - అనఁగ వట్టితప్పు - లని స్పష్టము. తప్పులను - దప్పు లని యెఱిఁగియుండి గ్రంథస్థములు సేయు మను గ్రామ్య వాదుల వాదము మఱింత తప్పు.

ప్రత్యయాంతములలో దాదాపుగఁ బూర్వవిభక్తిప్రత్యయము లన్నియు నిప్పు డెట్టిమార్పును లేకుండ వాడుకొనుచున్నాము. క్రియల కుండు పూర్వ ప్రత్యయాదులలోఁ గొన్నిమాత్రము మాటలలో వాడు కచేయుట లేదు ఏల ? బుద్ధిలేక — ఔచిత్యము లేక - కొందఱకు విద్యలేక - స్పష్టముగఁ బలుకుట కోపిక లేక - సంగ్రహముగఁ బలుకు నపేక్షచేత - తొందర చేత - నింక ననేకకారణములచేత నట్లు వాడుక చేయుట లేదు. "చూచి నాను, వచ్చినాను" అను రూపములు "చూశా, వచ్చా" యను రూపములకంటె నాబ్రాహ్మణపంచమపర్యంత మొక్కనికైనఁ దక్కువగఁ దెలియునెడల నప్పుడు పూర్వప్రత్యయరూపములు చచ్చిన వనుఁడు. అంతవఱ కనఁగూడదు. ఆ ప్రత్యయరూపములు సత్యములు. "అసత్య మాడితి మేమిరా ?" యని యొక నిని మనమడుగ "నిప్పుడు సత్యము వాడుకలోనే లేదండి" యని వాఁడు ప్రత్యు త్తర మిచ్చె ననుకొందము. అంతమాత్రముచే సత్యము చచ్చిన దని చెప్పుట తప్పు. సత్యము చెప్పు మని శాసించు వేదమును దిద్దు మని చెప్పుట వెఱ్ఱి. అదిగాక జను లిప్పటికిని సభలయం దుపన్యాసము లిచ్చునపుడు గాని, విద్యా వంతులతో సంభాషించునపుడు గాని యింటియొద్ద మాటలాడినట్లు మాటలాడక గ్రాంథికప్రత్యయరూపములను గమనించుచునే యున్నారు. "Even we, in this litearary age and at a distance of thousand years from those early fathers of languages, do not speak at

home as we speak in public" - Max Muller. కొంచెము జాగ్రత్తతో మాటలాడు నెడల భాషాల్పపరిచయము గలవాఁడైనను - తుదకు - విక్రకిచంద్రికలోఁ గ్రియలఁగూర్చిన పది పత్రములు చదివిన రెండవతరగతి (Form) పిల్లవాఁడైనను - చచ్చిన వనిచెప్పఁబడిన పూర్వప్రత్యయరూపములు తప్పకుండ మాటలాడఁగలఁడు. అంతవఱ కెందునకు ? ఆంధ్రభాష నాలుమాసములు నేర్చుకొనిన యాంగ్లేయుఁడు శుద్ధగ్రాంథికభాషను సులభముగ మాటలాడఁగలడు. అట్లిప్పు డనేకులు మాటలాడుచున్నారు. ఈ నడుమ పాఠశాలాపరీక్షాధికారి యగు నొకయాంగ్లేయుఁడు గ్రామ్యభాషకంటెఁ దనకు గ్రాంథిక భాష సులభతరముగఁ దెలియు నని చెప్పినట్లు వినియుంటిమి. చచ్చిన ప్రత్యయము లిన్ని జీవకళలు కనఁబఱచునా ?

ప్రతిదేశమందుఁ బ్రతిజాతియందుఁ గూడ వ్యావహారిక భాషకును, గ్రాంథికభాషకును భేద మున్నది. వ్యావహారికభాషలో వ్యాకరణనియమము లంతఁగాఁ బరిగణింపఁ బడవు. శబ్దములయుచ్చారణము లంత సుష్ఠుగ నుండవు. ఇట్టిలోపములు విద్య వచ్చినవాఁడు విద్యరానివాఁడు గూడఁ జేయును. గ్రాంథిక భాష యీ లోపములకు లోనుగాక పరిశుద్ధముగ నుండును. గ్రాంథికభాషా ప్రయోగములు వ్యావహారిక భాషలో నరు లందఱుఁ గూడ నుపయోగింప కున్నను, గ్రాంథికప్రయోగములు చచ్చె నని చెప్పుట కెంతమాత్ర మవకాశము లేదు. వ్యావహారికభాషకు గ్రాంథిక భాషకు విశేషభేద మున్న దని Wyld దొరగా రిట్లు చెప్పుచున్నారు: "The differences between written and spoken English are deeper than shose produced merely by a pronunciation which has far outstripped its symbolical expression and includes also differences of style, of idioms, choice of words and grammatical forms.' (ఇందులోని యడుగుగీతఁ మేము గీచితిమి).

కావున గ్రాంథికభాషలోని క్రియాప్రత్యయములు మన మందఱము నాగరక భాషలో నుపయోగింపకున్నను నవి చచ్చె నని చెప్పుట తప్పు! గ్రాంథిక భాషలో మాటలాడు పండితు లనేకు లున్నారు. అ-తవఱ కెందునకు ? క్రైస్తవ మత బోధకాలమున స్వచ్ఛ మగు నాంధ్రభాషలో మాటలాడు మాలవాం డ్రనేకు లున్నారు. అది యొక విశేషము కాదు.

కావున గ్రాంథిక భాషలోని శబ్దములు చావలేదు. ప్రత్యయములు చావలేదు. గ్రాంథిక భాష మృతభాష కాదు. Natural laws వలనఁ గలిగిన ప్రత్యయరూప

ములలో శుద్ధములైనవే గ్రాంథికప్రత్యయరూపములు "వచ్చు+చున్+ఉన్న+వాఁడు" = "వచ్చుచువున్నవాఁడు" మొదటిరూపము. ఇది పిదప "వచ్చుచున్నవాఁడు" అయ్యెను. తరువాత "వచ్చుచున్నాఁడు"అయ్యెను. ఈరెండురూపములుఁ బరిశుద్ధము లగు రూపము లని వ్యాకరణవేత్తలు పరిగ్రహించిరి. ఈ రూపములు Natural laws వలన సిద్ధించినవే. ఇంతమట్టుకే పూర్వులు పరిగ్రహించిరి. Natural laws మఱికొన్నిరూపములు "వస్తున్నాఁడు, వస్తుండాడు, వొస్తున్నాడు, వొస్తుండాడు, వస్తుడు, వొస్తుడు" అనునవి కలిగించినవి. ఇవి కేవలము నియమశూన్యములుగ గ్రహించి వీనిని గ్రాంథికులు పరిత్యజించిరి. "వారు గ్రహించిన దెల్ల పూజ్యము; వారు పరిత్యజించిన దెల్ల నింద్యముననిి యెచ్చట నున్నది; వారిమాట మాకేమి శాసనమా?" యని గ్రామ్యవాదులు నియమశూన్యులు కావున ననవచ్చును. ఎవనికిఁ దోచినట్లు వాఁడు చెప్పవచ్చు నని వారి సిద్ధాంతము. అట్లే యగునెడలఁ బ్రపంచ మంతయు నొక్కదినములో బ్రళయదశకు రాఁగలదు. ఇందునుగూర్చి వారికిఁ బూర్ణప్రమాణవాది యగు Wyld దొరగా రిట్లు చెప్పుచున్నారు: "A preliminary question meets us. Whence are the laws of style derived ? To whom or what are we to refer on difficult or disputed points ? Most rhetoricians, ancient and modern, have n:we .d that"

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక,<br>ప్రమాది - ఆశ్వయుజము,<br>సంపుటము 2; సంచిక 3.

---

# నేటి తేట తెలుగు

—రావుసాహెబు శ్రీ గిడుగు రామమూర్తి పంతులు

"అనావశ్యకము లయిన నిర్బంధములను దీసివేసి భాషను సుసాధ్యము చేయుట పరమప్రయోజనకరము... భాషాభివృద్ధినిబట్టియే జనులనాగరికతయు నభివృద్ధిచెందుచుండును. కనుక జనులయభివృద్ధిని గోరు దేశాభిమానులందఱును ముందుగా నాంధ్రభాషను మంచిస్థితికి దీసికొనివచ్చుటకై ప్రయత్నింపవలెను." "మనవారు దేశభాషలు మంచిస్థితిలో లేవా యని యడుగవచ్చును. లేవనియే మేము దృఢముగా చెప్పగలము...(పండితులు)"తమ పాండిత్యమును కనబఱుప జూచుచున్నారే కాని జనుల"కు తెలివిని గరపుటకై లేశమయినను ప్రయత్నింప కున్నారు." కం వీరేశలింగముపంతులుగారి బంగారపుపలుకులు.

మనదేశములో బ్రిటిషుగవర్న మెంటువారు సర్వజనసామాన్యముగా చదువు చెప్పించడానికి మొదలుపెట్టి రమారమీ అరవై సంవత్సరాలు అయినది. ఇంత కాలమూ పండితులు పాత తెలుగునే పుస్తకాలు వ్రాసి ఫస్టుక్లాసు మొదలుకొని ఎమ్. ఏ. క్లాసుదాకా చదివిస్తున్నారు పండితులే తెలుగుపాఠాలు చెప్పుతున్నారు. పండితులతెలుగు ఎంతమట్టుకు వృద్ధిపొందినది? ఈ పాత తెలుగు ఎంతమంది మాటాడగలరు? తెలుగువారిలో ఇంగ్లీషుపుస్తకములవల్లనా, తెలుగుపుస్తకముల వల్లనా, వ్యాపించినంతమట్టుకయినా ఇప్పుడు విద్య వ్యాపించినదా? ఈ అరవై సంవత్సరములలో ఎంతమంది ఇంగ్లీషు. అన్యభాష అయినా, చదవడము, వ్రాయడము, మాటాడడము కూడా నేర్చుకున్నారో చూడండి. పాత తెలుగు పండితు లయినా పొరబాట్లు లేకుండా వ్రాయలేరే!

తెలుగుకాంపోజిషన్ గురించి సెనేటులో మొన్న మొన్న చర్చజరిగినప్పుడు ఏమన్నారు విద్యాధికార్లు? తెలుగుపరీక్షలో నెగ్గిన బి. ఏ. లు తెలుగున సలక్షణ ముగా ఒక కథ అయినా వ్రాయలేరట! మద్రాసుగవర్న మెంటువారున్ను తమ జి. వో. లో ఈసంగతే చాటించినారు. ఇండియాగవర్న మెంటువారున్ను, దేశభాష లలో విద్య వ్యాపించవలసినంతమట్టుకు వ్యాపించలేదు అనిన్నీ, ప్రజలకు లోక వ్యవహారములో తెలివితేటలు కలిగించేవిద్యలు దేశభాషలలో చెప్పలేదు అనిన్నీ,

ఇంతకాలమూ విద్యావ్యాపకమునకై చేసిన ప్రయత్నము, పెట్టినఖర్చు ఇంచుమించుగా వ్యర్థమైనది అనిన్నీ, ఇకమీదట వాడుకలో వున్న భాషలలోనే తెలివి కలిగించే విద్యలు నేర్పడానికి ప్రయత్నము చేయవలసినది అనిన్నీ వ్రాసి, రిజల్యూషన్ ప్రకటించి ఉన్నారు.

జనాభాలెక్కలలో వేసినట్టు, తెలుగున సంతకము చేయగల వారందరూ చదువుచ్చినవారే అని ఒప్పుకొన్నా, తెలుగువారిలో చదువుకొన్నవారు వేయింటికి 75 గురు మాత్రమే. అంటే, వేయింటికి 925 గురు తెలుగువారు సంతకమైనా చేయలేరు అన్నమాట. తెలుగువారి అందరిలో బ్రాహ్మణజాతివారు గదా విద్యాగురువులు. ఈ బ్రాహ్మలు తెలుగువారిలో నూటికి ముగ్గురే వున్నారు. వీరికి విదలో నేర్చుకోడానికి ఎన్నెన్నో సుళువులు ఉన్నవి. మొదటి సంగతి, అక్షరాభ్యాసము వారికి విహితకర్మ. ఇంతేకాక, బ్రాహ్మలపిల్లలకు ధర్మానికి అనేకమంది సాయము చేస్తారు. అనేక తరాలనుండి విద్యాభ్యాసము బ్రాహ్మణవంశములలో వేరునాటుకొని ఉన్నది. పిల్లలు తమ పొట్ట పోషించుకోడానికి కూలీనాలీ చేయనక్కరలేదు. స్వగ్రామము, స్వగృహము విడిచి దూరదేశములకు పోయి పదిపండ్రెండు సంవత్సరాలు వేరేచింత లేకుండా చదువుకోవచ్చును. ఇన్ని సుళువులు గల బ్రాహ్మలలోనే చదువురానివారు, ఇంకానూటికి అరవై మంది ఉన్నారు; ఇకను ఇతరజాతులమాట చెప్పేది ఏమున్నది ? ఒక కార్డుమీద చిన్నఉత్తరమయినా వ్రాయలేనివారు, రెయిల్వేటికెట్ మీద ఏవూరిపేరున్నదో చదువుకోలేనివారు, వెయ్యింటికి 925 గురు ఉన్నప్పుడు, తెలుగుజాతులవారు నాగరికు లని చెప్పడానికి నాలుక తిరుగుతుందా? యూరపుఖండములో ఈకాలములో న్యూస్‌పేపరు చదవలేనివారిని కిరాతులుగా ఎంచుకొంటారు. అంతమట్టుకు చదవడము వ్రాయడము సర్వసామాన్య మయినవి. నలుగురు పండితులు నాలుగు సంస్కృతపుముక్కలు, నాలుగు పాతతెలుగు ముక్కలు వల్లించి, రెండు ఇండిరాలు, రెండుఅరసున్నలు, రెండుబండమాటలు, పెట్టి పాతగొడవలు రెండుపురాణాలు తెలిగించగానే, తెలుగుభాష వృద్ధిలోనికి వచ్చినట్టేనా? ఓనమాలయినా రాని కోట్లకొలదితెలుగు వారందరూ తెలివిగల వారున్ను నాగరికులున్ను అయినట్టేనా? అధమపక్షము నూటికి ఏభై మంది అయినా పుస్తకము చదివి అర్థము చేసుకోగలవారు తమ అభిప్రాయములను స్పష్టముగా వ్రాయగల వారు ఉండవద్దా.

నాగరికజాతిలో పూర్వకాలములో చదవడము వ్రాయడము అరుదే. అప్పటి లోకవ్యవహారమునకు ఇవి అంతగా అవశ్యము కావు. తెలివితేటలు కలిగించే ఇతర

సాధనములు ఉన్నకట్టుకు అందరికీ సామాన్యముగా ఉండేవి బహుస్వల్పముగా ఉండేవారు. చదువువచ్చినవారు, ఎవరో నలుగురు దేవతలలాగు. పురాణము చెప్పినావారే, పంచాంగము చెప్పినా వారే. తక్కిన జనులలో విద్యవల్ల కలిగే ఎక్కువ తక్కువలు ఆ కాలములో ఏవీ లేవు. ఇప్పటిలోకవ్యవహారమయితే ముక్కాలు మువ్వీసము కాగితముమీదనే జరుగుతూ ఉన్నది. వ్రాయలేనివారు, వ్రాసినది చదువలేనివారు, ఎంత వెనకపడుతున్నారో, ఎంత నష్టము పొందుతున్నారో చూడండి పూర్వకాలములో రామావధానులు, రామినాయుడు, మంగలి గురవడు, గొల్లకోనారి, మాదిగవెంకడు అందరూ ఒకటే ఎవరయినా ఉత్తరాలు వ్రాయనూ అక్కరలేదు, చదువనూ అక్కరలేదు. రసీదులూ లేవు, సంతకాలూ లేవు. మునుపు అధికార్లు నోటిమాటలతోనే వ్యవహారాలన్నీ పరిష్కరించేవారు. ఇప్పుడో? అర్జీలు, సమనులు, ప్లైఇంటులు, వాజ్మూలాలు, నోటీసులు, డిక్రీలు, నకళ్ళు, మనిఆర్డర్లు, రెఇల్‌వేటికెట్లు, మందులకేటలాగులు, ధరవరలపట్టీలు, ట్రేడుడైరెక్టరీలు, రిపోర్టులు, గెజట్‌లు, మ్యూనిసిపల్ కౌన్సిలు ప్రొసీడింగ్సు, న్యూస్‌పేపర్లు, పాంప్లట్లు, పుస్తకాలు, బులిటీన్లు మొదలైనవి ఎన్ని ఉన్నవో చూడండి. కొంచెము చదవడము, వ్రాయడము వస్తే, లోకవ్యవహారములో ఎన్ని సంగతులు తెలుసుకోవచ్చునో చూడండి. తెలివే ప్రధానమైతే నేటి తేట తెలుగులోనే తెలివి సులభము కాదా?

ఈకాలములో రామావధానులుగారి మనుమడు బి.ఏ.బి.ఎల్. అయి, ప్లీడరీ చేస్తాడు, లేదా స్కూల్‌ఫైనల్‌దాకా చదువుకొని హెడ్‌గుమాస్తా అవుతాడు. రామినాయుడు మనుమడు డిప్టికలక్టరు అవుతాడు. లేదా పోలీసుఇన్‌స్పక్టర్ అవుతాడు. (తెలుగులో పాండిత్యము చేత కాదు సుమండి) అయితే మంగలి వెంకడు, గొల్లగోపాలుడు చాకలి సరవడు ఇప్పటికీ రామావధానులు, రామినాయుడు తాతముత్తాతలంత సత్యకాలపువాళ్ళే. ఇప్పుడు ఇంగ్లీషు బళ్ళలో జాతిభేదము లేకుండా అందరికి సరిసమానముగా చదువు చెప్పబట్టి గాని, బ్రాహ్మణపండితులకే విద్యాధికారము ఉండే బ్రాహ్మణేతరులలో విద్య ఈమాత్రమయినా వ్యాపించునా? తెలుగు దేశములో విద్య ఇంతతక్కువగా ఉన్నప్పుడు విద్యఎడల నిజమైన అభిమానము గలవారు చేయవలసినపని ఏమిటి? విద్యవల్ల కలిగే ఫలము, లోకవ్యవహారానికి పనికివచ్చే జ్ఞానమా? లేక కేవలము శబ్దజాలమా? ఏదో ఒకటి వల్లించడమా? వల్లించినదానిలోని విషయము తెలుసుకోడమా? జ్ఞానము కలిగించే సాధనము ఎంత సుకరముగా ఉంటే అంతమంచిది గదా! మాటకు, ఇప్పుడు కాశీయాత్రచేసేవారు

రెఇల్‌బళ్లు ఎక్కి పోతున్నారు కారూ ? రెఇల్‌ బండికంటె ఎడ్లబండి ఎక్కిపోతే ఎక్కువ పుణ్యమని, అంతకన్న కాలినడకను పోతే మరింత పుణ్యమని, ఇంకా రోడ్లమీద దొర్లుతూపోతే మరీ ఎక్కువ పుణ్యమనీ, మన పౌరాణిక పండితులు, మనకు హితోపదేశము చేసినా, ఎంత పుణ్యము దొరికితే అంతే అయెను అని, వారూ మనమూ మెఇల్ బండిమీదనే పోతున్నామా, లేదా ? పైకిమాత్రం అంటారు శాస్త్రిగారు బుగ్గిలో దొర్లుతూపోతే బొందెతోనే స్వర్గానికి పోతామని, వ్యవహారములో ఆ మాటమీద విశ్వాసం మనకూ లేదు, వారికీ లేదు. వాదానికి మాత్రం శాస్త్రం ఒప్పుకోవలెనట! అలాగునే ఉత్తవాదానికి పాత తెలుగు, నిత్యమూ వ్యవహారములో నేటి తేట తెలుగు !

పూర్వము వేదములలోని భాష లోకులు మాటలాడుకొనే రోజులలో, ఇప్పుడు బొబ్బిలిపాటలాగు, వేదములు అందరికీ బోధపడేవి. రాను రాను ఆ భాష మారి, తుదకు వాడుక లేక, ఎవరికీ తెలియకుండా అయినది. ఇట్లా మారి ఏర్పడిన క్రొత్తభాషే సంస్కృతము. భారతము పంచమవేదమని చెప్పి, పూర్వపు ఇతిహాసములు అన్నీ ఇమిడ్చి, అందరికీ తెలిసేటట్టు అందరూ వాడుకొనే భాషలోనే తర్వాత తేడాగా వ్రాసినారు. ఆ భాషను వ్రాసినవారు, పూర్వ భాషతో కలపక, తమకాలపు వాడుకను అనుసరించే వ్రాసినారు. వాడుకలో ఉన్న భాషకు మార్పు కలగడము అనివార్యము గనుక ఆ సంస్కృతము కూడా కాలక్రమమున మారి, ప్రాకృతభాషలు ఎన్నో ఏర్పడినవి. ఆ భాషలలో గ్రంథాలూ పుట్టినవి. అయితే ప్రాకృతములూ, సంస్కృతమూ కలిపి ఏక భాషగా ఎవరూ చేయలేదు. సంస్కృతములో వ్యాకరణము వ్రాసినవారు అయినా వాడుకలో ఉన్నభాషనే పరీక్షించినట్టు అనేక నిదర్శనములు ఉన్నవి. శబ్దరూపభేదములు అంగీకరించినారు. స్వరము ఏర్పరచినారు. తూర్పు దేశమువారు ఈలాగు ఉచ్చరిస్తారని, ఉత్తరదేశమువారు ఈలాగు ఉచ్చరిస్తారని, లోకములో వాడుక ఈలాగు ఉన్నది, ఛందస్సు (అనగా వైదికభాష)లో ఈలాగు ఉన్నది అని ప్రత్యేకముగా పాతభాష, కొత్తభాష అని రెండు భాషలు ఉన్నట్టుగా చూపించినారు.

పాతవి పట్టుకొని పాకులాడేవారు కొందరు, కొత్తవి కొనియాడేవారు కొందరు ఎప్పుడూ ఉంటారు. పాతగిల్లినకొద్ది పరిచయము తక్కువ. గౌరవము ఎక్కువ; దూరమైనకొద్ది దృష్టి సూక్ష్మము అవుతుంది. రామాయణము కన్నా, శాస్త్రముకన్నా వేదము గొప్పది. శాస్త్రిగారికన్నా అవధానులు గొప్ప

వారు, తెలుగు రామాయణముకన్న సంస్కృతరామాయణము చదివితే పుణ్య మెక్కువ తెలుగు పండితులకన్న సంస్కృత పండితులు ఎక్కువ గొప్పవాళ్ళ మనుకుంటారు. తెలుగు పండితులుకూడా తమకు సంస్కృతములో పాండిత్యము ఉన్నా లేకపోయినా ఉన్నట్టే నటిస్తారు. పాతతెలుగు పండితులు కవిత్రయమును ప్రమాణముగా ఉంచుకొని సంకర తెలుగు వ్రాసేవారిని తక్కువగా చూస్తున్నారు. కొత్తతెలుగు వ్రాసేవారిని చూచి వారూ వీరూ ఆక్షేపిస్తున్నారు. పల్లెటూళ్ళలో రవిక తొడుక్కొంటే సాని, పట్నములో కోటు తొడుక్కొంటే దొరసాని, అని ముసలమ్మలు అన్నట్లే.

ప్రస్తుత విషయమునకున్ను మీదచెప్పినమాటలకున్ను సంబంధ మేమి టంటే: మొదటి తెలుగుకవులు తమ వ్యవహారములో ఉన్న తెలుగుభాషను వ్రాసినారు. వారి తెలుగు కాలక్రమమున మారినది ఎంతోకొంత. దానికిన్ని ఇప్పుడు వాడుకలో ఉన్న తెలుగుకున్ను భేదము ఉండబట్టి పాతభాషలో చెప్పిన వాక్యముల అర్థము, ఆ భాష బాగా చదువుకొన్న పండితులకు గాని స్పష్టముగా తెలియడములేదు పాతభాషలో కల్పించిన వేదములలోనిసారము కొత్త సంస్కృతములో భారతరామాయణములు వ్రాసి చెప్పినట్టుగా, పాతతెలుగులో వ్రాసిన పుస్తకములోని విషయములు సర్వసామాన్యముగా తెలిసేటట్టు చేయవలెనంటే, కొత్తతెలుగు అనగా ఇప్పుడు వాడుకలో ఉన్నభాషలో తిరిగి చెప్పవలెను గదా ! కొత్తవిద్యలు నేటితేటతెలుగులో కాగితముమీద వ్రాస్తే సులభము కావా ? ఈలాగు చేయుటము అన్ని దేశములలోను అన్ని భాషలలోను జరుగు తున్నది కావా ? పది పదిహేనుమార్లు పాతగిల్లిన ఇంగ్లీషులో క్రీస్తుమత గ్రంథములు మాటిమాటికి కొత్త కొత్త ఇంగ్లీషులో వ్రాస్తున్నారు కారా ? మన దేశములో కూడా పూర్వము అదేసంప్రదాయము గదా ! ఇందులో వైపరీత్యము ఏమి ఉన్నదని పండితులు రణగొణధ్వనిచేసి ఆకాశము బద్దలు కొట్టుతున్నారు.

విద్యలుకూడా కలకాలము ఒక్కరీతిని ఉండవు. ఉండలేదు. విద్యలుఅన్నీ అందరికి సామాన్యముగా ఉండవు. లోకవ్యవహారము మారినప్పుడు దానిలో కూడా అందుకు ఉపయోగించే విద్యలూ మారుతవి. ఇప్పుడు సివిల్‌కోర్టులోను, క్రిమినల్ కోర్టులోను, పూర్వపుస్మృతులుపనికివస్తవా ? పూర్వపుధనుర్విద్య ఈ కాలపు యుద్ధమునకు పనికివస్తుందా ! పూర్వపునియమాలు ఈ కాలములో చెల్లు తవా ? లోక వ్యవహారము లక్షవిధములు. నాగరికత ఎక్కువ అయినకొద్దీ ఈ లోకవ్యవహారము శాఖోపశాఖలుగా భిన్నభిన్నమై దుర్బోధము, దుర్లభము అవు తుంది శాస్త్రములు, కళలు లెక్కకుమీరి పెరుగుతవి, ఇవి అన్నీ నేర్చుకోదము

అందరికి సాధ్యమా? సర్వజనసామాన్యమైన విద్యవల్ల తెలిసేవి-వ్రాయడము, చదవడము, కొంత గణితము, దేశచరిత్ర, భూగోళ వివరణము, జగత్తు ఉత్పత్తివృద్ధి బోధించే శాస్త్రము, రాజ్యపాలన, ప్రజలనడవడి, దేహారోగ్యము మొదలయినవి. ఈ విద్య ఎంతో కొంత వచ్చిన పిమ్మట ప్రజలు తమ తమ వ్యాపారమునకు ఉపకరించే విద్యను గ్రహించవలసి ఉన్నది. కడుపుకూటి కోసము దినమంతా శ్రమపడవలసినవారి అందరికీ అన్ని శాస్త్రవిద్యలు స్వాధీన మవుతవా ? పాత తెలుగు పాండిత్యము పౌరాణికులకు పాత తెలుగుకవులకు కావలెను, లేదా భాషాతత్వము తెలుసుకొనే వారికి కావలెను గాని. అందరికీ ఎందుకు ? అందరూ సంస్కృతము నేర్చుకోరేమి ? వేదములు బ్రాహ్మలయినా చదవరేమి ? దేవభాష అయిన సంస్కృతము కన్న మ్లేచ్ఛభాష అయిన తెలుగు ఎందులో ఎక్కువ ?

పూర్వకాలమున మనదేశములో పుట్టిపెరిగిన విద్యలలో ఎన్నో రూపు మాసి పోయినవి. నిలిచినవయినా అన్నీ ఇప్పటి లోకవ్యవహారమునకు అనుకూలముగా లేవు లోకముతోకూడా మార్పుచెందనిది ఏదీ వృద్ధి పొందదు. లోకమును అనుసరించి మారినవి వృద్ధిపొంది, మారనివాటిని అణగద్రొక్కి నిర్మూలముచేయక మానవు. ఇది లోకధర్మము. మనుష్యులు, మృగములే కాదు, చెట్లు, చేమలున్ను, రాజ్యములు, వ్యాపారములు, భాషలు, విద్యలుకూడా కాలాను గుణముగా మారని ఎడల వృద్ధిపొందవు, మార్పునుబట్టే వృద్ధి. పుట్టినవాడు పుట్టినట్టే కర్రబొమ్మవలె ఉండునా ? జంతువులకు జీవము ఎటువంటిదో, అటువంటిదే భాషకు నోటివాడుకా, విద్యకు లోకవ్యవహారముతో సంబంధమున్ను.

పూర్వకాలమున మనదేశములో ద్విజులేగదా విద్యలు నేర్చుకొనేవారు. వారిలోనయినా అందరూ కాదు. సర్వసామాన్యముగా ప్రజలందరికోసము ఉద్దేశించి ఏరాజున్ను బడులు పెట్టించి విద్యలు చెప్పించలేదు. బ్రిటిషువారి పరిపాలనవల్లనే మనకు కలిగినది ఆ భాగ్యము. అయితే దురభిమానముచేత పండితులూ, పండితమ్మన్యులున్నూ, నిజము తెలియక విద్యాధికారులున్నూ ప్రజలకు అందరాని పండుగా చేసినారు విద్యను. పండితులు కవనముకోసము కల్పించుకొన్న కృత్రిమ భాషలో బాలబోధలూ, కథలూ, చరిత్రలూ వ్రాస్తూ, పిల్లలు చదువలేకుండాను చదివినా అర్థము కాకుండాను చేసి, ఫస్టుక్లాసు మొదలు కొని బి.ఏ దాకా తెలుగు చదివినా, ఇంగ్లీషు చదివినా, పండితులు వేదాలు, శాస్త్రాలు చదివినట్లు, ప్రతిదీ బండవల్లన వల్లించడము మప్పి పిల్లలబుద్ధి విక

సించకుండా మాడ్చి పాడుచేసినారు. తెలివి పుట్టడానికి తేటగా తెలిసే మాటలతో విద్య చెప్పవలెనన్న సంగతి ఆలోచించరు. ఇదే కారణము మనదేశములో విద్య వ్యాపించక మనము వెనకపడడానికి. యూరపు ఖండములో కూడా మూడు, నాలుగువందల సంవత్సరముల కిందటవరకు కృత్రిమ భాష అయిన లాటిన్‌లో గ్రంథములు వ్రాయడము, విద్య చెప్పడము ఆచారమయి ఉండేది. అందుచేత ఆ కాలములో సంసారులలో విద్యావంతులు అరుదు. సన్యాసులుగా ఉండేవారు మాత్రము చాలాకాలము పట్టుదల కలిగి పూని వల్లించి, ఆ కృత్రిమ భాష. అందులో వ్రాసినగ్రంథాలు నేర్చుకోగలిగేవారు. మనదేశములో పూర్వ సంప్రదాయముప్రకారము తెలుగుభాష నేర్చుకొనేవారు ఓనమాలు నేర్చుకొన్న వెంటనే సంస్కృతంలో వ్రాసిన బాలరామాయణము, తర్వాత అమరము, ఆంధ్రము, శబ్దాలు, సంస్కృతకావ్యాలు, నన్నయభట్టీయము ఈపరుసను చదువు కొని ప్రబంధాలు ఆరంభించేవారట! ఇదే అనులోమమార్గమట! వేదము వేంకట రాయశాస్త్రిగారు గ్రామ్యాదేశనిరసనములో ఈ పద్ధతిని ఎంతో కొనియాడుతూ వ్రాసినారు. ఈచొప్పున తెలుగు చెప్పకపోవడముచేతనే నట తెలుగుపిల్లలకు తెలుగు బాగా రాకపోవడము! భళాభళి! నిజము! శాస్త్రిగారు సెలవిచ్చినసంగతి వాస్తవమే! ప్రతి తెలుగువాడు తెలుగుపండితుడు కావలెనంటే ఇదే ఉత్తమ మయిన పద్ధతి. అయితే ఇప్పుడు "గ్రాంథికశైలిని", "వ్యాకరణశైలిని" నిర్దుష్టముగా వ్రాస్తున్నామని ప్రగల్భాలు పలుకుతూ వున్న ఎమ్. ఏ. పండిట్లు, బి.ఏ. పండిట్లు, ఎఫ్. ఏ. పండిట్లు అనులోమముగా శాస్త్రిగారు చెప్పినపద్ధతిని తెలుగు అభ్యసించినట్టు కనపడదు అంతా హుళక్కి-పండితులే. పండిట్ వావిలికొలను సుబ్బారావు పంతులవారంతటివారు "సందేహనివర్తి" అని, "నిరోగము" అని సంస్కృతములున్న "ఋజువు చేయుట", "మాటల ధోరణి" "ఆవైన వారిని మీరు జక్కగ దెలియునా?" "మేము విజయు నీళ్ళుద్రోచియుం జావవయె", "త్రోపెడిపిల్లి", "తీసివైచినది", "తిగిచి వేయుము", అని అసంస్కృతాలు, సంకరాలు, పాతకొత్తతెలుగులు కలిపి, పిసికి, ప్రయోగించినారు. వీరు గుండెలు కుళ్ళ వల్లించినారట సంస్కృత నిఘంటువులున్ను వ్యాకరణములున్ను! నేను ఈలాగున వ్రాయడము వీరి దోషములు ప్రకటించడానికి కాదు. ఎంతో అభిమానము, పూనిక కలిగి రాత్రింబగళ్లు పడవల్లించి, పుట్టినది మొదలు సంస్కృతము తెలుగు చదువుతూ, గ్రంథములు రచిస్తూ, అధ్యాపకవృత్తిలోనే కాలక్షేపముచేస్తూ ఉన్న వీరికే చక్కగా స్వాధీనము కాలేదే భాష! ఈకాలపుబడులలో చదివేపిల్లలకు పట్టు పడడము కష్టము కదా అని అడుగడానికి. లెక్కలు, హిస్టరీ, జిఆగ్రఫీ

నేచర్‌స్టడీ, డ్రాయింగ్, ఇంగ్లీషు మొదలగునవి ఎన్నో నేర్చుకొంటూ పదింటి నొక టిగా ఉన్న తెలుగుపాఠములు అనులోమపద్ధతిని వల్లించటము బడిపిల్లలకు ఏలాగున వల్లపడుతుంది? సంస్కృతవిద్యార్థులను చూస్తున్నాము కాదూ ఏలాగు రఘువంశము వల్లిస్తున్నారో? దినానికి ఒక శ్లోకము చొప్పున వ్యాఖ్యానముతో కూడా చదివి ఒప్పచెప్పుతారు గురువుగారికి. ఈలాగున చెప్పుచుండే మన పండితులు తెలుగువిద్య చెప్పి తెలివి పుట్టిస్తారట మన తెలుగుపిల్లలందరికీ! దినానికి అరవై గడియలు "గ్రామ్య" తెలుగు వాడుతూ. వాదానికి గ్రాంథికతెలుగు మంచి దని చిందులు తొక్కుతున్నవారు, తమ పిల్లలకు ఈరీతిగానే చదువులు చెప్పించి లాభము చూపించరాదూ? ఒక్కొక్కకాలేజీకిన్ని, ఒక్కొక్క హైస్కూలుకున్ను, ఒక్కొక్క తెలుగుపండితుడే కదా ఉన్నాడు; తక్కినమాస్టరులలో ఒక్కరయినా తెలుగు టెక్స్ట్ పాఠము చెప్పలేడుగదా! ఏమిగతి? ఈ మాస్టర్లందరు తాము నేర్చుకొన్న మరి ఏ సబ్జక్టు పాఠము చెప్పుమన్నా చెప్పడానికి తయారుగా ఉంటారు. తెలుగు చెప్పమంటే మాత్రము తమకు రాదని వెనకతీస్తారు. కారణము ఏమిటి? తెలుగుగ్రంథాలలోని తెలుగు ఈ తెలుగు మాస్టర్లు నిత్యమూ వాడుకొంటూ ఉన్న తెలుగుకాదు. అది వేరేభాష. ఇంగ్లీషుగ్రంథాలలో ఉన్న ఇంగ్లీషు బోధపడని ఇంగ్లీషుమాస్టర్లను చూచినారా ఎక్కడయినా? లక్షలకొలది అచ్చుపడుతున్నవి ఇంగ్లీషుపుస్తకాలు. ఏవో ఫిజిక్సు కెమిస్ట్రీవంటివి కప్పు. సాధారణముగా ఏ పుస్తకము పడితే ఆ పుస్తకము చదవగలడు ప్రతిఇంగ్లీషువాడున్ను. ఇంగ్లీషువారి దాకా ఎందుకు? ఇంగ్లీషు నేర్చుకొన్న తెలుగువారే చదవగలరు. తెలుగు బి. ఏ., గారు తాను పరీక్షకు చదవని పుస్తకము ఒకటి స్వతంత్రముగా చదవగలరా? ఒక కొత్తపద్యానికి "పదచ్ఛేదము" చెప్పగలరా? నా మాటలు అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు అనేరు కొందరు; గాని నా అనుభవమునుబట్టి నాకు వాస్తవముగా తోచినసంగతులే వ్రాస్తున్నాను. వేదము వేంకటరాయశాస్త్రి గారిని అడగండి; ఆయన నా మాట కాదనరు చూడండి. ఇప్పుడు గ్రంథకర్తలుగా పేరుపొందిన వారు అనేకమంది ఎంత తంటాలు పడి గిజగిజ గింజుకొంటునారు కారు వారి తెలుగు పూర్వపు వ్యాకరణసూత్రములను అనుసరించి ఉన్నదని భ్రమపడుతు న్నారు గాని దోషములు ఎన్నో ఉన్నవి. ఇప్పటిగ్రంథములలో నిర్దుష్టమైనది ఒకటి అయినా నాకు కనబడలేదు. మధ్య కవులు, ఆధునికకవులు వ్రాసినకావ్యముల లోనే అనేకమయినవాటిలో లక్షణవిరుద్ధము లయిన ప్రయోగములు ఉన్నవి అని రాయబహద్దరు వీరేశలింగముపంతులుగారే విమర్శించి చెప్పినారు. ఆ పంతుల వారి గ్రంథములలోనూ ఉన్నవి కొన్ని పూర్వలక్షణాలకు విరుద్ధమైన ప్రయోగ

ములు, ఇంతమందికి ప్రమాదము కలగడానికి కారణము ఏమిటంటే; బాగా పరిచయము గల స్వభాషలో గ్రంథములు వ్రాయక పరిచయము లేనట్టిదిన్ని, పాణినివ్యాకరమువంటి విపులమయిన లక్షణము లేనట్టిదిన్ని, పూర్వకవుల కావ్యములే శరణుగా గలదిన్ని అయిన ఒక కృత్రిమభాషలో వ్రాయడమేను. స్వభాషలో వ్రాయడము స్వగ్రామములోను, స్వగృహములోను తిరుగడమువంటిది గదా. బొంబాయి వంటి పెద్దపట్నములో కొంతకాలము కాపురమున్న తర్వాత కూడా, మనవ్యహారముతో సంబంధించిన స్థలములతో మాత్రము పరిచయము కలగవచ్చును గాని, తక్కినభాగములు కొత్తగానే ఉంటవి. మాపుగాని, ప్లానుగాని పట్టుకొని చూస్తే నలుగురూ గొప్పవనుకొనే స్థలములుమాత్రము పోల్చుకోవచ్చును; గాని తక్కినవి అన్నీ తెలియవు. వ్యాకరణము ప్లానువంటిది. నిఘంటువు పట్నములోని వస్తువుల పట్టి వంటిది. ప్లాను, పట్టి, పట్నము స్వరూపము తెలియజేసినా పట్నములో కాపురముండి నాలుగుమూలలా తిరిగేవారు వ్యవహరించినట్లు స్వేచ్ఛగా స్వతంత్రించి తోవ తప్పకుండా కొత్తవాళ్లు తిరగలేరు గదా ?

అట్లే భాషలో మనోభావములు వ్యక్తపరచడము కూడాను. 'నాకు ఆకలి వేస్తున్నది', 'నాకు ఆకలి అవుతున్నది', 'నాకు అకలిగా ఉన్నది' అనే వాక్యములు వాడుకలో ఉన్నవి. అందరమూ వాడగలము. 'నాకు ఆకలి గదిరినది', 'నాకు ఆకలి వొడమినది', 'నేను క్షుత్పీడితుండను'—అనే వాక్యములు చెవులకు కొత్త. 'నాకు ఆకలి వేస్తున్నది' అనడానికి మారుగా 'నాకు ఆకలి వైచుచున్నది' అని ప్రయోగించడము హాస్యాస్పదముగా ఉంటుంది. ఏ గ్రంథములలోనూ అట్టి ప్రయోగములు కనబడవు. అట్టివి కల్పించి వాడినందుచేత నైజధర్మము చెడి భాష కృత్రిమమైనది అవుతుంది. కర్రబొమ్మకూ జీవముతో ఉన్నమనిషికీ ఎంత భేదమో అంత భేద ముంటుంది అట్టి కృత్రిమభాషకున్నూ, వాడుకలో ఉన్నభాషకున్నూ. కంటి చూపులో కనబడేటట్లు నోటిమాటలో వినబడవలెను మనోభావము.

ఎంతో శ్రమపడితేనే గాని కృత్రిమభాష పట్టుపడదు. పోనీ, ఇంత శ్రమపడీ నేర్చుకుంటే, లాభ మేమైన ఉన్నదా? ఈ కృత్రిమభాష లోకవ్యవహారములో ఎవరైనా మాట్లాడుతున్నారా?లేదు.సభలలో వాడుతారా? లేదు. కోర్టులలో ప్లీడర్లు ఈ భాషలో వాదప్రతివాదములు చేస్తారా? లేదు. ఆసెసర్లకు అడ్రస్ ఈ భాషలో ఇస్తారా? లేదు. జడ్జీలు,మునసబులు ఈ భాషలో విమర్శ చేస్తారా? లేదు. తీర్పులు కాని,రాజీనామాలుగాని ఈ భాషలో వ్రాస్తారా?లేదు.బడిలో మాస్టర్లు పాఠాలు బోధ

పఠించినప్పుడు ఈ భాష వాడుతారా ? లేదు. పౌరాణికులు ఈ భాషలో పురాణములకు అర్థము చెప్పుతారా? లేదు. గనుక ఈ భాషలో పాండిత్యము లోకవ్యవహారానికి ఎందుకు బనికిరాదు. పండితులకే అది ప్రయోగించడములో ప్రమాదము సంభవిస్తూవుంటే, సాధారణులు ఈ భాష నేర్చి కంపోజిషన్, కవిత్వము కూర్చగలరా? ఇంత దుస్సాధ్యమైన భాషను ప్రతి తెలుగుపిల్లవాణ్ణి నేర్చుకొమ్మని బలవంతపెట్టడము చేతను, అందులో వ్రాసిన పుస్తకములే చదువమనడము చేతను ప్రజలలో విద్య వ్యాపించడము లేదు. ప్రైమరీస్కూళ్ళలో మాస్టర్లకే కాదు. హైస్కూళ్ళు కాలేజీలలో ఉన్న మాష్టర్లకైనా ఈ గ్రాంథికతెలుగు రానప్పుడు వారివద్ద చదువుకొనే పిల్లలకు ఆ భాష ఎట్లువచ్చేను ? ఇంగ్లీషు కథల పుస్తకము కులాసాగా చదువుతాడు గాని విజయవిలాసము, మనుచరిత్రము ఎవ్వడూ ముట్టుకోడు. తెలుగంటే అసహ్యము గదా ! బాగా ఆలోచించండి. దురభిమానము విడవండి. నిజము కనుక్కోండి. తెలుగుపుస్తక మంటే తెలుగు పిల్లలకే అసహ్య మెందుచేత ? తొమ్మిదిఏళ్ల ఈడుగల తెలుగుపిల్లలు నూరు ఇంగ్లీషుకథలపుస్తకాలు చదివినారు. అతియోక్తి కాదు.

అవిచ్ఛిన్నముగా సంప్రదాయానుసారము కవులు అందరూ నన్నయకాలము మొదలుకొని నేటివరకూ వాడుకచేస్తూ వచ్చిన భాషను విడిచి గ్రామ్యభాషను గ్రంథములు వ్రాయడము ఉచితము కాదని వాదించేవారి వాదములో అనేక దోషములున్నవి. భాష మారదు అని వాదిస్తారా ? ప్రత్యక్షముగా కనబడుతున్న దానికి విరుద్ధము గదా ! భాష మారకూడదని వాదిస్తారా ? ఈ విధి ఎక్కడనున్నదో మొదట చెప్పవలెను వ్యాకరణము చదువుకుంటే భాష చక్కగా వస్తుందంటే అనుభవానికి విరుద్ధము. ఏ దేశములో అయినా గొప్పకవులు వైయాకరణులు కారు. వ్యాకరణములోని సూత్రము ఒకటిఅయినా రాకుండా చక్కగా వ్రాయగలవారు అనేకు లున్నారు. గ్రామ్య మనగా అధమజాతుల వాడుక. ఇప్పటి ఉత్తమజాతుల వాడుక గ్రామ్యము అనకూడదు. ఒకవేళ గ్రామ్య మనగా పూర్వభాషాసంప్రదాయమునకు విరుద్ధము అయినది అంటే నన్నయ వాడుకకు భిన్నముగా నున్న తిక్కన వాడుక, నన్నయ తిక్కనల వాడుకకు భిన్నముగా ఉన్న పెద్దన వాడుక, ఇట్లు పూర్వ కవుల వాడుకకు భిన్నముగా ఉన్న తర్వాతికవులవాడుక గ్రామ్య మని చెప్పవలెను. అప్పుడు గ్రామ్యమందు దోషమే ఉండదు. మంచిగాని చెడ్డగాని ఔచిత్యముగాని అనౌచిత్యముగాని ఏ శబ్దమునకూ శాశ్వతమైన లక్షణము కాదు. ఒక ప్రదేశములోగాని, కాలములోగాని, అనుచితమైనది మరియొక ప్రదేశములోగాని, కాలములోగాని, ఉచితమవును. ఇది

అన్నిభాషల చరిత్రములలోను కనబడుతున్నది. మాటలకు గౌరవము ఆ మాటలు ఆడేవారినిబట్టి ఉంటుంది. ''సాని'' ఏమి పాపము చేసుకున్నది? ''ఇల్లాలు'' ఏమి పుణ్యము చేసుకొన్నది? ''కూడుకున్నపదము'' ఎందుచేత గ్రామ్యమైనది? ''మనుగుడుపుల''కు అంత గౌరవ మేల? కట్టెలకోసము కాటికిపోయినా, ''కాటికి పోయినాడు'' అనకూడదు గదా. నెల్లూరిలో ''బొక్క'' అంటే తప్పులేదు గాని, ఉత్తరజిల్లాలలో అశ్లీలము. ద్రౌపది నడిచినడిచి అలసి పోయివుంటే, ''అలసినది, దానిని మోచికొని తెమ్ము'' అని ధర్మరాజు తమ్మునితో చెప్పినట్టు ఇపుడు ఎవడైనా ''ఆవిడను మోసుకొని తెచ్చినాడు'' అనవచ్చునా?

అయితే వాడుకలో ఉన్నభాష ఒక్కలాగు ఉన్నదా? ఒక్కొక్కజిల్లాలో ఒక్కొక్కమాదిరి ఉంటుందే. అది అందరికీ తెలుస్తుందా? అని కొత్తతెలుగు కోసము కొట్టుకొనేవారిని కొందరు ఆక్షేపిస్తున్నారు. గ్రాంథికభాషమాత్రము ఒక్క మాదిరిని ఉన్నదా? చూడండి. 1. సంధివిషయములో కొన్నిచోట్ల బహుళము కొన్ని చోట్ల వైకల్పిక మట, కొన్నిచోట్ల తర చట. 2. సరళాదేశము పండితుల ఇష్టము, విహితము కాదు, వాడుచూ(చూ)చె, వాడుచో(టో)యె. 3. ఉయ్యేల మొ. రమారమి పది భిన్నరూపములు, ఒకరిని మొ. రకారము ఆరవ్వ; తెప్పు, తేప మొ. వాటికి ఎన్నిటికో రెండేసి ఉన్నవి రూపములు. 4. బహువచనరూపములు అనేక రీతులు; కొడవళ్లు మొ 5. ద్వితీయావిభక్తిరూపములు, ఉ. కంసునిన్, కంసునిఁ, కంసుని, కంసున్, కంసుఁ, కంసు, చతుర్థీ విభక్తిప్రత్యయములు కి, కిని 6 వర్తమాన కాలము, భవిష్యత్కాలము, తద్ధర్మకాలము, అన్నీ ఒక్కటే. 7. నన్ను కలిగి, నాపై కలిగి అని సకర్మక అకర్మక అర్థములు. 8. ప్రేలును-ప్రేలాడును అని అనుబంధము కలిగిగాని లేకగాని, 9. అనియెను, అనెను, అనితిని, అంటిని, 10. ప్రతి మాటకు అర్థభేదం లేని పర్యాయపదములు అనేకములు. 11. ఒకేమాటకు అనేక అర్థములు, 12. శబ్దపల్లవములు-ఇటువంటి వ్యత్యాసములు ఎన్నో ఉన్నవే గ్రాంథిక భాషలో! వీటిలో పదో వంతు అయినా ఉంటునా ఈ కాలపు నాగరికుల తెలుగు భాషలో భేదములు? పోనీ, తక్కువ కాదు, ఎక్కువే ఉన్నది వ్యత్యాసము అని ఒప్పుకొన్నా లోకవ్యవహారములో ఉండి, నోటను పలుకుతూ, చెవికి వినబడుతూ ఉన్నభాష ఏదైనా గ్రహించడము, మాటలాడడము బహుసులభము. ఒకటిరెండు ఏండ్లలో తెలుగుపిల్లలు ఉద్ధతము మాట్లాడగలరు. చెన్నపట్టణములో అరవలకు తెలుగు వస్తుంది.

బళ్ళారిలో తెలుగులకు కన్నడము వస్తుంది. అందరికి ఇంగ్లీషు వస్తుంది. అలాగునే గుంటూరుతెలుగువారు, కర్నూలుతెలుగులో భిన్నరూపము వాడుకలో ఉంటే నేర్చుకొంటారు, నేర్చుకొంటున్నారు. బొత్తిగా ఒకరిమాట ఒకరికి తెలియనంత వ్యత్యాసము ఉన్నదా గుంటూరితెలుగుకూ, కర్నూలు తెలుగుకూ ? ఉంటే ఇక్కడివారు అక్కడా, అక్కడివారు ఇక్కడా ఉద్యోగాలు చేస్తున్నారు గదా, ఏలాగు కార్యాలు నిర్వహించుకొని వస్తున్నారండీ? నా అనుభవాన్నిబట్టి చూస్తే తెలుగుదేశమంతటా చదువు నేర్చినవారందరూ మాట్లాడేభాష ఇంచుమించుగా ఒకటే భాష. దిగువజాతులవారికి చాలమందికి ఈ భాష వాడుక భాష కాకపోయినా బాగా తెలుస్తుంది. ఇది సులభముగా మాటలాడడము నేర్చుకోగలరు, నేర్చుకుంటున్నారుకూడా. గొప్పవాళ్ళలో నౌకర్లుగా ఉన్నవాళ్ళు చాలా మంది తమయజమానులు మాట్లాడినట్టే మాటలాడుతున్నారు. ప్లీడర్లవద్దకు తరుచుగా వెళ్ళే క్లయింట్లు నాగరిక భాష మాటలాడడము అలవాటు చేసుకొంటున్నారు. ఇట్లే ఆఫీసులలోను, కోర్టులలోను, దేవుడిగుళ్ళవద్ద, బజారులోను, మీటింగులలోను, అన్నిజిల్లాల తెలుగు మాటలు అన్నిజాతుల తెలుగుమాటలు కలిసి సాపెక్కుతున్నవి. ఉత్తమజాతుల వాడుకభాషకు గౌరవము సహజము గనుక అది వ్యాపిస్తున్నది. భేదా లుండే నేమి ? రైలుబండిలో అరిగిపోతున్నవి ఎగుడుదిగుళ్ళు అన్నీ. ఇదే క్రొత్తతెలుగు నేటి తేటతెలుగు: వ్రాస్తూ ఉన్న నా తెలుగు; చదువుతూ ఉన్న మీ తెలుగు.

తేటతెలుగుభాష అన్నివిధముల యోగ్యమైనది. అందరికీ సాధ్యమైనది. మాదిగ వెంకడు మొదలుకొని వెంటావధానులవరకున్ను వెయ్యింటికి 75 మంది మాత్రమే ఓనమాలు వచ్చినవా రున్నప్పుడు గ్రాంథిక భాష వచ్చినవారు 5 గురైనా ఉందురో, ఉండరో! అయితే నాగరికులు తెలుసు, తేట తెలుగు లోక వ్యవహారములలో ఇప్పుడు వాడుతూ ఉన్నవారే వెయ్యింటికి అధమపక్షము నూరుగురైనా ఉంటారు అది తెలుసుకో గలిగినవారు వెయ్యింట మున్నూరుగురైనా ఉంటారు క్రమ క్రమముగా వాడుక ఎక్కువయి అంతకంతకు దిగువ జాతులకు అది వ్యాపిస్తుంది. ఈ తేటతెలుగులో తెలివికలిగించే విద్య అందరికీ సర్వసాధారణముగా చెప్పితే సరస్వతి తెలుగుదేశములో తాండవమాడదా ? కొద్ది కాలములోనే తక్కిన దేశములతోపాటు మనతెలుగుదేశముకూడా నాగరికము కాదా?

ఎవరికీ సాధ్యముకాని, పస లేని పాతతెలుగులోనే అభిప్రాయాలు వ్యక్త పరచవలెనన్న పిచ్చిప్రయత్నాలు చేస్తూ ఉండబట్టి భాషకు ఏవిధమైన అభివృద్ధి

లేకుండా ఉన్నది ; గాని మనకు సుళువుగా బోధపడుతూ వున్న మన తెలుగునే ఆదరించిన ఎడల ఎంత ఉపకరిస్తుందో చూడండి. ఇండిస్ట్రియల్ రిఫార్మర్లు, పొలిటికల్ రిఫార్మర్లు, సానిటరీ రిఫార్మర్లు, అగ్రికల్చరల్ రిఫార్మర్లు, ఎడ్యుకేషనల్ రిఫార్మర్లు,లిటరరీరి ఫార్మర్లు,ఈ తేటతెలుగున లెక్చర్లు నోటను ఫెళ్లుమని ఉరిమించవచ్చును గదా. పాంట్లుఫ పుస్తకాలు కురిపించవచ్చును గదా. విద్యలు పారించవచ్చును గదా. తెలుగువారి బుద్ధి సారవంతమై ఎట్టి పంట పండునో ఎవరు చెప్పగలరు ? 

పండితులారా ! మీ దురభిమానము విడిచిపెట్టండి. దేశమంతా విద్యకావలెనని మొరపెట్టుకొంటూ ఉన్నది. సులభముగా వచ్చే తేటతెలుగులోనే విద్య నేర్పడము సులభమైనప్పుడు పాతభాష నేర్చుకొంటేనేగాని విద్య సంపాదించడానికి వల్లకాదు అని మీ రెందుకు అడ్డుపెట్టుతారు? మీరు గ్రామ్యులు కారు గదా? మీ నోటను వచ్చేమాట అశ్లీలము కాదు గదా ! మీరు నిత్యమూ వాడుకొనేభాష శంఖములో పోసిన తీర్థము వంటిది అదే అందరికి ఇచ్చి ఉద్ధరించరాదా !



—ఆంధ్రపత్రిక ప్రమాదీచ సంవత్సరాది సంచిక - 1913.
(ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక - (1965)లో
పునర్ముద్రితము)

